# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక



సంపుటి : 11
సంచిక : 1 138
హైదరాబాద్
జనవరి 2013

## దశాబ్ది ప్రత్యేక సంచిక

140 పేజీలు రు. 30

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

పది సంవత్సరాల ప్రయాణం

137 సంచికలు

రెండున్నర వేల వ్యాసాలు

తెలుగు సమాజం తనతో తాను చేసుకున్న సంభాషణ

పునాది మీరే! మీరే!

వేలాది మంది పాఠకులు, అభిమానులు

వందలాది మంది రచయితలు, శ్రేయోభిలాషులు

ఎంతోమంది దాతలు, ప్రకటనకర్తలు

## హృదయపూర్వక ధన్యవాదాలు

## 2013

## నూతన సంవత్సర శుభాకాంక్షలు

138

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జనవరి 2013
సంపుటి : 11
సంచిక : 1

| వ్యవస్థాపక సంపాదకులు : | సంపాదకులు : | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | ఎస్. వెంకటేష్ |

## లోపలి పేజీల్లో...

- సంపాదకీయం ◆ పది గ్రీష్మాల నిరంతర వసంత స్ఫూర్తి 5
- అభివృద్ధి - నిర్వాసితులు - ముదునూరి భారతి 9
- వ్యవసాయ పరివర్తనలో వర్గ సంబంధాలు - కోబడ్ గాంధీ 17
- చలనంలో విషయం - చలనంలో అధ్యయనం - ఎన్. వేణుగోపాల్ 25
- ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఆత్మహత్యల 'అభివృద్ధి' - కె.సజయ, రమ మెల్కోటె, బి.కొండల్‌రెడ్డి 40
- ప్రజాస్వామ్యం మెరిసిపోతుందా? సమసిపోతుందా? - వి. హనుమంతరావు 54
- మారని పేదరికం - మారుతున్న అంచనాలు - సత్యనారాయణ రెడ్డి 57
- పర్యావరణ పతనం - జీవ వినాశనం - కె.ఆర్. చౌదరి 62
- సామ్రాజ్యవాద విష ఫలితాలు - లోకసంచారి 64
- నేరాల కన్నతల్లి పార్లమెంటరీ వ్యవస్థ - ఎ. నర్సింహారెడ్డి 74
- దళిత ఆత్మగౌరవాన్ని ఎత్తిపట్టిన ఉద్యమం - కె. సత్యనారాయణ 90
- మహోజ్వల భారత కార్మికోద్యమం - పి.వి. రమణ 98
- మహిళా ఉద్యమ చరిత్ర - ప్రధాన ఘట్టాలు - డా. నళిని 112
- ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం - వరవరరావు 126
- అసహజ మరణాలు - వై. రామచంద్రం 138

### రానున్న సంచికలలో వరుసగా వెలువడే ప్రత్యేక సంచిక వ్యాసాలు...

- ప్రాంతీయ ఆకాంక్షలు - తెలంగాణ - దేశ వ్యాపిత దృశ్యం
- మైనారిటీ మతస్తుల జీవనస్థితి - మెజారిటీ మతోన్మాదం
- ఆదివాసుల ఆవాసాలు - అపార సంపద - కొల్లగొడుతున్న కార్పొరేట్లు
- సమాజం మూలుగులు పీలుస్తున్న అవినీతి
- భారతదేశంలో జాతుల సమస్య

'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,
డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

వీక్షణం

# పది గ్రీష్మాల నిరంతర వసంత స్ఫూర్తి

మీ చేతుల్లో ఉన్న ఈ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ఇప్పుడే పది సంవత్సరాలు పూర్తిచేసుకుంటున్నది. పది సంవత్సరాలు, 137 సంచికలు, రెండువేల ఐదువందల రచనలు – పెద్ద విషయమేమీ కాకపోవచ్చు. ప్రజల సమాచార విశ్లేషణా అవసరాలను తీర్చవలసిన బృహత్తర కర్తవ్యంలో ఇది ఇంకా అసంపూర్ణ, అసమగ్ర ప్రయత్నమే. చిన్న ప్రయోగమే. ప్రజా ప్రత్యామ్నాయ సమాచార, విశ్లేషణా వాహినుల సుదీర్ఘ చరిత్రలో చూసినప్పుడు ఇది ఇంకా నవజాత శిశువే. తప్పటడుగుల నడకే. కాని బొడ్డుపేగు కోసి, పేరు పెట్టి, అంబాడిన నాటినుంచి అక్షరాలు నేర్చుకుని, ఆటపాటలతో మీవంటి వేలాది మంది అభిమానాన్ని చూరగొన్న ఈ కౌమారందాకా ఈ శిశువు అభివృద్ధిని అడుగడుగూ అణువణువూ చూసిన మాకు ఈ ప్రయత్నమే, ఇంతవరకు సాధించిన విజయమే, ఈ మాత్రం సాఫల్యమే గొప్ప ఆనందదాయకం. గర్వకారణం. ఈ సంతోషాన్ని మీతో పంచుకోవాలి. మేం సాగించిన నూట ఇరవై నెలల, నూట ముప్పై ఏడు సంచికల ప్రయాణం, మా మార్గాయాసాలు, ఆరాటాలు, ఆగ్రహాలు, చిరు ఆనందాలు, పెద్ద నిరుత్సాహాలు, ఆదరణ, అసంతృప్తి, నిరాశ, సాధించిన స్వల్ప విజయాలు, పొందిన అపజయాలు, సాధించలేకపోయిన హృదయానికి దగ్గరి విషయాలు అన్నీ మీతో చెప్పుకోవాలి.

నూతన ఆర్థిక విధానాలు మొదలయ్యాక, ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్ లో ప్రపంచబ్యాంకు పాలన మొదలయ్యాక వాటి గురించి మాకు తోచిన పద్ధతిలో తెలుగులో వ్యాఖ్యలూ వ్యాసాలూ రాస్తున్న మాబోటి నలుగురైదుగురికి కలిగిన ఆలోచన ఈ పత్రిక. ఇతర పత్రికల్లో వస్తున్నట్టు అనేక విషయాల్లో ఒకటిగా కాక, పూర్తిగా ఇటువంటి విషయాలు మాత్రమే రాసే పత్రిక ఒకటి ఉండాలని మాకు 2000–2001 ల్లో అనిపించింది. ఆ ఆలోచనకు ప్రధాన భూమిక వి. హనుమంత రావు గారిది. అప్పటికి నాలుగు దశాబ్దాలకు పైగా ప్రజాపక్ష పాత్రికేయుడిగా, మేధావిగా, ఆర్థిక విషయాల మీద ప్రత్యేకించి కృషి చేసిన ఆయన అంతకు ముందే ఆంధ్రప్రదేశ్ ఇయర్ బుక్, డేటా ఆంధ్రప్రదేశ్ పక్షపత్రిక వంటి ప్రయత్నాలు చేసి ఉన్నారు. నూతన ఆర్థిక విధానాల వాతావరణంలో ఇటువంటి పత్రిక అవసరం మరింత పెరుగుతున్నదని, ఒక చారిత్రక అవసరంగా ఈ పత్రిక రావాలని, ఇది పక్షపత్రికగా ఉండాలని ఆయన ఆశించారు. ఈ పత్రిక ప్రధాన బాధ్యత నేను తీసుకోవాలని ఆయన కోరారు. అప్పటికి ఎకనమిక్ టైమ్స్ ఉద్యోగం పోయి, పాక్షికంగా వెబ్ సైట్లకు పనిచేస్తున్న నేను అందుకు ఒప్పుకున్నాను. ప్రధాన స్రవంతి పత్రికలలో పనిచేసిన అనుభవం, సాహిత్య పత్రికలతో సన్నిహిత సంబంధం వల్ల నేను తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ లాగ, ఇంకా చెప్పాలంటే, అంతకన్న మెరుగ్గా ప్రజానుకూల, ప్రజాపక్ష దృక్పథంతో రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదిక ఒకటి రావాలని ఆలోచిస్తున్నాను. అలా హనుమంతరావుగారి ఆలోచనలు, నా ఆలోచనలు కలగలిసి ఈ పత్రికకు ఒక రూపం వచ్చింది. పదిహేనేళ్ల ముందు నేను విజయవాడలో మిత్రులతో కలిసి నడపడానికి ప్రయత్నించి, రెండు సంచికల కన్న ఎక్కువ తేలేకపోయిన సమీక్ష పేరుతో ఇది వస్తే బాగుంటుందని నేననుకున్నాను. రిజిస్ట్రేషన్ పరిమితుల దృష్ట్యా ముందు ప్రజాపక్ష చేర్చాం. నమూనా సంచిక నుంచి 2003 సెప్టెంబర్ 15 సంచిక వరకూ, అంటే వీక్షణం పేరుకు రిజిస్ట్రేషన్ వచ్చేవరకూ ఈ పత్రిక ప్రజాపక్ష సమీక్ష పేరుతోనే వచ్చింది.

సమతా పబ్లికేషన్స్ ప్రచురణగా, ఇది పాత్రికేయుల పత్రిక అనే ఉపశీర్షికతో నమూనా సంచిక ప్రజాపక్ష సమీక్ష 2002 సెప్టెంబర్‌లో వెలువడింది. ఆ సంచికకు గౌరవ సంపాదకులు ఎబికె ప్రసాద్, సంపాదకులు వి. హనుమంతరావు, విద్యాభూషణ్, ఎన్ వేణుగోపాల్, డి పాపారావు. తర్వాత కొన్ని రోజులకే నాకు న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ఉద్యోగం రావడంతో పత్రికకు నేను బైటి నుంచి సహాయం మాత్రమే చేయగల పరిస్థితి వచ్చి, నాపేరు సలహామండలిలోకి మారింది. ప్రజాపక్ష సమీక్ష మొదటి సంచిక 2003 జనవరి 1న వెలువడింది. గౌరవ సంపాదకులు ఎబికె ప్రసాద్, సంపాదకులు వి హనుమంతరావు, సలహామండలి ప్రొ. ఆర్ వి ఆర్ చంద్రశేఖర రావు, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, ప్రొ. పి. నారాయణ రెడ్డి, డి పాపారావు, బి. సాంబశివరాజు, ఎన్ వేణుగోపాల్. అప్పుడు ఇప్పటిలాగా ఎక్కువ రచనలూ లేవు, పైగా పక్షపత్రిక. రచనల కొరత, కంపోజింగ్, ప్రూఫ్ రీడింగ్, ప్రింటింగ్, ప్యాకింగ్, పోస్టింగ్... చాల ఒత్తిడి ఉండేది. హనుమంతరావుగారు తాను వయసుకూ శక్తికీ మించి కష్టపడడం మాత్రమే గాక చుట్టూ ఉన్నవాళ్లందరిమీద ఒత్తిడి పెట్టేవారు. ఆ రోజుల్లో కొంతకాలం సహాయ సంపాదకుడిగా పనిచేసిన వీరారెడ్డి వచ్చి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ క్యాంటీన్‌లో నా ఎదురుగా కూచుని, గబగబా సంపాదకీయాలు, వ్యాసాలు రాయించి తీసుకుపోయిన రోజులు నిన్ననో మొన్ననో గడిచినట్టున్నాయి. అలా రెండు సంవత్సరాలు హనుమంతరావు గారి ఇల్లే కార్యాలయంగా, ఒకే ఒక్క ఉద్యోగితో, కనీసం ముగ్గురి పార్ట్ టైమ్ సహకారంతో, తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులతో పత్రిక నడిచింది. నిర్మాణం లేకుండా నడిచే పత్రికలన్నిటిలాగే ఆలస్యంగా రావడం, మధ్య మధ్య సంచికలు వదిలిపెట్టడం, సమన్వయం లేకపోవడం వంటి పొరపాట్లెన్నో దొర్లాయి.

అప్పటికే ఆరోగ్యం క్షీణిస్తున్న హనుమంతరావు గారు పత్రిక బాధ్యత పూర్తిగా తీసుకొమ్మని పదేపదే అడుగుతూ ఉండడం, నాకు కూడ ప్రధాన స్రవంతి పత్రికలనుంచి వైదొలగి నా ఇష్టపూర్వకమైన, స్వచ్ఛందమైన ప్రజానుకూల పాత్రికేయ వృత్తిలో ఉండాలని కోరిక బలపడడం, సరిగ్గా అప్పుడే ఒక ప్రజా ప్రత్యామ్నాయ పరిశోధనా సంస్థ ఏర్పాటు కోసం మిత్రులతో పంచుకుంటున్న

ఆలోచనలు కలిసి 2004 డిసెంబర్‌లో నేను ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వదిలేయడం, రెండు మూడు నెలలలో సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్స్ (సిడిఆర్‌సి) స్థాపించడం, వీక్షణం నేను వర్కింగ్ ఎడిటర్‌గా (2008 నుంచి ఎడిటర్‌గా), సమతా పబ్లికేషన్స్ – సిడిఆర్‌సి సంయుక్త ప్రచురణగా రావడం జరిగిపోయాయి.

అంతకుముందు రెండు దశాబ్దాలకు పైగా అటు ప్రత్యామ్నాయ పత్రికలతోనూ ఇటు ప్రధాన స్రవంతి పత్రికలతోనూ నా అనుబంధం నుంచి ఒక పాఠం నేర్చుకున్నాను. పత్రిక అనేది క్రమబద్ధంగా, నిరంతరాయంగా నడవవలసిన పని. అందువల్ల దానికి సొంత, సుస్థిర నిర్మాణం, పూర్తికాలం కేటాయించగల నిర్వాహకులు, క్రమబద్ధమైన పనిపద్ధతులు ఉండాలి. పార్ట్ టైమ్ నిర్వాహకులతో పత్రిక తేవచ్చుగాని క్రమబద్ధంగా, నిరంతరాయంగా తేవడం సాధ్యం కాదు. ఆ అవగాహన వల్ల వీక్షణంకు ఒక నిర్మాణాన్ని తయారు చేయడం మీద ఎక్కువ శ్రద్ధ పెట్టాను. వీక్షణంకు ఈ ఎనిమిది సంవత్సరాలలో ఆరు సంవత్సరాలపాటు అటువంటి సొంత, సుస్థిర నిర్మాణాన్ని సిడిఆర్‌సి సమకూర్చింది (రెండు సంవత్సరాలుగా సిడిఆర్‌సి పనిచేయడం లేదు). అందువల్లనే గత ఎనిమిది సంవత్సరాలలో పత్రిక ఒక్క సంచిక కూడ ఆగకుండా, ప్రతి నెలా కచ్చితమైన తేదీల్లో వెలువడడం సాధ్యమయింది. సుస్థిరమైన నిర్మాణం, కచ్చితమైన పని పద్ధతులు రూపొందడం వల్లనే ఈ ఎనిమిది సంవత్సరాలలో నాలుగైదు సందర్భాలలో సంపాదకుడికి, ఇతర నిర్వాహకులకు వ్యక్తిగత ఇబ్బందులు వచ్చినా వీక్షణం ఏ మాత్రం అంతరాయం లేకుండా కొనసాగింది.

పది సంవత్సరాల వీక్షణం చరిత్రను సింహావలోకనం చేస్తే, కొన్ని లోపాలు ఉన్నప్పటికీ కొన్ని గణనీయమైన విజయాలు సాధించిందని మాకు గర్వంగా ఉంటుంది. ప్రజా ప్రత్యామ్నాయ రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా ఇది ప్రజలలో, పాఠకులలో చాల ఆదరణను చూరగొంది. ఆయా పార్టీలు, ప్రజాసంఘాలు నడిపే పత్రికలు మినహాయిస్తే ఇది దాదాపు ప్రతి ఒక్కరూ ఆదరించే ఏకైక రాజకీయార్థిక, సామాజిక పత్రికగా తయారయింది. ఈ పత్రికలో అచ్చవుతున్న వ్యాసాల పరిధి విశాలమైనదిగా అందరి ప్రశంసలనూ అందుకుంటున్నది. తెలుగులో ప్రగతిశీలమైన, నిశితమైన ఆలోచనలు చేసేవారూ, వ్యక్తీకరించేవారూ, ఆచరణలో పెట్టేవారూ అందరూ వీక్షణంను తమ కరదీపికగా భావిస్తున్నారు. అందువల్లనే అటు విద్యారంగంలో, ఇటు క్రియాశీల కార్యకర్తలలో వీక్షణం అభిమానాన్ని చూరగొన్నది.

'వీక్షణం శ్రేయోభిలాషులు, మిత్రులు పత్రిక అభివృద్ధి కోసం చాల సూచనలు చేస్తున్నారు. ఇది తెలుగు ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలా ఉండాలనే సూచనల నుంచి గ్రామీణ, స్థానిక పరిణామాల నివేదికగా, విశ్లేషణగా ఉండాలనే సూచనల వరకు చాల సూచనలు మాకందుతున్నాయి. ఇది కేవలం పైనుంచి చెప్పే పత్రికగానో, కిందినుంచి వినే పత్రికగానో మాత్రమే ఉండాలని మేం అనుకోవడం లేదు. ఈ రెండు వాహికల మేలు కలయికగా, తెలుగు సమాజం తన గురించీ, తన ఇరుగుపొరుగు పరిణామాల గురించీ చేసుకునే అన్వేషణకు అద్దం పట్టేదిగా ఉండాలని మా కోరిక' అని 2005 మే-జూన్ సంచిక సంపాదకీయంలో రాసిన మాటకు వీక్షణం అక్షరాలా కట్టుబడి ఉంది. పాఠకులకు ఏ అవగాహనలను అందించాలని తాననుకుంటున్నదో అవీ చెప్పింది. పాఠకుల నుంచి తానేమి వినాలనుకుంటున్నదో అవీ వింది. పత్రికకూ పాఠకులకూ మధ్య, రచయితలకూ పాఠకులకూ మధ్య, రచయితలకూ రచయితలకూ మధ్య, ఒక్క మాటలో తెలుగు సమాజానికి తనతో తనకు నిరంతర సంభాషణకు వీక్షణం వేదికగా నిలిచింది.

తొలిరోజుల్లో పక్షపత్రికగా 24 పేజీలు, మాసపత్రికగా 48 పేజీలు నింపడానికి ఇబ్బంది పడే స్థితి నుంచి ఇవాళ 64 పేజీల పత్రికను సునాయాసంగా తేవడం మాత్రమే కాక, ఏ రోజునైనా కనీసం ఇరవై వ్యాసాలు నిలువ ఉండే స్థితికి చేరుకున్నాం. తెలుగులో రాజకీయార్థిక, సామాజిక ఆలోచనాపరులైన రచయితలలో ప్రతిఒక్కరూ తమ రచనలను వీక్షణంకు పంపించారు. ఎంతోమంది రచయితలు తమ రచనలు వీక్షణంలోనే రావాలని కోరుకుంటున్నారు. అలా ఈ పది సంవత్సరాలలో అచ్చువేసిన రెండువేల ఐదు వందల రచనలతో కనీసం వెయ్యి మంది రచయితలకు వీక్షణం వేదికను కల్పించింది. ఆ వెయ్యి మందిలో కనీసం రెండు వందల మంది కొత్త రచయితలు. వీక్షణంలోనే తొలి రచన చేసి, ఆ తర్వాత వ్యాస రచయితలుగా స్థిరపడినవాళ్లు ఎందరో ఉన్నారు. అలాగే వీక్షణం మొదటినుంచీ పరిశోధక విద్యార్థులకు ప్రత్యేక స్థానం కల్పించింది. ఎం.ఫిల్, పిఎచ్ డి విద్యార్థులు, పరిశోధకులు, అధ్యాపకులు తమ పరిశోధనా ఫలితాలను సమాజంతో పంచుకోవడానికి వీక్షణం వేదిక అయింది. పరిశోధక విద్యార్థులకు, అధ్యాపకులకు వృత్తి ఉద్యోగాలలో, పదోన్నతులలో ఉపయోగపడే (ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్) ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు కూడ వీక్షణంకు వచ్చింది.

అలాగే వీక్షణం తెలుగులో సామాజిక శాస్త్ర వ్యాస రచనా ప్రక్రియను అభివృద్ధి చేసే కృషిలో భాగంగా వ్యాసరచనా అధ్యయన తరగతులు కూడ నిర్వహించింది. తెలుగు వ్యాసరచనా చరిత్ర, వ్యాసరచనా పరికరాలు, వ్యాసరచనలో సాధారణ పొరపాట్లు, వ్యాసరచనకు అవలంబించవలసిన పద్ధతులు ఒక తరగతిగా చెప్పి, కొన్నిడజన్ల మందికి వ్యాస రచనలో ఆసక్తి పెంపొందించింది. కనీసం పది మంది ఈ తరగతి ప్రభావంతో వ్యాస రచయితలుగా మారారు.

వీక్షణం నిర్వహించిన కార్యక్రమాలలో మరొక విశిష్టమైన అంశం రచయితల సమావేశాలు. పత్రికలకూ రచయితలకూ పాఠకులకూ మధ్య సన్నిహిత సంబంధాలు ఉండాలనీ, నిరంతర సంభాషణ జరుగుతుండాలనీ భావించిన వీక్షణం గత ఆరు సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు నిర్వహిస్తున్నది. రచయితలతో పాటు, పాఠకులు, అభిమానులు కూడ విరివిగా పాల్గొంటున్న ఈ సమావేశాలలో వీక్షణంలో వెలువడే రచనల మీద, వెలువడవలసిన అంశాల మీద, వీక్షణంను విస్తరించవలసిన అవసరం మీద ఆసక్తికరమైన చర్చ జరుగుతున్నది. విలువైన సూచనలు, సలహాలు అందుతున్నాయి.

వీక్షణం నిర్వహిస్తున్న అసాధారణమైన మరొక పని అసహజ మరణాల సూచి. నిర్వాహకులు వై రామచంద్రం, డి వి రామకృష్ణారావుల పూనికతో, రాష్ట్రవ్యాప్తంగా దాదాపు ఇరవై మంది మిత్రుల సహకారంతో తెలుగు సమాజంలో అసహజ మరణాల జాబితా తయారు చేసే పని వీక్షణం గత ఆరు సంవత్సరాలకు పైగా చేస్తున్నది. అసహజ మరణాలను సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నంగా గుర్తిస్తూ ఆ చిహ్నాన్ని ఎప్పటికప్పుడు నమోదు చేయాలని చేస్తున్న ఈ ప్రయత్నం

ఆలోచనా ప్రేరకమైన ఎన్నో సామాజిక, రాజకీయార్థిక విషయాలను సూచిస్తున్నది.

అలాగే, తెలుగు పాఠకులకు అవసరమైన, తెలుగు పాఠకుల అవగాహనా పరిధిని పెంచే విశ్లేషణా వ్యాసాలను ఇంగ్లిషు నుంచి అనువదించి అచ్చువేసే పనికి వీక్షణం ఉద్దేశపూర్వకంగానే పూనుకున్నది. ఈ పది సంవత్సరాలలో అటువంటి వ్యాసాలు కనీసం వంద అయినా ప్రచురణ అయి ఉంటాయి.

కొద్దికాలం కింది వరకూ వీక్షణం క్రమం తప్పకుండా నిర్వహించిన కార్యక్రమం ప్రతినెలా ఒక ప్రత్యేకమైన విషయం ఫోకస్‌గా తీసుకుని దానిమీద నలుగురైదుగురు రచయితల వైవిధ్యపూరితమైన వ్యాసాలు ప్రచురించడం. ఆయా రచయితల నుంచి నిర్ణీత వ్యవధి లోపల వ్యాసాలు తెప్పించుకోవడంలో, నాణ్యత పాటించడంలో వచ్చిన ఇబ్బందుల వల్ల ఈ ఫోకస్ శీర్షిక ప్రస్తుతానికి రావడం లేదు గాని, ఒక సమకాలీన అంశం మీద స్థూలంగా ప్రజానుకూల దృక్పథం లోనే ఎంత వైవిధ్యపూరితమైన ఆలోచనలుండే అవకాశం ఉందో దీనితో ప్రతినెలా తెలిసివచ్చేది. ఆ భిన్నాభిప్రాయాల ఛాయలన్నీ ఒక్కచోట దొరికి పాఠకుల అవగాహనా పరిధి పెరగడానికి అవకాశం వచ్చేది.

వీక్షణం తొలిరోజుల్లోనే ప్రచురణలు కూడ ప్రారంభించి ఒక దళారీ పశ్చాత్తాపం వంటి ముఖ్యమైన పుస్తకాలు ప్రచురించింది. అలాగే మాతృసంస్థ సిడిఆర్‌సి ప్రచురించిన *50 ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్*‌తో సహా ఎన్నో పుస్తకాలను పాఠకులకు అందజేసింది. వీక్షణం కార్యాలయంలో విభిన్న అంశాల మీద చర్చాగోష్ఠులు, సమావేశాలు నిర్వహించింది. కార్యాలయంలోనే కీలకాంశాలపై సంప్రదించడానికి గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసి అందుబాటులో ఉంచింది.

ఫోకస్ ఒరవడిలోనే వీక్షణం భూసంస్కరణలు, నీటిపారుదల, ఎన్నికలు, విద్యుచ్ఛక్తి, ప్రాంతీయ అసమానతలు, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం వంటి కొన్ని అంశాల మీద ప్రత్యేక సంచికలు కూడ ప్రచురించింది. వీక్షణం ప్రచురించిన రెండువేలకు పైగా వ్యాసాలు ప్రతి ఒక్కటీ విలువైనవే, ఏదో ఒక అర్థంలో ప్రత్యేకమైనవే. కాని ఇతర పత్రికలేవీ చేయని పని వీక్షణం సగర్వంగా చూపుకోదగిన పని రెవెన్యూ పాలన చరిత్ర, భూమి సమస్య, భూసంస్కరణలు, నిత్య జీవితంలో సామ్రాజ్యవాద దోపిడీ, స్వావలంబన, ప్రపంచీకరణ విధానాలు, అవినీతి, స్విస్ బ్యాంక్ ఖాతాలు, గ్రామ అధ్యయనాలు, భారత-చైనా యుద్ధం వంటి అంశాల మీద ప్రచురించిన వ్యాసాలు. అలాగే 2005 నుంచి 2011 వరకు వీక్షణం మాతృ సంస్థ అయిన సిడిఆర్‌సి పరిశోధనా కృషిలో భాగంగా వీక్షణం కూడ పరిశోధనలో పాల్గొన్నది, పరిశోధనా ఫలితాలు అచ్చువేసింది.

అయితే ఈ కృషి అంతా వీక్షణం నిర్వాహకులుగా పేర్లు కనబడే ఒకరిద్దరు వ్యక్తులది మాత్రమే కాదు, మాకు సన్నిహితులూ, పరిచితులూ, అపరిచితులూ కూడ అయిన అసంఖ్యాక మిత్రుల సహాయ సహకారాలు లేకపోతే వీక్షణం ఇలా నిలదొక్కుకోగలిగి ఉండేదే కాదు. ఈ పది సంవత్సరాల, నూట ఇరవై నెలల, నూట ముప్పై ఏడు సంచికల ప్రయాణంలో వేలాది మంది మిత్రులు వీక్షణంకు ఆదరాభిమానాలు అందించారు. వీక్షణాన్ని తమ కౌగిట్లోకి తీసుకున్నారు. వీక్షణం చదవడం, వీక్షణం గురించి మాట్లాడడం, వీక్షణంకు ఆర్థిక, హార్దిక సహకారం అందించడం తమ బాధ్యత అనుకున్నారు. వారందరికీ పేరుపేరునా వీక్షణం తన హృదయపూర్వక ధన్యవాదాలు తెలియ జేస్తున్నది. తెలంగాణ పల్లెల నుంచి పొట్ట చేతపట్టుకుని ముంబైకి వలసవెళ్లి అక్కడ కార్మికులుగా పనిచేస్తున్న యువకులు ప్రతినెలా క్రమం తప్పకుండా వీక్షణం చదువుతూ, చదివిస్తూ, చర్చిస్తూ ఉన్నారని విన్నప్పుడు మా పని సార్థకమయిందనిపిస్తుంది. మధ్యభారత అరణ్యాల నుంచీ, తూర్పుకనుమల నుంచీ మహత్తర సామాజిక నిర్మాణ కృషిలో ఉన్నమిత్రులు వీక్షణంకు రచనలు పంపినా, వీక్షణంలో అచ్చయిన రచనల మీద తమ అభిప్రాయం తెలిపినా, వీక్షణంకు అక్కడి ఆదివాసుల పేరు మీద చందాలు వచ్చినా మా కళ్లు చెమ్మగిల్లుతాయి. సుదూరంగా పుణెలోనో, కోల్ కత్తాలోనో, చెన్నైలోనో ఉద్యోగం చేస్తున్న తెలుగు విద్యావంతులు, ఉద్యోగార్థం అమెరికా వెళ్లిన ప్రగతిశీల మిత్రులు, దేశవ్యాప్తంగా చెరసాలలో చిక్కిన నిరపరాధులు, భవిష్యత్ సమాజ స్వాప్నికులు, రాష్ట్రవ్యాప్తంగా నలుమూలల నుంచి పాఠకులు, మంచిర్యాల, మిర్యాలగూడ, మహబూబ్ నగర్ వంటిచోట్ల ఏర్పడిన వీక్షణం మిత్రబృందాలు మాతో దూరవాణిలోనో, ఉత్తరాలలోనో సంభాషించినప్పుడు, వీక్షణంపట్ల అభిమానాన్ని ప్రకటించినప్పుడు, మెరుగుదలకు సూచనలు చేస్తున్నప్పుడు మా కృషి వృథా పోవడం లేదనీ, దానికి విలువ ఉందనీ అనిపిస్తుంది. ఇదంతా ఒక ఎత్తయితే, రాష్ట్రంలో కనీసం పది మంది వయోధిక మిత్రుల ప్రేమాదరాలను వీక్షణం చూరగొనడం మరొక ఎత్తు. వారందరూ ఉద్యోగ విరమణ చేసి పది పదిహేను ఏళ్లయిన, అరవైలలో, డెబ్బైలలో ఉన్న వయోవృద్ధులు. కాని గొప్ప ఆశాజీవులుగా, నవయువకులుగా వారు వీక్షణం క్రమబద్ధంగా చదవడం, వీక్షణంకు రాయడం మాత్రమే కాదు, కాలికి బలపం కట్టుకుని తిరిగి చందాలు చేర్పిస్తున్నారు, వారిలో ఒక్కొక్కరూ వీక్షణంను కనీసం యాభై నుంచి వంద మంది కొత్త పాఠకులకు పరిచయం చేశారు. ఎందరో మహానుభావులు, అందరికీ మా వందనాలు.

అలాగే తొలి సంవత్సరాలలో వీక్షణం సలహామండలిగా పనిచేసిన ప్రొ. ఆర్ వి ఆర్ చంద్రశేఖరరావు, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ,, ప్రొ. పి. నారాయణ రెడ్డి, డి పాపారావు, బి. సాంబశివరాజు, ప్రొ. చక్రధరరావు, కాత్యాయనిల తోడ్పాటు లేకపోతే వీక్షణం ఇవాళ ఉన్న స్థితికి చేరి ఉండేది కాదు. వారి సహకారాన్ని సవినయంగా గుర్తు చేసుకుంటున్నాం. వీక్షణం నిర్మాణంలో ఆయా సమయాలలో కొద్దికాలమో, ఎక్కువకాలమో పనిచేసిన ప్రశాంత్, ఎం విద్యాభూషణ్, ఇప్ప వీరారెడ్డి, కొణతం దిలీప్, ఎ సునీత, ఎం మమత, కిశోర్ కుమార్, కె రమ, పి అనల, భాగ్యలక్ష్మి, రమేశ్, గాయత్రి, ఫణీంద్ర, డి వి రామకృష్ణా రావు, ప్రస్తుతం వీక్షణం నిర్వహణలో భాగస్వాములయిన వై రామచంద్రం, సి రాజశేఖర్, సి వెంకటేష్, ఎ మల్లేష్ తమ శక్తిసామర్థ్యాలను వీక్షణం కోసం వెచ్చించి ప్రజలకూ వీక్షణంగా వారధిగా నిలిచారు, నిలుస్తున్నారు.

పది సంవత్సరాల ప్రయాణం విజయవంతంగా ముగిసి, రెండో దశాబ్దిలోకి అడుగు పెడుతున్న వేళ చిరకాలం దాచుకోదగిన, ఎప్పటికైనా సంప్రదించడానికి ఉపయోగపడే విశిష్ట సంచికగా 2013 జనవరి ప్రత్యేక సంచిక వెలువరించాలని ఆలోచించాం. ఈ ఆలోచనను నలుగురితో పంచుకుని, వారి సలహాలు, సూచనలు స్వీకరించడానికి 2012 జూలైలో

ప్రత్యేక రచయితల సమావేశం ఏర్పాటు చేశాం. ఆ సమావేశంలో వచ్చిన సూచనల ఆధారంగా ప్రత్యేక సంచిక తయారీ మొదలయింది. ఇవాళ దేశం ముందు, తెలుగు సమాజం ముందు ఉన్న ప్రధాన సమస్యలు, ప్రజా ఉద్యమాలు ప్రతిఫలించేలా ఆయా ప్రత్యేక అంశాల మీద సమాచార వివరణా, విశ్లేషణా వ్యాసాలను ఆహ్వానించాం. దాదాపు మూడు నెలల ముందే ఈ ప్రయత్నం మొదలయినా చివరి గడువు నాటికి ఇంకా కొన్ని వ్యాసాలు రాలేదు. రానున్న సంచికలలో కూడ ఈ వ్యాస పరంపర కొనసాగుతుంది.

సహజంగానే గత దశాబ్ది ప్రయాణమంతా నల్లేరు మీద బండినడక కాదు, అన్నీ విజయాలతోనే సాగలేదు. ఎన్నో అపజయాలూ ఇబ్బందులూ అనుభవిస్తూ, అధిగమిస్తూ, అధిగమించడానికి ప్రయత్నిస్తూ సాగిన ప్రయాణమిది. రచనలోనూ, ఆర్థిక పుష్టిలోనూ, నిర్వహణలోనూ వీక్షణం నిత్య సమస్యలను ఎదుర్కొంటూనే ముందుకు సాగింది, సాగుతోంది.

ఇదివరకే చెప్పినట్టు మాకు చాల విరివిగా రచనలు వస్తున్నప్పటికీ, ఎంతో మంది రచయితలు చాల ఉదారంగా మాకు రచనలు పంపుతున్నప్పటికీ, ఇవాళ్టి సామాజిక సందర్భానికి అవసరమైన రచనలకు, వస్తున్న రచనలకు మధ్య తేడా ఉంటున్నది. ప్రతి నెలా చివరివారంలో మరుసటి నెల సంచిక పోస్ట్ చేసి, తర్వాతి సంచికకు ఏ రచనలు ఉండాలని సంపాదకవర్గ సమావేశం జరుపుకుంటున్నప్పుడు ఆ నెలలో జరిగిన ఘటనలు, పరిణామాలు మేమంటే మేమని తోసుకొస్తాయి. వాటి మీద కనీస సమాచార నివేదికలైనా ఉండవలసి ఉంటుంది. ఆ ఘటనలను, పరిణామాలను ప్రాతిపదికగా తీసుకుని రాయవలసిన సైద్ధాంతిక, విశ్లేషణా వ్యాసాలుంటాయి. అవికాక, నిర్ణీత కాలవ్యవధిలేని పరిశోధనా వ్యాసాలు, దృక్పథ వివరణా వ్యాసాలు ఎప్పుడూ ఉంటాయి. ఇవన్నీ రాయడానికి తగినంతమంది రచయితలు లేరు. సంఖ్యలో ఉన్నా, ఆయా విషయాల మీద సాధికార అవగాహన ఉన్నవాళ్ల సంఖ్య తక్కువ. అలాంటివాళ్లు ఉన్నా వారు ఇతరంగా అనేక పనుల్లో కార్యమగ్నులై ఉంటారు గనుక సమయం పాటించి అడిగిన తేదీ లోపల ఇవ్వలేరు. మొత్తంగా నెల తిరిగేసరికి అంత ముఖ్యమైన, అత్యవసరమైన విషయాలలో కొన్నిటి మీద రచనలు లేకుండానే పత్రిక వెలువడుతుంది. ఇదీ సాధారణ పరిస్థితి. మనలో ప్రతి ఒక్కరూ ఆలోచించడం, రాయడం, జరిగిన, జరుగుతున్న ప్రతి విషయం మీదా తమ స్పందన వ్యక్తీకరించాలని అనుకునేంతవరకూ ఈ పరిస్థితి మారదు.

రచనా సమస్య కన్న మించినది ఆర్థిక పుష్టి సమస్య. 'ఈ పత్రిక వెనుక డబ్బుమూటలు లేవు. నయాపైసా పెట్టుబడి పెట్టలేదు కాబట్టి ప్రతిఫలాన్ని కోరుకోవడం లేదు. ప్రత్యామ్నాయ విధానాలు, ఆచరణే దేశానికి, ప్రజలకు విముక్తి కలిగిస్తాయనే విశ్వాసమే, మా మేధస్సే మా పెట్టుబడి. చందాదారులే మా పోషకులు... ఈ పత్రికను ప్రారంభించడమే మా వంతు. దాన్ని పెంచి, పోషించాల్సింది పాఠకులే. మీ రచనలు, ఆర్థిక సహాయమే మా ఊపిరి' అని పత్రిక ప్రారంభ సంచిక సంపాదకీయంలో హనుమంతరావు గారు రాశారు. ఇవాళ్టికీ అదే పరిస్థితి. నిజానికి ప్రత్యామ్నాయ పత్రికలన్నిటి ఆర్థిక పరిస్థితీ ఇదే. చాల ప్రత్యామ్నాయ పత్రికలు ఆలస్యంగా వెలువడడం, మధ్యమధ్య కొన్ని సంచికలు వదిలేయడం, అర్ధాంతరంగా ఆగిపోవడం ఆర్థిక కారణాలవల్లనే. కాని ఎన్ని ఇబ్బందులు పడవలసి వచ్చినా సరే, వీక్షణం ఒక్క సంచిక కూడ ఆగిపోగూడదు, ఆలస్యం కాగూడదు అనే పట్టుదల వల్ల, ఒక నిర్మాణాన్ని ఏర్పాటు చేసుకోవడం వల్ల వీక్షణానికి ఖర్చు మరింత పెరిగింది. పత్రిక ఉత్పత్తి వ్యయం పెరిగిపోయింది. ఆ ఉత్పత్తి వ్యయాన్నంతా చందాదారుల మీద, విడిప్రతి కొనుగోలుదారుల మీద వేయడం తలకు మించిన భారమవుతుంది. ఆ ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించడానికి నిర్మాణం తగ్గిస్తే పత్రిక ఉనికే ప్రమాదంలో పడుతుంది. అందువల్ల ఉత్పత్తి వ్యయంలో కొంతభాగాన్ని మిత్రుల నుంచి విరాళాల రూపంలో, వ్యాపార ప్రకటనల, అభినందన ప్రకటనల రూపంలో సేకరించక తప్పదు.

ప్రత్యామ్నాయ సంస్థలన్నీ విరాళాల కోసం ఆ దాతల మీదనే ఆధారపడడం వల్ల వారి మీద కూడ ఒత్తిడి పెరుగుతున్నది. అందువల్ల ప్రధానస్రవంతి వార్తాపత్రికల లాగనే ప్రకటనల మీద దృష్టి పెట్టాలని వీక్షణం భావించింది. ప్రకటనలు వేసినంత మాత్రాన తన అభిప్రాయాలలో రాజీపడనక్కరలేదు. ఇంతవరకూ వీక్షణం అలా ఎప్పుడూ రాజీ పడలేదు. ప్రభుత్వ ప్రకటనలు ప్రజాధనమే గనుక, చిన్నపత్రికలకు తప్పనిసరిగా కొంత భాగం కేటాయించాలని చిన్నపత్రికలు ఎంతోకాలం పోరాడి, ఒక హక్కుగా దాన్ని సంపాదించుకున్నాయి. అవి కూడ నిబంధనల ప్రకారం ప్రతి నెలా ఒకటి రావలసి ఉన్నా వీక్షణంకు ఏడాదికి ఎనిమిదికి మించి రాలేదు. గత సంవత్సరానికి పైగా అన్ని చిన్నపత్రికలకూ ఆ ప్రకటనలూ ఆగిపోయాయి. ఇక స్వతంత్ర, ప్రైవేట్ సంస్థల ప్రకటనలు తప్ప మరొక అవకాశం లేదు. అవి కూడ లేకుండా పూర్తిగా చందాలతో, విరాళాలతో పత్రిక నడపగలిగిన స్థితి వస్తే సంతోషం. కాని ఇప్పటికైతే ఆ ఆదర్శవంతమైన స్థితి కనుచూపు మేరలో లేదు. కొనుగోలుశక్తి, అదనపు వనరులు తక్కువగా ఉన్న మన సమాజంలో మాత్రమే కాదు, ప్రపంచమంతా ప్రత్యామ్నాయ సమాచార వాహికల పరిస్థితి ఇదే. వరల్డ్ న్యూస్ డెయిలీ ఇంటర్నేషనల్ క్లియరింగ్ హౌస్, రీడర్ సపోర్టెడ్ న్యూస్, ట్రూత్ ఔట్, డెమొక్రసీ నౌ వంటి పూర్తిగా ఇంటర్నెట్ మీద నడిచే అంతర్జాతీయ ప్రత్యామ్నాయ పత్రికలు కూడ దాదాపు ప్రతిరోజూ విరాళాల కోసం విజ్ఞప్తులు చేస్తుండడం, ఆశించిన కనీస స్థాయిలోనైనా విరాళాలు రావడం లేదని విచారపడడం కనబడుతున్నది. చివరికి అమెరికాలో రెవల్యూషనరీ కమ్యూనిస్ట్ పార్టీ కూడ విరాళాలు రాకపోతే తన పత్రిక రెవల్యూషన్ ఇక నడిచే పరిస్థితి లేదని ప్రకటిస్తున్నది.

ఇక, తగినంతమంది సిబ్బంది లేకపోవడం, అందువల్ల పత్రిక నాణ్యతలో లోపాలు, సర్క్యులేషన్ లోపాలు వంటి నిర్వహణా సమస్యలను కూడ వీక్షణం ఇప్పటికీ ఎదుర్కొంటూనే ఉన్నది.

ఈ సమస్యల వల్ల వీక్షణం చేయవలసిన పనులెన్నో చేయలేకపోయింది. చేయగలిగే, చేయాలని అనుకునీ కూడ ఈ కారణాల వల్ల చేయలేకపోయిన పనులూ కొన్ని ఉన్నాయి. ఈ సమస్యలను మెల్లమెల్లగా అధిగమిస్తూ చేయవలసిన, చేయగలిగిన, చేయాలనుకుంటున్న పనులు భవిష్యత్తులో మరింత సమర్థంగా చేయగలమనే ఆశిస్తున్నాం.

అయితే వీక్షణం ఎంచుకున్న దృక్పథం, కార్యక్షేత్రం, ఆచరణ, విలువలు ప్రత్యామ్నాయమైనవి. అవి ఈ సమాజంలో అనివార్యంగా.

(మిగతా 24వ పేజీలో...)

# అభివృద్ధి - నిర్వాసితులు

## సామాజిక పరివర్తన - మిగులు మనుషుల ప్రభావం

*అభివృద్ధి పేరు మీద సాగుతున్న అభివృద్ధి పథకాల మార్గం సామాజిక పరివర్తనను సాధించడం లేదనీ, అశేష ప్రజా రాశులను మిగులు మనుషులుగా మారుస్తున్నదనీ అంటూ ఆ పరిణామాల ప్రభావాన్ని చర్చిస్తున్నారు* **ముదునూరి భారతి**

**భా**రత ప్రభుత్వం అభివృద్ధి పథకాల ద్వారా సాగే అభివృద్ధి మార్గాన్ని చేపట్టింది. ఈ ఆధునికీకరణకు పెట్టుబడి మదుపే సాధనమని అది భావిస్తోంది. ఈ దిశలో అమలయ్యే విభిన్న అభివృద్ధి పథకాలు, విధానాలు పెద్ద సంఖ్యలో ప్రజలను నిర్వాసితులను చేస్తున్నాయి. వారు సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థ నుంచీ, సంస్కృతి నుంచీ నిర్వాసితులవుతున్నారు గాని కొత్తగా రూపొందుతున్న ఆధునిక ఆర్థిక వ్యవస్థలో సంలీనం కావడం లేదు. ఇది ప్రతి ఒక్కరూ అంగీకరించే నిస్సందేహమైన వాస్తవం. ఇలా నిర్వాసితులైన ప్రజలను పేదలు అనో, అంచులలో జీవిస్తున్నవారు అనో, మిగులు మనుషులు అనో వేరువేరుగా పిలుస్తున్నారు. ఈ సమూహంలో షెడ్యూల్డ్ తెగలు, షెడ్యూల్డ్ కులాలు. గ్రామీణ చేతివృత్తులవారు, వ్యవసాయ కూలీలు, స్త్రీలు ఉన్నారు. ఇటీవలి కాలంలో విశ్వవిద్యాలయాల పరిశోధనలో ఈ 'అభివృద్ధి– నిర్వాసితత్వం' సమస్య చాల ఎక్కువగా చర్చకు వస్తోంది. ఆ పరిశోధనలలో ప్రతి ఒక్కటీ మరింత మరింత లోతుకు వెళ్లి నిర్వాసితత్వపు పర్యవసానాల తీవ్రత గురించి కొత్త కొత్త అంశాలను, లక్షణాలను బయట పెడుతున్నాయి. ఏ అభివృద్ధి పథకాన్ని పరిశీలించినా అటువంటి నిర్ధారణలకే రావచ్చు.

అభివృద్ధి పథకాల వల్ల నిర్వాసితులైన ప్రజలు అసంఖ్యాకంగా ఉన్నారని, వారు పెరుగుతున్నారని గుర్తిస్తున్న ఈ పత్రం ఒక చిన్నప్రశ్నతో ఈ చర్చను ప్రారంభించదలచింది. 'నిర్వాసితులు ఉన్నారు సరే, అయితే ఏమిటి' అనేదే ఆ ప్రశ్న. అభివృద్ధి ప్రక్రియ మీద నిర్వాసితులు వేయగల ప్రభావాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తూ ఈ పత్రం మరొక మూడు ప్రశ్నలను ముందుకు తెస్తుంది.

- నిర్వాసితుల ఉనికి అభివృద్ధి ప్రక్రియ మీద గాని, ఆర్థిక వ్యవస్థ మీద గాని ఏదైనా ప్రభావం వేస్తుందా?
- నిర్వాసిత ప్రజాసమూహం సంఖ్య పెరుగుతూ పోతున్నప్పుడు తమ నిర్వాసితత్వం పట్ల వారి స్పందనలు, ఆచరణలు, అభిప్రాయాలు ఏమైనా మార్పులు సంతరించుకుంటాయా?
- నిర్వాసితుల ప్రభావంతో రాజ్యం పాత్ర ఏమవుతుంది? రాజ్య నిర్వహణలో ఏవైనా పరిమితులు తలెత్తుతాయా?

మానవ సమాజం ఒక భౌతిక వాస్తవికత. మానవ సమాజాన్ని తమలో తమకు నిర్దిష్ట సంబంధాలు గల వ్యక్తుల సమూహంగా చూడవచ్చు. ఆ మనుషులకు ప్రకృతితోనూ, సమాజంతోనూ, చరిత్రతోనూ సంబంధం ఉంటుంది. ఆ సంబంధాలను ఉత్పత్తి శక్తులు, ఆస్తి సంబంధాలు, ఉపరితలం అనే మూడు పరస్పరాధారిత రంగం నిరంతర చలనంలో ఉన్న సామాజిక సంబంధాలుగా గుర్తించవచ్చు. ప్రకృతి, సమాజం ఎప్పుడూ సమతా స్థితిలో ఉండవని, నిరంతర చలనంలో ఉంటాయని మార్క్సిస్టు తత్వశాస్త్రం భావిస్తుంది. ఈ మొత్తం చలనం ఎటువంటిదంటే, సమాజంలోని ప్రతి కోణమూ దానికదిగా స్వతంత్ర చలనాన్ని కలిగి ఉండవచ్చు. అది ఇతర కోణాలలో చలనాన్ని ప్రారంభించవచ్చు, ప్రేరేపించవచ్చు. తద్వారా అనేక పాక్షిక చలనాల వరుసను సృష్టించవచ్చు. ఆ చలనాల నేపథ్యంలో సమాజానికి ఒక స్వభావాన్ని సంతరింపజేయవచ్చు.

అలా చూసినప్పుడు అభివృద్ధి అంటే పరివర్తనా ప్రక్రియ అని అర్థమవుతుంది. జ్ఞానం, సమాజానికి ఆ జ్ఞానాన్ని అన్వయించడం, సంస్కృతి అనే మూడు కోణాలలో ఏ ఒక్క కోణాన్నయినా తొలగించి, దాని స్థానంలో మరొకదాన్ని ప్రవేశపెట్టడం అభివృద్ధి అని అర్థమవుతుంది. మరోమాటల్లో చెప్పాలంటే ఒక నిర్దిష్ట సంబంధం అసాధ్యంగా మారిపోయినపుడు, కొనసాగడం కష్టమయినప్పుడు ఆ సంబంధాన్ని తొలగించవలసిన అవసరాన్ని అభివృద్ధి ప్రతిఫలిస్తుంది. అంటే అభివృద్ధి–తొలగింపు (నిర్వాసితత్వం), లేదా నిర్మాణం–విధ్వంసం అనేవి ఒకే పరివర్తనా ప్రక్రియకు ఉండే రెండు ముఖాలని తేలుతుంది. అంటే నిర్వాసితత్వం అనేది అభివృద్ధితో పాటు నడిచివచ్చే నీడలా ఉంటుంది. కాని, భారత సమాజ నేపథ్యంలో ఈ రెండు ప్రక్రియలు స్థలంలోనూ, కాలంలోనూ విడదీయబడినట్టు కనబడుతున్నాయి. అభివృద్ధి పథకాల వల్ల ప్రయోజనాలు పొందుతున్న భాగం ఒకటి కాగా, అదే అభివృద్ధి క్రమం వల్ల తమ ఆర్థిక వ్యవస్థ నుంచి, పర్యావరణం నుంచి దూరమై నిర్వాసితులవుతున్న సమాజ భాగం మరొకటిగా ఉంటున్నది. రెండు సమూహాలు వేరువేరుగా ఉంటున్నాయి.

వలసవాద పాలన రోజుల్లో కూడ నిర్వాసితత్వం అనేది ఒక అనివార్య క్రమంగా ఉండింది. అడవులు, నదీజలాలు, ఖనిజాలు వంటి సహజవనరులు ఎన్నో అభివృద్ధి పథకాలకు అవకాశం ఇచ్చి స్థానిక ప్రజా సమూహాలను నిర్వాసితులను చేశాయి. అప్పటికి ఉండిన పారిశ్రామిక వ్యవస్థను ధ్వంసం చేయడం, వ్యవసాయాన్ని బలవంతంగా వ్యాపారీకరించడం వల్ల గ్రామీణ సమాజంలోని చేతివృత్తుల బృందాలు, సేవా బృందాలు నిర్వాసితులయ్యారు. వారిలో కొందరు వ్యవసాయ

కూలీలుగా మారిపోగా మరికొందరు కొత్త పరిశ్రమల తలుపులు తట్టారు. స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం ఎన్నో అభివృద్ధి పథకాలను ప్రారంభించింది. మళ్లీ వీటివల్ల కూడ దేశంలోని అన్ని ప్రాంతాలలోను స్థానిక జనాభాలో అత్యధిక సంఖ్యాకులు నిర్వాసితులయ్యారు. జ్ఞానం, ఆ జ్ఞానాన్ని సమాజానికి అన్వయించడం, సంస్కృతి అనే మూడు రంగాలలోను చేపట్టిన విధానాలు ప్రజలను వారి కార్యకలాపాల నుంచి నిర్వాసితులను చేయడానికే దారితీశాయి. ప్రస్తుతం ఇలా నిర్వాసితులైన ప్రజలలో గణనీయమైన సంఖ్య ఆధునిక ఆర్థిక వ్యవస్థలో సంలీనం కాని స్థితిలో గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణాల అంచులలోను నివసిస్తున్నారు. సమాజంలో జరిగే ప్రతి కొత్త దశ అభివృద్ధి కొత్తగా మరి కొంతమందిని నిర్వాసితులను చేసి, ఇప్పటికే ఉన్న నిర్వాసిత జనాభాను పెంపొందిస్తోంది. వారు కొత్త వ్యవస్థలో సంలీనం కాకపోవడానికి కారణం ఆయా స్థానిక ప్రజాసమూహాలకు ఉన్న జ్ఞానం, నైపుణ్యం, సాంకేతిక పరిజ్ఞానాలకూ, ఆ అభివృద్ధి పథకాలకు అవసరమైన వాటికీ మధ్య సక్రమ సంబంధం లేకపోవడం కావచ్చు. ఆ కొత్త అభివృద్ధి పథకాలకు భారీ పెట్టుబడితో కూడిన ఉన్నతస్థాయి సాంకేతిక పరిజ్ఞానం కావాలి. వాటి పరివర్తనా వ్యయం చాల ఎక్కువగా ఉంటుంది. ఈ పునస్సమ్మేళనం జరగకపోవడం వల్ల నిర్వాసిత ప్రజా సమూహం నానాటికీ పెరిగిపోతూ, అంతకంతకూ ఎక్కువగా అంచులలోకి నెట్టబడుతూ ఉంది. ఈ సమూహం నూతన ఆర్థిక వ్యవస్థకు ఉపయోగ పడని అదనపు/మిగులు మనుషులుగా ఉంది. వ్యవస్థలో ఇలా నానాటికీ పెరుగుతున్న, సంలీనం కాని ప్రజానీకం ఉండడం విశాలమైన ఆర్థిక వ్యవస్థమీద, రాజ్య నిర్వహణ మీద, స్వయంగా ఆ నిర్వాసిత ప్రజల మీద ఎటువంటి ప్రభావం చూపుతుందనేది, ఆ ప్రభావంపట్ల ఆ నిర్వాసిత ప్రజలు ఎటువంటి ప్రతిస్పందన చూపుతారనేది ఇప్పుడు ప్రశ్న.

### 1. అభివృద్ధి పథకాలు–నిర్వాసిత ప్రజల ప్రతిస్పందన

అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి అనే ప్రక్రియ సాగుతున్న గత 65 సంవత్సరాల నేపథ్యంలో భారత ఆర్థిక వ్యవస్థ మూడు భిన్న ఉప ఆర్థిక వ్యవస్థల సమాహారంగా మారిపోయింది.

భారత ఆర్థిక వ్యవస్థలో సాగిన అభివృద్ధి క్రమం గ్రామీణ–పట్టణ ద్వంద్వ ఆర్థిక వ్యవస్థలను ఒకే నిర్మాణ సూత్రం ప్రాతిపదికగా ఏకీకృతం చేయడానికీ, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను అవశేషంగా మార్చడానికీ బదులుగా, మూడు విశిష్టంగా వేరైన, స్వతంత్రమైన ఉప ఆర్థిక వ్యవస్థల సమాహారంగా మార్చింది. ఒకే ఆర్థిక వ్యవస్థలో ఏకకాలంలో మూడు భిన్నమైన భాగాలు ఉండడమంటే అర్థం ఆ భాగాల మధ్య పరస్పర అంతస్సంబంధాలు లేకపోవడమే. నిజానికి భాగాల మధ్య పరస్పర అంతస్సంబంధాలు ఉండడమే ఆ భాగాలన్నీ ఒకే మొత్తానికి చెందినవనడానికి కీలకమైన షరతు. ఆ భాగాల మధ్య ఏకముఖ సంబంధం మాత్రమే ఉండడమంటే పాక్షిక పరివర్తనకు మాత్రమే వీలుంటుంది. తత్ఫలితంగా మొత్తం దేశంలోని ఆర్థిక వ్యవస్థ అనేక పొరలలో, అనేక నిర్మాణాలతో ఉంటుంది.

ఒక సమాజంలో ప్రకృతి పట్ల అవగాహన ఏ స్థాయిలో ఉంది, ఆ జ్ఞానాన్ని వినిమయం చేసుకునే ప్రక్రియ ఏమిటి, ఆ జ్ఞానాన్ని భౌతిక వస్తూత్పత్తిలో ఎలా వినియోగిస్తున్నారు అనే అంశాల మీదనే ఆ సమాజ నిర్మాణ రూపాలు, ఆ సమాజ స్వభావం ప్రధానంగా ఆధారపడి ఉంటాయి. ఒక వ్యక్తికి ఇతర వ్యక్తులతో ఉన్న సంబంధం సమాజ నిర్మాణాన్ని రూపొందించడానికీ మార్చడానికీ కావలసిన శక్తిని సమకూరుస్తుంది. సాంఘిక వ్యవస్థలు, వాటికి అనుబంధంగా ఏర్పడే నిర్మాణాలు, తత్సంబంధిత ఆస్తి హక్కులు, జ్ఞాన భాండాగారం, సాంకేతిక నైపుణ్యం సమస్తమూ కలిసి ఒక స్వీయ అస్తిత్వ ఆలోచనా–ఆచరణా స్థలాన్ని (ఆంటలాజికల్ స్పేస్) తయారు చేసిపెడతాయి. ఈ స్థలంలో నిలిచి ఉండే మనిషి ఆలోచన, ఆచరణ ఆ స్థలానికి తగిన నియమ నిబంధనల చేత నిర్దేశించబడుతుంది. దీన్నే మరో మాటల్లో చెప్పాలంటే సమస్యలను పరిష్కరించే పద్ధతులకు సంబంధించిన చైతన్యం అని చెప్పవచ్చు.

మానవశ్రమ, ప్రకృతి (భూమి, ముడి పదార్థాలు), పెట్టుబడి (ఉత్పత్తి సాధనాలు, పెట్టుబడి) వంటి ప్రధాన ఉత్పత్తి వనరులను సమాజంలో వ్యక్తులు తమలో తాము పంచుకుంటారని మానవ పరిణామ చరిత్ర చూపుతోంది. ఒక నిర్దిష్ట స్వీయ అస్తిత్వ ఆలోచనా–ఆచరణా స్థలం అనే ప్రత్యేక నేపథ్యంలో, అప్పటికి అందుబాటులో ఉండే జ్ఞాన స్థాయిని బట్టీ, దాన్ని ఆకళించుకునే ప్రక్రియను బట్టీ ఈ మూడు వనరులలో ఒకటి భౌతిక వస్తూత్పత్తిని పెంచడానికి ఆటంకంగా మారుతుంది. అంటే ఆ వనరుకు కొరత ఏర్పడుతుంది. అలా ఏ వనరుకు కొరత ఏర్పడిందో ఆ వనరే ఉత్పత్తిని నిర్ణయిస్తుంది. సంబంధాలను కూడ నిర్ణయిస్తుంది. తద్వారా అది మొత్తం వ్యవస్థకు ఒక నిర్మాణాన్ని స్థిరపరుస్తుంది. అలా చూసినప్పుడు ప్రస్తుత గిరిజన సమాజాన్ని శ్రమకొరత వ్యవస్థగా, స్థిరవ్యవసాయ సమాజాన్ని భూమికొరత వ్యవస్థగా, మార్కెట్ ప్రధాన పెట్టుబడిదారీ సమాజాన్ని పెట్టుబడికొరత వ్యవస్థగా చూడవచ్చు.

భారతదేశంలో కనబడే ఈ దృశ్యాన్ని బహుళపొరల కొరత వ్యవస్థల సమాహారంగా వ్యాఖ్యానించవచ్చు, ఉదాహరణకు వెనుకబడిన ఒడిశా రాష్ట్రాన్ని ఆదివాసి ప్రధానమైనదిగా శ్రమకొరత వ్యవస్థగా వ్యాఖ్యానించ వచ్చు. వ్యవసాయ ప్రాధాన్యతవల్ల పంజాబ్‌ను భూమికొరత వ్యవస్థగానూ, గుజరాత్‌ను పెట్టుబడికొరత ఆర్థికవ్యవస్థగానూ చూడవచ్చు. అలాగే, ఈ రాష్ట్రాలలో ప్రతి ఒక్కటీ కూడ తనకు తాను మూడు కొరతల వ్యవస్థల సమ్మేళనంగా ఉండడాన్నీ చూడవచ్చు. ఒడిశాలో అట్టడుగున విస్తృతమైన శ్రమకొరత వ్యవస్థ ఉండగా, పైభాగాన ఒక చిన్న పెట్టుబడి కొరత వ్యవస్థ కూడ ఉంది. మధ్యభాగాన్ని భూమికొరత వ్యవస్థ ఆక్రమించింది. పిరమిడ్ లాంటి ఈ నిర్మాణంలో ప్రతి పొరకూ దానికే ప్రత్యేకమైన సంస్థాగత నిర్మాణాలున్నాయి. ఇందుకు భిన్నంగా గుజరాత్‌లో ఈ పిరమిడ్ తిరగబడి ఉంది. అక్కడ పైభాగంలో విస్తృతమైన పెట్టుబడి కొరత వ్యవస్థ ఉండగా, అట్టడుగున చిన్న శ్రమకొరత వ్యవస్థ ఉంది. ఇక్కడ కూడ మధ్య భాగంలో భూమి కొరత వ్యవస్థ ఉంది. దేశం మొత్తంగా చూసినా ఇటువంటి బహుళ నిర్మాణాల వ్యవస్థ కనబడుతుంది.

ఈ మూడు రకాల కొరతల వ్యవస్థలూ మూడు భిన్నమైన స్వీయ అస్తిత్వ ఆలోచనా–ఆచరణా స్థలాలను రూపొందిస్తాయి. ఈ మూడు వ్యవస్థలలో ఉన్న వ్యక్తులు మూడు భిన్నమైన చైతన్య స్థాయిలలో

ఉంటారు. అందువల్ల దేశం మొత్తానికీ ఒకే ఒక్క రాజ్యాధికారం గాని, ఒకే ఒక్క అభివృద్ధి పథం గాని ఉండడం సాధ్యం కాదు.

అభివృద్ధిని సామాజిక పరివర్తనగా, అంటే ఒక కొరత వ్యవస్థనుంచి మరొక కొరత వ్యవస్థకు చలనంగా చూసినప్పుడు, ఆ పరివర్తన రెండు స్థాయిలలో జరిగే అవకాశం ఉంటుంది. భారత ఆర్థిక వ్యవస్థను ద్వంద్వ ఆర్థిక వ్యవస్థగా చూడడం ఆనవాయితీ. అంటే గ్రామీణ పట్టణ ఆర్థిక వ్యవస్థల మధ్య విభజన ఉందనీ, అవి రెండు మాత్రమే గుణాత్మకంగా భిన్నమైన భాగాలనీ అంటారు. ఆ క్రమంలో శ్రమకొరత వ్యవస్థనూ భూమికొరత వ్యవస్థనూ కలిపేసి సమానంగా చూడడం జరుగుతుందన్న మాట. ఇలా చూడడం వల్ల దేశం మొత్తానికీ వర్తించే, సమానంగా అమలు చేయగలిగే సమాన అభివృద్ధి విధానాలను రూపొందించడం సమస్యాత్మకమవుతుంది. ఈ స్థితిలో ఆశించిన లక్ష్యాలకూ, సాధించిన ఫలితాలకూ మధ్య అఖాతం ఉన్నప్పుడు సాధారణంగా రాజకీయ సంకల్ప లేమి వల్లనో, సరైన పాలన లేకపోవడం వల్లనో, ప్రజల మానసిక సంసిద్ధత లేనందువల్లనో అలా జరిగిందని తప్పు పడుతుంటారు. కాని అసలు ఆ విధానాలు ఆ ప్రత్యేక సందర్భానికి తగినవా కాదా అనే ప్రశ్న వేయరు.

పెట్టుబడికొరత వ్యవస్థకు సంబంధించిన విధానాలు శ్రమకొరత వ్యవస్థలో పనికిరానివవుతాయి. ఆ రెండు వ్యవస్థలూ ఒకదానికొకటి సరిపడనివి. శ్రమే అత్యంత విలువైన వనరుగా ఉండే శ్రమకొరత వ్యవస్థలో కుటుంబ నియంత్రణ విధానాలకు అర్థం లేదు. అలాగే అక్కడ పెట్టుబడి వ్యాపారీకరణ జరగలేదు గనుక, అక్కడ ఉత్పత్తి మార్కెట్ కోసం కాదు గనుక చిల్లర వర్తకంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి అనే ప్రస్తుత సంస్కరణల జోరుకు అక్కడ అర్థం లేదు. అలాగే రోడ్లే లేని చోట విమానయాన రంగంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి అనే మాటకూ అర్థం లేదు. వంట చెరకు సేకరించడమే కష్టభరితంగా ఉన్న చోట గ్యాస్ సిలిండర్ల మీద పరిమితి అనే విధానానికి అర్థం లేదు. అలాగే చిన్నతరహా అటవీ ఉత్పత్తుల సేకరణ విధానాలకు మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో అర్థం లేదు.

ఆయా నేపథ్యాలకు తగిన విధానాలను రూపొందించడం విభిన్నమైన ఉప ఆర్థిక వ్యవస్థలు ఉనికిలో ఉన్నాయనే భావనను బలోపేతం చేస్తుంది. ఈ మూడు ఉప ఆర్థిక వ్యవస్థల ఉనికిని నిరాకరించి, ఒకే రకమైన అభివృద్ధి విధానాలను అమలు చేయడానికి ప్రయత్నాలు చేస్తే, అవి ఒకే ఒక్క ఉప వ్యవస్థ పట్ల అనుకూలంగా ఉండి ఇతర ఉపవ్యవస్థలలో వైరుధ్యపూరిత ఫలితాలకు దారితీస్తాయి. మొత్తం ఆర్థిక వ్యవస్థను అస్తవ్యస్తం చేస్తాయి.

ప్రకృతి పట్ల విభిన్న అవగాహనా స్థాయిలను, అందువల్ల భిన్నమైన ఉత్పత్తి స్థాయిలను సూచించే విభిన్న సామాజిక నిర్మాణాలు సహజీవనం సాగిస్తుండడం, పెట్టుబడికొరత వ్యవస్థ అగ్రభాగాన్ని ఆక్రమించి ఉండడం వల్ల ఈ భిన్న వ్యవస్థల మధ్య అంతస్సంబంధాలు ఏకముఖ ప్రక్రియగా ఉంటాయి. వాస్తవికతను నిశితంగా పరిశీలిస్తే శ్రమకొరత వ్యవస్థకు ఇతర రెండు కొరతల వ్యవస్థలతోనూ వినియోగ వస్తువుల ద్వారా మాత్రమే వినిమయాలు ఉన్నాయి. కాని అందుకు సరిపోయిన ఉత్పత్తి వస్తువుల వినిమయాలు లేవు, శ్రమకొరత వ్యవస్థ తన దగ్గర ఉన్న అటవీ ఉత్పత్తులను ఇతర రెండు వ్యవస్థలతోను వినిమయం చేసుకుంటుంది. అందుకు బదులుగా ఉప్పు, కిరోసిన్, కొన్ని ఆడంబర ప్లాస్టిక్ వస్తువులు మాత్రం స్వీకరిస్తుంది. కాని ఇతర రెండు వ్యవస్థలనుంచి శ్రమకొరత వ్యవస్థకు పెట్టుబడి ప్రవాహం లేదు. ఇటువంటి వినిమయ సంబంధాలు లేకపోవడం వల్ల సమ్మేళనం అసంపూర్తిగా మిగిలిపోతుంది. తత్ఫలితంగా శ్రమకొరత వ్యవస్థ (ఉత్పత్తి వస్తువులలో) దానికదిగా సొంత స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి ఉన్నప్పటికీ ఇతర రెండు వ్యవస్థలకు మాత్రం అంచులలో ఉండిపోతుంది.

శ్రమకొరత వ్యవస్థ నుంచి పెట్టుబడికొరత వ్యవస్థకు ప్రయాణిస్తున్నప్పుడు ఉత్పత్తి విధానాలు అంతకంతకూ ఉన్నతమైన జ్ఞానంతో, శాస్త్రవిజ్ఞానంతో, సాంకేతిక పరిజ్ఞానంతో ఉంటాయి. దానితోపాటు ఆ వ్యవస్థల మధ్య పరస్పర అంతస్సంబంధాలు లోపించడంతో, అంతరాల దొంతర ఏర్పడుతుంది. ఇది ఆరోగ్య వ్యవస్థలో ఉన్న పై ఆస్పత్రికి సూచించే పద్ధతిలా ఉంటుంది. ఈ వ్యవహారంలో పెట్టుబడి కొరత వ్యవస్థ ప్రాబల్యం వహిస్తుంది. అది విశాలమైన ఆర్థిక వ్యవస్థ కావడం మాత్రమే కాదు, ఇతర రెండు ఆర్థిక వ్యవస్థలూ అడుగున ఉండిపోతాయి. దీనితో మొత్తం వ్యవస్థలోనే దోపిడీ, పీడన సంబంధాలు నెలకొంటాయి.

మొత్తంగా చూసినప్పుడు భారత ఆర్థిక వ్యవస్థ తనలోని అసమాన భాగాలతో, వాటిమధ్య అంతస్సంబంధాలు లేకపోవడంతో సమతాస్థితిని కోల్పోతుంది. అభివృద్ధి పథకాల రూపంలో మరింత ఎక్కువ పెట్టుబడి మదుపు ప్రవహించినకొద్దీ వ్యవస్థలోని మూడు ఉపవ్యవస్థల మధ్య అఖాతం పెరిగిపోతుంది. దానితో విస్తారమైన దారిద్ర్యం మధ్య చిన్న చిన్న సౌభాగ్యపు ముక్కలు కనబడతాయి. ప్రాంతీయవాదం బలం పుంజుకుంటుంది. ఇతర ఆర్థిక వ్యవస్థలు భిన్నమైనవి గనుక ఈ వ్యవస్థలోని నిర్వాసితుల స్పందనలు కూడ భిన్నంగా ఉంటాయి. అభివృద్ధి పథకాల మీద వాటి ప్రభావం పడి అంచనా వ్యయాలు పెరిగిపోవడానికి, అనిశ్చితతకూ దారితీస్తాయి.

అభివృద్ధి పథకాలు-నిర్వాసితుల ప్రతిస్పందన శ్రమకొరత ఆదివాసి ఆర్థిక వ్యవస్థలో ఆ ప్రాంతంలో ఏ అభివృద్ధి పథకం ఆలోచన మొదలైనా వెంటనే వ్యతిరేకత తలెత్తుతుంది. కొన్నిసార్లు ఆ వ్యతిరేకత ప్రజా ఉద్యమంగా విస్తరిస్తుంది. ఉదాహరణకు స్వాతంత్ర్యానంతరం మొట్టమొదటి ఆధునికీకరణ ప్రయత్నంగా హిరాకుడ్ ఆనకట్ట నిర్మాణం మొదలయినప్పుడు స్థానికులు దాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమం నడిపారు. హిరాకుడ్ ఆనకట్ట నిర్వాసితుల పునరావాస చర్యలు ఇప్పటికీ అసంపూర్తిగానే ఉన్నాయి. రెంగలి ఆనకట్ట, బాల్కో, నాల్కో అల్యూమినియం కర్మాగారాలు, కళింగనగర్ లో టాటా స్టీల్ కర్మాగారం, పోస్కో స్టీల్ కర్మాగారం, కలహండిలో వేదాంత అల్యూమినియం కంపెనీ, పశ్చిమ బెంగాల్ లో సింగూరు, నందిగ్రామ్ .... ఈ జాబితా అలా పెరిగిపోతూనే ఉంది. వేదాంతకు వ్యతిరేకంగా నియమగిరి కొండలలో ఆదివాసి ప్రజల పోరాటం, బాక్సైట్ సరఫరాకు వాళ్లు సమ్మతించక పోవడం వల్ల రోజుకు నాలుగు కోట్ల రూపాయల నష్టం వచ్చిందని (మొత్తంగా రు. 3000 కోట్ల నష్టం వచ్చిందని) అంచనా వేస్తున్నారు. కంపెనీ తాత్కాలికంగా తన పని ఆపివేయవలసి వచ్చింది. తాను తన

కర్మాగారాన్ని ఉపసంహరించుకుంటానని కంపెనీ ప్రభుత్వానికి తెలియజేసింది. ఇలా వేరువేరు చోట్ల ప్రజా ఉద్యమాల వల్ల దేశంలో పెట్టుబడి అనుకూల వాతావరణం లేకుండా పోయిందంటున్నారు.

ఇక భూమి కొరత ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధి పథకాలకు వాటికవిగా గతంలో పెద్ద వ్యతిరేకత వ్యక్తం కాలేదు. కాని అక్కడ ప్రజా ఉద్యమాలు, ఇతర డిమాండ్లతో పాటు తమ భూమికి హెచ్చు నష్టపరిహారం చెల్లించాలనీ, మెరుగైన పునరావాసం, ఇతర సౌకర్యాలు కల్పించాలని డిమాండ్ చేస్తున్నాయి. అక్కడ ప్రజలకు పెట్టుబడికొరత వ్యవస్థలు ఎలా పనిచేస్తాయో కొంతవరకు అవగాహన ఉంది. అందువల్ల దానితో బేరమాడడానికి, మెరుగైన నష్ట పరిహారంతో పరిష్కరించుకోవడానికి సిద్ధపడుతున్నారు. నర్మదా నది మీద అనేక ఆనకట్టలలో ఒకటయిన ఓంకారేశ్వర్ ఆనకట్ట ఒక ఉదాహరణ. ఇటీవల అక్కడి ప్రజలు జన సత్యాగ్రహంలో భాగంగా రిజర్వాయర్ లో నీటిమట్టం తగ్గించాలని, హెచ్చు నష్టపరిహారం ఇవ్వాలనీ, మెరుగైన పునరావాసం కల్పించాలనీ డిమాండ్ చేశారు. ప్రభుత్వం వారి డిమాండ్లను అంగీకరించింది. దీని ప్రభావం ఎంత బలమైనదంటే ఇటువంటి అభివృద్ధి పథకాల అంచనా వ్యయం మధ్యదారిలో పెరిగిపోతుంది, అనిశ్చిత పరిస్థితి పెరుగుతుంది.

ఇలా గ్రామాల నుంచి నిర్వాసితులైన, అంచులలోకి నెట్టబడిన ప్రజలు ప్రత్యామ్నాయ జీవనోపాధి కోసం వెతుకులాటలో మొట్టమొదట పట్టణప్రాంతాలకు వలసవెళ్లి పారిశ్రామిక కార్మిక జనాభాలో భాగం కావాలని కోరుకుంటారు. కాని పారిశ్రామిక ఉపాధిలో భద్రతలేని సామాజిక సంబంధాలు, అనిశ్చితతలు, వాటితోపాటే పట్టణ ప్రాంతాలలో మితిమీరిన జీవన వ్యయం కలిసి ఈ శ్రామికులను మళ్లీ గ్రామాలవైపు తరుముతాయి. దానితో గ్రామ ఆర్థిక వ్యవస్థ మీద ఒత్తిడి పెరుగుతుంది. ఆ క్రమంలో భూమికొరత ఆర్థిక వ్యవస్థ బలోపేతమవుతుంది. ఈ దశాబ్దపు జనగణన గణాంకాల ప్రకారం గ్రామీణ ప్రాంతాల నుంచి పట్టణ ప్రాంతాలకు వలస వెళ్లే జనాభాలో వేగంలో తరుగుదల కనబడింది. ఇలా పట్టణ ప్రాంతాలకు శ్రామికుల వలసలు తగ్గడంతో పట్టణాల శ్రామిక మార్కెట్‌లో చలనశీలత తగ్గుతుంది. అంటే ఆర్థిక వ్యవస్థ గమనం మందకొడిగా సాగుతుంది. వెనక్కి వచ్చిన ఈ శ్రామికులు తమ గ్రామంలోనే ఉద్యోగం కోసం, ఉపాధికోసం వెతుకుతూ, గ్రామంలో సాగుచెయ్యని రైతాంగ కుటుంబాల వైపు చూస్తారు. గ్రామాలలో భూమి ఉన్న ఈ కొత్త సాగుచెయ్యని రైతాంగ వర్గం గ్రామం బైట, పట్టణాలలో, అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో లాభసాటి వ్యవహారాల కోసం వెతుకుతూ గ్రామం వదిలి వెళ్లిపోయినది. వాళ్లు తమ భూమి మీద ఆసక్తిని యథాతథంగా ఉంచుకుని గ్రామంలోని వ్యవసాయ కూలీలతో, పేద రైతులతో కౌలు సంబంధాలలో ప్రవేశిస్తారు. దీనితో ఇద్దరూ– అటు సాగుచెయ్యని రైతాంగ కుటుంబాలూ, ఇటు వ్యవసాయ కూలీలూ, పేదరైతులూ–ఈ కౌలు సంబంధాలతో లబ్ధి పొందుతారు. కాని ఈ పరిణామం వల్ల భూమి మార్కెట్, శ్రామిక మార్కెట్ కూడ జడాత్మకంగా నిలిచిపోతాయి. దాని అర్థమేమంటే సామాజిక పరివర్తనా ప్రక్రియ ఆటంకానికి గురవుతుంది. అందువల్ల వ్యవసాయ సంక్షోభం తలెత్తుతుంది. అది వేతనాల మీద, ఉపాధిమీద, ఆహార భద్రత మీద ప్రభావం వేస్తుంది.

## 2. అభివృద్ధి ప్రక్రియ, రాజ్యం పాత్ర, ప్రజల ప్రతిస్పందన

అభివృద్ధి అంటే పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థగా పరివర్తన చెందడమేనని, సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థను ఆధునిక ఆర్థిక వ్యవస్థగా మార్చడానికి అవసరమైన పరిణామాలు సాధించాలంటే పెట్టుబడి మదుపు విపరీతంగా పెంచాలనీ ఆలోచనలతో భారత రాజ్యం ఇప్పటికే పురోగమించిన దేశాల అభివృద్ధి నమూనాను అమలులో పెట్టదలచుకుంది. ఈ లక్ష్యం కోసం అత్యవసరమైన వనరు అయిన భూమిని సేకరించే బాధ్యతను రాజ్యమే చేపట్టింది. రాజ్యం చేపట్టిన ఈ చర్య వల్ల స్థానిక ప్రజలు పెద్ద సంఖ్యలో తమ భూముల నుంచి బేదఖలయి, నిర్వాసితులయ్యారు. ఆ ప్రజలు తరతరాలుగా ఈ భూమి మీదనే నివసిస్తున్నారు, ఈ భూమి నుంచే తమ మనుగడ పొందుతున్నారు. భూమి నుంచి వారి పరాయీకరణ కేవలం వారి సహజ పరిసరాల నుంచి భౌతికంగా నిర్వాసితులు కావడం మాత్రమే కాదు, అది వారి జీవనశైలుల నుంచి నిర్వాసితులు కావడం కూడ. ఈ ఆధునికీకరణ–నిర్వాసితత్వం ప్రక్రియ గతంలోని వలస పాలన కాలం లోనూ, ప్రస్తుత పాలన లోనూ ఎన్నో ఏళ్లుగా కొనసాగుతూనే ఉంది. ఈ నిర్వాసితులలో అత్యధికులు తిరిగి కొత్తగా తలెత్తుతున్న ఆర్థిక వ్యవస్థలో భాగం కాలేకపోయారు. వారు కొత్త ఆర్థిక వ్యవస్థ అంచులలోనే మిగిలిపోయారు. వారు ఎటువంటి శ్రమా చేయకుండా లబ్ధి మాత్రం పొందుతున్న అదనపు మనుషులని ఆధునిక సమాజం వారిని చిన్నచూపు చూస్తోంది. ఒక్క మాటలో చెప్పాలంటే అభివృద్ధి పథకాలన్నీ కూడ వారిని అభివృద్ధి చేయకుండా, పునస్సమ్మేళనం చేసుకోకుండా నిర్వాసితులను చేస్తున్నాయని చెప్పవచ్చు. అంటే నిర్వాసితత్వం–అభివృద్ధి ప్రక్రియలు స్థలం లోనూ కాలంలోనూ వేరు చేయబడి సాగుతున్నాయి. అప్పుడిక ఈ నిర్వాసిత ప్రజానీకం మనుగడకు మిగిలే ప్రధానమైన వనరు ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలు, సంక్షేమ పథకాలు, ఇతర సౌకర్యాలు వంటి తాయిలాలే. ప్రభుత్వం ఇలా అందజేస్తున్న వేరువేరు తాయిలాల జాబితా చూస్తేనే అవి ఎంత ఎక్కువగా ఉన్నాయో తెలుస్తుంది.

తొలిదశలో రాజ్యం అనేక రకాల దారిద్ర్య వ్యతిరేక కార్యక్రమాలను చేపట్టింది గాని కాలక్రమంలో అవన్నీ సబ్సిడీలుగా, సంక్షేమ పథకాలుగా మిగిలిపోయాయి.

1. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న కుటుంబాలకు తెల్ల రేషన్ కార్డులు. కుటుంబానికి 30 కిలోల చొప్పున బియ్యం ఉచితంగా గాని, రు. 2 కు కిలో గాని ఇవ్వడం. అలాగే కుటుంబానికి అవసరమైన పంచదార, కిరొసిన్, నూనె, పప్పులు, వగైరా నిత్యావసర వస్తువులు చౌకధరలకు అందించడం. దీపం లబ్ధిదారులకు ఇతరుల కన్న ఎక్కువగా మూడు గ్యాస్ సిలిండర్లు తక్కువ ధరకు అందించడం.
2. జాతీయ విద్యా మిషన్ ఆధ్వర్యంలో ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్య అందించడం, పేద కుటుంబాల విద్యార్థులు పాఠశాలకు వచ్చేలా ప్రోత్సహించడానికి ఉచిత మధ్యాహ్న భోజన పథకం, యూనిఫారాలు, పుస్తకాలు, కొన్నిసార్లు సైకిళ్లు, స్కాలర్‌షిప్‌లు ఇవ్వడం.
3. ఉచిత ఆరోగ్య సేవలను అందరికీ అందుబాటులోకి తేవడానికి త్వరలో ప్రవేశపెట్టనున్న జాతీయ ఆరోగ్య మిషన్.

4. ఉపాధి హామీ పథకం కింద అర్హులైన, పనిచేయడానికి సిద్ధంగా ఉన్నవారందరికీ రోజుకు రు. 135 వేతనంతో ఏడాదికి కనీసం వంద రోజుల పని కల్పించడం.
5. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, స్త్రీలు వంటి బలహీనవర్గాలకు ప్రత్యేక సహాయం అందించడం.
6. స్వయం సహాయ బృందాలు. ప్రత్యేకంగా స్త్రీలకు వడ్డీ లేని రుణాలు ఇవ్వడం.
7. అవసరంలో ఉన్న కుటుంబాలకు మైక్రో ఫైనాన్స్ సంస్థల ద్వారా ఆర్థిక సహాయం అందించడం.

వీటిలో కొన్ని కార్యక్రమాలు ఇటీవల అమలులోకి వచ్చినవి. ముఖ్యంగా విద్య, ఆరోగ్య రంగాల పథకాలు ఆర్థిక సంస్కరణల నేపథ్యంలో వచ్చినవే. రాజ్యం తన రోజువారీ కార్యక్రమాల నుంచి ఉపసంహరించుకోవాలనీ, కేవలం సదుపాయాలు కల్పించే పాత్రకు పరిమితం కావాలనీ ఆర్థిక సంస్కరణల భావజాలం భావిస్తుంది. అందువల్ల అభివృద్ధి బాధ్యతను రాజ్యం మీది నుంచి తీసివేసి ప్రజల మీద పెట్టడం జరుగుతోంది. ఈ కార్యక్రమాలన్నీ సమర్థంగా సాగితే, అంచులలోకి నెట్టబడుతున్న ప్రజాసమూహాలు తమ దారిద్ర్యం నుంచి బయటపడతాయనీ, వారు కొత్త వ్యవస్థలో సంలీనం కాగలుగుతారనీ రాజ్యం ఆశిస్తోంది. అందువల్లనే ఈ కార్యక్రమాలను 'సమ్మిళిత అభివృద్ధి కార్యక్రమాలు' అని పిలుస్తున్నారు.

ఈ పథకాల ప్రయోజనాలన్నిటినీ డబ్బురూపంలోకి మార్చాలనీ, లబ్ధిదారుల బ్యాంక్ ఖాతాలలో నిర్ణీత మొత్తంలో డబ్బు జమ చేయాలనీ ప్రభుత్వం కొత్త ప్రతిపాదన పెడుతోంది. ప్రపంచం మొత్తం మీదనే పేద ప్రజలకు ఆయాదేశాల ప్రభుత్వాలు ఇచ్చే సబ్సిడీలకన్న భారతప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలే అతి ఎక్కువ అని ప్రచారసాధనాలు అంటున్నాయి. సబ్సిడీలు ప్రభుత్వం చేసే అనుత్పాదక, వృథా ఖర్చు అని కొందరు అభిప్రాయపడుతున్నారు. అది ఉచితంగా తాయిలాలు ఇచ్చే దుబారా ఖర్చుగా, ప్రభుత్వానికి పెద్ద భారంగా తప్ప దానితో సానుకూల ఫలితాలేమీ ఉండవని వారి అభిప్రాయం.

భారత ప్రభుత్వం ప్రస్తుతం సబ్సిడీల మీద వెచ్చిస్తున్నది జాతీయాదాయంలో 2.08 శాతం ఉండగా, ఈ భారాన్ని 1.5 శాతానికి తగ్గించాలని ప్రభుత్వం భావిస్తోంది. సబ్సిడీల కూర్పును మార్చాలనీ, ఆహార సబ్సిడీని పెంచి, ఇంధన, ఎరువుల సబ్సిడీని తగ్గించాలనీ ప్రభుత్వం భావిస్తోంది. సాంఘిక రంగాలపై బడ్జెట్ ప్రస్తుతం రు. 5,41,000 కోట్లుగా ఉంది. ఆర్థిక సంస్కరణలను వేగవంతం చేయదలచినప్పుడలా ప్రభుత్వం సాంఘికరంగం గురించి ఎక్కువగా మాట్లాడుతుంది. ప్రస్తుతం చిల్లర వర్తకం, విమానయానం, తదితర రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని పెంచాలని ఆశిస్తున్న ప్రభుత్వం సాంఘిక రంగాలకు కూడ ప్రాధాన్యత ఇస్తానని ప్రకటిస్తోంది. అవి:

1. ప్రజా పంపిణీ వ్యవస్థ (రేషన్ కార్డులను డిజిటైజ్ చేయడం-రు. 4,200 కోట్లు-75 శాతం కేంద్రప్రభుత్వ వాటా)
2. సమగ్ర శిశు అభివృద్ధి పథకం కింద శిశు సంరక్షణ-ఏడు లక్షల అంగన్ వాడిలను విస్తరణ (రు. 1.23 లక్షల కోట్లు)
3. ఆరోగ్య కార్యక్రమాలను పునరుద్ధరణ-రు. 22,500 కోట్లు

దీని అర్థం ఏమంటే ప్రభుత్వాలు అమలు చేస్తున్న అభివృద్ధి పథం అసంఖ్యాక ప్రజానీకాన్ని నిర్వాసితులను చేసి, వారు ప్రభుత్వం ఇచ్చే తాయిలాల మీద బతకవలసిన వాళ్లుగా మార్చేస్తుంది. వాళ్లు కేవలం అభివృద్ధి ప్రక్రియకు ప్రేక్షకులుగా మిగిలిపోతారు.

భారతదేశం ప్రపంచంలోనే అతి వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశంగా పేరు పొందుతున్నప్పటికీ వ్యవస్థలో అసమానత సూచి కూడ విపరీతంగా పెరిగిపోతోంది. జనాభాలో 70 శాతం మంది ఆహార కొరతతో బతుకుతున్నారు, ఆరోగ్య వసతి అందని స్థితిలో ఉన్నారు. నిరుద్యోగంలో ఉన్నారు.

## భూసేకరణ-ప్రజల ప్రతిస్పందన

దేశాన్ని విజయవంతంగా ఆధునికీకరించాలంటే పారిశ్రామికీకరణ, పట్టణీకరణ, మౌలిక సౌకర్యాల అభివృద్ధి మూడు కీలకమైన మంత్రదండాలని భారత ప్రభుత్వ కేంద్ర నాయకత్వం భావిస్తోంది. ఒకవైపు ఆధునీకరణ ద్వారా త్వరితగతిన ప్రగతి సాధించడం, మరొకవైపు ఆ ఆధునికీకరణ క్రమంలో నిర్వాసితులవుతున్న ప్రజలకు సరైన నష్ట పరిహారం, పునరావాసం అందించడం అనే రెండు లక్ష్యాలను నెరవేర్చడానికి ప్రభుత్వం కొత్త భూసేకరణ, నష్ట పరిహార, పునరావాస చట్టం ముసాయిదాను తయారు చేసింది. ఆ ముసాయిదాకు పార్లమెంటు త్వరలో చట్టరూపం ఇవ్వనుంది. ప్రభుత్వం చేయదలచుకున్న కార్యక్రమాలన్నిటికీ భూమి కావాలి. ఆ భూమిని 'ప్రజా ప్రయోజనం' పేరు మీద సేకరిస్తున్నారు. కాని ఆ పనివల్ల గణనీయమైన సంఖ్యలో స్థానిక ప్రజలు తమ సహజ పర్యావరణం నుంచి నిర్వాసితులవుతున్నారు. ఒక అంచనా ప్రకారం గత 65 సంవత్సరాలలో వేరువేరు అభివృద్ధి పథకాల వల్ల కనీసం ఆరు కోట్ల మంది ప్రజలు నిర్వాసితులయ్యారు. వారు భూమిలేని నిరుపేద వ్యవసాయ కూలీలు, చిన్న రైతులు, ఆస్తిలేని గ్రామీణ పేదలు, గ్రామీణ చేతివృత్తుల పనివాళ్లు, సేవావృత్తులవాళ్లు, క్వారీ కార్మికులు, మత్స్యకారులు, షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగలకు చెందినవారు. ప్రభుత్వం భూమి, రోడ్లు, ఇతర సబ్సిడీలు, సౌకర్యాలు కల్పించే బాధ్యత తీసుకోగా, మౌలిక సాధన సంపత్తి సమకూర్చుకునే బాధ్యత పెట్టుబడి తీసుకుంటుంది.

సవరించిన ముసాయిదా ప్రకారం ఈ చట్టం పేరు 'న్యాయమైన నష్ట పరిహారం, పునఃస్థిరీకరణ, పునరావాసం, భూసేకరణలో పారదర్శకత బిల్లు.' ఈ ముసాయిదా ప్రకారం నష్ట పరిహారం, కొత్త స్థలంలో పునరావాసం రెంటినీ ఒకే చట్టంలో భాగం చేయదలిచారు. ఈ మొత్తం వ్యవహారంలో అభివృద్ధిని పునరావాసంతో మిళితం చేసి, నిర్వాసితత్వాన్ని (కొత్త వాతావరణంతో పునస్సమ్మేళనాన్ని) విస్మరించారు. అందువల్ల ప్రగతి ప్రక్రియ పరిమితమవుతుంది. అభివృద్ధి ప్రక్రియ వెనుకడుగు పడుతుంది.

నిరంతరం మారుతున్న ప్రవాహం లాంటి మానవసమాజం గురించి భావనను జడాత్మక పదజాలంలో నిర్వచించడంతో ఎప్పుడూ సమస్య ఉంటుంది. ఉదాహరణకు న్యాయమైన నష్ట పరిహారం, న్యాయమైన పునఃస్థిరీకరణ, పునరావాస విధానాలు అనేవాటికి ప్రాతిపదిక అయిన కుటుంబం అనే భావన సారాంశం కాలం మారినకొద్దీ మారుతూ ఉంటుంది. ప్రస్తుతం పునఃస్థిరీకరణ, పునరావాసం అనే భావనలో ఇంటి

స్థలం, నిర్మాణ సామగ్రి ఇవ్వడంతో పాటు విద్యుత్తు, తాగునీరు, పాఠశాల, పోస్టాఫీసు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, పక్కా రోడ్డు, వగైరా 25 రకాల సౌకర్యాలు కలిసి ఉన్నాయి. ఈ జాబితా ఇంకా ఇంకా పెరిగిపోతోంది. అలాగే మార్కెట్ సంకేతాలను బట్టి నష్టపరిహారం కూడ పెరిగిపోతోంది. నిర్వాసితత్వం వల్ల ఒక కుటుంబానికి జరిగే నష్టాలను డబ్బురూపంలోకి ఎలా తర్జుమా చేయాలనేది ఇక్కడ మరొక ప్రధాన సమస్య. ఇక్కడ వినియోగం పునాదిపై సాగుతున్న మార్కెటేతర వ్యవస్థలను మార్కెట్ ఆధారిత వ్యవస్థ పదజాలంలో ఎలా చెపుతామనేది ప్రధాన సమస్య.

మన దేశంలో ఇప్పటికీ మార్కెట్లు సంపూర్ణంగా ఉనికిలోకి రాలేదు. అందువల్లనే భూమి ధరను ఏకైక పద్ధతిలో నిర్ణయించడం సాధ్యం కాదు. ఆ భూమిని ఎందుకు ఉపయోగిస్తున్నారనే దానిమీద ఆధారపడి ధర అటూ ఇటూ ఊగిసలాడుతూ ఉంటుంది. మార్కెట్ ధరలు బేరసారాల మీద ఆధారపడి స్థిరీకరణ పొందుతాయనే సిద్ధాంతానికి ఇది భిన్నమైనది. ఒకచోట ఒక అభివృద్ధి పథకం రాబోతున్నదనే మాట వినిపించడం, వదంతి వ్యాపించడమైనా సరే, అక్కడ భూమి ధరలు విపరీతంగా పెరిగిపోతాయి. దానితో అక్కడి నిర్వాసితులు తమ భూమికి హెచ్చు నష్టపరిహారం కోసం బేరమాడతారు. ఈ కొత్త బేరాలు అంతకుముందే నిర్ణయమైన నష్టపరిహారం తీసుకున్న తర్వాత కూడ కావచ్చు. నోయిడాలో రైతుల ఆందోళన ఈ పరిణామానికి ఒక ఉదాహరణ. నోయిడా రైతుల ఆందోళన రాజకీయ రూపం ధరించాక, వారిని శాంతింపజేయడానికి కేంద్రప్రభుత్వం నష్టపరిహారాన్ని కొన్ని రెట్లు పెంచాకనే ఆందోళన తగ్గుముఖం పట్టింది.

ఇలా హెచ్చు నష్ట పరిహారం కోసం బేరాలాడడం భూమికొరత వ్యవస్థ నుంచి పెట్టుబడికొరత వ్యవస్థకు సాగే పరివర్తనలో రెండో దశలో విజయం సాధిస్తుందనిపిస్తుంది. అక్కడ నిర్వాసితులకు కొత్త వ్యవస్థలోని మార్కెట్ విలువల గురించి, కొత్త వ్యవస్థ పనితీరు నియమాల గురించి అవగాహన ఉంటుంది. ఈ బేరసారాల ప్రక్రియ ఎప్పుడూ సాగే, ఎప్పటికీ పూర్తికాని ప్రక్రియగా ఉంటుంది. భూములకు ఇలా నష్ట పరిహారం పెరిగిపోతుండడాన్ని, దానితో పాటు సామాజిక, న్యాయ వివాదాల వ్యయాన్ని ప్రభుత్వం భరించవలసి ఉంటుంది. కొన్నిసార్లు మదుపుదార్లు కూడ భరించవలసి రావచ్చు.

మొదటి పరివర్తనలో, అంటే శ్రమకొరత వ్యవస్థనుంచి భూమికొరత వ్యవస్థకు మారేటప్పుడు, ప్రస్తుతం రాజ్యానికీ మావోయిస్టు పార్టీకి మధ్య తీవ్రమైన ఘర్షణ సాగుతోంది. రాజ్యమేమో పెట్టుబడి కేంద్రిత అభివృద్ధి పథకాలను, గనుల తవ్వకాన్ని ముందుకు తోస్తుండగా, ఆదివాసులను నిర్వాసితత్వం నుంచి, రాజ్య నిర్బంధం నుంచి రక్షించడానికి మావోయిస్టులు ఈ పథకాలను వ్యతిరేకిస్తున్నారు. ఈ పెట్టుబడి ఆధార అభివృద్ధి పథకాలను అమలుచేయాలనే కృత నిశ్చయంతో రాజ్యం అభివృద్ధి, భద్రత అనే రెండు అంచుల వ్యూహాన్ని ఎంచుకుంది. రాజ్యం కొన్నిసార్లు ఈ ఘర్షణను ఆర్థికాభివృద్ధి సమస్యగా పరిగణిస్తోంది. రోడ్ల నిర్మాణ చర్యలు చేపడుతోంది. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా కుటుంబాలకు నిత్యావసర వస్తువుల సరఫరా సాగిస్తోంది. ఆరోగ్య, విద్యా సదుపాయాలు సమకూరుస్తోంది. వీటన్నిటికీ అయ్యే వ్యయాన్ని ప్రభుత్వమే భరిస్తోంది. మరికొన్నిసార్లు రాజ్యం ఈ హింస ప్రతిహింసలను భద్రతా ప్రమాదంగా చూస్తోంది. ఈ భద్రతా సవాలును ఎదుర్కోవడానికి అర్ధసైనిక బలగాలను నియోగించడం, వారి శిక్షణ కళాశాలలను ఏర్పాటు చేయడం, వారికి అవసరమైన రవాణా, ఆయుధ సామగ్రి సరఫరా చేయడం, ఉద్యోగకల్పనా పథకాలు రచించడం చేస్తోంది. ఈ పనులన్నిటికీ కూడ పెద్ద ఎత్తున నిధులు కావాలి. అంటే శ్రమకొరత వ్యవస్థలలో సామాజిక రాజకీయ సంక్షోభం తలెత్తినప్పుడు రాజ్యమే ఎటువంటి సానుకూల ప్రతిఫలం లేకపోయినా పెద్ద ఎత్తున అనుత్పాదక ద్రవ్య భారాన్ని వహించవలసి వస్తోంది.

### 3. నిర్వాసిత ప్రజలకు తమ మీద తమకు ఉండే ప్రభావాలు

ఆర్థిక వ్యవస్థలో ఎక్కువ పెరుగుదల రేట్ల కోసం పెట్టుబడి మదుపును ముందుకు తోయాలని భారత రాజ్యం చేస్తున్న మహాప్రయత్నాలు అసంఖ్యాక ప్రజలు తమ ఆర్థిక వ్యవస్థ నుంచీ, పరిసరాల నుంచీ నిర్వాసితులై, కొత్తగా అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో సంలీనం కాలేకపోవడానికి దారితీశాయి. ఇది వారు ఒక ఆధునిక వ్యవస్థలో భౌతికంగా ఉండి కూడ ఆ వ్యవస్థలో భాగం కాలేని సంక్లిష్ట పరిస్థితికి దారితీసింది. వాళ్లు ఇప్పుడు తమ సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థకూ చెందరు, కొత్తగా తలెత్తుతున్న ఆధునిక వ్యవస్థకూ చెందరు. వాళ్లు తమదైన ఒక సొంత ఆర్థిక స్థలం లేని, తమకు తాము తగినట్టుగా నడుచుకోలేని స్థితిలో మిగిలిపోయారు. ఈ కారణం వల్లనే వారిని 'మిగులు మనుషులు' అనే పర్యాయపదంతో పిలవవలసి వస్తోంది. వారిని కొత్త వాతావరణంలో నిలిపి ఉంచేందుకు రాజ్యం అనేక రకాల సబ్సిడీలద్వారా, సంక్షేమ పథకాల ద్వారా అంతకంతకూ ఎక్కువ నిధులు వెచ్చించే వ్యూహాత్మకమైన బాధ్యత తీసుకుంటోంది. కాని కొత్త ఆర్థిక వ్యవస్థలో వారిని పునస్సమ్మేళనం చేసే ఆలోచనే దానికి లేదు. ఆర్థిక కర్తలుగా వ్యవహరించే తమ సొంత ఆర్థిక స్థలం లేనందువల్ల ఒక వంక, ఏ పనీ చేయకపోయినా రాజ్యం క్రమబద్ధంగా అందజేసే తాయిలాల వల్ల మరొకవంక వారిలో ఇతరులపై ఆధారపడి ఉండే మానసికస్థితి తలెత్తింది. ఈ మానసిక స్థితి వల్ల వాళ్లు క్రియాశీల మానవులుగా, కర్తలుగా తమ పాత్ర నిర్వహించలేని స్థితి ఏర్పడింది. వారిని ఎల్లప్పుడూ ఎవరో ఏదో ఇస్తే స్వీకరించే లబ్ధిదార్ల స్థితికి పరిమితం చేసింది. ఇది ఎల్లప్పుడూ తమ సమస్యల పరిష్కారానికి భగవంతుడు అనే మానవాతీతశక్తి మీద ఆధారపడే లాంటి మానసిక స్థితే. ఈ నిర్వాసిత ప్రజలు తమ సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వం వైపో, నాయకుడి వైపో చూస్తూ ఆధారపడే మనస్తత్వాన్ని చూపుతున్నారు. మరోమాటల్లో చెప్పాలంటే ఈ మిగులు మనుషులు తమ సొంత చొరవనంతా కోల్పోయి నిర్లిప్త వస్తువుల స్థాయికి కుదించబడి ఉన్నారు. దేశానికి ఎన్నికలు వచ్చినప్పుడు మాత్రమే వారికి తమ ఉనికి గురించిన స్పృహ కలుగుతుంది. వారి వోటుకు ఒక పాత్ర ఉంటుంది. ఒక విలువ ఉంటుంది. ఈ పరాశ్రిత మనుగడకు ప్రతీకాత్మక చిత్రంగా ఎల్లప్పుడూ చేతులు ముడుచుకుని ఆకాశం వైపు ఎదురుచూపులు చూస్తుండే నిస్సహాయ జీవులను చూడవచ్చు.

ఈ నిర్వాసితులలో కొందరు, నిర్దిష్ట నియమ నిబంధనలు లేని తమదైన ప్రత్యేక ఆర్థిక స్థలమేదీ లేనందువల్ల సంఘ వ్యతిరేక శక్తులుగా కూడ మారుతారు. అసాంఘిక కార్యకలాపాలలో పాలుపంచుకుంటారు. పౌరసమాజ నియమాలను చెల్లాచెదురు చేస్తారు. తాము నివసిస్తున్న

ఆర్థిక వ్యవస్థను అస్థిరపరుస్తారు. నిర్వాసితులలో మరొక పాయ రాజ్యాన్ని, దాని అభివృద్ధి విధానాలను సవాలు చేసే విప్లవోద్యమాలలో చేరతారు.

ఈ అన్ని బృందాలలోను, పరాశ్రిత మనుగడలో ఉండే నిర్వాసితులు సమాజంలో మార్పుకు ప్రధాన ఆటంకంగా ఉంటారు. వారిని నిశితంగా పరిశీలిస్తే వారు తమ స్వీయ అస్తిత్వ ఆలోచనా ఆచరణా స్థలం ఏమిటో తెలియని స్థితిలో, ఆర్థిక వ్యవస్థ నిర్మాణాలతో సంబంధం లేని స్థితిలో ఉంటారని అనిపిస్తుంది. వ్యవస్థలో ఒక ప్రత్యేక ఉత్పత్తి వనరు కొరతతో ఉందనే భావన, ఆ వ్యవస్థకు నిర్మాణ సూత్రాలుంటాయనే భావన వారిలో అస్పష్టంగా ఉంటాయి లేదా ఉండవు. ఆ క్రమంలో ఈ నిర్వాసిత ప్రజలు తమ చైతన్యాన్ని కోల్పోతారు. తమ సమస్యలను తామే పరిష్కరించుకునే సామర్థ్యాన్ని కోల్పోతారు. వ్యవస్థనుంచి పరాయి అయిపోతారు. వారు భౌతికంగా కొత్త వ్యవస్థలో ఉంటూ ఉండవచ్చు గాని వారు ఆ కొత్త వ్యవస్థలో భాగం కారు. వారు ప్రభుత్వం నుంచి ఇంకా ఇంకా ఎక్కువ తాయిలాలు వస్తాయని ఆశిస్తారు, రావాలని కోరుతారు. స్వీయ అస్తిత్వ ఆలోచనా ఆచరణా స్థలంలో కొరత అనే భావన దాదాపుగా కొరవడినందువల్ల, వీరు తాయిలాల కొరత అనే భావనతో ఉచితంగా తమకు అందేవాటిని ఇంకా ఇంకా ఎక్కువగా సంపాదించాలని ఆశపడతారు. అది అవినీతికి భావజాల పునాదిని సంతరించి పెడుతుంది. ఇంకా ఇంకా ఎక్కువ తాయిలాలు కావాలనే వారి కోరిక రాజ్యం తన ఆర్థికవనరులను ఇంకా ఎక్కువగా వెచ్చించడానికి దారితీస్తుంది. ఈ కోరికల ఆటంకాలను తొలగించడం ద్వారా తాను కోరుకున్న అభివృద్ధి ప్రక్రియకు అవసరమైన పెట్టుబడుల ప్రవాహం సాఫీగా సాగిపోవాలని రాజ్యం కోరుకుంటుంది. నిర్వాసిత ప్రజలు తమకు వీలయినంత ఎక్కువ కావాలని కోరడం, సాధించడానికి ప్రయత్నించడం వల్ల రాజ్యం మీద భరించరాని భారం పడుతుంది.

### ముగింపు

నిర్వాసితులు, అంచులలోకి నెట్టబడినవారి జనాభా ఉండడం, అంతకంతకూ పెరిగిపోవడం, వారు ఆధునిక వ్యవస్థలోకి సంలీనం కాకపోవడం సమాజం మీద గణనీయమైన ప్రభావం వేస్తాయి. ఈ స్థితి సమాజపు పురోగమనానికి, అంటే సాంప్రదాయిక వ్యవస్థ ఆధునిక వ్యవస్థగా అభివృద్ధి చెందడానికి అవరోధాలను కలగజేస్తుంది.

ఆర్థికవ్యవస్థలో 'అభివృద్ధి పథకాల ద్వారా అభివృది' అనే మార్గం భారత ఆర్థిక వ్యవస్థను ప్రత్యేకంగా గుర్తించదగిన, సహజీవనం చేస్తున్నమూడు విభిన్న ఉపవ్యవస్థల సమాహారంగా మార్చివేసింది. ఈ క్రమంలో అవశేషంగా మిగిలిపోవలసిన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అందుకు బదులుగా ప్రస్తుతం రెండు విభిన్నమైన, స్వతంత్రమైన, సజీవమైన ఆర్థిక వ్యవస్థలుగా కనబడుతోంది. ఈ పరిస్థితిలో ఒకే ఒక్క రాజ్యాధికారం గాని, పరివర్తనకు ఏకైక దిశగాని, ఒకేఒక్క పరివర్తనా విధానం గాని ఉండే అవకాశం లేకపోవచ్చు. అలాగే, మూడు ఉపవ్యవస్థల మధ్య ఏక ముఖ సంబంధాలు ఉండడం వల్ల అంతరాల దొంతర ఏర్పడింది. ఆ అంతరాల దొంతరలో పై స్థానాన్ని పెట్టుబడి కొరత వ్యవస్థ ఆక్రమించి ఉంది. అదే విశాల ఆర్థిక వ్యవస్థమీద ప్రాబల్యం వహిస్తోంది. అది ఇతర వ్యవస్థలతో దోపిడీ, పీడన సంబంధాలను నెరపుతోంది.

ఈ మూడు ఉపవ్యవస్థలు మూడు భిన్నమైన స్వీయ అస్తిత్వ ఆలోచనా ఆచరణా స్థలాలను సృష్టిస్తాయి. ఆ స్థలాలలో ఉన్న వ్యక్తులు మూడు భిన్నమైన చైతన్య స్థాయిలను కలిగి ఉంటారు. మూడు భిన్నమైన ఉప ఆర్థిక వ్యవస్థల సమకాలిక ఉనికి, అవి విభిన్న దిశలలో అమలుచేసే బహుళ ఒత్తిళ్లు, అదేసమయంలో ఏకముఖ సంబంధాలు ఉండడం వల్ల మొత్తంగా వ్యవస్థ సమతాస్థితిని కోల్పోతుంది. ఇటువంటి బహుస్వభావ ఆర్థిక వ్యవస్థలోకి మరింత పెట్టుబడి మదుపు ప్రవేశిస్తే ఉప ఆర్థిక వ్యవస్థల మధ్య విభజన పెరగడం, అస్థిరతను సృష్టించడం మాత్రమే జరుగుతాయి. ఈ అభివృద్ధి పథకాల పట్ల నిర్వాసిత ప్రజల స్పందన పూర్తి వ్యతిరేకతగానో, ఎక్కువ ప్రయోజనాల కొరకు బేరంగానో ఉంటుంది. దీని ప్రభావం ఎంత బలంగా ఉంటుందంటే అభివృద్ధి పథకాల అంచనావ్యయం మధ్యదారిలో పెరిగిపోతుంది, అనిశ్చితి పెరుగుతుంది.

ఇక రాజ్యం పనితీరు రంగంలో, ప్రభుత్వాలు పెట్టుబడి మదుపును ఆకర్షించే ప్రయత్నంలో వర్ధమాన ఆర్థిక వ్యవస్థలోకి పెట్టుబడుల సాఫీ ప్రవాహం కొరకు మంచి మౌలిక సాధన సంపత్తిని కల్పించవలసి ఉంటుంది. అలాగే రాజ్యమే తగిన నష్టపరిహారం ఇవ్వవలసి ఉంటుంది. పునఃస్థిరీకరణ, పునరావాస సహాయం అందజేయవలసి ఉంటుంది. ఇదంతా డబ్బు రూపంలో ఇవ్వడం మాత్రమే కాదు. మార్కెట్ ధరతో సంబంధం లేకుండా భూమి విలువ పెంచాలని, రెండు మూడు రెట్లు ఎక్కువ నష్టపరిహారాన్ని ఇవ్వాలని కోరే నిర్వాసితులను సంతృప్తి పరచడానికి ప్రభుత్వం ఇంకా ఇంకా ఎక్కువ ఖర్చు పెట్టవలసి ఉంటుంది. అలాగే ఎప్పటికప్పుడు పెరిగిపోతున్న నిర్వాసిత జనాభా కోసం సబ్సిడీలు, సంక్షేమ పథకాల మీద ప్రభుత్వం ఎక్కువ ఖర్చు పెట్టవలసి ఉంటుంది. ఇదంతా ఎటువంటి ఫలితం లేని ఆర్థిక అనుత్పాదక వ్యయంగా మారిపోతుంది. ప్రవహిస్తున్న నదిలోకి నాణాలు విసిరేసినట్టుగా అది ఎందుకూ పనికి రాకుండా పోతుంది. అంతేకాదు, 'సమ్మిళిత అభివృద్ధి పథకాలు' అనే పేరుతో ప్రభుత్వం ప్రచారం చేస్తున్న పథకాలేవీ ఈ

అంచులలో ఉన్న ప్రజానీకాన్ని వ్యవస్థలో సమ్మిళితం చేయలేక పోతున్నాయి. దానికి తోడుగా, దేశ వ్యాప్తంగా ప్రభుత్వం అమలుచేస్తున్న అభివృద్ధి పథకాలకు వ్యతిరేకంగా సాగుతున్న రాజకీయ ఉద్యమాలను అణచి వేయడానికి రాజ్యం అనేక రకాల అదనపు ఖర్చు కూడ భరించవలసి వస్తోంది.

పెట్టుబడి మదుపు పెరిగే తొలిదశలో అది ఆర్థిక వ్యవస్థ మొత్తంగా పెరుగుదలకు దారి తీసి ఉండవచ్చును. కాని కాలక్రమంలో ఈ వృద్ధి తగ్గుముఖం పట్టింది. చివరికి దాని ఫలితంగా ఎటువంటి పరివర్తనా రాలేదు. ప్రస్తుతం రాజ్యం ఆర్థిక వ్యవస్థలోకి ఇంకా పెట్టుబడి మదుపును ఆకర్షించాలని ఆశిస్తూ మరోసారి సంస్కరణలకు పూనుకుంటోంది. చిల్లర వర్తకం, విమానయానం, బీమా, తదితర రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని ఆహ్వానించడానికి ప్రయత్నిస్తోంది. అదే సమయంలో వేలాది కోట్ల రూపాయల ఖర్చుతో సాంఘిక సంక్షేమ వ్యయాన్ని పెంచడానికి ప్రతిపాదిస్తోంది. అలాగే కంపెనీలు తమకు అప్పగించిన భూమి మీద ఎటువంటి కార్యక్రమాలు చేపట్టడానికి వీలులేని విధంగా ఆటంకాలు ఎదుర్కొంటున్నప్పటికీ ఆ భూమిని వెనక్కి ఇవ్వకుండా తమ అధీనంలోనే ఉంచుకోవడం మరొక అంశం. అలాగే సమాజంలో పెరిగిపోతున్న మరొక అంశం ఏమంటే ఇప్పటికీ ప్రజలు తమ దగ్గర డబ్బును బ్యాంకుల లాంటి సంస్థలలో మదుపు పెట్టకుండా, భూమి మీద పెట్టడానికే అత్యంత ప్రాధాన్యత ఇస్తున్నారు. రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు, పాలకులు, సంపన్నులు వందలాది ఎకరాల భూములు కొనుగోలు చేస్తున్నారు.

మారుతున్న ఆర్థిక నేపథ్యపు ఈ పరిస్థితిలో ఉన్న వాతావరణాన్ని చెప్పాలంటే

- పారిశ్రామికవేత్తలు, గనుల కంపెనీలు తమకు అందిన భూమిని అంటిపెట్టుకుని ఉంటున్నారు.
- నిరుపేద ప్రజలు భూమి కోరుకుంటున్నారు.
- గ్రామీణ ప్రాంతాల భూయజమానులు తమ భూమి వదలడానికి సిద్ధంగా లేరు.
- రియల్ ఎస్టేట్ వంటి రూపాలలో భూమి మీద కొత్త పెట్టుబడి మదుపు వస్తోంది.

ఇప్పటికీ మిగులును సృష్టించేది భూమేననే, పెట్టుబడి కాదనే భావన ఈ పరిణామాలతో బలోపేతం అవుతోంది.

ఇక నిర్వాసితులైన ప్రజల గురించి చూస్తే, ప్రస్తుతం కొనసాగుతున్న అభివృద్ధి ప్రక్రియ వారి మీద వేస్తున్న ప్రభావం ఆసక్తికరమైనది. ఈ ప్రక్రియ వల్ల నానాటికీ ఎక్కువమంది ప్రజలు తమ సాంప్రదాయిక వ్యవస్థలలోనూ ఉండలేకపోయారు. ఆధునిక వ్యవస్థలోనూ సంలీనం కాలేకపోయారు. వారు తమంత తాముగా వ్యవహరించి, తమ జీవనోపాధి సంపాదించుకోగలిగిన ఆర్థిక వ్యవస్థలేవీ వారికి లేకుండా పోయాయి. అందువల్ల వారు సబ్సిడీలు, సంక్షేమ చర్యలు, సమ్మిళిత అభివృద్ధి కార్యక్రమాలు వంటి రూపాలలో ప్రభుత్వం ఇచ్చే తాయిలాల మీద ఆధారపడవలసిన స్థితికి నెట్టబడుతున్నారు. అంటే వారు 'తాయిలాల కొరత' అనే భావనతో వ్యవహరించడానికి నెట్టబడి, తాము పొందే ఉచిత వస్తువులను పెంచుకోవడమెలా అని ప్రయత్నిస్తున్నారు. ఇది అవినీతికి భావజాల పునాదిని కల్పిస్తోంది.

సరైన నాయకత్వం, వ్యవస్థానిర్మాణాలలో మార్పు సహకరిస్తే నిర్వాసిత ప్రజలలోని ఒక చిన్న భాగం వారికి దొరికిన కొత్త స్థలంలో పునఃస్థిరీకరణ, పునరావాసం పొందడం మాత్రమే కాదు, కొత్త వ్యవస్థలో సంలీనమైపోతున్నారు. కాని నిర్వాసిత ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రభుత్వం ఇచ్చే తాయిలాల మీద మాత్రమే ఆధారపడి, పరాన్నభుక్కు జీవితం గడుపుతున్నారు. రాజ్యం వారి సమస్యలు పరిష్కరించే రక్షకురాలిగా కనబడుతోంది. కొన్నిసార్లు ఇలా ప్రభుత్వం మీద నిరంతర ఆశ్రితత్వం వల్ల, తమ కార్యకలాపాలతో తామే మనుగడ సాగించగలమనే ఆశ కొరవడడం వల్ల, వారు సంఘవ్యతిరేక శక్తులుగా మారి, అసాంఘిక కార్యకలాపాలకు దిగుతున్నారు. మరికొందరు భవిష్యత్తు మీద ఏ ఆశా లేని పరాశ్రిత మనుగడతో విరక్తి చెంది, రాజ్యాన్ని, పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గాన్నీ వ్యతిరేకించే మౌలిక ఉద్యమాలలో భాగమవుతున్నారు.

పెట్టుబడిదారీ అభివృద్ధి పథానికి ఎదురవుతున్న ఈ ఆటంకాలను తొలగించే ప్రయత్నంలో ఈ నిర్వాసితులను శాంతింపజేయడానికి రాజ్యం వారికి నానాటికీ ఎక్కువ తాయిలాల ఆశ చూపవచ్చు. కొత్త పథకాలను ప్రకటించవచ్చు. వారు తమ సొంత చొరవను ప్రదర్శించకుండా పరాన్నభుక్కు జీవితమే కొనసాగించేటట్టు వారిని నెట్టవచ్చు. అందువల్ల వారు క్రమంగా మనిషి సహజస్వభావాలైన ఆలోచన, సృజనాత్మక ఆచరణల నుంచి దూరమవుతారు. ప్రభుత్వం ఇచ్చే తాయిలాలు ఎలా ఉన్నప్పటికీ, ఈ నిర్వాసిత ప్రజలు తమ సహజ మానవ స్వభావాన్ని తిరిగి సంపాదించుకునేందుకు, తమదని చెప్పుకునే తమ మనుగడకు చాలినంత చిన్న మడిచెక్క కావాలని కోరుతారు. ఈ అంశానికి ఉదాహరణ ఇటీవల జరిగిన జన సత్యాగ్రహం. దేశంలోని విభిన్న ప్రాంతాలకు చెందిన లక్ష మంది రైతులు గ్వాలియర్ నుంచి ఢిల్లీ దాకా ఊరేగింపుగా వెళ్లి తమదని చెప్పుకోగలిగే అతి చిన్న మడిచెక్క (పది సెంట్లు) కావాలని ఆందోళన జరిపారు.

సారాంశంగా చెప్పాలంటే, భారతదేశంలో అభివృద్ధి కోసం ఎంచుకున్న పెట్టుబడిదారీ మార్గం అశేష ప్రజానీకాన్ని తమ సాంప్రదాయిక ఆర్థికవ్యవస్థ నుంచి నిర్వాసితులను చేస్తోంది. వారు ఆధునిక ఆర్థిక వ్యవస్థలో కూడ సమ్మిళితం కావడం లేదు. ఇలా అంచులోకి నెట్టబడుతున్న ప్రజా సమూహం విస్తరిస్తున్న కొద్దీ సమాజం మీద దాని ప్రభావం పెరుగుతుంది. ఈ సమూహం లంగరుగా పనిచేసి సమాజ గమనం మీద పరిమితులు విధిస్తుంది. ఆర్థిక వ్యవస్థలోకి పెట్టుబడి మదుపు ఎంత ఎక్కువగా ప్రవేశిస్తే ఈ లంగరు బరువు అంతగా పెరుగుతుంది. ఈ లంగరు స్వభావమేమంటే ఇది సమాజగమనం (అభివృద్ధి) పాక్షికంగా, పరిమితంగా సాగేందుకు మాత్రమే అనుమతిస్తుంది. అభివృద్ధిని కొత్తగా, విభిన్నంగా పునర్నిర్మించి, పునరాలోచించి, మిగులు మనుషులను కొత్త వ్యవస్థలోకి పునస్సమ్మేళనం చేసే క్రమాన్ని మొదలుపెట్టకుండా, నిర్వాసితులకు ప్రధాన పాత్ర ఇవ్వకుండా, నిర్వాసితత్వం, అభివృద్ధి క్రమాలను ఐక్యం చేయకుండా సమాజ పరివర్తన వాస్తవరూపం ధరించదు.

*(నవంబర్ 11, 2012న హైదరాబాద్‌లో జరిగిన ఆర్.ఎస్. రావు స్మారక సదస్సులో సమర్పించిన పత్రం)*

*(రచయిత సామాజిక శాస్త్రవేత్త)* వీ

# వ్యవసాయ పరివర్తనలో వర్గ సంబంధాలు

*భారత వ్యవసాయరంగంలో వస్తున్న మార్పులను విశ్లేషించడానికి అవసరమైన సైద్ధాంతిక చట్రాన్ని చర్చిస్తూ, ఆ మార్పులు పెట్టుబడిదారీ పరివర్తనగా అభివర్ణించడానికి వీలులేనివని వాదిస్తున్నారు* **కోబడ్ గాంధీ**

వ్యవసాయం రంగంలో అర్ధ భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలున్నాయా, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలున్నాయా అంచనా వేయడానికి సైద్ధాంతిక పునాదిని అర్థం చేసుకోవలసి ఉంది. మనం చాల తరచుగా దృగ్గోచరాంశాలను అన్నివైపుల నుంచి చూసే దృక్పథంతో కాక కొన్ని అంశాలను మాత్రం చూసి నిర్ధారణలకు వస్తుంటాం. అందువల్ల తప్పుడు నిర్ధారణలకు రావడం జరుగుతుంది. ఈ అంశం మీద కాట్ స్కీ రచనలను మరింత అభివృద్ధి చేసిన లెనిన్ తన డెవలప్ మెంట్ ఆఫ్ కాపిటలిజం ఇన్ రష్యా గ్రంథంలో ఈ పరివర్తనా ప్రక్రియను సమగ్రంగా ఎలా అర్థం చేసుకోవాలో వివరించారు. ఆ తర్వాత వేరువేరు సమయాల్లో రాసిన వేరు వేరు 'వ్యవసాయ కార్యక్రమాల'లో తన ఆలోచనలను లెనిన్ తానే మరింత అభివృద్ధి చేశారు. ఆ రచనలన్నీ ఇవాళ భారతదేశం లో ఉన్న పరిస్థితి గురించి మన అధ్యయనానికి సైద్ధాంతిక పునాదిగా ఉపయోగపడతాయి. పెట్టుబడిదారీ విధానం గురించి మార్క్స్ చేసిన మౌలిక సూత్రీకరణలను క్లుప్తంగా పరిచయం చేసి, ఆ తర్వాత లెనిన్ సూత్రీకరణల సారాంశాన్ని వివరించడానికి ఇక్కడ ప్రయత్నిస్తున్నాం. దానికన్న ముందు సామాజిక పరిశోధన ఏ దిశలో సాగాలో మావో ఇచ్చిన సూచన గురించి చెప్పుకోవాలి: 'సామాజిక, ఆర్థిక పరిశోధనా లక్ష్యం వర్గ శక్తుల బలాబలాల గురించి సరైన అంచనాకు రావడం, సరైన పోరాట వ్యూహాన్ని రూపొందించుకోవడం' అని మావో అన్నారు.

'అన్ని సామాజిక వర్గాలూ మన పరిశోధనల లక్ష్యం కావాలిగాని సామాజిక దృగ్గోచరాంశాలలోని ఏదో ఒక ముక్క కాదు. ఇటీవలి కాలంలో ఎర్రసైన్యపు నాలుగో సైనిక విభాగంలోని కామ్రేడ్స్ పరిశోధనా కృషి మీద శ్రద్ధ పెడుతున్నారు. కాని వారు ఉపయోగిస్తున్న పద్ధతి తప్పుగా ఉంది. వారి పరిశోధనాఫలితాలు వెచ్చాలకొట్టు ఖాతా లాగనో, పల్లెటూరి బైతు పట్నంలో వినే విచిత్ర కథల లాగనో, లేదా కొండ మీదికి ఎక్కి జనం నిండిన నగరాన్ని సుదూరం నుంచి చూసినట్టో ఉన్నాయి. ఇటువంటి పరిశోధనతో ఏమీ ఉపయోగం లేదు. అది మన ప్రధాన లక్ష్యాన్ని నెరవేర్చదు. విభిన్న సామాజిక వర్గాలకు సంబంధించిన రాజకీయ ఆర్థిక పరిస్థితిని అవగాహన చేసుకోవడమే మన ప్రధాన లక్ష్యం. ప్రతి వర్గపు ప్రస్తుత స్థితిని, దాని అభివృద్ధి క్రమపు ఒడిదుడుకులను మన పరిశోధనా ఫలితం మనకు రూపుకట్టాలి. ఉదాహరణకు రైతాంగం కూర్పు ఎలా ఉందో మనం పరిశోధిస్తున్నప్పుడు మనకు కౌలుదారీ సంబంధాల వల్ల విభజనకు గురయిన భూయజమానులైన రైతుల సంఖ్య, సగం యజమానులైన రైతుల సంఖ్య, కౌలుకు చేస్తున్న రైతుల సంఖ్య తెలియడం మాత్రమే కాదు, వర్గం వల్ల, లేదా స్థాయి వల్ల విభజించబడే ధనికరైతుల సంఖ్య, మధ్యతరగతి రైతుల సంఖ్య, పేద రైతుల సంఖ్య కూడ తప్పనిసరిగా తెలియాలి. వ్యాపారుల కూర్పు గురించి పరిశోధించేటప్పుడు మనకు ధాన్యం, వస్త్రాలు, ఔషధ దినుసులు, వగైరా ప్రతి వ్యాపారంలోనూ ఉన్న వ్యాపారుల సంఖ్య మాత్రమే కాదు, మరింత ప్రత్యేకంగా చిన్న వ్యాపారులు, మధ్యతరగతి వ్యాపారులు, పెద్ద వ్యాపారుల సంఖ్య తెలియాలి. ప్రతి వ్యాపారపు వాస్తవ స్థితి ఏమిటో పరిశోధించడం మాత్రమే కాదు, ఆ వ్యాపారం లోపల వర్గ సంబంధాలు ఎలా ఉన్నాయో పరిశోధించాలి. వేరువేరు వ్యాపారాల మధ్య సంబంధం ఎలా ఉన్నదని మాత్రమే కాదు, వేరువేరు వర్గాల మధ్య సంబంధాలు ఎలా ఉన్నాయో పరిశోధించాలి. మన ప్రధాన పరిశోధనాపద్ధతి విభిన్న సామాజిక వర్గాలను నిశితంగా అధ్యయనం చేయగలగాలి. ఆ వర్గాల మధ్య అంతస్సంబంధాలను అర్థం చేసుకొని, వర్గశక్తుల బలాబలాల గురించి సరైన అంచనాకు రావడమే దాని అంతిమ లక్ష్యం. తద్వారా విప్లవ పోరాటంలో ప్రధాన శక్తిగా ఉండే వర్గాలేవో, మిత్రులుగా గెలుచుకోవలసిన వర్గాలేవో, కూలదోయవలసిన వర్గాలేవో నిర్వచించుకుని, సరైన పోరాట ఎత్తుగడలను రూపొందించుకోవడమే మన ఏకైక లక్ష్యం.

మన పరిశోధనలో మనం అన్ని వర్గాల లేదా శ్రేణుల వాస్తవస్థితి ఏమిటో తెలుసుకోవడం మీద దృష్టిపెట్టాలి. మనం ప్రస్తుతం పనిచేస్తున్న ప్రాంతాలలో పారిశ్రామిక కార్మిక వర్గం, పారిశ్రామిక బూర్జువా వర్గం ఉనికిలో లేవు గాని మిగిలిన అన్ని వర్గాలూ మనకు నిరంతరం తారసపడుతూనే ఉంటాయి. మన పోరాట ఎత్తుగడలు అంటే ఈ అన్నివర్గాల, శ్రేణుల పట్ల మన ఎత్తుగడలే' అని కూడ మావో అన్నారు. (పుస్తకపూజను వ్యతిరేకించండి, మే 1930)

మొట్టమొదట అర్ధ భూస్వామ్యం అంటే ఏమిటో అర్థం చేసుకోవలసి ఉంది. అర్ధ భూస్వామ్యం అంటే భూస్వామ్య వ్యవస్థ గర్భంలో వేరువేరు స్థాయిలలో పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందినప్పటికీ, అవి ఇంకా పూర్తి స్థాయి పెట్టుబడిదారీ సంబంధాలుగా అభివృద్ధి చెందలేదని అర్థం. పరిమాణాత్మక మార్పులు అంతిమంగా ఒక గెంతు తీసుకుని గుణాత్మక మార్పులుగా పర్యవసిస్తాయని గతితర్కం చెపుతుంది. అటువంటి గెంతు జరగనంతవరకూ ఏ దృగ్గోచరాంశంలోనూ, వస్తువులోనూ మౌలికమైన మార్పులు జరగలేదని చెప్పవచ్చు. అందువల్ల గత కొన్ని దశాబ్దాలలో పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో కొంత వృద్ధి కనబడుతున్నప్పటికీ, అది పునాది ఉత్పత్తి సంబంధాలలో, కనీసం

ఏదైనా ప్రత్యేక ప్రాంతంలోనైనా, మార్పు తేగల గెంతుకు దారి తీసిందా అని అంచనా వేయవలసిన అవసరం ఉంది. పెట్టుబడిదారీ సంబంధాలను పైనుంచి ప్రవేశపెట్టే 'జంకర్ మార్గం' వక్రీకరించబడిన పెట్టుబడిదారీ అభివృద్ధికి దారితీస్తుందని లెనిన్ విశ్లేషించాడు. కాని, అలా వక్రీకరించబడిన పెట్టుబడిదారీ అభివృద్ధిని అంచనా వేసేటప్పుడు కూడ, అది గుణాత్మక మార్పులకు దారితీసిందా లేదా పరిశీలించవలసి ఉంటుంది. అది అటువంటి గుణాత్మక మార్పులకు దారితీయనట్టయితే, అది మౌలికంగా అర్ధభూస్వామ్యంగానే ఉన్నదన్నమాట. అర్ధభూస్వామ్యం లోపలనే వక్రీకృత పెట్టుబడిదారీ వృద్ధి జరిగిందన్నమాట. గుణాత్మక మార్పులు జరిగినట్టయితే, అది మౌలికంగా పెట్టుబడిదారీగా మారిపోయి, కొన్ని భూస్వామ్య అవశేషాలు మిగిలాయన్నమాట. లెనిన్ చెప్పిన మరొక మార్గపు పెట్టుబడిదారీ అభివృద్ధిలో కింది నుంచి వ్యవసాయరంగంలో మార్పులు జరుగుతాయి. పాత ఉత్పత్తి సంబంధాలు ధ్వంసమయి, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతుంది.

ఈ సమస్య మీద లెనిన్ అవగాహనను ఇంకా వివరంగా పరిశీలించే ముందు, ఈ సమస్యను అర్థం చేసుకోవడానికి ఉపకరించే మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్ర సూత్రీకరణలు కొన్నిటిని క్లుప్తంగా పునశ్చరణ చేసుకుందాం.

సరుకుల ఉత్పత్తి గురించి కొన్ని మార్క్సిస్టు సూత్రీకరణలు సరుకుల ఉత్పత్తికీ, పెట్టుబడిదారీ విధానానికీ తేడా లేదన్నట్టుగా మొత్తంగా పొరపాటు పడకుండా ఉండడం చాల ముఖ్యం. పెట్టుబడిదారీ వ్యవస్థలో మాత్రమే అన్నీ లేదా అతి ఎక్కువ ఉత్పత్తులు సరుకుల రూపం ధరిస్తాయనే మాట నిజమే. కాని దాన్ని తిరగేసి చూస్తే నిజం కాదు. సరుకుల ఉత్పత్తి ఉన్నంత మాత్రాన అది తప్పనిసరిగా పెట్టుబడిదారీ వ్యవస్థ కావాలని లేదు. పెద్దఎత్తున సరుకుల ఉత్పత్తి ఉండడం పెట్టుబడిదారీ వ్యవస్థ తలెత్తడానికి ఒక ముందస్తు షరతు అవుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ రాకముందు ఉండేదాన్ని సాధారణ సరుకుల ఉత్పత్తి అంటారు.

సాధారణ సరుకుల ఉత్పత్తి కింద ప్రతి ఉత్పత్తిదారుకూ సొంత ఉత్పత్తి సాధనాలుండి, వాటి మీదనే శ్రమ చేస్తారు. పెట్టుబడిదారీ విధానం కింద ఉత్పత్తి సాధనాల యాజమాన్యం ఒక వర్గం వ్యక్తుల చేతుల్లో కేంద్రీకృతమై ఉంటుంది. వాటి మీద శ్రమ మాత్రం మరొక వర్గం వ్యక్తులు చేస్తారు. అంతేకాదు, ఉత్పత్తి సాధనాలు, శ్రమ శక్తి రెండూ సరుకులుగా మారిపోతాయి. అంటే రెండూ కూడ వినిమయ వస్తువులుగా, మారకపు విలువల వాహకాలుగా ఉంటాయి. తత్ఫలితంగా యజమానుల మధ్య సంబంధాలు మాత్రమే కాక యజమానులకూ, యజమానులు కాని వారికీ మధ్య సంబంధాలు కూడ మారకపు సంబంధాల స్వభావాన్ని సంతరించుకుంటాయి. వీటిలో మొదటిది సాధారణ సరుకుల ఉత్పత్తి లక్షణం కాగా, రెండవది పెట్టుబడిదారీ విధానానికి మాత్రమే ప్రత్యేకమైన లక్షణం.

సాధారణ సరుకుల ఉత్పత్తిలో ఉత్పత్తిదారులు తమ అవసరాలను తీర్చుకునే ఇతర ఉత్పత్తులను కొనుక్కునేందుకు తమ ఉత్పత్తిని అమ్ముకుంటారు. అంటే ఇక్కడ ఉత్పత్తిదారులు సరుకులతో ప్రారంభించి, వాటిని డబ్బుగా మార్చుకుని, ఆ డబ్బును మళ్లీ సరుకులుగా మార్చుకుంటారు. ఇక్కడ మొత్తం లావాదేవీల గొలుసులో మొదటా చివరా సరుకులే ఉంటాయి. కాకపోతే ఈ గొలుసు ఎందుకు అవసరం అవుతుందంటే మొదట వదులుకున్న సరుకుల కన్న కొత్తగా సంపాదించుకున్న సరుకులు గుణాత్మకంగా భిన్నమైనవి అయి ఉంటాయి. ఈ వలయాకారపు గొలుసును మార్క్స్ సరుకు - డబ్బు - సరుకు (స-డ-స లేదా సి-ఎం-సి అని అభివర్ణించాడు.

మరొకవంక పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడిదారులు చేతిలో డబ్బులతో పెట్టుబడిదారు హోదాలో మార్కెట్ లో ప్రవేశిస్తారు. ఆ డబ్బుతో శ్రమశక్తి, ఉత్పత్తిసాధనాలు అనే సరుకులను కొంటారు. వాటిని ఉపయోగించి ఉత్పత్తి ప్రక్రియను పూర్తి చేస్తారు. ఆ సరుకులతో మార్కెట్ లో ప్రవేశించి వాటిని అమ్మి డబ్బు సంపాదిస్తారు. ఈ వలయాకారపు గొలుసు డబ్బు-సరుకు-డబ్బు (డ-స-డ లేదా ఎం-సి-ఎం) గా ఉంటుంది. ఇక్కడ వలయానికి మొదటా చివరా ఉన్నది డబ్బు.

మరి మొదటి గొలుసులో ఉన్నట్టుగా మొదటిదానికీ చివరిదానికీ గుణాత్మకమైన తేడా లేకపోతే ఈ వలయాకార గొలుసు ఉనికికి అర్థం ఏమిటనే ప్రశ్న వస్తుంది. ఎందుకంటే డబ్బు గుణాత్మకంగా ఎప్పుడైనా ఒకటే. అది దానికదిగా ఏ మానవ అవసరాన్నీ తీర్చదు. మరి మొదటి డబ్బుకూ చివరి డబ్బుకూ తేడా లేనట్టయితే అసలు ఈ వలయాకారపు గొలుసు ప్రక్రియ అర్థరహితమై పోతుంది. దీనికి ఎంతో కొంత అర్థం ఉండాలంటే డబ్బు గుణాత్మకంగా మారకపోయినా, పరిమాణాత్మకంగా మారవలసి వస్తుంది. అంటే పెట్టుబడిదారు దృష్టినుంచి చూసినప్పుడు ఈ గొలుసు డ-స-డ గా కాక, డ-స-డ' గా (ఎం-సి-ఎం గా కాక ఎం-సి-ఎం'గా) ఉండాలి. డ' (ఎం' - ఎం ప్రైమ్ అని పలకాలి) అంటే డ కన్న హెచ్చినది అని అర్థం.

ఈ రెండు పద్ధతులలో సాధారణ సరుకుల ఉత్పత్తి విధానానికి ప్రాతిపదిక 'కొనడం కోసం అమ్మడం' కాగా, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి ప్రాతిపదిక 'అమ్మడం కోసం కొనడం'గా ఉంటుంది. (పటం-1)

'కొనడం కోసం అమ్మడం' అనే సాధారణ సరుకుల చలామణీ పద్ధతిలో అవసరాలను తీర్చుకోవడం, సరుకుల ఉపయోగ విలువలను సాధించడం అనే లక్ష్యం కోసమే చలామణీ ఉంటుంది. ఇందుకు భిన్నంగా 'అమ్మడం కోసం కొనడం' అనే పెట్టుబడిదారీ పద్ధతిలో డబ్బు పెట్టుబడిగా చలామణీ కావడం దానికదే అంతిమంగా ఉంటుంది. ఆ వలయపు చలనం ఎంత ఎక్కువగా ఉంటే అంతగా ఆ పెట్టుబడి విలువ పెరిగిపోతుంది. ఈ రెండు పద్ధతులలో మొదటి పద్ధతి పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి విధానానికి సూచిక కాగా రెండో పద్ధతి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి సూచిక. చెప్పులు తయారు చేసేవాళ్లు (మోచీలు) తరతరాలుగా మార్కెట్ కోసమే (అమ్మడం కోసమే) చెప్పులు ఉత్పత్తి చేస్తున్నారు. ఐనా దాన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తి అనడానికి వీలులేదు. ఎందుకంటే ఆ మోచీ చేసే అమ్మకాలన్నీ తన సొంత అవసరాలు తీర్చే ఇతర సరుకులు కొనుక్కోవడానికి చేసేవే. ఇవాళ చిన్న, మధ్యతరగతి రైతులు తమ ఉత్పత్తులు అమ్మడం కూడ సరిగ్గా అలా సాగుతున్నదే.

పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ఉనికిలో ఉండాలంటే తప్పనిసరిగా అక్కడ పెట్టుబడిదారులు, కార్మికులు ఉండాలి.

పెట్టుబడిదారు అంటే తన డబ్బును మరింత పెట్టుబడిగా మార్చుకోవడం కోసం ఉత్పత్తిలో ఖర్చు పెట్టేవాడు. పెట్టుబడిదారుకు ఏకైక లక్ష్యం అదనపు విలువను పెంచుకోవడం ద్వారా తన పెట్టుబడి సంచయాన్ని (రాశిని) పెంచుకోవడమే. పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుడు అంటే తన శ్రమశక్తి తప్ప మరేమీ లేనివాడు. అతను ఉత్పత్తి సాధనాల యాజమాన్యంతో పూర్తిగా వేరయి ఉంటాడు. ఆవిధంగా శ్రమశక్తి మార్కెట్ లో కొనడానికీ అమ్మడానికీ వీలయిన ఇతర అన్ని సరుకుల లాగనే స్వేచ్ఛా శ్రమశక్తిగా ఉంటుంది. ఈ శ్రమశక్తిని పెట్టుబడిదారు దోపిడీ చేసినప్పుడు అదనపు విలువ తయారవుతుంది. తద్వారా నిరంతరాయంగా పెట్టుబడి సంచయం పెరుగుతుంది. ఇలా నిరంతరాయంగా పెట్టుబడి సంచయం జరగడం వల్లనే, పెరగడం వల్లనే పెట్టుబడిదారీ వ్యవస్థ చలనశీలంగా ఉంటుంది. అంతకు ముందరి వ్యవస్థలతో పోల్చినప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థ ఎక్కువ చలనశీలంగా కనబడడం ఇందువల్లనే.

భారతదేశం మొత్తంగాగాని, దేశంలోని ఏ ప్రాంతంలో గాని ఉత్పత్తి విధానాన్ని విశ్లేషిస్తున్నప్పుడు తప్పనిసరిగా గమనంలో ఉంచుకోవలసిన సూత్రీకరణలలో ఇవి కొన్ని. భూస్వామ్యం నుంచి పెట్టుబడిదారీ విధానానికి పరివర్తనను సూచిస్తున్న ఏ అర్ధభూస్వామ్య వ్యవస్థలోనైనా చాల ప్రాంతాలలో భూస్వామ్యం గాని, పెట్టుబడిదారీ విధానం గాని వాటి అసలుసిసలు రూపాలలో కనబడకపోవచ్చు. ఒకదానిలో ఒకటి కలిసిపోయిన విభిన్న ఉత్పత్తి సంబంధాల సంధి రూపాలు కనబడవచ్చు. దేశం మొత్తానికి గాని, ఒక ప్రత్యేక రాష్ట్రంలోగాని వాటిలో ఏది ప్రభావశీల, ప్రధాన ఉత్పత్తి విధానంగా ఉన్నదో నిర్ణయించవలసి ఉంటుంది.

లెనిన్ తన డెవలప్ మెంట్ ఆఫ్ కాపిటలిజం ఇన్ రష్యాలో వివరించిన కొన్ని సూత్రాలను ఇప్పుడు చూద్దాం.

### 1. తయారీ పరిశ్రమ పెరుగుదల

'తయారీ పరిశ్రమలో పెట్టుబడిదారీ విధానం పెరగడమే వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానాన్ని సృష్టించి, విస్తరించడానికి ప్రధాన శక్తిగా ఉంటుంది'అని లెనిన్ అన్నాడు. తయారీ పరిశ్రమలు పెరగకుండా, వ్యవసాయం నుంచి బైటికి తోయబడిన జనాభాను కొత్త పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో సంలీనం చేసుకోవడం జరగదు. అందువల్ల అసంఖ్యాక ప్రజానీకం అల్పోద్యోగాలలో, బొటాబొటి జీవితాలు గడుపుతూ ఉంటారు. పారిశ్రామిక రంగంతో పోలిస్తే వ్యవసాయ రంగంలో ఉత్పాదకత తక్కువ గనుక రైతాంగంలో కొత్తగా వస్తున్న వర్గవిభజన వల్ల బైటికి తోయబడుతున్న ప్రజానీకానికి వ్యవసాయ రంగం ఉపాధి కల్పించజాలదు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోనూ ఈ పరిణామాన్ని చూడవచ్చు. ఇలా ఇతర ఉపాధి అవకాశాలు కొరవడడం వల్ల భూమి మీద ఒత్తిడి పెరుగుతూ ఉంటుంది. అశేష ప్రజానీకం అర్ధ దారిద్ర్య స్థితిలో, చిల్లర మల్లర పనులు చేసి పొట్టపోషించుకుంటూ ఉంటారు. వారు మొత్తం మీద ఉనికిలో ఉన్న వెనుకబడిన ఉత్పత్తి సంబంధాలలోనే కొనసాగుతుంటారు.

### 2. వినియోగం పెరుగుదల

సరుకుల ఉత్పత్తి ఉనికిలో ఉన్నంతమాత్రాన మొత్తంగా పెట్టుబడిదారీ విధానం ప్రాబల్యంలో ఉన్నట్టు కాదు. 'పెట్టుబడిదారీ విధానం అంటే అత్యున్నత దశకు చేరిన సరుకుల ఉత్పత్తి. అక్కడ శ్రమశక్తి కూడ సరుకు అయిపోతుంది' అని లెనిన్ అన్నాడు. అందువల్ల, గ్రామీణ ప్రాంతాలలో 'వినియోగం','పంపిణీ' ఎంతగా పెరిగాయో అంచనా వేసేటప్పుడు, ఉత్పత్తి సంబంధాల మీద వాటి ప్రభావం ఏమిటో చూడడం చాల ముఖ్యం. సరుకుల వినియోగం పెరిగిపోయిందని అలవోకగా చూపే ఉదాహరణలు కొంతవరకు పెట్టుబడిదారీ సంబంధాలు పెరిగాయనడానికి సూచికలు కావచ్చుగాని మౌలిక పరివర్తన జరిగిందని రుజువు చేయడానికి తగిన కారణం కావు. లెనిన్ అన్నట్టుగా 'సామాజిక ఉత్పత్తిలోని వేరువేరు భాగాలు పునరుత్పత్తి పొందుతున్న ప్రక్రియను అర్థం చేసుకోకుండా 'వినియోగం' గురించి చర్చించడం కూడ సాధ్యం కాదు.... రాజకీయార్థిక శాస్త్రం వ్యవహరించేది కేవలం 'ఉత్పత్తి'తో కాదు, ఉత్పత్తిలో మనుషుల మధ్య ఏర్పడుతున్న సామాజిక సంబంధాలతో, మొత్తంగా సామాజిక ఉత్పత్తి వ్యవస్థతో. ఈ సామాజిక సంబంధాలను విశ్లేషించిన తర్వాతనే, ఉత్పత్తిలో ప్రతి వర్గమూ ఏ స్థానంలో ఉన్నదో, తత్ఫలితంగా జాతీయ వినియోగంలో ఆ వర్గం పొందుతున్న వాటా ఏమిటో నిర్ధారణ అవుతుంది.'

'వినియోగం','పంపిణీ' ల మీద మాత్రమే ఎక్కువ శ్రద్ధపెట్టి, ఉత్పత్తి సంబంధాలమీద వాటి ప్రభావమేమిటో అంచనా వేయడాన్ని విస్మరించే 'మార్క్సిస్టు' రాజకీయార్థిక శాస్త్రవేత్తలు చాల ఎక్కువగా ఈ మౌలిక అవగాహనను మరచిపోతున్నారు. ఒక ఉదాహరణ చెప్పాలంటే, ఇతర రంగాలలో ఉపాధి అవకాశాలు లేనందువల్ల, తరాలు గడుస్తున్న కొద్దీ ఉన్న కొద్దిపాటి మడిచెక్క మీదనే మరింత ఎక్కువమంది ఆధారపడవలసి వస్తున్నందువల్ల, తరం మారినకొద్దీ భూమి ఇంకా ఇంకా చిన్న చిన్న ముక్కలుగా చీలిపోతున్నందువల్ల భూమి మీద ఒత్తిడి పెరుగుతోంది. ఇక తమ మనుగడ కోసమైనా రైతు కుటుంబాలు ఉత్పాదకత పెంచుకునే దిశలో అధిక దిగుబడి వంగడాలవైపు, మార్కెట్ వైపు మళ్లుతున్నారు. ఇలా మార్కెట్ వైపు మళ్లినప్పటికీ వారు నివసిస్తున్నది కనీస మనుగడ స్థాయిలోనే, పాత ఉత్పత్తి సంబంధాల చట్రంలోనే. ఇవాళ్టి వ్యవసాయ సంక్షోభం ఈ పరిస్థితిని మరింత దిగజార్చింది. ఈ స్థితిని కేవలం 'వినియోగం','పంపిణీ' పెరుగుతున్నదనే లెక్కలతో అర్థం చేసుకోలేం.

### 3. సాధారణ సరుకుల ఉత్పత్తి

ఇంతకు ముందరి అంశానికి కొనసాగింపుగా మరొకటి చెప్పాలి. చేతివృత్తుల రూపంలో, చిన్న రైతు కమతాల రూపంలో, ఉత్పత్తి విస్తారంగా శకలీకరణ చెంది ఉన్న స్థితిలో సాధారణ సరుకుల ఉత్పత్తి దానికదిగా తప్పనిసరిగా పెట్టుబడిదారీ అభివృద్ధికి సూచిక కాదు. 'చిన్నతరహా భూ ఆస్తి ఉన్నదంటే జనాభాలో అత్యధిక సంఖ్యాకులు గ్రామాలలో ఉన్నారని అర్థం. సామాజిక శ్రమ కాకుండా, ఒంటరి శ్రమ ప్రాధాన్యత వహిస్తున్నదని అర్థం...' అని మార్క్స్ అన్నాడు. 'చిన్న మడిచెక్క భూమి మీద యాజమాన్యం ఉన్నదంటే దాని స్వభావం వల్లనే అది సామాజిక శ్రమ ఉత్పత్తి శక్తుల అభివృద్ధినీ, సామాజిక శ్రమ

రూపాలనూ, పెట్టుబడి సాంఘిక కేంద్రీకరణనూ, భారీస్థాయి పశుపోషణనూ, శాస్త్రవిజ్ఞానపు ప్రగతిశీల అన్వయాన్నీ అడ్డుకుంటుంది' అని కూడ మార్క్స్ అన్నాడు.

ఇతర ఉద్యోగ, ఉపాధి వనరుల కొరత వల్ల భూమి మీద ఒత్తిడి పెరుగుతూ ఉంది. తరం మారి కొత్త తరం వచ్చేసరికి, తమ చిన్నచిన్న మడిచెక్కల మీద ఆధారపడేవారి సంఖ్య పెరిగిపోయి, వారి అవసరాలకు తగినట్టుగా దిగుబడి పెంచుకోవడం కోసం ఎంతో మంది రైతులు అధిక దిగుబడి వంగడాలవైపు మళ్లుతున్నారు. ముంచుకొస్తున్న సామ్రాజ్యవాద విధానాల ఫలితంగా, వ్యవసాయ సంక్షోభంతో ఇవాళ అత్యధిక రైతాంగ కుటుంబాలు రుణభారంతో దివాళా ఎత్తాయి. ఈ వాస్తవాన్ని గుర్తించడంతో పాటు, ఈ రకమైన సరుకుల మారకం వల్ల ఎంత అదనపు విలువ తయారవుతున్నదో, అది ఎంతవరకు మౌలిక అవసరాలు తీరుస్తున్నదో నిర్ధారించడం అవసరం. సరుకుల మారకం పెరుగుదల పెట్టుబడి సంచయంతో సంబంధం లేకుండా జరుగుతున్నట్టయితే అది సాధారణ సరుకుల ఉత్పత్తికే దారితీస్తుంది గాని, పెట్టుబడిదారీ వ్యవస్థకు కాదు.

## 4. పెట్టుబడి సంచయం

వ్యవసాయంలో తయారవుతున్న అదనపు విలువ తిరిగి వ్యవసాయంలోనే ఎంతవరకు మదుపుగా పెట్టబడుతున్నదనేమీద, వ్యవసాయ రంగంలోకి వస్తున్న మదుపులో ఎంతభాగం ప్రభుత్వం నుంచీ, ప్రైవేటు రంగం నుంచీ వస్తున్నదనే దానిమీద ఆధారపడి వ్యవసాయంలో పెట్టుబడి సంచయం పరిమాణం ఉంటుంది.

నిజానికి పెట్టుబడిదారీ వృద్ధిని నిర్ణయించే కారకాలలో పెట్టుబడి సంచయం ఒకటి. ఎందుకంటే స్థిర పెట్టుబడి (ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి) అంతకంతకూ త్వరితగతిన పురోగమిస్తూ ఉండడమే పెట్టుబడిదారీ విధానపు మౌలిక నియమం. పెట్టుబడిదారీ వ్యవసాయం గనుక సాగుతున్నట్టయితే ధనికరైతాంగవర్గం తన అదనపు విలువను (మిగులును) నానాటికీ మెరుగైన సాంకేతిక పరిజ్ఞానం రూపంలో వ్యవసాయంలోనే తిరిగి మదుపు పెట్టాలి. తద్వారా ధనికరైతులు తమ వ్యవసాయక్షేత్రపు ఉత్పాదకతను పెంచుకుని, దాని నుంచి తాము రాబట్టే అదనపు విలువను పెంచుకోగలుగుతారు. అంటే, మనం వ్యవసాయ రంగంలో ఎంత మిగులు రూపొందుతున్నదో, అది ఏ పద్ధతిలో ఉపయోగంలోకి వస్తున్నదో పరిశోధించవలసి ఉంటుంది.

'హరిత విప్లవపు' మొదటి దశాబ్దాన్ని మినహాయిస్తే, వ్యవసాయ రంగ సంక్షోభం వల్లా, వ్యవసాయ ఉత్పత్తి కారకాల ధరల పెరుగుదలకూ, వ్యవసాయోత్పత్తుల ధరల తరుగుదలకూ మధ్య వ్యత్యాసం వల్లా వ్యవసాయ రంగపు మిగులు అంతా పీల్చివేయబడుతున్నది. ప్రపంచీకరణ దశలో, 1990లలో ఈ సంక్షోభం ఇంకా తీవ్రతరమై, ఈ మిగులు ఇంకా తగ్గిపోవడం మాత్రమే కాదు, వేలాది మంది రైతులను ఆత్మహత్యలవైపు నెట్టింది. లభ్యమవుతున్న గణాంకాల ప్రకారం వ్యవసాయ రంగంలో స్థూల పెట్టుబడి సమీకరణ 1980లలో 11 శాతం ఉన్నదల్లా 1990లలో 7.6 శాతానికి తగ్గింది.

స్థూల జాతీయాదాయంలో వ్యవసాయ రంగ వాటా, స్థూల పెట్టుబడి సమీకరణ (దేశం మొత్తానికీ)

| సంవత్సరం | స్థూల జాతీయాదాయంలో వ్యవసాయరంగ వాటా | స్థూల పెట్టుబడి సమీకరణ |
|---|---|---|
| 1971-72 | 44.50% | 16.30% |
| 1981-82 | 38.10% | 13.90% |
| 1991-92 | 27.80% | 10.00% |
| 1995-96 | 25.70% | 9.10% |
| 1998-99 | 24.70% | 5.50% |

**మూలం:** భారత ఆర్థిక సర్వే, భారత ప్రభుత్వం, న్యూ ఢిల్లీ (2000)

వ్యవసాయరంగంలో ఇలా తక్కువ మిగులు రూపొందడంతో పాటు, ఆ రూపొందిన మిగులు కూడ వ్యవసాయ రంగంలోకి తిరిగి వచ్చే మదుపుగా కాకుండా ప్రాథమికంగా ఇతర రంగాలకు తరలిపోతున్నది. మళ్లీ తలెత్తిన వడ్డీ వ్యాపారం వల్ల, అత్యంత లాభసాటిగా మారిన ఇతర వ్యాపారాల వల్ల వ్యవసాయ రంగ మిగులులో అత్యధిక భాగం వ్యవసాయంలోకి తిరిగి పెట్టుబడిగా రావడం లేదు, అటువంటి ఇతర రంగాలకు వెళ్తున్నది. నిజం చెప్పాలంటే, మన గ్రామీణ ప్రాంతాలలో అధికరేట్ల వడ్డీ వ్యాపారం అత్యంత లాభసాటి అయిన పెట్టుబడి అవకాశంగా ఉన్నంతకాలం పెట్టుబడిదారీ అభివృద్ధిని అది అడ్డుకుంటూనే ఉంటుంది. అయితే, 'హరిత విప్లవ' ఆవిర్భావంతో పరిస్థితుల్లో కొంత మార్పు వచ్చిన మాట నిజమే. కాని అందువల్ల రూపొందిన పెట్టుబడిదారీ వ్యవసాయం ఎంత పరిమిత పరిమాణంలో ఉన్నదో, మొత్తంగా వ్యవసాయ రంగంలో పెట్టుబడి మదుపు అల్ప స్థాయితో పోల్చి చూసినప్పుడు అర్థమవుతుంది.

ఇక ఆర్థిక వ్యవస్థలోని గ్రామీణ రంగంలో ప్రభుత్వ మదుపు స్థాయిని చూసినప్పుడు, అది స్థూల జాతీయాదాయంలో వాటాగా 1981లో 14 శాతం ఉన్నదల్లా, 2001 నాటికి 5 శాతానికి పడిపోయింది. స్థూల జాతీయాదాయంలో గ్రామీణాభివృద్ధి వ్యయం వాటా 1990లో 14.5 శాతం ఉన్నదల్లా 2003-04 నాటికి 5 శాతానికి పడిపోయింది.

## 5. స్వేచ్ఛాయుత వేతన శ్రమ

పెట్టుబడిదారీ వ్యవస్థ ఉనికిలో ఉండాలంటే తప్పనిసరిగా పెట్టుబడిదారులు, స్వేచ్ఛాయుత వేతన శ్రామికులు ఉండాలి. స్వేచ్ఛాయుత వేతన శ్రామికులు అంటే తమ శ్రమ శక్తి తప్ప మరే సొంత ఆస్తి లేని వారు. అలాగే ఉత్పత్తి సాధనాల యజమానులతో ఎటువంటి బంధనాలూ లేని వారు. పెట్టుబడిదారీ విధానంలో ఒక ముఖ్యమైన అంశమేమంటే అక్కడ వేతన శ్రామికులు ఉత్పత్తి సాధనాలతో పూర్తిగా వేరయిపోయి ఉంటారు. దాని అర్థం ఒక వేతన శ్రామికుడికి తన సొంతమని చెప్పుకోదగిన ఉత్పత్తి సాధనాలు ఏవీ ఉండవు. ఉదాహరణకు ఒక కార్మికుడు తన పనిస్థలానికి తన సొంత పనిముట్టు పట్టుకుని వెళుతున్నట్టయితే, ఏదో ఒక ఉత్పత్తి సాధనం ఉంది గనుక ఆ కార్మికుడిని పూర్తిగా స్వేచ్ఛాయుత వేతన శ్రామికుడు అనడానికి వీలు లేదు. అలాగే స్వేచ్ఛాయుత వేతన శ్రామికుడు అంటే అర్థం అతను ఏ రకంగానూ ఏ బంధనాలలోనూ లేనివాడన్నమాట. ఆ శ్రమ కుటుంబానికి అవసరమైన శ్రమ కాగూడదు. పనిగంటలు ఎంత

ఎక్కువగా ఉన్నాసరే, నిర్దిష్టంగా, నిర్ణీతంగా ఉండాలి. వేతనం క్రమబద్ధ ప్రాతిపదికన ఉండాలి. వేతనం డబ్బు రూపంలో ఉండాలి, వస్తు రూపంలో ఉండగూడదు. వగైరా, వగైరా నియమాలుంటాయి. కనుక మన సామాజిక అధ్యయనం ఇలా ఉత్పత్తిలో భాగమైన శ్రమ స్వభావాన్ని అర్థం చేసుకునే దిశలో ఉండాలి. ఈ అర్థాలలో వేతన శ్రమ గనుక పూర్తిగా స్వేచ్ఛగా ఉన్నట్టయితే అది పెట్టుబడిదారీ సంబంధం. అలా కాక అది వేరు వేరు ఛాయల ఆశ్రితత్వాన్ని సూచిస్తున్నట్టయితే, అలా మిగులును రాబట్టుకుంటున్నట్టయితే అది పెట్టుబడిదారీ పూర్వ, అర్ధ భూస్వామ్య పద్ధతికి సంబంధించిన ఏదో ఒక రూపం అన్నమాట.

రైతాంగంలో చాల మంది తమ ఉత్పత్తి సాధనాల నుంచి, భూమి నుంచి నిర్వాసితులు చేయబడినప్పటికీ, 'హరిత విప్లవం' తర్వాత వ్యవసాయ రంగంలో వేతన శ్రామికుల సంఖ్య పెరిగినప్పటికీ, ఈ శ్రామికులలో అత్యధిక సంఖ్యాకులు క్రమబద్ధమైన స్వేచ్ఛాయుత వేతన కార్మికులుగా ఉన్నారా లేదా అనేది చూడాలి. ప్రతి రంగంలోనూ గ్రామీణ కార్మికవర్గం, గ్రామీణ బూర్జువావర్గాల మధ్య స్పష్టమైన విభజన ఉన్నదా లేదా చూడాలి. భారతదేశంలో పారిశ్రామిక రంగంలో గణనీయమైన పెరుగుదల లేనందువల్ల, శ్రామికులు నిరంతరాయంగా నిర్వాసితులు అవుతుండడం, అంతకంతకూ శ్రమశక్తి సరుకుగా మారిపోతుండడం కనబడుతోంది. కాని దానితోపాటే రైతాంగం మరింత దారిద్ర్యంలోకి దిగజారడమూ కనబడుతోంది. కాని ఈ శ్రమశక్తి అమ్మకమంతా ఎక్కువగా సాధారణ సరుకు ఉత్పత్తి రూపమే తీసుకుంటున్నది గాని పెట్టుబడిదారీ ఉత్పత్తి రూపం తీసుకోవడం లేదు. ఉదాహరణకు, ఒక మధ్యతరగతి రైతు ఉన్నాడనుకొండి. ఆయన తన కుటుంబ శ్రమతో మాత్రమే వ్యవసాయం సాగించలేడు గనుక ముమ్మరమైన పనుల సమయంలో నలుగురు కూలీలను పనిలోకి తీసుకుంటాడు. అయినా, దిగుబడిలో అధికభాగాన్ని ఆయన తన కుటుంబ వినియోగం కోసమే ఖర్చుచేస్తున్నట్టయితే, ఆ వేతన కార్మికులనుంచి ఆయన రాబట్టే అదనపు విలువ ఏమీ లేనట్టే. వారి శ్రమ సాధారణ సరుకు ఉత్పత్తి రూపం మాత్రమే తీసుకుంటుంది. ఆయన పత్తి వంటి వాణిజ్య ఉత్పత్తి సాగించినప్పటికీ పరిస్థితి అదే. భారత గ్రామసీమలలో అమ్మకం అవుతున్న శ్రమశక్తిలో ఎంత భాగం ఈ రూపంలో ఉన్నదో పరిశీలించవలసి ఉంది. ఇటువంటి శ్రమశక్తి వల్ల సరుకుల ఉత్పత్తి విస్తరిస్తున్నట్టు కనిపించినప్పటికీ, స్థానిక మార్కెట్ పెరుగుతున్నప్పటికీ, వ్యవసాయ రంగంలో కొంత మార్పు ఉన్నప్పటికీ, ఈ పరిణామాలన్నీ సాధారణ సరుకు ఉత్పత్తి రూపంలోనే ఉంటాయి. చిన్నస్థాయి వ్యవసాయం పెరుగుతుంది. పెట్టుబడిదారీ విధానం గాని, గ్రామీణ బూర్జువావర్గం గాని పుట్టుకురావు. అలాగే, భారత వ్యవసాయంలో తలెత్తుతున్న వేతన శ్రామికులతో పాటే పొత్తు, పాలు, కుటుంబ సహకారం వంటి రూపాలలో శ్రమసేవలు ఎంతవరకు సహజీవనం చేస్తున్నాయో, కొనసాగుతున్నాయో కూడ పరిశీలించవలసి ఉంది.

## 6. అధిక వడ్డీ రేట్లు, వడ్డీ వ్యాపారం

అధిక వడ్డీరేట్లు, వడ్డీ వ్యాపారం అనేవి పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి విధాన సూచికలు కాగా బ్యాంకు రుణ, పరపతి సౌకర్యాలు ఆధునిక పెట్టుబడిదారీ విధాన సూచికలు. 'వడ్డీ సహిత పెట్టుబడికి ఒక స్వభావసిద్ధ రూపం అధిక వడ్డీరేట్లు. స్వయం ఉపాధి రైతులు, చిన్న స్థాయి చేతివృత్తుల వాళ్లు ప్రబలంగా ఉండే చిన్న స్థాయి ఉత్పత్తితో ఈ రూపం కలిసి ఉంటుంది' అని మార్క్స్ అన్నాడు. 'ఉత్పత్తి సాధనాలు విడివిడిగా ఉన్నప్పుడు అధికరేట్ల వడ్డీ, సంపదను కేంద్రీకరిస్తుంది. అది ఉత్పత్తి విధానాన్ని మార్చదు, అది జలగలాగ, పరాన్నభుక్కు లాగ ఉత్పత్తి విధానానికి అంటిపెట్టుకుని ఉండి, దాన్ని దిగలాగుతుంది. ఉత్పత్తి విధానపు రక్తం పీలుస్తుంది, బలహీనం చేస్తుంది. దాని పునరుత్పత్తి మరింత దయనీయమైన పరిస్థితుల్లో సాగేలా చేస్తుంది' అని కూడ అన్నాడు.

'హరిత విప్లవ' సమయంలో వడ్డీవ్యాపారంతో పోల్చినప్పుడు బ్యాంకుల రుణ, పరపతి సౌకర్యాలు పెరిగాయి. అయినా వడ్డీ వ్యాపారం సజావుగానే సాగింది. ప్రపంచీకరణ దశలో బ్యాంకుల ప్రైవేటీకరణ, వ్యవసాయ రంగానికి ప్రాధాన్య వడ్డీ రేట్ల తొలగింపు జరిగాక బ్యాంకుల రుణ, పరపతి సౌకర్యాలు మళ్లీ తగ్గుముఖం పట్టాయి. మళ్లీ వడ్డీ వ్యాపారం పుంజుకుంటోంది. అయితే ఇది ఎంత మేరకు జరుగుతున్నదో అధ్యయనం చేయవలసి ఉంది.

ఈ సూత్రాన్ని సాధారణంగా అన్వయించగలిగినప్పటికీ, రుణ, పరపతి సౌకర్యాలు స్వభావరీత్యానే పూర్తిగా భూస్వామ్యానికో, పెట్టుబడిదారీ విధానానికో చెందినవి కావు. ఉదాహరణకు, ఇవాళ ఎన్నోచోట్ల వడ్డీ వ్యాపారం అచ్చుగుద్దినట్టు పాతకాలపు భూస్వాముల వడ్డీ వ్యాపారం లాగనే ఉండకపోవచ్చు. కాని వ్యాపారులు వసూలుచేసే అధిక వడ్డీ రేట్లు సంవత్సరానికి 36 శాతం నుంచి వంద శాతం దాకా ఉంటున్నాయి. అలాగే, ఇవాళ బ్యాంకు రుణాలలో ఎక్కువభాగాన్ని ధనిక రైతులు, ఇతరులు తీసుకుని, తిరిగి అధిక వడ్డీ రేట్లకు ఇతరులకు రుణాలు ఇస్తున్నారు. అందువల్ల ఇవాళ అమలులో ఉన్న రుణపద్ధతి మౌలికంగా భూస్వామ్యమా, పెట్టుబడిదారీనా తెలుసుకోవడానికి ఆ రుణ సారాంశాన్నీ, స్వభావాన్నీ అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి.

## 7. వ్యవసాయంలో ఉత్పాదకతా ధోరణులు

పోటీ మార్కెట్ లో మనుగడ సాగించాలంటే ఉత్పాదకత నిరంతరం వృద్ధి చెందుతూ ఉండాలనేది పెట్టుబడిదారీ విధానంలో సాధారణ నియమం. అలా జరగకపోతే ఒక పెట్టుబడిదారును, పోటీ పెట్టుబడిదారు మింగివేస్తాడు. 'హరిత విప్లవపు' తొలిరోజుల్లో భారత వ్యవసాయ ఉత్పాదకతలో కచ్చితమైన వృద్ధి కనబడింది. కాని ఆ తర్వాత 1980ల మధ్యనాటికి ఆ వృద్ధిరేటు చాలవరకు తగ్గుతూ వచ్చింది. పర్యావరణ విధ్వంసంతో, వ్యవసాయంలో ప్రభుత్వ పెట్టుబడులు తగ్గడంతో, మరీ ముఖ్యంగా 1990లలో, ఆ తర్వాతా ఉత్పాదకత గణనీయంగా పడిపోయింది. ఈ ఉత్పాదకత ఎంత పడిపోయిందనేదీ, పెట్టుబడి సంచయం మీద దాని ప్రభావం ఏమిటనేదీ విశ్లేషించవలసి ఉంది. ఈ ఉత్పాదకత పతనం మౌలికంగా భారత వ్యవసాయ ఆర్థిక వ్యవస్థమీద సామ్రాజ్యవాద ప్రభావ ఫలితమే.

అలాగే, ఉత్పత్తి కారకాల విలువలకూ, అంతిమ ఉత్పత్తి విలువలకూ మధ్య అంత పెద్ద వ్యత్యాసం ఎందుకు ఉంటున్నది? అందుకు రెండు

కారణాలున్నాయి: మొదట, ఎరువులు, పురుగుల మందులు, ట్రాక్టర్లు, పంప్ సెట్లు వగైరా ఉత్పత్తి కారకాలు తయారుచేసే బహుళజాతి సంస్థలకు, దళారీ బడా బూర్జువావర్గానికీ ఇబ్బడి ముబ్బడి లాభాలు సమకూర్చి పెట్టేందుకు ఉత్పత్తి కారకాల ధరలను హెచ్చుగా నిర్ణయిస్తున్నారు. మరొకవంక పారిశ్రామిక రంగానికీ, సామ్రాజ్యవాదులకూ చౌకధరకు ముడిసరుకులు సమకూర్చేందుకు వ్యవసాయోత్పత్తుల ధరలను అతి చౌకగా నిర్ణయిస్తున్నారు. రెండవది, ఆధునిక ఉత్పత్తి సాంకేతిక పద్ధతులు వినియోగించబడుతున్నప్పటికీ, అందుకు అవసరమైన మౌలిక సాధన సంపత్తి అభివృద్ధి చెందలేదు గనుక, ఇవాళ్టికీ దిగుబడి వర్షాధారంగానే ఉంది. అలాగే రైతాంగం దగ్గర లభ్యమయ్యే పెట్టుబడి స్వల్పంగా ఉండడం వల్ల, ఉత్పత్తి కారకాల వినియోగం సక్రమంగా, శాస్త్రీయంగా జరగడం లేదు. అది దిగుబడి మరింత పడిపోవడానికి దారితీస్తోంది. ఈ అన్ని కారణాలు కలగలిసి, అధిక దిగుబడి వంగడాలతో ఎంత ఉత్పత్తి చేయవచ్చునో అంత చేయడం లేదు. సామ్రాజ్యవాదులను, దళారీ బడా బూర్జువాలను సంతృప్తిపరచే విధానాలనే ప్రభుత్వాలు అమలు చేస్తున్నందువల్ల రైతాంగపు ఉత్పత్తికి మార్కెట్ లో ధర తక్కువగా నిర్ణయమవుతున్నది. అందువల్ల మొత్తంగా వ్యవసాయోత్పత్తి పెరుగుదల ధోరణి కనబడుతున్నప్పటికీ, తీవ్రమైన ఎగుడుదిగుళ్లు కూడ కూడ ఉన్నాయి.

## 8. దేశీయ మార్కెట్

పెట్టుబడిదారీ ఉత్పత్తి పెరుగుదల అనివార్యంగా దేశీయ (గృహ, స్థానిక) మార్కెట్ విస్తరణకు దారితీస్తుంది. గ్రామీణ ప్రాంతాలలో ఈ విస్తరణ రైతాంగ వర్గ విభజన ప్రక్రియ ద్వారా జరుగుతుంది. ఆ ప్రక్రియ వల్ల రైతాంగం పెట్టుబడిదారీ రైతులుగా, గ్రామీణ కార్మికవర్గంగా విభజించబడతారు.

రైతాంగ విభజన దేశీయ మార్కెట్ పెరగడానికి కారణమవుతుంది. రెండు ఎకరాల ఆసామి అయిన ఒక పేదరైతు భూమిని భూస్వామి-వడ్డీవ్యాపారి ఆక్రమించడంతో ఆయన వ్యవసాయ కూలీగా మారాడనుకోండి. తన భూమి కోల్పోకముందు ఆ భూమిలో వచ్చే మొత్తం పంటను ఆ రైతు, ఆయన కుటుంబం సొంతంగా వినియోగించేవారు. కాని భూమి కోల్పోయిన తర్వాత వారి జీవిత స్థితి దారుణంగా మారిపోతుంది. శ్రమశక్తి అమ్మకందారుగా మారాక ఆయన వినియోగించే అత్తెసరు సరుకులు కూడ సరుకుల చలామణీకి అదనంగా చేరుతాయి. అలాగే ఆ రెండెకరాలలో పండే పంట కూడ మార్కెట్ లోకి ప్రవేశిస్తుంది. అలా రైతాంగ విభజన జరిగే కొద్దీ ఒకవంక రైతాంగ జీవనస్థితి దారుణంగా పడిపోయినప్పటికీ, దేశీయమార్కెట్ విస్తరణకు అది అదనపు దోహదం చేస్తుంది.

'సహజ ఆర్థిక వ్యవస్థ లక్షణం చెల్లాచెదురుగా ఉండే చిన్న చిన్న ఆర్థిక యూనిట్లు. సరుకుల ఉత్పత్తి దానికదిగానే ఆ స్థితిని ధ్వంసం చేసి చిన్న, స్థానిక మార్కెట్లను ఒక్కదగ్గరికి తెచ్చి సువిశాల జాతీయ (ఆ తర్వాత ప్రపంచ) మార్కెట్ గా ఏకం చేస్తుంది. సొంత వినియోగం కోసం ఉత్పత్తి అనే స్థితిని యావత్ సమాజం కోసం ఉత్పత్తి అనే స్థితికి బదిలీ చేస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి ఎంత ఎక్కువయితే ఈ సామూహిక ఉత్పత్తి స్వభావం, వ్యక్తిగత సొంతం చేసుకునే స్వభావం మధ్య వైరుధ్యం అంత తీవ్రతరమవుతుంది' అని లెనిన్ అన్నాడు.

అందువల్ల, వినియోగం కోసం ఎంత ఉత్పత్తి జరుగుతున్నద్నీ మార్కెట్ కోసం ఎంత ఉత్పత్తి జరుగుతున్నద్నీ ఇవాళ్టి ధోరణి ఏమిట్నీ ఎంతవరకు వేతనాల చెల్లింపులు డబ్బు రూపంలో జరుగుతున్నాయ్నీ ఎంతవరకు వస్తురూపంలో జరుగుతున్నాయ్నీ అశేష ప్రజానీకపు కొనుగోలు శక్తి ఏమేరకు పెరిగింద్నీ పారిశ్రామిక వస్తువుల అమ్మకాలకు గ్రామీణ మార్కెట్ ఎంత అవకాశం ఇస్తోంద్నీ వ్యవసాయం నుంచి తొలగించబడిన శ్రామికులు ఎంతవరకు పరిశ్రమలలో, తయారీరంగంలో సంలీనమయ్యార్నీ లేదా వారిలో అత్యధికులు ఇంకా సమాజపు అంచులలో రెండుపూటలా తిండిలేని స్థితిలో మనుగడ సాగిస్తున్నార్నీ ఎంతవరకు వ్యవసాయం పరిశ్రమతో సమ్మిళితమయింది వంటి అంశాలు పరిశీలించడం చాల ముఖ్యం. ఉత్పత్తి సంబంధాలు ఏ మేరకు పరివర్తన చెందాయని చూడడానికి ఇవన్నీ అధ్యయనం చేయవలసి ఉంటుంది.

## 9. వ్యక్తిగత పరాధీనత

'అంతకు ముందరి ఆర్థిక వ్యవస్థలన్నిటిలోనూ వ్యక్తిగత పరాధీనత అవిభాజ్యమైన అంతర్భాగంగా ఉండేది. పెట్టుబడిదారీ విధానం అన్ని రూపాలలోని వ్యక్తిగత పరాధీనతను రద్దు చేస్తుంది' అని లెనిన్ అన్నాడు. గ్రామీణ భారతదేశంలో ఎంతమేరకు వంశం, కులం తదితర సామాజిక, వ్యక్తిగత పరాధీనతా రూపాలు ఉనికిలో ఉన్నాయో లేక ఈ పరాధీనతా రూపాలు ధ్వంసమైపోయి, కేవలం వర్గ విభజన మీద ఆధారపడిన సంబంధాలుగా మారిపోయాయో మనం చూడాలి. అలాగే భూస్వామ్య అధికారం తనను తాను నిలబెట్టుకునే రూపాలలో వంశ, కుల నిర్మాణాల పాత్ర, ఉదాహరణకు హర్యానా ఖాప్ కుల పంచాయితీల లాంటివి, ఏమేరకు ఉందో పరిశీలించాలి. నిజానికి పెట్టుబడిదారీ విధానంతో పాటు ప్రజలకు ఎక్కడికంటే అక్కడికి వెళ్లే చలనయోగ్యత వస్తుంది. దానితో పాత వ్యక్తిగత పరాధీనతా రూపాలు బదాబదలు అవుతాయి. జనాభాలో అత్యధిక సంఖ్యాకులు మార్కెట్, పెట్టుబడి అనే ఏకైక అంశం మీద పూర్తిగా ఆధారపడే పరిస్థితి వస్తుంది.

కనుక, మన అధ్యయనంలో ఈ వ్యక్తిగత పరాధీనతా రూపాలు ఏ మేరకు తగ్గిపోయాయో, అలా తగ్గిపోవడంలో డబ్బు సంబంధాల ప్రవేశం పాత్ర ఎంతో పరిశీలించాలి.

## 10. రైతాంగ వర్గ విభజన - పట్టణ/గ్రామీణ విభజన

దీనిలో రెండు అంశాలున్నాయి. మొదటిది, గ్రామీణ జనాభాలో గ్రామీణ కార్మికవర్గం, పెట్టుబడిదారీ రైతు (లేదా కులక్) అనే వర్గ విభజన ఎంతమేరకు జరిగిందనేది. రెండోది, ఈ విభజన జరిగి, రైతాంగం తమ భూముల నుంచి తొలగించబడి, పట్టణ ప్రాంతాలకు ఎంతమేరకు వలస వెళ్లారనేది.

మొదటి అంశం చూస్తే, పెట్టుబడిదారీ వ్యవసాయం వృద్ధి చెందితే, తత్ఫలితంగా రైతాంగ వర్గ విభజన జరుగుతుంది. గ్రామ జనాభాలో అతి చిన్న భాగాన్ని వేతన కార్మికులుగా ఉపయోగించుకునే విశాలమైన

ఆధునిక పెట్టుబడిదారీ వ్యవసాయ క్షేత్రాలు తయారవుతాయి. ఈ ప్రక్రియలో చిన్న రైతులు, చివరికి మధ్యతరగతి రైతాంగంలో కూడ ఒక పెద్ద బృందం తమ భూమి నుంచి బేదఖలయిపోతారు. అలా విశాల పెట్టుబడిదారీ వ్యవసాయ క్షేత్రాలు ఏర్పడతాయి. 'జంకర్ మార్గం' అనేదానిలో ఈ పరివర్తన పైనుంచి జరుగుతుంది. భూస్వాములే కులక్ లుగా మారిపోతారు. ఈ పరివర్తన అనేక మధ్యంతర సంధి రూపాలద్వారా జరుగుతుంది. ఎంత మేరకు పెట్టుబడిదారీ వ్యవసాయానికి మౌలిక పరివర్తన జరిగిందో, ఎంతమేరకు కొన్ని పెట్టుబడిదారీ మార్పులతో అర్ధభూస్వామ్య స్థితిలో ఉందో మన అధ్యయనంలో జాగ్రత్తగా పరిశీలించాలి. ఇక్కడ చర్చిస్తున్న అన్ని అంశాలనూ పరిగణనలోకి తీసుకున్నప్పుడే ఇది అంచనా వేయడం వీలవుతుంది.

కాని, ఇలా తమ భూములనుంచి వెళ్లగొట్టబడిన శ్రామికులందరినీ పెట్టుబడిదారీ అభివృద్ధిలో అనివార్యంగా సంలీనం చేసుకోవడం కుదరదు. ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవసాయం ఈ నిర్వాసిత జనాభా నుంచి అతి చిన్న భాగానికి మాత్రమే చోటు కల్పించగలుగుతుంది. అందువల్ల అత్యధిక ప్రజానీకానికి పారిశ్రామిక రంగమే ఉపాధి చూపవలసి వస్తుంది. దేశీయ మార్కెట్ గనుక విస్తరిస్తే దానితోపాటుగానే పారిశ్రామిక రంగం పెరుగుతుంది గనుక అది ఈ నిర్వాసితులకు ఉపాధి కల్పించగలుగుతుంది. అప్పుడు గ్రామీణ జనాభా కన్న ఎక్కువగా పట్టణ జనాభా పెరుగుతూ పోతుంది.

'పెట్టుబడిదారీ విధానం తప్పనిసరిగా జనాభా చలనానికి వీలుకల్పిస్తుంది. ఇంతకు ముందరి సామాజిక ఆర్థిక వ్యవస్థలకు ఇటువంటి చలనం అవసరం ఉండేది కాదు. ఆ వ్యవస్థలలో ఇటువంటి పరిణామం పెద్ద ఎత్తున జరగడం అసాధ్యం... పెట్టుబడిదారీ విధానం వ్యవసాయంలో పాల్గొనే జనాభాను నిరంతరాయంగా తగ్గిస్తూ, సువిశాల పారిశ్రామిక కేంద్రాల సంఖ్యను పెంచుతూ పోతుంది' అని లెనిన్ అన్నాడు.

అంటే, వ్యవసాయంలో వర్గ విభజన ప్రక్రియ, అదే సమయంలో పట్టణ ప్రాంతాలలో పరిశ్రమలు పెరిగి, నిర్వాసిత జనాభాను తనలో సంలీనం చేసుకుంటున్నప్పుడు మాత్రమే ముందుకు కదులుతుంది. ఈ మొత్తం ప్రక్రియను వివరిస్తూ లెనిన్ 'సరుకుల ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందడమంటే అర్థం వ్యవసాయం నుంచి అంతకంతకూ ఎక్కువమంది బైటికిపోతూ ఉండడమే. అంటే వ్యవసాయ జనాభా తగ్గిపోతూ పట్టణ జనాభా పెరిగిపోతూ ఉండడమే' అన్నాడు.

ఈ ప్రక్రియనే వివరిస్తూ, 'వ్యవసాయేతర జనాభాతో పోలిస్తే, వ్యవసాయ జనాభాను నిరంతరాయంగా తగ్గిస్తూ పోవడమనేది పెట్టుబడిదారీ ఉత్పత్తి స్వభావంలోనే ఉంది. ఎందుకంటే పరిశ్రమలో అస్థిర పెట్టుబడితో పోల్చినప్పుడు స్థిర పెట్టుబడి పెరుగుతుంది. దానితోపాటే అస్థిర పెట్టుబడి సంఖ్యాత్మకంగా పెరుగుతూ, సాపేక్షికంగా తగ్గుతూ ఉంటుంది. మరొకవంక వ్యవసాయంలో ఒక నిర్దిష్టమైన మడిచెక్కను వినియోగించడానికి అవసరమైన అస్థిర పెట్టుబడి సంఖ్యాత్మకంగా తగ్గుతుంటుంది. కొత్త భూమిని సాగులోకి తెచ్చినంతమేరకు మాత్రమే అది పెరగడానికి అవకాశం ఉంటుంది. కాని కొత్త భూమి సాగులోకి రావడానికి వ్యవసాయేతర జనాభా పెద్దఎత్తున పెరగడం ముందస్తు షరతుగా ఉంటుంది' అని మార్క్స్ అన్నాడు.

భారతదేశంలో కాలక్రమంలో పట్టణ జనాభా పెరుగుతున్నదనడంలో సందేహం లేదు. కాని ఆ పెరుగుదల క్రమబద్ధంగా ఉంది. ఇక రైతాంగం వ్యవసాయ కార్మికులుగా, పెట్టుబడిదారీ రైతులుగా విభజనకు గురికావడం దేశంలోని కొన్ని చిన్నభాగాలలో కొంతవరకు కనిపించవచ్చు. కాని మిగిలిన అనేక ప్రాంతాలలో ఈ ప్రక్రియ అనేక సంధి రూపాలలో ఉంది. మన అధ్యయనాలలో ప్రాథమికంగా ఈ రెండో అంశాన్ని ఎక్కువగా పరిశీలించవలసి ఉన్నది. అలాగే మొదటి అంశం ఏ మేరకు జరుగుతున్నదో పరిశీలించవలసి ఉంది.

## 11. చేతివృత్తులు

పెట్టుబడిదారీ పరిశ్రమ, పెట్టుబడిదారీ సంబంధాలు గనుక పెరుగుతున్నట్టయితే అవి మొట్టమొదట, అన్నిటికన్న ఎక్కువగా ఈ ప్రాచీన, వెనుకబడిన ఉత్పత్తి, సేవా రూపాలను రద్దు చేయవలసి ఉంటుంది. కాని ఇవి పారిశ్రామిక అభివృద్ధితోపాటు సహజీవనం చేస్తూ కొనసాగుతున్నాయి. అలాగే రైతాంగంలో వర్గ విభజన జరిగినట్టయితే అదే సమయంలో గృహోత్పత్తి రంగం విచ్ఛిన్నమైపోతుంది. ఆధునిక దేశీయ పరిశ్రమ విస్తరిస్తుంది. 'సహజ ఆర్థిక వ్యవస్థకు అత్యవసరమైన అనుబంధం గృహ పరిశ్రమలు. చిన్న రైతులు ఉన్నంతవరకూ గృహ పరిశ్రమలు అవశేషాలుగా ఉంటూనే ఉంటాయి' అని లెనిన్ అన్నాడు.

భారతదేశంలో, కుల-ఆధారిత గృహ శ్రమ కొనసాగుతుండడం మాత్రమే కాదు, గృహ పరిశ్రమలను రాజ్యం, దళారీ బడా బూర్జువావర్గం కూడ ప్రోత్సహిస్తున్నాయి. ఉదాహరణకు ప్రభుత్వం 1981-82లో ఖాదీ, గ్రామీణ పరిశ్రమలకు మొత్తం నిధులు, పాత రుణాల బకాయిలు కలిసి రు. 338 కోట్లు ఇచ్చింది. అందులో ఖాదీకి రు. 208 కోట్లు, గ్రామీణ పరిశ్రమలకు రు. 130 కోట్లు ఇచ్చారు. పారిశ్రామిక ఉత్పత్తి విస్తరిస్తున్న నేపథ్యంలో కూడ ఈ రంగం ఇంకా ఉనికిలో ఉన్నదనే వాస్తవం మాత్రమే కాదు, దానికి ప్రభుత్వ ప్రోత్సాహం దొరుకుతున్నదనే అంశం ఈ దేశంలో సామ్రాజ్యవాదం, దళారీ బడా బూర్జువావర్గం వెనుకబడిన పెట్టుబడిదారీపూర్వ ఉత్పత్తి విధానాలతో మిలాఖత్తు అయ్యాయనేందుకు స్పష్టమైన ఉదాహరణ. సామ్రాజ్యవాదం, దళారీ బడా బూర్జువా వర్గం ఈ పెట్టుబడిదారీపూర్వ ఉత్పత్తి విధానాన్ని తన మనుగడ కొరకు సామాజిక పునాదిగా వాడుకుంటున్నాయి.

ఈ రంగంలో అత్యధికులు తీవ్రమైన సంక్షోభంలో ఉన్నారు. లక్షలాది కుటుంబాలు, ముఖ్యంగా చేనేత కార్మికులు, బొటాబొటి జీవితం సాగిస్తున్నారు. అయినా వారికి తగిన ఉపాధి అవకాశాలు లేవు. అందువల్ల ప్రతి సంవత్సరం వేలాది మంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. మన గ్రామీణ, అర్ధపట్టణ ప్రాంతాలలో ఎంతవరకు చేతివృత్తులు కొనసాగుతున్నాయో, చేనేత కార్మికులు, చెప్పులు కుట్టేవాళ్లు, కంసాలులు, మంగళ్లు, ఇతర శ్రామిక సేవల రూపాలు కొనసాగుతున్నాయో పరిశీలించవలసి ఉంది.

**12. ఉత్పాదకతా ధోరణులు**

పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థలో పెట్టుబడిదారీ సంబంధాలు సాధారణంగా ఉత్పాదకత పెరగడానికి దారితీస్తాయి. అతి తీవ్రమైన పెట్టుబడిదారీ పోటీని ఎదుర్కొని మనుగడ సాగించాలంటే ఉత్పాదకత పెంచుకోవలసి ఉంటుంది. ఇది పరిశ్రమ విషయంలో ఎంత వాస్తవమో, పెట్టుబడిదారీ వ్యవసాయంలో కూడ అంతే వాస్తవం. కాని భారతదేశంలో దిగుబడులు పెరుగుతున్నప్పటికీ, ఆ దిగుబడులు ప్రపంచంలోని ఇతర వెనుకబడిన దేశాలలో దిగుబడులతో కూడ సమానంగా ఉండడం లేదు. అలాగే ప్రధాన వ్యవసాయ ఉత్పత్తి కారకాలను తయారుచేసే సామ్రాజ్యవాదుల, దళారీ బడా బూర్జువాల లాభాలను పెంచడానికే రూపొందుతున్న విధానాల ఫలితంగా వ్యవసాయ రంగపు లాభార్జన కూడ తగ్గిపోతూ ఉంది.

ఉత్పత్తి సంబంధాల స్వభావాన్ని అధ్యయనం చేసేటప్పుడు వ్యవసాయ ఉత్పాదకత వృద్ధిని, వెనుకబడిన ఉత్పత్తి సంబంధాలతోనూ, ఆర్థిక వ్యవస్థలో సామ్రాజ్యవాద జోక్యంతోనూ దాని సంబంధాన్నికూడ అర్థం చేసుకోవడం అవసరం.

**ముగింపు**

మనం సామాజిక అధ్యయనాలు చేస్తున్నప్పుడు భూస్వామ్య సంబంధాలు ఏ మేరకు బలహీనమయ్యాయో, ఏ మేరకు పెట్టుబడిదారీ పరివర్తన జరిగిందో సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి మొత్తం మీద కనీసం ఈ 12 అంశాలకు సమాధానాలను కనిపెట్టవలసి ఉంటుంది. భారతదేశం అర్ధభూస్వామ్య దేశం అని మనం అంటున్నప్పుడు పాత కరడుగట్టిన భూస్వామ్యం ఎక్కువగా కనబడడం లేదు, అది అనేక పరివర్తనా, సంధి రూపాల స్థితులలో ఉంది. ఈ విభిన్న పరివర్తనా రూపాల దశలను అధ్యయనం చేయడం ద్వారానే మనం దేశంలోని విభిన్న ప్రాంతాలలో వ్యవసాయంలో వాస్తవికంగా ఉన్న వర్గ సంబంధాలను నిర్ధారించగలం. ఆ నిర్ధారణ ప్రాతిపదికగానే ఒక వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని రూపొందించుకుని, విభిన్న పరివర్తనా రూపాలలో ఉన్న విభిన్న ప్రాంతాలకు ప్రత్యేకంగా వర్తించే వేరువేరు నినాదాలను తయారు చేసుకోవలసి ఉంటుంది.

(ఈ వ్యాసం సామాజిక అధ్యయనాల పునాది గురించి స్థూల చిత్రాన్ని మాత్రమే ఇస్తుంది. భారత దేశం కన్న ఎక్కువగానే పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందినప్పటికీ ఫిలిప్పైన్స్, పెరూలలో అక్కడి కమ్యూనిస్టు పార్టీలు తమ దేశాలను అర్ధభూస్వామ్య దేశాలుగా ఎందుకు, ఎలా అభివర్ణించాయో వారి అనుభవాలను, అవగాహనలను అధ్యయనం చేయాలి. ఈ లోగా పై సూచనలు సమగ్ర సామాజిక అధ్యయనం సాగించడానికి ఉపయోగపడతాయని ఆశిస్తున్నాం.)

(మూలం: http://toanewdawn.blogspot.in)

*(రచయిత న్యూఢిల్లీ, తిహార్ జైల్లో సిపిఐ (మావోయిస్ట్) రాజకీయ ఖైదీ)* వీ

---

*(...8వ పేజీ తరువాయి)*

*సహజంగా ఆటంకాలను ఎదుర్కొంటూ, అధిగమిస్తూ సాగవలసిందే. ఆ సమస్యలు ఎప్పటికప్పుడు పాఠకులతో, మిత్రులతో పంచుకొని, అధిగమించే అవకాశాలను కనిపెట్టడమే వీక్షణం చేస్తూ వస్తున్న పని. పది కాలాలు అలాగే గడిచాయి, మిత్రుల సహకారమే మరొక పదికాలాల జీవితం ఇస్తుందని మా ఆశ, మా నమ్మకం.*

*అవును, వీక్షణం ఇంకా పదికాలాల పాటు నిలిచి ఉండాలనీ, తాను చేయవలసిన పని ఉన్నదనీ, పెరుగుతున్నదనీ భావిస్తున్నది. నిజంగా ఇవాళ నెలకొని ఉన్న రాజకీయార్థిక, సామాజిక పరిస్థితులు, రోజు రోజూ జరుగుతున్న పరిణామాలు వీక్షణం వంటి పత్రిక అవసరాన్ని మరింత పెంచుతున్నాయి, వేనోళ్ల చాటుతున్నాయి. ఒకవైపు చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి అనుమతితో సహా అతి భయంకరమైన ప్రజావ్యతిరేక ప్రపంచీకరణ విధానాలను ప్రవేశపెడుతున్న, దేశ వనరులను బహుళజాతి సంస్థలకు అప్పగించి, ప్రజల జీవనాన్ని అల్లకల్లోలం చేస్తున్న పాలకపక్షం, ప్రజల గురించి ఎంత మాత్రం పట్టించుకోని నామమాత్ర ప్రతిపక్షాలు, నరహంతకుడు నరేంద్ర మోడీ మూడో సారి అధికారానికి రావడం, హిందూ బ్రాహ్మణీయ మతోన్మాద భావజాలం, కుల అంతరాల, వివక్షా దుర్మార్గాల ఆచారాలు పెచ్చరిల్లుతుండడం, నిజమైన ప్రజా ప్రత్యామ్నాయం కోసం పోరాడుతున్న ప్రజలపై, ప్రజా ఉద్యమంపై గ్రీన్ హంట్ తో సహా అమానుష హంతక దాడులు... ఈ దుస్సహ, దుర్భర వర్తమానంలో వీక్షణం చేయవలసిన పని చాల ఉంది. నానాటికీ పెరుగుతున్నది. ఇటువంటి అనేకానేక అంశాల మీద ప్రజలలో అవగాహన కలిగించడం, ఆ అవగాహన ఎటువంటి శాస్త్రీయ, నిర్మాణ చైతన్యంగా మారవలసి ఉన్నదో చూపడం, ప్రజా ప్రత్యామ్నాయ నిర్మాణంలో తన వంతు పాత్ర నిర్వహించడం వీక్షణం సంకల్పశుద్ధితో ఎంచుకుంటున్న పనులు.*

*సమాజం శకలాలు శకలాలుగా విడిపోయి, ఎవరి గూట్లో వాళ్లే ఉంటూ, ఎవరి అవగాహన వాళ్లే తమలో తామే చదువుకుంటూ, పక్కవారి అవగాహన ఏమిటో తెలుసుకోవాలనే ఆసక్తి కూడ లేనంత ఏకేశ్వరోపాసనలో ఉన్నప్పుడు అందరికీ అవసరమైన చైతన్యాన్ని, అందరూ చదవవలసిన విశాల అవగాహనలను, అందరూ పాల్గొనవలసిన ఆచరణను పైకెత్తి చూపదలచిన వీక్షణం పని ఇంకా ఇంకా విస్తరిస్తున్నది.*

*ఇలా విస్తరిస్తున్న బృహత్తర కర్తవ్యాన్ని సక్రమంగా నెరవేర్చాలంటే వీక్షణం ఇంకా స్థిరంగా రావాలి. ఇంకా బలంగా రావాలి. ఇంకా లోతుగా రావాలి. అంటే రచనలోనూ, ఆర్థిక నిర్వహణలోనూ, రోజువారీ నిర్వహణలోనూ సమస్యలను అధిగమించాలి. ఇంకా ఎక్కువ మంది భాగస్వామ్యంతో వెలువడాలి. అంటే వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరూ మరొకరికి దీన్ని పరిచయం చేయాలి. చందాదారులు ప్రతిఒక్కరూ మరొక్క చందాదారునైనా చేర్పించాలి. ప్రతి గ్రామానికీ పట్టణానికీ వీక్షణం చేరేలా చూడాలి. వీక్షణ సుస్థిర అభివృద్ధికి అవసరమైన వనరులను సమకూర్చాలి. తాము ఇవ్వగలిగిన విరాళం ఎంత చిన్నదైనా సరే ఇవ్వాలి. మిత్రులతో ఇప్పించాలి. వ్యాపార, అభినందన ప్రకటనలు సేకరించాలి.*

*వీక్షణం ప్రజల పత్రిక. ప్రజలకోసం వీక్షణం మరి పదికాలాల పాటు కొనసాగవలసి ఉంది. ప్రజలే వీక్షణాన్ని పదికాలాలపాటు నిలుపుకోవాలి.*

***- ఎన్ వేణుగోపాల్***

# చలనంలో విషయం - చలనంలో అధ్యయనం

## ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ పరివర్తన (1970 - 2010) పై మావోయిస్టుల విశ్లేషణ

***భారత సమాజాన్ని అర్ధ భూస్వామ్య, అర్ధ వలస సమాజంగా 1970లో చేసిన నిర్వచనం ఇవాళ్టికీ సరిపోతుందా అనే చర్చ నేపథ్యంలో మూడు దశాబ్దాలలో వ్యవసాయ సంబంధాలలో వచ్చిన మార్పులను వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

**ఉపోద్ఘాతం**

దృగ్గోచరాంశాలతో వ్యవహరించాలన్నా, వాటిలో ఏదైనా మార్పు తేవాలన్నా ఆ దృగ్గోచరాంశాల గురించి సమగ్ర అవగాహన ఉండడం మొదటి షరతు. సమాజ స్వభావం గురించిన అంచనా, ఆ సమాజం ప్రధానంగా వ్యవసాయ సమాజమైతే వ్యవసాయ సంబంధాల గురించిన అంచనా, ఆ సమాజంలో, ఆ వ్యవసాయ సంబంధాలలో పరివర్తన సాధించాలనే ఆలోచనకు కీలకమైనదవుతుంది. అందువల్ల భారతదేశంలో సామాజిక పరివర్తన సాధించదలచిన శక్తులలో ప్రధానమైన మావోయిస్టులు, లేదా నక్సలైట్లు, సమాజ అధ్యయనం సాగించడం, భారత సమాజం గురించి ఒక నిర్దిష్ట అవగాహనకు రావడం, ఆ అవగాహన ప్రాతిపదికగా తమ పరివర్తనా రాజకీయాలను ఆచరణలో పెట్టడం సహజం. తాము పరివర్తన తీసుకురావడానికి ప్రయత్నిస్తున్న సమాజం 'అర్ధభూస్వామ్య అర్ధవలస' సమాజం అని భారత మావోయిస్టులు అభివర్ణిస్తారు. ఈ ప్రాథమిక అవగాహన 1960ల చివరా, 1970ల మొదటా ఉండిన పరిస్థితులకు సంబంధించినదనేది నిజమే. ఆ తర్వాత పరిస్థితి గణనీయంగా మారిందని, అందువల్ల ఆ అవగాహనను పూర్తిగా వదులుకోకపోయినా, మార్పులు చేసుకోక తప్పదని చర్చ జరుగుతున్నది. అయితే తాము అభివర్ణించిన పరిస్థితిని మావోయిస్టులు నిరంతరం అధ్యయనం చేస్తున్నారని, విశ్లేషిస్తున్నారని చూపడానికి తగిన ఆధారాలున్నాయి. తమ ప్రాథమిక అవగాహనను మార్చుకోవలసినంత గణనీయమైన, మౌలికమైన మార్పులు రాలేదని వారు ఆ అధ్యయనాల పునాదిపై నిర్ధారిస్తున్నారు.

గత నాలుగు దశాబ్దాల కాలంలో గ్రామీణ వ్యవసాయ భౌతిక పరిస్థితిలో వచ్చిన మార్పులనూ, ఆ మార్పుల పట్ల మావోయిస్టుల స్వీయ అవగాహనల చరిత్రనూ వివరించడానికి ఈ పత్రం ప్రయత్నిస్తుంది. భౌతిక పరిస్థితి (ఆబ్జెక్టివ్ కండిషన్స్), స్వీయ మానసిక శక్తులు (సబ్జెక్టివ్ ఫోర్సెస్) అనే తాత్విక పరిభాషను ఆబ్జెక్ట్ – సబ్జెక్ట్ (విషయం – విషయి, కర్మ – కర్త) గా వివరించడం ఉంది. (తెలుగులో సబ్జెక్ట్ అనే మాటకు మామూలుగా విషయం అనే అర్థం చెప్పుకుంటుండగా, తాత్విక పరిభాషలో దాని అర్థం కర్త, విషయి. అంటే సబ్జెక్ట్ అనే మాటకు ఏకకాలంలో విషయం, విషయి అనే రెండు అర్థాలు, చదవబడుతున్న వస్తువు, చదువుతున్న వ్యక్తి అనే రెండు అర్థాలు వస్తాయన్నమాట – అను.). తాత్విక పరిభాషలోని విషయం, విషయి రెండూ కూడ చలనంలో ఉన్నాయి. కాలక్రమంలో మార్పులకు గురవుతున్నాయి. ఈ పత్ర శీర్షిక గురించి ఒకమాట చెప్పాలి. సబ్జెక్ట్ – విషయం – అనే పదానికి చాల అర్థభేదాలున్నాయి. ఈ పత్రంలో ఆ పదాన్ని రెండు వేరువేరు అర్థాలలో, పరస్పర వ్యతిరేకమైన అర్థాలలో కాకపోయినా, వాడడం జరుగుతున్నది. సాధారణ అర్థంలో సబ్జెక్ట్ – విషయం – అంటే అధ్యయన లక్ష్యం లేదా క్షేత్రం అని చెప్పుకోవచ్చు. కాని తాత్విక పదజాలంలో సబ్జెక్ట్ అంటే క్రియాశీల కర్త. విషయాన్ని లేదా సమాజాన్ని లేదా అధ్యయన విషయాన్ని పరిశీలించే, పరివర్తన చెందించే వ్యక్తి. అంటే ఒకరకంగా చెప్పాలంటే సబ్జెక్ట్, ఆబ్జెక్ట్ అనే మాటలు తమ అర్థాలు మార్చుకుని ఒకటిగా మారిపోతున్నాయన్నమాట. ఈ పత్రం సబ్జెక్ట్ అనే మాటను సాధారణంగా 'భౌతిక పరిస్థితులు'గా అభివర్ణించే సమాజం, వ్యవసాయ సంబంధాలు, వర్గపోరాటం వంటి అంశాలకూ వాడుతుంది. వర్గపోరాటానికి నాయకత్వం వహించడం ద్వారా ఆ వ్యవసాయ సంబంధాలను అధ్యయనం చేయడానికి, వాటిలో జోక్యం చేసుకోవడానికి, వాటిని మార్చడానికి ప్రయత్నించే స్వీయ మానసిక శక్తులను, మావోయిస్టులను గురించి చెప్పడానికి కూడ ఆ మాట వాడుతుంది. (ఇదంతా ఇంగ్లిష్ పత్ర శీర్షిక స్టడీయింగ్ ది సబ్జెక్ట్ ఇన్ మోషన్ గురించి చర్చ. ఆ ఇంగ్లిష్ శీర్షికకు సన్నిహితంగా ఉండేలా చలనంలో విషయం – చలనంలో అధ్యయనం అని తెలుగు చేయడం జరిగింది – అను.)

ఈ పత్రం నాలుగు భాగాలలో ఉంది. మొదటి భాగం సమాజ స్వభావం గురించిన అంచనాకు సంబంధించిన సైద్ధాంతిక, రాజకీయ, ఆర్థిక అర్థాలను వివరిస్తుంది. రెండో భాగం మారుతున్న సమాజ వాస్తవికతను అర్థం చేసుకోవడం కోసం మావోయిస్టులు సాగించిన నిర్దిష్ట, నిరంతర అధ్యయనాల చరిత్రను వివరిస్తుంది. మూడో భాగం మూడు దశాబ్దాల కింద మావోయిస్టులు అధ్యయనం చేసిన రెండు గ్రామాలను ప్రస్తుతం పునరధ్యయనం చేసి సాధించిన ఫలితాలను వివరిస్తుంది. నాలుగో భాగం వ్యవసాయ సంబంధాలలో మార్పు – కొనసాగింపు, కొత్త అంశాల ప్రవేశం, వాటి స్వభావం, పాత్ర, రూప సారాల గతితార్కికత, భారతదేశంలో కొనసాగుతున్న వ్యవసాయ విప్లవ ఆవశ్యకత వంటి విశాల చట్రంలోపల సమాజ స్వభావ అవగాహనను అర్థం చేసుకోవడానికి ఒక ముగింపు కాని ముగింపును ప్రకటిస్తుంది.

### కీలక భావనల అభివృద్ధి

అర్ధభూస్వామ్య అర్ధవలస స్వభావం అనే మౌలిక సూత్రీకరణకు మూడు స్థాయిల ప్రతిస్పందనలున్నాయి. 1. దాన్ని ఒక నిస్సారమైన పదబంధంగా మార్చి భౌతిక వాస్తవికత గురించి నిర్దిష్ట అధ్యయనం ఏదీ లేకుండా ఆ మాటను యథాతథంగా వల్లించడం. కొన్ని ప్రాంతాలలో నైనా కనబడుతున్న భిన్నమైన వాస్తవికతలను పట్టించుకోకుండా విశాల ఉపఖండ సంక్లిష్ట వాస్తవికతను ఈ సూత్రీకరణతో అర్థం చేసుకోగలమని అనుకోవడం. 2. అది ఒక సాదాసీదా, అర్థం లేని పదజాలం అని వర్ణించి దాని అవసరాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయడం. 3. సామాజిక వాస్తవికతను విశ్లేషించడానికీ, మార్చడానికీ ఉపయోగపడే ఒక శక్తివంతమైన, అర్థవంతమైన సాధనంగా ఆ సూత్రీకరణను గుర్తించి ఆ సాధనాన్ని నిరంతర అధ్యయనం, ఆచరణల ద్వారా పదును పెట్టుకోవడానికి ప్రయత్నించడం.

ఈ మూడు ప్రతిస్పందనలలో పార్లమెంటరీ వామపక్షాల వైఖరిని చేర్చలేదు. ఏమంటే వారు అసలు భారత సమాజపు అర్ధభూస్వామ్య, అర్ధవలస స్వభావాన్నే అంగీకరించరు. భారతదేశం స్వతంత్ర, సర్వసత్తాక దేశమని వారు భావిస్తారు. భారత సమాజం క్రమక్రమంగా పెట్టుబడిదారీ సమాజంగా పరివర్తన చెందుతున్నదనో, 'ప్రస్తుత భారత వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు ప్రబలంగా ఉన్నాయ'నో, 'కొన్ని భూస్వామ్య అవశేషాలతో ప్రధానంగా పెట్టుబడిదారీ సంబంధాలు' అనో భావిస్తారు. పార్లమెంటరీ వామపక్షాలనూ మార్క్సిస్టు లెనినిస్టులనూ, లేదా 1967 తర్వాత వచ్చిన నక్సల్బరీ పంథానూ వేరుచేసే విభజన రేఖ ఈ అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణే. అయితే ఇటీవల కొంతమంది మాజీ మార్క్సిస్టు లెనినిస్టు ఆలోచనాపరులు, కార్యకర్తలు ఈ సూత్రీకరణను సవరించాలని ఆలోచిస్తున్నారు. వారిలో కొందరు భారతదేశం పెట్టుబడిదారీ సమాజం అయిపోయిందనో, పెట్టుబడిదారీ సమాజంగా మారుతున్నదనో అభివర్ణిస్తున్నారు. లేదా వస్తున్న మార్పులు, ముఖ్యంగా ప్రపంచీకరణ తర్వాత మార్పులు 'భారత విప్లవ వ్యూహాన్ని, ఎత్తుగడలను ప్రభావితం చేయగలిగినంత గణనీయమైనవి' అని భావిస్తున్నారు.

ఈ మూడు ధోరణులలో మొదటి జడాత్మక అవగాహన భారత విప్లవోద్యమానికి కొంతమేరకు నష్టం కలిగించింది. వివిధ పార్టీలు వెలువరించిన సాహిత్యంలో చాల భాగం ఈ భావనను యథాతథంగా, ఎటువంటి అధ్యయనం, బలపరచే వాస్తవాలు, వాదనలు లేకుండా వాడుతున్నది. ఆ రచయితలు ఈ భావనను ఉపయోగించడమే నిర్దిష్ట అధ్యయనానికి ప్రత్యామ్నాయం అన్నట్టు భావిస్తున్నారు. తమది నక్సల్బరీ వారసత్వంగా చెప్పుకునే పార్టీలు, సంస్థలు దేశంలో దాదాపు నలభై ఉన్నప్పటికీ, వాటిలో రెండు మూడు మాత్రమే ఈ విషయమై నిర్దిష్ట అధ్యయనాలు చేసి అర్ధభూస్వామ్య సూత్రీకరణను బలపరచే వాదనలను ప్రచురించాయనే వాస్తవమే జడాత్మక పదాడంబర ధోరణి ఎంతగా ఉందో తెలియజేస్తుంది.

చాల మంది సామాజిక శాస్త్రవేత్తలు, వారు ఉద్యమానికి సానుభూతి పరులైనా, విమర్శకులైనా, తీసుకున్న రెండో ధోరణి అసలు ఆ సూత్రీకరణను కొట్టిపారేస్తుంది, చిన్నచూపు చూస్తుంది, అర్ధభూస్వామ్య సూత్రీకరణను సమాజ శాస్త్రవేత్త రవీంద్ర రే 'అధిభౌతిక భావన' అని కొట్టిపారేయగాగా, అర్థశాస్త్రవేత్త అశోక్ రుద్రా దాన్ని 'మాయ' అన్నారు. రవీంద్ర రే మరింత ముందుకువెళ్లి ఇంకా అన్యాయమైన వ్యాఖ్య కూడ చేశారు: 'ఈ సూత్రీకరణ వాస్తవస్థితికి వివరణ కాదు. అటువంటి పని చేసే నిశితమైన అధ్యయనం గాని, ఓపిక గాని నక్సలైట్లకు ఏకోశానా లేవనుకోండి. వాళ్ల సూత్రీకరణ ఒక రకమైన ఆచరణకు నిర్దేశం. తాము ఎంచుకున్న వ్యూహాన్ని సమర్థించుకోవడానికి వారు ఆ సూత్రీకరణ వాడుతున్నారు' అన్నారు (రవీంద్ర రే, ది నక్సలైట్స్ అండ్ దెయిర్ ఐడియాలజీ, 1992, పే. 176).

అదే పద్ధతిలో అశోక్ రుద్ర 'మాయలు సృష్టించడంలో, ఎటువంటి అనుభవాత్మక ఆధారం లేని సిద్ధాంతాలు తయారు చేయడంలో, నల్లనిదాన్ని తెల్లనిదని వర్ణించే, రాత్రిని పగటిగా భావించే సామర్థ్యంలో మార్క్సిస్టులు ఏమీ తీసిపోలేదు. కొంతమంది అత్యుత్సాహపరులైన రాజకీయార్థిక శాస్త్రవేత్తలు కేవలం పదేపదే వల్లించడం ద్వారా అర్ధ భూస్వామ్యం అనే సిద్ధాంతాన్ని బాగా ప్రచారంలోకి తీసుకురాగలిగారు. భారత వ్యవసాయంలో ఉన్నదంటున్న ప్రతిష్టంభనను ఈ సిద్ధాంతం వివరిస్తుందని వారి నమ్మకం. వారికి అంకెల పట్ల, వాస్తవాల పట్ల ఏమాత్రం పట్టింపు లేదు' అన్నారు (అశోక్ రుద్ర, పొలిటికల్ ఎకానమీ ఆఫ్ ఇండియన్ అగ్రికల్చర్, 1992, పే. 82).

ఈ విమర్శకులు అన్నట్టుగా మావోయిస్టు ఆచరణలో ఉన్న కార్యకర్తలకు సామాజిక శాస్త్రవేత్తలు అనుసరించే అత్యాధునిక సంవిధానాలు, పట్టికలు, సమీకరణాలు, సమ్మేళనాలు, అంకెలు, వాస్తవాలు అనబడేవి తెలియక పోవచ్చు, కాని తప్పనిసరిగా వారు అట్టడుగు ప్రజాసమూహాలలో ఉన్నారు. నేలమీద వాస్తవంగా ఏమి జరుగుతున్నదో వారికి తెలుసు. వారు 'ఓపికతో, నిశితమైన అధ్యయనం' సాగించారడానికి ఎన్నో ఆధారాలున్నాయి. నిజానికి వారికి అధ్యయనం, పోరాటం వేరువేరు కాదు. ఒకటి చేస్తే మరొకటి చేయనక్కరలేదని వారెప్పుడూ అనుకోలేదు. ఆంధ్రప్రదేశ్‌లో వారి చరిత్ర చూస్తే వారు వాస్తవాన్ని అర్థం చేసుకోవడానికీ, మార్చడానికీ కచ్చితంగా ఎన్నో అనుభవాత్మక అధ్యయనాలు చేశారని తేటతెల్లమవుతుంది.

ఇక మూడోది, ఆ సూత్రీకరణ పట్ల విప్లవాత్మకమైన, వాస్తవికమైన అవగాహన. అది ఆ సూత్రీకరణను చిలకపలుకుల్లాగ వల్లిస్తే సరిపోతుందని ఎప్పుడూ సంతృప్తి పడలేదు. నిర్దిష్ట వాస్తవికతలో దాన్ని పరీక్షకు పెట్టాలని అనుకుంది. వర్గపోరాటానికి నాయకత్వం వహించాలంటే నిర్దిష్ట అధ్యయనం అవసరమని నొక్కి చెప్పింది. నిరంతర అధ్యయనం-పోరాటం-సైద్ధాంతీకరణ-మళ్లీ పోరాటం-సిద్ధాంతాన్ని పదును పెట్టుకోవడం అనేదే వారి చరిత్ర. వారు అర్ధభూస్వామ్య సూత్రీకరణను అవసరమైనంత తీవ్రతతో అర్థం చేసుకున్నారని వారి చరిత్ర రుజువు చేస్తుంది. అటువంటి ఎన్నో అధ్యయనాలు వేరువేరు సైద్ధాంతిక పటుత్వంతో దేశవ్యాప్తంగా జరిగాయని ఆధారాలున్నప్పటికీ, ఈ పత్రం, రచయిత పరిమితులవల్ల ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన అధ్యయనాల చరిత్రకు పరిమితమవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో గత ముప్పై ఐదు సంవత్సరాలలో ముప్పైకి పైగా గ్రామాలలో కనీసం డజను అధ్యయనాలు జరిగాయి. ఇవి కాక మావోయిస్టులు అధ్యయనం చేసిన, స్థానిక వర్గ సంబంధాలను అర్థం చేసుకుని, పోరాటాలు నడిపిన గ్రామాలు వేలాదిగా ఉంటాయి.

ఐతే ఆంధ్రప్రదేశ్ అధ్యయనాల వివరాలలోకి వెళ్లేముందు, అసలు భారత కమ్యూనిస్టు/మావోయిస్టు ఉద్యమంలో దేశవ్యాప్తంగానే అర్ధ భూస్వామ్య అర్ధవలస సూత్రీకరణ చరిత్రను తెలుసుకోవడం అవసరం.

నిజానికి భారత వ్యవసాయ స్థితిని భూస్వామ్యం, అర్ధభూస్వామ్యం అని సూత్రీకరించడం 1950లలో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట (1946-51) ఉరవడిలో జరిగింది. అప్పుడు భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పరిశీలన కోసం ఆంధ్ర రాష్ట్రకమిటీ కార్యదర్శివర్గం తయారుచేసిన డాక్యుమెంటులోనూ, ఆ తర్వాత కొత్త కేంద్రకమిటీ సభ్యులకూ, సానుభూతిపరులకూ 1950 జూన్ 1న రాసిన లేఖలోనూ ఈ సూత్రీకరణ కనబడుతుంది.

'భారత దేశపు గ్రామీణ ప్రాంతాలలో, ఇంకా భూస్వామ్య, అర్ధభూస్వామ్య సంబంధాలే ప్రబలంగా ఉన్నాయి. సామ్రాజ్యవాద పాలకులు తమ దోపిడీ ఆర్థిక వ్యవస్థ ప్రయోజనాల కోసం ఉద్దేశ పూర్వకంగానే ఈ భూస్వామ్య అర్ధభూస్వామ్య వ్యవసాయ నిర్మాణాన్ని నిలిపి ఉంచారు...అయితే దేశంలో భూస్వామ్య గర్భంలోనే పెరుగుతున్న గణనీయమైన పెట్టుబడిదారీ సంబంధాలను మనం విస్మరించగూడదు' అని ఆ లేఖలో రాశారు.

ఈ అవగాహన మీద ఆధారపడి, లక్ష్యసాధన కోసం అనుసరించ వలసిన వ్యూహం సాయుధపోరాటమని అదే లేఖ ప్రతిపాదించింది: 'పార్టీ విజయవంతంగా ముందుకు సాగాలంటే వేరు వేరు ప్రాంతాలలో ప్రజానీకపు చైతన్యస్థాయిని బట్టి సాహసికంగా ప్రజాపోరాటాలను ప్రారంభించాలి. వాటిని సాయుధ గెరిల్లా ప్రతిఘటనతో మిళితం చేయాలి. వాటిని మరింత ఉన్నత స్థాయికి అంటే భూపంపకానికీ, గ్రామ ప్రజా కమిటీల (జనపంచాయత్) నిర్మాణానికీ తీసుకుపోయేలా అభివృద్ధి చేయాలి. ఆరకంగా మాత్రమే విప్లవోద్యమాన్ని రక్షించుకోవడం, ఇంకా విశాల ప్రాంతాలకు విస్తరించడం, అంతిమంగా యావత్ దేశాన్నీ చుట్టుముట్టడం సాధ్యమవుతుంది. సాయుధ గెరిల్లా యుద్ధతంత్రాన్ని పాటించడం ద్వారా మాత్రమే పార్టీ బలోపేతమవుతుంది, విస్తరిస్తుంది. అలా సాయుధ గెరిల్లా యుద్ధానికి నాయకత్వం వహించే బలమైన పార్టీ కష్టజీవులైన ప్రజలందరినీ ఏకం చేయగలుగుతుంది. అన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గాలనూ సంఘటితం చేయగలుగుతుంది. నైసర్గికంగానూ ఇతరంగానూ అనువైన ప్రాంతాలలో విముక్తి ప్రాంతాలను స్థాపించి, ప్రజా విమోచన సైన్యాన్ని నిర్మించగలుగుతుంది. అలా చిట్టచివరికి యావత్ దేశాన్ని సంపూర్ణంగా విముక్తి చేసి అంతిమ రాజ్యాధికారాన్ని చేపట్టగలుగుతుంది.

భారత సమాజం గురించీ, భారత విప్లవ పరివర్తనా వ్యూహం గురించీ 1950లో వ్యక్తమైన ఈ మౌలిక అవగాహన పార్టీలో ఎక్కువకాలం కొనసాగలేదు. ఈ లేఖ రాసిన 16 నెలలలోపే, పార్టీ అధికారికంగా తెలంగాణ సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకుంది. తన గెరిల్లా దళాలను రద్దు చేసుకుంది. తన ఆయుధాలను రాజ్యానికి అప్పగించింది. పార్లమెంటరీ ఎన్నికలలో పాల్గొనడం ప్రారంభించింది. ఆ తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ (సిపిఐ) గాని, భారత కమ్యూనిస్టు పార్టీ - మార్క్సిస్టు (సిపిఐ-ఎం) గాని సోషలిస్టు పరివర్తనకు ముందస్తు దశగా వ్యవసాయ విప్లవం జరగవలసి ఉందని ప్రకటిస్తూనే ఉన్నాయి. కాని ఆ వ్యవసాయ విప్లవం అనేది సోషలిజం దిశలో పెట్టుబడిదారీ అభివృద్ధిని వేగవంతం చేసే మార్గంగా మాత్రమే ఆ రెండు పార్టీలూ చూస్తున్నాయి. అందువల్ల భారత దేశాన్ని పెట్టుబడిదారీ దేశం అనో, భూస్వామ్య అవశేషాలున్న పెట్టుబడిదారీ దేశం అనో వ్యవహరిస్తున్నారు.

'వ్యవసాయంలో అర్ధభూస్వామ్య సంబంధాలను తొలగించి పెట్టుబడిదారీ సంబంధాలు స్థాపించడం ప్రభుత్వ విధానాల ప్రధాన లక్ష్యం. ఈ లక్ష్యసాధన దిశలోనే కాంగ్రెస్ ప్రభుత్వాలు శాసన చర్యల ద్వారా భూస్వామ్య ప్రయోజనాలను గణనీయంగా అడ్డుకున్నాయి. జమీందారీ, జాగీర్దారీ, ఇతర చట్టపరమైన భూస్వామ్యాన్ని రద్దు చేసే చర్యలు, కౌలుదారీ చట్టాలు, భూగరిష్ఠ పరిమితి చట్టాలు అన్నీ కూడ ఈ లక్ష్యం సాధించడానికి ఉద్దేశించినవే. కాని భూస్వామ్య ప్రయోజనాల మీద ఈ దాడి సంపూర్ణంగానూ, వాటిని ఊడ్చేసేదిగానూ జరగలేదు. ఇది రాజీల, రాయితీల ప్రక్రియగా సాగుతూ వచ్చింది. అందువల్ల అర్ధభూస్వామ్య దోపిడీకి చెప్పుకోదగినంత అవకాశం మిగిలిపోయింది' అని భారత కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం రాసింది.

'స్వాతంత్ర్యం తర్వాత, భూస్వామ్య విధానాన్ని రద్దు చేసే బదులు, కాంగ్రెస్ పాలకులు అర్ధభూస్వామ్య ప్రభువులను పెట్టుబడిదారీ భూస్వాములుగా మార్చే, ధనిక రైతాంగ శ్రేణిని వికసింపజేసే వ్యవసాయ పరివర్తనా విధానాలను అవలంబించారు' అనీ, 'గ్రామీణ శ్రామిక జనాభాలో అతి పెద్ద బృందాలు కార్మికీకరణ చెందడం, గ్రామీణ జనాభాలో ఎక్కువ మంది వ్యవసాయ కార్మికులుగా మారడం, రైతాంగంలో వేగవంతమైన వర్గ విభజన, మార్కెట్ కోసం ఉత్పత్తి, సాంప్రదాయిక కౌలుదారులను పెద్ద ఎత్తున బేదఖలు చేయడం, గ్రామీణ ధనికులు, ముఖ్యంగా భూస్వాములు వ్యవసాయంలో, వ్యవసాయ సంబంధిత కార్యకలాపాలలో పెట్టుబడి మదుపును పైస్థాయికి పెంచడం వంటి పరిణామాలు ఇదివరకెన్నడూ లేనిస్థాయిలో పెట్టుబడి పునరుత్పత్తి జరగడానికి పునాది వేశాయి. దానితో గ్రామసీమలలో పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధే వ్యవసాయ సంబంధాలలో ప్రధాన ధోరణి ఉంది' అనీ భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కార్యక్రమం అంటుంది.

మొత్తంగా కమ్యూనిస్టు ఉద్యమంలోను, ప్రత్యేకించి కొత్తగా ఏర్పడిన సిపిఐ-ఎం లోను సాగిన అంతర్మథనం వల్ల 1960ల మధ్య భాగం నుంచి ఈ అవగాహనకు సవాళ్లు ఎదురుకావడం మొదలయింది. ఆ క్రమంలో డార్జిలింగ్ జిల్లాలో సిపిఐ-ఎం నాయకుడు, ఆ తర్వాత తలెత్తిన నక్సల్బరీ పంథా నాయకుడు చారు మజుందార్ 1965 నుంచి 1967 వరకు ఎనిమిది వ్యాసాలు రాశారు. వాటిలో నాలుగో వ్యాసం (దాని మీద రాసిన తేదీ లేదు గాని, కచ్చితంగా 1965లో రాసినదై ఉంటుంది) లో ఆయన 'రైతులు ఏ వర్గానికి చెందుతారని నిర్ధారించడంలో చాల తరచుగా ఒక పొరపాటు జరుగుతున్నది. అందుకు కేవలం భూమి పట్టా కాగితాలను ఆధారంగా చేసుకుంటున్నారు. ఇది చాల ప్రమాదకరమైన పొరపాటు. ఒకరి వర్గస్థితిని వారి ఆదాయం, జీవన ప్రమాణాల ఆధారంగా విశ్లేషించవలసి ఉంటుంది' అన్నారు. అలాగే ఏడో వ్యాసం (ఇది కూడ తేదీ లేనిదే, కాని 1966లో రాసినది కావచ్చు) లో ఆయన '...భారతదేశం వంటి అర్ధవలస అర్ధభూస్వామ్య దేశంలో విప్లవపు ప్రధాన శక్తి రైతాంగమే' అని రాశారు. ఈ రెండు వ్యాఖ్యలూ 1967 మేలో జరిగిన నక్సల్బరీ ప్రజ్వలనానికి ముందువి కాగా, ఆ

తర్వాత, నవంబర్ 1967లో ఆయన చాల స్పష్టంగా 'భారతదేశం అర్ధవలస అర్ధభూస్వామ్య దేశం. దేశంలోని ఈ వలస స్థితిని మార్చగల ప్రధానశక్తి రైతాంగమూ, వారి భూస్వామ్య వ్యతిరేక పోరాటమూ. వ్యవసాయ విప్లవం జరగకుండా ఈ దేశంలో ఏ మార్పునూ ఊహించలేం' అని రాశారు.

వ్యవసాయ వర్గ వ్యవస్థ నిర్మాణం గురించీ, అర్ధభూస్వామ్య సూత్రీకరణ గురించీ చారు మజుందార్ చేసిన ఇటువంటి ఎన్నో ప్రస్తావనలతో పాటు చైనా కమూనిస్టు పార్టీ దినపత్రిక పీపుల్స్ డెయిలీ 1967 జూలై 5 న రాసిన సంపాదకీయం ఈ సూత్రీకరణకు బలం చేకూర్చింది: 'కాంగ్రెస్ పాలనలోని భారతదేశం పేరుకు మాత్రమే స్వతంత్రమైనది. వాస్తవంలో అది ఒక అర్ధవలస, అర్ధ భూస్వామ్య దేశం తప్ప మరేమీ కాదు. కాంగ్రెస్ ప్రభుత్వం భారత భూస్వామ్య ప్రభువుల, నిరంకుశ దళారీ పెట్టుబడిదారుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది' అని ఆ సంపాదకీయం రాసింది.

అయితే, ఇదంతా భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) ఇంకా ఏర్పడక ముందు. భారత రాజ్యపు స్వభావం గురించీ, భారత విప్లవం అనుసరించవలసిన వ్యూహం గురించీ సిపిఐ-ఎం లోపల అంతర్గత పోరాటం జరుగుతున్న సందర్భంగా. చిట్టచివరికి, 1969 ఏప్రిల్ 22న అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ సమితి రూపొందించిన రెండు తీర్మానాలలో, వాటి ప్రాతిపదికన ఏర్పడిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు- లెనినిస్టు) ఆమోదించిన రాజకీయ తీర్మానంలో ఈ అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణకు సమగ్ర నిర్వచనం దొరికింది.

'.....భారత దేశం అర్ధవలస, అర్ధభూస్వామ్య దేశమనీ, భారత రాజ్యం బడా భూస్వాముల, దళారీ నిరంకుశ పెట్టుబడిదారుల రాజ్యమనీ మేం ప్రకటిస్తున్నాం... కొద్దిమంది భూస్వాముల చేతుల్లో అంతకంతకూ ఎక్కువ భూమి కేంద్రీకరించబడడం, రెక్కలుముక్కలు చేసుకుని రైతాంగం ఉత్పత్తి చేసిన మిగులు మొత్తాన్నీ కౌలు రూపంలో దోపిడీ చేయడం, గ్రామీణ జనాభాలో దాదాపు 40 శాతం మంది పూర్తిగా భూమిలేని నిరుపేదలుగా ఉండడం, నడ్డివిరిచే అధిక వడ్డీరేట్ల దోపిడీ, పేద రైతాంగాన్ని వారి భూములనుంచి తొలగించడం, మధ్యయుగాలను తలపించే హరిజనుల సజీవదహనాల వంటి పాశవిక సామాజిక అణచివేత, ఉత్పత్తి పద్ధతులు అత్యంత వెనుకబాటుతనంలో ఉండడం వంటి లక్షణాలన్నీ కలిసి మన సమాజపు అర్ధభూస్వామ్య స్వభావాన్ని ప్రదర్శిస్తున్నాయి' అని ఆ తీర్మానం రాసింది. 'ఈ దశలో భారత విప్లవం కొత్త తరహా ప్రజాస్వామిక విప్లవంగా, ప్రజల ప్రజాస్వామిక విప్లవంగా ఉంటుంది. దాని ప్రధాన స్వభావం గ్రామసీమలలో భూస్వామ్యాన్ని రద్దు చేసే వ్యవసాయ విప్లవంగా ఉంటుంది....' అని కూడ ఆ తీర్మానం రాసింది.

కొత్తగా రూపొందిన పార్టీ గ్రామీణ వర్గ వ్యవస్థను అధ్యయనం చేయడానికీ, విశ్లేషించడానికీ ప్రయత్నాలు ప్రారంభించిందనడానికి రుజువులను ఆ పార్టీ అధికార పత్రిక లిబరేషన్ మొదటి సంచిక (జూన్ 1969) లోనే చూడవచ్చు. 'దోపిడీ స్వభావం, రూపాల గురించి ఒక పరిశోధన: ఒక గ్రామ వర్గ విశ్లేషణపై నివేదిక' అనే ఆ వ్యాసంలో దోపిడీ గురించి సవివరమైన చిత్రణతో పాటు పార్లమెంటరీ వామపక్షాలకు భిన్నంగా విప్లవరాజకీయ వ్యూహం ఎందుకు సమర్థించదగినదో వివరణా ఉంది.

ఈ సూత్రీకరణను 1970 మేలో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) కాంగ్రెస్ లో ఆమోదించిన 'పార్టీ కార్యక్రమం'లో ధ్రువీకరించారు. '1947లో ప్రకటించిన బూటకపు స్వాతంత్ర్యం పాత వలస, అర్ధభూస్వామ్య వ్యవస్థ స్థానంలో అర్ధవలస అర్ధభూస్వామ్య వ్యవస్థను నెలకొల్పడం తప్ప మరేమీ కాదు' అని ఆ కార్యక్రమం రాసింది. ఆ కార్యక్రమంలో అర్ధభూస్వామ్య భావన అనేకసార్లు ప్రస్తావనకు వచ్చింది. 'అర్ధభూస్వామ్య భూసంబంధాలు మన దేశాన్ని నిరంతరం కరువుకాటకాలలో ముంచివేయడంతో ప్రతి ఏటా లక్షలాది మంది ఆకలిచావుల పాలవుతున్నారు' అని కార్యక్రమం రాసింది.

కొద్దిరోజుల్లోనే నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలు తాత్కాలిక అపజయానికి గురయ్యాయి. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ఎన్నోసార్లు చీలిపోయింది. ప్రస్తుతం దేశంలో తమను తాము మార్క్సిస్టు లెనినిస్టు వారసులుగా చెప్పుకునే పార్టీలు కనీసం నలభై ఉన్నాయి. ఇదివరకే చెప్పినట్టు, వీటిలో అరడజను పార్టీలు మాత్రమే తమ ఆచరణలో భాగంగా అర్ధభూస్వామ్య అర్ధవలస భావనను బలపరచుకునే ప్రయత్నాలు చేశాయి. వ్యూహానికీ ఎత్తుగడలకూ సంబంధించిన ఇతర సమస్యలు, ముఖ్యంగా పార్లమెంటరీ ఎన్నికలలో పాల్గొనడమా లేదా, ప్రజా పంథాను అవలంబించడం వంటి చర్చలు ప్రధానపాత్ర వహించాయి గాని వర్గపోరాటాన్ని సమర్థంగా నిర్వహించడానికి వ్యవసాయ సంబంధాలను అధ్యయనం చేయడం, విశ్లేషించడం మీద చాల పార్టీలు దృష్టి పెట్టలేదు.

ఈ నేపథ్యంలో నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల వెనుకంజ తర్వాత ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ని పునరుద్ధరించడానికి ప్రయత్నించారు. పశ్చిమ బెంగాల్, బీహార్, పంజాబ్ లలో మిగిలిపోయిన శాఖలతో కలిసి 1973లో సిపిఐ (ఎం-ఎల్) కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీ (సిఓసి) ని రూపొందించారు. ఈ సమయంలోనే సిఓసి ప్రజా పంథా గురించి, వ్యవసాయ విప్లవ కార్యక్రమం గురించి వినూత్న ఆలోచనలు చేసింది. ఆ ఆలోచనలన్నీ 1974లో రూపొందిన ఆత్మవిమర్శనా రిపోర్టు అనే డాక్యుమెంటులో సంఘటితమయ్యాయి. ఈ డాక్యుమెంటు మార్గనిర్దేశకత్వంలో రాడికల్ విద్యార్థి సంఘం నిర్మాణమయింది. త్వరలోనే ఎమర్జెన్సీ ప్రకటించడంతో రాడికల్ విద్యార్థులు అధ్యయనం కోసమూ, పోరాటాలను నిర్మించడం కోసమూ గ్రామాలకు తరలివెళ్లారు. ఈ అనుభవాలు, అధ్యయనాలు కలిసి వ్యవసాయ విప్లవం అనే కీలక రచనగా రూపుదిద్దుకున్నాయి. అయితే 1978లో ఈ రచన అచ్చయ్యేనాటికి సిఓసి పనిచేయలేని స్థితి ఏర్పడి, ఆ పుస్తకం సిపిఐ (ఎం-ఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ పేరు మీదనే వచ్చింది.

కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల రైతాంగంలో ప్రత్యేకంగానూ, మొత్తంగా రాష్ట్రంలోనూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటీ మూడు సంవత్సరాల పాటు నిర్వహించిన పోరాటాల వల్ల దేశవ్యాప్తంగా విప్లవకారులందరి దృష్టీ ఈ పోరాటాలవైపు మళ్లింది. అలా రూపొందిన ఐక్యతతో 1980 ఏప్రిల్ 22న భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) (పీపుల్స్ వార్) ఏర్పడింది. ఈ పార్టీ కేంద్ర కమిటీ అధికారపత్రిక వాయిస్ ఆఫ్

వాన్‌గార్డ్ మొదటి సంచిక నుంచి ప్రారంభించి 'భారత వ్యవసాయం – పెట్టుబడిదారీనా, పెట్టుబడిదారీ పూర్వమా?' అనే సవివరమైన విశ్లేషణను ప్రచురించింది. ఈ వ్యాసం భూవినియోగం, భూకమతాలు, వ్యవసాయ ఉత్పత్తి కారకాలు, ఉత్పాదకతా ధోరణులు, రుణ–పరపతి సౌకర్యాలు, రైతాంగ విభజన, మార్కెట్, మిగులు వినియోగం అనే ఎనిమిది ప్రాతిపదికల మీద ఆధారపడి అర్ధభూస్వామ్య సూత్రీకరణను సమర్థించింది. ఆ తర్వాత కూడ ఆ పత్రిక వ్యవసాయ సంబంధాల మీద, పోరాటాల మీద ఎన్నో అధ్యయనాలు, నివేదికలు, విశ్లేషణలు ప్రకటించింది.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు–లెనినిస్టు) (పీపుల్స్‌వార్), మావోయిస్ట్ కమ్యూనిస్ట్ సెంటర్ ఆఫ్ ఇండియా విలీనమై 2004 సెప్టెంబర్ లో భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) ఆవిర్భవించింది. ఆ పార్టీ కార్యక్రమంలో '...బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష వలస, అర్ధభూస్వామ్య వ్యవస్థ స్థానంలో నయావలస రూపంలోని సామ్రాజ్యవాద పరోక్ష పాలన, దోపిడీ, నియంత్రణలతో కూడిన అర్ధవలస అర్ధభూస్వామ్య వ్యవస్థ ఏర్పడింది' అని రాశారు. 'ఇవాళ్టికీ, మన దేశం మౌలికంగా రైతాంగ జనబాహుళ్యపు దేశమే. మూడింట రెండు వంతుల మంది ప్రజలు గ్రామీణ ప్రాంతాలలోనే జీవిస్తున్నారు. రైతాంగంలోని అత్యధిక సంఖ్యాకులు అతి దుర్భరమైన దోపిడీ పీడనలకు గురవుతున్న వర్గమే. వారు అత్యంత దారుణమైన పరిస్థితులలో, దుర్భర దారిద్ర్యంలో బతుకునీడ్చవలసివస్తోంది. భూసంస్కరణల బూటకపు తతంగాలెన్నో జరిగినా, మొత్తం భూమిలో 30 శాతం ఇంకా భూస్వాముల చేతుల్లోనే ఉంది. వారు జనాభాలో ఐదు శాతం కన్న తక్కువే. గ్రామీణ జనాభాలో 20 శాతం మధ్యతరగతి రైతాంగం గానూ, 10 శాతం ధనిక రైతాంగం గానూ ఉన్నారు. మొత్తం జనాభాలో 65 శాతం మంది భూమిలేని నిరుపేదలు గానో, అతి చిన్న కమతాలు గల చిన్న రైతులుగానో ఉన్నారు. గ్రామసీమలలో తీవ్రమైన అర్ధభూస్వామ్య దోపిడీ రూపాలు ఇంకా ప్రాబల్యంలో ఉన్నాయి. ఇప్పటికీ చలామణీలో ఉన్న ఆ దోపిడీ రూపాలలో ఒకటి, పంట దిగుబడిలో 50 శాతం దాకా దోపిడీ చేసే పాలు, పొత్తు రూపం. అలాగే కట్టు బానిసత్వం, అధిక వడ్డీరేట్లు, వర్తక పెట్టుబడి, ఇతర ఆర్థికేతర నిర్బంధ రూపాలు అమలులో ఉన్నాయి. చిన్న చిన్న మడిచెక్కలుగా మారిన భూమి మీద కొన్ని ప్రాంతాలలో ప్రాచీన రూపాలలో, ప్రకృతి వైపరీత్యాలకు లోబడి వెనుకబడిన వ్యవసాయం సాగుతున్నది. దానితో మధ్యతరగతి రైతాంగంతో సహా మన రైతాంగంలోని అత్యధిక సంఖ్యాకులు దయనీయమైన జీవితం గడపవలసి వస్తున్నది. పల్లెసీమలలో ఇవాళ్టికీ భూస్వాములు, వడ్డీ వ్యాపారులు, వర్తకులు, మత సంస్థలు రాజ్యం చలాయిస్తున్నారు. దేశంలో కొనసాగుతున్న అర్ధభూస్వామ్య ఉత్పత్తి సంబంధాలకు వెన్నెముక ఈ దోపిడీ వర్గాలే. ఈ వాస్తవాలన్నీ మన దేశం ఒక అర్ధ భూస్వామ్య దేశమని చూపుతున్నాయి' అని రాశారు.

అలాగే, భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) ప్రకటించిన భారత విప్లవపు వ్యూహం – ఎత్తుగడలు 'భారతదేశాన్ని మేం అర్ధభూస్వామ్యం అని ఎందుకంటున్నాం' అని ప్రశ్న వేసుకుని మరీ స్పష్టమైన జవాబు చెప్పింది: 'భూస్వామ్యాన్ని కూలదోసి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలోలాగ కాక, భారతదేశంలో బ్రిటిష్ వలసవాదం తన సామాజిక ఊతగా భూస్వామ్యాన్ని పరిరక్షించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలకులు విశాల రైతాంగ రాశుల మీద భూస్వామ్యపు పట్టును మౌలికంగా మార్చకుండానే పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్టిన ఫలితంగా అర్ధభూస్వామ్య ఉత్పత్తి సంబంధాలు నెలకొన్నాయి. వలసవాద ప్రత్యక్ష పాలన ముగిసిపోయిన తర్వాత కూడ దేశంలో అర్ధభూస్వామ్య ఉత్పత్తి సంబంధాలు కొనసాగాయి. సామ్రాజ్యవాదులు తమ నయావలస ఆధిపత్యానికీ దోపిడీకీ సామాజిక ఆధారంగా ఒకవంక దళారీ నిరంకుశ పెట్టుబడిదారీవిధానాన్నీ, మరొకవంక భూస్వామ్యాన్నీ వాడుకున్నారు. భారత ప్రజలకు శత్రువులైన ఈ మూడు వర్గాల మిలాఖత్తు వల్ల వ్యవసాయ వర్గ సంబంధాల మౌలిక నిర్మాణం మార్పు చెందలేదు. స్వాతంత్ర్యం అనబడేది వచ్చి అర్ధ శతాబ్ది గడిచిన తర్వాత కూడ భూసంస్కరణలు అమలు జరగలేదు. గ్రామసీమల్లో విశాల ప్రజానీకం మీద అధిక వడ్డీ రేట్ల, వర్తక దోపిడీ నిరాఘాటంగా సాగుతూనే ఉంది.

ఇవాళ్టికీ గ్రామసీమల స్థితి ఒకపక్క కొద్దిమంది భూస్వాముల, కులక్‌ల చేతిలో భూకేంద్రీకరణ, మరొకపక్క గ్రామీణ ప్రజానీకమంతా పేద, భూమిలేని రైతాంగంగా ఉండడంగా ఉంది. తత్ఫలితంగా భూమిలేని నిరుపేద వ్యవసాయ కూలీల సంఖ్య ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతూ పోతున్నది. ఉపాధి, ఉద్యోగావకాశాలు లేక వారు భూస్వాముల దగ్గరా, ప్లాంటేషన్ యజమానుల దగ్గరా కట్టుబానిసలుగా అమానుషమైన శ్రమ చేయవలసి వస్తోంది. ఉద్యోగావకాశాలు లేకపోవడంతో వారిలో అత్యధికులు దుర్భరమైన బతుకునీడుస్తున్నారు. లక్షలాది ప్రజలు అనారోగ్యంతోనో, ఆకలితోనో, అర్ధాకలితోనో చచ్చిపోతున్నారు.

దేశంలో భూస్వామ్య దోపిడీకి మరొక భయానకమైన కోణం అధిక వడ్డీరేట్ల దోపిడీ. రైతాంగం నుంచి విపరీతమైన వడ్డీ లాగబడుతున్నది. ప్రైవేటు వడ్డీ వ్యాపారులతో పాటు వివిధ బ్యాంకులు, ద్రవ్య సంస్థలు కూడ రైతాంగాన్ని దోపిడీ చేస్తున్నాయి. అందువల్ల గ్రామీణ రుణభారం నానాటికీ ఉరుకులు పరుగులుగా పెరిగిపోతున్నది. రైతాంగం తమ వ్యవసాయోత్పత్తులను అమ్మేటప్పుడు, మార్కెట్ నుంచి వ్యవసాయ ఉత్పత్తి కారకాలను కొనేటప్పుడు నిర్దాక్షిణ్యమైన వర్తకుల దుర్మార్గమైన దోపిడీ విశాల రైతాంగ జనావళి నుంచి మిగులునంతా పీల్చివేస్తున్నది. రైతాంగంలో అత్యధిక భాగాన్ని ఆక్రమించే పేద, భూమిలేని రైతాంగ ప్రజానీకం లెక్కలేనన్ని రూపాలలో భూస్వామ్యశక్తులకు బానిసలుగా, వ్యక్తిగతంగా లొంగిపోయి బతకవలసి వస్తున్నది. ఒకవైపు భావజాల నిర్మాణాలు, మరొకవైపు రాజ్యానికి చెందిన నిర్బంధ యంత్రాంగాలు, చివరికి ప్రైవేటు సైన్యాలు ఈ అధీనజీవనం యథాతథంగా సాగడానికి వీలు కల్పిస్తున్నాయి. స్థానిక నిరంకుశ ప్రభువులు, దుష్ట పెత్తందార్లు, మధ్య దళారీలు, పోలీసులు, న్యాయస్థానాలు, పొడవాటి ప్రభుత్వాధికారుల నిచ్చెనమెట్ల వ్యవస్థ దోపిడీ పీడనల ద్వారా, అనేక రకాల భూస్వామ్య కట్టుబాట్ల ద్వారా రైతాంగ ప్రజానీకపు జీవనాన్ని అతలాకుతలం చేస్తున్నారు. వీరందరూ సామ్రాజ్యవాదానికీ, భూస్వామ్యానికీ, దళారీ నిరంకుశ పెట్టుబడిదారీ విధానానికీ స్థానిక విధేయ సేవకులుగా పనిచేస్తున్నారు. ఇవన్నీ కలిసి రైతు జీవితం దుర్భరంగా, దుస్సహంగా మారిపోయింది. అయితే ఈ భూస్వామ్య పీడన గ్రామసీమలలో మాత్రమే, రైతు జనావళికి మాత్రమే పరిమితమై

లేదు. దానికి తోడుగా, అర్ధభూస్వామ్య ఉత్పత్తి విధానం దానికదిగానే రాజ్యాంగ యంత్రం ద్వారా, భావజాల, సాంస్కృతిక, తదితర ఉపరితల అంశాల ద్వారా మొత్తం దేశంలోని యావత్తు ప్రజానీకాన్నీ పీడనకు గురిచేస్తున్నది. అందువల్ల రైతాంగం మాత్రమే కాదు, దేశంలోని అశేష ప్రజానీకం భూస్వామ్యంతో వైరుధ్యంలో ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

భూస్వామ్య దోపిడీ పీడనలు కేవలం వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిని మాత్రమే కాదు, భారత పారిశ్రామిక అభివృద్ధి మార్గాన్ని కూడ అడ్డగిస్తున్నాయి. భూస్వామ్యం భారతదేశపు ఆర్థిక సామాజిక అభివృద్ధి మార్గానికి ప్రధాన అడ్డంకులలో ఒకటి. భూస్వామ్యానికీ అశేష ప్రజా బాహుళ్యానికీ మధ్య వైరుధ్యం దేశపు ప్రధాన మౌలిక వైరుధ్యాలలో ఒకటి.

ఈ కార్యక్రమం, వ్యూహం - ఎత్తుగడలు పత్రాలను మొదట 2004లో భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) కేంద్ర కమిటీ (తాత్కాలిక) తయారు చేయగా, 2007లో జరిగిన పార్టీ ఐక్యతా కాంగ్రెస్ ఈ పత్రాలను ధ్రువీకరించి, మౌలిక పత్రాలుగా ప్రకటించింది.

ఇటీవల, 2008లో కూడ, సిపిఐ (మావోయిస్టు) నుంచి చీలిపోయిన కర్ణాటక మావోయిస్ట్ ఇండిపెండెంట్ సెంటర్ ఈ అర్ధభూస్వామ్య సూత్రీకరణ మీద సందేహాలు వ్యక్తం చేసినప్పుడు, సిపిఐ (మావోయిస్టు) కేంద్ర కమిటీ ఒక సైద్ధాంతిక చర్చను నిర్వహించి సవివరమైన సమాధానం చెప్పింది.

ఆ సమాధానంలో, 'మనం ఉత్పత్తి విధానపు సమస్యను పరిశీలిస్తున్నప్పుడు, ఈ విషయం మీద లెనిన్ అందించిన సైద్ధాంతిక పునాది ప్రాతిపదికగా ఆ చర్చ చేయాలి. లెనినిస్టు అవగాహన ప్రకారం పరిగణనలోకి తీసుకోవలసిన అంశాలు ప్రధానంగా, వేతన శ్రమ స్వభావం, పరిమాణం; పెట్టుబడి సంచయం, విస్తృత పునరుత్పత్తి స్వభావం, పరిమాణం; గ్రామసీమలలో రైతాంగంలో వర్గవిభజన ఏ మేరకు జరిగింది; కౌలు రకాలు, పరిమాణం; రుణ, వడ్డీ వ్యాపార రకాలు, పరిమాణం; పెట్టుబడిదారీ సరుకు ఉత్పత్తినీ సాధారణ సరుకు ఉత్పత్తినీ పోల్చి చూసినప్పుడు వాటి పరిమాణం, స్వభావం; భూకేంద్రీకరణ పరిమాణం, స్వభావం; చేతివృత్తుల జనాభా పరిమాణం; ఉత్పాదకతా ధోరణులు; ఉపరితలాంశాల సమస్య; గ్రామంలో ఆధిపత్యంలో ఉన్న రాజకీయాధికార స్వభావం, ఆర్థికేతర నిర్బంధ రూపాల ఉనికి, పరిమాణం; ఆ ప్రాంతంలో పరిశ్రమల, తయారీ కర్మాగారాల పరిమాణం, పెరుగుదల, వగైరా. వ్యవసాయ మార్పులను తేవడంలో తయారీ పరిశ్రమల అభివృద్ధి ముఖ్యమైన అంశంగా ఉంటుందని లెనిన్ అన్నాడు. అంటే, గ్రామీణ భారతదేశంలో ఉత్పత్తి విధానం గురించి అధ్యయనం చేసేటప్పుడు మనం దాన్ని విడిగా చూడగూడదు. దాన్ని మిగిలిన భారత ఆర్థిక వ్యవస్థతో సంబంధంలోనూ, ముఖ్యంగా తయారీ పరిశ్రమల వృద్ధితో, తద్వారా పెరిగిన పెట్టుబడిదారీ సంబంధాల నేపథ్యంలోనూ పరిశీలించాలి' అని రాశారు.

అంటే, మొత్తం మీద దేశంలో ప్రధాన ఉత్పత్తి విధానం ఏమిటనే విషయంలోనూ, తత్ఫలితమైన సామాజిక పరివర్తనా వ్యూహం విషయంలోనూ భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు)కు 1960ల మధ్య నుంచి 2010ల వరకూ క్రమానుగతమైన, నిర్ద్వంద్వమైన వైఖరి ఉందని తెలుస్తుంది. ఆ పార్టీ మాత్రమే కాదు, స్వతంత్ర అధ్యయనాలు చేసిన ఎంతో మంది రాజకీయార్థిక శాస్త్రవేత్తలు కూడ నిశితమైన గ్రామ అధ్యయనాలు జరిపి, వ్యవసాయ సంబంధాల నిర్దిష్ట వాస్తవికతను పరిశీలించి ఇదేరకమైన అర్ధభూస్వామ్య సూత్రీకరణకు చేరారు, లేదా ఆ సూత్రీకరణను బలోపేతం చేశారు. ఆ రాజకీయార్థిక శాస్త్రవేత్తల విశ్లేషణలను స్థలాభావం వల్ల ఈ పత్రంలో భాగం చేయలేదు. నిజానికి ఆ విశ్లేషణల చరిత్రను, వివరాలను తెలుసుకోవడం మరింత ఆసక్తికరంగా, ఫలప్రదంగా ఉంటుంది.

## ఆంధ్రప్రదేశ్‌లో అధ్యయనాలు

ఇదివరకే చెప్పినట్టు, సిపిఐ (ఎం ఎల్) మొట్టమొదట ప్రతిపాదించిన అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణను కాలక్రమంలో వచ్చిన అన్ని పార్టీలూ, గ్రూపులూ అంగీకరిస్తూ వచ్చాయి. ఇతర అంశాల మీద ఎంత తీవ్రమైన భిన్నాభిప్రాయాలున్నప్పటికీ ఈ సూత్రీకరణకు సర్వత్రా ఆమోదం ఉంది. భారత సమాజపు అర్ధభూస్వామ్య స్వభావం గురించిన చర్చలో చాలమంది సామాజిక శాస్త్రవేత్తలతో పాటు కొన్ని పార్టీలు, గ్రూపులు కూడ దోహదం చేశాయి. సమాజ స్వభావం గురించి, ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్ గురించి భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు), దాని పూర్వరూపాలయిన సిపిఐ (ఎంఎల్) సిఓసి (1973-77), సిపిఐ (ఎంఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ (1977-80), సిపిఐ (ఎంఎల్) (పీపుల్స్ వార్) 1980-2004 చేసిన విశ్లేషణలకు మాత్రమే ఈ పత్రం పరిమితమవుతుంది.

వ్యవసాయరంగ పోరాటాలలో పాల్గొని, అధ్యయనం చేసిన అనుభవంతో విప్లవకారులు ఆంధ్రప్రదేశ్ లోని వ్యవసాయ సంబంధాల గురించి తమ తొలి విశ్లేషణను 1978లో వెలువరించారు. ఈ అధ్యయన పత్రం అంతకు ముందే వెలువడిన ఆత్మవిమర్శనా రిపోర్టు (1974), విప్లవానికి బాట (1976) అనే రెండు డాక్యుమెంట్లలోని సైద్ధాంతిక అవగాహనమీద, కొన్ని గ్రామాల నిర్దిష్ట అధ్యయనం మీద ఆధారపడింది. ఈ అధ్యయనం వ్యాసరూపంలో మొట్టమొదట సిపిఐ (ఎంఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటీ రహస్య అధికారపత్రిక ఎర్రజెండా ఏప్రిల్ - ఆగస్ట్ 1976 సంచికలో వెలువడింది. అదే పత్రం కొన్ని మార్పులు, చేర్పులతో విస్తృతమై వ్యవసాయ విప్లవం అనే పేరుతో 1978 మేలో బహిరంగంగా వెలువడింది.

వ్యవసాయ విప్లవం శతాబ్దాలుగా రాష్ట్రంలో కొనసాగిన వ్యవసాయ సంబంధాల చరిత్రను వివరించడం మాత్రమే కాదు, ప్రస్తుతం ఉనికిలో ఉన్న వ్యవసాయ సంబంధాల గురించి నిర్దిష్ట అధ్యయనానికి కూడ పూనుకుంది. నల్లగొండ, కృష్ణా జిల్లాలలో ఒక్కొక్క గ్రామం, ఆదిలాబాద్ జిల్లాలో రెండు గ్రామాలు - మొత్తం నాలుగు గ్రామాలు అధ్యయనం చేసి మొత్తంగా అర్ధభూస్వామ్య సమాజం ఉన్నదని వ్యవసాయ విప్లవం నిర్ధారించింది. కొనసాగుతున్న వ్యవసాయ సంబంధాల లక్షణాలెన్నిటినో సవివరంగా చిత్రించిన ఆ పుస్తకం ఆ అనుభవపూర్వక వాస్తవాల మీద ఆధారపడి తన నిర్ధారణలు చేసింది. అలా గుర్తించిన వాస్తవాలలో నమ్మకమైన నీటిపారుదల సౌకర్యాలు లేని, వెనుకబడిన వ్యవసాయోత్పత్తి స్వభావం; కాలంచెల్లిన పనిముట్ల, పద్ధతుల వాడకం; భూకమతాలలో అసమానత; ఎరువులు, రసాయనాల వంటి ప్రధాన ఉత్పత్తి కారకాలు

దిగుమతి చేసుకోవడం వల్ల నానాటికీ పెరిగిపోతున్న వ్యవసాయ ఉత్పత్తి కారకాల ధరలు; రసాయనాల వాడకం వల్ల భూసారం తగ్గిపోవడం; వ్యవసాయం లాభసాటిగా, గిట్టుబాటుగా లేని స్థితి; వ్యవసాయ అవసరాలకు తగినట్టుగా పశుగణాభివృద్ధి లేకపోవడం; వ్యవసాయంలో పెట్టుబడి మదుపు కొరత; రుణ, పరపతి సౌకర్యాల కొరత; వెట్టి, కట్టుబానిసత్వం వంటి భూస్వామ్య ఆచారాల కొనసాగింపు; తప్పుడు కొలతలు, తూకాలు; అధిక వడ్డీ రేట్లు; భూమి మీద తట్టుకోలేనంత ఒత్తిడి; వ్యవసాయ కూలీలకు ఏడాదికి ఆరు నెలలు కూడ పని కల్పించలేని వ్యవసాయ స్థితి; పెరిగిపోతున్న రుణభారం; అనేక భూస్వామ్య ఉపరితల ఆచారాలు వంటివెన్నో ఉన్నాయి.

ఈ దృశ్యం మీద ఆధారపడి, వ్యవసాయ విప్లవం దున్నేవారికే భూమి ఆవశ్యకతను ప్రత్యేకంగానూ, నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగమైన సర్వతోముఖ వ్యవసాయ విప్లవ అవసరం గురించి సాధారణంగానూ వాదించింది. వ్యవసాయ విప్లవపు ప్రధాన కర్తవ్యాలుగా ఆ పుస్తకం ఆరు అంశాలను ప్రతిపాదించింది: '1. దున్నేవారికే భూమి సూత్రం ప్రాతిపదికగా భూమిని తిరిగి పంచడం. 2. దేశంలో సాగుకు లాయకి అయిన భూమి అంతటికీ నీటిపారుదల సౌకర్యాలు కల్పించడం. 3. వ్యవసాయంలో యంత్రాలను ప్రవేశపెట్టడం ద్వారాను, ఆధునిక పద్ధతులను అమలుపరచడం ద్వారాను, ఉత్పత్తిని గరిష్ట ప్రమాణానికి పెంచడం. 4. రైతుల యొక్క రుణభారాన్ని నిర్మూలించడం. 5. ధరలను అదుపులో పెట్టడం. 6. దేశాన్ని పారిశ్రామికం చేయడం.

ఆత్మవిమర్శనా రిపోర్టు, వ్యవసాయ విప్లవం రెండూ కలిసి ఆంధ్రప్రదేశ్ లో, ప్రత్యేకించి తెలంగాణలో 1977-80 మధ్య కాలంలో నిజమైన ప్రజాపంథాలో విశాల సమరశీల వర్గపోరాటాన్ని నిర్మించడానికి బలమైన పునాదిని తయారు చేశాయి. అదే సమయంలో అప్పటికే ఏర్పడి ఉన్న రాడికల్ విద్యార్థి సంఘాన్ని (ఆర్ఎస్‌యు) బలోపేతం చేయడంతో పాటు, రాడికల్ యువజన సంఘం (రాడికల్ యూత్‌లీగ్ - ఆర్‌వైఎల్), రైతుకూలీ సంఘం, సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస) లను కూడ పార్టీ ఏర్పాటు చేసింది. భారత విప్లవోద్యమ చరిత్రలోనే మొదటిసారిగా 1978లో ఆర్ఎస్‌యు, ఆర్‌వైఎల్ లు 'గ్రామాలకు తరలండి' అనే చారిత్రాత్మకమైన నిర్ణయం తీసుకుని విద్యార్థి యువజన బృందాలను గ్రామసీమలకు పంపాయి. విప్లవ సందేశాన్ని ప్రచారం చేయడం, వర్గపోరాటాన్ని అభివృద్ధి చేయడానికి మొదటి మెట్టుగా గ్రామీణ ప్రజానీకాన్ని ప్రజాసంఘాలలో సంఘటితం చేయడం ఈ కార్యక్రమపు ఉద్దేశాలు. 1978 వేసవి నుంచి ప్రారంభించి ఆ తర్వాత ఒక దశాబ్దం పాటు ఈ కార్యక్రమం క్రమబద్ధంగా కొనసాగింది. ఈ కార్యక్రమంలో పాలుపంచుకున్న వేలాది మంది విద్యార్థి యువజనులు 8-10 మంది గల చిన్న బృందాలుగా ఏర్పడి, మొదట రెండు మూడు రోజుల సన్నాహక అధ్యయన తరగతులకు హాజరయ్యేవారు. ఆ తరగతుల్లో గ్రామీణ సమాజం, వ్యవసాయ సంబంధాలు, మార్క్సిస్టు తాత్విక దృక్పథం, రాజకీయార్థిక శాస్త్రం, వ్యవసాయ, నూతన ప్రజాస్వామిక విప్లవ భావనలు మొదలైన అంశాల మీద వారికి శిక్షణ ఇవ్వబడేది. ఆ తర్వాత ప్రతి బృందమూ వారం పది రోజుల పాటు దాదాపు పది పదిహేను గ్రామాలలో తిరిగి, అక్కడి ప్రజలతో మమేకమై, వారి నుంచి నేర్చుకుని, వారిని సంఘటితం చేసి, వారికి విప్లవ చైతన్యాన్ని అందించేది. ఈ బృందాలలో రాజకీయ ఉపన్యాసకులు, గాయకులు, సంఘకార్యకర్తలు తప్పనిసరిగా ఉండేవారు. వారిలో చాల మంది మొట్టమొదటిసారి గ్రామ స్థాయి ప్రజా సమీకరణ, సంఘ నిర్మాణం అనుభవాలు పొందారు. అలా వేలాది గ్రామాలలో ఈ ప్రచార దళాలు స్థానిక, గ్రామ స్థాయి ఆర్‌వైఎల్, రైతు కూలీ సంఘం శాఖలను ఏర్పాటు చేశాయి. అలా 1981లో రాష్ట్ర స్థాయి రైతుకూలీ సంఘం కూడ నిర్మాణమయింది. ఈ బ్రహ్మాండమైన, అపూర్వమైన కార్యక్రమం గురించి సమగ్ర కథనం ఇంకా రాయవలసే ఉంది గాని 'గ్రామాలకు తరలండి' కార్యక్రమం ఆంధ్రప్రదేశ్ గ్రామసీమలలో విప్లవ బీజాలను నాటడంలో విజయం సాధించిందని తెలుసుకుంటే ప్రస్తుతానికి సరిపోతుంది. ఈ కార్యక్రమంలో భాగంగా గ్రామాలలో ఉండిన వాస్తవ వ్యవసాయ సంబంధాలను అనివార్యంగా, సహజంగా అధ్యయనం చేయవలసి వచ్చింది. గ్రామంలో వర్గపోరాటానికి చోదకశక్తులెవరో, ఐక్యసంఘటన లో కలిసిరాగల మిత్రులెవరో, శత్రువులెవరో గుర్తించవలసి వచ్చింది. అంటే ఈ ఏకైక సమీకృత ఆలోచనాచరణ కార్యక్రమంలో అధ్యయనం, సమీకరణ, సంఘనిర్మాణం, పోరాటం కలగలసిపోయాయి.

ఈ అనుభవాలలో భాగంగా, పార్టీ మళ్లీ కరీంనగర్ జిల్లాలో నాలుగు గ్రామాలను (గౌరవెల్లి, మాణిక్యాపూర్, రామవరం, కొత్తపల్లి) తీసుకుని సవివరమైన అధ్యయనం చేసి, ఆ అధ్యయన ఫలితాలను 1982 ఏప్రిల్ లో దున్నేవానికి భూమి దక్కనిదే రైతాంగానికి విముక్తి లేదు అనే పుస్తకంగా ప్రచురించింది. ఈ పుస్తకానికి సంక్షిప్త ఇంగ్లిష్ అనువాదం 1983లో వాయిస్ ఆఫ్ ది వాన్ గార్డ్ పత్రికలో అచ్చయింది. గ్రామీణ సమస్యలను విశ్లేషిస్తూ ఆ పుస్తకం 'ఈ నాలుగు గ్రామాలు ఆ జిల్లాకు సంబంధించిన సగటు గ్రామీణ ఆర్థిక సంబంధాలను తెలియపరుస్తాయి' అని రాసింది.

ఈ నాలుగు గ్రామాల అధ్యయనంలో గుర్తించిన విషయాలు: 1. భూకమతాలలో అసమానత, 2. పశువులు, వ్యవసాయ పనిముట్లు, వగైరాల యాజమాన్యంలో అసమానత. 3. ప్రతి కుటుంబం మీద దుర్భరమైన రుణభారం. 4. రుణ పరపతి సౌకర్యాల లేమి. 5. గ్రామస్తులలో అతి ఎక్కువమందికి అవసరాలకూ ఆదాయానికీ మధ్య అఖాతం. 6. వ్యవసాయ కూలీలకు ఏడాది పొడవునా తగినంత పని దొరకక పోవడం. 7. గ్రామంలో వైద్య, ఆరోగ్య సౌకర్యాల లేమి. 8. తక్కువ స్థాయి విద్యాసౌకర్యాలు. 9. భూసంస్కరణల అమలులో వైఫల్యం. 10. వెట్టిచాకిరీ లాంటి జీతగాళ్ల పద్ధతి. 11. తక్కువ కూలీ, తప్పుడు కొలతలు, తూకాలు, అధిక వడ్డీ రేట్లు వంటి భూస్వామిక ఆచారాల ద్వారా కొద్దిమంది చేతుల్లో భూమి కేంద్రీకరణ. 12. అస్పృశ్యత. 13. చేతివృత్తుల కులాలు. 14. వ్యాపారస్తులు, ఉద్యోగులు.

ఈ కాలంలోనే ప్రత్యేకించి తెలంగాణలోను, మొత్తంగా ఆంధ్రప్రదేశ్ లోనూ జరిగిన వ్యవసాయ పోరాటాల గురించి వివరమైన కథనాలతో పార్టీ నాగేటి చాళ్లలో (1981), కరీంనగర్ - ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు వర్ధిల్లాలి (1982), మునుముందుకు సాగుతున్న రైతాంగ పోరాటాలు (1983), పీపుల్స్ వార్ తో చేయి కలిపి నడుస్తున్న లక్షలాది జనసమూహాలు (1990) ప్రచురించింది. ఈ పుస్తకాలన్నీ పరిమాణాత్మకంగా కాకపోయినా గ్రామీణ ప్రాంతాలలో కొనసాగుతున్న వర్గ సంబంధాలనూ, వివిధ రూపాల వర్గపోరాటాలనూ సవివరంగా చిత్రించాయి. పార్టీ వైపు నుంచి వచ్చిన ఈ వివరణలతో పాటు

**పట్టిక 1. గౌరవెల్లి – భూకమతాలు 1982-2012***

| కమతం | కుటుంబాల సంఖ్య 1982 | మొత్తం భూమి 1982 (ఎకరాలు) | కుటుంబాల సంఖ్య 2012 | మొత్తం భూమి 2012 (ఎకరాలు) |
|---|---|---|---|---|
| భూమిలేని నిరు పేదలు, చిన్న రైతులు | 298 | 239 | 361 | 355 |
| మధ్యతరగతి రైతులు | 184 | 796 | 212 | 1226 |
| ధనిక రైతులు | 44 | 610 | 20 | 300 |
| భూస్వాములు | 39 | 1158 | 3 | 60 |

*1982లో గౌరవెల్లి గ్రామపంచాయతీలో గుడాటిపల్లి కూడ కలిసి ఉండేది. ఆ తర్వాత దాన్ని వేరు చేశారు. అందువల్ల కూడికలలో తేడాలు కనబడతాయి.

**పట్టిక 2. మాణిక్యాపూర్ – భూకమతాలు 1982-2012**

| కమతం | కుటుంబాల సంఖ్య 1982 | మొత్తం భూమి 1982 (ఎకరాలు) | కుటుంబాల సంఖ్య 2012 | మొత్తం భూమి 2012 (ఎకరాలు) |
|---|---|---|---|---|
| భూమిలేని నిరు పేదలు, చిన్న రైతులు | 280 | 435 | 307 | 307 |
| మధ్యతరగతి రైతులు | 43 | 223 | 319 | 1393 |
| ధనిక రైతులు | 25 | 182 | 16 | 240 |
| భూస్వాములు | 24 | 577 | 10 | 320 |

సానుభూతిపరులు, పరిశీలకులు రాసిన కవితలు, కథలు, నవలలు ఎన్నో కూడ వెలువడ్డాయి. ఈ సాహిత్యమంతా గ్రామాలలో కొనసాగుతున్న అర్ధభూస్వామ్య సంబంధాలను చాల వివరంగా చిత్రించింది. ఈ భూస్వామ్య వ్యతిరేక పోరాటాలను రాజ్యం అత్యంత క్రూరంగా అణచివేసింది. ఎన్ కౌంటర్ల పేరిట వందలాది మంది కార్యకర్తలను, ప్రజలను చట్టవ్యతిరేకంగా హత్య చేయడం, వేలాది మందిని అరెస్టు చేసి చిత్ర హింసలకు గురి చేయడం, స్త్రీల మీద అత్యాచారాలు, అవమానాలు, వేలాది మంది సానుభూతిపరుల వేధింపులు, గ్రామాలను తగులబెట్టడం, ఆస్తిని విధ్వంసం చేయడం వంటి ఎన్నో రూపాలలో ఈ అణచివేత సాగింది. ఈ నిర్బంధకాండ పార్టీ మీద, ఆరు ప్రజాసంఘాల మీద 1992 మేలో చట్టబద్ధంగానే నిషేధం విధించడంతో పరాకాష్టకు చేరింది. ఆ తర్వాత పార్టీ, దాని ప్రజాసంఘాలు బహిరంగంగా తమ కార్యక్రమాలు సాగించలేక పోయాయి. చట్టబద్ధ పద్ధతులలో తమ అభిప్రాయాలను అచ్చువేసి బహిరంగంగా పంచలేకపోయాయి. 1995లోనూ, 2004లోనూ కొద్ది నెలల కోసం వచ్చిన విరామం మాత్రమే మినహాయింపు.

అయితే, అటువంటి భయంకరమైన నిర్బంధకాండ మధ్య కూడ పార్టీ శ్రేణులు తమ కార్యక్రమాన్ని కొనసాగించాయి. అనేక సమస్యలమీద ప్రజలను కదిలిస్తూ, సంఘటితం చేస్తూ, నాయకత్వం వహించాయి. వర్గపోరాటాన్ని మరింత ఉన్నతస్థాయికి తీసుకువెళ్లాయి. ఈ సమీకరణ, సంఘటిత నిర్మాణం, నాయకత్వ కృషిలో భాగంగా వారు నిర్దిష్ట వాస్తవికతను అధ్యయనం చేయడం కూడ కొనసాగించారు. ఇటీవల ముసాయిదా రూపంలో వెలువడిన ఒక పత్రం ప్రకారం, ఈ ఇరవై సంవత్సరాలలో పార్టీ కార్యకర్తలు వరంగల్ జిల్లా కొండాపూర్, లద్దునూరు, ఖిలా షాపూర్, అడవి కేశవాపూర్ గ్రామాలలో, ఏటూరు నాగారం ప్రాంతంలో, కరీంనగర్ జిల్లా గొర్రెపల్లిలో, మహబూబ్‌నగర్ జిల్లా మొలచింతపల్లిలో, ఆదిలాబాద్ జిల్లా మంగి ప్రాంతంలో, మొత్తంగా నిజామాబాద్ జిల్లాలో అధ్యయనాలు చేశారు. రాష్ట్రంలో స్వతంత్ర సామాజిక శాస్త్రవేత్తలు చేసిన అధ్యయనాలెన్నిటినో కూడ పార్టీ పరిగణనలోకి తీసుకుందని ఈ పత్రం చూపుతుంది. అలాగే పార్టీ అధికార పత్రిక క్రాంతిలో, సైద్ధాంతిక పత్రిక ఎర్రజెండాలో ఎన్నో అధ్యయనాలు అచ్చయ్యాయి.

ఈ అధ్యయనాలన్నిటినీ విశ్లేషిస్తూ, ఆ పత్రం, 'రాష్ట్రంలో గతంలో జరిగిన తీవ్రమైన వర్గపోరాట ఫలితంగా పాత ఫ్యూడల్ విధానంలో కొన్ని గణనీయ మార్పులు జరిగాయి. రాష్ట్రంలో ఈ ఐదు దశకాల్లో జరిగిన ఆర్థిక, రాజకీయ, సామాజిక సంస్థాగత మార్పుల్లో భాగంగా నూతన భూస్వామ్యవర్గం పుట్టుక, పాత భూస్వాములు తమ పెట్టుబడులను పట్టణ ప్రాంతాల్లోకి తరలించడం, భూస్వామ్య కుటుంబాల్లో నుండి ప్రభుత్వ, ప్రైవేట్ ఉన్నతోద్యోగాల్లో స్థిరపడటంతో వ్యవసాయం మీద ఆధారపడే భూస్వామ్య వర్గం స్థానంలో వ్యవసాయేతర గ్రామీణ పెత్తందార్ల (నాన్ కల్టివేటింగ్ రూరల్ జెంట్రీ) చేతుల్లో భూమి ప్రధానంగా కేంద్రీకరించబడింది. వీరు నూతన దోపిడీ పద్ధతుల్లో రైతాంగాన్ని పీల్చిపిప్పి చేసే విధానం ముందుకొచ్చింది. గతంలో వెట్టి, వడ్డీ, నాగులు, తప్పుడు కొలతలు, దండుగలు లాంటి ఆర్థికేతర దోపిడీ రూపాలతో పాటు అక్రమ శిస్తు, బంజరు, శిఖం, దేవాలయం భూములు హస్తగతం చేసుకొని భూస్వామ్య వర్గం రైతాంగాన్ని దోపిడీ చేసి మిగులు దక్కించుకునేది. మారిన పరిస్థితుల్లో ఈ దోపిడీ రూపాల స్థానంలో రాజకీయ, పాలన పరమైన విషయంలో పైరవీలు, ప్రభుత్వ భూములను అక్రమంగా హస్తగతం చేసుకోవడం, కౌలు దోపిడీ, మార్కెట్ – ప్రభుత్వ దోపిడీ, పెద్ద కాంట్రాక్టర్లుగా అవతారమెత్తి లిక్కర, ప్రభుత్వ టెండర్ల ద్వారా వేల కోట్ల రూపాయల దోపిడీ, గ్రామీణ పరపతి రంగాల్లో ఆధిపత్యం, రియల్ ఎస్టేట్ వ్యాపారం, నూతనం వ్యవసాయంలో ప్రవేశపెట్టబడిన ట్రాక్టర్లు, ఇతర యంత్రాలు లీజులకివ్వడం, అడ్తి వ్యాపారం నుండి మిగులును రాబట్టుకోవడం లాంటి నూతన దోపిడీ రూపాలు ప్రధానంగా ముందుకొచ్చాయి. గ్రామ వర్గపొందికలో గణనీయ మార్పులు రావడం, ఉత్పత్తిలో వక్రీకరించిన పెట్టుబడిదారీ సంబంధాలు కొంతమేరకు చోటు చేసుకోవడంతో అర్ధ ఫ్యూడల్ సంబంధాల్లో మార్పులు జరిగాయి. వ్యవసాయ విప్లవంలో 60, 70, 80 దశకాల్లో లాగా అదే మాదిరి వర్గ

వైరుధ్యాలు లేవు. వర్గ పొందికలో మార్పులు జరిగి వర్గ పోరాట తీరుతెన్నులలో కూడా మార్పులు రావడం సహజం. ఈ రోజు గ్రామాల్లో జరిగిన మార్పుల వల్ల గత శతాబ్దాల్లో గ్రామాల్లో భూస్వాములు, అందులో పెద్ద భూస్వామి ఒకవైపు తక్కిన విశాల ప్రజారాశులు మరోవైపు వుండి జరిగిన విప్లవ పోరాటాలుగా నేటి పోరాట స్థితి లేకుండా పోయింది. ధనిక, మధ్య తరగతి రైతుల్లో కొంతమంది నేడు నూతన భూస్వాములుగా ఎదిగి గ్రామాధిపత్యం చెలాయిస్తూ వుండడం, నేడు వర్గ పోరాటం వీరికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టాల్సి వుంటుంది. గ్రామంలో వర్గాల పొందికకనుగుణంగా విశాల ఐక్య సంఘటన అభివృద్ధి చెందుతుంది. నూతన పోరాట రూపాలు, డిమాండ్లు ముందుకు రావడం జరుగుతుంది' అని నిర్ధారించింది.

## రెండు గ్రామాల పునరధ్యయనం

ఒక విప్లవ పార్టీ అనుసరించిన ఆచరణ-అధ్యయనం-ఆచరణ-పునరధ్యయనం-పునరాచరణ అనే ఈ నిరంతర చరిత్ర నేపథ్యంలో, ఈ పత్రం కూడ 1980-82లో జరిగిన అధ్యయనాన్ని పునాదిగా చేసుకుని ఆ రెండు గ్రామాలను పునరధ్యయనం చేయాలని భావించింది. అప్పుడు అధ్యయనం జరిగిన నాలుగు గ్రామాలలో (గౌరవెల్లి, మాణిక్యాపూర్, రామవరం, కొత్తపల్లి) ప్రస్తుత అధ్యయనానికి రెండు గ్రామాలను (గౌరవెల్లి, మాణిక్యాపూర్) ఎంపిక చేసుకోవడం జరిగింది.

ఈ పునరధ్యయనపు ఫలితాలలోకి వెళ్లే ముందు మొదటి అధ్యయనం గురించీ, ప్రస్తుత పునఃపరిశీలన గురించీ కొన్ని వివరణలు ఇవ్వవలసి ఉంది. తొలి అధ్యయనంలో ఆ అధ్యయనకర్తలు ఉపయోగించిన సంవిధానం ఏమిటో, రైతాంగాన్ని విభజించడంలో వారి పునాది ఏమిటో, అప్పటి వాస్తవానికీ వారి అవగాహనకూ మధ్య ఏమైనా తేడా ఉందో తెలుసుకోవడానికి ప్రచురితమైన పుస్తకం తప్ప మరే ఆధారమూ లేదు. అప్పటి అధ్యయన పత్రం ఒక రాజకీయ డాక్యుమెంటు. అది ఆర్థిక రాజకీయ సమాచారాన్ని ఒక నిర్దిష్ట రాజకీయ దృక్పథంతో మేళవించింది. పోరాటంలో ఏ మౌలిక వర్గాలను సమీకరించాలో, ఏ వర్గాలకు వ్యతిరేకంగా పోరాటం నిర్వహించాలో ఆ పత్రం స్పష్టంగా, నిర్దిష్టంగా గుర్తించింది. అప్పటికి కొనసాగుతున్న వ్యవసాయ సంబంధాల పరివర్తన ఆవశ్యకతను ఆ పత్రం స్పష్టంగా చూపింది. ఆ పరివర్తన సాధించడానికి కచ్చితమైన రాజకీయ కార్యక్రమాన్ని ప్రకటించింది. ప్రస్తుత అధ్యయనం ముందర అటువంటి కార్యక్రమం లేదు. ముప్పై సంవత్సరాల కింద గుర్తించిన భౌతిక వాస్తవికతలో ఏమి మారిందో, ఏమి మారలేదో తెలుసుకోవాలనే పరిమిత కార్యక్రమంతో ఈ అధ్యయనం సాగింది. అందువల్ల మొదటి అధ్యయన పత్రం గుర్తించిన పద్నాలుగు పరిశీలనాంశాలను తీసుకుని వాటిలో ఏ మార్పులు వచ్చాయో, ఏవి యథాతథంగా కొనసాగుతున్నాయో ప్రస్తుతం పరిశీలించడం జరిగింది. అలాగే గత అధ్యయనంలో ఉనికిలో లేనివి, ఈ మధ్యకాలంలో తలెత్తినవి ఏమైనా ఉన్నాయో లేదో కూడ పరిశీలించడానికి ఈ పత్రం ప్రయత్నించింది.

## శ్రమ

1982 నాటి పరిస్థితితో పోల్చినప్పుడు, గ్రామంలో వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగింది. ఒక అర్థంలో వారు స్వేచ్ఛగానే, ఏ యజమాని పిలిచినా పోవడానికి సిద్ధంగానే ఉన్నారు. కాని తగినంత పనే లేదు. రెండు గ్రామాలలో దాదాపు సగం కుటుంబాలు వ్యవసాయ కూలీలుగా ఉన్నారు. కాని ఆ గ్రామాలలో వ్యవసాయ పనులు వారికి ఏడాదికి 90 రోజుల పని కల్పించడానికి కూడ సరిపోని స్థితిలో ఉన్నాయి. దున్నడం, నీళ్లు కట్టడం, కోత కోయడం వంటి పురుషుల పనులన్నీ ప్రస్తుతం యంత్రాల ద్వారానే జరుగుతున్నాయి. విత్తనాలు చల్లడం, నాటడం, కలుపు ఏరడం వంటి పనుల్లో స్త్రీలకు అవకాశం దొరుకుతోంది. నిర్మాణ పనులు, సేవా వృత్తులు, వలస, ఉపాధి హామీ పథకం వంటి వాటిలో రోజుకూలీలకు పని దొరుకుతున్నది గాని అది ఏడాదికి 6-7 నెలల కంటె తక్కువ మాత్రమే. ఇలా గ్రామాల నుంచి కూలీలను బైటికి తోస్తున్న పరిస్థితీ ఉంది. పట్టణాల నుంచీ, సేవారంగం నుంచీ వారిని లాగుతున్న పరిస్థితీ ఉన్నాయి గాని ఆ రెండూ సమానంగా లేవు. అలాగే గ్రామం లోపల వ్యవసాయ పనులకు అవసరమైన నైపుణ్యాలు, ఆ పనుల మీద ఆసక్తి తగ్గిపోతున్నట్టు కనబడుతున్నాయి. వ్యవసాయంలో శ్రమ అవసరం, శ్రమకు అవకాశం గణనీయంగా తగ్గిపోయాయి. డబ్బురూపం లో వేతనాలు పెరిగాయి గాని నిజవేతనాలు స్థిరంగానో, తగ్గిపోయో ఉన్నాయి. 1982 అధ్యయనం నాటికి వార్షిక కట్టుబాటుతో జీతగాళ్లు ఉండేవారు. వారు భూస్వాముల దగ్గర, ధనిక రైతుల దగ్గర దాదాపు కట్టుబానిసలుగా ఉండేవారు. అప్పుడు గౌరవెల్లిలో 106 మంది, మాణిక్యాపూర్‌లో 66 మంది జీతగాళ్లుండగా ప్రస్తుతం అది బాగా తగ్గిపోయి, గౌరవెల్లిలో 10 మంది, మాణిక్యాపూర్‌లో 26 మందిగా ఉంది.

భూమి 1982లో భూకమతాలలో అసమానత కొట్టవచ్చినట్టు కనబడేది. అప్పుడు గౌరవెల్లి గ్రామ జనాభాలో 5 శాతం మంది చేతుల్లో 44 శాతం భూమి, మాణిక్యాపూర్‌లో 5 శాతం మంది చేతిలో 39 శాతం భూమి కేంద్రీకృతమై ఉండేది. మరొకచివర, గౌరవెల్లి జనాభాలో 50 శాతం మంది, మాణిక్యాపూర్ జనాభాలో 48 శాతం మంది భూమిలేని నిరుపేదలుగా, చిన్న రైతులుగా ఉండేవారు. ప్రస్తుతం చూస్తే, 30 ఎకరాలకన్న ఎక్కువ భూమి ఉండి, భూస్వాములుగా లెక్కించదగిన వారు రెండు గ్రామాలలోనూ లేరు. ఇది గత 30 సంవత్సరాలలో కుటుంబాల లోపల జరిగిన విభజనల వల్ల కావచ్చు, లేదా భూస్వాములు తమ భూమిని అమ్ముకొని వెళ్లినందువల్ల కూడ కావచ్చు. అయితే గ్రామాలలో భూమిలేని నిరుపేదల, చిన్న కమతాల రైతుల సంఖ్యలో చెప్పుకోదగిన తరుగుదల కనబడలేదు. నిజానికి ఆ చిన్న కమతాలు కూడ ఎంత చిన్నవీ, వ్యవసాయం గిట్టుబాటు కానివీ అంటే వారిని కూడ భూమిలేని నిరుపేదల కిందనే లెక్కగట్టవచ్చు. భూమిలేని నిరుపేద కుటుంబాలు, చిన్న రైతు కుటుంబాలు యథాతథంగా కొనసాగుతున్నాయని చూపడానికి గౌరవెల్లిలో మొత్తం 490 కుటుంబాలలో 100 కుటుంబాలు పూర్తిగా భూమిలేని కుటుంబాలు. కాగా 85 దళిత కుటుంబాలు చిన్నరైతులుగా లెక్కకు వస్తున్నప్పటికీ ఆ 85 కుటుంబాలకు కలిసి ఉన్న మొత్తం భూమి 56 ఎకరాలు మాత్రమే. అలాగే మాణిక్యాపూర్ లోని మొత్తం 600 కుటుంబాలలో 150 కుటుంబాలు పూర్తిగా భూమి లేకుండా ఉన్నాయి. వారిలో 50 కుటుంబాలు దళితులవే. అలాగే మధ్యతరగతి రైతాంగం పెరుగుదల జరిగి, వారి కమతాలలో

చెప్పుకోదగిన వృద్ధి ఉంది. కాని నీటిపారుదల సౌకర్యాల కొరత వల్ల, ఉత్పత్తి కారకాల ధరలు హెచ్చుగా ఉండడం వల్ల ఈ మధ్యతరగతి రైతుల వ్యవసాయం కూడ సంక్షోభంలో ఉంది. చాల కుటుంబాలు పట్టణాలకు వలస వెళ్లి ఇతర వృత్తులలో స్థిరపడిన తర్వాత కూడ గ్రామంలో తమ భూమిని యథాతథంగా ఉంచుకుంటున్నారు. తమ ఆదాయంలో ఎక్కువ భాగాన్ని పన్ను కట్టనక్కరలేని వ్యవసాయాదాయంగా చూపుకోవడానికే భూమిని అలా ఉంచుకుంటున్నారు. అలాగే ఒక రక్షణగా, హోదా చిహ్నంగా కూడ భూమి ప్రాముఖ్యత ఇంకా తగ్గిపోలేదు. మొత్తం మీద గ్రామంలో భూయాజమాన్యపు అసమానత రూపం మారినప్పటికీ ఇతర రూపాలలో అసమానత కొనసాగుతూనే ఉంది.

## పశుగణం, వ్యవసాయ పనిముట్లు

1982లో పశుగణం, కర్ర నాగళ్లు, ఎడ్లబళ్లు లాంటి వ్యవసాయ పనిముట్లు చాల ప్రాధాన్యత వహించేవి. అప్పటి అధ్యయనం ఒక్కొక్క కుటుంబానికి ఈ ఆస్తులు ఎలా ఉన్నాయో వివరంగా జాబితా వేసింది. ప్రస్తుతం మాత్రం వ్యవసాయం కోసం పశువుల వాడకం, సాంప్రదాయిక పనిముట్లు వాటి అవసరాన్ని కోల్పోయాయి. వాటి సంఖ్య ఎంతగానో పడిపోయింది. గౌరవెల్లిలో 1982లో 1,076 ఎడ్లు ఉండగా, ప్రస్తుతం ఆ సంఖ్య 182కు పడిపోయింది. అలాగే ఎడ్లబళ్ల సంఖ్య 112 నుంచి 2కు పడిపోయింది. అదే విధంగా మాణిక్యాపూర్ లో పశువుల సంఖ్య 479 నుంచి 397కు, బళ్ల సంఖ్య 71 నుంచి 4కు పడిపోయింది. అయితే, కాలక్రమంలో ఈ రెండు గ్రామాలలోను పాడి పరిశ్రమ పెరగడంతో, పాలిచ్చే పశువులను ఆదాయ వనరుగా చూస్తున్నారు. అసమానంగానే అయినప్పటికీ అన్ని కుటుంబాలకూ పాడిపశువులు ఉన్నాయి. ఇక వ్యవసాయ పనిముట్ల విషయానికి వస్తే, వ్యవసాయ పనులన్నీ యాంత్రీకరణ చెందాయి. ఆ యంత్రాలు ధనిక రైతుల దగ్గరైనా ఉన్నాయి. లేదా ఆయా సమయాల్లో బైటినుంచి వచ్చే వ్యాపారులు అద్దెకు ఇస్తున్నారు.

**పట్టిక 3: గౌరవెల్లి – మార్పు సూచికలు కొన్ని**

| సూచిక | 1982 | 2012 |
|---|---|---|
| జీతగాళ్లు | 106 | 10 |
| వ్యవసాయ పశుగణం | 1076 | 182 |
| ఎడ్లబళ్లు | 112 | 2 |
| ఆయిల్ పంప్ సెట్లు | 146 | 0 |
| రుణభారం | రు. 8,95,000 | రు. 4.4 కోట్లు |

**పట్టిక 4: మాణిక్యాపూర్ – మార్పు సూచికలు కొన్ని**

| సూచిక | 1982 | 2012 |
|---|---|---|
| జీతగాళ్లు | 66 | 25 |
| వ్యవసాయ పశుగణం | 479 | 397 |
| ఎడ్లబళ్లు | 71 | 4 |
| ఆయిల్ పంప్ సెట్లు | 73 | 0 |
| రుణభారం | రు. 8,69,700 | రు. 2.26 కోట్లు |

## సాంకేతిక విధానం

గత ముప్పై సంవత్సరాలలో వ్యవసాయోత్పత్తి ప్రక్రియలో గాని, దైనందిన జీవితంలో గాని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానపు సాధనాలు వాడడం విపరీతంగా పెరిగిపోయింది. 1982లో వ్యవసాయంలో ఆయిల్ పంప్ సెట్లు మాత్రమే ఉండగా, ప్రస్తుతం ఎలక్ట్రిక్ పంప్ సెట్లు, బోరు బావులు, ట్రాక్టర్లు, అధిక దిగుబడి వంగడాలు, రసాయనిక ఎరువులు, సింథటిక్ క్రిమిసంహారక మందులు, బిందు సేద్యం పద్ధతులు, పంటకోత యంత్రాలు, దైనందిన జీవితంలో ద్విచక్ర వాహనాలు, మూడు చక్రాల ఆటోలు, ట్రాలీలు, మొబైల్ ఫోన్లు, టెలివిజన్ సెట్లు, వీడియో పరికరాలు ఎక్కడబడితే అక్కడ కనబడుతున్నాయి. పంటల సాగులో కూడ మార్పులు కనబడుతున్నాయి. సజ్జ, జొన్న వంటి ముడి తృణధాన్యాలు పూర్తిగా అదృశ్యమై పోయాయి. పత్తి, పూలు, పళ్లు వంటి వాణిజ్య పంటలు పెద్ద ఎత్తున ప్రవేశించాయి.

## సంచయన ప్రక్రియ

భూస్వాములకూ, పెద్ద/ధనిక రైతులకూ తప్ప మిగిలినవారికి వ్యవసాయం గిట్టుబాటుగా లేనందువల్ల వారి దగ్గర పోగుపడే మిగులు ఉండడం లేదు. రెండు గ్రామాలలోను భూస్వాములుగా, పెద్ద రైతులుగా చెప్పగలిగినవాళ్లు 5 శాతం కన్న తక్కువే గనుక పెట్టుబడి సంచయన ప్రక్రియ పెద్దఎత్తున లేదనే చెప్పవచ్చు. అయితే, పాడి పరిశ్రమలోను, ప్రభుత్వ పథకాలలోను, ఉద్యోగాలలోను ఆదాయం, మిగులు ఉన్నాయి. మాణిక్యాపూర్ లో చిన్న, మధ్యతరగతి రైతులు పశువుల వ్యాపారం, పళ్ల తోటలు గుత్తకు తీసుకోవడం, పాడి పరిశ్రమ, రియల్ ఎస్టేట్ వంటి రంగాలలో ప్రవేశించి చెప్పుకోదగిన ఆదాయం సంపాదించగలుగుతున్నారు. ఉజ్జాయింపుగా అంచనా వేస్తే ఈ రెండు గ్రామాలలో కూడ వ్యవసాయం, కల్లు వ్యాపారం, పాడి పరిశ్రమ, రోజు కూలీ వేతనాలు, సేవారంగాల ద్వారా సగటున సాలీనా రు. 7 కోట్ల ఆదాయం ఉంటోంది. ఇందులో కనీసం రు. 2–3 కోట్లు సంగ్రహించడానికి (సంచయనం చేయడానికి) వీలైన మిగులుగా ఉంది.

## మిగులు సంగ్రహం, మదుపు

తక్కువ వేతనాలు, స్థానిక వనరులకు తక్కువ విలువ కట్టడం, ఉమ్మడివనరులను కొల్లగొట్టడం వంటి పనులతో పాటు, సారా వ్యాపారం, మొబైల్ ఫోన్ సేవలు, ద్విచక్ర వాహనాలు, ఇంధనాలు, ప్రైవేట్ విద్య, వైద్య, ఆరోగ్య సేవలు, ఆధునిక సరుకులు, టెలివిజన్ కేబుల్, పండుగలు, పెళ్లిళ్లు, ఉత్సవాలు, మతాచారాలు వంటి మార్గాల ద్వారా ఈ మిగులును సంగ్రహించడం జరుగుతోంది. గ్రామంలో జరుగుతున్న ఖర్చులో అత్యధిక భాగం వినియోగానికీ, విలాసాలకూ వెళ్తున్నది. ఉత్పత్తి సాధనాల యాజమాన్యం, కులం, రాజకీయ, అధికార వర్గాలతో సంబంధం వంటి వాటి ద్వారా ఈ మిగులు సంగ్రహ ప్రక్రియ జరుగుతున్నది. కేవలం మాణిక్యాపూర్ గ్రామంలోనే సారా దుకాణాలు ప్రజల నుంచి రోజుకు రు. 50,000 (సాలీనా రు. 1.8 కోట్లు) కొల్లగొడుతున్నాయి. అంటే, మొత్తం మీద గ్రామాలలో పోగుపడుతున్న మిగులు, పొదుపు సొమ్ము తిరిగి ఉత్పాదక కార్యకలాపాలలోకి మదుపుగా రావడం లేదు. మాణిక్యాపూర్ మధ్యతరగతి రైతులు తమ వ్యవసాయ

కార్యకలాపాలు పెంపొందించుకోవడానికి పొరుగు గ్రామాలకు చెందిన 500 ఎకరాల భూమిని కొనుగోలు చేయడం ఒక అరుదైన ఉదాహరణ.

రుణభారం గత ముప్పై సంవత్సరాలలో గ్రామీణ రుణభారంలో ఎన్నో రెట్ల పెరుగుదల కనబడుతోంది. 1982లో గ్రామంలోని అన్ని కుటుంబాలకు కలిసి ఉన్న అప్పు గౌరవెల్లిలో రు. 8.95 లక్షలు, మాణిక్యాపూర్ లో రు. 8.7 లక్షలు. ఈ రుణభారాన్ని విడదీసి చూస్తే, గౌరవెల్లిలో 298 భూమిలేని నిరుపేద, చిన్నరైతు కుటుంబాలకు రు. 1.64 లక్షల అప్పు ఉండేది. కాని ఇప్పుడు గౌరవెల్లిలో కేవలం స్వయం సహాయ బృందాల నుంచే రు. 86 లక్షల రుణాలు పంపిణీ అయ్యాయి. దీనికి అదనంగా బ్యాంకు రుణాలు, మైక్రోఫైనాన్స్ రుణాలు, ప్రైవేట్ వడ్డీ వ్యాపారుల రుణాలు, వ్యక్తిగత బదుళ్లను కూడ కలుపుకోవాలి. ప్రస్తుతం గ్రామంలోని 120 దళిత కుటుంబాలకు కలిసి మొత్తంగా రు. 50 లక్షల రుణభారం ఉంది. ఈ అప్పులు ఉత్పాదక, వ్యవసాయక అవసరాలను తీర్చుకోవడానికి చేసినవి కాదని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. దీనిలో అత్యధిక భాగం రోజువారీ వినియోగానికి, ఆచార వ్యవహారాలకు, వైద్యానికి, విద్యకు ఖర్చయినదే. ఇంత పెద్ద మొత్తపు అప్పు నిజంగానే తలకు మించిన భారం. దీనికి ఎటువంటి ధరావత్తు కూడ లేదు. ఈ మొత్తం అప్పుకు అసలు చెల్లింపు ఎప్పుడైనా జరుగుతుందో లేదో తెలియదు గాని వడ్డీ చెల్లింపులు మాత్రం ఉపాధి హామీ పథకం, వృద్ధాప్య పింఛన్, వగైరా ప్రభుత్వ పథకాల ఆదాయాల నుంచి జరుగుతున్నాయి.

**పట్టిక 5: రెండు గ్రామాలలో మార్పులు**

| సూచిక | అదృశ్యమైంది | పెరిగింది | తగ్గింది | కొత్తగా తలెత్తింది |
|---|---|---|---|---|
| రోజు కూలీలు | | ✓ | | |
| జీతగాళ్లు | | | ✓ | |
| మధ్యతరగతి రైతులు | | ✓ | | |
| భూస్వాములు | | | ✓ | |
| భూకమతాల అసమానత | | | ✓ | |
| వ్యవసాయ పశువులు | | | ✓ | |
| కర్ర నాగలి / మానవ శ్రమతో | | | | |
| నీటిని తోడే సాధనాలు | ✓ | | | |
| ట్రాక్టర్, వ్యవసాయ పనిముట్లు | | ✓ | | |
| చేతివృత్తుల వాళ్లు | | | ✓ | |
| రుణభారం | | ✓ | | |
| సంస్థాగత రుణాలు | | ✓ | | |
| స్వయం సహాయ బృందాలు | | | | ✓ |
| మైక్రోఫైనాన్స్ | | | | ✓ |
| వడ్డీ వ్యాపారులు | | | ✓ | |
| పాడిపరిశ్రమ | | ✓ | | |
| ఉపాధి అవకాశాలు | | ✓ | | |
| సంక్షేమ పథకాలు | | ✓ | | |
| ఆరోగ్య సౌకర్యాలు | | ✓ | | |
| విద్యా సౌకర్యాలు | | ✓ | | |
| బహిరంగ భూస్వామ్య అలవాట్లు | | | ✓ | |
| అస్పృశ్యత | | | ✓ | |

పరపతి సౌకర్యాలు సంస్థాగత, తక్కువ వడ్డీ రేట్ల రుణ, పరపతి సౌకర్యాలు లేకపోవడం 1982లో వ్యవసాయ సంక్షోభానికి గల ప్రధాన కారణాలలో ఒకటిగా ఉండేది. అందువల్ల ప్రజలు అధిక రేట్ల వడ్డీ వ్యాపారుల కింద, భూస్వాముల కింద నలిగిపోతుండేవారు. ప్రస్తుతం గ్రామంలో పైకిచూడడానికి కొట్టవచ్చినట్టుగా అధిక రేట్ల వడ్డీవ్యాపారి-భూస్వామి మిలాఖత్తు కనబడడం లేదు. కాని గ్రామీణ రంగంలో ఎన్నో రకాల కొత్త వడ్డీవ్యాపార, డబ్బు చలామణీ మార్గాలు పుట్టుకొచ్చాయి. ప్రస్తుతం గ్రామంలో కనీసం 13 రకాల డబ్బు చలామణీ, రుణ, పరపతి సౌకర్య మార్గాలు ఉన్నాయని బయట పడింది. వీటిలో కొన్ని వడ్డీ రహితమైనవి కాగా 36 శాతం వడ్డీ రేటు ఉన్నవి కూడ ఉన్నాయి. అలాగే పంట కోతకు ముందే రానున్న వరి ధాన్యం ప్రాతిపదికగా అప్పు పెట్టడం, ఎరువులు, పురుగుల మందులు అధిక రేట్లతో పరపతిగా ఇవ్వడం, ధాన్యం వ్యాపారం వంటి పాత పద్ధతులు ఇంకా కొనసాగుతున్నాయి. స్వయం సహాయ బృందాలు, మహిళా పొదుపు బృందాలు, మైక్రో ఫైనాన్స్ సంస్థలు వంటి కొత్త రుణ, పరపతి మార్గాలు తలెత్తాయి. ప్రతి గ్రామాన్ని ఒక బ్యాంకు దత్తత తీసుకుని, ఆ గ్రామ రుణ అవసరాలు తీర్చాలనే నిబంధనలు రావడంతో సంస్థాగత రుణ పరపతి సౌకర్యాలలో మెరుగుదల వచ్చింది గాని, ఈ సౌకర్యాన్ని గ్రామంలోని పెత్తందారీ వర్గాలు మాత్రమే వాడుకోగలుగుతున్నాయి. ఇవాళ్టికీ ఒక గ్రామపు అవసరాల్లో సంస్థాగత రుణ పరపతి సౌకర్యాలు తీరుస్తున్నది 40 శాతం కన్న ఎక్కువ ఉండడం లేదు.

## సామాజిక సూచికలు

అతి ఎక్కువ మంది గ్రామస్తుల అవసరాలకూ ఆదాయానికీ మధ్య పెద్ద అఖాతం ఉన్నదని పాత అధ్యయనం గుర్తించింది. అప్పుడు గ్రామాలలో పోగుపడుతుండిన ఆదాయం ప్రజల కనీస అవసరాలైన కూడు, గుడ్డ, గూడులకు కూడ సరిపోయేది కాదు. ప్రస్తుతం గ్రామంలో ఆదాయ మార్గాలు చాల పెరిగిపోయాయి. కాని పేదరికం మాత్రం

అప్పటికన్న ఎక్కువ కొట్టవచ్చినట్టుగా ఉంది. అప్పుడు గ్రామంలో వైద్య, ఆరోగ్య సౌకర్యాలు ఏమీ లేవు. ప్రస్తుతం గ్రామాలకు మంచి రోడ్లు రావడంతో, గ్రామంలోనే ఒకరిద్దరు అశిక్షిత వైద్యులయినా ఉండడంతో ఆరోగ్య సౌకర్యాలు మెరుగుపడ్డాయి. కాని, ఇప్పటికీ ఆధునిక, సుశిక్షిత వైద్య సహాయం అందడం లేదు. ఖరీదైన ప్రైవేటు వైద్య సహాయం కోసం గ్రామస్తులు దూరాభారాలు వెళ్లవలసి వస్తున్నది. ప్రభుత్వ వైద్య ఆరోగ్య సౌకర్యాలు లేనేనా లేవు, ఉంటే సరిపోయినంతగానైనా లేవు. 1982లో విద్యాస్థాయి చాల తక్కువగా ఉండింది. గ్రామంలో విద్యావంతులైన యువకుల సంఖ్య, పాఠశాలకు వెళ్లే వయసు ఉన్న వారిలో విద్యార్థుల సంఖ్య దయనీయంగా ఉండింది. అందుకు భిన్నంగా ప్రస్తుతం గ్రామంలో విద్యావంతుల సంఖ్యలో గణనీయమైన మార్పు ఉంది. అలాగే తమ పిల్లలను పాఠశాలలకు పంపించాలనే ఆసక్తి గ్రామస్తులలో విపరీతంగా పెరిగింది.

1982 నాటికి గ్రామంలో భూస్వామ్య కట్టుబాట్లు బలంగా ఉండేవి. భూస్వాములు ఆ కట్టుబాట్ల ఆధారంగానే భూములు ఆక్రమించుకుంటూ ఉండేవారు. వారి దగ్గర పోగుపడిన సంపదంతా ఏళ్ల తరబడి ధాన్యం రూపంలో కూలీ, తప్పుడు కొలతలు, తూకాలు, కూలీ ఇవ్వకుండా పనిచేయించుకోవడం, వెట్టిచాకిరీ వగైరా భూస్వామ్య పద్ధతుల ద్వారా సమకూరిందే అని 1982 అధ్యయనం తెలిపింది. అధిక వడ్డీ రేట్లు కూడ ఈ జాబితాలో చేరాయి. ఈ దృశ్యంలో ఇప్పుడు కొన్ని మార్పులు వచ్చాయి. ధాన్య రూపంలో కూలీ రద్దయిపోయింది. (మంగలి, వడ్రంగి వంటి సేవా వృత్తులకు మాత్రం కొంతవరకు ఈ పద్ధతి అమలవుతున్నట్టుంది). తప్పుడు కొలతలు, తూకాలు ఉపయోగించే అవకాశాలు సన్నగిల్లాయి. వేతనాలు ఇవ్వకుండానో, సగం ఇచ్చో పని చేయించుకోవడం, వెట్టి చాకిరీ వంటివి కూడ లేకుండా పోయాయి. అధిక వడ్డీ రేట్లు రూపు మార్చుకున్నాయి.

అయితే, సాగు చేయని 'రైతు' కుటుంబాల చేతుల్లో భూమి కేంద్రీకరణ ఎక్కువవుతోంది. ఈ సాగు చేయని గ్రామీణ పెత్తందార్లు రాజకీయ, పాలనా పరమైన వ్యవహారాలలో మధ్యవర్తిత్వం, ప్రభుత్వ పనుల కాంట్రాక్టులు, గ్రామీణ ఆర్థిక లావాదేవీల నిర్వహణ, వర్తకం, ట్రాక్టర్లు, తదితర సాధనాలను అద్దెకు ఇవ్వడం, రియల్ ఎస్టేట్ వగైరా కొత్త పద్ధతుల ద్వారా మిగులును సంగ్రహించగలుగుతున్నారు.

అస్పృశ్యత, కుల వివక్ష 1982లో కొట్టవచ్చినట్టుగా కనబడుతుండేవి. చాల కులాలు తమ సాంప్రదాయిక వృత్తులను వదిలిపెట్టి కూలీలుగా మారిపోవడంతో ప్రస్తుతం కుల వివక్షలో మార్పు కనబడుతోంది. అస్పృశ్యతా సమస్య అప్పుడు ఉన్నంత నగ్నంగా ఇప్పుడు లేదు. అధ్యయనం చేసిన రెండు గ్రామాలలోను అస్పృశ్యత కనబడలేదు. గ్రామీణ వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో వడ్రంగులు, కమ్మరులు, కుమ్మరులు, సాలెలు వంటి చేతివృత్తుల కుల సమూహాల ప్రాధాన్యతను, వ్యవసాయ కార్యకలాపాలకు వారి కీలక సహకారాన్ని పాత అధ్యయనం గుర్తించింది. కాని గత ముప్పై సంవత్సరాలలో వీటిలో ఎన్నో వృత్తుల అవసరం తొలగిపోకపోయినా, బాగా తగ్గిపోయింది. ఆ కుల సమూహాలన్నీ వ్యవసాయేతర కార్యకలాపాలకు మారడమో, పట్టణాలకు వలస వెళ్లడమో జరిగింది. చాల సందర్భాలలో కుల అస్తిత్వం, కుల వివక్ష వృత్తి రంగంలో కాక భావజాల రంగంలో కొనసాగుతున్నాయి.

**కొత్త అంశాలు**

ఇంతకు ముందరి అధ్యయనంలో లేని, అప్పటికి ఉనికిలో లేని కొత్త అంశాలు కొన్ని ప్రస్తుతం వచ్చి చేరాయి. వలసలు, సేవారంగం పెరుగుదల, కొత్త సరుకుల ప్రవేశం, ప్రభుత్వ సంక్షేమ పథకాలు వంటి అంశాలు గత ముప్పై ఏళ్లలో కొత్తగా వచ్చినవి. ఈ కొత్త అంశాలు వ్యవసాయ సంబంధాలను మార్చడంలోగాని, కొనసాగించడంలో గాని ఏ పాత్ర నిర్వహించాయో అధ్యయనం చేయవలసి ఉంది. ఇటీవల గ్రామీణ ప్రాంతాలు అంతకంతకూ ఎక్కువ మంది ప్రజలను బైటికి తోస్తున్నాయి. భుక్తి, ఉపాధి ఎక్కడ దొరుకుతుందా అనే వెతుకులాటలో వారు గ్రామం వదిలి పట్టణాలవైపు వెళ్తున్నారు. అయితే గ్రామం నుంచి వికర్షణ - పట్టణపు ఆకర్షణ ప్రక్రియ ఈ మిగులు జనాభాకు అర్థవంతమైన జీవనోపాధి ఏమీ కల్పించడం లేదు. వారికి ఉద్యోగాలు కల్పించేందుకు తగిన స్థాయిలో ద్వితీయ, పారిశ్రామిక రంగ అభివృద్ధి లేదు. ప్రస్తుతం అధ్యయనం చేసిన రెండు గ్రామాలలోను వందలాది మంది ప్రజలు వలస వెళ్లారు గాని కనీసం ఒక్కరికైనా పారిశ్రామిక రంగంలో ఉద్యోగం, ఉపాధి దొరకలేదు. సమీప పట్టణాలలోను, గ్రామాలలోను పెరిగిన సేవారంగ వ్యాపకాలు ఈ ప్రజల శక్తినీ, సమయాన్నీ వాడుకుని, వారి నుంచి మిగులును సంగ్రహించగలుగుతున్నాయి. తద్వారా వారి జీవన ప్రమాణాలలో చెప్పుకోదగిన మెరుగుదల ఏమీ కనబడడం లేదు. లెక్కలేనన్ని ప్రభుత్వ సంక్షేమ పథకాలు ఈ ప్రజలను లబ్ధిదారులుగా, ఎవరు ఏమి ఇస్తారా అని ఎదురుచూసేవారిగా, ఇతరుల మీద ఆధారపడేవారుగా, ఆశ్రితులుగా, అనుత్పాదకులుగా తయారు చేస్తున్నాయి. కాని వారు సంపూర్ణమైన సృజనాత్మక, ఉత్పాదక శక్తిగా అభివృద్ధి చెందడానికి సహకరించడం లేదు.

**ముగింపు**

ముప్పై సంవత్సరాల కిందటి ప్రాతిపదిక అధ్యయనంతో పోల్చి జరిపిన ప్రస్తుత అధ్యయనం రెండు గ్రామాల్లోనూ చెప్పుకోదగిన కొనసాగింపు ఉన్నప్పటికీ ఎన్నో గణనీయమైన మార్పులు కూడ వచ్చాయని గుర్తించింది. చాల ఆసక్తికరమైన అంశమేమంటే ఈ ముప్పై ఏళ్లలో గ్రామీణ రంగంలో కొత్తగా తలెత్తిన అంశాలతో పోలిస్తే పూర్తిగా అదృశ్యమై పోయిన అంశాలు చాల తక్కువ. అంటే కొత్త ప్రవేశించింది గాని అది పాతను పూర్తిగా తుడిచిపెట్టలేదని అర్థం. ఇక మిగిలిన అనేక సూచికలలో అటు తరుగుదలలోనో, ఇటు పెరుగుదలలోనో పరిమాణంలో మార్పు మాత్రమే ఉంది. అంటే ఉత్పత్తి సంబంధాలలో గుణాత్మకమైన మార్పులు రాలేదనో, వచ్చినా సరిపోయినన్ని రాలేదనో చెప్పడానికి ఇది సూచిక కావచ్చునా ఆలోచించాలి. వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో అటువంటి గుణాత్మక పరివర్తన తీసుకురావడానికి వ్యవసాయ విప్లవంలోను, 1982 అధ్యయనంలోను సూచించిన కార్యక్రమాలు ఈ రెండు గ్రామాలలోను ఇప్పటికీ అవసరమైనవిగానే కనబడుతున్నాయి. ఆ సూచనలు మళ్లీ ఒకసారి చెప్పుకోవాలంటే దున్నేవారికే భూమి సూత్రం ప్రాతిపదికగా భూమిని తిరిగి పంచడమ్మ్మ్ నీటి పారుదల సౌకర్యాలు కల్పించడమ్మ వ్యవసాయంలో ఉత్పత్తిని గరిష్ఠ ప్రమాణానికి పెంచడమ్మ రైతుల రుణభారాన్ని నిర్మూలించడమ్మ ధరలను అదుపులో పెట్టడమ్మ పారిశ్రామికీకరణ,

గ్రామసీమలలో మొత్తంగానూ, వ్యవసాయ ఉత్పత్తి వ్యవస్థలలో ప్రత్యేకంగానూ ఎన్నో గణనీయమైన, దృశ్యమానమైన మార్పులు వచ్చాయి. అయినా ఈ కనబడే మార్పులతో సమానంగా ఉత్పత్తి సంబంధాల స్వభావంలో గాని, సామాజిక సంబంధాల స్వభావంలో గాని మార్పులు వచ్చినట్టు కనబడడం లేదు. రూపానికీ సారానికీ మధ్య అంతరం ఉంటుందనే తాత్విక అవగాహనకు ఇది మరొక రుజువు. అయితే సమస్య ఏమంటే రూపంలో మార్పులు సంఖ్యలో, పరిమాణంలో ఉండడం వల్ల కనబడుతుంటాయి. సారంలో మార్పులు గుణంలో, స్వభావంలో ఉండడం వల్ల అంత స్పష్టంగా కనబడవు.

ఇప్పటికే ఎందరో విశ్లేషకులు చెప్పినట్టుగా, ఒకటి రెండు గ్రామాలను అధ్యయనం చేసినంత మాత్రాన మొత్తం దేశానికి సంబంధించిన సంపూర్ణ చిత్రాన్ని రాబట్టలేం. స్థూల దృష్టిలో చూసినప్పుడు భారతదేశంలో ప్రధాన ఉత్పత్తి విధానం ఏమిటనే సాధారణ సమస్యనుగాని, అది అర్ధభూస్వామ్యమా, పెట్టుబడిదారీ విధానమా అనే ప్రత్యేక సమస్యను గాని ఒక విశాలమైన అవగాహనా చట్రంలో చూడవలసి ఉంటుంది. వ్యవసాయ రంగంలో మార్పులు – కొనసాగింపు, సామ్రాజ్యవాద దశలో పరిశ్రమ మీద, స్వతంత్ర పెట్టుబడిదారీ అభివృద్ధి మీద ఉండే ఆటంకాలు, భారత పాలక వర్గాల స్వభావమ్మ్ భారత కార్మికవర్గపు పెరుగుదల – స్వభావం వంటి అనేక అంశాలతో ఆ అవగాహనా చట్రం నిర్మాణమవుతుంది. అలాగే కొత్త అంశాల ప్రవేశం గురించీ, వాటి స్వభావం గురించీ, పాత్ర గురించీ జాగ్రత్తగా అర్థం చేసుకుని, వాటి సారంలోకి వెళ్లి నిర్దిష్ట పరిశీలనతో విశ్లేషించవలసి ఉంటుంది.

### సంప్రదించిన పుస్తకాలలో కొన్ని


ఆంధ్రప్రదేశ్ రైతు కూలీ సంఘం, 1983 – మునుముందుకు సాగుతున్న రైతాంగ పోరాటాలు, క్రాంతి ప్రచురణలు, సికిందరాబాద్.

ఆర్ ఎస్ రావు, 2010 – కొత్తచూపు, వీక్షణం పబ్లికేషన్స్, హైదరాబాద్.

ఎన్ వేణుగోపాల్, 2008 – కళ్లముందరి చరిత్ర – నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం: సమకాలీన వ్యాఖ్యలు, స్వేచ్ఛాసాహితి, హైదరాబాద్.

క్రాంతి ప్రచురణలు, 1981 – నాగేటి చాళ్లల్లో... రగిలిన రైతాంగ పోరాటం, క్రాంతి ప్రచురణలు, సికిందరాబాద్.

కొండపల్లి సీతారామయ్య, 2005 – వ్యవసాయ విప్లవం, కొండపల్లి సీతారామయ్య మెమోరియల్ కమిటీ, హైదరాబాద్.

కొండపల్లి సీతారామయ్య, 2005 – ఆత్మవిమర్శనా రిపోర్టు, తదితర రచనలు, కొండపల్లి సీతారామయ్య మెమోరియల్ కమిటీ, హైదరాబాద్.

పరమేశ్వర్, 2002 – భూపోరాటంలో వాస్తవాలు – వక్రీకరణలు, విప్లవ రచయితల సంఘం, హైదరాబాద్.

వరవరరావు, 1990 – సృజన సంపాదకీయాలు, పర్‌స్పెక్టివ్స్, హైదరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) జనశక్తి, 1994 – సిరిసిల్ల రైతాంగ పోరాటం – పూర్వాపరాలు, సిపిఐ (ఎం–ఎల్) జనశక్తి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ, హైదరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) (పీపుల్స్‌వార్), 1982 – దున్నేవానికి భూమి లభించనిదే రైతాంగానికి విముక్తి లేదు, క్రాంతి ప్రచురణలు, సికిందరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) (పీపుల్స్ వార్), 1982 – కరీంనగర్ – ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు వర్ధిల్లాలి, క్రాంతి ప్రచురణలు, సికిందరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) (పీపుల్స్ వార్), 1985 – భారత ఆర్థిక వ్యవస్థ – అర్ధ వలస అర్ధ భూస్వామ్య విధానం, క్రాంతి ప్రచురణలు, సికిందరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) (పీపుల్స్ వార్), 1990 – పీపుల్స్ వార్ తో చేయి కలిపి నడుస్తున్న లక్షలాది జన సమూహాలు, క్రాంతి ప్రచురణలు, హైదరాబాద్.

సిపిఐ (ఎం–ఎల్) విమోచన, 1992 – భారత వ్యవసాయ రంగపు అర్ధ భూస్వామిక స్వభావం, విమోచన, హైదరాబాద్.

Arvind (ed.), n.d. - Agrarian Question in India, Communist League of India (M-L), Delhi.

Balagopal, K, 1988 - Probings in the Political Economy of Agrarian Classes and Conflicts, Perspectives, Hyderabad.

Basu, Pradip, 2000 - Towards Naxalbari (1953-1967) - An Account of Inner-Party Ideological Struggle, Progressive Publishers, Calcutta.

Bhaduri, Amit, 2010 - Essays in the Reconstruction of Political Economy, Aakar Books, Delhi.

CPI (M-L) Central Committee, n.d. - Semi Feudal Character of Indian Agriculture, Resistance Publications, place not given.

CPI (M-L) (People''s War), 1983 - Indian Agriculture: Capitalist or Pre-Capitalist?, Voice of the Vanguard, Vol 1, Issues 1, 2 and 3, March, April and May.

CPI (M-L) (People''s War), 1983 - Struggle for Land is the Centre of All Peasant Struggles, Voice of the Vanguard, Vol. 1, Issues 5-6, July/August.

CPI (Maoist), 2004 - Party Prorgramme. Available on www.bannedthought.net/India/CPI-Maoist-Docs/Founding/Programme-pamphlet.pdf

CPI (Maoist), 2004 - Strategy & Tactics of the Indian Revolution. Available on www.bannedthought.net/India/CPI-Maoist-Docs/Founding/StrategyTactics-pamphlet.pdf

Damas, Marius, 1991 - Approaching Naxalbari, Radical Impression, Calcutta.

Diwakar, D M, 1994 - India - A Semi-Feudal Semi-Colonial State, Manak Publications, Delhi.

Ghosh, Suniti Kumar (ed.), 1992 - The Historic Turning Point - A Liberation Anthology, Vol. I, Author, Calcutta.

Ghosh, Suniti Kumar (ed.), 1993 - The Historic Turning Point - A Liberation Anthology, Vol. II, Author, Calcutta.

Gupta, D N (ed.), 1995 - Changing Modes of Production in India - An Historical Analysis, Hindu College, Delhi.

Karnataka Maoist Independent Center, 2006 - Dialectics of Revolution, Bulletin 1, December.

Lenin, V. I., 1977 - The Development of Capitalism in Russia in Collected Works, Vol. 3, Progress Publishers, Moscow.

Mao Tsetung, 1971 - Selected Reading from the Works of Mao Tsetung, Foreign Languages Press, Peking.

Mazumdar, Charu, 1982 - Eight Documents, Mass Line Publications, New Delhi.

Overstreet, Gene D. and Windmiller, Marshall, 1960 - Communism in India, The Perennial Press, Bombay.

Patnaik, Utsa (ed.), 1990 - Agrarian Relations and Accumulation - The ''Mode of Production'' Debate in India, Sameeksha Trust and Oxford University Press, Bombay.

Prasad, Pradhan H, 1989 - Lopsided Growth - Political Economy of Indian Development, Sameeksha Trust and Oxford University Press, Bombay.

Rao, M B (ed.), 1976 - Documents of the History of the Communist Party of India, Vo. VII, 1948-50, People''s Publishing House, New Delhi.

Rao, R S, 1995 - Towards Understanding Semi Feudal Semi Colonial Society, Perspectives, Hyderabad

Ray, Rabindra,1992 - The Naxalites and Their Ideology, Oxford University Press, Delhi.

Reddy, N Rajasekhara, 1977 - What is CPI''s Programme?, Communist Party Publication, New Delhi.

Revolutionary Communist Party, 2008 - Opportunists Never Understand Dialectics of Revolution - Central Committee, CPI (Maoist), June.

Rudra, Ashok, 1992 - Political Economy of Indian Agriculture, K P Bagchi & Company, Calcutta.

Sanyal, Kalyan, 2007 - Rethinking Capitalist Development - Primitive Accumulation, Governmentality & Post-Colonial Capitalism, Routledge, London.

Sau, Ranjit, 1986 - Economy Class Society, Universities Press, Madras.

Sen, Samar and others (eds.), 1978 - Naxalbari and After - A Frontier Anthology, Kathashilpa, Calcutta.

Shah, S. A. (ed.), 1983 - India - Degradation and Development, M Venkatarangaiya Foundation, Hyderabad.
Singha Roy, Debal K., 2004 - Peasant Movements in Post-Colonial India - Dynamics of Mobilisation and Identity, Sage Publications, New Delhi.
Thorner, Alice, (1982) - Semi-Feudalism or Capitalism? Contemporary Debate on Classes and Modes of Production in India, in Economic and Political Weekly, Vol. XVII, No. 49, 50 and 51, Decmber 4, 11 and 18.

*('భారత దేశంలో వ్యవసాయ పరివర్తన' అంశంపై 2011 జూలై 13-14 ల్లో గోల్డ్ స్మిత్స్, యూనివర్సిటీ ఆఫ్ లండన్, యూనివర్సిటీ ఆఫ్ ఆక్స్ ఫర్డ్ సంయుక్తంగా నిర్వహించిన సదస్సులో సమర్పించడానికి రాసిన పత్రం ఇది. వీసా సమస్యల వల్ల రచయిత వెళ్లలేకపోయినా, సదస్సులో ఈ పత్రం చదివి చర్చించారు. సదస్సు గురించి తొలి ప్రతిపాదన వచ్చినప్పుడు ఈ పత్రం రాయమని సూచించి, ప్రోత్సహించి, ఎన్నో ఆలోచనలు పంచుకున్న ప్రొ. ఆర్ ఎస్ రావు బౌద్ధిక, నైతిక ప్రోత్సాహానికి కృతజ్ఞతలు. ఈ పత్ర రచన మధ్యలోనే 2011 జూన్ 17న ఆయన అకాల మరణం ఈ పత్రంలోనూ, ఈ పత్ర రచయిత జీవితంలోనూ పూరించలేని ఖాళీలను మిగిల్చింది. అలాగే ఈ పత్ర రచనకు దోహదం చేసిన డా. ముదునూరి భారతికి కృతజ్ఞతలు. రచయిత సహచరులు యాటెల్లి రామచంద్రం, డి వి రామకృష్ణారావు ఈ అధ్యయన బాధ్యతను తమ తలకెత్తుకుని, కష్టనష్టాలకోర్చి, రెండు గ్రామాలకూ అనేకసార్లు వెళ్లి నిశితమైన పరిశోధన చేయకపోయి ఉంటే ఈ పత్ర రచన సాధ్యమై ఉండేదే కాదు. తమ జీవితం గురించీ, ఇబ్బందుల గురించీ విలువైన సమాచారాన్ని మాతో పంచుకోవడానికి హృదయ పూర్వకంగా సహకరించిన గౌరవెల్లి, మాణిక్యాపూర్ గ్రామస్తులకు కృతజ్ఞతలు సరిపోవు. ఎన్నో దశాబ్దాలుగా ఈ భావనను, ఆలోచనను అభివృద్ధి చేయడంలో తోడ్పడిన వందలాది మంది మావోయిస్టు ఉద్యమ కార్యకర్తల సహాయ సహకారాలను కృతజ్ఞతతో, గౌరవంతో తలచుకోవడం రచయిత బాధ్యత. ఇంగ్లిషులో ఈ పత్రం కనీసం మూడు సార్లు తిరగరాయడానికి తమ వ్యాఖ్యల ద్వారా, చర్చల ద్వారా సహాయపడిన అల్పా షా, బార్బరా హారిస్ వైట్, జెన్స్ లెర్చెలకు కృతజ్ఞతలు. ఈ పత్రంలో ప్రస్తావించిన అంశాల గురించి ఇంకా వివరంగా చర్చించవలసి ఉంది గాని ఆక్స్‌ఫర్డ్ సదస్సు విధించిన పదివేల పదాల పరిమితి వల్ల ఆ చర్చ జరగలేదు. పత్రంలో ఇంకా మిగిలిపోయిన పొరపాట్లకు రచయితదే బాధ్యత.)*

**పాదసూచికలు**

1. తొలిరోజుల భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) డాక్యుమెంట్లలో 'అర్ధ-వలస అర్ధ-భూస్వామ్య' అని రాశారు. అయితే ఇదే పదబంధం ఇదే పద్ధతిలో అన్నిచోట్లా లేదు. ఈ పదబంధంలో ఏ పదం ముందు, ఏ పదం వెనుక అనే విషయంలోను, ఇంగ్లిషులో రాసినప్పుడు అర్ధ తర్వాత అడ్డుగీత ఉండాలా అక్కర్లేదా అనే విషయంలోను అటు విద్యాసంబంధమైన రచనలలోను, ఇటు పార్టీ సాహిత్యంలోను ప్రామాణికమైన, ఒకేరకమైన పద్ధతి లేకపోవడం గమనార్హం.

2 వీరిలో 1970లలో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీ నుంచి విడిపోయి రూపొందిన కమ్యూనిస్ట్ లీగ్ ఆఫ్ ఇండియా (ఎం - ఎల్) నుంచి 2006లో భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) నుంచి చీలిపోయిన కర్ణాటక మావోయిస్ట్ ఇండిపెండెంట్ సెంటర్ వరకు అనేక ఛాయల అభిప్రాయాలు ఉన్నాయి.

3. వారిలో ప్రధానంగా చెప్పవలసిన వారు ఆర్ ఎస్ రావు, అమిత్ భాదురి, ప్రధాన్ ఎచ్ ప్రసాద్, నిర్మల్ కుమార్ చంద్ర, రంజిత్ సావు.

4. మే 1992లో పార్టీ మీద నిషేధం విధించేవరకూ ఈ పుస్తకం అరడజను కన్న ఎక్కువసార్లు పునర్ముద్రణలు పొందింది. తొలి ముద్రణలో అది సిపిఐ (ఎంఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటీ పేరు మీద వెలువడగా, 1980ల తర్వాత పునర్ముద్రణలు సిపిఐ (ఎంఎల్) (పీపుల్స్ వార్) పేరు మీద జరిగాయి. ఇది కొండపల్లి సీతారామయ్య రచనగా సుప్రసిద్ధమైనప్పటికీ ఈ ముద్రణలు వేటిలోనూ రచయిత పేరు లేదు. ఆయన మరణించిన తర్వాత కొండపల్లి సీతారామయ్య స్మారక కమిటీ ప్రచురణగా 2002లో వెలువడినప్పుడు, ఇది ఆయన రచనగా అచ్చయింది.

5. ఆంధ్రప్రదేశ్ లో వ్యవసాయ ఉత్పత్తి సంబంధాలు అనే ఈ పత్రం 2009 జూలైలో రాసినప్పటికీ, ఈ ఆక్స్‌ఫర్డ్ సదస్సు (2011) నాటికి ముసాయిదా రూపంలో ఉండింది. ఆ తర్వాత 2012 జూలైలో విరసం ప్రచురణగా వెలువడింది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# వీక్షణం పాఠకులందరికీ నూతన సంవత్సర హార్దిక శుభాకాంక్షలు

వీక్షణం పత్రిక దశాబ్ది కాలం పూర్తి చేసుకున్న సందర్భంగా ప్రజా పత్రికను అభినందిస్తున్నాం. గత పది సంవత్సరాలుగా ప్రజల పక్షాన ఉంటూ, నిర్భయంగా ఉన్నది ఉన్నట్టు రాస్తూ ఎంతో మందిని ఆలోచింప చేస్తున్నది. వీక్షణం చదువుతున్న ప్రతి పాఠకుణ్ని సామాజికంగా ఆలోచింపజేస్తూ, ఆచరణ దిశగా నడిపిస్తున్నది. వీక్షణంకు ఎన్ని ఆర్థిక ఇబ్బందులు వచ్చినా, ఎంతో ఓర్పుతో పత్రికను ముందుకు నడుపుతున్న సంపాదకులను, సిబ్బందికి మా ధన్యవాదాలు తెలుపుతున్నాం. వీక్షణంలో వస్తున్న వ్యాసాలు మప్పై ఏళ్ల తరువాత గౌరవెల్లి, మాణిక్యాపూర్, లక్షింపేట, ఆదివాసి పోరాటాలు మమ్ములను ఎంతో ఆలోచింప చేశాయి. 'వీక్షణంకు మీ చేయి అందించండి' అనే విజ్ఞప్తి పత్రిక ఆర్థిక ఇబ్బందులు ఎంత భయానకంగా ఉన్నాయో తెలియజేస్తుంది. సామాజిక, రాజకీయార్థి పత్రికగా ప్రజా ఉద్యమాలను ప్రేమిస్తూ ప్రజల పక్షాన గొంతు ఎత్తుతున్న మన ప్రజా పత్రిక వీక్షణంకు మా వంతుగా శ్రమజీవి సంఘం తరపున ఆర్థిక సాయం అందిస్తున్నాం. ఇంకా వీక్షణం పత్రికను ప్రజల మధ్యకు తీసుకపోయే ప్రయత్నం చేస్తాం. వీక్షణం ముందుకు పోవాలని ఆశిస్తున్నాం.

## శ్రమజీవి సంఘం, ముంబాయి



Advt.

# ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఆత్మహత్యల 'అభివృద్ధి'

*ప్రభుత్వ విధానాల ఫలితంగా రుణభారంతో బతుకులు బలిచేసుకుంటున్న నిస్సహాయ రైతు సోదరుల దీనగాథలను, ప్రభుత్వ నిర్లక్ష్యాన్నీ, ప్రజాస్పందననూ వివరిస్తున్నారు* **కె.సజయ, రమ మెల్కోటె, బి.కొండల్‌రెడ్డి**

నిస్తేజమైన చూపులు. భయపెట్టే బతుకు. అర్థంకాని పిల్లల భవిష్యత్తు. వ్యవసాయం బతుకునిస్తుందనుకున్నారు. కానీ, నలుగురికీ అన్నం పెట్టే రోజులు పోయి అర్థాంతరంగా ప్రాణాలు తీసుకోవాల్సి వచ్చింది. పొరపాటు ఎక్కడ జరిగిందో, ఎవరు ఎక్కడ తీసుకున్న నిర్ణయాలకి తమ జీవితాలు బజారున పడ్డాయో అర్థం కాని కలవరం. కట్టుకున్న భార్యనే బాధ్యురాలిగా చేసి ప్రతి ఒక్కరి సూటిపోటీ మాటలు. సానుభూతి లేని అధికార యంత్రాంగం. కడుపు మండం తిండిపంటలు వేద్దామంటే భర్త వినలేదు. 4-5 సంవత్సరాలు వరుసగా మొక్కజొన్న పంటే వేశాడు. ఒకసారి అధికవర్షం, మరోసారి వర్షం అసలు లేకపోవడం, ఒకసారి పంట బాగుందనుకుంటే చీడ సోకింది. అప్పుల మీద అప్పులు చేసి పురుగు మందులు జల్లినా పంటకు పట్టిన పురుగులు చావలేదు. పెరిగిపోయిన అప్పులతో ముగ్గురు పిల్లల భవిష్యత్తు ఏమవుతుందో అనే భయం ఊపిరాడనివ్వలేదు. అందుకే ఇంక అప్పులు వద్దని గట్టిగా వారించింది. భార్య మాటలవల్లే, అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడని నింద మోపారు. తాను భర్తతో గొడవ పడలేదని గొంతు నాళాలు పగిలేలా భోరున విలపించింది బాలలక్ష్మి. ఆమెది మెదక్ జిల్లా తొగుట మండలం జప్తులింగారెడ్డిపల్లి. ఆపలేని ఆమె దు:ఖమే నేటి వ్యవసాయరంగ దుస్థితికి అద్దం పడుతుంది.

బాలలక్ష్మిని 2007 ఫిబ్రవరి 4న మా బృందం కలిసినప్పుడు ఎదురయిన సంఘటన ఇది. ఆమె భర్త నీల బాలయ్య 27-8-2006 వినాయక చవితి రోజున పంట కోసం తెచ్చిన పురుగుమందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ రోజు భారతదేశంలో అరగంటకొకటి చొప్పున మోగుతున్న రైతు మృత్యుఘంటికల్లో ఇది కూడా ఒకటి.

ప్రపంచవ్యాపితంగా వస్తున్న వివిధ సామాజిక సంక్షోభాలలో ఇప్పుడు ప్రధానంగా కలవరపరుస్తున్న అంశం పెరుగుతున్న ఆత్మహత్యలు. అది విద్యార్థులు, యువత, కార్మికులు, రైతులు ఎవరైనా కావొచ్చు. ఆత్మహత్యలను సమస్యలకు పరిష్కారంగా ఎప్పటికీ చెప్పలేం కానీ, వీటికి దారితీస్తున్న ఆర్థిక, రాజకీయ, సామాజిక నేపథ్యాలను విశ్లేషించాల్సిన, పరిష్కారాల కోసం అన్వేషించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

అందుకే 2007 నుంచి మేము కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్, ఆహారభద్రత సలహాదారుల కార్యాలయం, అమన్‌వేదిక, శ్రామిక వికాస కేంద్రం, రైతు సేవా సమితి, డిబిఎఫ్, రైతు ఆత్మహత్యల బాధిత కుటుంబాల పోరాట వేదిక, యుగాంతర్, కమిట్‌మెంట్స్, హెచ్‌ఆర్‌ఎఫ్‌లతో కలిసి మెదక్, వరంగల్, మహబూబ్‌నగర్ జిల్లాలలో 300 పైన కుటుంబాలనూ, 2011 నుంచి సి.యస్.ఏ, పిలుపు, ఎయస్‌డిఎస్, పీస్, అడ్రస్, రైతు ఆత్మహత్యల నివారణ కాంపెయిన్, ఆంధ్ర, ఆశ్రయ్, యాక్షన్ ఎయిడ్, రైతు స్వరాజ్య వేదికలతో కలిసి తెలంగాణ, రాయలసీమ, కోస్తా జిల్లాలలో కలిసి సందర్శించిన దాదాపు 100 పైన రైతు ఆత్మహత్య బాధిత కుటుంబాల దుఃఖాన్ని ఈ వ్యాసానికి నేపథ్యంగా తీసుకుంటున్నాం. గణాంకాలు, అంకెలతో మానవ సంబంధాల్లోని సంక్షోభాన్ని వివరించే ప్రయత్నం ఈ వ్యాసం ఉద్దేశ్యం ఎంత మాత్రం కాదు. బహుశా ప్రభుత్వాలు, ప్రభుత్వ యంత్రాంగం, పరిశోధనా సంస్థలు ఇంకా ఇతర వ్యవస్థలకు ఇవన్నీ బలవన్మరణాలుగా నమోదవుతున్న గణాంకాలు మాత్రమే. కానీ ఆయా కుటుంబాలకు మాత్రం తీరని దుఃఖం. ఎంత గోస పెట్టుకున్నా తిరిగిరాని మానవ ఆత్మీయ సంబంధం. వయసైపోయిన తల్లిదండ్రులకు ఆధారమయిన కొడుకు, భార్యకు జీవితాంతం తోడుంటానని చెప్పిన భర్త, పిల్లలకు నేనున్నాననే భరోసా అందించే తండ్రి, తోడబుట్టినవాళ్లకు అండైన అన్న, తమ్ముడు ఇలా ఇన్ని రకాల ఆత్మీయ సంబంధాలలోనుంచి హఠాత్తుగా ఒక వ్యక్తి బలవంతంగా మాయమయితే ఆ కుటుంబం జీవితాంతం ఈ గాయాల బాధను భరిస్తూ బతకవలసిందే కదా.

### ఆత్మహత్యల నేపథ్యం-వ్యవసాయరంగం-ప్రపంచీకరణ

జైజవాన్, జైకిసాన్ అనేది ఒకప్పుడు జాతి నినాదం. ఇప్పుడు దానిలో జైకిసాన్ పరిస్థితే ఆగమ్యగోచరంగా మారింది. ప్రతిరోజూ వాతావరణ సూచికలను ఇచ్చినట్లుగా వార్తా పత్రికలు నిత్యం రైతు ఆత్మహత్యల సమాచారాన్ని అందిస్తున్నా గానీ అవి ఏ ప్రభుత్వాన్నీ కదిలించలేక పోతున్నాయి. గత పదిహేడు సంవత్సరాల కాలాన్ని తరచి చూస్తే అరగంట కొక రైతు ఆత్మహత్య చొప్పున 1995-2011 వరకూ అక్షరాలా 2,70,940 ఆత్మహత్యలు జరిగాయి. దీనిలో మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, చత్తీస్‌ఘడ్, మధ్యప్రదేశ్ ఈ ఐదు రాష్ట్రాలలో జరిగిన రైతు ఆత్మహత్యలే 64 శాతం ఆక్రమించాయి. మహారాష్ట్ర 53,818 రైతుల ఆత్మహత్యలతో మొదటి స్థానంలో ఉంటే, ఆంధ్రప్రదేశ్ 33,326 రైతు ఆత్మహత్యలతో రెండో స్థానంలో నిలిచింది. ఈ గణాంకాలన్నీ కూడా ప్రభుత్వ యంత్రాంగమైన జాతీయ నేరపరిశోధన సంస్థ సంకలనం చేసినవే. (2011 ఎన్‌సిఆర్‌బి పట్టికలు చూడండి.) ఇప్పటివరకైతే ఇదే ప్రామాణికం. ఇవికాక దేశవ్యాపితంగా వివిధ ప్రజాసంఘాలు, యూనివర్సిటీ పరిశోధనా సంఘాలు, ప్రచార, ప్రసార మాధ్యమాలలో వస్తున్న వార్తలు సమస్య తీవ్రతను తెలియజేస్తూ వస్తున్నాయి. ప్రారంభ సంవత్సరాలలో పౌరసమాజ కృషితో ప్రభుత్వాలలో కొంత కదలిక వచ్చింది గానీ సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ పట్టించుకోకపోగా బాధితులైన రైతుకుటుంబాల మీదనే బండలు వేస్తున్నారు. రైతు

ఆత్మహత్యల అంశం ఇప్పుడు ప్రభుత్వాలకి అప్రధాన విషయం. ఏ రాజకీయ పార్టీ అయినా మాట్లాడుతోంది అంటే అది వారి తాత్కాలిక రాజకీయ ప్రయోజనాంశాల కోసమే తప్పించి నిజంగా సమస్య పరిష్కారానికి దారిచూపే విధానాల గురించి మాట్లాడుతున్నారా అనేది తరచి చూసుకోవాల్సిందే. రోజు రోజుకి రైతు ఆత్మహత్యల విషాదం పెరుగుతోందే తప్పించి దీనిని ఆపగల విధాన పరమైన చర్యలు శూన్యం. వ్యవసాయం సంక్షోభంలో ఉందని విధాన నిర్ణేతలు, బాంకులు, ప్రభుత్వ పాలనా యంత్రాంగం అందరూ నిర్ధారిస్తూ అంగీకరిస్తున్న విషయమే కానీ చనిపోతున్న వారిని మాత్రం నిజమైన రైతులుగా అంగీకరించడానికి ఏ వ్యవస్థలూ ఇప్పుడు సిద్ధంగా లేవు. వ్యవస్థల దృష్టిలో ఇవి వ్యక్తిగత కారణాలు, వ్యసనాలతో జరుగుతున్నవే కానీ వ్యవసాయ సంబంధిత ఆత్మహత్యలు కావు.

అసలు రైతులుగానే గుర్తించబడని వీళ్లు బతుకు భారమై ఆత్మహత్యలు చేసుకోవలసిన పరిస్థితి ఎందుకు వస్తోంది? ఈ పదిహేడు సంవత్సరాల కాలంలో ఏం జరిగింది? వ్యవసాయం సంక్షోభంలోకి ఎందుకెళ్లింది? వ్యవసాయ సంక్షోభానికి సూచికలుగా ఈ రైతుల ఆత్మహత్యలను ప్రభుత్వాలు ఎందుకు గుర్తించడంలేదు? అన్నీ ప్రశ్నలే. ప్రభుత్వాల దృష్టిలో అప్రధానమయిపోయిన మరో అంశం దేశంలో 46 శాతం మంది పిల్లల్లో పెరుగుతున్న పౌష్టికాహార లోపం. వీరందరూ గ్రామీణ, ఆదివాసీ, పట్టణ పేదవర్గాలకు చెందిన వారే. కొద్ది సంవత్సరాల క్రితం ఆకలి చావులు కూడా నమోదు అయ్యాయి. కానీ వీటిని కూడా అంగీకరించడానికి ప్రభుత్వాలు సిద్ధంగా లేవు. ఈ మూడు అంశాలు వ్యవసాయరంగంలో వచ్చిన సంక్షోభానికి సూచికలు.

వ్యవసాయరంగంలో వచ్చిన సంక్షోభాన్ని విశ్లేషించాలంటే ముందుగా 1980ల చివరి నుంచీ మనదేశ ఆర్థిక విధానాలలో వచ్చిన మార్పుల గురించి తెలుసుకుని తీరాలి. 1980 దశకం నుంచీ మనదేశంలో అమలులోకి వచ్చిన నూతన ఉదారవాద ఆర్థిక విధానాల ప్రభావం ఏమిటనేది వెంటనే అర్థం కానప్పటికీ ఇప్పుడు దాని ప్రభావం స్పష్టమే. అప్పటినుంచే విధాన నిర్ణయాలలో వ్యవసాయరంగ ప్రాధాన్యం తగ్గింది. వ్యవసాయానికి అవసరమైన సమస్త వనరులు మార్కెట్ మాయాజాలానికి చిక్కుకున్నాయి. అంతర్జాతీయ మార్కెట్‌లకు మనదేశం గేట్లు తెరిచేసింది. అందుకనుగుణంగా దేశీయ మార్కెట్లు సరళీకరించబడ్డాయి. విత్తనాలు, ఎరువులు, నీటిపారుదల, కరెంటు, వ్యవస్థీకృత రుణాలు, వ్యవసాయ ఉత్పత్తుల మార్కెట్, ఆర్థిక సంస్కరణల చుట్టూ తిరిగాయి. తిరుగుతున్నాయి.

జాతీయ స్థాయిలో ఆహార భద్రతను పెంచాలంటే దానికి కావలసింది స్థానికంగా ఆహార ఉత్పత్తులను పెంచాలి తప్పించి దిగుమతుల ద్వారా ఆహార ఉత్పత్తులను పొందడం కాదు. ఇదే సరళీకరణ విధానం తీసుకువచ్చిన మార్పు. స్థానిక ఆహార ఉత్పత్తికి కావలసిన వనరులను అందించడం కాకుండా, ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవచ్చనే భావన. ఆర్థిక సరళీకరణ విధానాలు ఆర్థిక పెట్టుబడులను లాభాలనార్జించే వ్యవసాయేతర రంగాల్లో మాత్రమే పెట్టుబడులు పెట్టడానికి ప్రోత్సహిస్తాయి.

గత రెండు దశాబ్దాలుగా వ్యవసాయంపై విధానాల నిర్లక్ష్యమే రైతు ఆత్మహత్యల రూపంలో అత్యంత బాధాకరంగా సమాజం ముందుకి వచ్చి నిలబడింది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో వ్యవసాయ రంగంలో ఏర్పడుతున్న సంక్షోభానికి ప్రధాన కారణం విధానాల్లో చోటు చేసుకుంటున్న నిర్లక్ష్యాలు, లోపాలు. అపసవ్య విధానాలకు అనేక కారణాలు ఉన్నప్పటికీ, ప్రధానమైనది మాత్రం ఉదారవాద మార్కెట్ ఆర్థిక విధానాలు, సరళీకరణ. చాలా దేశాలలో ఈ ఆర్థిక విధానాలే అనేక రంగాలను శాసిస్తున్నాయి. అందులో వ్యవసాయం ప్రధానమైనది. వ్యవసాయానికి, వ్యవసాయ పరిశోధనకు పూర్తిగా నిధులు తగ్గించడం దీనిలో భాగం. కొన్ని ఉత్పత్తులకే ప్రాధాన్యత ఇవ్వడం ద్వారా వర్షాధారిత ఉష్ణమండల ప్రాంతాలలో కూడా అక్కడి భూసారానికి అస్సలు పనికిరాని పంటలను అధికదిగుబడుల పేరుతో ప్రోత్సహించడం వల్ల భూమి శాశ్వతంగా నిస్సారమయిపోయే పరిస్థితులు ఏర్పడ్డాయి. మార్కెట్ల సరళీకరణ విధానంతో రైతాంగం మొత్తం, ఆహారధాన్యాల పంటల నుంచి వాణిజ్య పంటలవైపే మొగ్గు చూపుతున్నారు. సాంప్రదాయక ఆహార పంటల విజ్ఞానం నుంచీ, స్థానిక వనరుల అవగాహన నుంచీ, వాతావరణ ప్రతికూల పరిస్థితుల్లో కూడా నిలబడగల స్వంత విత్తన విజ్ఞానం నుంచీ దూరమైపోయారు. ఫలితంగా రైతులు విత్తన కంపెనీలు, పురుగుమందులు, ఎరువుల కంపెనీలు, డీలర్ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండాల్సి వచ్చింది. ఫలితంగా వీటి ధరలు విపరీతంగా పెరగడంతో పాటు, మార్కెట్లో కృత్రిమ కొరతను సృష్టించి, రైతుల్లో అభద్రతను సృష్టిస్తున్నారు. దీనితో పంట సాగుకయ్యే పెట్టుబడి విపరీతంగా పెరిగిపోతోంది. పెట్టే పెట్టుబడికి వచ్చే రాబడికి ఏ మాత్రం పొంతన ఉండడం లేదు. వివిధ రకాల వ్యవసాయ సమస్యలతో పాటు

**1995 నుండి ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రంలో ఆత్మహత్య చేసుకున్న రైతుల వివరాలు**

| సంవత్సరం | ఎన్.సి.ఆర్.బి.ప్రకారం రైతుల ఆత్మహత్యలు | రాష్ట్ర ప్రభుత్వం గుర్తించినవి |
|---|---|---|
| 1995 | 1196 | 000 |
| 1996 | 1706 | 000 |
| 1997 | 1097 | 000 |
| 1998 | 1813 | 104 |
| 1999 | 1974 | 180 |
| 2000 | 1525 | 191 |
| 2001 | 1509 | 256 |
| 2002 | 1896 | 323 |
| 2003 | 1800 | 304 |
| 2004 | 2666 | 1182 |
| 2005 | 2490 | 655 |
| 2006 | 2607 | 557 |
| 2007 | 1797 | 493 |
| 2008 | 2105 | 470 |
| 2009 | 2414 | 299 |
| 2010 | 2525 | 188 |
| 2011 | 2206 | 141 |
| 17 సంవత్సరాలు | 33,326 | 5348 |

వ్యవస్థాగత రుణ సదుపాయం కూడా తగ్గిపోయింది. అందుకే చిన్న, సన్నకారు రైతులు అధిక వడ్డీలతో కూడుకున్న ప్రైవేట్ అప్పుల వలయంలోకి చిక్కుకుంటున్నారు. ఇది వ్యవసాయంపై రైతు పెట్టే పెట్టుబడి భారాన్ని మరింత పెంచుతోంది. వ్యవసాయ పరిశోధన, విస్తరణ సేవలపై ప్రభుత్వ రంగ వ్యవస్థలయిన విశ్వవిద్యాలయాలకు, వాటి అనుబంధ సంస్థలకు దృష్టి లేకపోవడం వల్ల కూడా రైతులకు పంట సాగుల కవసరమైన విజ్ఞానం దూరమవుతోంది.

ఈనాటి ఈ పరిస్థితికి కారణాన్ని విశ్లేషిస్తే మన దగ్గర సాంప్రదాయ ఆహార పంటలైన జొన్న, రాగి, సజ్జ, పప్పుధాన్యాలు, మిరప వంటి వాటి స్థానంలో హైబ్రిడ్ రకాల వ్యాపార పంటల వ్యవసాయం, ముఖ్యంగా మన రాష్ట్రంలో 1995 నుంచి పత్తి పంట మొదలవ్వడం కనిపిస్తుంది. ఈ మార్పులన్నీ రైతులను ముఖ్యంగా సన్న, చిన్నకారు రైతాంగాన్ని తీవ్రమైన అప్పుల భారంలోకి నెట్టివేశాయి. ఒకవైపు రైతులు ఆత్మహత్యలకు పాల్పడడం, మరోవైపు పేదవర్గాల ప్రజలు చాలినంత ఆహారం లభించక ఆకలి చావులకు గురవడం మొదలయ్యింది. 2001 సంవత్సరం పియుసిఎల్ వేసిన కేసులో సుప్రీంకోర్టు ఈ పరిస్థితిపై స్పందిస్తూ దేశవ్యాపితంగా 60 మిలియన్ టన్నుల అదనపు ఆహార నిల్వలు గోదాముల్లో ఉండి కుళ్లిపోతుంటే కోట్లాదిమంది ప్రజలు ఆకలి చావులకు గురవడం అనేది కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వైఫల్యంగానే చూడాల్సి ఉంటుందని తీవ్రంగా హెచ్చరించింది.

వాతావరణ మార్పులను దృష్టిలోకి తీసుకోవడం, అనావృష్టి పరిస్థితుల్లో వ్యవసాయానికి కావలసిన నీటి అవసరాలను చూడవల్సిన బాధ్యత, అందుకు తగిన విధంగా చర్యలు తీసుకోవలసిన బాధ్యత ఎట్టి పరిస్థితిలో కూడా ప్రభుత్వాలదే ననటంలో సందేహం లేదు. అన్ని ప్రాంతాలకు ఎలాంటి మినహాయింపులు లేకుండా ఏ పరిస్థితుల్లోనయినా ముందస్తు ప్రత్యామ్నాయ నీటి వనరుల రక్షణ ప్రభుత్వాల అప్రమత్తతకు నిదర్శనం. కానీ ఇక్కడ రాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలో ఈ ఆత్మహత్యల నేపథ్యంలో నుంచి చూసినపుడు పరిస్థితి పూర్తిగా విరుద్ధంగా ఉంది. ప్రభుత్వం ఈ బాధ్యత నుంచి తప్పుకుందనడానికి నిదర్శనం జరుగుతున్న ప్రతి రైతు ఆత్మహత్య వెనుక కనీసం మూడు నుంచి ఆరు బోరుబావుల తవ్వకానికి అయిన అప్పులు ఉండడమే. వర్షాధార వ్యవసాయ ప్రాంతాలలో నీటివనరుల రక్షణ, పెంపుకోసం ప్రభుత్వం బాధ్యత తీసుకుంటున్న దాఖలాలు కనిపించడం లేదు. ఈ విషయం ఈ రైతుల వ్యక్తిగత బాధ్యతగా మారింది. సాగునీటి వనరులు, సుస్థిరతను అందించే చిన్ననీటిపారుదల వ్యవస్థల ప్రాధాన్యత ఈ ఇరవై సంవత్సరాలలో క్రమంగా కనుమరుగైంది. దక్కన్ పీఠభూమి ప్రాంతంలో వ్యవసాయానికి ప్రధాన పాత్ర పోషించే గొలుసుకట్టు చెరువుల వ్యవస్థ నిర్వహణ పూర్తిగా నిర్లక్ష్యం అయింది. దానితో వ్యవసాయానికి అవసరమైన సాగునీటి కోసం ఇప్పుడు అత్యధికమంది రైతులు పూర్తిగా వ్యక్తిగత ఖర్చుతో కూడిన భూగర్భజలాలపై ఆధారపడుతున్నారు. భూగర్భ జలాల పరిమాణం చాలా ప్రమాదస్థాయిలో పడిపోతుండటమే దీనికి పెద్ద ఉదాహరణ. దీనితో నీళ్లు రాక బోర్లు విఫలమవుతున్నాయి.

వీటికి తోడు వాతావరణంలో వస్తున్న మార్పులు వ్యవసాయాన్ని ఆటుపోట్లకు గురిచేస్తున్నాయి. అతివృష్టి అనావృష్టి ఏకకాలంలో రాష్ట్రంలోని ప్రతి ప్రాంతాన్నీ అతలాకుతలం చేస్తున్నాయి. ఇది ప్రతి సంవత్సరం ఎదురౌతోంది. కరువు పరిస్థితులు నిరంతరం కొనసాగు తున్నాయి. ముఖ్యంగా మెట్ట ప్రాంతాలలో. వ్యవస్థాగత బ్యాంకు రుణ సౌకర్యం లేకపోవడంతో అధిక వడ్డీలతో కూడిన ప్రైవేట్ అప్పుల ఊబిలో చిన్న సన్నకారు రైతులు చిక్కుకుపోవడం చాలా ఎక్కువయింది. విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు ఇలా వ్యవసాయానికి కావలసిన ప్రతి అంశంలోను పెట్టుబడి ఎక్కువయిపోయింది. విత్తనాల కోసం, ఎరువుల కోసం రైతులు రోజుల తరబడి క్యూల్లో నిలబడి ఉంటున్నట్లు ప్రసార, ప్రచార మాధ్యమాల్లో వస్తున్నాయి. ఎరువులు, పురుగుమందుల దుకాణాల డీలర్లే కొత్తరూపంలో వడ్డీవ్యాపారస్తులుగానే కాకుండా, ఫలానా ఎరువులు పురుగుమందులు వాడితేనే మీ పంట సరిగ్గా వస్తుందంటూ ఒకటి అవసరమైన చోట నాలుగు కొనిపించడం కూడా జరుగుతోంది. అప్పు ఇచ్చేది వారే కాబట్టి వద్దని చెప్పే అవకాశం ఉండదు. ఆధునిక వ్యవసాయం పూర్తిగా మార్కెట్ ఆధారితం అవడంతో, వేస్తున్న పంటలు కూడా వాణిజ్య పంటలు కాబట్టి గ్రామాలలో నెమ్మదిగా పశుసంపద కనుమరుగు అయిపోతోంది. పశువుల పెండతో సహజ ఎరువు తయారు చేయడం అనే ప్రక్రియే పూర్తిగా పోయింది. వ్యవసాయంలో ఏ చిన్న అవసరం వచ్చినా దూరంలో ఉన్న మండల కేంద్రాలకు ప్రతిరోజూ పరుగులు పెట్టడమే ఒక పెద్ద పనిగా మారింది. ఇది కూడా ఖర్చుని పెంచుతోంది. సంవత్సరాల తరబడి ఒకే పంట వేయడం మేం కలిసిన అన్ని కుటుంబాలలోనూ కనిపించింది. గ్రామాలలోకి వెళ్లి రైతులతో మాట్లాడుతుంటే ఇప్పుడు అనుసరిస్తున్న పంట విధానాల వల్ల, వేస్తున్న పత్తి, మొక్కజొన్న లాంటి వాణిజ్య పంటల వల్ల, వాడుతున్న రసాయన ఎరువులు, పురుగు మందుల వల్ల భూమిసారం తగ్గిపోతోందని, చౌడుగా మారుతోందని చెప్తున్నారు. కానీ, పెరుగుతున్న ఆర్థిక సంక్షోభంలో, మరోదారి లేక పత్తిలాంటి పంటలకే ఎక్కువ మొగ్గు చూపాల్సి వస్తోందని, కుటుంబ అవసరాల రీత్యా తప్పటంలేదని చెప్తున్నారు. విద్య, వైద్యం, ప్రజారవాణా పూర్తిగా ప్రైవేటీకరణ అయి పోవడం, పిల్లల పెళ్లిళ్లతో డబ్బు అవసరాలు చాలా పెద్దఎత్తున ముందుకి వచ్చాయి. దీనికి తోడు జీవనవిధానంలో పెరుగుతున్న వ్యాపార సంస్కృతి.

### ఆత్మహత్యలు-ఆహార భద్రత

రైతు ఆత్మహత్యల నేపథ్యాన్ని, ఆకలి చావుల నేపథ్యాలను వేరువేరుగా చూడాల్సి ఉన్నప్పటికీ వీటి మధ్య ఉన్న సారూప్యతలను గమనిస్తే ఈ రెండూ కూడా భారత వ్యవసాయరంగంలో తీసుకుంటున్న విధానాల ఫలితమే అని మనకు స్పష్టంగా అర్థమవుతుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో విధాన నిర్ణేతలు వ్యవసాయరంగంపై వహిస్తున్న నిర్లక్ష్యం, వ్యవసాయం మీద ఆధారపడిన ప్రజలను, ముఖ్యంగా భూమిలేని పేదవర్గాలను, చిన్న, సన్నకారు రైతాంగాన్ని, స్త్రీలను, దళితులను, ఆదివాసీ సమూహాలను సంక్షోభంలోనికి నెట్టివేస్తోంది. రాష్ట్రంలోని ఆదిలాబాద్ లాంటి ఎర్రనేలల ఆదివాసీ ప్రాంతాలలో కూడా సాంప్రదాయ ఆహార పంటల స్థానంలో పత్తి పంటల ప్రవేశం దీనికి పెద్ద ఉదాహరణ. ఫలితంగా ఒక కనిపించని సంక్షోభం అక్కడి ఆదివాసీ సమూహాన్ని నిశ్శబ్దంగా నిర్మూలిస్తోంది. ఆహారలేమి తీవ్ర స్థాయిలో ఉంది. దానితో రక్తహీనతతో చనిపోతున్న గర్భిణీ స్త్రీలు, నవజాత శిశువుల సంఖ్య ప్రమాదకరంగా ఉంది.

'దేశ జనాభా మొత్తానికి నిజమైన ఆహారభద్రత అంటే అనేక విషయాలుంటాయి. ఇవన్నీ కూడా ప్రజల భాగస్వామ్యంతోనే సాధ్యం అవుతాయి. అవసరమైన ఆహార పదార్థాల పంపిణీ జరగాలంటే అందుకు తగినట్టు వ్యవసాయ ఉత్పత్తి పెరగాల్సి ఉంటుంది. వాణిజ్యానికి అవసరమైన ఒకటి రెండు పంటలు మాత్రమే కాకుండా, వైవిధ్యభరితమైన పంట మార్పిడి, ముఖ్యంగా ఆహార సుస్థిరతను అందించే వ్యవసాయం వైపు మళ్లాలి. ఇది స్థానిక స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ జరగాలి. అన్ని వర్గాల ప్రజలకూ ఆహారం అందుబాటులో ఉండేలా చూడడం అంటే అందరిలోనూ అవసరమైన ఆహార పదార్థాలను కొనుగోలు చేయగల సామర్థ్యం పెరగాలి. మరోమాటలో చెప్పాలంటే ఉపాధి, వేతనాలు, జీవనోపాధులు వంటి విషయాలు చాలా ముఖ్యమైనవి' అని ప్రముఖ వ్యవసాయ ఆర్థిక శాస్త్రవేత్త జయతి ఘోష్ (ది పొలిటికల్ ఎకానమీ ఆఫ్ హంగర్ ఇన్ ట్వంటీఫస్ట్ సెంచరీ ఇండియా, ఇపిడబ్ల్యు, అక్టోబరు, 2010 సంచిక) విశ్లేషించారు.

ఇప్పుడు భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలో వ్యవసాయం ఎదుర్కొంటున్న పరిస్థితులు ఇవే. ఈ పరిస్థితులు చాలా పెను సవాళ్లను మనముందు ఉంచుతున్నాయి. భారతదేశ జనాభాలో మూడొంతుల మంది వ్యవసాయం మీద ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆధారపడివున్నారు. వ్యవసాయం కాలానుగుణంగా నడవాల్సిన విషయం. వాతావరణ మార్పులు, పరిస్థితులు చాలా తీవ్ర ప్రభావాన్ని చూపిస్తున్నాయి. ప్రభుత్వాలు ఈ అంశాన్ని దృష్టిలోకి తీసుకోకుండా నిర్లక్ష్యం వహిస్తున్నాయి. దీనితో పాటు భూసారం, వేస్తున్న పంటలు, భూసారానికి అనుగుణంగా వేయాల్సిన పంటలు, నీటిసౌకర్యం, విత్తనాలు, ఎరువులు, పంట దిగుబడి, మార్కెట్ వ్యవస్థ ఇవన్నీ ఒక దానితో ఒకటి ముడిపడిఉన్న అంశాలు. వీటితో పాటు మరోముఖ్యమైన విషయం కాలానుగుణంగా మారుతూ వస్తున్న వ్యవసాయ ఉత్పత్తి వర్గాలు. ఒకప్పటి సాంప్రదాయ వ్యవసాయ వర్గాలేవైతే వున్నాయో అవి క్రమంగా వ్యవసాయం నుంచి తప్పుకుంటున్నాయి కానీ భూ యాజమాన్యాన్ని వదులుకోవడం లేదు. ఇది వ్యవసాయంలో ఎదురవుతున్న అతి పెద్ద సవాలు. ఇప్పటి వరకూ సంప్రదాయ కులవృత్తుల్లో ఉన్నవర్గాలు వ్యవసాయాన్ని తమ జీవనాధారంగా ఎంచుకుంటున్న పరిస్థితి దేశవ్యాపితంగా కనిపిస్తోంది.

ఆంధ్రప్రదేశ్ లో వ్యవసాయ పరిస్థితికి వస్తే మూడింట రెండొంతుల మంది రాష్ట్ర ప్రజల ప్రధాన జీవనాధారం వ్యవసాయమే. రాష్ట్ర స్థూలోత్పత్తిలో మూడొంతులు దీని నుంచే వస్తుంది. అయితే అనేక కారణాల రీత్యా వ్యవసాయ భూమి తరిగిపోతోంది. వ్యవసాయేతర కారణాలకు భూమిని బదలాయింపు చేయటం, రియల్ ఎస్టేట్ వంటి వ్యవహారాలు దీనికి కారణం. జాతీయ స్థాయిలో వచ్చిన విధాన నిర్ణయాలను, నూతన ఆర్థిక విధానాలను ముందుగా అమలు పరిచినది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే. ఆహార పంటల స్థానంలో పెద్ద ఎత్తున వాణిజ్య పంటలు ఆక్రమించాయి. వరి పంటను కూడా వాణిజ్య అవసరాలకోసమే పండించడం జరుగుతోంది. ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరిగాయి. మార్కెట్ మీద ఆధారపడడం ఎక్కువయింది. 82 శాతం రైతులు రుణభారంలో వున్నారు. చిన్న, సన్నకారు రైతులు వ్యవసాయాన్ని నిర్ణయించే స్థితిలో లేరు. భౌగోళిక ప్రాంతాల ప్రత్యేక అంశాలను గమనంలోకి తీసుకోకుండా ఏకీకృత విధానం అమలు పరచడంతో మెట్టప్రాంతాల రైతాంగం అధిక పెట్టుబడులు పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. మార్కెట్ ల కోసమే విధానాల రూపకల్పన జరుగుతోంది కానీ క్షేత్ర స్థాయి ప్రత్యేకతలను, అవసరాలను దృష్టిలోకి తీసుకోవడం లేదు.

గుంటూరు, ప్రకాశం లాంటి జిల్లాల్లోని రైతులు పెద్ద ఎత్తున వాణిజ్య పంట అయిన పత్తి వైపు మళ్లారు. విపరీతంగా పురుగు సోకటంతో ఎన్ని మందులు వాడినా ఫలితం రాక అక్కడ పత్తిపంట విఫలమవడంతో దాదాపు 100 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఆ తర్వాత అక్కడి నుంచి వలసల రూపంలో తెలంగాణా జిల్లాలకు వచ్చిన వీరు తెలంగాణ ప్రాంతానికి పూర్తి వ్యాపార పంట అయిన ఈ హైబ్రిడ్ పత్తి పంటను పరిచయం చేస్తూ వచ్చారు. దీనికి కారణం ఇక్కడ భూమి కౌలుకి గానీ, కొనడానికి గానీ చౌకగా దొరకటమే. వీరిని చూసి మొదట్లో కేవలం పెట్టుబడి పెట్టగల స్థానిక ధనిక రైతులే పత్తి పంటను అందుకున్నారు. ప్రారంభంలో వలసవచ్చిన రైతులతో పాటు, స్థానిక ధనిక రైతులు అత్యధిక లాభాలను ఆర్జించడం చూసిన చిన్న, సన్నకారు రైతాంగం కూడా పూర్తిగా పత్తి పంట వైపు మళ్లారు. వ్యాపార పంటల ఆగమనంతో వ్యవసాయ పద్ధతులలోనూ, స్థానిక రైతుల జీవన విధానం లోనూ పెద్దఎత్తున మార్పులు చోటుచేసుకున్నాయి. స్వయంసిద్ధ, ఆహార పంటల సుస్థిర జీవనవిధానంలోకి పురుగు మందులు, రసాయనిక ఎరువుల కంపెనీలు, ఆయా కంపెనీల డీలర్లు, అప్పుదారులు, కమిషన్ ఏజంట్లు, బ్యాంకులు ప్రవేశించాయి. సంప్రదాయ విత్తన తయారీ పద్ధతులకి స్థానిక రైతులు దూరమయిపోయారు.

## పౌరస్పందన, జయతి ఘోష్ కమిషన్

1980లలో ప్రకాశం, గుంటూరు జిల్లాలలో ప్రారంభమయిన రైతుల ఆత్మహత్యలు రాష్ట్రంలోని అనేక జిల్లాలకు విస్తరించి ప్రతి సంవత్సరం పెరుగుతూనే వున్నాయి. 1998లో వరంగల్ జిల్లాలోని సామాజిక కార్యకర్తలు, మేధావులు, జర్నలిస్టులు, యూనివర్సిటీ అధ్యాపకులు రైతు సేవా సమితి పేరుతో జిల్లాలో ఆత్మహత్య చేసుకున్న కుటుంబాలను సందర్శించి ఆయా కుటుంబాలకు కొంత ఆర్థిక సహాయం అందజేశారు. రైతులకు న్యాయం జరగాలని పెద్దఎత్తున ఉద్యమాలు నడిపారు. రైతు సహాయ కమిటీ పేరుతో హైదరాబాద్ కేంద్రంగా మరో ప్రయత్నం మొదలయింది. ఈ కమిటీ సభ్యులు ఆత్మహత్య బాధిత కుటుంబాలను కొంత ఆర్థిక సహాయంతో ఆదుకోవడంతో పాటు అన్ని జిల్లాలలో సమస్య పూర్వాపరాలను విచారించారు. 1998 సంవత్సరంలో జులైనెలలో రైతుఆత్మహత్యల మీద ఈ కమిటీ ఆధ్వర్యంలో ఒక స్వతంత్ర ప్రజా బహిరంగ విచారణ నాలుగు ప్రాంతాలలో జరిగింది. అవి, మెదక్ (30-3-98), వరంగల్ (16-4-98), గుంటూరు (7-5-98), హైదరాబాద్ (17-5-98). ఈ ట్రిబ్యునల్‌లో సభ్యులుగా ఆంధ్రప్రదేశ్ హైకోర్టు రిటైర్డ్ జడ్జ్ పి.ఏ. చౌదరి, రిటైర్డ్ ఐఏయస్ అధికారులు శంకరన్, కె.ఆర్.వేణుగోపాల్, ప్రముఖ సంపాదకులు ఎ.బి.కె.ప్రసాద్, స్వాతంత్ర సమరయోధులు, విద్యావేత్త బూర్గుల నరసింగరావు వ్యవహరించారు. ఈ ట్రిబ్యునల్ తన రిపోర్టును ప్రభుత్వానికి అందజేసింది.

### ట్రిబ్యునల్ రిపోర్టులోని ముఖ్యాంశాలు

● జరిగిన రైతు ఆత్మహత్యలేవీ కూడా వ్యక్తిగత, మానసిక, దుందుడుకు నిర్ణయాలు కావు.

● పంటనష్టాలతో చిన్నరైతులు రుణభారంలోకి వెళ్లిపోతున్నారు. ఆదుకోవలసిన ప్రభుత్వాల నుంచి ఏ మాత్రం సహాయం అందటం లేదు. పౌరులందర్నీ అన్నిరకాల అణచివేతలు, దోపిడీల నుంచీ రక్షించాల్సిన బాధ్యత, అభివృద్ధి పథంలో జీవించడానికి అవకాశాలు కల్పించవలసిన బాధ్యత రాజ్యాంగ బద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాలది.

– రైతు జీవితం ఆత్మాభిమానంతో ఉంటుంది. తమ జీవనోపాధుల్ని కోల్పోతున్న రైతాంగం బానిస బతుకుల్లోకి వెళ్లడానికి సిద్ధంగా లేరు.

– రైతుల ఆత్మహత్యలు పెరిగిపోతున్నా గానీ ప్రభుత్వం ఇంతవరకూ ఏ రకమైన ప్రత్యేక చర్యలూ తీసుకోలేదు. రైతాంగానికి భరోసా ఇచ్చే ప్రయత్నాలు చేయలేదు.

– వ్యవసాయ విస్తరణ సేవలు రైతులకు సహాయపడడంలో, పంటలు, విత్తనాలు, ఎరువులు, పురుగుమందుల విజ్ఞానాన్ని అందించడంలో పూర్తిగా విఫలమయ్యాయి.

– పెరుగుతున్న వ్యాపార సంస్కృతిలో ఒంటరివారవుతున్న రైతులు. గ్రామీణ జీవితంలో విచ్ఛిన్నమవుతున్న ఉమ్మడి సామాజిక విలువలు.

### ప్రభుత్వం తీసుకోవాల్సిన చర్యల గురించి ట్రిబ్యునల్ సూచనలు

● వ్యవసాయ విస్తరణ సేవలను పటిష్టం చేయాలి. రైతులకు సకాలంలో సహాయాన్ని అందించాలి.

– గ్రామీణ బ్యాంకులు, సహకార బ్యాంకుల విధానాన్ని తిరిగి పునరుద్ధరించాలి. సకాలంలో పంటరుణాలను అందించాలి.

– మెట్టప్రాంతాలలోని రైతాంగానికి ఆర్థిక సంస్థలలో రుణ కోటాను నిర్ణయించాలి.

– వర్షాధార ప్రాంతాలలో యుద్ధప్రాతిపదికన చిన్ననీటిపారుదల వ్యవస్థలను బలోపేతం చేయడానికి ప్రాధాన్యం ఇవ్వాలి.

– కల్తీ విత్తనాలు, పురుగుమందుల, ఎరువుల వ్యాపారులను వెంటనే నియంత్రించాలి. దీనికి అవసరమైన చట్టపరమైన మార్పులను తీసుకోవాలి.

– మెట్టప్రాంతాల భూసారానికి అనుగుణమైన పంటల విధానాల్ని ప్రోత్సాహకాలతో ప్రభుత్వం అభివృద్ధి చేయాలి.

– పర్యావరణానికి హానిచేయని సహజ ఎరువులు, పురుగుమందుల విధానాలను విశ్వవిద్యాలయాల పరిశోధనా కేంద్రాలు రూపొందించాలి.

– ఆహారపంటలైన జొన్న, రాగి, సజ్జలు, పప్పుధాన్యాలు వర్షాధారప్రాంతాలకు అనుగుణమైనవే కాక, రైతులకు కచ్చితమైన దిగుబడి వస్తుంది. అంతేకాకుండా ఇవి పేదవర్గాల ప్రజలకు బలవర్ధకమైన సంప్రదాయ ఆహార వనరులు కూడా. వీటిని ప్రభుత్వం ప్రోత్సహించాలి. ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు, పరిశోధనాసంస్థలు ఉమ్మడిగా పనిచేసి చిన్న, సన్నకారు రైతులు ఈ పంటలు పండించే విధంగా వ్యవస్థలను రూపొందించాలి.

– ప్రైవేట్ వడ్డీ వ్యాపారస్తుల నుంచీ, ఎరువుల డీలర్ల నుంచి రైతాంగాన్ని రక్షించి, తామే స్వంతంగా సహకార సంఘాలను ఏర్పాటు చేసుకునే విధంగా ప్రోత్సహించాలి.

– ది మద్రాస్ డెట్ రిలీఫ్ యాక్ట్, హైదరాబాద్ డెట్ రిలీఫ్ యాక్ట్‌లను సక్రమంగా అమలు పరిచి వడ్డీ వ్యాపారులను నియంత్రించాలి.

– ఆత్మహత్య చేసుకున్న వ్యక్తి కుటుంబాలకు వెంటనే ఎక్స్‌గ్రేషియా చెల్లించాలి.

– ఈ కుటుంబాలలోని పిల్లలకు ఉచిత విద్యాసౌకర్యాన్ని కల్పించాలి.

ఇవి 1998లో ప్రజా ట్రిబ్యునల్ ప్రభుత్వానికి సూచించిన విషయాలు. అప్పటి నుంచి ఆంధ్రప్రదేశ్‌లో మేధావులు, పౌరసమాజం, ప్రసారసాధనాలు, రైతులు, హక్కుల సంఘాలు సంఘటితంగా నిరంతరం తీసుకొచ్చిన ఒత్తిడితో, 2004లో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ప్రముఖ ప్రణాళికా నిపుణులు జయతిఘోష్ నేతృత్వంలో ఒక కమిషన్‌ని నియమించింది. ఈ కమిషన్ అనంతపురం, వరంగల్, మహబూబ్‌నగర్, గుంటూరు, చిత్తూరు, శ్రీకాకుళం, హైదరాబాద్ ప్రాంతాలలో పర్యటించి రైతుల నుంచి, రైతు సంఘాల నుంచి అభిప్రాయాలు సేకరించి సమగ్రమైన రిపోర్టును వెలువరించింది. ప్రభుత్వ వ్యవస్థాగత వైఫల్యాలు, ప్రణాళికా వైఫల్యాల వల్లే చిన్నకారు రైతులు మరీ ముఖ్యంగా వెనుకబడిన కులాలు, షెడ్యూలు కులాలకు చెందిన రైతులు సంక్షోభంలో వున్నారని, సంక్షోభ నివారణకు ప్రభుత్వం తక్షణం దృష్టి సారించాలని జయతిఘోష్ కమిషన్ నివేదిక (2004) ఇచ్చింది. ఈ కమిటీ సిఫార్సుల మేరకు రాష్ట్రంలో 1998 నుంచి ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాలకు ఒక లక్షాయాభైవేల రూపాయలు ఎక్స్‌గ్రేషియా ప్రకటిస్తూ జీవో 421ని 2004 జూన్ 1న ప్రభుత్వం జారీ చేసింది. (జీవో పూర్తి పాఠం వ్యాసం చివరిలో చూడండి.) ఈ జీవో ప్రకారం ఒక లక్షా యాభైవేల రూపాయల ఆర్థికసాయంతో పాటు ఆ కుటుంబాల పిల్లల చదువు (ఉన్నత విద్య వరకూ), అవసరమయిన వారికి హాస్టల్ వసతి కల్పించడం వంటి విషయాలు కూడా ప్రభుత్వ బాధ్యతే.

ఏ కారణాలవల్లయితేనేం ప్రారంభంలో కేవలం కొద్ది కుటుంబాలకు మాత్రమే ప్రభుత్వం నుంచి పైన చెప్పిన ఈ ఆర్థిక సాయం అందింది. అయితే పిల్లల చదువు ఎక్కడా ఊసులోకి కూడా రాలేదు. ప్రభుత్వం నుండి సంఘటన జరిగిన నెలరోజులకల్లా అందాల్సిన ఎక్స్‌గ్రేషియా చాలా కుటుంబాలకు ఇప్పటికీ ఎండమావే. ఇప్పటికీ రైతు ఆత్మహత్యలు జరుగుతూనే ఉన్నాయి. మరిన్ని కుటుంబాలు రోజూ ఈ సుడిగుండంలో చిక్కుకుపోతున్నాయి. ప్రజా ట్రిబ్యునల్ ఎత్తిచూపిన అంశాల గురించి గానీ, జయతి ఘోష్ కమిషన్ ఇచ్చిన సూచనలను గానీ ప్రభుత్వం పట్టించుకున్నట్లయితే ఆత్మహత్యల సమస్య పరిష్కారానికి ఒక మార్గం దొరికిఉండేది. అయితే ప్రభుత్వం వ్యవసాయానికి కావలసిన సమస్త మద్దతు వ్యవస్థలను ఉపసంహరించుకుంటోంది. వైఫల్యం తమది కాదు అని చెప్పటానికే రైతు ఆత్మహత్యలు నిజమైన వ్యవసాయ సంబంధిత కారణాలతో కాదని బాధ్యత నుంచి తప్పించుకుంటోంది.

### ఆగని ఆత్మహత్యలు

రైతు సహాయ కమిటీ ఏర్పడిన నాటి నుంచి ఈ అంశాల మీద వివిధస్థాయిల్లో పనిచేసిన మేము ఈ కుటుంబాల దగ్గరకు వెళ్లినప్పుడు అన్ని జిల్లాల్లోనూ మాకు ఎదురైన అంశం ఆ కుటుంబాల్లో పేరుకుని ఉన్న విపరీతమైన దుఃఖం. భవిష్యత్‌పై ఏ మాత్రం ఆశలేనితనం.

అంతులేని నిరాశ. తీవ్రమైన శారీరక మానసిక అనారోగ్యాలు. చాలా సందర్భాలలో 12-13 సంవత్సరాల పిల్లలు తమ చదువు మానేసి చిన్నవయస్సులోనే కుటుంబ భారాన్ని నెత్తినెత్తుకున్నారు. బంధువులు, ఊరివాళ్ల ఒత్తిడితో బతుకు అభద్రతతో ఆడపిల్లలకు చాలా చిన్న వయస్సులోనే పెళ్లిళ్లు చేసే పరిస్థితుల్లోకి ఒంటరి తల్లులు నెట్టబడ్డారు. పరిస్థితులు పూర్తిగా దిగజారిపోయిన చోట ఆదుకునే వ్యవస్థలు లేక వయసైపోయిన వృద్ధులు ఆకలితో అనాథలుగా మిగలడం కనిపించింది.

అన్ని కుటుంబాలకు కాకపోయినా సంక్షోభంలోకి కూరుకుపోతున్న కొన్ని కుటుంబాలకైనా మా వంతు సామాజిక బాధ్యతగా ఏం చేయగలుగుతాము అని ఆలోచించినపుడు ఆయా కుటుంబాల్లోని పిల్లలు తమ చదువు కొనసాగించేవిధంగా ఒక పౌరస్పందన వేదికగా పనిచేయాలని నిర్ణయించుకున్నాం. కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్ (సిసిసి) పేరుతో 2007 నుంచీ ఈ పిల్లలు చదువుకొనసాగించడానికి అవసరమైన చేయూతను వ్యక్తులు, సంస్థల తోడ్పాటుతో వివిధ పద్ధతుల్లో అందజేస్తున్నాం. అలా ఇప్పటివరకూ దాదాపు 200 మంది పిల్లలు వివిధ స్థాయిల్లో తమ చదువుని కొనసాగించగలుగుతున్నారు.

ఆ క్రమంలో మేము కలిసిన కుటుంబాలలోని వ్యక్తులు, ఇతర గ్రామస్థులు చెప్పిన అంశాలు, మా దృష్టికి వచ్చిన విషయాల ఆధారంతో రైతుల ఆత్మహత్యలతో కుటుంబాల మీద పడుతున్న ఒత్తిడులు, తీవ్రమౌతున్న సామాజిక సంక్షోభం, ఆహార అభద్రతల మీద ఒక పరిశీలన చేశాము. 1999 నుంచీ 2011 వరకూ జరిగి రైతు ఆత్మహత్యల కుటుంబాలలోని బాధిత కుటుంబాల స్త్రీలు, పిల్లలు వివరించిన అంశాలు ఇందులో వున్నాయి. ఈ కుటుంబాలు ఎదుర్కొంటున్న అనుభవాల ఆధారంతో ఆత్మహత్యలకు దారితీసిన పరిస్థితులను, వాటి వెనుక ఉన్న అంశాలనుమాత్రమే కాక ఆత్మహత్యల తర్వాత ఆయా కుటుంబాలు ఎదుర్కొంటున్న సమస్యల తీవ్రతను చర్చలోకి తీసుకురావడం ఈ వ్యాసం ప్రధానోద్దేశం. పత్రికా వార్తల ఆధారంగా, పోలీసు స్టేషన్‌లలో 174 సెక్షన్ కింద నమోదు అయిన సంఘటనల ఆధారంగా, స్థానిక ప్రజా సంఘాల సహాయంతో వివిధ జిల్లాలలో జరుగుతున్న రైతుల ఆత్మహత్యల వివరాలను సేకరించడానికి గ్రామీణ విద్యార్థి, యువ స్వచ్ఛంద కార్యకర్తల సహాయాన్ని తీసుకున్నాం.

ప్రధానంగా మా పరిశీలనలో కనిపించిన అంశాలు ఇవి 1) ఆత్మహత్యలకు పాల్పడుతున్నది చాలా చిన్న వయస్సు వారు. 2) అధికభాగం వెనుకబడిన సామాజిక వర్గాలకు చెందినవారు. 3) చిన్నవయసులోనే ఒంటరి వారవుతున్న వ్యవసాయరంగ స్త్రీలు. కుటుంబంలోని పిల్లలు, వృద్ధుల సంరక్షణ భారం స్త్రీలే ఒంటరిగా మోయాల్సి రావడం. 4) భర్త మరణంతో వ్యవసాయాన్ని కొనసాగించలేని పరిస్థితులు. 5) అందరూ 3 ఎకరాలలోపు భూమి కలిగిఉండి మరికొంత భూమిని కౌలుకు తీసుకుంటున్న సన్న, చిన్నకారు రైతాంగం. 6) ప్రభుత్వ వ్యవస్థాగత రుణ సదుపాయం పొందిన వారు చాలా తక్కువ, అధిక వడ్డీతో కూడుకున్న ప్రైవేట్ రుణాలు తీసుకున్నవారు ఎక్కువ. 7) కాలువల వంటి సమగ్ర నీటిపారుదల వ్యవస్థ లేకపోవడం. చేసిన అప్పులు ప్రధానంగా సాగునీటి అవసరాల కోసమే వున్నాయి. 8) వర్షాధార ప్రాంతాల లోని చెరువుల వ్యవస్థ పూర్తిగా కనుమరుగయిపోయింది. 9) సాగునీటి అవసరాల రీత్యా బోరు బావుల తవ్వకం కోసమే అధిక భాగం అప్పులు తీసుకున్నారు. అవి విఫలమవడంతో మళ్లీ మళ్లీ ప్రయత్నించడం కూడా రుణ భారాన్ని పెంచింది. 10) సాంప్రదాయ ఆహారపంటల నుంచి నీటి అవసరం, పెట్టుబడి ఎక్కువ అవసరం ఉన్న వరి, పత్తి, మొక్కజొన్న వంటి పంటలకు మళ్లటం. గిట్టుబాటు ధరలు లేకపోవడం, మార్కెట్ సదుపాయాలు లేకపోవడం. 11) భూసారం గురించి కానీ, పంటల పద్ధతులు గురించి కానీ చెప్పేవారు లేరు. వ్యవసాయ శాఖ విస్తరణ సేవలు పూర్తిగా శూన్యం. 12) వ్యవసాయ అవసరాల కోసం పెట్టుబడి ఎక్కువ కావడం, ముఖ్యంగా విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు, రవాణా. 13) విద్య, వైద్య అవసరాలు ప్రైవేట్‌పరం కావడంతో కుటుంబ ఖర్చు పెరగడం. 14) ఆడపిల్లల పెళ్లిళ్లు, ఇంకా కుటుంబ అవసరాల రీత్యా వ్యాపార పంటల కోసం భూమిని కౌలుకి తీసుకోవడం, తద్వారా అధిక పెట్టుబడి పెట్టవల్సి రావడం. 15) స్త్రీలకు నిర్ణయాధికారం లేదు. పంటల నిర్ణయంలో, వ్యవసాయంలో స్త్రీల అభిప్రాయాలకు విలువలేదు. 16) స్త్రీలకు భూమి మీద చట్టపరమైన హక్కు లేదు. 17) ఉన్న కొద్దిపాటి భూమి కూడా కుటుంబ ఉమ్మడి ఆస్తిగా ఉండడం. 18) దానితో చనిపోయిన రైతులను నిజమైన రైతులుగా గుర్తించని ప్రభుత్వం. 19) అమలు కాని 421/2004 జివో, ఈ కుటుంబాలకు అందని నష్టపరిహారం. 20). పిల్లల చదువు ఆగిపోయే పరిస్థితులు, పట్టించుకోని ప్రభుత్వాధికారులు. 21) ఆహార భద్రతా పథకాల్లోని అంత్యోదయ కార్డు ద్వారా 35 కిలోల బియ్యంగానీ, విడో పింఛన్ గానీ అందటం లేదు. 22) చాలా కుటుంబాలకు జాతీయ కుటుంబ సంక్షేమ పథకం (ఎన్ఎఫ్‌బియస్) కింద రు. 5000లు కూడా అందలేదు. 23) అప్పుల భారంతో కుటుంబాలు సామాజిక మద్దతును కోల్పోతున్నాయి. 24) మనోధైర్యం అందించే వ్యవస్థలు లేవు.

ఆత్మహత్యలకు పాల్పడుతున్న వారిలో 90శాతం మంది వెనుకబడిన కులాలకు చెందినవారే ఉండడం మా దృష్టికి వచ్చింది. ముదిరాజ్, గౌడ, గొల్ల, కుర్మ, చాకలి, కుమ్మరి, మున్నూరుకాపు, చాకలి సామాజిక వర్గాలు ఎక్కువగా ఆత్మహత్యలకు పాల్పడినట్లు కనిపిస్తోంది. రెడ్డి, వెలమ, ఎస్‌సి, ఎస్‌టి సామాజిక వర్గాలు తర్వాతి వరుసలో వున్నాయి. ఈ మధ్యకాలంలో ఐదారు ముస్లిం కుటుంబాలు కూడా ఈ జాబితాలో చేరాయి. ఇప్పటివరకూ ప్రధానంగా చనిపోయింది పురుష రైతులే. ఇటీవల మహిళారైతుల ఆత్మహత్యలు కూడా పెరుగుతున్నాయి. ఎన్‌సిఆర్‌బి లెక్కల ప్రకారం రాష్ట్రంలో 1995-2011 మధ్యకాలంలో 33,326 రైతు ఆత్మహత్యలు నమోదు అయితే, అందజేసిన ఎక్స్‌గ్రేషియా వివరాల ప్రకారం ప్రభుత్వం గుర్తించినవి 5438 మాత్రమే. ఇది మొత్తం సంఖ్యలో 16 శాతం. (ఎన్‌సిఆర్‌బి పట్టిక చూడండి.) ప్రభుత్వం వ్యవసాయ సంబంధిత ఆత్మహత్యలుగా గుర్తించని వాటికి ఎక్స్‌గ్రేషియా అందడం లేదు. 1998లో ప్రజా ట్రిబ్యునల్ ఏ అంశాలనయితే వ్యవసాయ దారుల సమస్యకు మూలంగా పేర్కొందో ఆయా అంశాల మీద ప్రభుత్వం తీసుకున్న చర్యలు దాదాపు శూన్యం. ట్రిబ్యునల్ వెలువరించిన విషయాలే మళ్లీ పదేళ్ల తరువాత మా పరిశీలనలోనూ ముందుకు వచ్చాయి. అంటే పదేళ్ల సమయంలో ప్రభుత్వాలు రైతుల

గురించి, ముఖ్యంగా వర్షాధార ప్రాంత రైతులు, చిన్న, సన్నకారు రైతుల అవసరాలను పట్టించుకోని ఫలితమే ప్రతి సంవత్సరం పెరుగుతూ వస్తున్న ఆత్మహత్యలు.

విషాదమేమంటే, ప్రతి జిల్లాలోనూ అనేకమంది వ్యవసాయాన్ని వృత్తిగా స్వచ్ఛందంగా ఎంచుకున్న యువకులు చిన్న వయస్సులోనే బలవన్మరణాలకు పాల్పడ్డారు. ఈ రైతుల సగటు వయసు 30 సంవత్సరాల కంటే తక్కువ ఉంటోంది. కొంతమంది విషయంలోనయితే వాళ్లు చనిపోయేనాటికి ఒక్కోసారి వాళ్ల పిల్లల వయసు 3 నెలలు కూడా మించడం లేదు. అత్యంత బాధాకరమైన సంఘటన మెదక్ జిల్లా ములుగు మండలంలోని సింగన్నగూడెం గ్రామానికి చెందిన 25 సంవత్సరాల మన్నే స్వామి 4 సార్లు నీటి కోసం బోర్లు ప్రయత్నించి అవి విఫలమవడంతో 26-3-2011 న ఆత్మహత్య చేసుకునే నాటికి అతని భార్య నాగమణి 5 నెలల గర్భవతి. ఇప్పుడు చంటిపాప సంరక్షణతో ఉపాధి అవకాశాలు లేక, అప్పుల వాళ్లకు సమాధానం చెప్పలేక ఏం చేయాలో అర్థం కాని పరిస్థితిలో ఉంది. ఇదే జిల్లాలో దాదిగూడెం గ్రామం, ఊట్ల పంచాయితీ, జిన్నారం మండలానికి చెందిన 'మోతె రాజు'కు 26 సంవత్సరాలు. వ్యవసాయ ఖర్చుల కోసం అయిన పెట్టుబడి అప్పులు తట్టుకోలేక 2011 అక్టోబరు 31 న పురుగులమందు తాగి చనిపోయాడు. రాజు భార్య రేణుకకు తల్లిదండ్రులు లేరు. ఇప్పుడు భర్త కూడా చనిపోవడంతో సంవత్సరం వయస్సున్న కొడుకుతో దిక్కుతోచని స్థితిలో ఉంది. సమస్య తీవ్రతను అర్థం చేసుకోవడానికి ఇంతకంటే వివరణ అవసరం లేదేమో?

అందరిదీ అటూ ఇటూగా ఒకే వ్యథ. ప్రతి ఒక్కరూ కూడా 3 ఎకరాల లోపు స్వంత వ్యవసాయ భూమి ఉన్నవాళ్లే. పెద్దల నుంచి వచ్చిందో లేదా తామే కష్టపడి కూడబెట్టుకుని భూమిని కొనుగోలు చేసో లేదా కౌలుకు తీసుకొని వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించిన కొత్తతరం యువరైతులు వీళ్లు. ఈ సంఘటనల నైసర్గిక, భౌగోళిక పరిస్థితులను గమనిస్తే ఎక్కడా నీటిపారుదల వ్యవస్థలు స్థిరంగా లేని వర్షాధార వ్యవసాయ ప్రాంతాలనేది స్పష్టం. మేము పరిశీలించిన తెలంగాణ జిల్లాలలో ఎక్కడా సమగ్ర సాగునీటి వ్యవస్థ లేదు. భూగర్భ జలాలే ఆధారం. సాగునీటికోసం రైతులు తమ స్వంత బాధ్యతతో బావులు, బోర్లు తవ్వించుకున్నారు. ప్రభుత్వ మద్దతు లేదు. సంప్రదాయ నీటివ్యవస్థలైన చెరువుల నిర్వహణను ప్రభుత్వం పట్టించుకోవడం మానేసి చాలా కాలమయిందని ప్రతి గ్రామంలోనూ మేం కలిసి మాట్లాడిన గ్రామస్థులందరూ చెప్పారు. భూగర్భ జలాల వినియోగం ఎక్కువవడంతో వాటి సఫలత శాతం చాలా తగ్గిపోయింది. ఎలాగోలా కష్టపడి వేయిస్తే నీరు పడుతుందన్న ఆశతో మళ్లీ మళ్లీ బోర్లు వేయాల్సి రావటమే అసలు విషాదం. బోర్ల ఖర్చు ఒకసారితో అయిపోయేది కాదు. దానికోసం కరెంట్ మోటర్ ఏర్పాటు చేసుకోవాలి. వాటికి అయ్యే రిపేర్లు, కరెంటు కోతలు, అన్నీ సక్రమంగా ఉంటే వర్షాలు లేక భూగర్భజలాలు పెరగడంలేదు. సాగునీరుతో పాటు వ్యవసాయ విస్తరణ సేవలు, సదుపాయాలు లేవు. ఆర్థికంగా స్థిరపడడానికి, పెరుగుతున్న ధరలతో జీవితాన్ని నిలబెట్టుకోవాలని, ముఖ్యంగా పిల్లాపాపలను చక్కగా చదివించుకోవాలనే ఆశ ప్రతి ఒక్కరి అనుభవంలో కనిపిస్తుంది. వ్యక్తిగత పూచీకత్తుతో తెచ్చిన అప్పులు. ఎంత కష్టపడినా గానీ ఫలితం దక్కని తీరు, పంట నష్టం, పెట్టుబడి నష్టం. చివరికి అప్పుల ఒత్తిడితో ప్రాణ నష్టం. ఇప్పటి వరకు వ్యవసాయ కూలీలుగా ఉన్న వర్గాలు తమ సొంత వ్యవసాయానికి వస్తున్న క్రమంలో అదీ ఆధునిక వ్యవసాయానికి మళ్లుతున్న సమయంలో ఎదురవుతున్న సమస్యలు, తద్వారా ఎదురవుతున్న సామాజిక సంక్షోభానికి ఉదాహరణలు.

30 సంవత్సరాల లోపు వయస్సులో వ్యవసాయాన్ని వృత్తిగా చేసుకుని స్వతంత్రంగా బతకాలనుకున్న నవయువ రైతుల జీవితాలకి ప్రభుత్వం కల్పించిన, కల్పించాల్సిన భరోసా ఇదేనా? రైతుకు మద్దతుగా నిలవాల్సిన వ్యవస్థలు ఏమయ్యాయి? ఈ రైతు యువకుల భార్యలు, వారి చిన్నపిల్లలు, వృద్ధులైన తల్లిదండ్రులు దిక్కుతోచక కొట్టుమిట్టాడుతున్నారు. పితృస్వామిక కుటుంబ చట్రాలు బలంగా ఉన్న సామాజిక నేపథ్యంలో స్త్రీల ఈ పరిస్థితి వారిని మరింత సామాజిక వెలివేతకు గురిచేస్తోందనేది వారి అనుభవం. చాలామందికి జీవనోపాధి లేకుండా అయింది. సాంప్రదాయ తిండి గింజల వ్యవసాయంలో స్త్రీలకు స్పష్టంగా ఒక పాత్ర ఉండేది, నిరంతరం పని ఉండేది. కానీ, ఇప్పటి ఆధునిక వ్యవసాయంలో తోడు లేకుండా తిరిగి వ్యవసాయాన్ని కొనసాగించే ధైర్యం ఉండడం లేదని చాలామంది ఆడవాళ్ల అనుభవం.

నీళ్ల దగ్గర నుంచీ, విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు, దుక్కి దున్నటం, కోతలు, పంట తీయటం, మార్కెట్ వ్యవహారాలు ఏవీ తెలియక పోవటమే కాకుండా, చిన్నవయసు కావడంతో దేనికీ నిర్ణయాధికారం లేకపోవడం, బంధువుల అజమాయిషీలో ఉండడం వంటి చాలా సమస్యలను చెప్పుకొచ్చారు. కుటుంబ పోషణ కోసం 100 రోజుల ఉపాధి హామీ పనుల మీద ఆధారపడదామన్నా కానీ అక్కడ కూడా ఒంటరి స్త్రీలనే పేరుతో పనులలో అవకాశం ఇవ్వడం లేదు. ఇలాంటి అనుభవం చాలామందికి ఉంది. పుట్టింటి వైపు వాళ్లు ఏమన్నా ఆదుకోగలిగిన పరిస్థితి ఉంటే ఆ ఆధారంతో చిన్న చిన్న చాలీచాలని జీవనోపాధులను వెతుక్కోవడం, లేదంటే కూలీ దొరికిన నాడు పనికి వెళ్లటం, లేదా ఆకలితో ఉంటున్నామని చెప్పారు. ఆకలితో ఉండడం అనేది చాలా కుటుంబాల్లో సర్వసాధారణమైపోయింది. కనీసపాటి చదువులు లేకపోవడంతో అంగన్‌వాడీ టీచర్ లాంటి పనులు కూడా వీరికి వచ్చే అవకాశం లేదు. పిల్లల్ని ఎలా పెంచాలనే అభద్రతతో నిద్ర కూడా పోలేకపోతున్న భారమైన స్థితి. ఆర్థిక ఆధారం లేక, ఆహార భద్రత లేక సామాజిక కట్టుబాట్ల హింసతో మానసిక, శారీరక ఆరోగ్యాలు శిథిలమవుతుంటే మా పరిస్థితికి కారణమెవరు అని గట్టిగా నిలదీయలేని నిస్సహాయస్థితిలో కూరుకుపోయిన గ్రామీణ యువతులు వీరు.

మెదక్ జిల్లా సిద్దిపేట మండలంలోని ఎన్సాన్ పల్లి గ్రామంలో గొల్ల సామాజిక వర్గానికి చెందిన విసుకొండ బాలయ్య 12-9-2006 న ఆత్మహత్య చేసుకున్నాడు. చనిపోయేనాటికి ఇతని వయసు 28 సంవత్సరాలు. భార్య భాగ్యమ్మ కొడుకు ప్రశాంత్ (6సం?), వృద్ధుడైన తండ్రి ఎల్లయ్యలతో కలసి జీవించేవాడు. 2 ఎకరాల స్వంత పొలం. వర్షాధారం. మొక్కజొన్నతో పాటు కుటుంబానికి అవసరమయ్యే కందులు వంటి పంటలు వేస్తూ, వ్యవసాయంతో పాటు ఇతర కూలీ పనులు కూడా చేస్తూ జీవనం గడిపేవారు. మొక్కజొన్న పంట కోసం చాలా పెద్ద మొత్తంలో అప్పులు చేసిపెట్టుబడి పెట్టాడు. పంట సమయానికి

సరియైన వర్షాలు లేక వేసిన మొక్కజొన్న పంట మొత్తం ఎండి పోయింది. పంట కోసం తెచ్చిన అప్పు పెరిగి పోయింది. 2006 సంవత్సరంలో బయట కూలీ పనులు కూడా సరిగ్గా దొరకకపోవడంతో ఒకపూట తినడానికి కూడా కష్టమైంది. పంట పండకపోవడంతో ఆర్థిక ఇబ్బందులు ఏర్పడ్డాయి. పంటకోసం చేసిన అప్పులే కాక కుటుంబ పోషణ కోసం కూడా అప్పులు చేయాల్సి వచ్చింది. వడ్డీరేట్లు పెరిగిపోయాయి. ఆర్థిక పరిస్థితి పూర్తిగా దిగజారిపోయింది. అప్పులు తీర్చమనే ఒత్తిడి ఎక్కువవడంతో తట్టుకోలేక తన ఇంటిలోనే ఉరివేసుకుని చనిపోయాడు. కొడుకు, మామల పోషణ భారం ఇప్పుడు పూర్తిగా భాగ్యమ్మపై పడింది.

మహబూబ్‌నగర్ జిల్లా మాడుగుల మండలం, బ్రాహ్మణపల్లి గ్రామంలో దళిత సామాజిక వర్గానికి చెందిన 30 సంవత్సరాల రౌడంపల్లి యాదయ్య 2011 ఫిబ్రవరి 5 న ఆత్మహత్య చేసుకున్నాడు. భార్య వెంకటమ్మ. 12, 7 సంవత్సరాల వయస్సున్న ఇద్దరు మగ పిల్లలు. వృద్ధురాలైన తల్లి. భూపంపకంలో భాగంగా రెండు ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది గానీ, పట్టా చేతికి ఇవ్వలేదు. గత పది సంవత్సరాలుగా ఆ రెండు ఎకరాలలో జొన్నలు, సజ్జలు పండించేవాడు. మూడు సంవత్సరాల క్రితం మరో మూడు ఎకరాలు కౌలుకి తీసుకుని మొత్తం ఐదు ఎకరాలలో పత్తి పంట వేశాడు. అసైన్డ్ భూమికి పట్టా లేకపోవడం, కౌలుకి తీసుకున్న భూమికి రుణసౌకర్యం లేకపోవడంతో పెట్టుబడి కోసం, కౌలు కోసం ప్రైవేట్ వడ్డీ వ్యాపారస్తులను ఆశ్రయించాడు. ఇందిరమ్మ ఇల్లు మంజూరు అయింది కానీ, మొదటి దశ నిర్మాణానికే రు.25,000 ఖర్చు అయింది. దానికి సంబంధించిన బిల్లులు మంజూరు కాలేదు. గత మూడు సంవత్సరాలలో కౌలుకి, పంట పెట్టుబడికి, ఇంటికి కలిపి ఒక లక్షా యాభైవేల రూపాయలు అప్పు అయింది. ఈ మూడేళ్ల నుంచి పత్తిపంట సరిగా రాకపోవడంతో అప్పుల ఒత్తిడికి తట్టుకోలేక ఆత్మహత్య చేసుకోవడానికి పురుగుమందు తాగాడు. గమనించిన కుటుంబ సభ్యులు వెంటనే కల్వకుర్తి పట్టణంలోని ఆసుపత్రికి తీసుకువెళ్లారు. అయితే పరిస్థితి కొంత ప్రమాదంగా ఉండడం తో హైదరాబాద్‌లోని ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌కు తీసుకువచ్చిన ఒకరోజు తర్వాత చనిపోయాడు. శవాన్ని వెనక్కి తీసుకువెళ్లడానికి వెంకటమ్మ తన శరీరం మీదఉన్న కొద్దిపాటి బంగారు వస్తువులను కూడా అమ్ముకోవాల్సి వచ్చింది. ఇంతవరకూ అధికారులెవరూ సందర్శించలేదు. కనీసం ఎన్ఎఫ్‌బియస్ కూడా అందలేదు. కుటుంబం గడువక పెద్దకొడుకును అప్పుడప్పుడూ పనిలోకి పంపిస్తుంటుంది.

మరో ఉదాహరణ వరంగల్ జిల్లా రేగొండ మండలం జగ్గయ్యపేట గ్రామంలో గొల్ల సామాజిక వర్గానికి చెందిన పెంట సాంబయ్యది. చనిపోయేనాటికి 28 సంవత్సరాలు. 01.08.2007 న ఆత్మహత్య చేసుకున్నాడు. భార్య సరిత, ఇద్దరు ఆడపిల్లలు అనూష, ప్రవల్లిక. ఇద్దరిదీ అంగన్‌వాడీ స్కూలు కెళ్లే వయస్సే. 2 ఎకరాల సొంత భూమి ఉంది. పదేళ్ల నుండి పత్తి, మిరప పెట్టేవారు. బోర్ల కోసం ప్రయత్నిస్తే విఫలమయింది. మళ్లీ ప్రయత్నం చేశారు. ఒక సంవత్సరం వానలు ఎక్కువ వచ్చి చేతికి వచ్చిన మిరపపంట మొత్తం పాడయిపోయింది. నాలుగైదు సంవత్సరాలు ఇలానే వర్షం వస్తే ఎక్కువ రావడం, లేకపోతే అసలు రాకపోవడంతో అధిక వడ్డీలతో అప్పుల మీద అప్పులు పెరిగి ఒత్తిడి ఎక్కువయిపోయింది. ఇంట్లో ఉన్న సామాను అమ్మినా గానీ ఫలితం లేకపోయింది. దీనితో సాంబయ్య తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నాడు. అప్పుల వాళ్ల ఒత్తిడితో భూమిని అమ్మకానికి పెట్టాల్సి వచ్చిందని, ఆ కొంచెం భూమి కూడా పోతే తనకు, తన పిల్లలకూ ఇక ఏ ఆధారం కూడా ఉండదని సరిత ఆవేదన. జాతీయ కుటుంబ సంక్షేమ పథకం కింద వచ్చిన రు.5000 తప్పించి ఇంతవరకూ ప్రభుత్వం నుంచి ఏ సహాయం అందలేదు. దరఖాస్తు చేసుకున్నా గానీ 421 జివో కింద ఎక్స్‌గ్రేషియా ఇవ్వలేదు. కూలీ పనులు చేసుకుంటూ ఇద్దరు ఆడపిల్లలతో పాటు అత్తమామల పోషణ భారం కూడా చూసుకుంటోంది.

తండ్రి చనిపోయిన తర్వాత పిల్లల చదువు, భవిష్యత్ మీద చాలా ప్రభావం చూపుతోంది. చదువుకోవాలని ఎంత కోరిక వున్నా గానీ పరిస్థితుల ప్రతికూలతతో పిల్లలు చదువులు మానేసే పరిస్థితి చాలా కుటుంబాలలో ఏర్పడింది. ఇక్కడ ఆడా మగా అన్న తేడా లేదు. ఒకటి రెండు సంవత్సరాల తేడాతో అందరూ చదువులు మానేసిన సంఘటనలు మాకు చాలా ఎదురయ్యాయి. కనీసం హైస్కూలు చదువు వరకూ కూడా కొంత మంది పూర్తి చేయలేకపోయారు. అలాంటి పరిస్థితిలో సిసిసి చేయూతతో డిగ్రీ వరకూ చదువుకున్న కొంతమంది పిల్లల అనుభవాలను పరిశీలిద్దాం.

'మా నాయనకు నేనంటే చాలా ఇష్టం. పెళ్లయిన చానా కాలానికి పుట్టానని బాగా చూసుకునేవాడు. నేను పెద్ద చదువులు చదువుకోవాలని మస్తు కోరుకున్నడు. చిన్నప్పటినుంచి నేను బడిలో ఏ కార్యక్రమంలో పాల్గొన్నా గానీ దాన్ని ఫొటో తీయించి దాచేవాడు. మమ్మల్ని బాగా చదివించాలనే ఆశతో ఉండేవాడు. మా నాయిన ఇలా చనిపోవడంతో మాకేమీ తోచకుండా అయింది. నేను చదువుకునేందుకు ఏ ఆధారం లేదు. బస్ ఛార్జీలు పెట్టుకుని సిద్ధిపేట కాలేజీకి వెళ్లిరావాలంటే చాలా కష్టమయ్యేది. మాకు ప్రభుత్వం నుంచి ఏ రకమైన సహాయం అందలేదు. రైతు ఆత్మహత్య కాదని తిప్పిపంపేశారు. మాకు ఏం చేయాలో తెలియలేదు. దాని గురించి మాట్లాడేవారు లేకపోవడంతో మేం ఏం చేయాలో తెలియక వదిలేశాం. మాకు చదువుకోవడానికి సహాయం చేసేవారుంటే కనీసం డిగ్రీ వరకన్నా చదవాలని ఉంది.'

ఇది మెదక్ జిల్లా తొగుట మండలం పల్లెపహాడ్‌కు చెందిన కవిత వాళ్లింటికి మేం మొదటిసారి 2007లో వెళ్లినప్పుడు మాతో చెప్పిన మాటలు. తండ్రి మల్లాగౌడ్ చనిపోయేనాటికి కవిత ఇంటర్ పూర్తిచేసింది. గౌడ సామాజిక వర్గానికి చెందిన రెండెకరాల రైతు మల్లాగౌడ్‌కు ఒక కూతురు, ముగ్గురు కొడుకులు. వరుస సంవత్సరాలలో ఏర్పడిన కరువు పరిస్థితులతో పాటు, నీటిసౌకర్యం కోసం బోర్ల కోసం అధిక వడ్డీతో తీసుకున్న ప్రైవేట్ అప్పుల భారంతో ఒత్తిడి తట్టుకోలేక మల్లాగౌడ్ 2006లో ఆత్మహత్య చేసుకున్నాడు. ఇంటి పెద్ద ఆత్మహత్య చేసుకోవడంతో కుటుంబం మొత్తం తీవ్రమైన మానసిక సంక్షోభంలోకి కూరుకుపోయింది. కవితతో పాటు ఇతర పిల్లలు కూడా చదువు మానేసే పరిస్థితులు ఏర్పడ్డాయి. సిసిసి అందజేసిన కొద్దిపాటి ఆసరాతో ఇప్పుడు కవిత, ఆమె తమ్ముడు రమేష్ డిగ్రీ పూర్తి చేయగలిగారు.

'సౌర కుటుంబంలో సూర్యుడెంత వెలుగునిస్తాడో, ఒక కుటుంబంలో తండ్రి కూడా అంతే వెలుగునిస్తాడు. అలాంటి మా తండ్రి మాకు దూరమయిన తరువాత చానా కష్టమయిపోయింది. అప్పుల వాళ్ల నుంచి ప్రతిరోజూ అవమానాల నెదుర్కొన్నాం. రోజూ ఇంటికొచ్చి సతాయించే

వారు. మా అమ్మ ఆరోగ్యం కూడా పాడయింది. నాకు మస్తు భయమేసింది. మా కుటుంబంలో ఎవరూ చదువుకోలేదు. నేనే హైస్కూల్ వరకూ వచ్చాను. మా నాయిన చనిపోయిన తర్వాత ఇంక నేనెట్ల చదవాలె అనుకున్న. నాకు చదువుకోవాలని ఉండె. స్కూల్లో ఎవరన్నా మీ నాయిన ఇట్లా... అంటే ఏడుపు వచ్చేసేది. నాయిన చనిపోవడంతో తిండికి వెళ్లేది కూడా కష్టమయింది. అప్పుడు మాకు స్కూల్లో మధ్యాహ్నం అన్నం పెట్టకపోతుండె. మా ఊర్లో హైస్కూలు లేదు, 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఎల్లారెడ్డిపేటకు రోజూ నడిచి వెళ్లి చదువుకునేదానిని. 10వ తరగతి అయిన తరువాత పొలంలో బీన్స్ తెంపేపని, పత్తి ఏరే పని చేస్తూనే ఇంటర్, డిగ్రీ చదివిన. మస్తు ఏడుపు వచ్చేది. ఒక్కోరోజంతా ఏమీ తినకుండానే కాలేజీకి వెళ్లాల్సి వచ్చేది. వారంలో మూడురోజులు తిండి ఉండేది కాదు. మాకు చానాకాలం పాటు ప్రభుత్వం నుంచి ఏ సహాయం అందలేదు. సిసిసి సంస్థ తోడ్పాటుతో 421 జివో కింద నష్టపరిహారం కోసం అప్లికేషన్ పెడ్తే మీ నాయినది నిజమైన రైతు ఆత్మహత్య కాదు అని ఎమ్ఆర్వో ఆఫీస్ నుంచి తిరస్కరించారు. చానాసార్లు తిరిగిన తర్వాత, అప్పుల కాగితాల రుజువులు చూపించిన తర్వాత, మా నాయిన చనిపోయిన ఏడు సంవత్సరాలకు లక్షరూపాయలు ఇచ్చారు. మేం బాంకుల్లో అప్పు తీసుకుంటే మా దగ్గర వడ్డీ కట్టించుకుంటారు కదా, మరి మాకిచ్చేటపుడు కూడా వడ్డీ కట్టి ఇవ్వాలి కదా. ఏం న్యాయం ఇది?'

తొగుట మండలంలోని పెదమాసానిపల్లి గ్రామంలో ముదిరాజ్ సామాజిక వర్గానికి చెందిన అనిత అనుభవం ఇది. అనిత 9వ తరగతిలో ఉన్నప్పుడు 2004లో తండ్రి ఆత్మహత్య చేసుకున్నాడు. ఇంటర్ నుంచి సిసిసి సహాయంతోనే బి.ఇడి. వరకూ చదివి ఇప్పుడు అదే ఊర్లో విద్యా వలంటీరుగా పనిచేస్తోంది. అనిత తల్లి నర్సమ్మ తనకున్న కొద్దిపాటి పొలం సాగుచేసుకుంటూ కూలీ పనికి వెళ్తుంది. ఇలా కొంతమంది పిల్లలు తమ చదువును కొనసాగించడానికి ప్రభుత్వం నుంచి మద్దతు లేకపోయినా గానీ, సామాజిక బాధ్యతతో ఉన్న వ్యక్తులు, సంస్థల నుండి సహాయం అందింది.

రైతు ఆత్మహత్యలను వ్యవసాయరంగ సంక్షోభానికి సంకేతాలుగా తీసుకున్నప్పటికీ ఈ సంఘటనలతో ప్రధానంగా నష్టపోతున్నది ఆయా కుటుంబాలే. రైతు ఆత్మహత్య జరిగిన కుటుంబాలకు నష్టపరిహారం ఇవ్వాలని జయతి ఘోష్ కమిషన్ సిఫార్సులతో వచ్చిన జివో 421 ప్రకారం ఈ కుటుంబాలు 13 డాక్యుమెంట్లతో స్థానిక ఎంఆర్ఓ కార్యాలయంలో దరఖాస్తు చేసుకోవాలని ప్రభుత్వమే చెప్పింది. (అవి: 1) ఎఫ్ఐఆర్ 2) గ్రామ పంచనామా రిపోర్టు, 3) పోస్టుమార్టమ్ రిపోర్టు, 4) ఫైనల్ రిపోర్టు, 5) ఫోరెన్సిక్ ల్యాబ్ రిపోర్టు, 6) ఆత్మహత్య రిపోర్టు అయిన దినపత్రికలు, 7) మూడు సంవత్సరాల సాగు వివరాల పహాణి (రైతు చనిపోయిన సంవత్సరంతో కలిపి) కాపీ, 8) పట్టాదారు పాసుబుక్కు-జిరాక్స్ 9) బ్యాంకు/ప్రైవేట్ అప్పు కాగితాలు, 10) రేషను కార్డు, 11) నామిని పత్రాలు, 12) ఎమ్ఎల్విసి రిపోర్టు, 13) డిఎల్విసి రిపోర్టు.)

ఈ జివో ప్రకారం రైతు ఆత్మహత్య జరిగితే నెలరోజుల లోపల ప్రభుత్వ ఆధ్వర్యంలోని మండల స్థాయిలోని త్రిసభ్య కమిటీ (స్థానిక ఎమ్ఆర్వో, వ్యవసాయ అధికారి, సబ్ ఇన్స్పెక్టర్ ఈ కమిటీ మెంబర్లుగా వ్యవహరించాలి) ప్రత్యక్షంగా గ్రామానికి వెళ్లి విచారణ జరిపి నివేదికను (ఎమ్ఎల్విసి రిపోర్టు) డివిజన్ కమిటీకి పంపించాలి. ఈ డివిజన్ కమిటీలో సభ్యులుగా ఆర్డివో, డిఎస్పి, డిఏవో సభ్యులుగా ఉంటారు. వీరు తమ రిపోర్టును (డిఎల్విసి రిపోర్టు) జిల్లా కలెక్టరుకు పంపించాలి. వారి పిల్లల చదువు ఆగిపోకుండా ఉచిత విద్య, వసతి ఏర్పర్చాలి. ప్రభుత్వ పథకాలన్నింటిలోనూ ప్రాధాన్యతగా అవకాశం ఇవ్వాలి.

అయితే చాలాచోట్ల ఎమ్ఎల్విసి స్థాయి విచారణ కూడా జరగడం లేదు. ఇంక డిఎల్విసి ప్రస్తావన లేకుండానే ఇవి వ్యవసాయ సంబంధిత ఆత్మహత్యలు కావని ఫైళ్లు మూసేస్తున్నారు. బాధిత కుటుంబాలు అన్ని ఆధారాలతో దరఖాస్తు చేసుకున్నాగానీ ఎక్స్‌గ్రేషియా అందటంలేదు. సహాయం కోసం కాళ్లరిగిపోయేలా సంవత్సరాల తరబడి బాధితులు ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరుగుతూ అవమానాల పాలు అవుతూనే వున్నారు.

ఈ విషయమై సిసిసి తరపున ఎచ్ఎంటివి సహకారంతో 'జనఘోష' పేరుతో ఒక ప్రజాబహిరంగ విచారణను ప్రజాప్రతినిధులు, అధికారులు, రాజకీయపార్టీలు, మేధావులు, జర్నలిస్టులు, హక్కుల సంఘాల సమక్షంలో 2010 ఫిబ్రవరిలో మెదక్ జిల్లా సిద్దిపేటలో నిర్వహించడం జరిగింది. 100కి పైగా బాధిత కుటుంబాలు ఈ విచారణలో పాల్గొన్నాయి. దీని ఫలితంగా ఈ సంఘటనల పునర్విచారణకు అధికారులు ఒప్పుకున్నారు. 15 కుటుంబాలకు ఎక్స్‌గ్రేషయా విడుదల చేశారు. మిగిలిన వాటిని ఇంకా పరిశీలిస్తున్నామన్నారు. ఇలా ఎంతో వ్యయప్రయాసల కోర్చి ఒత్తిడి తీసుకురాగలిగిన చోట వేళ్ల మీద లెక్కించదగినంత మందికి ఎక్స్‌గ్రేషియా లభించింది. 2011 నుంచి రాష్ట్రవ్యాపితంగా పనిచేస్తున్న వివిధ సంఘాలు 40కి పైగా కలిసి రైతు స్వరాజ్య వేదిక పేరుతో ఒక నెట్వర్క్‌గా పనిచేస్తూ ఈ కుటుంబాలను సమీకృత పరుస్తూ జిల్లా స్థాయిల్లో, రాష్ట్ర స్థాయితో సదస్సులు నిర్వహిస్తూ ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావడం జరుగుతోంది. ఇదే అంశం మీద జాతీయ స్థాయిలో 2012 నవంబరులో దాదాపు వివిధరాష్ట్రాలలో పనిచేస్తున్న 100 సంఘాలు కలిసి ఒక ప్రజావిచారణను చేపట్టి, ప్రభుత్వం తక్షణం ఆత్మహత్యల నివారణకు దృష్టి సారించాలని, చనిపోయిన రైతు కుటుంబాలకు తక్షణ ఆర్థిక సహాయంతో పాటు ఆ కుటుంబాలకు శాశ్వత జీవనోపాధుల గురించి ఆలోచించాలని, సమగ్రమైన వ్యవస్థాగత రుణాలను అందించాలని, ప్రైవేట్ రుణ వ్యవస్థను నియంత్రించాలని, రైతుకు అనుకూలంగా ఉండే విధానాల మార్పు అత్యవసరమని చెప్తూ ఒక రిపోర్టును అందించాయి. ఈ ప్రజాబహిరంగ విచారణలో 16 రాష్ట్రాల నుండి బాధిత కుటుంబాల స్త్రీలు హాజరయ్యారు.

ఎక్స్‌గ్రేషియా కోసం కాళ్లరిగిపోయేలా తిరుగుతున్న మరికొన్ని కుటుంబాల వ్యధను ఇక్కడ చూద్దాం.

మెదక్ జిల్లా తొగుట మండలం కాన్గల్ గ్రామంలో చాకలి సామాజిక వర్గానికి చెందిన పోతరాజు కనకయ్య 2007 జనవరి 28న ఆత్మహత్య చేసుకున్నాడు. భార్య కనకవ్వ. భార్యభర్తలిద్దరూ తమకు ఉన్న రెండున్నర ఎకరాల భూమిలో వ్యవసాయంతో పాటు తమ కులవృత్తి చేసుకుంటూ జీవనం కొనసాగిస్తూ ఉండేవారు. ఇద్దరు పిల్లలు. ఒక అబ్బాయి, ఒక అమ్మాయి. వృద్ధురాలైన కనకయ్య తల్లి. కనకయ్య తనకున్న రెండున్నర ఎకరాల భూమిలో మక్కజొన్న, పొద్దు తిరుగుడు వేశాడు. నీటి సౌకర్యం

కోసం అప్పు చేసి రెండు బోర్లు వేశాడు. అందులో ఒకటి పూర్తిగా విఫలం కాగా రెండవ దానిలో నామమాత్రంగా నీళ్లు పడ్డాయి. ఇలా కొద్దిపాటి నీళ్లతో వ్యవసాయం సాగిస్తూ మూడు సంవత్సరాలు గడిపాడు. వర్షాలు లేక వేసిన పంటలు వరి, మక్కజొన్న, పొద్దు తిరుగుడు దిగుబడి సరిగ్గా రాక, చేసిన అప్పులు తీర్చలేకపోవడంతో అవి వడ్డీతో సహా ఎక్కువ అయ్యాయి. 2006 సంవత్సరంలో వేసిన పొద్దుతిరుగుడు పంటకు వర్షాలు లేక, నీళ్లు అస్సలు అందక పంట పూర్తిగా ఎండిపోవడంతో అప్పుల ఒత్తిడితో కనకయ్య ఆత్మహత్య చేసుకున్నాడు. కనకయ్య మరణించిన తరువాత కుటుంబ భారమంతా కనకవ్వ పైనే పడింది. వీరికి ప్రభుత్వం నుండి ఇప్పటివరకూ ఎటువంటి సహాయం అందలేదు. ఎన్.ఎఫ్.బి.ఎస్ అందలేదు. అడిగిన అన్ని డాక్యుమెంట్లు పెట్టి దరఖాస్తు చేసినా గానీ 421 జీవో కింద ఒక లక్షా యాభైవేల రూపాయలు రాలేదు. ఇప్పటివరకూ ఎన్నోసార్లు అధికారుల చుట్టూ తిరిగినా గానీ ఏ ఫలితమూ లేదు.

దౌల్తాబాద్ మండలంలోని ఇందుప్రియాల్ గ్రామానికి చెందిన సూరంపల్లి లచ్చయ్య ఒక ఎకరం భూమి కలిగిన దళిత రైతు. 2007లో ఆత్మహత్య చేసుకున్నాడు. ఉన్న ఆ ఒక్క ఎకరంలో పంట పండాలంటే వర్షమే ఆధారం. భార్య, నలుగురు కూతుళ్లు, ఒక కొడుకు. అందరూ చిన్న పిల్లలు. కుటుంబ జీవనాధారం ఆ ఎకరమే. సాగునీటి కోసం అప్పు చేసి నీరు వచ్చేవరకూ బోరు మీద బోరు వేశాడు. కొద్దిగా నీరు పడింది. అందులో విద్యుత్ మోటారును ఏర్పాటు చేసే ప్రయత్నంలో అది సైతం బోరులోపలికి పడిపోయింది. నీటికోసం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అప్పులు పెరిగిపోయాయి. అప్పుల తీవ్రతతో మనస్థాపానికి గురై 2007 మే 29న పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. లచ్చయ్య చనిపోవడంతో భార్య తీవ్ర అనారోగ్యానికి గురయింది. కుటుంబానికి కనీసం తిండి కూడా గడవని పరిస్థితులు ఏర్పడ్డాయి. అతని రెండో కూతురు జ్యోతి చిన్న వయస్సులోనే కుటుంబ బాధ్యత నెత్తినేసుకుని కూలి పనికి వెళ్లటం మొదలుపెట్టింది. ఘటన జరిగి అయిదేళ్లు అయినా ఇంతవరకూ జ్యోతి కుటుంబానికి ప్రభుత్వం నుంచి సహాయం అందలేదు.

ఈ సంఘటనలో కొసమెరుపు ఏమిటంటే, 2010 నవంబరులో వ్యవసాయం గురించి పనిచేసే వివిధ సంఘాల నెట్‌వర్క్ దేశవ్యాపితంగా చేపట్టిన కిసాన్ స్వరాజ్య యాత్ర సందర్భంగా హైదరాబాద్‌లో జరిగిన ఒక సభలో అప్పటి రాష్ట్ర వ్యవసాయశాఖా మంత్రి రఘువీరారెడ్డి ముఖ్య అతిథిగా వచ్చారు. సభకి అధ్యక్షత వహించింది హెచ్‌ఎంటివి ఛీఫ్ఎడిటర్ రామచంద్రమూర్తి. మంత్రిగారు ప్రసంగించిన తర్వాత సభలోనే ఉన్న జ్యోతి 'రైతులు ఆత్మహత్యలు చేసుకోకుండా ప్రభుత్వం ఎందుకు చర్యలు తీసుకోదు, మాలాంటి పిల్లలు అనాథలుగా మారకుండా చూసే బాధ్యత ప్రభుత్వానిది కాదా' అని సూటిగా ప్రశ్నించింది. జ్యోతి మాటలకు స్పందించిన ఆయన అప్పటికప్పుడు ఆ అమ్మాయిని సచివాలయంలోని తన కార్యాలయానికి పిలిపించుకుని, వారి రికార్డులన్నీ పరిశీలించి, ఈ కుటుంబానికి ఎక్స్‌గ్రేషియా వచ్చే అర్హత ఉందని వెంటనే అందించవలసిందిగా స్వయంగా అప్పటి మెదక్ జిల్లా కలెక్టరు సురేష్‌కుమార్ లేఖ రాసిచ్చారు. అలానే అప్పటి ముఖ్యమంత్రి రోశయ్యకు, రెవెన్యూశాఖా మంత్రి ధర్మాన ప్రసాదరావుకు కూడా ఉత్తరాలు రాశారు.

**1995-2011 సంలలో దేశవ్యాపితంగా నమోదయిన రైతు ఆత్మహత్యల సమాచారం**

| రాష్ట్రం పేరు | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 27284 | 6042 | 33326 |
| అరుణాచల్‌ప్రదేశ్ | 170 | 31 | 201 |
| అస్సాం | 3602 | 276 | 3878 |
| బీహార్ | 1121 | 197 | 1318 |
| ఛత్తీస్‌ఘర్ | 11686 | 2654 | 14340 |
| గోవా | 164 | 7 | 171 |
| గుజరాత్ | 7813 | 1548 | 9361 |
| హర్యానా | 2989 | 215 | 3204 |
| హిమాచల్‌ప్రదేశ్ | 602 | 75 | 677 |
| జమ్ము, కశ్మీర్ | 170 | 31 | 201 |
| జార్ఖండ్ | 881 | 51 | 932 |
| కర్నాటక | 30433 | 6720 | 37153 |
| కేరళ | 18349 | 1388 | 19737 |
| మధ్యప్రదేశ్ | 22170 | 5878 | 28048 |
| మహారాష్ట్ర | 47930 | 5888 | 53818 |
| మణిపూర్ | 15 | 5 | 20 |
| మేఘాలయ | 131 | 25 | 156 |
| మిజోరాం | 65 | 6 | 71 |
| నాగాల్యాండ్ | 22 | 3 | 25 |
| ఒడిశా | 3994 | 610 | 4604 |
| పంజాబ్ | 1342 | 19 | 1361 |
| రాజస్థాన్ | 8287 | 1246 | 9533 |
| సిక్కిం | 296 | 93 | 389 |
| తమిళనాడు | 11734 | 2764 | 14498 |
| తమిళనాడు | 751 | 404 | 1155 |
| ఉత్తరప్రదేశ్ | 8330 | 1685 | 10015 |
| ఉత్తరాఖండ్ | 274 | 69 | 343 |
| పశ్చిమ బెంగాల్ | 16132 | 4006 | 20138 |
| **మొత్తం రాష్ట్రాలు** | **226737** | **41936** | **268673** |
| కేంద్రపాలిత ప్రాంతాలు | 0 | 0 | 0 |
| అండమాన్ & | | | |
| నికోబార్ దీవులు | 149 | 1 | 150 |
| ఛండీఘర్ | 5 | 0 | 5 |
| దాద్రా & నాగర్‌హవేలి | 245 | 15 | 260 |
| దామన్ & డయ్యూ | 6 | 0 | 6 |
| ఢిల్లీ (ఉత్తరప్రదేశ్) | 255 | 13 | 268 |
| లక్షద్వీప్ | 0 | 0 | 0 |
| పుదుచ్చేరి | 1461 | 117 | 1578 |
| **మొత్తం రాష్ట్రాలు** | **2121** | **146** | **2267** |

జ్యోతి తన చెల్లెళ్లతో సహా స్వయంగా వాటిని తీసుకుని జిల్లా కలెక్టరుని కలిసింది. స్వయంగా క్యాబినెట్ మంత్రిగారు ఆదేశించినా ఇంతవరకూ ఏ సహాయమూ అందలేదు. జ్యోతి ఒక్కసారి కాదు కనీసం ఇప్పటికి 20 సార్లన్నా మండల అధికారుల చుట్టూ తిరిగి ఉంటుంది. ఇంకా తిరుగుతూనే ఉంది.

మరో సంఘటన, ఆదిలాబాద్ జిల్లా, సారంగపూర్ మండలం, గోపాల్ పేట గ్రామానికి చెందిన మందా వెంకటిది. భార్య నర్సవ్వ. ఇద్దరు పిల్లలు కొడుకు హరీష్, కుతురు హారిక. హరీష్ ఇంటర్ పూర్తి చేశాడు. హారిక 10వ తరగతి పూర్తి చేసింది. వెంపటి తనకున్న రెండు ఎకరాలు స్వంత భూమిలో వ్యవసాయం చేసుకుంటూ గ్రామీణ ఉపాధి హామీ పనికి వెళ్లుతూ జీవనం కొనసాగిస్తుండేవాడు. నీటి సౌకర్యం లేని భూమి కావడంతో వర్షాల పైనే ఆధారపడవలసి వచ్చేది. గత 5,6, సంవత్సరాలుగా పత్తి పంట దిగుబడి చాల తక్కువగా వస్తుండేది. దానికి తోడు ఆరోగ్యం పాడవడంతో వైద్యానికి గాను దాదాపు 50 వేల రూపాయలు ఖర్చు అయింది. 2011లో రెండు ఎకరాలలో పత్తి వేస్తే కేవలం 25 కిలోగ్రాముల పత్తి వచ్చింది. పంట లేకపోవడంతో మొత్తం అప్పులు 2 లక్షలు దాటి పోయాయి. అప్పులు తీరే మార్గం లేదనుకున్న వెంకటి 11-08-2011 నాడు ఇంటిలోనే ఉరి పెట్టుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. ఇప్పటి వరకూ కనీసం గ్రామస్థాయి రెవిన్యూ అధికారి కూడా ఆ కుటుంబాన్ని సందర్శించలేదు. భార్య నర్సవ్వకు వితంతువు పింఛన్ మంజూరు కోసం ప్రపోజల్స్ కూడా పంపలేదు. ఈ కుటుంబానికి ప్రస్తుతం తెల్లకార్డు మీద ఇస్తున్న 12 కిలోల బియ్యమే ఆధారం. తండ్రి చనిపోవడంతో పిల్లల చదువు సమస్యగా మారింది. వీరు చదువుకొనసాగించాలంటే ప్రతి రోజు గోపాల్‌పేట నుండి నిర్మల్ కు వెళ్లి రావలసి ఉంటుంది. ప్రస్తుతం వీరి తల్లి నర్సవ్వ ఆరోగ్య పరిస్థితి కూడా బాగా లేదు.

ఎక్స్‌గ్రేషియా అంశాన్ని పక్కన పెడితే కనీసం ఇప్పుడున్న పథకాలేవీ కూడా ఈ కుటుంబాలకు ఎక్కడా సక్రమంగా అందటం లేదని స్పష్టంగా తెలుస్తోంది. దీనికి పెద్ద ఉదాహరణ ఈ కుటుంబాల స్త్రీలకు రు.200 వితంతు పింఛన్ కూడా రాకపోవడం, 35 కేజీల బియ్యం వర్తించే అంత్యోదయ కార్డు ఇవ్వకపోవడం. అలా వచ్చిన వాటిని వేళ్ల మీద లెక్కించవచ్చు. అయితే, వితంతు పింఛను, అంత్యోదయ కార్డులు లాంటివి ఇచ్చిన కొన్నిచోట్ల మా ప్రభుత్వం వీరి సంక్షేమం గురించి చాలా చేస్తోందని చెబుతూ, ఆయా కుటుంబాల సుస్థిర జీవనాధారాల గురించి కనీసం కూడా పట్టించుకోకుండా చేతులు దులుపుకుంటున్నారు. అంటే ఒక కుటుంబానికి జీవనాధారమైన వ్యక్తి విలువ నెలకు రు.235లు మాత్రమే. అందుకే వీరిని మిగతా పథకాలలో అందరిలో భాగంగా చూడకూడదని ప్రధానమైన డిమాండ్‌గా ఒత్తిడి తీసుకురాగలగాలి.

ఈ కుటుంబాలలోని వారు వ్యవసాయ సంబంధిత అప్పుల భారంతో ఆత్మహత్యలు చేసుకుంటున్నారని ప్రభుత్వం నమ్మితే కదా కనీసం ఈ కొద్దిపాటి అంశాలైనా ఆలోచించేది. అయితే సమస్య పరిష్కారం ఎక్స్‌గ్రేషియాతోనో, కొన్ని రకాల సంక్షేమ పథకాలతోనో ఎప్పటికీ లభించదు. చిన్న, సన్నకారు రైతులకు భరోసా నివ్వగలిగే విధానాల మార్పు కోసం ప్రయత్నించాలి. అలాగే ఒక ప్రత్యేక దృష్టితో వ్యవసాయం కొనసాగించేలా, జీవనోపాధులు పెరిగేలా ఈ కుటుంబాలలోని స్త్రీలకు మద్దతు వ్యవస్థలను రూపొందించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే. ఈ విధానాల మీద నిరంతరం కృషి జరుపుతూనే, గ్రామ స్థాయి నుంచి చిన్న, సన్నకారు రైతులను ముఖ్యంగా మహిళా రైతులను సంఘటితం చేయాల్సిన అవసరం ఉంది. దీనికి చాలా సమయం పెట్టాల్సి ఉంటుంది. సాధారణంగా ఏం జరుగుతుందంటే పౌరసమాజ సంస్థల పనివిధానం కూడా జండర్ అంశాలకు, స్త్రీల ప్రాతినిధ్యాన్ని కేవలం బాధిత స్త్రీలుగానే ముందుకి తీసుకువస్తున్నారు గానీ, వారిని ఎక్కడికక్కడ స్థానిక సంఘాలుగా కూడగట్టే ప్రయత్నం చాలా కొద్దిగానే జరిగిందని చెప్పాలి. ఇప్పటి వరకూ ఒక్క సిద్దిపేటలోనే ఈ బాధిత కుటుంబాల స్త్రీలతో 'రైతు ఆత్మహత్యల బాధిత కుటుంబాల పోరాట వేదిక' ఏర్పడి తమకు న్యాయంగా రావలసిన హక్కుల కోసం సంఘటితంగా పోరాటం చేస్తున్నారు. ఏ విధాన కారణాలు రైతులను ముఖ్యంగా మగవారిని ఆత్మహత్యలకు నెడుతున్నాయో అవి స్త్రీలను పూర్తిగా విస్మరించిన విధానాలు. అ విధానాల మార్పు అంటే జండర్ అంశాల ప్రాముఖ్యతతో ఉండాలి తప్పించి మళ్లీ స్త్రీలను ఒక పక్కకు నెట్టేసే విధంగా, ఆధారపడేవ్యక్తులుగానే ఉంచకూడదు. ప్రాతినిధ్య ప్రాధాన్యత మారాల్సిన అవసరం చాలా ఉంది. దీనిగురించి ఆలోచించటానికయినా, పనిచేయటానికైనా సహనం ఉండి తీరాలి.

'వ్యవసాయానికి ప్రధానంగా కావలసింది వ్యవస్థాగత మద్దతులు. స్త్రీలు రైతులుగా చట్టప్రకారం, సామాజికంగా కూడా గుర్తించబడక పోవడం వల్ల వీటికి దూరమవుతున్నారు. సాధారణంగా, స్త్రీలకు అప్పు ఇవ్వటం పట్ల బ్యాంకులకు కూడా చాలా అభ్యంతరాలుంటాయి. పురుషులకు అప్పు ఇవ్వడానికి ఏ మాత్రం సంశయించని (ఇక్కడ కుల, మత, వర్గ, పేద, ధనిక తారతమ్యా లుంటాయేమో గానీ, పురుష జెండర్ కారణంగా తిరస్కృ మాత్రం ఉండదు) స్త్రీలకు మాత్రం భర్త లేదా కుటుంబంలోని పురుషుల హామీని అడుగుతాయి. అందుకోసం ఒత్తిడి చేస్తాయి.' (కె.సజయ, 'స్త్రీల భూమి హక్కుల పోరాటాలు, సంధిస్తున్న ప్రశ్నలు' : స్త్రీవాద రాజకీయాలు-వర్తమాన చర్చలు, 2008)

అందుకే మద్దతు లేకుండా వ్యవసాయం కొనసాగించలేం అని ఈ కుటుంబాల స్త్రీలు పదే పదే చెప్తున్నారు. భర్తలు ఆత్మహత్య చేసుకోగా కుటుంబభారాన్ని ఒంటరిగా నెత్తినెత్తుకున్న స్త్రీల వ్యధలో కుటుంబ మద్దతు సరే, వ్యవస్థాగత మద్దతుల సంగతేమిటి అనే ప్రశ్న అర్థం కావాలంటే వారు మాట్లాడుతున్న దానిని కేవలం భర్త లేకపోవడం అనే పరిమిత అంశంగా మాత్రమే అర్థం చేసుకోకూడదు. రైతు ఆత్మహత్యల బాధిత స్త్రీలు ఏం మాట్లాడుతున్నారో అర్థం చేసుకోవడానికి, వారికి మనోబలం కూడగట్టడానికి, చేయూత నందించడానికి, తిరిగి వ్యవసాయంలో కొనసాగడానికి లేదా వ్యవసాయాధారిత అనుబంధ జీవనోపాధుల గురించి ఆలోచించడానికి, అందించడానికి ఎక్కడికక్కడ స్వతంత్ర ప్రతిపత్తితో ప్రజాస్వామికంగా పనిచేయగలిగే విధంగా స్థానిక సంఘాల సమాఖ్యలు ఏర్పడాల్సి ఉంది. వాటిలో ఈ స్త్రీల ప్రాతినిధ్యాన్ని, నాయకత్వాన్ని గణనీయంగా పెంచాల్సిన అవసరం ఎంతైనా ఉంది. విభిన్న ఆలోచనలు, భావాలతో ఉండే వ్యక్తులు, సంస్థలు కలిసి ప్రజాస్వామికంగా పనిచేయగలిగే విధంగా వేదికలు ఏర్పడాలి గానీ అవి స్థానిక అస్తిత్వాలను మింగేసేవిధంగా ఉండకూడదు. స్త్రీలకు ప్రాధాన్యత లేని వేదికలుగానూ మిగిలిపోకూడదు.

**ముగింపు**

వ్యవసాయంలో రైతుల ఆత్మహత్యలు ఆగాలంటే ఏవో కొద్దిమంది చేసే కార్యక్రమాలు సరిపోవు. పరిస్థితి మారాలంటే ఏ విధానాలైతే దీనిక కారణమో ఆ విధానాలలో రైతులకు ఆత్మస్థయిర్యం కలిగించే మార్పు తీసుకోవడం తప్పించి వేరే మార్గం లేదు. జాతీయ ఆహార విధానాలలో స్థానిక ఆహార ఉత్పత్తులకే ప్రాధాన్యత ఇవ్వటంతో పాటు వ్యవసాయ దిగుబడులు పెరిగేలా ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచాలి. అంటే వ్యవసాయం లాభసాటిగా ఉండడంతో పాటు ఉత్పత్తి సామర్థ్యం పెరగాలి. రైతులందరికీ తాము పండించిన పంటకు గిట్టుబాటు ధర లభించేలా చూడడం దీనిలో ముఖ్యాంశమవుతుంది. అంతేకాకుండా రైతులు స్వచ్ఛందంగా ముందుకు రావాలే తప్పించి ప్రభుత్వ నిర్బంధపు ధాన్యసేకరణ వ్యవస్థలో ఉండిపోకూడదు. దేశంలో స్థానిక ఆహారధాన్యాల ఉత్పత్తులను పెంచగలిగే విధంగా దృష్టి పెట్టాలి. దీనివలన అంతర్జాతీయ మార్కెట్ మీద ఆధారపడే పరిస్థితి ఉండదు. దీనికోసం రైతులకు అవసరమైన అనేక సంస్కరణాంశాల అమలు మీద వేగవంతమైన శ్రద్ధ పెట్టాల్సి ఉంటుందని జాతీయ రైతు కమిషన్లు అనేక సూచనలను ఇచ్చాయి. వీటివలన ఆహార పంటలు పండించే రైతులకు ఉత్పత్తి సామర్థ్యంతో పాటు ఆర్థిక స్వావలంబన కూడా పెరుగుతుంది. ఈ విధానం విజయవంతంగా అమలు జరగాలంటే ముఖ్యమైన అంశం స్థానిక మార్కెట్లో ధరలు పెరగకుండా స్థిరంగా నిలిచిఉండాలి. ధరల నిరంతర అస్థిరతను అరికట్టాలి. అలాగే బయోఫ్యూయల్ అవసరాల కోసం ఆహార ధాన్యాల ఉత్పత్తి చేయడాన్ని నిరోధించాలి. వ్యవసాయ పెట్టుబడులు పెరిగిపోవటాన్ని నియంత్రించాలి. భూసారం తగ్గిపోయే విధంగా పంటవిధానాలు ఉండకూడదు. అలాగే వ్యవసాయ పరిశోధనకు, విస్తరణ సేవలకు సరిపడినన్ని నిధులు కేటాయించాలి. వివిధ రకాలుగా వాతావరణ మార్పులతో ప్రభావితమవుతున్న పంటల రక్షణకు అధిక ప్రాధాన్యత ఇవ్వాలి.

పెరుగుతున్న ఆత్మహత్యలు సామాజిక రుగ్మతలకు అద్దం పడుతున్నాయి. రైతుల ఆత్మహత్యలు వ్యవసాయరంగంలో సంక్షోభానికి, ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిదర్శనమని మళ్లీ మళ్లీ పునరుద్ఘాటించవలసిందే. పౌరసమాజ స్పందన పరిస్థితుల్లో కొంతమేరకు మార్పు తీసుకోవడానికి తోడ్పడినప్పటికీ, ప్రభుత్వ విధానాల్లో మార్పు రానంతకాలం సంక్షోభం ఇంకా తీవ్రమయ్యే ప్రమాదం ఉంది. రైతు ఆత్మహత్యలను, ఆహార అభద్రతను కేవలం ఎవరో కొందరికి మాత్రమే పరిమితమైన ప్రత్యేక సమస్యలుగా చూడడానికి వీలులేదు. ఇవి ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో వస్తున్న సంక్షోభంగా గుర్తించాలి.

(మా ఈ పనిలో క్షేత్ర స్థాయిలో సహకరిస్తున్న విద్యార్థి వాలంటీర్లకు, ఉపాధ్యాయులకు ఇంకా అనేక మంది మిత్రులకు మా కృతజ్ఞతలు. ఈ కుటుంబాల పిల్లల చదువు కొనసాగడానికి చేతనయినంత సహకరించ వలసిందిగా ప్రతిఒక్కరికీ మా విజ్ఞప్తి.)

*(రచయితలు కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్ బాధ్యులు)*

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం**

**పరిహారం–ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాలకు ప్రత్యేక ప్యాకేజితో కూడిన ఆర్థిక సహాయం, పునరావాస ఏర్పాటు – ఉత్తర్వులు – జారీ**

ఆదాయశాఖ (డి.ఎ.2) – ప్రభుత్వ ఉత్తర్వు సంఖ్య 421, 1 జూన్, 2004

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో, ఈ మధ్య రైతు కుటుంబాలలో జరిగిన విషాద సంఘటనలు–రైతుల ఆత్మహత్యలను ప్రభుత్వం పరిశీలించిన మీదట, అటువంటి ఆత్మహత్య చేసుకోవటానికి వరుస కరువులు, చీడ తెగుళ్లు వంటి ప్రకృతి సిద్ధమైన ఆపదలు, ప్రతి సంవత్సరం పెరుగుతున్న రుణాలు వాటి వలన కుటుంబానికి కలిగే సామాజిక అవమానం, ఆర్థిక పరమైన ఒత్తిడులు, మానసిక వ్యథ–దాని ఫలితంగా సామాజిక వెలిలాంటి ఎన్నో కారణాలు కావచ్చు. అన్నీ కలిసి చివరికి ఆత్మహత్యలకు దారి తీస్తున్నాయి. కుటుంబాన్ని పోషించే వ్యక్తిని కోల్పోవడం అనేది ఆ కుటుంబాలకు జరుగుతున్న విషాదమే కాకుండా దేశం ఒక రైతుని కోల్పోతోంది.

ఇటువంటి ఆత్మహత్యల వల్ల ఎదురయ్యే పరిస్థితులలో చర్య తీసుకోవటానికి ప్రభుత్వం, ఈ ఉత్తర్వులో వివరించినట్లుగా, ఒక మంత్రివర్గ అనుబంధ కమిటీని నియమించింది. ఈ కమిటీ నివేదిక పరిశీలనలో ఉండగానే, ప్రభుత్వం ఆత్మహత్యలకు పాల్పడిన రైతుల కుటుంబాలకు మధ్యంతర ఆర్థిక సహాయం అందించడానికి నిర్ణయించింది. దీని ప్రకారం ప్రభుత్వం, ఆపదలో వున్న కుటుంబ సభ్యులకు సహాయపడే విధంగా మూడు స్థాయిల్లో అమలు జరిపే ఈ కింది మధ్యంతర ప్రత్యేక పాకేజీని రూపొందించినది.

**1. ఆర్థిక సహాయం**

వ్యవసాయ సంబంధిత విషయాలతో ఆత్మహత్యలు జరిగినప్పుడు ఆ కుటుంబానికి/చనిపోయిన వారి కుటుంబ సభ్యులకు రు. 1,00,000 (లక్ష రూపాయలు మాత్రమే) ఆర్థిక సహాయం ఇవ్వటం, అంతేకాక రు. 50,000 (యాభైవేల రూపాయలు మాత్రమే) మించకుండా బాధితుల అప్పు తాలూకు లావాదేవీలు ఒక్కసారి పరిష్కార మొత్తంగా రుణదాతలకు ఇవ్వటం జరుగుతుంది.

చనిపోయిన వారి కుటుంబ సభ్యులకిచ్చే ఒక లక్ష రూపాయల ఎక్స్‌గ్రేషియాని అధికారిక బ్యాంకులో బాధితుల చట్టపరమైన వారసులతో పాటుగా మండల రెవెన్యూ అధికారి (ఎమ్.ఆర్.ఒ.) తో ఉమ్మడి ఖాతాను తెరిచి అందులో జమచేయాలి. రైతు ఆత్మహత్య జరిగిన ప్రదేశ అధికారి పరిధిలో వున్న మండల స్థాయి పునరావాస కమిటీ అధికారిచే ఈ ఖాతా నిర్వహణ ఉంటుంది. కమిటీ గుర్తించిన రుణదాతలైన వ్యక్తి/వ్యక్తులకు పరిష్కార రూపాన అప్పు (రు. 50,000 మించకుండా) అందినట్లు తెలియజేసే సరైన రసీదు తీసుకుని కమిటీ పర్యవేక్షణలో అందజేసి, బాధితుల కుటుంబంపై మరే ఇతర చెల్లింపులు చేసే బాధ్యత లేదన్న విషయాన్ని స్పష్టంగా తెలియజేయాలి.

ఈ అకౌంట్ నిర్వహణలో జరిగే ఖర్చుని మొదలు జిల్లా కలెక్టర్ రివాల్వింగ్ నిధి నుండి భరించాలి. ఆ తరువాత సరైన ప్రతిపాదనలను దాఖలు చేసి ముఖ్యమంత్రి ఉపశమన నిధి నుండి ప్రభుత్వ ఆదాయశాఖ ద్వారా తిరిగి చెల్లింపు పొందాలి.

**నిర్ధారణ ప్రక్రియ**

ఆత్మహత్య సంఘటన సరైనదేననే ధృవీకరణకు ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. అందులో సభ్యులుగా ఈ కింది వ్యక్తులు ఉంటారు.

1. ఆర్.డి.ఒ./సబ్ కలెక్టర్ : అధ్యక్షులు/సభ్యులు
2. డిప్యూటీ సూపరింటెండెంట్ : సభ్యులు
3. అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ : సభ్యులు

ఈ కమిటీ ఆత్మహత్య చేసుకున్న రైతు నివాస ప్రదేశంపై వుండే అధికార పరిధి ప్రతి సంఘటనను తనిఖీ చేసి వ్యవసాయ సంబంధిత ఆర్థిక బాధలతో, సామాజిక అవమానాలతో జరిగిన ఆత్మహత్యగా నిర్ధారించాలి. అంతేకాక బ్యాంకు అధికారులు రుణదాతలతో, కుటుంబ సభ్యులతో, గ్రామస్థులతో కూర్చుని రుణ విముక్తికై ఒక్కసారిగా యిచ్చే ఆర్థిక పరిష్కార ప్యాకేజీని తయారు చేయాలి.

**పునరావాస ప్యాకేజీ**

ధృవీకరణ కమిటీ నిర్ధారణ అనంతరం రు. 50,000 (యాభై వేలు) అప్పు చెల్లించాలి. ఆ తరువాత కుటుంబ వ్యవసాయ పునరావాస ప్రక్రియ మొదలౌతుంది. ఇందుకోసం ఎమ్.ఆర్.ఓ./మండల వ్యవసాయ అధికారి పరిధిలో వ్యవసాయ కార్యకలాపాలకు అవసరమైన పంటల మార్పు చేర్పులను, సాంకేతిక పరమైన మార్పు చేర్పులను, సంబంధిత వ్యవసాయ శాఖల సలహాపై నిర్ణయించాలి. మండల బృందం ప్రధాన బాధ్యత బాధిత కుటుంబానికి సరైన పునరావాసం కల్పించటం. దీని కోసం ఈ బృందం కనీసం ఒక సంవత్సరం లేక తగినంత కాలం పని చేసి, సదరు కుటుంబాన్ని ఆపదనుండి వెలికి తీసుకుని రావాలి.

దీనితోపాటుగా సామాజిక పరమైన సాంత్వన అందజేయడానికి తగిన చర్యలు ఈ కింది విధంగా తీసుకోవాలి.

1. సాంఘిక, సంక్షేమ స్కూళ్లల్లోను, హాస్టళ్లల్లోను పిల్లలను చేర్పించాలి.
2. ఇందిరా ఆవాస్ యోజన పథకంలో ఇళ్ల కేటాయింపు
3. ప్రభుత్వ సంక్షేమ పథకాల కింద ఆర్థిక సహాయం.
4. పింఛను వగైరా.

ఇంకా ఇటువంటి సంఘటనలలో ప్రభుత్వం అవసరమైనప్పుడు అర్హత నిబంధనల మినహాయింపు అందించాలి. ఈ ఉత్తర్వులు ప్రధానంగా 01.07.1998 నుండి వ్యవసాయ సంబంధిత ఆత్మహత్య సంఘటనలన్నిటికీ వర్తిస్తాయి.

బాధిత కుటుంబ సభ్యులు ఇంతకు మునుపు ఎటువంటి పరిహార/ఉపశమన/ఆర్థిక సహాయం లభించనివారు, వారి వారి పూర్తి సమాచారంతో రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్‌కు (ఆ ప్రాంత అధికారిక పరిధి కలిగినవారికి) దరఖాస్తు చేసుకోవాలి. దరఖాస్తు అందుకున్న వెంటనే రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు ఈ ఉత్తర్వులను అనుసరించి తగిన విధంగా తదుపరి చర్యలు చేపట్టాలి.

**నివారణ చర్యలు :**

ప్రతి కలెక్టరు కార్యాలయం నుండి హెల్ప్‌లైన్ నిర్వహణ కొనసాగాలి. ఆ హెల్ప్‌లైన్ సహాయంతో ఒక రైతు గాని వారి స్నేహితులు, బంధువులు, కుటుంబ సభ్యులెవరైనా లేదా శ్రేయోభిలాషులెవరైనాగాని అటువంటి సంఘటన జరగనున్నదని గ్రహించిన వెంటనే కలెక్టర్ దృష్టికి తీసుకురావాలి. అటువంటి సమాచారం అందిన వెంటనే కలెక్టరు కార్యాలయం నుంచి డివిజన్ ఆఫీసర్‌కు ఆ సమాచారాన్ని అందజేసి ఆర్.డి.ఓ., వారి యంత్రాంగం వెంటనే ఆ కుటుంబాన్ని చేరుకుని జిల్లా స్థాయిలో సముచితమైన సలహా, సహాయాన్ని తగిన విధమైన ప్యాకేజీ అందించగలిగి రుణదాతల ఒత్తిడి నుంచి వారిని రక్షించగలగాలి. అటువంటి సంఘటనలను అమలులో ఉన్న ప్రభుత్వ పథకాలనుండి లబ్ది దొరికే అత్యంత ప్రాముఖ్యమైన కేసులుగా పరిగణించాలి.

హెల్ప్‌లైన్ నిర్వహణ కొరకు పెట్టిన ఖర్చు తాలూకు డబ్బును ముఖ్యమంత్రి ఉపశమన నిధి నుండి పొందాలి. అన్ని జిల్లాల కలెక్టర్లు పైన చెప్పిన విషయాలపై తగిన చర్యలు చేపట్టమని విజ్ఞప్తి చేస్తున్నాం. కార్యనిర్వహణకై మార్గదర్శక సూచనలను త్వరలో జారీ చేయబడతాయి. (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు గవర్నరు గారి ఉత్తర్వులు)

**ఏ.కె. గోయల్,** ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి

# ప్రజాస్వామ్యం మెరిసిపోతుందా? సమసిపోతుందా?

*కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ-2 పాలన అభివృద్ధి మాయాజాలంతో ప్రజలను భ్రమల్లో ముంచి ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తోందని అంటున్నారు* **వి. హనుమంతరావు**

దేశంలో ప్రజాస్వామ్యం ధగధగా మెరిసిపోతోందా? విలవిలా గింజుకొంటోందా? భగభగా మండిపోతోందా? 2004 ఎన్నికల్లో ధగధగా మెరిసిపోతోందని బిజెపి నినాదం వల్లించి బొక్కబోర్లా పడింది. గెలిచిన మన్మోహన్‌సింగ్ ఏమైనా సాధించాడా? ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించాడా, పటిష్ట పరిచాడా అంటే వామపక్షాలు బయట ఉండి చెయ్యి అందించబట్టి ప్రజాస్వామ్యం పునరుద్ధరించి పటిష్ట పరచడం మాట అటుంచి, తన కుర్చీ పదిలపరుచుకోవడంలో నిమగ్నుడై పోయాడు. ప్రజాస్వామ్యాన్ని గాలికి ఒదిలి పెట్టేశాడు. 2009 ఎన్నికల్లో తన పార్టీ మైనారిటీ కావడంతో జక్కయ్యను, బక్కయ్యను కావటేసుకొని తన కుర్చీని కాపాడుకొన్నాడు. వామపక్షాల సపోర్టు అవసరమూ లేకపోయింది. వాళ్ల సంఖ్యాబలమూ పడిపోయింది. దీనితో ఆయన ప్రజాస్వామ్యం మీద దాడులు ప్రారంభించాడు. దేశవ్యాప్తంగా ఆందోళనలు చెలరేగాయి. దీనికి స్కాంల పర్వం తోడైంది. దేశంలో అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి. స్కాంల రంధిలో పడ్డ ప్రభుత్వం ప్రజల దృష్టిని మరల్చడానికి అభివృద్ధి మంత్రాన్ని మరింత బిగ్గరగా పఠించడం ప్రారంభించింది. మోతాదు పెంచారు. అభివృద్ధి ప్రచారం వరదలై పారుతోంది. ఆ ప్రచారంలో ప్రజలు తడిసి ముద్దైపోతున్నారు. ఈ ప్రచారం గోబెల్స్ స్థాయిలో కాంగ్రెస్ నాయకులు హోరెత్తిస్తున్నారు. ఈ అభివృద్ధి ఫలితాలను అందుకోవాల్సిన ప్రజలు అభివృద్ధి ఏదీ? ఎక్కడా? అని ఇటూ అటూ చూసుకొంటూంటే అదెక్కడా కానరావడం లేదు. బహుశా అది కాంగ్రెస్ నాయకులకే కనిపిస్తుంది కాబోలు. మీరు గమనించారో లేదో, నాయకులు అభివృద్ధి, అభివృద్ధి అంటూ గావు కేకలు పెడతారే గాని సామాజికాభివృద్ధి అనే మాట వారి నోట పొరపాటున కూడా వినరాదు. 1947లో అధికార మార్పిడి జరిగిన తర్వాత దేశం అభివృద్ధి సాధించలేదని ఎవరూ అనలేరు. కాని, ఆ మహాకవి గురజాడ 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని అనడం కాంగ్రెస్ నాయకులకు గొంతులో పచ్చి వెలక్కాయ అడ్డం పడ్డట్లయింది. ఆయన ఎప్పుడో ఏదో ఉబుసుపోతా రాసి పారేసి వెళ్లిపోయాడు. ఈ కమ్యూనిస్టులకు పనీ పాటా లేక ఆయన రాసిన ఆ కవిత్వాన్ని అంతకూ అంత పెద్దక్షరాలతో రాసి రాష్ట్రం అంతటా పంచిపెట్టి కాంగ్రెస్ ప్రచారానికి ఏకుమేకయ్యారు. అందుకనే, అతి జాగ్రత్తగా సామాజికాభివృద్ధి అనే పదం వారి ఉపన్యాసాల్లో దొర్లకుండా కేవలం అభివృద్ధి జపిస్తూ వస్తున్నారు. పెరుగుదలనే చూపించి అదే అభివృద్ధి అని ప్రచారం చేస్తున్నారు. ఈ నాయకులకు పెరుగుదల వేరు, అభివృద్ధి వేరు విషయాలని తెలియదా? ఏదో గోడలకు సున్నాలు వేసి, పాఠశాలలకు, ఆసుపత్రులకు నాలుగు భవనాలు కట్టించి, నాలుగు ఫ్లై ఓవర్లు నిర్మించి ఇదే అభివృద్ధి అంటున్నారు. అది అభివృద్ధా? మన్మోహన్ (ఆయన ప్రధాని కాదు, ప్రపంచ బ్యాంక్‌కు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్) ఎవరి అడుగుజాడల్లో నడుస్తున్నారో, ఆ ప్రపంచ బ్యాంక్ ఎపుడో 2000 సంవత్సరంలోనే అభివృద్ధి అంటే ఏమిటో నిర్వచించింది.

*'పెరుగుదలంటే బొట్లు బొట్లుగా అభివృద్ధి ప్రజలకు చేరడం కాదు. ప్రజల అవసరాలను నేరుగా సాధించాలి. ఏ ఒక్క విధానం తనంతట తానే సాధించజాలదు. సమగ్ర వైఖరినవలంబించాలి. ఆహార భద్రత, నీటి కొరత తీర్చడం, వయస్సు మళ్లిన వారికి భద్రత, సాంస్కృతిక సంరక్షణ, పర్యావరణ దిగజారుదును నిరోధించడం – వీటన్నింటినీ సాధించగలగాలి. ఈ సమస్యలన్నిటికీ పరిష్కారమే అభివృద్ధికి, మానవ సంక్షేమానికి దోహదం చేస్తుంది. ఉదాహరణకు పాఠశాల భవన నిర్మాణమే తీసుకుంటే అలాంటి నిర్మాణం ప్రారంభం మాత్రమే. విద్యాస్థాయి పెంపుదల అనేక విషయాల మీద ఆధారపడుతుంది. ఉపాధ్యాయులకు శిక్షణ, వారి ఎంపిక, జీతభత్యాలు, పుస్తకాల సరఫరా, ఇతర అవసరాలు చేకూర్చడం కూడా భవన నిర్మాణం అంత అవసరం.'*

*(ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నివేదిక 2008)*

అభివృద్ధి అంటే ప్రపంచ బ్యాంక్ వివరణ ఇది. కాని మనం చూస్తున్నదేమంటే పాఠశాల భవనం నిర్మించి అదే అభివృద్ధి అంటున్నారు అమాత్యులు. ఇటీవలి కాలంలో, ముఖ్యంగా చిదంబరం ఆర్థికశాఖ పగ్గాలు చేపట్టిన తర్వాత మౌలిక సదుపాయాల కొరత తీవ్రంగా ఉందని, అందుకు కావాల్సిన పెట్టుబడులు కావాలని ఇంటా బయటా, అంటే దేశంలో, విదేశాల్లో విజ్ఞప్తులు, వేడుకోళ్లు (ముష్టెత్తుకోవడానికి మరోపేర్లు) చేసుకొంటున్నారు. పాలకుల దృష్టిలో మౌలికావసరాలంటే విమానాశ్రయాలు, నాలుగులైన్ల రహదారులు, అయిదు నక్షత్రాల హోటళ్లు, విద్యుచ్ఛక్తి లాంటివి. ఇవన్నీ కార్పొరేట్ల, అధికారుల, పాలకుల మౌలికావసరాలు. కాని ప్రజల మౌలికావసరాలు అంటే గృహ నిర్మాణం, వస్త్రాలు, పారిశుద్ధ్యం, ఆహార ధాన్యాలు, తాగే రక్షిత నీరు, ఉపాధి వగైరా. ఈ మౌలికావసరాల సంగతి చిదంబరం మాటవరుసకైనా ప్రస్తావించరు. వాటి కోసం బడ్జెట్లలో ఘనంగా కేటాయింపులేగాని, వ్యయం పాతాళంలో ఉంటుంది. ఉదాహరణకు, మన రాష్ట్రంలో ఎక్సైజు శాఖలో 2006 కానిస్టేబుళ్ల పోస్టులకు దరఖాస్తులు ఆహ్వానించగా, 4.16 లక్షల మంది స్పందించి దరఖాస్తు చేసుకొన్నారు. వీరందరికీ ఇవన్నీ లభ్యమైన నాడే అది అభివృద్ధి అనిపించుకొంటుంది. కాగా వాళ్లకు ప్రాతినిధ్యం వహించే, కొమ్ముకాసే చిదంబరం నుంచి సామాన్యులను పట్టించుకొంటాడనుకోవడం ఎడారిలో నీరు కోసం వెతుకులాడినట్లుంటుంది. ఏ కార్యక్రమమైతే అభివృద్ధి కార్యక్రమాలని

ప్రభుత్వం అంటూందో, అలాంటి కార్యక్రమాలు బ్రిటిష్ పాలనలో కూడా జరిగాయి. అపుడు వాళ్లు తమ దేశాభివృద్ధికి దోపిడీ కొనసాగిస్తే, ఇపుడు నల్లదొరలు తమ జేబులు నింపుకోవడానికి అడ్డదారులు తొక్కుతున్నారు. అందుకనే బ్రిటిష్ పాలనను రుచి చూసిన వయోవృద్ధులను ప్రశ్నిస్తే అవే మంచి రోజులని అంటున్నారు. చెప్పొచ్చేదేమంటే ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్న సౌకర్యాలు అభివృద్ధి నిర్వచనం కిందకు రావు. ఆ సౌకర్యాలు సామాన్యులు అనుభవించినపుడే అవి అభివృద్ధి కార్యక్రమాలవుతాయి. అందరికీ అభివృద్ధి కార్యక్రమాలు అందుబాటులోకి రావడం లేదని ఇన్‌క్లూజివ్ గ్రోత్ లక్ష్యసాధనకు కృషి జరగాలని ప్రధాని మన్మోహన్ నినదించడమే అందుకు తిరుగులేని సాక్ష్యం. ప్రధాని కూడా గ్రోత్ (పెరుగుదల) అని అంటున్నారు కాని అభివృద్ధి (డెవలప్‌మెంట్) అనడం లేదనేది గమనార్హం. పెరుగుదలకు, అభివృద్ధికి తేడా ఉందని, పెరుగుదల ఫలితాలు అందాల్సిన వారికి అందినప్పుడే అది అభివృద్ధి అవుతుందని, ప్రజాస్వామ్యం వేళ్లూనుకొంటుందని గుర్తుంచుకోవాలి.

అలాగే ఒక ప్రాజెక్ట్ నిర్మిస్తారు, ఒక పరిశ్రమ ఏర్పాటు చేస్తారు. కొంతమందికి ఉద్యోగాలు లభిస్తాయి. నిర్మాణ సమయంలో ఎక్కువ మందికి తాత్కాలికంగా ఉపాధి లభిస్తుంది. కాని అదే సమయంలో వందల కుటుంబాలు నిరాశ్రయులవుతాయి. ప్రత్యామ్నాయ వసతి ఏర్పాటు లభించదు. ఇప్పుడు నిర్మాణ సమయంలో యంత్రాల వినియోగం ఎక్కువ కావడంతో, వ్యవసాయంలో కూడా యాంత్రికీకరణ వేగంగా ప్రవేశించడంతో నిరాశ్రయుల సంఖ్య పెరుగుతోంది. వలసలు పెరుగుతాయి. పట్టణాలలో మురికివాడల సంఖ్య పెరుగుతుంది. ఇక్కడ నాకు ఒక సందర్భం గుర్తుకొస్తోంది. రాష్ట్రంలో నాగార్జునసాగర్ నిర్మాణానికి రెండు ప్రత్యామ్నాయాలను ఇంజినీర్లు నెహ్రూ ముందు ఉంచి ఆయన నిర్ణయాన్ని కోరారు. 1) వేల మంది కార్మికులను నియమించి నిర్మాణం చేపట్టడం. ఇలా చేస్తే నిర్మాణం ఆలస్యమవుతుంది. 2) యంత్రాలను ఉపయోగించడం. ఇలా చేస్తే నిర్మాణం త్వరగా పూర్తవుతుంది. ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయకుండా మొదటి ప్రత్యామ్నాయాన్నే ఎంపిక చేశారు. నిరుద్యోగం తాండవిస్తున్న పరిస్థితుల్లో ఉపాధి కల్పించడానికే ప్రాముఖ్యత, ప్రాధాన్యత ఇవ్వాలన్నారు.

## పార్లమెంటరీ ప్రజాస్వామ్యం

ఎన్నికలు జరుగుతున్నాయి. మన దేశం ప్రజాస్వామ్య దేశం అనే బోర్డు తగిలించుకొంది. ప్రపంచ దేశాలన్నిటినీ కబళించేద్దామనుకొంటున్న అమెరికా కూడా ప్రజాస్వామ్య దేశమే! సామాన్యుని దృష్టిలో ప్రజాస్వామ్యమంటే మెజారిటీ సాధించిన వారే చట్టసభల్లో కూర్చుని దేశాన్ని రాజ్యాంగ పరిమితుల్లో పరిపాలిస్తారు. కాని ఆచరణ? మన దేశంలో గత రెండు దశాబ్దాలుగా పార్లమెంట్ ఎపుడూ సంవత్సరానికి 365 రోజుల్లో వందరోజులకంటే ఎక్కువ సమావేశం కాలేదు. 14వ లోక్‌సభ అయిదు సంవత్సరాల్లో పార్లమెంట్ సమావేశం అయిన రోజులు 332 మాత్రమే. అంటే సంవత్సరానికి సగటున 66 రోజులు. సమావేశాలు జరిగినపుడు కూడా 24 శాతం సమయం అంతరాయాలు, వాయిదాలతో వృథా అయింది. కాని ఏ బ్రిటిష్ పార్లమెంట్ మనకు ఆదర్శమో, ఆ పార్లమెంట్ సంవత్సరానికి కనీసం 160 రోజులు సమావేశమవుతుంది. వెనక్కు తిరిగి చూసుకొంటే కొన్ని ముఖ్యమైన బిల్లులు ప్రవేశపెట్టినా అవి పార్లమెంట్ ముగిసిపోయినా ఇంకా చర్చకు రాకుండా మురిగిపోతాయి. కొన్ని కీలక బిల్లుల మీద చర్చ జరిగినపుడు పాలక పార్టీకి మెజారిటీ లేక తనను వ్యతిరేకిస్తున్న పార్టీలతో రాజీపడి లేదా డబ్బిచ్చి సభ్యులను కొనేసి వారి తోడ్పాటుతో గెలిచిన సందర్భాలున్నాయి. (విదేశీ పెట్టుబడుల బిల్లులో లాగ). మన దేశం పార్లమెంట్ చరిత్రలోనే ఏ ప్రభుత్వమూ మెజారిటీ ఓట్లతో గెలవలేదు. ఈ మైనారిటీ ప్రభుత్వమే సభ్యుల జీతభత్యాలను తమ చిత్తం వచ్చినట్లు పెంచేసుకొంటూపోతుంది. సభలో బిల్లులు ఎలా పాస్ అవుతాయో మీకు తెలుసునా? ఐదు వందల మందికి పైగా సభ్యులు ఉన్న లోక్‌సభలో కనీసం యాభై మంది ఉంటే బిల్లు ఓటింగ్‌ను పెట్టవచ్చు. అందులో మెజారిటీ అంటే 26 మంది సభలో ఉండి అనుకూలంగా ఓటు చేస్తే ఆ బిల్లు పాస్ అయినట్లు లెక్క. అంటే 121 కోట్ల జనాభాకు 26 మంది ఓటు చేసిన బిల్లు ప్రజల పాలిట శిలాశాసనమైపోతుంది. మీకు తెలుసునో లేదో, సభ్యులు సభ జరిగినంత కాలం సభలో కూర్చోనక్కర్లేదు. సమావేశ మందిరంలో ఉన్న హాజరు పట్టీలో సంతకం చేస్తే చాలు. సంతకాలు పెట్టేసి వెళ్లిపోయే ప్రబుద్ధులు గణనీయంగా ఉన్నారు. అసలు వీళ్ల ఎన్నికైన తీరే ప్రశ్నార్థకం. ఎన్నికల్లో లక్షల కోట్లు ఖర్చు చేసి, ఓట్లు కొనేసి లేదా పీపాలకు పీపాలు 'మందు' పోయించి ఓటు వేయించుకొన్న వారు అత్యధిక సంఖ్యాకులున్నారు. నాకు బాగా గుర్తు 1951 ఎన్నికల్లో గ్రామాల్లో భూస్వాములు ఎవరైతే కమ్యూనిస్టులకు ఓటు వేయవచ్చునో గుర్తించి వారందరినీ ఓటింగ్‌కు ముందే పశువులను కట్టేసే బందెలదొడ్లో బంధించేసి ఓటింగ్ సమయం అయిన తర్వాత వదలిపెట్టేవారు. ఒకరి ఓటు మరొకరు వేసేయడం – షరా మామూలే. ఇతర రాష్ట్రాల్లోనూ ఇదే ధోరణి. 2009 ఆంధ్రప్రదేశ్ ఎన్నికల్లో ఒంటరిగా 230 సీట్లకు పోటీ చేసిన కాంగ్రెస్ సగం సీట్లయినా రాకుండా 150 సీట్లతో సరిపెట్టుకోవాల్సి వచ్చింది. సభలో సభ్యుల సంఖ్య 294. అంటే బొటా బొటీగా మెజారిటీ. 15 పార్లమెంట్ ఎన్నికలు జరిగిన తీరుతెన్నులను విశ్లేషిస్తే ఇలాంటి విశేషాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. ఓ పుస్తకమే రాయవచ్చు. ఇందులో ప్రజాస్వామ్యం ఎక్కడుంది?

ఎంతసేపూ అభివృద్ధి గురించి మాట్లాడుతారే గాని సామాజికాభివృద్ధి గురించి మాట్లాడరేమని ఈ వ్యాసం మొదట్లోనే ప్రశ్నించా. సామాజికంగా అభివృద్ధి జీరో అని ప్రభుత్వానికి తెలుసు. తూర్పు ఆసియా దేశాల్లో సామాజికాభివృద్ధి సూచికలను పరిశీలిస్తే అన్ని దేశాల కన్నా భారతదేశం కింది స్థాయిలో ఉండడమే కాక 25 సంవత్సరాల క్రితం ఆ దేశాలు ఏమి సాధించాయో, ఆ స్థాయిని కూడా భారతదేశం సాధించలేదని ప్రణాళికా సంఘమే 2005లోనే అంగీకరించింది. అయినా పాలకులు అభివృద్ధి, అభివృద్ధి అని గావు కేకలు పెడుతూనే ఉన్నారెందుకు? వారి నిర్వచనంలో అభివృద్ధి అంటే ప్రాజెక్టులు, పరిశ్రమలు, విమానాశ్రయాలు వగైరా. ఈ కార్యక్రమాల ఫలితాలనుభవించే వారి జేబులు నిండితే, తమ జేబులూ నిండుతాయి. ఇటు కాంట్రాక్టర్ల నుంచి ముడుపులు అందుతాయి. పేద ధనిక వర్గాల మధ్య అంతరాలు ఎంత ఎక్కువగా పెరిగితే ఏలిన వారికి అంత లాభం. సామాజికంగా వెనుకబడిన వర్గాలకు చేసే కేటాయింపులు ఎపుడూ పూర్తిగా ఖర్చు కావు. చేసిన ఖర్చులో అధికారగణం, కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు వారి వాటా వారు

మింగుతారు. వాస్తవంగా పేదలకు అందేది ఎంగిలి చెయ్యి విదిలించిన మెతుకులే. అభివృద్ధి గురించిన నినాదాలు మాత్రం బహు పసందుగా ఉంటాయి. 'గరీబీ హటావో' నినాదంతో ఇందిరాగాంధీ ఈ మోసపూరిత వాగ్దానాలకు శ్రీకారం చుట్టింది. ముందు సంపదను పెంచితే, ఆ సంపద పేదలకు అందించడానికి అవకాశం లభిస్తుందన్నారు. ఆ తర్వాత సమానత్వంతో కూడిన అభివృద్ధి అన్నారు. నినాదాలు ఇలా మారుస్తూ పోయి, ప్రస్తుతం ఇంక్లూజివ్ గ్రోత్ దగ్గర ఆగింది. కాని, ఇదే కాలంలో దేశంలో కోటీశ్వరులు, మిలియనీర్లు, బిలియనీర్లు, ఆ తర్వాత ప్రపంచం లోనే మొదటి రెండు, మూడు స్థానాలను దక్కించుకొన్న కార్పొరేట్లు వెలిశారు. అంటే అభివృద్ధి జరిగింది కాని ఫలితాలు కుబేరుల సంఖ్య పెరగడానికే. వారి సంపద మరింత ఎక్కువ కావడానికే తోడ్పడిందన్న మాట. వారి ఆదాయంలో నాయకుల వాటా ఉంటుందని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఇదీ అభివృద్ధి నినాదం వెనుక ఉన్న అసలు కథ.

## రాజ్యాంగం

మన రాజ్యాంగాన్ని చూస్తే 'సర్వసత్తాక', 'సామ్యవాద', 'ప్రజాస్వామ్య' 'లౌకిక', రాజ్యాంగం అని ప్రకటించినా, అనుభవంలో, అమలులో చూస్తే పైన పేర్కొన్న లక్ష్యాలన్నీ చెరిపేయాల్సిందే. ఇతర దేశస్తులెవరైనా మన రాజ్యాంగాన్ని చదివితే ఎంత ప్రజాస్వామ్య దేశమోనని విస్తుపోతారు. ఆచరణలో 62 సంవత్సరాల తర్వాత కూడా అనుభవంలో రాలేదని వారికి తెలియదు కదా. పంచాయితీ వ్యవస్థ జుట్టు రాష్ట్ర ప్రభుత్వాల చేతుల్లో, వాళ్ల జుట్టు కేంద్రం చేతుల్లో, దాని జుట్టు అమెరికా బంటు అయిన ప్రపంచ బ్యాంక్ చేతుల్లో చిక్కుకొని ఉండగా ఎక్కడుంది 'సర్వసత్తాక'? సామ్యవాదం మాయమై దాని స్థానంలో వివిధ రాకల పెట్టుబడిదారీ విధానాలు అవతరించాక, సామ్యవాదం కాకెత్తుక పోయింది.

## పేదరికం అభివృద్ధి

పేదరికం అభివృద్ధికి శత్రువు. ఉపన్యాసాల్లో పేదరికం గురించి కడవల కన్నీళ్లు కారుస్తుంటారు. మొదటి ప్రణాళిక నుంచి ప్రస్తుత ప్రణాళిక వరకూ పేదరిక నిర్మూలన ఎజెండాలో ఉంటూనే వచ్చిందంటే పేదరికం తిష్టవేసుకొని కూర్చుందన్న మాట. 62 సంవత్సరాల తర్వాత కూడా పేదలంటే ఎవరు అని నిర్వచించలేకపోతున్నారు. జిడిపి పెరిగితే పేదరికం తగ్గిపోతుందని మన్మోహన్ ఉవాచ. 1991లో ఆయన సంస్కరణలు ప్రవేశపెట్టిన నాటి నుంచీ (ఇటీవలి రెండు మూడేళ్లు మినహాయించి) జిడిపి పెరుగుతూనే ఉంది. కాని పేదరికం కదలనని మొరాయిస్తుంది. అసలు పేదలంటే ఎవరు అనే విషయాన్నే నిర్వచించలేక కమిటీ తర్వాత కమిటీ వేస్తూ పేదల నోరూరిస్తోంది.

– ప్రణాళికా సంఘం ఏర్పాటు చేసిన టెండూల్కర్ కమిటీ ప్రకారం దేశంలో 37 శాతం మంది పేదలున్నారు.

– కేంద్ర ప్రభుత్వం అధికారికంగా 27 శాతం మందే పేదలు.

– అర్జున్‌సేన్ గుప్త కమిటీ 77 శాతం మంది సగటున రోజుకు 20 రూపాయల కన్నా తక్కువ ఆదాయంతో బతుకులు వెళ్లదీస్తున్నారు.

– ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త ఎన్.పి. సక్సేనా లెక్క 50 శాతం.

– ప్రపంచ బ్యాంకు లెక్క 42 శాతం.

– ఆసియా డెవలెప్‌మెంట్ బ్యాంక్ 77 శాతం.

– ఎన్‌సిఎఇఆర్ అనే పరిశోధనా సంస్థ 2004–05 సంవత్సరంలో 30.5 శాతం మందే పేదలంటోంది.

పేదరిక నిర్మూలన అన్నమాట అటుంచి అసలు పేదలెవరో, ఎంత మందో తేల్చలేని చవట దద్దమ్మ ప్రభుత్వమేమీ కాదు. పేదలెవరో నిర్ధారిస్తే వాళ్లందరికీ తిండి గింజలివ్వాలి. ఈ బాధ అంతా ఎందుకు, డబ్బు రూపంలో వారికి సహాయం చేస్తే పీడా వదిలిపోతుందని ఆధార్ కార్డుల పథకం ప్రవేశపెట్టారు. అయితే ఆ కార్డు ఎవరికివ్వాలి? పేదలను గుర్తించాలి. రెడ్డొచ్చి మొదలాడేరా అన్నట్లువుతూంది. గుర్తించడంలో తాత్సారం చేయడం వెనుక అసలు రహస్యమేమంటే, పేదలకు కడుపు నిండితే వాళ్లు ఓట్లు తమకు పడవు, తమ పదవులూడిపోతాయి. పేదరికాన్ని నిర్మూలించడం మాట అటుంచి కనీసం తగ్గించనైనా తగ్గించలేని ప్రభుత్వం అధికారంలో ఉండే హక్కు లేదు. అపుడపుడు నాకనిపిస్తుంది పేదరికం నిర్మూలన పేదల చేతుల్లోనే ఉందని. ఎన్నికల సమయంలో మందుకు, డబ్బుకు కక్కుర్తిపడకుండా కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ఓటు వేయడమే. అపుడే అభివృద్ధి ఫలితాలు వారికి దక్కుతాయి. నువ్వు కాంగ్రెస్‌కు బద్ధ విరోధివి, నువిట్లా రాస్తూనే ఉంటావని అంటున్నారా? మన్మోహన్ సింగ్ ప్రపంచ బ్యాంక్ మోచేతి నీళ్లు తాగుతుంటారు కదా, ఆ బ్యాంకు ఏమంటుందో వినండి. 'అనారోగ్యం, నిరుద్యోగం (స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 11 వేల ఉద్యోగాలకు ప్రకటన ఇస్తే 36 లక్షల అప్లికేషన్‌లు వచ్చాయి), ప్రకృతి వైపరీత్యాలు పేదలపై తీవ్ర ప్రభావం కలుగ చేస్తున్నాయి... సూక్ష్మ రుణాలు తాత్కాలికంగా పేదలను ఆదుకొన్నా పేదరికం నుంచి బయట పడవేయడం లేదు' అని చెబుతూ సమస్య పరిష్కారానికి 'సామాజిక సంక్షేమ పథకాలు వ్యక్తులకు సహాయపడేలా, ఆ వ్యక్తి ఆర్థిక పరిస్థితిని, ఉత్పత్తి శక్తిని పెంచడం ద్వారా సాధ్యం' అని చెప్పింది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పార్లమెంట్‌లోనే, శాసనసభలోనే ఖూనీ చేస్తుంటే ప్రజాస్వామ్యాన్ని ఎలా రక్షిస్తాం? ప్రధానమైన కాంగ్రెస్, బిజెపి రెండూ అధికారంలో, ప్రతిపక్షంలో ఉన్న అనుభవం ఉంది. వాళ్లే ఇలా చట్టవిరుద్ధంగా కుర్చీలు విసిరేసుకుంటూ, అసభ్యంగా, అమర్యాద పూర్వకంగా సభ సజావుగా జరగనీయకుండా ప్రవర్తిస్తూ, బయట ఉన్న ప్రజలకు నీతిబోధలు చేస్తూంటే, దెయ్యాలు నీతులు వల్లిస్తున్నాయన్న సామెతను గుర్తు చేస్తూంది. వాళ్లు ప్రజాస్వామ్యాన్నేమి రక్షిస్తారు?

విద్య, వైద్యం, పారిశుద్ధ్యం లాంటి సంక్షేమ పథకాల గురించి చెప్పాలంటే ఈ వ్యాసం చేట భారతం అవుతుంది. అయినా పై విషయాలు అందని ద్రాక్ష అని పాఠకులందరి ఏకాభిప్రాయం. వారు ప్రజాస్వామ్యానికి చాలా దూరంలో ఉన్నారు. అంటే అభివృద్ధి ఫలితాలు వారికందడం లేదు. అలాంటి అభివృద్ధి జరిగితేనేమి, జరక్కపోతేనేమి? ప్రధాని రెండవ విడత సంస్కరణలు ప్రవేశపెట్టి ప్రజలకు అందజేసిన సందేశం ఏమిటి? 'మీ ఏడుపేదో మీరు ఏడ్వండి. మేము చేసేది ఇంతే' నని పరోక్షంగా చెప్పడమే. ప్రజలు చేయగలిగిందల్లా దేశ వ్యాప్తంగా ఆందోళనలను ఉధృతం చేసి ప్రభుత్వానికి నిద్రపట్టకుండా చేయడం. 2014 ఎన్నికల్లో కాంగ్రెస్‌కు బై బై చెప్పడం.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# మారని పేదరికం - మారుతున్న అంచనాలు

***ప్రభుత్వ ఆర్థిక విధానాల వల్ల ఒకవైపు సంపన్నుల సంపద, మరొకవైపు ప్రజల పేదరికం పెరిగిపోతున్నాయనీ, వ్యవస్థలో సమూలమైన మార్పు మాత్రమే ఈ సమస్యను పరిష్కరిస్తుందనీ అంటున్నారు* సత్యనారాయణ రెడ్డి**

పట్టణాల్లో రోజుకు 28.65, గ్రామాల్లో 22.42 రూపాయల కంటే ఎక్కువగా ఖర్చు చేయగలిగినవారు పేదలు కారని 2012 ప్రారంభంలో కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. దానిపై దేశంలో పెద్ద ఎత్తున వ్యతిరేకత వ్యక్తం అయింది. దానితో పేదరికం సమస్యపై ఆర్థిక సలహా మండలి అధ్యక్షుడు రంగరాజన్ నేతృత్వంలో, ప్రణాళికా సంఘం ఒక నిపుణుల కమిటీని ఏర్పాటు చేసింది. ప్రస్తుత చారిత్రక సామాజిక నేపథ్యంలో కనీస కుటుంబ వ్యయాన్ని నిర్ధారించడం, దారిద్ర్య రేఖను నిర్ధారించడానికి అనుసరించే పద్ధతిని పునఃపరిశీలించి, పేదరికపు స్థాయిని అంచనా వేయడం ఆ కమిటీ బాధ్యతగా పేర్కొంది.

మనదేశంలో పేదరికం సమస్యపైన గత 55 సంవత్సరాలుగా చర్చ సాగుతున్నది. 1957లో గుల్జారీలాల్‌నందా అధ్యక్షతన 15వ కార్మిక సదస్సు జరిగింది. ఆ సదస్సులోనే మొదటిసారి 'దారిద్ర్యరేఖ' అనే భావనను తెరపైకి తెచ్చారు. ఆ తర్వాత 1977లో అలఘ్ కమిటీ, 1989లో లక్డావాలా కమిటీలు పేదరికం సమస్యపైన అధ్యయనాలు జరిపాయి. ఆ సమస్యపై 2005లో ఏర్పాటు చేసిన సురేష్ టెండూల్కర్ కమిటీ, 2009లో తన నివేదికను సమర్పించింది. దాన్ని కేంద్ర ప్రభుత్వం 2011లో ఆమోదించింది. మన పాలకులు ప్రస్తుతం పేదరికాన్ని నిర్ధారించడానికి ఈ కమిటీ చేసిన సూచనలనే ఆధారం చేసుకొంటున్నారు.

పేదరికం సమస్యపై కొత్తగా మరో నిపుణుల కమిటీ ఏర్పాటు చేయబడిన ఈ సందర్భంలో, అసలు పేదరికం అంటే ఏమిటి? దాన్ని నిర్ధారించడానికి మన ప్రభుత్వాలు నిర్ణయిస్తున్న కొలమానాలు ఏమిటి? అవి శాస్త్రీయమైన ప్రాతిపదికపైన ఉంటున్నాయా? ఈ సమస్యపై ప్రభుత్వేతర సంస్థలు, అంతర్జాతీయ సంస్థలు సూచిస్తున్న కొలమానాలు ఏమిటి? పేదరికానికి మూల కారణాలు ఏమిటి? మధ్యతరగతి ప్రజలంతా ధనికులేనా? మనదేశంలోని పేదల శాతం ఎంత? వివిధ ప్రభుత్వాలు గత 65 సంవత్సరాల కాలంలో అమలు జరిపిన 'అభివృద్ధి సంక్షేమ' చర్యలు పేదరికాన్ని తగ్గించాయా? రాబోయే రోజుల్లో పేదరికం తగ్గే అవకాశం ఉన్నదా? లేక అది మరింత పెరుగుతుందా? దేశంలో పేదరికం మొత్తంగా ఎప్పుడు, ఎట్లా నిర్మూలింపబడుతుంది? పేదరికం సమస్య చుట్టూ అల్లుకొని ఉన్న కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు ఇవి. అందువల్ల వీటి గురించి కొంత వివరంగానే చర్చించాల్సి ఉంటుంది.

### పేదరికం గురించిన ప్రజా వ్యతిరేక నిర్వచనాలు

2011వ సంవత్సరానికి ముందు గ్రామాల్లో 2400 పట్టణాల్లో 2100ల క్యాలరీలను అందించే ఆహారానికి సరిపడినంత ఆదాయాలు కలిగిన వారంతా, ప్రభుత్వం దృష్టిలో పేదలు కారు. (1989లో లక్డావాలా కమిటీ ఈ ప్రమాణాన్ని నిర్ణయించింది). ఈ కొలమానం మేతవేస్తే తిని పొద్దాకా పనిచేసే పశువులతో సమానంగా మనుషులను భావించే పెట్టుబడిదారీ దృక్పథాన్ని ప్రతిబింబిస్తున్నది. దేశంలోని అనేక మంది మేధావులు, ప్రజాతంత్ర శక్తులు ఈ కొలమానాన్ని పూర్తిగా వ్యతిరేకించారు. పేదరికాన్ని లెక్కించేటప్పుడు ప్రతి మనిషికి మౌలికంగా అవసరమైన పౌష్టికాహారం, సరైన గృహవసతి, విద్య, వైద్యంతో పాటుగా ఆధునిక సమాజం కొత్తగా ముందుకు తెచ్చిన అవసరాలను కూడా పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. సురేష్ టెండూల్కర్ కమిటీ ఆహారంతో పాటుగా ప్రజల విద్య, వైద్య అవసరాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలని సూత్రప్రాయంగా అంగీకరించింది. కానీ దాని వలన దేశంలో పేదరికపు శాతం పెరగకుండా చూడడం కోసం ప్రజల ఆహారపు ఖర్చును అది బాగా తగ్గించి లెక్కించింది. కాయకష్టం చేసేవారికి, చేయనివారికి అందరికి కూడా ఆహారపు అవసరాన్ని 1800 క్యాలరీలుగానే అది నిర్ణయించింది. ఈ విషయంలో అంతకు ముందు లక్డావాలా కమిటీ నిర్ణయించిన ప్రమాణాలే (గ్రామాల్లో 2400, పట్టణాల్లో 2100) తక్కువగా ఉండగా సురేష్ టెండూల్కర్ కమిటీ వాటిని మరింతగా తగ్గించింది. ఇలాంటి వక్రీకరించబడిన లెక్కల ఆధారంగా 2009-2010వ సంవత్సరంలో దేశంలోని పేదల శాతాన్ని 29.8 గా నిర్ధారించింది. (దేశ జనాభాలో 36 కోట్లుగా).

### పేదరికంపై ప్రభుత్వేతర, అంతర్జాతీయ సంస్థల అంచనాలు

ది సెంటర్ ఫర్ పాలసీ ఆల్టర్నేటివ్స్ అనే స్వచ్ఛంద సంస్థ, ప్రజల మౌలిక అవసరాలను పరిగణనలోకి తీసుకొని ప్రత్యామ్నాయ పేదరికపు సూచిని రూపొందించింది. దాని ప్రకారం పట్టణాల్లో 68.5 శాతం, గ్రామాల్లో 80 శాతం ప్రజలను అది పేదలుగా గుర్తించింది. ఐక్యరాజ్య సమితి మద్దతుతో ఆక్స్‌ఫర్డ్ పావర్టీ హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇనిషియేటివ్ అనే సంస్థ బహుముఖ పేదరికపు సూచిక (మల్టి డైమెన్షియల్ పావర్టీ ఇండెక్స్) ఆధారంగా 104 దేశాల్లోని పేదరికంపై అధ్యయనాన్ని చేపట్టింది. సబ్ సహారా ఆఫ్రికాలోని 26 దేశాల్లోనూ కలిపి 41 కోట్ల మంది మాత్రమే పేదలు ఉండగా, భారతదేశంలోని ఎనిమిది రాష్ట్రాల్లోనే అంతకంటే ఎక్కువగా 42 కోట్ల మంది పేదలు ఉన్నట్లుగా ఆ సంస్థ నివేదిక పేర్కొన్నది. ఐక్యరాజ్య సమితి బాలల నిధి (యుఎన్ఐసిఇఎఫ్) ప్రకారం భారతీయుల్లో సగం మంది పోషకాహార లోపంతో బాధ పడుతున్నారు. జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే ప్రకారం 6 నెలల నుండి 3 సంవత్సరాల లోపు పిల్లల్లో 78.9 శాతం, 15-50

సంవత్సరాల మధ్యన ఉన్న మహిళల్లో 56.22 శాతం వరకూ రక్తహీనతతో బాధపడుతున్నారు.

1983లో 65 శాతం మంది ప్రజలు తమకు అవసరమైన దానికంటే తక్కువ క్యాలరీలను(శక్తిని) ఇచ్చే ఆహారాన్ని తీసుకొంటుండగా, 2005 నాటికి అది 76 శాతానికి పెరిగి పోయిందని అతుల్ కోహ్లి పావర్టీ అమిడ్ ప్లెంటీ అనే తన ఇటీవలి గ్రంథంలో పేర్కొన్నాడు. ఈ విషయాన్నే 2011-2012 భారత ప్రభుత్వ ఆర్థిక సర్వే కూడా కింద పేర్కొన్న రూపంలో ధృవపరిచింది. 1990-91వ సంవత్సరంలో సగటున రోజుకు ఒక వ్యక్తికి 510 గ్రాముల ఆహార ధాన్యాలు అందుబాటులో ఉండగా అది 2010-2011లో 440.4 గ్రాములకు పడిపోయిందని ఆ సర్వే నివేదిక పేర్కొన్నది.

ప్రపంచ ఆకలి సూచిక ప్రకారం బాగా పేదరికంతో బాధపడుతున్న 81 దేశాల్లో భారతదేశం 67వ స్థానంలో ఉన్నది. పేదరికానికి పేరు పొందిన రువాండాది 60వ స్థానం. 16 సంవత్సరాల క్రితం (1996) కంటే భారత దేశపు పరిస్థితి ఈ విషయంలో మరింతగా దిగజారింది.

పైన పేర్కొన్న వాస్తవాలన్నీ కూడా దేశంలో కేవలం 29.8 శాతం మంది ప్రజలు మాత్రమే పేదలుగా ఉన్నారనే టెండూల్కర్ కమిటీ అంచనాలు ఎంత అవాస్తవికంగా ఉన్నాయో స్పష్టం చేస్తున్నాయి. పై వాస్తవ పరిస్థితులన్నింటిని పరిగణనలోకి తీసుకొన్నప్పుడు పేదలు దేశ జనాభాలో 75-80 శాతం వరకూ ఉంటారనే నిర్ధారణకు రావచ్చును.

### మధ్యతరగతికి చెందిన వారంతా ధనవంతులేనా?

మధ్య తరగతి అనే పదాన్ని నేడు చాలా విస్తృతమైన అర్థంలో వాడుతున్నారు. ప్రజల్లో రోజుకు కేవలం రెండు డాలర్లను (సుమారు 100 రూపాయలను) ఖర్చు పెట్టే వారిని కూడా (నలుగురు సభ్యులున్న కుటుంబం నెలకు 12000 రూపాయలు ఖర్చు చేస్తే మధ్య తరగతిగానే వ్యవహరిస్తున్నారు. అలాంటి వారిని మధ్య తరగతి అనుకున్నా కూడా వారు కింది మధ్య తరగతి కిందనే వస్తారు. మధ్య తరగతిని మూడు కేటగరీలుగా-కింద, మధ్య, ఉన్నత- వర్గాలుగా విభజించాల్సి ఉంటుంది. వారిలో 85 శాతం వరకు మొదటి రెండు కేటగరీల కిందకే వస్తారు. మిగిలిన 15 శాతాన్ని మాత్రమే ఉన్నత మధ్య తరగతిగా పరిగణించాల్సి ఉంటుంది. నిరుపేదలతో పోల్చుకున్నప్పుడు వీరి ఆదాయాలు కొంత ఎక్కువగానే ఉంటున్నాయి. అయితే జీవన వ్యయం బాగా పెరిగిపోయి, ఆదాయాల కంటే ఖర్చులే ఎక్కువవుతున్న పరిస్థితికి దారితీసింది. మధ్య తరగతిలో 85 శాతం వరకు ఉంటున్న కింది, మధ్యస్థాయివారు ఈ కింద పేర్కొన్న వివిధ కారణాల వలన జీవిస్తున్నారనడం కంటే జీవితాలను ఈడ్చుకొని వస్తున్నారనడం సరిగ్గా ఉంటుంది. అవి:

1. వ్యవసాయంలో పెట్టుబడి ఖర్చులు (ముఖ్యంగా గత కొద్ది సంవత్సరాలుగా) విపరీతంగా పెరిగి పోయాయి. దానివల్ల వారికి ఖర్చులు పోను మిగులు ఉండడం లేదు. లేదా స్వల్పంగానే ఉంటున్నది. అతివృష్టి, అనావృష్టి, విద్యుత్ కోతలు, పంటలు వచ్చే సమయంలో వాటి ధరలను వ్యాపారస్తులు తగ్గించడంలాంటి సమస్యలు వారి ఇబ్బందులను రెట్టింపు చేస్తున్నాయి.

2. ప్రభుత్వాలు, తమ ప్రజావ్యతిరేక విధానాల ద్వారా ప్రభుత్వ పాఠశాలలనూ, ఆస్పత్రులనూ బలహీనం చేశాయి. విద్య, వైద్య వ్యాపారాలను ప్రోత్సహించే విధానాలనే అవి అనుసరిస్తున్నాయి. దానితో ఈ వర్గాల ప్రజలు వాటికోసం పెద్ద మొత్తాల్లో తమ ఆదాయాలకు మించి ఖర్చు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. కుటుంబంలో ఒకరో, ఇద్దరో తీవ్ర అనారోగ్యాలకు పాలయినప్పుడు లేదా వారు శాశ్వత రోగగ్రస్తులుగా మారిపోయిన్పుడు వారి పరిస్థితి మరింత దుర్భరంగా తయారవుతుంది.

3. ఆడపిల్లల పెళ్ళిళ్ల సందర్భంగా కట్నాలు, కానుకల కోసం అయ్యే భారీ ఖర్చుల కోసం వారు తమకున్న స్థిరాస్తులను లేదా వాటిలో కొంత భాగాన్ని కోల్పోవడం లేదా పెద్ద మొత్తాల్లో అప్పులు చేయాల్సిరావడం.

4. నిత్యావసర సరకుల ధరలు, ఇతర సేవల ఖర్చులు విపరీతంగా పెరిగిపోయినందున వారి జీవన వ్యయం రెట్టింపు కావడం. దానికి తగిన విధంగా ఆదాయాల్లో పెరుగుదల ఉండకపోవడం.

5. చదువుకున్న యువతలో పెరిగిపోయిన నిరుద్యోగం లేదా కొద్ది పాటి జీతాలకే వారు పనిచేయాల్సిరావడం.

6. పారిశ్రామిక, వ్యవసాయక రంగాల్లో ఉత్పత్తులు బాగా క్షీణించడం వాటిలో కొనసాగుతున్న సంక్షోభ పరిస్థితుల మూలంగా ఉపాధి అవకాశాలు తగ్గిపోయి ప్రజల కొనుగోలు శక్తి పడిపోవడం, దాని కారణంగా వ్యాపారస్తుల వ్యాపారాలు పూర్తిగా దెబ్బతినిపోవడం లేదా వారి ఆదాయాలు తగ్గిపోవడం.

7. దేశంలో కొనసాగుతున్న పై సంక్షోభాలకు, అంతర్జాతీయంగా నెలకొన్న సంక్షోభ పరిస్థితులు తోడయి దేశం నుండి ఎగుమతులు తగ్గిపోతున్నాయి. అది వీరి జీవితాలపై ప్రతికూల ప్రభావాన్ని చూపడం, విద్యుత్ కోతల మూలంగా పరిశ్రమలు ఖాయిలా పడడం లేదా మూతపడడం వలన అందులో పని చేసేవారు తమ ఉపాధిని పూర్తిగానో, పాక్షికంగానో కోల్పోవడం.

8. సంఘటిత రంగాల్లో (పెద్ద పరిశ్రమలు, ప్రభుత్వ ఉద్యోగాలు, బ్యాంకులు మొదలైనవి) పని చేస్తున్న వారికి ఇతరులతో పోల్చుకున్నప్పుడు కొంత ఎక్కువ ఆదాయాలే వస్తున్నాయి. అయితే అనేక రూపాల్లో ఉంటున్న కోతలు పోను నికరంగా వారిచేతికి వచ్చే డబ్బు బాగా తగ్గి పోతున్నది. దానితో కుటుంబ నిర్వహణ వారికి భారంగానే ఉంటుంది.

పెద్ద పరిశోధన అవసరం లేకుండానే వెంటనే కనబడే కారణాలు ఇవి. సమస్యలను మరింత లోతుగా అధ్యయనం చేస్తే ఇలాంటి సమస్యలు మరిన్ని బయటకు వస్తాయి.

ఒకవైపు పైన పేర్కొన్న పరిస్థితులున్నాయి. మరోవైపున వివిధ కారణాల వలన కొందరు గ్రామీణ, పట్టణ పేదలు మధ్య తరగతి స్థాయికి చేరుకుంటున్నారు. మధ్య తరగతి, ధనిక రైతులు, వ్యాపారస్తుల్లో కొందరు సంపన్నుల జాబితాలో చేరిపోతున్నారు. ఇది రెండు వైపులా జరుగుతున్న ఒక నిరంతర పరిణామంగా ఉంటుంది. ఈ విధంగా సంపన్నుల జాబితాలో చేరుతున్న కొద్ది శాతాన్ని మినహాయిస్తే, మధ్య తరగతుల్లోని కింది, మధ్యస్థాయి వారందరినీ పైన పేర్కొన్న కారణాల వలన పేదలుగానే పరిగణించాల్సి ఉంటుంది.

గతం నుండే మధ్య తరగతిగా ఉన్నవారు కానీ లేదా కొత్తగా వారిలో చేరే వారుకానీ, తమ ఆదాయాల్లో భవిష్యత్ అవసరాల కోసం భద్రపరుచుకోవడం (పొదుపు) అనేది పైన వివరించిన కారణాల వలన బాగా తగ్గిపోయింది. పోతుంది. నల్గొండ జిల్లా పరిధిలోని సూర్యాపేట,

తుంగతుర్తి పాత తాలుకా ప్రాంతాల్లోని సుమారు 100 గ్రామాల్లోని ప్రజల నుండి, ప్రతి సంవత్సరం కొత్తగా 17000 మందితో జీవిత బీమా పాలసీలను కట్టించాలని ఎల్ఐసి సంస్థ తన లక్ష్యంగా పెట్టుకుంది. 2006-2011 మధ్యకాలంలో వారు పై లక్ష్యాన్ని సాధించారు కూడా. కానీ గత సంవత్సరం (2011-12)లో ఒక్కసారిగా ఆ సంఖ్య 12000కు పడిపోయింది. దాని వలన సంవత్సరంలో కనీసం 12 మందితోనైనా కొత్తగా బీమా పాలసీలను కట్టించలేని 600 మంది ఆ సంస్థ ఏజెంట్ల ఏజెన్సీని రద్దు చేశారు. (ఆ ప్రాంతాల్లో ఉన్న మొత్తం 1100 మంది ఏజెంట్లలో 50 శాతానికి పైగా) పట్టణ ప్రాంతాల్లో కూడా అదే విధమైన పరిస్థితులు కొనసాగుతున్నాయి.

ప్రభుత్వం కటిక దారిద్ర్యాన్ని గడుపుతున్న 29.8 శాతం ప్రజలను మాత్రమే పేదలుగా గుర్తిస్తుంది. మధ్య తరగతిలోని 85 శాతాన్ని కూడా పేదలుగానే పరిగణించాల్సి ఉంటుంది. అది సహేతుకమైనదే కాకుండా శాస్త్రీయ మైనది కూడా. అయితే ప్రభుత్వాలు తమ సామాజిక బాధ్యతల నుండి తప్పించుకోవడానికి, పేదరిక నిర్మూలనలో లేదా దాన్ని తగ్గించడంలో తమ వైఫల్యాలను తమ ప్రజా వ్యతిరేక సంపన్న వర్గాల అనుకూల విధానాలను కప్పిపుచ్చు కోవడం కోసం పేదరికం తగ్గిపోయినట్లుగానూ మిగిలిన పేదరికాన్ని కూడా వచ్చే ప్రణాళికల్లో తగ్గించబోతున్నట్లుగానూ, ప్రచారం చేసుకొంటున్నాయి.

### నెహ్రూ, ఇందిరాగాంధీల పాలనల్లోనూ పేదరికం తగ్గలేదు

దేశంలో అభివృద్ధి అనేది గత 65 సంవత్సరాలుగా ఏదో స్థాయిలో కొనసాగుతూనే వస్తుంది. స్థూల దేశీయ ఉత్పత్తి పెరుగుతూనే వస్తుంది. అయితే, ఆ అభివృద్ధి ఫలితంగా సృష్టించబడిన సంపద మాత్రం ప్రధానంగా కొద్ది మంది చేతుల్లోకే చేరుకుంటుంది. దాని ఫలితంగా దేశంలోని సంపన్నుల సంఖ్య, వారి చేతుల్లోని సంపద నిరంతరం పెరిగి పోతుంది. వెల్తెక్స్ అనే సంస్థ రూపొందించిన 2012-13 ప్రపంచ భారీ సిరుల నివేదిక ప్రకారం మన దేశ జనాభా 122 కోట్ల మందిలో కేవలం 7730 మంది చేతుల్లోనే 50 లక్షల కోట్ల రూపాయల సంపద పోగుపడి ఉంది.

దేశంలో అభివృద్ధి జరిగి, సంపద పెరిగిపోతే ఆ సంపద బొట్లు బొట్లుగా కిందకు జారి పేదలకు కూడా చేరుతుందనీ, తద్వారా పేదరికం క్రమంగా తగ్గిపోతుందనేది ఒక సిద్ధాంతం. సుప్రసిద్ధ రచయిత్రి అరుంధతిరాయ్ ఈ బొట్లు బొట్లుగా సంపద కిందకు జారే సిద్ధాంతంపై వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తూ, సంపద పైకి ఎగదన్నే సిద్ధాంతమే మన దేశంలో బాగా పని చేస్తుందని రాశారు. అందువల్లనే 120 కోట్ల జనాభాలో కేవలం వంద మంది అత్యంత సంపన్నుల ఆస్తులు దేశీయ స్థూల ఉత్పత్తిలో నాల్గవ వంతును ఆక్రమిస్తున్నాయని ఆమెపై వ్యాసంలో పేర్కొన్నారు.

ఈ విధంగా సంపద పోగుపడడం అనేది ప్రభుత్వం 1991లో నూతన ఆర్థిక విధానాన్ని అమలు జరపడం ప్రారంభించిన తర్వాత జరుగుతున్న పరిణామంగానే దేశంలో కొంతమంది అభ్యుదయ మేధావులతో సహా అభిప్రాయపడుతున్నారు. 1991కి ముందు, 1947 నుండే నెహ్రూ, ఇందిరా గాంధీలు కూడా దోపిడీ పాలక వర్గాలకు అనుకూలమైన విధానాలనే అనుసరించారన్న విషయాన్ని వారు అర్థం చేసుకోలేక పోతున్నారు. 'శ్రేయో రాజ్యం', సామ్యవాద తరహా పాలన ప్రభుత్వరంగ అభివృద్ధి, భూమి పంపకంతో సహా వివిధ భూసంస్కరణలు, సోషలిజం, సెక్యులరిజం, గరీబీ హటావో, 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాలన్నీ కూడా ఎలాంటి మినహాయింపులు లేకుండా పాలక వర్గాలు అభివృద్ధి కావడానికే తోడ్పడ్డాయి.

పైన పేర్కొన్న వాటిలో ప్రభుత్వ రంగ అభివృద్ధిని ఒక ఉదాహరణగా తీసుకొని ఆలోచిస్తే అదే విషయం మనకు స్పష్టమవుతుంది. ఉక్కు, విద్యుత్తు, బొగ్గు గనుల లాంటి భారీ పెట్టుబడులు అవసరమైన పరిశ్రమల్లో పెట్టుబడులు పెట్టగలిగిన స్థితిలో ఆనాడు దేశంలోని పెట్టుబడిదారులు లేరు. అందువల్ల ప్రభుత్వమే తన బడ్జెట్ల నుండి భారీగా డబ్బులు కేటాయించి ఆ పరిశ్రమలను నెలకొల్పి, అభివృద్ధి చేసింది. వాటి ఉత్పత్తులను అతి తక్కువ ధరలకే ప్రైవేట్ పెట్టుబడిదారు లకు అందించింది. ప్రభుత్వం చౌకగా అందిస్తున్న ఆ మౌలిక వనరులను ఉపయోగించుకొని దేశంలోని బడా పెట్టుబడిదార్లు 30-40 సంవత్సరాల కాలంలో తమ సంపదను బాగా పెంచుకున్నారు. ఈ విధంగా దేశంలోని ప్రభుత్వ రంగాన్ని అభివృద్ధి చేయడం, ప్రైవేట్ బడా పెట్టుబడిదారుల అభివృద్ధికే బాగా తోడ్పడింది. ఈ నిరంకుశ (ప్రభుత్వ బడ్జెట్ల ద్వారా అందే) పెట్టుబడికి తోడు సామ్రాజ్యవాద దేశాల నుండి వివిధ రూపాల్లో పెట్టుబడులు ప్రవాహంలో వచ్చి పడ్డాయి. వాటికి దేశంలోని ఫ్యూడల్ పెట్టుబడి కూడా (మాజీ రాజులు, పెద్ద భూస్వాముల వద్ద ధన రూపంలో ఉన్న సంపద) తోడయింది. ఈ మూడు రకాల పెట్టుబడుల ద్వారా దేశంలో బడా పెట్టుబడిదారీ వర్గం పెద్ద ఎత్తున అభివృద్ధయింది. భారత దేశంలోనే కాకుండా అనేక ఇతర దేశాల్లోకి కూడా అలాంటి వారు తమ పెట్టుబడులను ఎగుమతి చేసే స్థితికి చేరుకున్నారు.

భూసంస్కరణల విషయంలో కూడా జరిగిందదే. తెలంగాణ సాయుధ పోరాట(1946-51) నేపథ్యంలో దేశంలో పాలకులు భూమి పంపకంతో సహా భూసంస్కరణలను తెరమీదికి తెచ్చారు. భూస్వాములంతా తమ భూముల గురించి దొంగ లెక్కలతో తమ వద్ద 'మిగులు భూములు' లేవని ప్రకటించారు. అందువలన దేశంలో భూముల పంపకం అనేది పరిమితంగానే అమలు జరిగింది. కాలక్రమంలో ఆ విధంగా పంచిన భూముల్లో అధిక భాగం ఆర్థిక, సామాజిక కారణాల వలన ప్రజల చేతుల్లో లేకుండా పోయాయి. ప్రజల దగ్గర ఇంకా మిగిలి ఉంది స్వల్పమే. 1947-1991 మధ్యకాలంలో కూడా పాలక వర్గ అనుకూల విధానాలే అమలు జరిగాయి. దానివల్ల వారి సంపదే బాగా పెరిగింది తప్ప ప్రజల పేదరికం మాత్రం తగ్గలేదు.

అయితే 1991లో నూతన ఆర్థిక విధానాల అమలు ప్రారంభమైన తర్వాత ఒక వైపున కొద్ది మంది చేతుల్లో సంపద బాగా పోగుపడడం, మరోవైపున పేదరికం పెరిగిపోతున్నదనేది మాత్రం ఒక భౌతిక వాస్తవం. రాబోయే రోజుల్లో ఈ క్రమం మరింతగా పెరగనున్నది.

### సంక్షేమ పథకాల అసలు లక్ష్యం

పేదల సంక్షేమం కోసమని చెప్తూ మన పాలకులు వివిధ పేర్లతో అనేక కొత్త కొత్త పథకాలను తెస్తున్నారు. మన రాష్ట్రంలో గత పది సంవత్సరాల కాలంలో వాటిని మరింత పెద్ద ఎత్తున అమలు జరిపారు.

అయితే ఈ పథకాలేవి కూడా ప్రజల్లో పేదరికాన్ని తగ్గించలేవు. కానీ వాటి అమలు కోసం మాత్రం ప్రభుత్వాలు వేలాది కోట్ల రూపాయలను ఖర్చు చేశాయి. చేస్తున్నాయి. దానిలో సింహభాగం ఆబ్కారి ద్వారా (మద్యం దుకాణాల వేలం, మద్యం అమ్మకాలు) సమకూర్చుకుంటున్నారు. దాని కోసం ప్రభుత్వాలు మద్యం దుకాణాల వేలాన్ని, మద్యం ధరలను నిరంతరం పెద్ద ఎత్తున పెంచుకుంటూ వచ్చాయి. దానితోపాటు ప్రతివస్తువు సేవల పైన పన్నులను, ధరలను పెంచి వారిని కొల్లగొట్టి ప్రభుత్వం ఖజానాలను నింపుకుంటుంది. తిరిగి ఆ డబ్బునే ఈ సంక్షేమ పథకాల కోసమని పాలకులు ఖర్చు పెడుతున్నారు. కానీ వివిధ రకాల కాంట్రాక్టర్లు, మధ్య దళారీలు, అధికార పార్టీ నాయకులు, వారి ఆశ్రితులే ఆ కేటాయింపుల్లో అధిక భాగాన్ని కాజేస్తున్నారు. అందులో కొద్ది భాగమే ప్రజలకు చేరుతున్నది. అది వారికి కొద్దిపాటి ఉపశమనాన్ని కలిగించడం తప్ప పేదరికం నుండి బయట పడవేయడానికి ఏ విధంగానూ తోడ్పడడంలేదు.

ఈ సంక్షేమ పథకాల బండారం అంతా బహిర్గతం కావడంతో ప్రభుత్వం ఇప్పుడు కొత్త ముసుగు వేసుకొని నగదు డబ్బు పంపక పథకం పేరుతో ముందుకు వస్తున్నది. దాని ఫలితాలు కూడా పై ఫలితాలకు భిన్నంగా ఏమి ఉండవనేది స్పష్టమే.

వివిధ ప్రభుత్వాలు తెచ్చిన, తేబోయే సంక్షేమ పథకాల అసలు లక్ష్యం పేదలను పేదరికం నుండి బయట పడవేయడం ఎంతమాత్రం కాదు. తామనుసరిస్తున్న దోపిడి పాలక వర్గ అనుకూల విధానాలకు వ్యతిరేక పోరాటాల్లోకి ఈ ప్రజలు వెళ్లకుండా ఆపడమే వాటి అసలు లక్ష్యం. ప్రజలను నిరంతరం భ్రమల సుడిగుండాల్లో ముంచుతూ, పాలక వర్గ పార్టీ నాయకుల, కార్యకర్తల చుట్టూ వారిని తిప్పుకుంటూ వారిలో పోరాట చైతన్యం అభివృద్ధి కాకుండా చేసే ప్రయత్నాల్లో ఒక భాగమే ఈ సంక్షేమ పథకాల అమలు లక్ష్యం.

## తీవ్రతరమవుతున్న సంక్షోభం–మరింత పెరగనున్న పేదరికం

దేశంలో కొనసాగుతున్న వ్యవసాయ రంగంలోని సంక్షోభం రానున్న రోజుల్లో మరింత తీవ్రతరమయ్యే సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. వ్యవసాయానికి అవసరమైన విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందుల వ్యాపారాన్ని అంతర్జాతీయ గుత్త సంస్థలు, దేశంలోని వారి దళారీలైన బడా పెట్టుబడిదార్లు తమ గుప్పెట్లో పెట్టుకొని వాటి ధరలను విపరీతంగా పెంచుతూ పోతున్నారు. గత రెండు సంవత్సరాల్లోనే (2011 ఏప్రిల్ నుండి 2012 ఆగస్ట్ మధ్యన) ఎరువుల ధరలను వారు 12 సార్లు పెంచారంటే సమస్య తీవ్రతను అర్థం చేసుకోవచ్చును. దేశ జనాభాలో దాదాపు ముగ్గురిలో ఇద్దరు వ్యవసాయ రంగంలోనే కొనసాగుతున్నప్పటికీ ఇంకా వంట నూనెలను, పప్పులను దిగుమతి చేసుకోవలసిన దుస్థితిలోనే మనం ఉన్నాం. దేశ ప్రజల్లో గణనీయమైన భాగం దుర్భర దారిద్ర్యం వలన తమకు అవసరమైన ఆహార ధాన్యాలను కొనలేకపోతున్నారు. ఆ కారణంగానే మన గోడౌన్లలో వాటి నిల్వలు పేరుకుపోతున్నాయి. వాటిలో కొంతభాగాన్ని విదేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నాం తప్ప అవి మన నిజమైన మిగులు కావనే విషయం స్పష్టమే.

పారిశ్రామిక రంగాన్ని కూడా సంక్షోభం పట్టి పీడిస్తుంది. ఈ రంగంలోని అభివృద్ధి ప్రస్తుతం సున్నా స్థాయికి చేరుకుంది. 12వ పంచవర్ష ప్రణాళికలో 9 శాతం అభివృద్ధిని సాధించాలని పాలకులు పెద్ద ఆర్భాటంగా ప్రకటించారు. ఆ ప్రణాళికలోని మొదటి సంవత్సరంలో అది 5–6 శాతం మధ్యలోనే ఉంటుందని వివిధ అంతర్జాతీయ సంస్థలు అంచనా వేస్తున్నాయి. అది కూడా ఉత్పత్తి రంగాలైన వ్యవసాయం, పరిశ్రమల ద్వారా కాకుండా ప్రధానంగా సేవల రంగం నుండే ఉంటుంది. దేశంలోని ఈ సంక్షోభాలకు అంతర్జాతీయంగా కొనసాగుతున్న సంక్షోభం తోడయింది. అది మన ఆర్థిక వ్యవస్థపై తీవ్ర ప్రభావాన్ని చూపుతోంది. ఎగుమతులు తగ్గిపోయి విదేశీ మారక ద్రవ్య నిల్వలు కరిగిపోతున్నాయి.

రానున్న రోజుల్లో మరింతగా పెరగనున్న ఈ సంక్షోభాల ప్రభావం ప్రజలపై పెద్ద ఎత్తున పడుతుంది. దాని ఫలితంగా ప్రజల పేదరికం తగ్గడానికి బదులుగా మరింతగా పెరిగే సూచనలే స్పష్టంగా కనిపిస్తున్నాయి. సమస్యలు, సంక్షోభాల తీవ్రత ఈ రూపం తీసుకొంటుండగా మన పాలకులు మాత్రం ఎవరు ఎన్ని విధాలుగా అడ్డుకునే ప్రయత్నాలు చేసినప్పటికీ తాము మాత్రం సంస్కరణల అమలును మరింత తీవ్రతరం చేస్తామని ప్రకటిస్తున్నారు. మన పాలకులు ఆ వర్గాల సేవల్లోనే మరింతగా తరించి పోదల్చుకున్నట్లుగా వారి ఈ చర్యలు స్పష్టం చేస్తున్నాయి.

దేశ ఆర్థిక సామాజిక వ్యవస్థలో సమూలమైన మార్పులు తేగల ప్రజల ప్రజాతంత్ర విప్లవమే పేదరికం సమస్య శాశ్వత పరిష్కారానికి మార్గాన్ని సుగమం చేస్తుంది.

దేశంలో సంపద పెరిగితే అది క్రమంగా పేదరికాన్ని తగ్గిస్తుందని మన పాలకులు చెప్పుతున్నారు. మన దేశంలో ఇటీవల కాలంలో 7–8 సంవత్సరాల పాటు దేశీయ ఉత్పత్తిలో(జిడిపి) 8 శాతం అభివృద్ధిని సాధించాం. అయితే ఆ మేరకు ఉపాధి అవకాశాలు పెరగడం కానీ పేదరికం తగ్గడం కానీ ఏవీ జరగలేదు. దానికి భిన్నంగా పేదరికం పెరుగుతుంది. ప్రజల కొనుగోలు శక్తి పెరిగినప్పుడే దేశంలో నిజమైన స్థిరమైన అభివృద్ధికి బలమైన పునాదులు పడుతాయి. ఆ విధంగా పేదల కొనుగోలు శక్తి పెరగాలంటే, గ్రామాల్లోని పేదలకు భూమిని పంచాలి. అప్పుడు పని చేయగల వారందరికి ఉపాధి అవకాశాలను పెంచగల పారిశ్రామికాభివృద్ధికి మార్గం సుగమం అవుతుంది. విదేశీ, స్వదేశీ బడాపెట్టుబడిదారులకు, భూస్వాములకు ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రస్తుత పాలకులు వ్యవస్థలో అలాంటి మౌలిక మార్పులు తీసుకురారనేది స్పష్టమే.

ప్రజలు తాము ఎదుర్కొంటున్న పేదరికం సమస్య నుండి సంపూర్ణంగా బయట పడడానికి, ప్రస్తుత ఆర్థిక, సామాజిక వ్యవస్థను సమూలంగా మార్చగల విప్లవ మార్గాన్ని ఎంచుకోవడం తప్ప వారి ముందు మరేవిధమైన ప్రత్యామ్నాయం లేదు. అలాంటి నిజమైన ప్రజాతంత్రయుతమైన విప్లవం ద్వారానే పేదరికంతో సహా ప్రజలు, దేశం ఎదుర్కొంటున్న అన్ని మౌలిక సమస్యలు ఆ వైపుగా ఆలోచించాలి. ఆ మార్గాన్ని చేపట్టడమే తమ తక్షణ కర్తవ్యంగా ఎంచుకొని ఆ వైపుగా వారు ముందుకు సాగిపోవాలి.

*(రచయిత గ్రామీణ పేదల సంఘం మాజీ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, ప్రస్తుతం 'పోరునేల' ప్రచురణ సంస్థ సంపాదకులు)* వీ

# పర్యావరణ పతనం - జీవ వినాశనం

*బహుళజాతి సంస్థల లాభాపేక్షతో అన్ని రకాల కాలుష్యాలతో పర్యావరణ విధ్వంసం జరుగుతోందనీ, ముందే కళ్లు తెరిచి ప్రతిఘటించకపోతే అది జీవ వినాశనానికి దారితీస్తుందనీ అంటున్నారు* **కె.ఆర్. చౌదరి**

'యుగాంతం అవుతోంది, ప్రపంచ నాశనం డిసెంబర్ 21, 2012 నాడు తప్పదు' అనే పుకార్లను పత్రికలు, దూరదర్శన్‌లు మార్మోగించాయి. ఆ దినం వచ్చింది, పోయింది. కానీ, వల్లించిన పుకార్ల ప్రకారం ఏ ఘోరమూ జరగలేదు. ఏ ప్రమాదమూ ముంచుకొని రాలేదు. అయితే దీనికి భిన్నంగా విజ్ఞాన శాస్త్రజ్ఞులు, జ్ఞానులు కొన్ని హెచ్చరికలు చేస్తున్నారు. ప్రపంచం క్రమక్రమంగా, కొద్దికొద్దిగా, వివిధ రూపాల్లో, వివిధ ప్రాంతాల్లో వినాశనం దిశగా కదలుతోందనీ, మరీ గత కొద్ది దశాబ్దాలుగా ఈ కదలిక మరింత వేగం పుంజుకుంటున్నదనీ వారు చెబుతున్నారు. మారుతున్న వినాశకర పరిస్థితులకు పర్యావరణ పతనమే ప్రధాన కారణమని శాస్త్రబద్ధంగా ఆవిష్కరిస్తున్నారు, విశ్లేషిస్తున్నారు.

భూమి, నీరు, గాలి, చెట్లు, శీతోష్ణ పరిస్థితులు, పశు పక్ష్యాదుల సమూహమే పర్యావరణం. భూగర్భ జలాలు, కుంటలు, చెరువులు, డ్యాంలు, నదీ నదాలు, వంకలు, వాగులు, విశాల జలరాశులైన సముద్రాలు; గుట్టలు, కొండలు, పర్వతాలు; భూమి లోపల, భూమి పైన కూడా నిల్వలుగా ఉండే గనులు, ఖనిజాలు, గ్రనైట్‌లు కూడా పర్యావరణంలో భాగంగానే పరిగణిస్తున్నారు. ప్రకృతి వనరులు తరిగిపోవడానికి, కాలుష్యం కావడానికి, విధ్వంసం కావడానికి ప్రధాన కారణం పెట్టుబడి, సామ్రాజ్యవాదం.

ప్రకృతి వనరులతో కూడిన పర్యావరణం ముఖ్యంగా భూమి, నీరు, గాలి సమస్త జీవరాశులకు ప్రాణాధారం. భూమి లేనిదే ఆహారం లేదు, వ్యవసాయమూ లేదు. అడవులపైన పర్యావరణం నాణ్యత ఆధారపడి ఉంది. వర్షపాతాన్ని పెంచడంలోనూ, వర్షపు నీటిని భూమిలోకి ఇంకేట్లు చేసి భూగర్భ జలాలను అభివృద్ధి చేయడంలోనూ, అధిక ఉష్ణోగ్రతలను తగ్గించడంలోనూ, భూసారాన్ని సంరక్షించడంలోనూ, మానవుల అవసరాలను తీర్చడంలోనూ, పశు పక్ష్యాదుల జీవితాలను కాపాడడం లోనూ అడవుల పాత్ర అపారమైనది. మానవ అభివృద్ధిలో నీటికి గల స్థానం ప్రముఖమైనది. పర్యావరణం అనేక జీవరాశుల మనుగడకు అవసరమైనప్పటికీ, మానవ జీవితానికి సంబంధించిన సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో దీని పాత్ర గొప్పది. మానవాళి మనుగడకు, అభివృద్ధికి, ఆరోగ్యానికి కాలుష్య రహిత పర్యావరణం అత్యంత ఆవశ్యకం.

అయితే, పర్యావరణం కలుషితమవుతోంది. నానాటికీ పతనమయి పోతోంది. విధ్వంసం మరింతగా పెరిగిపోతోంది. వాతావరణంలోకి విడుదలయ్యే కార్బన్ డయాక్సైడ్ వంటి విషవాయువులు గత పదేళ్లలో 40 శాతం పెరిగాయి. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం పర్యావరణ శాఖ అంచనాల ప్రకారం మరొక రెండు డిగ్రీలు భూతాపం పెరిగితే సగటు వర్షపాతం తగ్గుతుంది; మొక్కలు, జంతు జాతుల్లో 30 శాతం కనుమరు గవుతాయి. ప్రపంచీకరణలో భాగంగా వినియోగ సంస్కృతి పెరిగి, వస్తు ఉత్పత్తి కొరకు స్వదేశీ, విదేశీ బహుళజాతి సంస్థలు భారీగా పారిశ్రామీకరణ చేపట్టాయి. అందుకోసం అడవులు, గనులు, నదులు, సేద్యపు భూములను విచ్చలవిడిగా, విచక్షణారహితంగా వినియోగి స్తున్నారు. ఈ కారణంగానే కాలుష్యం పెరిగి స్వచ్ఛమైన గాలి, నీరు దొరకడం లేదు. వాతావరణంలోకి విషవాయువులు వెలువడుతున్నందు వల్ల ఓజోన్ రంధ్రం కరిగి పోతోంది. భూతాపం పెరిగిపోతోంది. పర్యావరణ క్షీణతకు ప్రధానంగా కారణాలుగా చెప్పవచ్చును.

అనేక రకాలయిన పరిశ్రమల స్థాపన వల్ల విషవాయువులు వాతావరణంలోకి వెలువడుతాయి. విష వ్యర్థ పదార్థాలు పరిసర ప్రాంతాల్లోకి విడుదలవుతాయి. అందువల్ల భూమి, నీరు, గాలి కలుషిత మవుతాయి. పట్టణీకరణ వల్ల మురికివాడలు పెరిగి, పారిశుధ్యం కుంటు పడుతోంది. విద్యుత్ ఉత్పత్తి క్రమంలో పర్యావరణం తీవ్రంగా దెబ్బ తింటోంది. బొగ్గు తవ్వకం, తైలం, గ్యాస్ ఉత్పత్తి పర్యావరణంపైన ప్రతికూల ప్రభావం చూపుతున్నాయి. ఓపెన్ కాస్ట్ బొగ్గు తవ్వకం వల్ల జీవ వైవిధ్యం నాశనమవుతుంది. పంట పొలాలు దెబ్బతింటాయి. జన ఆవాసాలు పనికిరాకుండా పోతాయి. గ్రీన్ హౌస్ వల్ల విడుదలయ్యే విషవాయువుల ఫలితంగా వాతావరణ మార్పులు వస్తాయి. ఇదంతా మార్కెట్ శక్తులకు ఇస్తున్న ప్రాధాన్యత వల్లే. ఈ శక్తులు తక్షణ ప్రయోజనాల్నే తప్ప దీర్ఘకాలిక సామాజిక, ఆర్థిక ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకోవడం లేదు. నయా ఉదారవాద విధానాల వల్ల ఆర్థిక అసమానతలు పెరిగాయి. ధనికుల విలాస, భోగలాలస జీవిత విధానాలు పెరిగాయి. వీరు వస్తువులను, ఇంధనాన్ని అత్యధికంగా వాడుతున్నారు.

ఫలితంగా మోటార్ కార్లు, లారీలు మొదలైన వాహనాల ద్వారా విడుదలయ్యే విష వాయువులతో కూడా వాతావరణ కాలుష్యం పెరిగి భూగోళం వేడెక్కుతుంది. ఆమ్ల, క్షార వర్షాలు కురుస్తాయి. పంటలు, పచ్చిక, వృక్ష సంపద నాశనమవుతుంది. థర్మల్ విద్యుత్ ప్లాంట్‌ల వల్ల పర్యావరణానికి విపరీతమైన హాని జరుగుతుంది. లక్షలాది టన్నుల బొగ్గు కాలుతుంది. లక్షలాది టన్నుల బూడిద తయారవుతుంది. కార్బన్ డయాక్సైడ్, సల్ఫర్ డయాక్సైడ్, నైట్రిక్ ఆక్సైడ్ మొదలైన విష వాయువులు వాతావరణంలో వెదజల్లడం వల్ల పొగ, బూడిద, ఆర్సెనిక్, క్రోమియం, సీసం, పాదరసం తదితర లోహాలు క్యాన్సర్, ఊపిరితిత్తుల రోగాలు, గుండె జబ్బులు, చర్మరోగాలు మొదలైన వాటికి కారణమవుతాయి.

అణు విద్యుత్ ఉత్పత్తి మరింత ప్రమాదకరమయింది. రాష్ట్రంలో శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో నెలకొల్పే థర్మల్, అణు విద్యుత్ ప్లాంట్లకు వ్యతిరేకంగా ప్రజలు పోరాడుతున్నారు.

ఎన్నో రకాల వాతావరణ కాలుష్యాలు ఉన్నాయి. వాహనాలు, పరిశ్రమలు, పురుగు మందులు, అడవుల నరికివేత మొదలైనవన్నీ కాలుష్యాన్ని కలుగజేసేవి. వాహనాలు, పరిశ్రమలు వాయు కాలుష్యాన్ని కలుగజేస్తాయి. పరిశ్రమల వ్యర్థ పదార్థాలు, ఇళ్ల నుంచి వదలి మురికి నీరు నీటి కాలుష్యాన్ని పెంచుతాయి. పట్టణాల నుండి వచ్చే వ్యర్థ పదార్థాల నిల్వలు భూమి కాలుష్యానికి కారణమవుతాయి. అణు థార్మిక కాలుష్యం అణు కేంద్రాల నుండి వస్తుంది. మరెన్నో రకాలు కాలుష్యాలు ప్రజల్ని బాధిస్తున్నాయి. ప్రజల ఆరోగ్యాన్ని ప్రమాదంలో పడవేస్తోంది.

ప్రజల మనుగడనే ప్రశ్నార్థకం చేస్తోంది పర్యావరణ పతనం. వారి జీవితాల్ని అస్తవ్యస్తం చేస్తోంది. ఇప్పటికే దాదాపు 20 శాతం భూమి వ్యవసాయానికి పనికిరాకుండా పోయింది. ఈ స్థితికి కారణం మన దేశ పాలకులు అనుసరిస్తున్న విధానాలు కాగా, ఆ విధానాలను ప్రభుత్వం మీద రుద్దుతున్నవి బహుళజాతి కంపెనీలు.

అభివృద్ధి చెందుతున్న దేశాలను బహుళజాతి కంపెనీలు అనేక రూపాల్లో దోపిడీ చేస్తున్నాయి. ప్రకృతి వనరులను కొల్లగొట్టుతున్నాయి. ప్రజలను ఆర్థికంగా దోపిడీ చేస్తున్నాయి. సామాజిక విలువలను, ప్రజా సంస్కృతిని అధోగతి పాలుచేస్తున్నాయి. పర్యావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. ప్రజల జీవితాలను, ఆరోగ్యాల్ని దెబ్బతీస్తున్నాయి. వందలాది మంది ప్రజల ప్రాణాలను బహుళజాతి కంపెనీలు హరించి వేస్తున్నాయి. బతికి బయటపడ్డ వారి జీవితాలను నరకప్రాయం చేస్తున్నాయి. బహుళజాతి కంపెనీల చరిత్ర అత్యంత క్రూరమైనదని చెప్పడానికి అనేక రుజువులున్నాయి. లాభాలే పరమావధిగా బహుళజాతి కంపెనీలు పనిచేస్తాయి. దోపిడీ ద్వారా కొల్లగొట్టిన సంపదను తమ దేశాలకు తరలించుకుని పోతాయి.

ఇటువంటి బహుళజాతి కంపెనీలను మన దేశం నుంచి తరిమివేయడానికి, తద్వారా మన పర్యావరణానికీ, ప్రజా జీవితానికీ కలుగుతున్న హానిని తగ్గించడానికీ అనేక అవకాశాలు ఉన్నాయి. వేల సంవత్సరాలుగా సాగుతున్న మన వ్యవసాయ జీవన సంప్రదాయమే ఈ ప్రతిఘటనకు మంచి వనరు.

మన దేశంలో వ్యవసాయ రంగానికి సంబంధించి అపారమైన సాంప్రదాయ విజ్ఞానం, సేద్య పద్ధతులుండేవి ఈ విజ్ఞానం, సేద్య పద్ధతుల ద్వారా జరిగే వ్యవసాయంలో ఉత్పత్తి ఖర్చులు కనిష్టంగా ఉండేవి. పర్యావరణానికి అనుకూలంగా ఉండేవి. రైతుకు 'రిస్క్' తక్కువగా ఉండేది. ఈ విధానం ద్వారా అనేక పంటలు లేదా మిశ్రమ వ్యవసాయ పద్ధతులుండేవి. తమకు అవసరమైన విత్తనాలను, సేంద్రియ ఎరువులను, పురుగు మందులు రైతులే తయారు చేసుకొనేవారు. ఈ పద్ధతులను తగిన విధంగా మార్చుకొని అనుసరించడమే పర్యావరణ విధ్వంసానికి జవాబు. పర్యావరణ పరిరక్షణకు మార్గం.

*(రచయిత వ్యవసాయ అర్థశాస్త్రవేత్త)* వీ

# సామ్రాజ్యవాద విష ఫలితాలు

***ప్రపంచ దేశాలన్నిటి వనరులనూ, మార్కెట్‌లనూ, ప్రజా జీవనాన్నీ ఆక్రమించడానికి ప్రయత్నిస్తున్న సామ్రాజ్యవాదం ఏయే ఎత్తుగడల ద్వారా, ఏ విషఫలితాలను అందిస్తున్నదో వివరిస్తున్నారు* లోకసంచారి**

**హత్యాకాండలే సామ్రాజ్యవాదుల, దళారీ పాలక వర్గాల చరిత్ర**

హక్కుల హననం, హత్యాకాండలు, ఊచకోతలు చేయకుండా ఒక్కరోజు కాదు కనీసం ఒక్క గంట కూడా మనుగడ సాగించలేరు సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన (భారతదేశం లాంటి) వివిధ దేశాల దళారీ పాలక వర్గాలు.

సామ్రాజ్యవాదమంటే పెట్టుబడిదారీ విధానపు చిట్ట చివరి అమానవీయ అవతారం. ద్రవ్య పెట్టుబడికి, మారణాయుధాలకు పుట్టిన అమానవీయ సంతానమే సామ్రాజ్యవాదం. సామ్రాజ్యవాదులు, వారి దళారీలు జరిపిన హత్యాకాండలో ప్రపంచ వ్యాప్తంగా ఎన్ని కోట్ల మంది చంపబడ్డారో పరిశీలిస్తే ఈ వాస్తవం అర్థం అవుతుంది.

పాశ్చాత్య పెట్టుబడిదారులు తమ మార్కెట్ విస్తరణ పోటీలో భాగంగా ప్రపంచ ప్రజల మీద రుద్దిన మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలలో తొమ్మిదిన్నర కోట్ల ప్రజలు చనిపోయారు. కానీ, ఈ యుద్ధాలకు కారణమైన ఒక్క సామ్రాజ్యవాద పెట్టుబడిదారుడు కూడా చావలేదు. పైపెచ్చు వారి కంపెనీలే యుద్ధాల ద్వారా బాగా లాభపడి, ఇప్పుడు బహుళజాతి కంపెనీలుగా ఎదిగి ప్రపంచ ప్రజల భవిష్యత్తుకు ముఖ్యమైన ప్రకృతిని, పర్యావరణాన్ని, సాంస్కృతిక, ఆహార, జీవ వైవిధ్యాన్ని తమ కబంధ హస్తాల్లో బంధించి, పీల్చి, పిప్పి చేస్తున్నాయి. వారి తీర్చలేని, ఆస్తుల దాహానికి ప్రపంచ ప్రజల రక్తాన్ని జలగల్లా పీల్చుకుంటూ అంతులేని ఐశ్వర్యంలో, వికృత ఆనందాన్ని అనుభవిస్తున్నాయి.

బ్రిటిష్, ఫ్రెంచ్, డచ్, పోర్చుగీస్, ఇటాలియన్, స్పానిష్, జర్మన్, జాపనీస్, అమెరికన్ పెట్టుబడిదారులు తమ సామ్రాజ్య విస్తరణ కాంక్షలో భాగంగా ప్రపంచ వ్యాప్తంగా యుద్ధాలు చేసి ఆక్రమించుకున్న దేశాలలో జరిపిన మారణకాండలు కూడా కలిపితే, ఇప్పటి వరకు ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది చావుకు కారణమైంది పెట్టుబడిదారీ విధానం.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారత దేశాన్ని పాలించిన దాదాపు రెండు వందల సంవత్సరాలలో కనీసం రెండు కోట్ల మంది భారతీయులను చంపినట్టు పాశ్చాత్యులే చెప్తున్నారు. మన దేశ పాలకులు ఈ సంఖ్య ఏ కారణం చేత మనకు చెప్పడం లేదు? కేవలం వేళ్ల మీద లెక్కపెట్టగలిగేంత మంది బ్రిటిష్ వారు కోట్ల మంది జనాభా కలిగిన భారత ఉపఖండాన్ని ఎలా 200 సంవత్సరాలు ఏలగలిగారు? వారికి భారతీయులు ఎవరు సహకరించారు? వారి సంతానం ఇప్పుడు భారత దేశంలో ఏ స్థాయిలో ఉన్నారు? లాంటి విషయాలు ప్రతి భారతీయుడు ఆలోచించాలి. మొదటి ప్రపంచ యుద్ధంలోనే రెండు లక్షల వరకు భారతీయులు బ్రిటిష్ వారి సైనికులుగా యుద్ధంలో పాల్గొని చనిపోయారు.

1991లో అమెరికా సామ్రాజ్యవాదులు ఇరాక్ మీద దాడి జరిపినపుడు, ఎడారిలో పారిపోతున్న లక్షకు పైగా ఇరాక్ సైనికులను (వీరు షియా, కుర్దిష్ ముస్లింలు) తమ బుల్‌డోజర్లతో చంపి ఎడారిలోనే పూడ్చివేయించింది అమెరికా ప్రభుత్వం. ఈ విషయాన్ని పాశ్చాత్య సామ్రాజ్యవాదుల ఆధీనంలో ఉన్న ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా తొక్కి పెడితే, ఈ మధ్య డేవిడ్ క్రోమ్‌వెల్ అనే రచయిత 'వై ఆర్ వి ది గుడ్ గయ్స్' అనే పుస్తకం ద్వారా బహిరంగ పరిచారు. 2001 నుండి ఇప్పటి వరకు అఫ్ఘనిస్తాన్‌లో, అలాగే 2003లో రెండవసారి ఇరాక్ మీద యుద్ధం చేసి ఆక్రమించుకున్నప్పటి నుండి ఇప్పటి వరకు దాదాపు పదిహేను లక్షల మందిని చంపివేశారు. బయటకు చెప్పకుండా ఇంకా ఎన్ని లక్షల మందిని చంపి పూడ్చి వేశారో!

దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాల్లో ఆయా దేశాల దళారీ పెట్టుబడిదారీ పాలకవర్గాలు సామ్రాజ్యవాదుల అండతో జరుపుతున్న అంతర్ యుద్ధాలు (అంటే తమ దేశ ప్రజలపై తామే జరుపుతున్న యుద్ధాలు), చంపి రహస్యంగా పూడ్చివేయడం లాంటి సంఘటనలను కూడా పరిగణనలోకి తీసుకుంటే, కాపిటలిజం తన పుట్టుక నుండి ఇప్పటి వరకు దాదాపు కోట్ల కొద్ది ప్రజల చావుకు కారణమైంది.

సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన వివిధ దేశాల దళారీ పెట్టుబడిదారులతో కలిసి ఆయా దేశాల పోలీసు, మిలిటరీ, పారా మిలిటరీ బలగాలతో, తమ ప్రైవేట్ సైన్యంతో తమ దోపిడీని ప్రశ్నిస్తున్న ప్రజలపై జరుపుతున్న మారణకాండలో, ప్రపంచ వ్యాప్తంగా వారు ప్రతిరోజు సగటున పదివేల మందిని చంపుతున్నట్టు పరిశోధకుల అంచనా. ఇవన్నీ డైరెక్ట్ హత్యలు. ఇక ఇన్‌డైరెక్ట్‌గా కాపిటలిజం ఎందరి చావులకు కారణమవుతూ వస్తున్నదో చూద్దాం.

**సామ్రాజ్యవాదం – పారిశ్రామిక హత్యలు**

పారిశ్రామిక ప్రమాదాల వలన కాపిటలిజం పుట్టినప్పటి నుండి నేటి వరకు ప్రపంచ వ్యాప్తంగా కోట్ల కొద్ది కార్మికులు చనిపోయి ఉంటారని అంచనా. పెట్టుబడిదారుల శ్రమ దోపిడీ విధానంలో భాగంగా అత్యంత ప్రమాదకర వాతావరణంలో కార్మికులచే పని చేయించుకోవడం వలన జరిగిన ప్రమాదాలే ఇవి. అందుకే ఇవన్నీ ముమ్మాటికీ పెట్టుబడిదారులు చేసిన హత్యలే. ఒకేసారి వందల్లో, వేలల్లో ప్రజలు చనిపోయిన పారిశ్రామిక ప్రమాదాలే ఎక్కువ ప్రాచుర్యంలోకి వస్తాయి. అయితే, ఒకరిద్దరు మొదలుకొని, పదిహేను, ఇరవై వరకు కార్మికులు ఒక పారిశ్రామిక ప్రమాదంలో చనిపోతున్న సంఘటనలు ప్రపంచ వ్యాప్తంగా ప్రతిరోజూ వేల కొలదిగా జరుగుతున్నాయి. ప్రపంచ

వ్యాప్తంగా ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలను అన్నింటినీ పెట్టుబడిదారులకు చెందిన కార్పొరేట్ కంపెనీలు తమ ఆధీనంలోకి తీసుకున్న తర్వాత, రోజు వారీగా జరిగే పారిశ్రామిక ప్రమాదాలను అసలే వార్తల్లో ప్రచురించక పోవడం, ఒకవేళ ప్రచురించినా ఆ ప్రాంతపు లోకల్ ఎడిషన్‌లలో ఎక్కడో మూలకు ప్రచురిస్తూ ప్రపంచ ప్రజలకు నిజాలు తెలువకుండా చేస్తున్నారు. ప్రపంచ పెట్టుబడిదారుల డైరెక్ట్, ఇన్‌డైరెక్ట్ హత్యలను, దోపిడీని ప్రజలు అర్థం చేసుకోకుండా, చైతన్యవంతులు కాకుండా ఉంచడానికి మీడియాను తమ ఆధీనంలోకి తీసుకొని అత్యంత పనికిమాలిన విషయాలనే చెప్తూ, ప్రజలకు తమ చరిత్ర, జరుగుతున్న వాస్తవాలు అర్థం కాకుండా, తెలువకుండా చేస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా రోజువారీ జరుగుతున్న పారిశ్రామిక ప్రమాదాల్లో చనిపోతున్న ప్రజలు ఎంత మంది అని ఏ రోజుకారోజు తెలియపరిస్తే నమ్మశక్యం కాని నిజాలు తెలుస్తాయి.

## అనారోగ్యం – అకాల మరణాలు

పారిశ్రామిక వ్యర్థాలు, అవి వదిలే అత్యంత ప్రమాదకర కాలుష్యాల వలన గాలి, నీరు, భూమి కలుషితమై తద్వారా ఆహారంలో కలిసిపోయి ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ చరిత్రలో కొన్ని కోట్ల మంది అర్థాంతరంగా తీవ్ర వ్యాధుల బారిన పడి చనిపోయారు. ఇక పోలియో, శారీరక, మానసిక వైకల్యాలు, ఇతర రోగాలతో కోట్లాది మంది ప్రపంచ వ్యాప్తంగా ఈ రోజు జీవచ్ఛవాల్లా బతుకులీడుస్తున్నారు.

ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారుల కంపెనీలు తయారు చేస్తున్న ప్రమాదకర తిండి పదార్థాలను, పానీయాలను, రసాయన మందులు, సిగరెట్లు, మద్యపానం, డ్రగ్స్ (మాదక ద్రవ్యాలు) తదితరాలను వినియోగిస్తూ రోగాలకు గురై అర్థాంతరంగా యాభై ఏళ్ల వయసు లోపే చనిపోయిన వారి సంఖ్య గత వంద సంవత్సరాలలో ప్రపంచ వ్యాప్తంగా కనీసం పది కోట్ల వరకు ఉంటుంది. కాపిటలిజం పుట్టుకకు ముందు ఈ రోగాలు దాదాపుగా లేవని చెప్పవచ్చు. నేటి పెట్టుబడిదారీ జీవన విధానంలో భాగంగా వస్తున్న ఈ రోగాల వలన అలాగే, రసాయనిక మందుల వైద్యం వికటించి అర్థాంతరంగా ప్రతి ఏటా చనిపోతున్న వారి సంఖ్య ప్రపంచ వ్యాప్తంగా చూస్తే కనీసం కోటి పైనే ఉంటుంది.

పారిశ్రామిక వ్యర్థాలను శుద్ధి చేయగలిగే అవకాశం ఉన్నప్పటికీ లాభాల గురించి దాన్ని పట్టించుకోవడం లేదంటే కాలుష్యం వలన జరిగిన మరణాలన్నీ సామ్రాజ్యవాదుల, వారి దళారీల హత్యలే. అలాగే తాము తయారు చేస్తున్న పానీయాలు, తిండి పదార్థాలు, రసాయనిక మందులు, సిగరెట్లు, మద్యం, డ్రగ్స్ లాంటి వలన ప్రపంచ వ్యాప్తంగా కోట్ల కొద్ది ప్రజలు చనిపోతున్నారని, రోగాల పాలవుతున్నారని తెలిసినా, వాటిని తయారు చేస్తూ ప్రజల మరణాలకు కారణమవుతున్నారు. ఇవన్నీ కూడా సామ్రాజ్యవాదుల, వారి దళారుల హత్యలే.

## పర్యావరణం

భూమి మీద ఉన్న కనీసం 60 శాతం ఆక్సిజన్ కేవలం సముద్రంలో ఉండే అత్యంత సున్నితమైన సముద్రపు ఆల్గే (నాచు) వలన తయారవుతుంది. అయితే, సామ్రాజ్యవాదులు, వారి దళారీ కార్పొరేట్ కంపెనీలు సముద్రంలోకి వదులుతున్న పారిశ్రామిక వ్యర్థాలు ఈ ఆల్గేను చాలా వేగంగా నాశనం చేస్తున్నాయి. సముద్రంలో ఎంత శాతం ఆల్గే ఇప్పటికే నాశనం అయిందనే విషయాన్ని ప్రజలకు తెలువకుండా తొక్కి పెడుతున్నారు. మిగతా 40 శాతం ఆక్సిజన్ అడవుల నుండి వస్తుంది. అయితే, భారతదేశంలోని అడవులను మైనింగ్, టీ, కాఫీ తోటలు, రియల్ ఎస్టేట్, రిసార్ట్‌లు, కలప కొరకు విచ్చలవిడిగా పెట్టుబడిదారులు నాశనం చేస్తున్నారు. అక్కడ నివసించే ఆదివాసులు అడవుల నాశనాన్ని అడ్డుకుంటూంటే, వారిని మావోయిస్టుల పేరు మీద మానవ రహిత విమానాలతో, హెలికాప్టర్లతో, సైనికులతో కిరాతకంగా చంపేస్తున్నారు.

ఈ దుర్మార్గాన్ని, అడవి వినాశనాన్ని ఆపకపోతే మనం, మన తర్వాతి తరాలు సమీప భవిష్యత్తులోనే నశించిపోయిన ఆక్సిజన్ వలన చావులకు, రోగాలకు గురికాక తప్పదు. మరి, సామ్రాజ్యవాదులు, వారి తొత్తులు కూడా చనిపోవడం, రోగాల పాలవడం జరుగుతుంది కదా అనే అనుమానం కలగవచ్చు. కాని వారు ఇప్పటికే వందల కోట్ల ఖర్చుతో కట్టుకున్న ఇళ్లలో ఆక్సిజన్ యంత్రాలు కూడా పెట్టుకున్నారనే విషయం గుర్తించాలి.

సామ్రాజ్యవాదుల దగ్గర ప్రపంచ ప్రజలపై తాము రుద్దిన ఏ సమస్యకు పరిష్కారం లేదు. ప్రతి సమస్యకు ఎన్‌జిఒ సంస్థలను, శాస్త్రవేత్తలను, తదితరులను ముందుకు దింపి వారితో పచ్చి అబద్ధాలు మాట్లాడిస్తూ, ప్రజలను మభ్య పెడుతున్నారు. పర్యావరణం నాశనం చేసి గ్లోబల్ వార్మింగ్‌కు కారణమవడం వలన తీవ్ర కరువులు, భారీ తుపానులు వస్తూ భయంకర ఆహార కరువుకు దారితీస్తున్నాయి. వాటికి పరిష్కారం చూపకపోగా, పై నుండి, కార్పొరేట్ కంపెనీలకు వదిలేస్తే ఆ సమస్యలకు మార్గాలు చూపుతామని అంటున్నారు. వారి కంపెనీలే భూమిని, పర్యావరణాన్ని నాశనం చేసి, తిరిగి దాని పరిష్కారానికి కూడా వారికి డబ్బులు ఇస్తే పరిష్కారాలు చెపుతారట. నాశనం కావించిన లక్షల కోట్ల ఎకరాల అడవులను డబ్బులతో మొలకెత్తిస్తారా? వారు కాలుష్య కుహరాలుగా మార్చిన నదులను, సముద్రాలను కరెన్సీ నోట్లతో క్లీన్ చేస్తారా? చిన్న చెరువు లాంటి హుస్సేన్ సాగర్‌ను క్లీన్ చేయడానికి కూడా వందల కోట్లు ఖర్చు చేసినా అలాగే ఉంది. అలాంటప్పుడు కోట్లాది ఎకరాల అడవులను మొలకెత్తిస్తామంటే, సముద్రాలను శుద్ధి చేస్తామంటే అమాయకుల్లా మనం నమ్మాలట. పర్యావరణానికి ఎంతో ముఖ్యమైన బాక్సైట్ లాంటి వనరులను తవ్వేసి అల్యూమినియం తయారు చేసి వాటి నుండి ప్రజలను చంపే మారణాయుధాలు, యుద్ధ విమానాలు తయారు చేస్తున్నారు. మరి ఆ బాక్సైట్‌ను తిరిగి దాని స్థానంలో పెట్టగలరా? ఓజోన్‌కు రంధ్రం పడేట్టు భూమిని నాశనం చేసి, ఇప్పుడు ఓజోన్ రంధ్రాన్ని పూడ్చగలరా?

సామ్రాజ్యవాదులు, వారి దళారీలు, వీరికి ఊడిగం చేస్తున్న మేధావులు, శాస్త్రవేత్తల దగ్గర దోచుకుని పారిపోయే ప్రణాళిక తప్ప, ప్రకృతిని, పర్యావరణాన్ని కాపాడుతూ, ప్రజల జీవన ప్రమాణాలు పెంచే ప్రణాళిక ఏదీ లేదు. అది సామ్రాజ్యవాదం ఉన్నంత వరకు అసంభవం కూడా. ప్రజలు తిరగబడి తరిమికొట్టే వరకు దోచుకోవాలి, తిరగబడడానికి వీలు లేకుండా ప్రజలను రకరకాల భ్రమల్లో, వ్యసనాలు, మత్తులలో ముంచి, ప్రజల ఆరోగ్యాన్ని నాశనం చేసి, పోరాడడానికి

శక్తి లేకుండా చేసి, అప్పటికీ తిరగబడితే ఎలాగూ తమ అక్రమ సంపాదనను ఎప్పటికప్పుడు పాశ్చాత్య దేశాలలో, డాలర్‌లలో (రూపాయలలో కాదు), బంగారం, వజ్రాల రూపకంలో, పాశ్చాత్య దేశాల్లో బంగ్లాలు కొనడం లాంటి వాటి ద్వారా దాచుకుంటున్నారు కాబట్టి ఆ దేశాలకు పారిపోతారు.

కేవలం ప్రజల ఆరోగ్యాన్ని నాశనం చేయడం మాత్రమే కాదు, సామ్రాజ్యవాద, దళారీ వ్యవస్థ ప్రకృతికి, పర్యావరణానికి జరిపిన, జరుపుతున్న నష్టం వర్ణించలేనిది. రెండు వందల సంవత్సరాల క్రితం ఉన్న అడవులతో పోల్చితే, ఇప్పుడు పది శాతం మాత్రమే మిగిలాయి. అడవులు అంతరించిపోవడం, గ్లోబల్ వార్మింగ్ పెరిగిపోవడంతో వాతావరణంలో తీవ్ర మార్పులు జరిగాయి. దాంతో దాదాపు అన్ని దేశాల్లో కూడా కరువు రావడం మొదలయింది.

## వ్యవసాయం, ఆహార కొరత

వ్యవసాయ రంగంలోకి అడుగిడిన బహుళజాతి విత్తన కంపెనీలు, పురుగు మందుల కంపెనీలు, సహజ సిద్ధమైన ఎరువులతో, సాంప్రదాయక మేలిరకాల వంగడాలతో నడుస్తున్న మన దేశ వ్యవసాయాన్ని 'హరిత విప్లవం' పేరుతో నాశనం చేసి భూమి, నీటి వనరులను కలుషితం చేసి, తమ గుప్పిట్లోకి తీసుకున్నారు.

వ్యవసాయ ఉత్పత్తులలో కమాడిటీస్ ఫ్యూచర్స్ ట్రేడింగ్ అనే షేర్ మార్కెట్ లాంటి దళారీ జూద వ్యాపారానికి భారత దళారీ పాలకులు అనుమతి ఇవ్వడం వలన రైతులు అప్పులు చేసి పండించిన పంటల ధరలు వాస్తవిక పరిస్థితుల ఆధారంగా నిర్ణయించబడకుండా, జూద స్వభావం కలిగిన అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిదారుల, దళారీల స్పెక్యులేషన్ ఆధారంగా నిర్ణయించబడుతుండడం వలన రైతులకు గిట్టుబాటు ధరలు లభించడం లేదు. సామ్రాజ్యవాద దేశాల ఒత్తిడికి తలొగ్గి ఆయా దేశాల్లో మిగిలిపోయిన వ్యవసాయ ఉత్పత్తులను మిలియన్ల కొద్ది టన్నులు మన దేశ పాలకులు దిగుమతి చేసుకోవడం వలన అవే పంటలు పండించిన భారత రైతులు తీవ్రంగా నష్టపోవడం జరుగుతున్నది. ఈ మధ్య పాడిపరిశ్రమ సంక్షోభంలో పడి రైతులు తమ బర్రెలను, ఆవులను అమ్మేసుకుంటున్నారని మీడియాలో విస్తృతంగా వార్తలొచ్చాయి. అయితే, ఈ సంక్షోభానికి గల ప్రధాన కారణం మాత్రం అంతగా ప్రచారంలోకి రాలేదు. పాడి పరిశ్రమ ఇలా సంక్షోభంలో పడడానికి గల ప్రధాన కారణం సామ్రాజ్యవాద దేశాల నుండి ఇబ్బడి ముబ్బడిగా దింపబడిన పాల పౌడర్ అతి తక్కువ ధరలో భారతదేశంలో అమ్మబడుతున్నది.

కేవలం ప్రపంచ మార్కెట్‌కు కావాల్సిన, సామ్రాజ్యవాదులకు లాభదాయకమైన వ్యాపార పంటలకే భారత దళారీ పాలకులు ప్రోత్సాహకాలు ఇస్తూ, తక్కువ ఖర్చుతో ఆయా ప్రాంతాల వాతావరణానికి అనుగుణమైన, భారతదేశంలోనే వందల సంవత్సరాలుగా పండించ బడుతున్న అత్యంత పోషకాలు కలిగిన ఆహార ధాన్యాలు, పప్పు దినుసులు, కూరగాయలు, పళ్లను పండించడానికి ప్రోత్సాహకాలు ఇవ్వకపోవడం వలన, దేశ ప్రజలకు పౌష్టికాహారం, ఆహార ధాన్యం కొరత ఏర్పడుతున్నది. ఇంకోవైపు వ్యాపార పంటలను పండిస్తున్నప్పటికీ రైతులు అప్పుల్లోకి కూరుకుపోవడం జరుగుతున్నది. ఇంకా రకరకాలుగా భారత దళారీ పాలకులు సామ్రాజ్యవాదులతో పన్నిన కుట్రలో భాగంగా వ్యవసాయాన్ని ఉద్దేశపూర్వకంగా నాశనం చేస్తున్నారు. దాంతో 1991 నుండి నేటి వరకు లక్షలాది మంది రైతులు అప్పులల్లో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకున్నారు. లక్షలాది రైతు కుటుంబాలు అప్పులు తీర్చడానికి భూములను అమ్ముకొని, కూలీలుగా మారారు. ఎన్నో లక్షల కుటుంబాలు వ్యవసాయాన్ని వదిలి పట్టణాలకు, నగరాలకు వలస పోతున్నారు. ఇవన్నీ కనబడుతున్న వాస్తవాలే.

భారతదేశం లాంటి వర్షాధార దేశాల్లో గ్లోబల్ వార్మింగ్ వలన వాతావరణంలో పెను మార్పులు జరిగాయి. వర్షాలు పడాల్సినప్పుడు పడకపోవడం, పడకూడని సమయాల్లో పడడం, అయితే తుఫానులు రావడం, లేదా కరువు రావడం, ఇలా మొత్తం వాతావరణం మారిపోయింది. రానున్న పది సంవత్సరాలలోనే నీటి కొరతతో వరి పండించడం చాలా ప్రదేశాలలో సాధ్యం కాదని పర్యావరణ శాస్త్రవేత్తలు చెపుతున్నారు. ఇప్పటికే నీరులేక క్రాప్ హాలిడేలు ప్రకటిస్తున్నారు. ఇంకో వైపు సామ్రాజ్యవాద దేశాలు తమ దేశ వాతావరణంలో పండించలేని పత్తి పంటను (వారి విచ్చలవిడి బట్టల వినియోగానికి) భారత దేశం లాంటి ఉష్ణ దేశాల్లో ఆ దేశాల సామ్రాజ్యవాద తొత్తు ప్రభుత్వాల ద్వారా పత్తి పంటకు ప్రభుత్వ సబ్సిడీలు, ప్రోత్సహకాలు ఇప్పిస్తూ, ఆహార పంటలను ప్రోత్సహించకుండా పత్తి లాంటి కమర్షియల్ పంటలను ప్రోత్సహిస్తున్నారు. ఇవే కాకుండా, సిగరెట్ల గురించి పొగాకు పంట; గమ్ కొరకు రబ్బర్ చెట్లు, గువార్ గమ్ పంటలు; పౌల్ట్రీ ఫామ్, నూనె పరిశ్రమల కొరకు మొక్కజొన్న, సన్‌ఫ్లవర్ పంటలు; బయో డీజిల్ కొరకు జట్రోఫా; ఎథనాల్ కొరకు చెరుకు; ప్యాకేజ్డ్ ఫుడ్ కంపెనీల కొరకు సోయా, గోధుమలు, టమాటా; పానీయాల కంపెనీల కొరకు టీ, కాఫీ, కోకా పంటలు; పేపర్ కంపెనీల కొరకు యూకలిప్టస్, ఇతర చెట్లు; ఫర్నిచర్ కంపెనీల కొరకు కేవలం గుజ్జును (కలప కాదు) ఇచ్చే చెట్లు; ఇలా, ఇంకా ఎన్నెన్నో రకాలుగా ప్రపంచ మార్కెట్ కోసం పెట్టుబడిదారుల కంపెనీలకు కావాల్సిన వ్యాపార పంటలకు మాత్రమే సామ్రాజ్యవాదుల దళారీ ప్రభుత్వాలు ప్రోత్సాహకాలు ఇస్తూ ఉండడం వలన, ఆహార పంటలు పండించడం ఆపేసి, వ్యాపార పంటల వైపు మొగ్గు చూపుతున్నారు. దాంతో, కేవలం ముప్పై ఏళ్ల క్రితం ఎన్నెన్నో వైవిధ్యమైన పళ్ళు, కూరగాయలు, తిండి గింజలకు నెలవైన భారత దేశం నేడు ఇవన్నీ కనుమరుగు అయిపోయే పరిస్థితికి చేరుకుంది. ఇప్పటికే, భారతదేశం పండించగలిగిన ఆహార ఉత్పత్తులను దిగుమతి చేసుకుంటున్న విషయం గమనించాలి. పోషకాహార లేమి మెజారిటీ భారతీయులలో ఉంది. మధ్యతరగతి కుటుంబాలు కూడా పోషకాహార లేమితో, రోగ నిరోధక శక్తి నశించి, తరుచుగా రోగాల పాలవుతున్నారు. ఇక పేద ప్రజల పరిస్థితి చెప్పనవసరమే లేదు. దీనికి కారణం, ఇరవై, ముప్పై సంవత్సరాల క్రితం దొరికినట్టుగా తక్కువ ధరకే రకరకాల సేంద్రియ కూరగాయలు, పళ్లు ఇప్పుడు దొరకడం లేదు. పల్లెటూర్లలోనే పళ్ళు, కూరగాయలు దొరకని పరిస్థితి వచ్చింది.

వ్యవసాయాన్ని నాశనం చేయాలనే పాలకవర్గాల కుట్ర, త్వరలోనే మన దేశ ప్రజలను అత్యంత పోషకాహార లేమికి, ఆహార కొరతకు గురి చేయబోతున్నాయి. ఇప్పటికే పురుగు మందుల ద్వారా, హైబ్రిడ్ విత్తనాల ద్వారా భారత వ్యవసాయాన్ని తమ గుప్పిట్లోకి తీసుకున్న

సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన భారత దళారీ పెట్టుబడిదారుల కార్పొరేట్ కంపెనీలు, మొత్తంగా వ్యవసాయాన్ని, భూమిని తమ పరం చేసుకొని కాంట్రాక్ట్ ఫార్మింగ్, కార్పొరేట్ ఫార్మింగ్‌తో వేల ఎకరాల అతిపెద్ద కమతాలలో అంతర్జాతీయ మార్కెట్‌కు అవసరమైన వ్యాపార పంటలను మాత్రమే పండించబోతున్నారు. ఇప్పటికే చాలా మంది రైతుల వద్ద మన సాంప్రదాయక వంగడాలు లేవు. నిజానికి, ఈరోజు సామ్రాజ్యవాద దేశాలు తలుచుకుంటే, కేవలం ఆరు నెలల్లోనే భారతీయులు నగ్నంగా తిరగాల్సిన పరిస్థితి తేవచ్చు. ఎందుకంటే, భారతదేశంలో పండే పత్తి పంటలో 98 శాతం మోన్‌సాంటో (అమెరికా) కంపెనీ విత్తనాలే. ల్యాబ్‌లలో తయారు చేసే ఈ విత్తనాలలో 'టెర్మినేటర్ టెక్నాలజీ' వాడడం వలన ఆ విత్తనాలలో పునరుత్పత్తి శక్తి ఉండదు. అంటే ప్రతిసారీ ఆ కంపెనీ విత్తనాలు కొనక తప్పదు. కాటన్ (పత్తి) బట్టలు కాకపోతే పాలిస్టర్ బట్టలు తొడుక్కొని మానాన్ని కాపాడుకుంటాం అని అనుకున్నా మళ్లీ సామ్రాజ్యవాదుల పాదాల చెంతకే వెళ్లక తప్పదు. మరి భారతదేశంలో ఇంతకు ముందు పత్తి పండలేదా? కొన్ని వేల సంవత్సరాల నుండి మన దేశంలో పత్తి పండిస్తున్నారు. బట్టలు నేస్తున్నారు. నిజానికి, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశాన్ని ఆక్రమించుకోవడానికి గల కారణాలలో పత్తి, మిరియాలు కూడా ఒక కారణం. బట్టలు తొడుక్కోవడానికి పత్తి కావాలి. రుచికరమైన తిండి తినడానికి మిరియాలు కావాలి. మిరియాల గురించి తెలవకముందు వీరి ఆహారం రుచిగా ఉండేది కాదు. కారం లేకుండా చప్పగా ఉండేది. పాశ్చాత్య దేశాలు మంచు దేశాలు కాబట్టి అక్కడ మిరియాలు పండవు. పత్తి కూడా ఏ సామ్రాజ్యవాద దేశంలో పండదు. పత్తి మీద అధికారం ఉంటేనే బ్రిటన్ వలె సామ్రాజ్యవాద దేశంగా ఎదగగలమని భావించిన అమెరికా సామ్రాజ్యవాదులు పక్కనే ఉన్న మెక్సికోపై యుద్ధం చేసి, లక్షలాది ఆ దేశస్థులను ఊచకోత కోసి, దాదాపు మెక్సికోలో సగం ప్రాంతాన్ని తమ దేశంలో కలుపుకున్నారు. అవే ఇప్పుడు అమెరికాలోని దక్షిణ ప్రాంతపు రాష్ట్రాలు. దాదాపు వంద సంవత్సరాల క్రితం వరకు ఆ రాష్ట్రాల్లో ఆఫ్రికా నుండి కిడ్నాప్ చేసి తెచ్చిన నల్లజాతి వారిని బానిసలుగా మార్చి, తిండి కూడా సరిగా పెట్టకుండా, జీతం ఇవ్వకుండా, వారితో పత్తి తోటల్లో వెట్టి చాకిరీ చేయించుకుని అత్యంత లాభాలు గడించారు అమెరికా పెట్టుబడిదారీ దోపిడీదారులు. వారి సంతానమే నేడు అమెరికాలో మంత్రులు, ప్రెసిడెంట్లు, మిలియనీర్లు, బిలియనీర్లు, బహుళజాతి సంస్థల యజమానులు. ఇలాంటి నరహంతక దోపిడీ పెట్టుబడిదారులతోనే భారతదేశం 'అభివృద్ధి' చెందుతుందని భారత దళారీ పాలకవర్గాలు 1991లో గ్లోబలైజేషన్ మొదలుపెట్టారు. సామ్రాజ్యవాద దోపిడీదారుల కాళ్ల ముందు మోకరిల్లారు.

## దోపిడీ, అణచివేతల కొరకే హైవేలు, రింగ్‌రోడ్‌లు

1947కు ముందు బ్రిటిష్ దోపిడీదారులు దాదాపు రెండు శతాబ్దాల పాటు భారత దేశ ప్రజలను దోచుకోవడానికి సహకరించిన భారత దళారీ పాలకవర్గాలే, ఈసారి అన్ని సామ్రాజ్యవాద దేశాల దోపిడీదారులు ప్రపంచీకరణ పేరు మీద భారతదేశాన్ని దోచుకోవడానికి దారులు వేసి, వారితో మిలాఖతై అశేష భారత ప్రజానీకాన్ని ఇరవై రెండు సంవత్సరాల లోనే ఇంతవరకు కనీవినీ ఎరుగని పేదరికంలోకి, అప్పుల్లోకి, ఆహార, పోషకాహార సంక్షోభంలోకి, కాలుష్యం, పర్యావరణ, జీవ వైవిధ్య, ఆరోగ్య సంక్షోభంలోకి నెట్టారు. సామ్రాజ్యవాదుల బహుళజాతి కార్పొరేట్ కంపెనీలు, భారత దళారీ పెట్టుబడిదారుల కార్పొరేట్ కంపెనీలు కలిసి 'దోచుకున్నోనికి దోచుకున్నంత' అన్నట్టుగా భారత ప్రజలను, వనరులను బ్రిటిష్ వాడి పాలనలో జరిగిన దోపిడీ కన్నా కొన్ని లక్షల రెట్లు మించి దోచుకుంటున్నారు. బ్రిటిష్ పాలనలో వారి దోపిడీ కోసం, ప్రశ్నించే ప్రజలను ఊచకోత కోసే సైన్యాన్ని తరలించడం కోసం రైల్ మార్గం వేస్తే, నేడు సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన భారత దళారీ పెట్టుబడిదారుల దోపిడీ కొరకు, ఈ దోపిడీని ప్రశ్నించే ప్రజలను ఊచకోత కోసే సాయుధ బలగాలను మారుమూల పల్లెల్లోకి కూడా ట్రాన్స్‌పోర్ట్ చేయడానికి హైవేలను, ఎయిర్‌పోర్టులను, రింగ్‌రోడ్‌లను వేస్తున్నారు. దీన్ని మధ్యతరగతి 'అభివృద్ధి' అని భ్రమపడుతున్నది.

## వలసలు – పట్టణీకరణ

వ్యవసాయాన్ని నాశనం చేయడం వలన సామ్రాజ్యవాదులకు, భారత దళారీ పాలకవర్గాలకు ఏమి లాభం? వ్యవసాయం చేయడం ఆత్మహత్యా సదృశం, నష్టదాయకం అని భావించి వ్యవసాయాన్ని వదిలి దాదాపు వ్యవసాయ రంగంలో 95 శాతంగా ఉన్న చిన్న, సన్నకారు రైతులు, వీరిపై ఆధారపడిన వ్యవసాయ కూలీలు పట్టణాలకు, నగరాలకు వలసపోతేనే అక్కడ ఉన్న పరిశ్రమలకు శ్రామికులు అత్యంత చవకగా దొరుకుతారు. వ్యవసాయాన్ని నాశనం చేయకుండా, గ్రామీణ ప్రజలు పట్టణాలకు బతుకుదెరువు కొరకు వలస పోయే పరిస్థితులు కల్పించకుండా, ఆ దేశంలో పెట్టుబడిదారులు అత్యంత లాభాలు గడించలేరు. అన్ని పాశ్చాత్య దేశాల్లో ఇదే జరిగింది. కొన్ని పాశ్చాత్య దేశాల్లో నియంతృత్వం ద్వారా గ్రామాల నుండి ప్రజలను పట్టణాలకు తరిమితే, ఇంకొన్ని దేశాల్లో కృత్రిమ ఆర్థిక సంక్షోభాలు సృష్టించి వ్యవసాయాన్ని నాశనం చేసి, గ్రామాల్లో బతికే పరిస్థితి లేకుండా చేసి పట్టణాలకు వలసపోయేట్టు చేశారు. వరల్డ్ బ్యాంక్ 'వరల్డ్ డెవెలప్‌మెంట్ రిపోర్ట్-2013' దృష్టిలో 'వ్యవసాయం తక్కువ ఉత్పాదకత రంగం'. కాబట్టి 'సృజనాత్మక విధ్వంసం' చేస్తే శ్రామికులు వ్యవసాయం వదిలి పరిశ్రమల వైపు వెళతారు. దీన్ని వీరు 'లేబర్ రిఅల్లొకేషన్' అంటున్నారు. అంటే, వ్యవసాయాన్ని సృజనాత్మకంగా విధ్వంసం చేయకుండా పట్టణాలలోని వారి పరిశ్రమలకు, కంపెనీలకు శ్రామికులు దొరకరు అని వారే చెపుతున్నారు.

2040 వరకు 70 నుండి 80 శాతం భారత గ్రామీణ ప్రజలు (యాభై ఏళ్ల పైబడిన వారిని మినహాయించి) పట్టణ ప్రాంతాలకు వలస వెళ్లేట్టు ప్రణాళికలు రచించిన వాస్తవం మనకు స్వయంగా వరల్డ్ బ్యాంక్, జోన్స్ లాంగ్ లసాల్ అనే బహుళజాతి రియల్ ఎస్టేట్ రీసెర్చ్ కన్సల్టెన్సీ సంస్థల రిపోర్ట్‌ల ద్వారా తెలుస్తుంది. వీరి రిపోర్ట్‌ల ప్రకారం 2040 వరకు దేశంలోని 80 శాతం జనాభా కేవలం 950 పట్టణాలు, మహా నగరాలలో నివసించబోతున్నారు. (అంటే వలసలు పోయే పరిస్థితులు కల్పించబోతున్నారు.) దీనివలన పెట్టుబడిదారులకు చవకగా కార్మికులు దొరకడమే కాకుండా, పెట్టుబడిదారుల అన్ని రకాలైన ఉత్పత్తులు, చివరికి

తిండి గింజలు, కూరగాయలు కూడా వారి సూపర్ మార్కెట్లలో కొంటారు కాబట్టి అలా వారికి విపరీతమైన లాభం. ఏ రంగాన్ని తీసుకున్నా సామ్రాజ్యవాదుల, దళారీ పెట్టుబడిదారుల కంపెనీలే కాబట్టి పట్టణాల్లో నివసించే ప్రజలు ఖర్చు చేసే దాదాపు ప్రతి రూపాయి కూడా సామ్రాజ్యవాదుల, వారి దళారీల కార్పొరేట్ కంపెనీలకే చేరుతుంది. అందుకే, మెజారిటీ జనాభా గ్రామాల్లో ఉంటే కార్పొరేట్ కంపెనీల దృష్టిలో ఆ జనాభా దేశానికి అనవసర భారం. 'దేశంలో ఖర్చు చేయబడే ప్రతి రూపాయిలో యాభై పైసలు నా కంపెనీకే వచ్చే వ్యాపార ప్రణాళిక చేసాం' అని ముకేష్ అంబానీ అన్న మాటలు గుర్తు చేసుకోవాలి.

### ఊయల నుంచి సమాధి దాకా లాభమే

ఒక శిశువు జన్మించి ఉయ్యాలలో ఉన్నప్పటి నుండి పెరిగి, పెద్దయి, ముసలి వయసులో చనిపోయి శవపేటికలోకి వెళ్లే వరకు ఆ వ్యక్తి ఈ కార్పొరేట్ కంపెనీల మాఫియాకు లాభాలు తెచ్చే యంత్రంగా బతికి చావాలి. అంతేకాని మనిషి లాగా బతకకూడదు. (నిజానికి, వారి వ్యాపారం తల్లి గర్భం నుండే మొదలు అవుతున్నది). అలా బతకడానికి వీలులేని అత్యంత అమానవీయమైన వ్యాపార సంబంధాలను అందరి జీవితాల్లోకి వారు తెస్తున్నారు. అలా తెస్తేనే వారికి విపరీతమైన లాభాలు వస్తాయి. సామ్రాజ్యవాద దేశాల్లో ఇలాంటి వ్యవస్థే ఉంది. భారత దేశంలోని చాలా నగరాల్లోకి ఈ వ్యవస్థ ఇప్పటికే వచ్చి, పాతుకు పోతున్నది. ఇది జరిగిన, జరుగుతున్న వాస్తవం. ఇలాంటి వ్యవస్థలో మనం ఏదైనా మంచి పని చేయాలన్నా డబ్బు కావాలి. దాని కొరకు డబ్బు సంపాదించే క్రమంలో, వాటిని ఖర్చు చేసే క్రమంలోని ఆ లింక్‌లో ఆ డబ్బు ఎన్ని చేతులు మారినా, అంతిమంగా ప్రతి రూపాయి కార్పొరేట్ కంపెనీల (అంటే సామ్రాజ్యవాదులు, దళారీ పెట్టుబడిదారుల) జేబుల్లోకే వెళ్లే వ్యవస్థ ఇప్పుడు భారత దేశంలో గ్లోబలైజేషన్ పేరు మీద దింపారు. పాశ్చాత్య దేశాల్లోని ఇలాంటి అమానవీయ వ్యవస్థలో కొన్ని దశాబ్దాలుగా బతుకులీడుస్తున్న ప్రజలలో కొందరు మార్పు కోరుకుంటున్న వారు ఈ కార్పొరేట్ కంపెనీల డబ్బు విష వలయం నుండి బయటపడి బతికే అన్వేషణలో రకరకాల ప్రయోగాలు చేస్తున్నారు. దీంట్లో భాగంగా, వస్తు మార్పిడి జీవన విధానం, తిండి పెట్టే పని చేయడం; ఒక ఏరియాలోనే చెల్లుబాటు అయ్యే లోకల్ కరెన్సీ; గెరిల్లా గార్డెనింగ్ (అంటే పక్కింటి వారి లేదా ప్రభుత్వ భూములల్లో వారికి తెలువకుండా కూరగాయలు – పువ్వులు కాదు– పండించుకోవడం); ధనవంతులు వాడకుండా వదిలేసిన కూరగాయలను తెచ్చుకొని వాడుకోవడం; కొందరు కలిసి ఒక ఎకరం భూమిలో కూరగాయలు తదితరమైనవి పండిస్తూ కలిసి బతకడం; సినిమాలు, షికార్లు, సెల్‌ఫోన్‌లు, కంప్యూటర్‌లు, బైక్‌లు, టివిలు చివరికి కరెంట్ కూడా వాడకుండా అత్యంత సాధారణ బట్టలు తొడుక్కొని ఒక మనిషి ఎంత సాధారణ జీవితం బతుకగలడో అలాగ జీవిస్తూ బతకడం; అతి పేద దేశాలకు వెళ్లి ఆ పేదలలాగే బతుకుతూ, లేదా ఏదైనా సేవా సంస్థలకు ఉచితంగా పనిచేస్తూ బతకడం; ఇలా రకరకలా వినూత్న పద్ధతులలో ఈ పెట్టుబడిదారీ విష వలయం నుండి, అది తయారు చేసిన అత్యంత అమానవీయ వ్యాపార సంస్కృతి నుండి బయట పడాలని చూస్తున్నారు.

అయితే, ఇవి కేవలం పరిమితమైన, తాత్కాలిక పరిష్కారాలు. అసలు కావాల్సింది సంపూర్ణ, శాశ్వత పరిష్కారం. దానికి మనం ఈ సామ్రాజ్యవాదుల, వారి దళారుల అమానవీయ వ్యవస్థ నుండి విముక్తికై పోరు సలిపి అత్యంత మానవీయమైన సమ సమాజాన్ని స్థాపించు కోవడమే పరిష్కారం. అయితే ఈ సత్యాన్ని ప్రజలకు అర్థం కాకుండా, భారత దళారీ పాలకవర్గాలు, సామ్రాజ్యవాదులతో కుమ్మక్కై, 'శ్మశాన' అభివృద్ధిని 'పిప్పి' నాగరికతను, కాలుష్యం, అవినీతి, రాజ్యహింస, అరాచకం, అనారోగ్యం, రోగాలతో నిండి కుళ్లి కంపుకొడుతున్న ఈ వ్యవస్థను అందమైన హాలీవుడ్ యానిమేషన్ సినిమాలా ప్యాకేజింగ్ చేసి 'అభివృద్ధి' పేరు మీద పగటి కలలు చూపిస్తున్నారు. ఎటిఎం మెషిన్ల నుండి దూసుకొస్తున్న చెక్కు చెదరని కరెన్సీ నోట్లను చూస్తూ, కొత్త నోట్ల వాసన పీలుస్తూ, ఇంగ్లీష్ చదువులు చదువుకున్న మధ్యతరగతి, ఈ కుళ్లిన కంపును పీలుస్తూ కూడా ఇదంతా వాస్తవం కాదనుకుంటుంది.

### చదువులు, ట్రెడ్‌మిల్

చదువు మనిషికి మంచి-చెడులను, న్యాయం-అన్యాయాలను గుర్తించగలిగే విచక్షణా జ్ఞానం కలిపించేదిగా ఉండాలి. కాని అలాంటి చదువు నేర్పిస్తే చదువుకునే యువకులు సామ్రాజ్యవాదుల, వారి దళారీల దోపిడీ నిజ స్వరూపాన్ని గుర్తిస్తారని, కేవలం ఉద్యోగాల గురించే చదువు అనే వ్యవస్థను విద్యారంగంలో దింపారు. చదువుకున్న తరువాత తాము చదువు మీద పెట్టిన డబ్బు, సమయానికి తగిన రిటర్న్స్ (లాభాలు) రావాలి కాబట్టి ఉద్యోగాలు సంపాదించి, పెళ్లి చేసుకొని, పిల్లల్ని కని, వారికి మంచి జీవితం, ఆస్తి, చదువులు సమకూర్చడం లక్ష్యాలుగా ఉండాలని చదువుకున్న యువతకు బ్రెయిన్ వాష్ జరుగుతుంది. కాబట్టి యువత ఉద్యోగాలలోనో, చిన్నా, చితకా వ్యాపారాలలోనో రాణించే ప్రయత్నంలో ఉంటున్నారు. సంపాదనే లక్ష్యంగా అందరూ బతుకు తున్నాం కాబట్టి, మనకు ఇష్టం ఉన్నా, లేకున్నా, మనం ఏమి చేస్తున్నామో అర్థం అయినా కాకపోయినా, ఒకరి సంపాదన కొరకు ఇంకొకరికి అబద్ధాలు చెపుతూ, మోసం చేస్తూ, ఆ క్రమంలో కొన్ని డబ్బులు సంపాదించినా, అంతకంటే వేల రెట్లు ఎక్కువగా ప్రతి ఒక్కరం సామ్రాజ్యవాదులకు, దళారీ పెట్టుబడిదారులకు మనం కష్టపడి ఆస్తులు సంపాదించి పెడుతున్నాం. పాలకవర్గాలు స్వయంగా కోట్ల కొద్ది ప్రజల్ని మోసం, దోపిడీ చేయలేరు కాబట్టి ప్రజల నుండి కొందరిని ఉద్యోగాలలోకి తీసుకొని వారిచేత తమ తోటి ప్రజలను మోసం, దోపిడీ చేయిస్తున్నారు.

దాంట్లో భాగంగానే తమ దోపిడీకి కావలసిన చదువులను ముందుకు తెచ్చి, అవి చదవడానికి ప్రజల చేతే డబ్బులు ఖర్చు చేయించి, కష్టపడి చదివేట్టు చేసి, వారి చేతనే తమ దోపిడీ అమలుపరుస్తున్నారు. చివరికి, వేల కోట్ల తమ అక్రమ సంపాదనను తామే కాపాడుకునే ధైర్యం కూడా లేక, తమ అక్రమాలను ప్రశ్నిస్తున్న ప్రజలను అణచివేయడానికి, చంపడానికి పేద, మధ్యతరగతి వారినే ముందుకు తోసి, వారి చేత తమ వారినే అణచి వేయిస్తున్నారు. మారణహోమాలు సృష్టిస్తున్నారు. వారి దోపిడీని, ఆస్తులను కాపాడడానికి ప్రజలు (వారు కూడా పాలకవర్గాల చేతుల్లో దోపిడీకి గురవుతున్నవారే) ప్రాణాలు ఇవ్వాలి.

జీతం డబ్బుల గురించి ప్రాణాలు ఎవరిస్తారు? కేవలం పేదవారే. అందుకే, పేదరికం అనేది లేకుండా సామ్రాజ్యవాదులు, దళారీ పెట్టుబడిదారులు బతకలేరు. ఎంత పేదరికం ఉంటే వారికి అంత లాభం. ఎందుకంటే, సామ్రాజ్యవాదుల భాషలో పేదరికంలో ఉన్న వారే, బతుకు తెరువు కొరకు చనిపోవడానికి సిద్ధపడతారు. కాబట్టి ఆ పేదవారిని వారు తమ భాషలో 'చవక మాంసపు ముద్దలు'గా పిలుస్తారు. 'చవక మాంసపు ముద్ద'లను బలి చేస్తూ తమ అక్రమ, అనైతిక దోపిడీ రాజ్యాన్ని కాపాడుకుంటున్నారు.

### కరెన్సీ, ద్రవ్యోల్బణం – సామ్రాజ్యవాదుల దోపిడీ సాధనాలు

పెట్టుబడిదారులు మనల్ని నమ్మబలికిస్తున్నట్టుగా కరెన్సీ నోట్లు రియాలిటీ (వాస్తవం) అయితే, ఒక వంద రూపాయల నోటు విలువ, ఎప్పుడైనా అదే విలువ కలిగి ఉండాలి. కేవలం పది సంవత్సరాల క్రితం వంద రూపాయల విలువకు ఇప్పటి పరిస్థితితో పోలిస్తే ఎంతో విలువ పడిపోయింది. ముప్పై సంవత్సరాల క్రితం వంద రూపాయలతో ఒక వ్యక్తి నెలంతా బతికేవాడు. ఇప్పుడు మూడు రోజులకు మించి బతకలేడు. ముప్పై ఏళ్ల క్రితం 25 పైసలకు ఎంతో విలువ ఉండేది. ఇప్పుడు 25 పైసల నాణానికి ఏ విలువా లేదని చెలామణీలో నుండి తీసివేసారు. రిజర్వ్ బ్యాంక్ (ఆర్‌బిఐ) లెక్కల ప్రకారమే ప్రతి సంవత్సరం ఎనిమిది శాతం ద్రవ్యోల్బణం (అంటే ధరలు పెరగడం) ఉంది. ఆర్‌బిఐ లెక్కల ప్రకారం, మీ దగ్గర ఇప్పుడు లక్ష రూపాయలు ఉంటే, సరిగ్గా అవే నోట్లను మీరు ఐదు సంవత్సరాల తరువాత బయటకు తీస్తే వాటి అసలు విలువ కేవలం అరవై వేలే.

ఇప్పుడు మీ దగ్గరున్న లక్ష రూపాయలను 2040 సంవత్సరంలో బయటకు తీస్తే మీకు కేవలం రెండు లేదా మూడు వేల విలువగల వస్తువులు మాత్రమే వస్తాయి. తాము ప్రజలకు ఏది వాస్తవమని భ్రమింప చేస్తున్నారో, దాన్ని వారే నమ్మడం లేదు. తాము అక్రమంగా అనైతికంగా, ప్రజలను దోచుకొని సంపాదించిన వందలు, వేల కోట్లను, రూపాయి నోట్లలో ఉంచుకుంటే, 30 ఏళ్ల తరువాత వాటి విలువ చాలా పడిపోతుందని, ఒక్కొక్క కోటీశ్వరుడు టన్నుల కొద్ది బంగారాన్ని కొని, దాచుకుంటున్నారు. అందుకే బంగారం విలువ అంతగా పెరిగిపోతుంది. అలాగే, కోటి, రెండు కోట్ల విలువ చేసే వజ్రాలను కొంటున్నారు. అమెరికా డాలర్లు కొంటూ స్విస్ బ్యాంకుల్లో దాచుకుంటున్నారు. పాలకవర్గాలు ప్రజలకు భారతదేశ కరెన్సీ నోట్లను నమ్మమని చెపుతూనే, తాము మాత్రం వాటిని భవిష్యత్‌లో పనికిరాని పేపర్ ముక్కల్లా చూస్తూ డాలర్, బంగారం, వజ్రాలను నమ్ముతున్నారు. అసలు వాస్తవం ఏంటంటే, మెజారిటీ ప్రజలు ఎన్ని దశాబ్దాలు కష్టపడినా వారి సంపాదనంతా రోజు రోజుకూ దూసుకుపోతున్న ద్రవ్యోల్బణం (ధరలు పెరగడం), ప్రత్యక్ష, పరోక్ష పన్నులు కట్టడం, హాస్పిటల్స్‌కు, చదువులకు మాత్రమే సింహభాగం ఖర్చవుతుంది. ఇంకా డబ్బు మిగిలితే, సామ్రాజ్యవాదులు, వారి దళారీలు పకడ్బందీగా అన్ని దిక్కుల నుండి దింపిన వస్తు వినియోగ సంస్కృతిలో భాగమైన సెల్‌ఫోన్‌లు, ఎలక్ట్రానిక్స్, కాస్మొటిక్స్, కంప్యూటర్లు, ఫ్యాషన్‌లు, బైక్‌లు, కార్లు, పెట్రోల్ లాంటి అనవసర ఖర్చులకే కర్పూరంలా కరిగిపోతూ, విలువైన ఆస్తి మెజారిటీ ప్రజలు ఎన్నడూ ఏర్పరుచుకోలేరు.

దోపిడీ పాలకవర్గాలకు ఒక వాస్తవం స్పష్టంగా తెలుసు. ఒక దేశ జనాభాలో 90 శాతం జనాభా వారి జీవిత కాలం నిద్రపోకుండా కష్టపడినా ధనవంతులు కాలేరని. అలా కనీసం 15 శాతం జనాభా కోటీశ్వరులు అయినారని వాదన కొరకు అనుకున్నా, పాలకవర్గాల ఆస్తుల విలువ పడిపోయినట్టే. ఎలా అంటే, ఎంత ఎక్కువ శాతం జనాల దగ్గర డబ్బు లక్షలు, కోట్లలో ఉంటుందో, పాలకవర్గాల దగ్గరున్న ఆస్తుల విలువ అంతగా తగ్గిపోతుంది. ప్రజల శ్రమను, వారి కష్టార్జితాన్ని దోచుకోకుండా పాలకవర్గాల ఆస్తులు పెరుగవు. అయితే, ఆ ఆస్తులు గాలి నుండి రావు. ప్రజల శ్రమను, కష్టార్జితాన్ని ఏదో రకంగా దోచుకుంటేనే వారి ఆస్తులు పెరుగుతాయి. ప్రజలందరికి చెందాల్సిన వనరులను అక్రమంగా తమ పరం చేసుకోవడం; ట్యాక్సులు కట్టనవసరం లేకుండా చట్టాలు చేయించుకోవడం; ప్రజలు డైరెక్ట్, ఇన్‌డైరెక్ట్ ట్యాక్సుల ద్వారా ప్రభుత్వానికి కట్టిన సొమ్మును పారిశ్రామికాభివృద్ధి, ఉద్యోగాల కల్పన పేరు మీద కాజేయడం లాంటి అక్రమ చర్యల ద్వారానే వారి ఆస్తులు పెరుగుతాయి. దేశ జనాభాలోని మెజారిటీ ప్రజలను అత్యంత పేదరికంలోకి, అప్పుల్లోకి నెట్టివేయకుండా, దేశంలోని అతి కొద్దిమంది చేతుల్లో అపార ఆస్తులు కేంద్రీకృతం కావు. శ్రమ తప్ప ఆస్తులు లేని మెజారిటీ ప్రజలకు పేదరికం, అప్పులు ఎందుకుంటాయంటే శ్రమ దోపిడీనే నమ్ముకొని దోపిడీ పాలన సాగిస్తూ ఉన్న సామ్రాజ్యవాదులు, వారి దళారీలైన అతికొద్ది మంది చేతిలోనే దేశ సంపద కేంద్రీకృతం కావడం వలన.

ప్రజలను శ్రమదోపిడీ చేసి అపారమైన ఆస్తులు సంపాదించడమే కాకుండా, ప్రజలు వేతనం ద్వారా సంపాదించిన డబ్బును కూడా కాజేయడానికి సామ్రాజ్యవాదులు, వారి దళారీల కార్పొరేట్ కంపెనీలు ద్రవ్య పెట్టుబడిలో భాగమైన షేర్ మార్కెట్, మ్యూచువల్ ఫండ్స్, కమాడిటీస్ ట్రేడింగ్, ఫ్యూచర్స్ ట్రేడింగ్, ఇన్స్యూరెన్స్ లాంటి పథకాలు ముందుకు తెచ్చారు. ఇన్స్యూరెన్స్‌తో సహా ప్రైవాటిలో దేంట్లో పెట్టుబడులు పెట్టినా లాభాలు కాదు అసలుకు కూడా గ్యారంటీ లేదు. ఈ విషయం చిన్న చిన్న అక్షరాలతో కూడిన ఐదు, ఆరు పేజీల మధ్యలో ఎక్కడో రాసి ఉంటుంది. ఈ విషయం మనకు చెప్పకుండానే ఆ రిస్క్‌కు ఒప్పుకుంటున్నట్టు సంతకం కూడా తీసుకుంటారు. పైన ఉదహరించిన పథకాలలో పెట్టుబడులు పెట్టినవారు లక్షాధికారులు అయినట్టు అబద్ధపు ప్రచారం చేయిస్తూ, ప్రజలు తమ కష్టార్జితాన్ని ఈ జూద వ్యాపారంలో పెట్టుబడులు పెట్టేట్టు చేస్తూ, అలా కోట్లాది మంది ప్రజలు పెట్టుబడులు పెట్టగా, జమయిన లక్షల కోట్ల రూపాయలను రకరకాల స్కీముల పేరుతో తమ ఆస్తులు పెంచుకోవడానికి వాడుకొని, నాలుగు రాళ్లు సంపాదించుకోవచ్చని భ్రమపడి పెట్టుబడి పెట్టిన ప్రజలను నట్టేట ముంచుతున్నారు.

దాంట్లో భాగంగానే ఇప్పుడు భారత ప్రజలు తమ రిటైర్మెంట్ వయసులో నెలవారీ ఆదాయం కొరకు దాచుకున్న పెన్షన్ డబ్బులను కూడా దోచుకోవడానికి తమ తొత్తు ప్రభుత్వం ద్వారా పెన్షన్, బ్యాంకింగ్ రంగంలో సంస్కరణలు తెప్పిస్తున్నారు. పాశ్చాత్య దేశాల్లోని ఆ దేశ ప్రజల పెన్షన్ డబ్బులతో జూదం ఆడి, వారి పెన్షన్ డబ్బులను కాజేసి, వారి భవిష్యత్తును అంధకారంలోకి నెట్టిన సామ్రాజ్యవాదుల ద్రవ్య

పెట్టుబడి కార్పొరేట్ కంపెనీలే భారతదేశానికి వచ్చి టాటా, బిర్లా, అంబానీల లాంటి భారత దళారీ పెట్టుబడిదారుల కార్పొరేట్ కంపెనీలతో మిలాఖత్ అయి, 12 లక్షల కోట్ల రూపాయల భారత ప్రజల సేవింగ్స్‌పై కన్ను వేసాయి.

ఇకపోతే ఫిక్స్‌డ్ డిపాజిట్‌లు. మీరు ఎన్ని లక్షలైనా ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయండి. కానీ, చట్టప్రకారం ఒక లక్షకు మాత్రమే గ్యారంటీ ఉంది. ఆర్థిక సంక్షోభం వచ్చినప్పుడు, లేదా బ్యాంకు దివాళా తీసినప్పుడు ఒక లక్ష తప్పించి మిగతా అంతా మీరు వదులుకోక తప్పదు. ఆ లక్ష కూడా అందరు ఒకేసారి అడిగితే బ్యాంకులు చట్ట ప్రకారమే నిరాకరించవచ్చు. ఇలాంటి తమకనుకూలమైన వేల కొద్ది చట్టాలను తయారు చేయించుకొని, ప్రజలను నిట్టనిలువునా ముంచినా తాము చట్టప్రకారం దొరలుగానే వెలుగుతున్నారు.

## సామ్రాజ్యవాదుల ప్యాకేజ్ డీల్

సామ్రాజ్యవాదులు గత మూడు వందల సంవత్సరాలకు పైగా ప్రపంచ దేశాలన్నింటినీ దోచుకోవడం వలన వచ్చిన అపారమైన ఆస్తులే కాదు, అనుభవం కూడా వారికి చాలా విలువైనది. 1991లో భారతదేశంను హోల్‌సేల్‌గా సామ్రాజ్యవాదులకు సమర్పించింది భారత దళారీ పాలకవర్గం. సామ్రాజ్యవాదం కేవలం ద్రవ్య పెట్టుబడితో మాత్రమే రాలేదు. వారు ఒక 'ప్యాకేజ్ డీల్'తో దిగారు. ఆ ప్యాకేజ్‌లో మా దేశానికి అవసరమైనవే తీసుకుంటాం అంటే కుదరదు. ప్రపంచాన్ని మూడు వందల సంవత్సరాలుగా దోచుకున్న అనుభవంతో అభివృద్ధి చేసిన ప్యాకేజ్ అది. దాంట్లో, ఆహారం, వ్యవసాయం, సంస్కృతి, విద్యకు సంబంధించిన సామ్రాజ్యవాదుల మోనోకల్చర్ విధానం ఉంటుంది. ప్రజలను మత్తులో ఉంచి, నిజాలు గ్రహించకుండా చేసే వివిధ రకాల ఎత్తుగడలు, మత్తులు ఉంటాయి. ప్రజలు ఒకరినొకరు చంపుకునే హింసాత్మక సంస్కృతి ఉంటుంది. సామ్రాజ్యవాదుల, వారి దళారీల దోపిడీని ప్రశ్నించే వారిని నిర్బంధించే, ఊచకోత కోసే ఫాసిజం ఉంటుంది. ప్రజలు ఏకం కాకుండా, ఎన్నెన్నో రకాలుగా విడగొట్టే ఎత్తుగడలు ఉంటాయి. ప్రజల నుండే కొందరిని లోబరుచుకొని ఈ దోపిడీ వ్యవస్థపట్ల వారి చేత ప్రజల్లో సమ్మతిని కలిగించే ఎత్తుగడ లుంటాయి. అశేష ప్రజానీకానికి శత్రువు ఎవరు అని అర్థం కాకుండా చేసే ఎత్తుగడలుంటాయి. తమ నిధుల ద్వారా నడిచే సంస్థలతో టెర్రరిస్ట్ చర్యలు చేపించి, వాటిని సాకుగా చూపి అత్యంత క్రూరమైన చట్టాలను తెచ్చి, తమ దోపిడీకి అడ్డు వచ్చే వారిని టెర్రరిస్టుల పేరు మీద అణచివేసే కుట్రలుంటాయి. సామ్రాజ్యవాదుల, వారి దళారీల ప్యాకేజ్డ్ డీల్ దుష్పరిణామాలే అన్ని రంగాల్లో మనమిప్పుడు చూస్తున్నాం. ఇది కేవలం ఆరంభం మాత్రమే. అసలు వినాశనం భవిష్యత్‌లో చూడబోతున్నాం.

## ఆహారం – సామ్రాజ్యవాదం

స్థానిక ఆహార వైవిధ్యాన్ని నాశనం చేసి తమ పాశ్చాత్య ఆహార మోనోకల్చర్‌ను అలవాటు చేయడం. ఫాస్ట్‌ఫుడ్, బేకరీ ఫుడ్, సూపర్ మార్కెట్‌లలో అమ్మే తినడానికి సిద్ధంగా ఉన్న ప్యాకేజ్డ్ ఫుడ్ ఈ కుట్రలో భాగంగానే 1991 నుండి దింపారు. ఆహారంలో మోనోకల్చర్ దింపాలంటే, వ్యవసాయంలో కూడా వైవిధ్య పంటలు లేకుండా చేయాలి. గ్లోబలైజేషన్ మొదలై కేవలం ఇరవై రెండు సంవత్సరాలలోనే ఎన్నో వైవిధ్యమైన పంటలను నాశనం చేసి పాశ్చాత్య ఆహార అలవాట్లను కోట్లాది ప్రజలకు అలవాటు చేసారు. ఈ లెక్కన రానున్న యాభై సంవత్సరాలలో ఏమి జరుగబోతుందో ఊహించుకోండి. మన సాంప్రదాయక ఆహార వైవిధ్యాన్ని నాశనం చేయడం వలన వారికి ఏమి లాభం? కొన్ని వేల సంవత్సరాల నాగరికతలో భాగంగా ఒక ప్రాంతంలో ఉండే ప్రజలు (అంటే ఎడారి ప్రాంతం, సముద్ర ప్రాంతం, చలి ప్రాంతం, అటవీ ప్రాంతం, మైదాన ప్రాంతం తదితరాలు) అక్కడ ఉన్న వాతావరణం రుతుక్రమాల కనుగుణంగా, ఆరోగ్యంగా ఉండాలంటే ఫలానా ఆహార ధాన్యాలను, జంతు మాంసాన్ని, కూరగాయలను, పళ్లను తినాలని, వాటిలో పచ్చిగా తినాల్సినవి ఏవి, వండుకొని తినాల్సిన వాటిని ఏ రకంగా, ఏం కలిపి వండాలి, వాటిని ఏ సమయంలో తినాలి, ఏ సమయంలో తినకూడదు, ఇలాంటి ఎన్నెన్నో సూక్ష్మ విషయాలను వేల సంవత్సరాల 'ట్రయల్ అండ్ ఎర్రర్' అనుభవంతో అభివృద్ధి చేసిన ఒక అద్భుతమైన శాస్త్రమే సాంప్రదాయక ఆహార వైవిధ్యం. అలా తిన్నందుకే కొన్ని వేల సంవత్సరాల నుండి మన పూర్వీకులు ఆరోగ్యంగా 'జీవన విధాన రోగాలు' లేకుండా కార్పొరేట్ హాస్పిటల్స్ అవసరం లేకుండా బతికారు.

కొన్ని వేల సంవత్సరాల క్రితమే 'ఫుడ్ ఈజ్ మెడిసిన్' (ఆహారమే ఔషధం) అని చెప్పారు. మూడు వందల సంవత్సరాల అపార అనుభవం ద్వారా 'సాంప్రదాయక ఆహార వైవిధ్యమే ఔషధం' అని అర్థం చేసుకున్న సామ్రాజ్యవాదులు, సాంప్రదాయక ఆహార వైవిధ్యాన్ని నాశనం చేస్తేనే తమ 'ట్యాబ్లెట్ ఈజ్ మెడిసిన్' (అల్లోపతి గోళీనే ఔషధం) అనే సిస్టంలోకి రారని గ్రహించారు. ఆహార వైవిధ్యానికి గుండెకాయ అయిన పంటల వైవిధ్యాన్ని అంటే సాంప్రదాయక వ్యవసాయాన్ని ఎన్ని రకాలుగా వీలయితే అన్ని రకాలుగా నాశనం చేస్తూ ఇప్పటికే చాలా విజయం సాధించారు. ఒకవైపు, సాంప్రదాయక ఆహారం కనుమరుగు అవుతూ ఉండడం వలన రోగాలు పెరిగాయి. ఇంకోవైపు సామ్రాజ్యవాదులు దింపిన ప్యాకేజ్డ్ ఫుడ్, బేకరీ, ఫాస్ట్‌ఫుడ్ (వీటిలో ఏ పదార్థం తీసుకున్నా ఎన్నెన్నో ప్రమాదకర రసాయనాలు కలుపుతారు)లను తినడం వలన చిన్న పిల్లల వయసు నుండే రోగాలు పెరిగాయి. అంటే, వ్యవసాయం నాశనం చేయడం వలన తమ కార్పొరేట్ కంపెనీలకే లాభం. ఆహార వైవిధ్యాన్ని నాశనం చేయడం వలన తమ కార్పొరేట్ కంపెనీలకే లాభం. రోగాలు రావడం వలన కూడా తమ హాస్పిటల్స్ – డయాగ్నస్టిక్స్ – ఫార్మా కార్పొరేట్ కంపెనీలకే లాభం. ఈ విధంగా ట్రిలియన్ల కొద్ది డాలర్లు అక్రమంగా, అనైతికంగా, అమానవీయంగా సంపాదిస్తున్నాయి సామ్రాజ్యవాదుల, వారి దళారీల కార్పొరేట్ కంపెనీలు.

## ఆధ్యాత్మిక, మత సంస్థలు

ఈరోజు ప్రపంచంలోని అన్ని మతాలకు పెద్ద ఎత్తున నిధులను ఇస్తున్నది సామ్రాజ్యవాదులు, దళారీ పెట్టుబడిదారులే. ప్రపంచ వ్యాప్తంగా మత ఘర్షణలు, మారణకాండలకు కూడా వీరే నిధులు ఇస్తున్నారు. నిజానికి, ఆర్ఎస్ఎస్, భజరంగ్ దళ్ లాంటి హిందూ మతోన్మాద

సంస్థలను స్థాపించి వాటిని ప్రోత్సహించిందే సామ్రాజ్యవాద, భారత దళారీ పెట్టుబడిదారులు. ప్రపంచ వ్యాప్తంగా ఇస్లామిక్ మతోన్మాదులను ప్రోత్సహిస్తున్నది సామ్రాజ్యవాద దేశాలు, వారి దళారీలైన సౌదీ పాలక వర్గాలు. ఇంకోవైపు క్రిస్టియన్ మతోన్మాదాన్ని ప్రపంచ వ్యాప్తంగా ప్రోత్సహిస్తున్నది కూడా క్రిస్టియన్ మత దేశాలైన సామ్రాజ్యవాద దేశాలు. ఇలా అన్ని రకాల మతాలలో మతోన్మాద సంస్థలను స్థాపించి, ప్రోత్సహించి, ప్రజలు ఒకరిని ఒకరు అసహ్యించుకునేట్టు, చంపుకునేట్టు చేస్తూ, ప్రజలు సామ్రాజ్యవాదుల, వారి దళారీల దోపిడీని అర్థం చేసుకోకుండా చేస్తున్నారు. ఇవే కాకుండా, ఈ మధ్య పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న ఆధ్యాత్మిక సంస్థల వెనుక వీరి ప్రోత్సాహమే ఉన్నది. సామ్రాజ్యవాదులు, వారి దళారీల దోపిడీనే ఈ వ్యవస్థలోని సకల సమస్యలకు, ప్రజల దుస్థితికి కారణమని, సమ సమాజాన్ని నిర్మించు కోవడం ద్వారానే ఈ సమస్యల నుండి ప్రజలు విముక్తి అవుతారనే వాస్తవం ప్రజలు తెలుసుకోకుండా 'నీ సమస్యలకు నీవే కారణం, నిన్ను నువ్వు ఉద్ధరించుకో' అనే అశాస్త్రీయ భావజాలాలను ప్రచారం చేసే ఆధ్యాత్మిక సంస్థలను సామ్రాజ్యవాదులు, వారి దళారీలు ప్రోత్సహిస్తున్నారు.

ధ్యానం, యోగాలు ఆరోగ్య పరిరక్షణలో ఒక పరిమిత స్థాయి వరకు ఉపయోగ పడ్తాయనేది వాస్తవం. కాని వీటికి మత సంబంధ, ఇతర మూఢ నమ్మకాలను జోడించి కేవలం ధ్యానం లేదా యోగా ద్వారానే సకల రోగాలు నయం అవుతాయని అశాస్త్రీయ ప్రచారం చేస్తున్నారు. సువార్త, స్వస్థత సభల్లో పాల్గొంటే అన్ని రకాల రోగాలు పోతాయనే క్రిస్టియన్ మత సంస్థల ప్రచారం ఎంత బూటకమో, కేవలం ధ్యానం, యోగాల ద్వారా అన్ని రకాల రోగాలు పోతాయనే హిందూ మత సంస్థల ప్రచారం కూడా అంత బూటకం. అన్ని మతాలకు చెందిన సామ్రాజ్య వాదులు, వారి దళారీలు ఈ బూటకపు ప్రచారాలను ప్రోత్సహిస్తూ, ప్రజలకు అర్థం కాకుండా చేయజూస్తున్న శాస్త్రీయ వాస్తవం ఏంటంటే, మనిషి ఏ పెద్ద రోగాలు రాకుండా, ఆరోగ్యంగా వంద సంవత్సరాలు బతకాలంటే మూడు పూటలా విటమిన్స్, మినరల్స్, ప్రోటీన్స్, మంచి ఫ్యాట్స్ తదితరాలు వచ్చే పౌష్టికాహారాన్ని తినాలి. మానసిక సమస్యలు లేని వ్యవస్థలో జీవించాలి. సరిగ్గా ఈ రెండు కూడా సామ్రాజ్యవాదుల, వారి దళారీల వ్యవస్థలో అసంభవం. ఇది కేవలం సమ సమాజంలోనే సాధ్యమవు తుంది. ఈ వాస్తవాన్ని కప్పి పెట్టడానికే మత, ఆధ్యాత్మిక సంస్థలను వాడుకొంటున్నారు. ప్రజలకు జరుగుతున్న వాస్తవాలు అర్థం కాకుండా, సంపూర్ణ, శాశ్వత పరిష్కారాల వైపు ఆలోచన చేయకుండా, ప్రజలు దోపిడీ వ్యవస్థను ఎదిరించకుండా చేయడంలో ఆధ్యాత్మిక, ధ్యాన సంస్థల పాత్ర చాలా ప్రముఖంగా ఉంది. వ్యవస్థ మారడం ద్వారానే పరిష్కారమయ్యే ఎన్నెన్నో వ్యక్తిగత సమస్యలకు కూడా 'నీ సమస్యలకు నీవే కారణం' అనే తనను తాను నిందించుకునే భావజాలాన్ని ప్రచారం చేయడం ద్వారా ఆధ్యాత్మిక సంస్థలు (అవి మాట వరుసకు పాశ్చాత్య సంస్కృతిని విమర్శించినా) సామ్రాజ్యవాదుల, వారి దళారీల ప్రయోజనాల పరిరక్షణకే పని చేస్తున్నాయి. పైగా ఈ దోపిడీదారుల కార్పొరేట్ కంపెనీలకు వెళ్లి ఒత్తిడిని తట్టుకోవడానికి వారికి యోగా, ధ్యానంలు నేర్పిస్తూ, ఈ దేశాన్ని దోచుకునే క్రమంలో వారికి మానసికి ఒత్తిడి కూడా రాకుండా చూసే బాధ్యతలను ధ్యాన, యోగ ఆధ్యాత్మిక సంస్థలు తీసుకొని తమకు నిధులు, మీడియా ప్రచారం సమకూరుస్తున్న సామ్రాజ్యవాదుల, దళారీ పెట్టుబడిదారుల పట్ల ఎనలేని భక్తి భావాన్ని ప్రదర్శిస్తున్నాయి.

## సంస్కృతి - సామ్రాజ్యవాదం

సామ్రాజ్యవాదుల ప్యాకేజ్ డీల్‌లోని మోనోకల్చర్‌లో రెండవ అంశం. ఆ దేశ, ప్రాంత సంస్కృతిలోని మంచి అంశాలను నాశనం చేసి చెడు అంశాలను ప్రోత్సహించడం. సామ్రాజ్యవాదుల జుగుప్సాకర సంస్కృతి దింపడం. ఏమి ఆశించకుండా ఇచ్చిపుచ్చుకోవడం, ప్రేమ, ఆప్యాయత, అడగక ముందే సహాయం చేయడం ఇలాంటి మంచి అంశాలను నాశనం చేయకుండా, డబ్బు ఇరుసుగా మానవ సంబంధాలు తిరిగేట్టు చేయకుండా, పెట్టుబడిదారుల ఆస్తులు పెరగవు. పాశ్చాత్య దేశాల్లో విజయవంతంగా అమలు చేసిన ఈ విధానమే 1991 నుండి భారతదేశంలో అమలు చేస్తున్నారు. ప్రతి దేశంలో కొన్ని చెడు అంశాలు ఉంటాయి. అభ్యుదయ సోషలిస్ట్ వ్యవస్థలో వీటిని నిర్మూలిస్తారు. కాని అభివృద్ధి వ్యతిరేక, అమానవీయ పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజలను విడదీసి దోచుకోవడానికి ఈ చెడు అంశాలను పెంచి పోషిస్తారు. అవే కుల, మత, భాషా, ప్రాంత వివక్షలు. అలాగే మూఢ నమ్మకాలను, వరకట్నం లాంటి దురాచారాలను సామ్రాజ్యవాదులు పెంచి పోషిస్తున్నారు.

ఇక మోనోకల్చర్‌లో భాగంగా ప్రపంచ వ్యాప్తంగా ఒకే రకమైన వేషధారణ (తద్వారా వారి చెప్పుల, బట్టల కంపెనీలకు లాభం), ఒకే రకమైన కాస్మోటిక్స్ (తద్వారా సాంప్రదాయక సహజ సౌందర్య పద్ధతులు నశించిపోయి వీరి కంపెనీలకు లాభం, అలాగే కాస్మోటిక్స్ వాడిన వారికి ఎలాగూ రకరకాల రోగాలు వస్తాయి కాబట్టి మళ్లీ వారి ఆరోగ్య రంగ కంపెనీలకే లాభాలు) తదితరాలతో ప్రపంచంలో ఉన్న లక్షలాది రకాల సాంప్రదాయక, సహజ జీవన విధానంలో ఉన్న వైవిధ్యాలను నాశనం చేస్తూ తమ కార్పొరేట్ కంపెనీలకు ట్రిలియన్ల కొద్ది లాభాలు చేసుకుంటున్నారు.

సామ్రాజ్యవాదుల ప్యాకేజ్‌డీల్‌లో భాగంగా డ్రగ్స్ (మాదక ద్రవ్యాలు) కూడా దింపుతున్నారు. 1960 దశకంలో సామ్రాజ్యవాదం, వారి యుద్ధాలకు వ్యతిరేకంగా అమెరికా, యూరప్ దేశాల ప్రజలు సంవత్సరాల తరబడి చేసిన ఉద్యమాలను నీరు గార్చడానికి ఆ దేశ ప్రభుత్వాలే తమ పోలీసు, మిలిటరీ వాహనాలలో మాదక ద్రవ్యాలను రవాణా చేసి, యువతకు అలవాటు చేసారు. అప్పటి నుండి యువతను బలహీనం చేయడానికి సామ్రాజ్యవాదులు డ్రగ్స్‌ను అమ్ముతున్నారు. అందుకే, ఇప్పుడు భారతదేశంలో నగరాలు, పట్టణాలలో యువతను టార్గెట్ చేసుకొని డ్రగ్స్‌ను అలవాటు చేయిస్తున్నారు. పంజాబ్‌లో కనీసంగా 70 శాతం యువత డ్రగ్స్‌కు బానిసలయ్యారని కొన్ని సంస్థలు జరిపిన సర్వేలో తేలింది. ఇప్పటికే యువతలో సిగరెట్లు, అల్కహాల్ తాగడం చాలా సర్వసాధారణం అయిపోయింది. డ్రగ్స్, సిగరెట్లు, అల్కహాల్ వ్యాపారం ఏటా భారతదేశం లో కనీసంగా లక్షన్నర కోట్లకు పైగా ఉంది. అంటే సామ్రాజ్యవాదులకు, భారత దళారీ పాలకులకు

ఎంత లాభమో ఊహించుకోవచ్చు. అలాగే, మాల్స్, మల్టీప్లెక్స్‌లు, పబ్బులు, రిసార్ట్‌లు, క్లబ్బులు తదితరాలు కూడా మోనోకల్చర్‌లో భాగమే. ప్రపంచ వ్యాప్తంగా ఎక్కడికి వెళ్లినా ఇవి సైజ్‌లో, నాణ్యతలో తేడా మినహాయిస్తే ఒకే తీరుగా ఉంటాయి. భారతదేశంలోని కొన్ని మాల్స్‌లో అదనంగా గుళ్లు కూడా కడుతున్నారు. అంతే తేడా.

ప్రజల జీవితాల్లో మానవ సంబంధాలు, ప్రకృతితో బంధాలు దెబ్బతీసి, అన్ని దిక్కుల నుండి మోనోకల్చర్ దింపి, తద్వారా వారికి జీవితంలో ఎప్పుడూ ఏదో వెలితిగా, బోర్‌గా, అసంతృప్తిగా ఉండేట్టు చేసి, ఆ బోర్‌డమ్ నుండి బయటపడడానికి మోనోకల్చర్‌లో భాగంగా తాము దింపిన సూపర్ మార్కెట్స్, మాల్స్, మల్టీప్లెక్స్‌లు, బేకరీలు, పబ్బులు, రిసార్ట్‌లు, అమ్యూజ్‌మెంట్ పార్క్‌లు, రెస్టారెంట్‌లు తిరిగేట్టు చేయడం; టివిలు, సెల్‌ఫోన్, ఇంటర్నెట్ చూస్తూ లేదా వీడియో గేమ్స్ ఆడుతూ ఉండేట్టు చేయడం; ఈ రకంగా మోనోకల్చర్ తెచ్చిన వెలితిని తీర్చుకోవడానికి మళ్లీ మోనోకల్చర్ చట్రంనే ఆశ్రయించేట్టు చేయడం ద్వారా, ఎటు వెళ్లి ఏది చేసినా డబ్బులు ఖర్చు చేయక తప్పదు కాబట్టి అంతిమంగా కార్పొరేట్ కంపెనీలకే లాభం. వారి కుట్ర వెనుక ఉద్దేశం అదే. దేశంలో ఖర్చు చేయబడే ప్రతి రూపాయి అంతిమంగా వారి జేబుల్లోకే రావాలి. ఇది చేయాలంటే, గ్రామాలను, వ్యవసాయాన్ని దెబ్బకొట్టి పట్టణాలకు వలసలు పోయేట్టు చేయాలి. మానవ సంబంధాలను, ప్రకృతిని, పర్యావరణాన్ని, సాంస్కృతిక, జీవ వైవిధ్యాన్ని నాశనం చేయాలి. ఇదంతా సామ్రాజ్యవాదులు గ్లోబలైజేషన్ పేరు మీద తెచ్చిన ప్యాకేజ్ డీల్.

సామ్రాజ్యవాదులు అమలు పరుస్తున్న ప్యాకేజ్ డీల్ ప్రజలపై అది చూపుతున్న ప్రభావాన్ని సూక్ష్మస్థాయిలో పరిశోధిస్తేనే అశేష భారత ప్రజానీకంపై జరుగుతున్న ఆర్థిక, సాంస్కృతిక, మానసిక దోపిడీ, దాడి అర్థమవుతుంది.

ఎవరి చరిత్ర వారికే తెలువకుండా చేసి, ఎవరైనా వాస్తవాన్ని చెప్పినా నమ్మకుండా చేసి, వీలైనంత వరకు ఆలోచనా జ్ఞానం లేకుండా చేసి మరయంత్రాలుగా చేస్తున్నారు. ఇప్పటికే, భారతదేశంలో చదువులంటే కేవలం ఉద్యోగాలు దొరకడానికి కావలసిన సర్టిఫికేట్‌గా పరిగణిస్తున్న సంస్కృతి ఉంది. మీరు ఎన్ని అబద్ధాలైనా నేర్పండి, సామ్రాజ్యవాదుల పాఠ్యాంశాలైనా చెప్పండి, మా పిల్లలకు ఉద్యోగాలు వస్తే చాలన్నట్టు తల్లిదండ్రుల ఆలోచన ఉంది కాబట్టి భారత యువత ఆలోచనా జ్ఞానం పని చేయకుండా అయిపోయే ప్రమాదం ఉంది. ఇప్పటికే ప్రైవేట్ కాలేజీలలో, ప్రైవేట్ యూనివర్సిటీలలో సామ్రాజ్యవాద సంస్కృతినే డైరెక్ట్‌గా నేర్పిస్తున్నారు. గ్లోబలైజేషన్ మంచిదని బ్రెయిన్ వాష్ జరిగిన వారికి, అది మనకు నష్టదాయకం అని చెప్తే ఎలా నమ్ముతారు.

ఎన్ని కుట్రలు పన్నినా, ఎంత క్రూర పరిపాలన చేసినా, ఎంత బలవంతులుగా కనిపించినా, ఏ అన్యాయ సామ్రాజ్యం మానవ చరిత్రలో శాశ్వతంగా మిగిలిపోలేదు. అలనాటి గ్రీక్, రోమన్ సామ్రాజ్యాల నుండి నిన్నటి బ్రిటిష్ దొంగల సామ్రాజ్యం వరకు కూడా మట్టికరిచారు. తాజాగా అమెరికా దోపిడీదారులను అతి చిన్న దేశమైన వియత్నాం ప్రజలు గెరిల్లా యుద్ధం ద్వారా రోజుకొక విమానం అమెరికా సైనికుల శవాలను తీసుకుపోయే స్థాయిలో చంపితే, దాదాపు ఇరవై లక్షల వియత్నామీయులను చంపి, ఓడిపోయి పారిపోయారు అమెరికా సామ్రాజ్యవాద కిరాతకులు. ఇప్పుడు అఫ్ఘనిస్తాన్‌లో కూడా తాలిబన్‌ల చేతిలో వేల మంది అమెరికా కిరాతకులు చచ్చిన తరువాత, దాదాపు ఐదు లక్షల అఫ్ఘనీయులను చంపిన అమెరికా, వీరితో గెలువలేమని అర్థమై ప్రపంచ ప్రజల ముందు పరువు పోకూడదని, 2014లో అఫ్ఘనిస్తాన్ సెక్యూరిటీ ఆ దేశ సైన్యానికి (అంటే తమ తొత్తులకు) వదిలి తాము వెళ్లిపోతామని చెప్పింది. పది సంవత్సరాల దురాక్రమణ తరువాత కూడా దేశ రాజధాని కాబూల్‌కు కేవలం నలభై కిలోమీటర్‌ల దూరంలో ఉన్న తాలిబన్‌ల స్థావరాన్ని మాత్రం ఏమీ చేయలేకపోయింది. వేల కొద్ది మానవరహిత విమానాలతో జనాలను చంపారు కాని తాలిబన్‌లను ఏమీ చేయలేకపోయారు.

### కాగితపు పులులు

సామ్రాజ్యవాదులు, వారి దళారీలు బలవంతులు కాదు. మావో వీరిని సరిగ్గా పరిశోధించి 'సామ్రాజ్యవాదులు కాగితపు పులులు' అన్నాడు. వీరి వికృత నిజస్వరూపాన్ని అన్ని కోణాలలో ప్రజలు అర్థం చేసుకోకపోవడం వారి బలం. ప్రజలు ఐకమత్యంగా లేకపోవడం వారి బలం. ప్రజలకు వీరి నిజస్వరూపం తెలిసిన మరుక్షణమే వారి అంతం కేవలం వేళ్ల మీద లెక్కపెట్టగలిగేన్ని రోజుల్లో జరిగిపోతుంది. 18 నుండి 40 ఏళ్ల యువకులలో కేవలం 25 శాతానికి సామ్రాజ్యవాదులు, వారి దళారీల వికృత నిజస్వరూపం తెలిసిపోయినా, వారి వ్యవస్థ పేకమేడలా కూలిపోవడం కచ్చితం. అందుకే వారి టార్గెట్ పిల్లలు, టీనేజర్లు, యువకులు. వీరిని శారీరక, మానసిక, ఆరోగ్య పరంగా, అలాగే, ఆలోచనా శక్తి పరంగా ఎంత నాశనం చేస్తే, సామ్రాజ్యవాదుల దోపిడీ రాజ్యం అంత ఎక్కువ కాలం మనగలుగుతుంది. అందుకే, టీనేజర్లను, యువకులనే టార్గెట్ చేసి వారిని ఎన్ని రకాలుగా వీలయితే అన్ని రకాలుగా బలహీనం చేస్తున్నారు. వారికి వాస్తవాలు తెలువకుండా చేస్తున్నారు. తెలుసుకోవడానికి వీలు లేకుండా అత్యంత పనికిరాని విషయాలను (సెల్‌ఫోన్‌లు, టీవీలు, విడియో గేమ్స్, ఫేస్‌బుక్‌లు, చాటింగ్‌లు, డేటింగ్‌లు, డ్రగ్స్, ఫ్యాషన్, కాస్మోటిక్స్, అల్కహాల్, రేసింగ్‌లు, పబ్బులు, మాల్స్ ఇంకా ఎన్నెన్నో) వారికి జీవితంలో అత్యంత ముఖ్యమైనవి అన్నట్టుగా వారి బ్రెయిన్ వాష్ చేసి యువత తమ చరిత్ర, జరుగుతున్న వాస్తవాలు తెలుసుకోకుండా చేస్తున్నారు.

### సామాజిక సేవ - సామ్రాజ్యవాదం

ఒకవైపు తమ అక్రమ సంపాదన కొరకు లక్షలాది మందిని ఊచకోత కోస్తూ, జైళ్లపాలు చేస్తూ, ఇంకొక వైపు తమ అక్రమ సంపాదనలో ఒక శాతం సేవా కార్యక్రమాల పేరు మీద పెడుతున్నారు. బిల్‌గేట్స్ వంటి సామ్రాజ్యవాది నుండి మొదలుకొని టాటా, బిర్లాల లాంటి సామ్రాజ్యవాదుల దళారీల వరకు పాలకవర్గాలు, పేదరిక నిర్మూలన, విద్య, ఆరోగ్య రంగాల్లో తాము వేల కోట్లు ఖర్చు చేస్తున్నట్టు ప్రచారం చేసుకుంటూ తమ అక్రమ సంపాదన ప్రజలకు అర్థం కాకుండా చేస్తున్నారు. ఒకవైపు లక్షలాది మందిని ఊచకోతల్లో చంపేస్తూ, ఇంకోవైపు పేదల బస్తీలలోకి వెళ్లి వారి పిల్లలను ముద్దాడుతూ, తమకు ఎంతో మానవతా హృదయం ఉన్నట్టుగా ప్రచారం చేసుకుంటున్నారు. ఈ బూటకపు ప్రచారం ప్రజలు నమ్మినంత వరకు మనకు

సామ్రాజ్యవాదుల దోపిడీ, వారి అత్యంత క్రూర నిజ స్వరూపం, విశ్వరూపం అర్థం కాదు. ధార్మిక కార్యక్రమాలు, కార్పొరేట్ సామాజిక బాధ్యతల పేరు మీద వీరు చేస్తున్న నాటకం వెనుక వారి అత్యంత క్రూర నిజస్వరూపం ఉంది. ఇంకొక వైపు, తమ మీడియా ద్వారా కొందరి వ్యక్తులను గొప్ప నిజాయితీ పరులుగా, పేద, మధ్యతరగతి వారిని ప్రేమించే వారిగా ప్రచారం చేసి, వారి పట్ల పేద, మధ్యతరగతి ప్రజలల్లో నమ్మకం కలిపించి, వారి చేత తమ దోపిడీ వ్యవస్థ మీద ప్రజలకు నమ్మకం పోకుండా ఈ (దోపిడీ) వ్యవస్థే మంచిదని, కాకపోతే కొన్ని లోపాలు ఉన్నాయని, వాటిని కొన్ని చట్టాలు తెచ్చి సరిచేసుకోవచ్చని మభ్య పెడుతూ, తమ వ్యవస్థ కూలిపోకుండా వారిని వాడుకుంటున్నారు.

### 'ప్యాకేజ్ డీల్' అంతంలోనే ప్రజల భవిష్యత్తు

సామ్రాజ్యవాదులు, వారి దళారీలు ఎలాగైతే ప్రజల సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, ఆహార, ఆరోగ్యాలను నాశనం చేసి దోచుకునే 'ప్యాకేజ్ డీల్'ను అమలు పరుస్తున్నారో, అలాగే ప్రజలు కూడా తమ 'ప్యాకేజ్ డీల్'లో భాగంగా సామ్రాజ్యవాదాన్ని, దళారీ పెట్టుబడిదారుల, దళారీ భూస్వాముల వ్యవస్థ స్థానంలో ప్రజల నూతన ప్రజాస్వామిక వ్యవస్థను, సమ సమాజాన్ని స్థాపించుకుంటే తప్ప ఈ అత్యంత క్రూర, అమానవీయ వ్యవస్థ నుండి, దోపిడీ, పీడనల నుండి, పేదరికం, అప్పులు, అత్యాచారాలు, అవినీతి, బాధలు, కష్టాల నుండి భవిష్యత్తు తరాల బతుకులను అగమ్య గోచరంగా, అంధకారంలోకి నెట్టివేస్తున్న కార్పొరేట్ కంపెనీల పర్యావరణ, ప్రకృతి విధ్వంసం నుండి మనల్ని మనం రక్షించుకోలేం. వేర్లతో సహా మొత్తంగా కుళ్లికంపు కొడుతున్న ఈ చెట్టు స్థానంలో కొత్త చెట్టును నాటితేనే నిజమైన పరిష్కారం తప్ప ఆకులనో, కొమ్మలనో మార్చితే, దానిపై ఇంత సుగంధ ద్రవ్యం చల్లితే ప్రజల బతుకులు ఇంకా ఇంకా దుర్భరం అవడం మినహాయించి వేరే ఏ మంచి మార్పు జరగదు. మనం చూడాల్సింది నూతన ప్రజాస్వామిక వ్యవస్థ నిర్మాణం వైపు. ఆ వ్యవస్థ కొరకు పోరాడుతూ, జీవితంలో అన్నింటికన్నా విలువైన ప్రాణాల్ని తృణ ప్రాయంగా అర్పిస్తున్న ప్రజల వైపు చూడాలి. వారిని అత్యంతంగా ప్రేమించాలి. అసహ్యించుకోవాల్సిన శత్రువులను అత్యంతంగా అసహ్యించుకోకుండా, ప్రేమించాల్సిన మిత్రులను అత్యంతంగా ప్రేమించలేం. బేషరతుగా అసహ్యించుకోవాల్సిన వారిని అసహ్యించు కోవాలి. బేషరతుగా ప్రేమించాల్సిన వారిని ప్రేమించాలి.

అందుకే ప్రజల ముందున్న కర్తవ్యం, భ్రమలను, మత్తులను వదిలి వాస్తవాలు తెలుసుకోవాలి. ఈ సామ్రాజ్యవాదుల, భారత దళారీ పాలకుల దోపిడీ వ్యవస్థ ఎన్ని దిక్కుల నుండి మనల్ని ఎలా దోచుకుంటున్నది, భవిష్యత్‌ను ఇంకా ఇంకా అంధకారంలోకి ఎలా పంపుతున్నది అనే వాస్తవాలు తెలుసుకోవాలి. అజ్ఞానంతో ఉన్నంత వరకు బానిసల్లా బతకక తప్పదు. వాస్తవాలతో కూడిన జ్ఞానమే మనల్ని విముక్తి మార్గంలో నడిపిస్తుంది. అందుకే, వాస్తవాలు తెలుసుకోకుండా విముక్తి కాలేం. వాస్తవాలు తెలుసుకొని, వీలైనంత మందికి, వీలైన తీరులో చెప్పాలి. చైతన్యం తేవాలి. ఐకమత్యంగా లేనంత వరకు దోపిడీ వ్యవస్థకే లాభం. అందుకే, కుల, మతాల పేరు మీద మనల్ని ఇంకా ఇంకా చీల్చాలని చూస్తున్న సామ్రాజ్యవాదుల, వారి దళారీల కుట్రలను, వీరికి సహకరిస్తున్న ప్రజాద్రోహుల పన్నాగాలను వమ్ము చేస్తూ, ప్రజలే చరిత్ర నిర్మాతలు కానంత వరకు, కుల, మతాల వివక్షలు ఉంటాయని గ్రహించి, వారి కుట్రలకు బలికాకుండా, ఐక్యపోరాటం ద్వారా ప్రజల నూతన ప్రజాస్వామిక వ్యవస్థను ఏర్పరుచుకోవాలి. మనం బతకాల్సింది భూమి మీద తోటి ప్రజల మధ్య. డబ్బుల సంపాదనే పరమావధిగా బతకడం కాదు, ప్రకృతిని, పర్యావరణాన్ని, ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, ప్రేమ, పరస్పర సహకారంతో యుద్ధాలు, హత్యలు, మానభంగాలు, వ్యసనాలు, దొంగతనాలు, మోసాలు, పాలకవర్గాల కుట్రలు, అశాంతి, అవినీతి, వివక్షలు, అన్యాయాలు, పెత్తనాలు, రౌడీయిజం, మాఫియాలు, భయాలు, మాదక ద్రవ్యాలు, రోగాలు లేని ఒక అత్యంత మానవీయ సమాజంలో బతకాలి. అలా బతకాలంటే, వీటన్నింటికీ కారణమవుతున్న నేటి డబ్బు, ఆస్తి ఆధారిత దోపిడీ వ్యవస్థను కూకటివేళ్లతో పీకి నూతన ప్రజాస్వామ్య, సమ సమాజ వ్యవస్థను ఏర్పరచక తప్పదు. ప్రతి ఒక్కరూ దోపిడీదారులకు ఆస్తులు సంపాదించి పెట్టే యంత్రాలుగా కాకుండా, మానవీయ సమ సమాజ వ్యవస్థ నిర్మాతలు కావాలి.

**ఉపయోగపడిన గ్రంథాలు**


1) Understanding Power - Noam Chomsky
2) An Ordinary Person's Guide to Empire - Arundhati Roy
3) Globalisation - An Attack on India's Sovereignty - Arvind
4) Bad Pharma - Ben Goodacre
5) Essays by James Petras
6) Global Parasites - Win Pereira, Jeremy Seabrook
7) The Enemy - Felix Greene
8) The People's History of America - Howard Zinn
9) Churning The Earth - Aseem, Ashish
10) సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధానపు అత్యున్నత దశ – లెనిన్


*(రచయిత అనేక దేశాల్లో పని చేసిన సామాజిక కార్యకర్త)* వీ

# నేరాల కన్నతల్లి పార్లమెంటరీ వ్యవస్థ

***ప్రజా పాలనలో ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంగా పార్లమెంటరీ వ్యవస్థ ఎలా ఆవిర్భవించి, పాలకవర్గ నిరంకుశత్వంగా మారి ఇవాళ భారత సమాజంలోని అన్ని అరిష్టాలకూ మూలకారణం అవుతున్నదో వివరిస్తున్నారు ఎ. నర్సింహారెడ్డి***

మానవ సమాజం ఆవిర్భవించిన తొలినాళ్లలో మానవ జీవితావసరాల ఉత్పత్తి సమష్టిగానూ, పరస్పర సహకారంతోనూ జరిగింది. మొదట ప్రజలు సామూహికంగా తెగలుగానూ, గణాల్లోనూ జీవించేవారు. సమాజాభివృద్ధి క్రమంలో మనిషి ఒంటరిగా పని చేయగలిగేలా పనిముట్లను కనుగొన్న తర్వాతనే కుటుంబం ఏర్పడింది. కాలక్రమంలో, జీవించి ఉండడానికి అవసరమైన దానికంటే అదనంగా ఉత్పత్తి చేయగలిగే స్థాయికి మనిషి నైపుణ్యం, ఉపయోగించే పనిముట్లు అభివృద్ధి చెందిన తర్వాత శ్రమ విభజన జరిగింది. దానితో పాటు స్వంత ఆస్తి పుట్టింది. ఫలితంగా సమాజంలో వర్గాలు ఏర్పడ్డాయి. అంతిమంగా బౌద్ధిక, శారీరక శ్రమల మధ్య కూడ శ్రమ విభజన జరిగింది. గతంలో లాగానే ఉత్పత్తి సామాజిక ప్రక్రియగానే కొనసాగుతున్నా పంపిణీలో మాత్రం మార్పులు వచ్చాయి. ఉత్పత్తి సామాజికంగా జరుగుతుంటే వినియోగం వ్యక్తిగతంగా జరుగుతున్నది, అంటే, ఉత్పత్తి దారునికి ఉత్పత్తి ఫలం అందడంలేదు. శ్రమ దోపిడీ జరుగుతున్నది. ఈ దోపిడీ కొనసాగడానికి దోపిడీకి గురయ్యేవారిని అణచి ఉంచాలి. ఇటువంటి పరిస్థితుల్లో ఉత్పత్తి కొనసాగిస్తూ ఒకవర్గం మరో వర్గాన్ని దోపిడి చేయడానికి వీలుగా ఆవిర్భవించిందే 'రాజ్యం'.

రాజు దైవాంశ సంభూతుడని, రాజు దేవుని ప్రతినిధి అని, రాజును ధిక్కరించడం దేవుణ్ని ధిక్కరించడంతో సమానమని 13వ శతాబ్దంలో థామస్ అక్వినాస్ చెప్పాడు. సామాజిక ఒడంబడిక ద్వారా రాజ్యం ఏర్పడిందనేది మరో సిద్ధాంతం. దీన్ని ప్రతిపాదించి ప్రచారం చేసినవారు స్పినోజా, హాబ్స్, లాక్, రూసోలు. రాజ్యం అనాదికాలం నుండి లేదని, మధ్యలో ప్రజలందరి ఒప్పందంతో, ప్రమేయంతో ఏర్పడిందని చెప్పడం వల్ల యూరప్ దేశాలలో ఈ సిద్ధాంతం 17,18 వ శతాబ్దంలో ప్రగతిశీల పాత్ర నిర్వహించింది. అలాగే, కొందరు సామాజిక శాస్త్రవేత్తలు హింసవల్ల, మరికొందరు మానవ మనస్తత్వం వల్ల రాజ్యం ఏర్పడిందని అన్నారు. కుటుంబం, స్వంత ఆస్తి, వర్గాలు, రాజ్యం ఏకకాలంలో ఏర్పడ్డాయని ఎంగెల్స్ పేర్కొన్నాడు. ప్రతి ఆధునిక రాజ్యానికి మూడు విశిష్ట లక్షణాలు ఉంటాయి. ఒకటి అధికారం, రెండు ప్రాదేశికత, మూడు ఆర్థిక వనరులు సమకూర్చుకునే అధికారం. రాజ్యం రెండు రూపాలుగా పాలన సాగిస్తుంది. ఒకటి ఏకవ్యక్తి నిరంకుశత్వం, రెండు ఎన్నికైన వారు పాలన సాగించే రిపబ్లిక్. ప్రభుత్వరూపాలు రాజ్యం సారాన్ని వెల్లడించవు. ఏ వర్గం అధికారంలో ఉంది, ఎటువంటి ఉత్పత్తి సంబంధాలను పరిరక్షించాలి అనే దాన్నిబట్టి అందుకనుగుణమైన రూపాన్ని రాజ్యం సంతరించుకుంటుంది.

భారతదేశంలో 'రాజ్యం' రుగ్వేదకాలంలో, 'గణ' లేదా 'జన' అనే ప్రజా సముదాయ నాయకుడిని రాజన్ అనేవారు. అదే సమయంలో 'గణ' ముఖ్యులుండే 'సభ', సాధారణ ప్రజల ప్రతినిధులుండే 'సమితి'లు రాజన్‌కు సలహా ఇచ్చేవి. తెగలు ఇంకా స్థిరనివాసాలు ఏర్పరచుకోని తొలిదశలో వాటి తాత్కాలిక స్థావరాలను 'విశ్'లు అనేవారు. కాలక్రమంలో రాజకీయ నాయకులు క్షత్రియులుగా చెలామణి అయ్యారు. క్రీ.పూ. ఆరవ శతాబ్దం నాటికి రాజరిక రాజ్యాలు ఏర్పడ్డాయి. పంజాబ్‌లోనూ, హిమాలయాలను ఆనుకొని ఉన్న ప్రాంతాలలో గణతంత్ర రాజ్యాలు కూడా ఉండేవి. మౌర్య, గుప్త వంశరాజుల పాలన కాలంలోనే భూస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. క్రీ.పూ. ఒకటవ శతాబ్దంలో మధ్య ఆసియా నుండి శకులు, పార్థియనులు, కుషాణులు, హుణులు భారతదేశ వాయవ్య ప్రాంతాలకు వచ్చారు. ఆ తర్వాత 7వ శతాబ్దం నుండి మధ్య, పశ్చిమాసియా నుంచి, 16 వ శతాబ్దంలో యూరప్ నుంచి భారతదేశంలోకి వచ్చారు. దాదాపుగా ఈ కాలమంతా ఫ్యూడల్ రాజరిక వ్యవస్థనే కొనసాగింది. ప్రజలకు పాలనలో భాగస్వామ్యంగానీ, హక్కులు గానీ లేవు. దోపిడీ పీడనలకు గురయ్యారు.

## 1. యూరప్‌లో ప్రాతినిధ్య ప్రభుత్వ భావన

యూరప్‌లో మధ్యయుగపు రాచరిక ఫ్యూడల్ నిరంకుశత్వానికి, భూబానిసల యజమానుల, వంశ పారంపర్య ప్రత్యేక హక్కులకు వ్యతిరేకంగా పోరాడే క్రమంలో బూర్జువా ప్రజాస్వామ్యం రూపొందింది. యూరప్‌లో భూస్వామ్య బంధాల నుండి స్వేచ్ఛను కోరుతూ బూర్జువా విప్లవాలు జరిగాయి. నిరంకుశ రాచరిక భూస్వామ్యాన్ని ధ్వంసం చేసి పెట్టుబడిదారీ సమాజాన్ని, ప్రాతినిధ్య ప్రజాస్వామ్య పార్లమెంటరీ వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఇంగ్లండ్‌లో రాజుకు సలహా ఇచ్చేందుకు 11వ శతాబ్దంలో భూస్వాములు, మతాధికారులతో ఏర్పడిన 'మహాసమితి' (గ్రేట్ కౌన్సిల్) పార్లమెంటరీ వ్యవస్థకు నాంది. ఈ సమితే 1215లో జాన్ రాజుచేత 'మాగ్నాకార్టా' అనే హక్కుల పత్రంపై సంతకం చేయించింది. క్రమంగా రాజును అధికారం నుండి తొలగించే హక్కును ఈ 'మహాసమితి' సాధించింది. మహాసమితిలో రెండు సభలను వర్గ ప్రాతిపదికన ఏర్పరిచారు. ఒకటి ప్రభువుల సభ, రెండు మధ్యతరగతి ప్రజలున్న పామర సభ. రెండు సభలను కలిపి పార్లమెంట్ అనడం ప్రారంభమైంది. ఇంగ్లండ్‌లో పార్టీ పద్ధతి ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం రెండో ఛార్లెస్ (1660) కాలంలోనే ఆవిర్భవించింది. బూర్జువా వర్గం సాగించిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాల సందర్భంలో సమస్త పౌరులకు

సమాన హక్కులు ఉండాలన్న నినాదాన్ని ముందుకు తెచ్చింది. ఫ్యూడల్ శక్తులను ప్రతిఘటించే సాధనాలుగా ఫ్రెంచి విప్లవంలో (1789) స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి నినాదాలు ముందుకొచ్చాయి. 1776 నాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటన స్వతస్సిద్ధంగా మానవులందరూ సమానంగా సృష్టించబడ్డారని ఉద్ఘాటించింది. ఈ ప్రకటన పత్రాలు రూపొందించినవారు సంపన్నులు, భూస్వామ్య విధానంపైన ఫ్రాన్స్‌లో, వలస విధానంపైన అమెరికాలో బూర్జువా విప్లవ పోరాటాలు సాగించారు. ప్రస్తుతం మనం చూస్తున్న బూర్జువా ప్రజాస్వామ్యం రూపం రావడానికి, దాన్ని అంగీకరించడానికి చాలా కాలం, చాల ఉద్యమాలు ప్రపంచ వ్యాప్తంగా జరిగాయి. ప్రాతినిధ్యం కొరకు ఆందోళనలు జరిగాయి. అంతిమంగా పార్లమెంటులు ఏర్పడ్డాయి. మన దేశంలో భూస్వామ్యంతో పోరాటం చేసి, దాన్ని ధ్వంసం చేసి, పెట్టుబడిదారీ విధానం రాలేదు కనుక ఇలా సహజంగా ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణం జరుగలేదు.

18,19వ శతాబ్దాలలో యూరప్‌లోనూ, 19,20 శతాబ్దాలలో ఆసియా, ఆఫ్రికా ఖండాలలోనూ పరాయి ప్రభుత్వాలపై తిరుగుబాటు చేసి జాతీయ రాజ్యాలను స్థాపించుకొన్నారు. పార్లమెంటును, జాతీయ రాజ్య భావనలను తెచ్చింది బూర్జువా వర్గమే. బూర్జువా వర్గం తనను తాను ప్రజల్లో ఒక భాగంగా, పౌర సమాజంలో ఒక భాగంగా చెప్పుకుంటుంది. రాజ్యం తటస్థమైందీ, నిష్పక్షపాతమైనదీ కాబట్టి సమాజంలో ఏ ఒక్క వర్గం కానీ, సమూహం కానీ రాజ్యాన్ని నియంత్రించ లేవవు, ప్రభుత్వాలు మారవచ్చు, కొత్త ప్రభుత్వాలు రావచ్చు కానీ రాజ్యం చట్రం మాత్రం చెక్కుచెదరకుండా ఉంటుందని, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం సమంజసమైన, న్యాయ సమ్మతమైన పరిపాలన వ్యవస్థ అని ప్రజలు విశ్వసించేలా బూర్జువా వర్గం చేసింది. బూర్జువా సామాజిక తత్వశాస్త్రం రాజ్యాన్ని ఒక అమూర్త వ్యవస్థగా, సమాజంలో ఉద్భవించే పలు ఘర్షణల్లో తటస్థంగా ఉండే న్యాయ నిర్ణేతగా నిర్వచిస్తుంది. 'వ్యక్తి స్వేచ్ఛ' హక్కు ద్వారా బూర్జువా వర్గం 'స్వంత ఆస్తి హక్కు' అన్నది న్యాయమైన సహజ మైన హక్కు అనే భావనను ప్రజల మనసుల్లో బలంగా నాటగల్గింది.

పాశ్చాత్య సమాజాల చారిత్రక అభివృద్ధి క్రమంలో ప్రాతినిధ్య ప్రభుత్వాలు ఆవిర్భవించాయి. రాచరిక ప్రభు వర్గాలను కూలదోసిన తర్వాతనే బూర్జువా వర్గం రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొని పారిశ్రామిక విప్లవాన్ని చేపట్టింది. ఆ పైన సమాజంలో బూర్జువా వర్గ ఆధిపత్యం ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, తాత్విక రంగాలలో ఏర్పడింది. దీనితో పాటు రాజకీయంగా పార్లమెంటరీ విధానాన్ని అభివృద్ధి పరిచిందన్న విషయం మన దృష్టిలో ఉండాలి. మొదట ఆస్తిగల మగవారికే ఓటు హక్కు ఉండేది. ఆడవాళ్లకు ఆస్తిలేని మగవారికి, బానిసలకు ఓటు హక్కు ఎన్నో ఉద్యమాల తర్వాత వచ్చింది. ప్రజలందరికి ఓటు హక్కు ఇవ్వడం మేధావుల, బూర్జువా వర్గ ఆధిపత్యానికి ప్రమాదం కాదని అనుభవం ద్వారా తెలుసుకున్న తర్వాతనే అటువంటి ఆమోదం లభించింది. ఆరంభంలో పెట్టుబడిదారీ వర్గం దోపిడీ, అణచివేతకు గురయ్యే వర్గాలకు పరిపాలనలో పాత్ర లేకుండా దూరంగా ఉంచే ప్రయత్నాలు తీవ్రంగానే చేసింది. చదువురాని, సామర్థ్యం లేని ప్రజలు పరిపాలన చెయ్యలేరని పాలకవర్గాలు, మేధావులు వాదించారు. అంతిమంగా ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం ఉత్తమం అని అంగీకరించారు. ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రతినిధులు, వారితో ఏర్పడిన చట్టసభలు వర్గ ఆధిపత్యాన్ని దెబ్బతీయకుండా ఉండే విధంగా అనేక ఏర్పాట్లు చేశారు. పరిమితులు విధించారు. శాసన, పరిపాలన, న్యాయ విభాగాల మధ్య విభజన, రాజ్యాంగం ద్వారా ఆస్తిహక్కు, ప్రజావ్యతిరేకతను శాంతి భద్రతల పేరుతో అణచివేయడానికి శిక్షా స్మృతులు, మిలిటరీ, పోలీసు బలగాలతో ఉద్యమాలను, ప్రజావ్యతిరేకతను అణచివేయడం వగైరా ఏర్పాట్లు రాజ్యాంగ యంత్రాంగం ద్వారా చేసుకున్నారు. పార్లమెంటరీ ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో పెట్టుబడిదారీ దోపిడీ విధానానికి గట్టి రక్షణను ఏర్పాటు చేసుకున్నారు.

## 2. రాజ్యం – రాజ్యాంగం – ప్రజాస్వామ్యం

రాజ్యం గురించి, ప్రజాస్వామ్యం గురించిన అవగాహనను క్లుప్తంగా పరిశీలిద్దాం. రాజ్యం వర్గ ఆధిపత్య సాధనం. రాజ్యం రూపం ఏదైనా దాని సారాంశం మాత్రం వర్గ ఆధిపత్యాన్ని పరిరక్షించడమే. పెట్టుబడిదారీ వ్యవస్థలో రాజ్యం పెట్టుబడి ఆధిపత్యాన్ని నిలబెడుతుంది. రాజ్యం రూపం నిరంకుశత్వమైనా, ప్రజాస్వామ్యమైనా దాని స్వభావం అదే. పెట్టుబడిదారీ రాజ్య రూపాలన్నింటిలోకీ ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం మెరుగైనది. దానిలో ప్రజాతంత్ర హక్కులు, సార్వజనీన ఓటింగ్ హక్కు, చట్టబద్ధ పాలన ఉంటాయి. నిరంకుశ రూపాలకన్న ఇది మెరుగైన రూపం.

రూపంలో ప్రాథమిక హక్కులు, అందరికీ ఓటుహక్కు ఉన్నంత మాత్రాన రాజ్యం ప్రజలందరిదీ మాత్రం కాదు. పెట్టుబడిదారీ వర్గ ఆధిపత్యాన్ని రక్షించుకోవడానికి ఉత్తమ మార్గంగా ఇది అభివృద్ధి అయింది. హక్కులు కావాలని ఉద్యమించినపుడు, స్వేచ్ఛగా ఓటు హక్కు వినియోగించుకునే ప్రయత్నం చేసినపుడు, వర్గ ఆధిపత్యాన్ని సవాలు చేసినపుడు, మన దేశంలోనైతే కులాధిపత్యాన్ని సవాలు చేసినపుడు, ప్రజల హక్కులు కాలరాయడానికి, నిరంకుశత్వంవైపు మళ్లడానికి పాలకవర్గాలు వెనుకాడవు. అందుకు ఉదాహరణగా మన దేశంలో 1975లో అత్యవసర పరిస్థితి నల్లచట్టాలు, అక్రమనిర్బంధాలు, సైనిక చట్టాలు, పోలీసు నిర్బంధాలు, ఎన్‌కౌంటర్లు, మిస్సింగ్‌లు, దళితులపై హత్యాకాండ, మహిళలపై అత్యాచారాలు నిత్యంమనం చూస్తూనే ఉన్నాం.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అన్న ఫ్రెంచి భావనలు, మానవులంతా సమానంగా సృష్టించబడ్డారనే అమెరికా స్వాతంత్ర్య ప్రకటన ఒక పుక్కిటి పురాణంగా, మాయగా తేటతెల్లమైంది. పరిస్థితు లలో సమానత, అవకాశాలలో సమానత, ఎంపికలో సమానత లేవని అనుభవంలో తేలింది. భౌతిక ఉత్పత్తి సాధనాలు అందుబాటులో ఉన్నవారికే స్వాతంత్ర్యం, స్వేచ్ఛ వలన ప్రయోజనం ఉంటుంది. ఆర్థిక, సామాజిక హక్కులు మాత్రమే స్వేచ్ఛ, సమానత్వాలను సార్థక పరుస్తాయి. తద్వారా మాత్రమే వ్యక్తి వికాసం పొందే వీలౌతుంది. అంటే ఉత్పత్తి సాధనాలు జాతీయ సంపదగా మారినప్పుడు మాత్రమే, సమాజంలోని సభ్యులందరికీ ఉత్పత్తి సాధనాల విషయంలో సమాన అవకాశాలు లభించినప్పుడు మాత్రమే. సమానత్వమనే సమస్యకు, తద్వారా స్వేచ్ఛకు వాస్తవమైన శాశ్వత పరిష్కారం లభిస్తుంది. ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం, రాజ్యపు బూర్జువా స్వభావాన్ని కప్పిపెట్టి ప్రజలను భ్రమల్లో పెట్టడంలో

కీలకపాత్ర వహిస్తుంది. బూర్జువా రాజ్యాంగ యంత్రాంగంలో ఉండే సహజ సిద్ధమైన వర్గస్వభావం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, రెడ్‌టేపిజం బయటికి కనిపించవు. రాజ్యాధికారం అంటే ప్రజలు ఎన్నుకున్న ప్రజాప్రతినిధులేకాదు, నిరంకుశ రాజ్యాంగ పరిపాలన యంత్రాంగం, సైన్యం, న్యాయస్థానాలు కూడ. రాజ్యం చేసిన చట్టాల పరిధిలో రూపొందించి విధించిన ప్రవర్తనా ప్రమాణాల మొత్తమే న్యాయశాస్త్రం. న్యాయ వ్యవస్థ లేకుండా రాజ్యం మనుగడ సాగించలేదు. అలాగే రాజ్యంలేని న్యాయ వ్యవస్థ వుండదు. న్యాయ వ్యవస్థ కూడా ఆర్థిక పునాదిపై నిర్మితమైన ఉపరితల నిర్మాణమే. పెట్టుబడిదారీ వర్గానికి రక్షణగా అంతర్జాతీయంగా ఉండే సామ్రాజ్యవాదం కూడా (సోవియట్ రష్యా, తూర్పు యూరప్ దేశాలు, చిలీలో అలెండీ హత్య, ఇరాక్‌లో సద్దాం హుస్సేన్ హత్య, లిబియాలో గడాఫీ హత్య) అనేక దేశాలలో ప్రజానుకూల ప్రభుత్వాలను కూల్చి సామ్రాజ్యవాద తొత్తులకు రాజ్యధికారం అప్పగించి నిరంకుశ పాలకులకు కావల్సిన రక్షణ అందిస్తుంది.

రాజ్య మౌలిక స్వభావాన్ని, దాని లక్ష్యాలను అమలు చేసే ప్రభుత్వ నిర్మాణాన్ని, విధులను వివరించే మౌలిక చట్టాల సంపుటియే రాజ్యాంగం. ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యాంగాన్ని ప్రజల పక్షాన ప్రతినిధులు రూపొందిస్తారు. అందువల్లనే రాజ్యాంగాన్ని అత్యున్నత శాసనంగా వర్ణిస్తారు. దీని ద్వారా ప్రజలు తమను తాము పరిపాలించుకుంటారు అన్నది బూర్జువా ప్రజాస్వామ్య భావన. రాజ్యం ఏ వర్గం పట్ల పక్షపాతిగా ఉండదని, తటస్థంగా ఉంటుందని, వర్గాలమధ్య ఏర్పడే ఘర్షణను సామరస్యంగా పరిష్కరిస్తుందని, పౌరులందరిని సమదృష్టితో చూస్తుందని, చట్టబద్ధంగా పాలన సాగిస్తుందని బూర్జువా వర్గం చెబుతున్నది.

కాని రాజ్యం, రాజ్యాంగ యంత్రాంగం వర్గ ఆధిపత్యాన్ని నిలబెట్టే సాధనంగా మార్క్సిస్టులు భావిస్తారు. బూర్జువా ప్రజాస్వామ్యం కూడ ప్రజాస్వామ్యం ముసుగులో సాగే నియంతృత్వమేనని మార్క్సిజం చెబుతుంది. రాజ్య రూపం ఏదైనా దాని సారం దాని పనుల్లో వ్యక్తమవుతుంది. మొత్తం రాజకీయ సంబంధాల వ్యవస్థ వర్గసమాజ ఆర్థిక సంబంధాలను వ్యక్తం చేస్తుంది. ఆర్థిక వ్యవస్థ రాజకీయ వ్యవస్థ ద్వారా మాత్రమే పని చేస్తుంది. అందువల్లనే "రాజకీయాలు ఆర్థిక వ్యవస్థ అత్యంత సాంద్రీకృత వ్యక్తీకరణ" అన్నాడు లెనిన్. ఆర్థిక వ్యవస్థ మీద ఆధిపత్యం వహించే వర్గానికి చెందిన వ్యక్తులు ఏ సాధనం ద్వారా తమ దోపిడీని, ఇచ్ఛను, పీడితవర్గం మీదా, సమాజం మీదా రుద్దుతారో ఆ వ్యవస్థను 'రాజ్యం' అంటారు. రాజ్యం రాజీ పడలేని వర్గ వైరుధ్యాల ఫలితం. వర్గాలు ఏర్పడ్డాకే రాజ్యం పుట్టింది.

మన స్వాతంత్ర్య పోరాటానికి వర్గ రీత్యా దళారీ బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించింది. ఈ వర్గాన్నీ వలస పాలకులు ఎదగనీయలేదు. కొంత కాలంగా వీరికి ఆర్థిక పుష్టి వుంది. పట్టణ మధ్య తరగతితోను, మేధావులతోను సత్ సంబంధాలున్నాయి. జాతీయ వాదులకు అండదండలిచ్చారు. ఈ వర్గం భూస్వామ్యానికి వ్యతిరేకం అన్న నమ్మకంతో రైతులు వీరి నాయకత్వాన్ని అంగీకరించారు. ఈ వర్గానికి రాజకీయ ప్రతినిధులు గాంధీ, నెహ్రూలు. ఆనాడు వీరిద్దరూ ప్రజలకు ఆరాధ్యదైవాలు. వీరిని బూర్జువా వర్గం మంత్రాంగానికి, బ్రిటిష్ పాలకుల నుండి రాయితీలు పొందడానికి ఉపయోగించుకుంది. సహాయ నిరాకరణోద్యమాన్ని (విదేశీ సరుకుల బహిష్కరణ) తన ప్రయోజనాల కొరకు బలపర్చింది. స్వాతంత్ర్యానంతరం బ్రిటిష్ పెట్టుబడులు కొనసాగటానికి, లాభాలను బ్రిటన్‌కు తరలించటానికి హామీ ఇచ్చింది. విద్యా సంస్థల్లో ఇంగ్లీషు మాధ్యమాన్ని కొనసాగించడాన్ని, బ్రిటిష్ పౌరులకు భారతీయులతో పాటు అన్ని సౌకర్యాలు కల్పించడానికి, దేశ విభజనకు కూడా ఒప్పుకుంది.

## 3. భారత రాజ్యాంగ అభివృద్ధిక్రమం

భారత రాజ్యాంగ చరిత్ర 1600లో ఈస్టిండియా కంపెనీ భారతదేశానికి రావడంతో ప్రారంభమైంది. 1858లో బ్రిటిష్ ప్రభుత్వం కంపెనీ పాలనను తొలగించి, భారతదేశ పాలనా బాధ్యతలను స్వయంగా స్వీకరించింది. ఈ పాలన 15 ఆగస్ట్ 1947 వరకు కొనసాగింది. ఈ మధ్యకాలంలో అనేక రాజకీయ సంస్థలు, పరిపాలనాపరమైన వ్యవస్థలు ఆవిర్భవించాయి. వాటి ప్రభావం ఈ నాటి వరకు కొనసాగుతోంది. ఈ సుదీర్ఘ చరిత్రను ఆరు దశలుగా విభజించి పరిశీలించవచ్చు. మొదటి దశ 1600 నుంచి 1773 వరకు ఈస్టిండియా కంపెనీ బ్రిటిష్ రాణి మొదటి ఎలిజబెత్ అనుమతితో వ్యాపారం కోసం భారతదేశానికి వచ్చింది. రెండోదశ 1773 నుంచి 1858 వరకు బ్రిటిష్ ప్రభుత్వం రెగ్యులేటింగ్ ఆక్ట్ 1773 ద్వారా భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ రాజకీయాధికారాన్ని గుర్తించి, దాని పాలనను క్రమబద్ధం చేసింది. 1784లో పిట్స్ ఇండియా ఆక్టును బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది. ఈ చట్టం ద్వారా ఈస్టిండియా కంపెనీ రాజకీయ విధులను, వ్యాపార విధులను వేరు చేశారు.

1857లో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా వెల్లువెత్తిన ప్రజా ఆగ్రహం, సైనిక తిరుగుబాటు రూపంలో ఆరంభమైన ప్రజాస్వామిక పోరాటం. వలస పాలన నుండి భారతీయులకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలనే నిజమైన జాతీయ భావాన్ని వ్యక్తీకరించింది. ఇది 1859 వరకు సాగింది. ఈ పోరాటానికి రైతాంగం సంపూర్ణ మద్దతు ఇచ్చింది. ఇది సైనిక తిరుగుబాటు రూపంలో వ్యక్తమైన రైతాంగ పోరాటం. విదేశీ ఆధిపత్యానికి ఒక సవాల్ మాత్రమే కాక, భారతీయ సార్వభౌమత్వాన్ని నెలకొల్పటానికి ధైర్యంతో చేసిన పోరాటం. ఈ పోరాటంలో పాల్గొన్న ప్రజలు వలస వ్యతిరేకతను, భూస్వామ్య వ్యతిరేకతను, స్వాతంత్ర్య కాంక్షను ప్రదర్శించారు. వలస వ్యతిరేక పోరాటాల్లో కెల్లా ఇది చాలా బలమైంది. ఈ పోరాటం నాందిగా రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక పరిస్థితుల్లో తీవ్ర మార్పులు వచ్చాయి. కంపెనీ పాలన రద్దయింది. 1858 నుండి బ్రిటిష్ ప్రత్యక్ష పాలనను భారత్‌లో ఏర్పరిచింది.

మూడోదశ 1858 నుంచి 1909 మధ్యకాలానికి చెందింది. సిపాయీల తిరుగుబాటును అణచివేసిన తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పాలనను 1858లో రద్దు చేసింది. ఇంగ్లాండులో బ్రిటిష్ మంత్రి మండలిలో కాబినెట్ హోదాగల భారత వ్యవహారాల మంత్రి పదవిని సృష్టించారు. ఆ మంత్రికి సలహా - సహకారాలను అందివ్వడానికి ఇండియా కౌన్సిల్ కూడా ఏర్పాటైంది. ఈ దశలోనే భారత కౌన్సిల్ చట్టం 1861, 1892 రూపొందించడం

జరిగింది. వాటి ద్వారా బ్రిటిష్ పాలిత ప్రాంతాల్లో శాసన మండళ్లను ఏర్పాటు చేయడమేకాక, వానిలో భారతీయులకు పరిమిత సభ్యత్వం కూడా ఇచ్చారు.

నాల్గో దశ భారత కౌన్సిల్ చట్టం 1909 మింటో–మార్లే సంస్కరణల ద్వారా కేంద్ర, రాష్ట్ర శాసన మండలులకు అధికారాలు, బాధ్యతలు పెంచారు. బడ్జెట్ గురించి చర్చించే అవకాశం భారతీయులకు ఉంది. కాని ఓటింగ్‌లో పాల్గొనే అవకాశం లేదు. భారత కౌన్సిల్ చట్టం 1919 మాంటేగ్ – చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ద్వారా బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనలో ద్వంద్వ పాలనను ఏర్పాటు చేసింది. చట్టం ఓటు హక్కును పరిమితం చేసింది. సభ్యత్వానికి ఆస్తి గీటురాయిగా ఉంది. స్త్రీలు ఈ సభలకు ఎన్నికయ్యే అవకాశం లేదు. ఫలితంగా సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాలు, ప్రతిఘటన చర్యలు ప్రారంభమైనాయి. ఈ పరిస్థితిని పరిశీలించేందుకు ఇంగ్లాండు నుంచి వచ్చిన సైమన్ కమీషన్ తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొంది. భారతీయులలో స్వాతంత్ర్య కాంక్ష పెరిగింది. ఈ దశలోనే బడా బూర్జువా నాయకత్వం క్రింద భారతీయ విప్లవ శక్తులన్నీ సమీకృతమయ్యాయి.

ఐదో దశలో భారతదేశ పరిపాలన కోసం బ్రిటిష్ పార్లమెంట్ రూపొందించిన అతి పెద్ద చట్టం 1935 భారత ప్రభుత్వ చట్టం. ఇది భారత ఉపఖండానికంతటికీ కలిపి సమాఖ్య వ్యవస్థను, అందులో బ్రిటిష్ పాలిత రాష్ట్రాలకు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కల్పించింది. కేంద్రంలోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ ద్విసభా శాసన విధానాన్ని, గవర్నర్ జనరల్‌కు, రాష్ట్రాలలోని గవర్నర్లకు విచక్షణాధికారాలతో పాటు అత్యవసర పరిస్థితి వంటి ప్రత్యేక అధికారాలనూ కల్పించింది. ఈ కాలంలో బ్రిటిష్ పాలన పునాదులు, దాని అధికార యంత్రాంగం చిన్నాభిన్నమవడం సుస్పష్టంగా వెల్లడయింది. ఎన్నడూ ఊహించని విధంగా ఎగిసిపడుతున్న ప్రజా తిరుగుబాట్ల పర్యవసానాలకు భయపడి వణికి పోయిన భారత దళారీ బడా బూర్జువా వర్గం, దానికి నాయకత్వం వహిస్తున్న జాతీయ కాంగ్రెసు ఉద్యమాన్ని నీరుగార్చడం మొదలు పెట్టాయి. దీనితో భారత బడా బూర్జువా వర్గానికి సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవాన్ని తుదకంటూ కొనసాగించడం ఇష్టం లేదని స్పష్టమై పోయింది.

వలస పాలన కాలంలోనే భారతదేశ పారిశ్రామిక వర్గం కొన్ని ప్రధాన నగరాలలో కేంద్రీకృతమైంది. ఈ కాలంలోనే పట్టణ జీవితాన్ని, రాజకీయాలను ప్రభావితం చేసే ఉన్నత మధ్యతరగతి వర్గం ఒకటి ఆవిర్భవించింది. తమ అవసరాలను, ప్రయోజనాలను ప్రతిభావంతంగా డిమాండ్ చేయగలిగారు. ఆధునిక ఆంగ్ల విద్య, ప్రభుత్వ ఉద్యోగం, ఆధునిక వృత్తి వీరి ఎదుగుదలకు బాగా తోడ్పడినాయి. వీరు తాము పుట్టిపెరిగిన సాంస్కృతిక వాతావరణంతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని ఆంగ్ల మానస పుత్రులుగా మారారు. వీరి అభిరుచులు, అలవాట్లు, అవసరాలూ అన్నీ అఖిల భారత స్వభావం కల్గినవైనందున ఏ తారతమ్యాలు లేకుండా ఒకే అఖిల భారత వేదికపైకి రాగలిగారు. ఆ వేదికే భారత జాతీయ కాంగ్రెస్. కాంగ్రెస్ పార్టీ సంస్థాగత నిర్మాణం అనేక దొంతరలతో, పట్టువిడుపులతో, అనేక వర్గాల రాజకీయ ఒప్పందాలతో నిర్మించబడింది. ఈ నిర్మాణం వలసానంతరం దేశంలో పాలకవర్గ కూటమిగా ఏర్పడడానికి, వారి పాలనకు తోడ్పడింది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఆధునిక పరిశ్రమలను స్థాపించారు. భారత బడా బూర్జువా వర్గం అధికార బదిలీకి ముందే దళారీ లక్షణాలను సంతరించుకుంది. ఈ వర్గం 1944లో 'బాంబేప్లాన్' గా గుర్తింపు పొందిన ఆర్థిక పారిశ్రామిక విధానాన్ని కాంగ్రెస్ ముందు పెట్టింది.

1945 వేసవిలో సామ్రాజ్యవాదులతో రాజీ బేరాలు కుదుర్చుకోవ డానికి గల అవకాశాలను పరిశీలించడానికి భారత పరిశ్రమల అగ్రాధిపతులైన జి.డి. బిర్లా, జె.ఆర్.డి. తాతాల నాయకత్వాన ఒక అధికార పారిశ్రామిక ప్రతినిధివర్గం ఇంగ్లాండు, అమెరికాలు పర్యటించింది. కాంగ్రెసు నాయకులు జైలు నుండి విడుదల చేయబడి, సంఘటనలు అతివేగంగా జరిగిపోతున్న దశ అది. "భారత పారిశ్రామిక అభివృద్ధి పట్ల బ్రిటిష్ పరిశ్రమల వైఖరిలో కచ్చితమైన మార్పు వచ్చిందని, బ్రిటన్‌లోని బడా పారిశ్రామికాధిపతులు భారతదేశంలో పారిశ్రామికీకరణ అనివార్యతను అంగీకరించడమే కాక చాలా సందర్భాల్లో భారత రాజకీయ వాంఛలకు అనుగుణంగా ఉండటానికి అంగీకరిస్తున్నారని గమనించడం ద్వారా భారత – బ్రిటిష్ సహకారంతో నూతనాధ్యాయాన్ని ఆ పారిశ్రామిక ప్రతినిధి వర్గం ప్రారంభించిందని" ఈస్టరన్ ఎకనమిస్టు పత్రిక (1945 జూన్ 29) వ్రాసింది.

1857 తిరుగుబాటు అనంతరం, 90 ఏళ్లలో మొదటిసారి సైనికులు, నావికా దళం, వైమానిక దళ సభ్యులు సామ్రాజ్యవాద పీడనకు వ్యతిరేకంగా ఉద్యమానికి పూనుకున్నారు. విప్లవ వెల్లువను కాంగ్రెస్ నాయకత్వం (గాంధీ, నెహ్రూ, పటేల్‌లు) తీవ్రంగా వ్యతిరేకించింది, నిరోధించడానికి ప్రయత్నించింది. బ్రిటిష్ వైస్రాయ్ వేవెల్ వద్ద పనిచేయడానికి మధ్యంతర ప్రభుత్వంలో కాంగ్రెసు విధేయతతో చేరింది. 1946 జూలై 7న జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో మాట్లాడుతూ గాంధీ "మనం గొప్పగా చెప్పుకుంటున్న సార్వ భౌమాధికారం న్యాయపరిమితి, భారతదేశపు 'స్వాతంత్ర్యం', సామ్రాజ్యవాదుల మీద ఆధారపడి ఉందన్న వాస్తవాన్ని దాచిపెట్టే సాధనంగా రాజ్యాంగ సభను" అభివర్ణించాడు. నిజానికి ఆనాడు సామ్రాజ్యవాదానికి ప్రజలకు, భూస్వామ్యానికి రైతాంగానికి, పెట్టుబడికి శ్రమకు, పాలక వర్గాలలోని వివిధ సెక్షన్ల మధ్య వైరుధ్యాలు తీవ్రంగా ఉన్నాయి. అయినా, సామ్రాజ్యవాదానికి, భూస్వామ్యానికి వ్యతిరేకంగా జరిగే ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వం వహించే శక్తి భారత దళారీ బడా బూర్జువా వర్గానికి లేదని 1947 ఆగష్టు 15 అధికార మార్పిడి రుజువు చేసింది. జాతీయ కాంగ్రెసు ప్రజా ప్రయోజనాలకు ద్రోహం చేసింది. భారత పాలకవర్గాలు సామ్రాజ్యవాద తొత్తులుగా ఉండే పాత్రను మాత్రమే ఎంచుకున్నారు.

వల్లభాయ్‌పటేల్ నావికా దళాల తిరుగుబాట్లను ఖండించి, 'నావికా దళంలో క్రమశిక్షణ వుండి తీరవలసిందేనన్న' బ్రిటిష్ ప్రధాన సైన్యాధికారి వ్యాఖ్యానానికి తన అమోదాన్ని తెలిపాడు. కాంగ్రెసు అధ్యక్షుడుగా నున్న మౌలానా అజాద్ 'ప్రస్తుత అధికారానికి వ్యతిరేకంగా సమ్మెలు, హర్తాళ్లు, ధిక్కరణకు స్థానం లేదని ప్రకటించాడు. ఉద్యమంలో ప్రదర్శితమైన హిందు, ముస్లిం ఐక్యతను, దానిపట్ల ప్రజల్లో పెల్లుబికిన విస్తృతమైన అండదండలను 'అపవిత్ర కూటమి'గా ఖండించడం ద్వారా దానిపై

గాంధీ దెబ్బతీశాడు. దినదినం పెరుగుతున్న వివిధ తరగతుల, ప్రజల విప్లవ కార్యాచరణ పట్ల ఉన్నత (బూర్జువా, భూస్వామ్య, సామ్రాజ్యవాద) వర్గాలలో గల భయాల్ని తేటతెల్లంగా బయట పెడుతున్న మాటలివి. "భారత దళారీ బడా బూర్జువా వర్గం, దాని ప్రతినిధి అయిన జాతీయ కాంగ్రెస్, దాని నాయకుడు 'మహాత్ముడు', ఆయన అనుచరులు అహింసా మార్గం పట్టడానికి, అందుకు బ్రిటిష్ ప్రభుత్వం కృతజ్ఞతా పూర్వకంగా ఉండటానికి సరైన కారణం ఉందని, ఫలితంగా అధికార బదిలీ తర్వాత బ్రిటిష్ పరిశ్రమలు పరిరక్షించబడి, మరింత అభివృద్ధి చెందాయని' గున్నార్ మిర్డాల్ 'ఏషియన్ డ్రామా' అనే తన పుస్తకంలో పేర్కొన్నారు.

చివరిదైన ఆరో దశ అధికార బదిలీతో మొదలవుతుంది. అధికార మార్పిడికి బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించిన వెంటనే కేంద్రంలో నెహ్రూ నాయకత్వాన తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. భారతదేశానికి ప్రథమ గవర్నర్ జనరల్‌గా మౌంట్ బాటన్, ప్రధానిగా నెహ్రూ భారత ప్రభుత్వ చట్టం 1935 ప్రకారం ప్రకటించబడ్డారు. 1947 ఆగష్టు 15న బ్రిటిష్ ప్రభుత్వం భారత్‌లో దాదాపు రెండు శతాబ్దాలు తాను నెలకొల్పిన అన్ని వ్యవస్థలను, సంస్థలను, సర్వీసులను భారత ప్రభుత్వానికి అప్పగిస్తూ అధికారాన్ని మార్పిడి చేసింది. రాజీ – బదిలీ అనంతరం మారిన పరిస్థితులకు అనుగుణంగా కొన్ని మార్పులను భారత రాజ్యాంగంలో పొందుపరచడమైంది. "కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికార విభజన, కేంద్ర శాసన సభకు, కొన్ని రాష్ట్రాలకు ద్విసభా విధానం, రాష్ట్రపతికి అత్యవసర అధికారాలు, రాష్ట్ర గవర్నర్లకు విచక్షణాధికారాలు 1935 చట్టాన్ని ఆధారం చేసుకొని భారత రాజ్యాంగం కల్పించింది". బ్రిటిష్ ప్రభుత్వం దాదాపు రెండు శతాబ్దాలు పెంచి పోషించిన నిరంకుశ పరిపాలనా యంత్రాంగాన్ని, మిలిటరీని బ్రిటిష్ వారి నుంచి వారసత్వంగా భారత ప్రభుత్వం స్వీకరించింది. 1947 ఆగష్టు తర్వాత కూడా రెండు సంవత్సరాల పాటు భారత సైన్యం బ్రిటిష్ సర్వసేనాని అయిన జనరల్ బోచర్ ఆధిపత్యం కిందనే ఉంది.

పెట్టుబడిదారీ దోపిడీ కొనసాగాలంటే రాజ్యాంగ యంత్రం యావత్తు బూర్జువా వర్గం చేతిలో ఉండాలి. దానిపై సర్వాధికారం ఉండాలి. రాజ్యాధికారాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకోగలిగిన శక్తి సామర్థ్యాలు భారత బూర్జువా వర్గానికి లేవు. దేశ ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితుల దృష్ట్యా అది ఇతర వర్గాలతో రాజీపడింది. రాజ్యాధికారం దక్కాలంటే సాంఘికంగా బలమైన ఇతర వర్గాలతో బూర్జువా చేతులు కలుపక తప్పలేదు. ఇందులో గ్రామీణ భూస్వామ్యవర్గం ప్రధానమైంది. ఈ రాజీ అభివృద్ధి నిరోధకమైన రాజీ. ఈ రాజీ వల్ల యథాతథవాదుల బలం పెరిగింది. రైతాంగంపై భూస్వాముల దోపిడీ, అణచివేతలు కొనసాగడానికి కారణమైంది. జాతీయ కాంగ్రెస్ క్రమంగా పట్టణ మధ్యతరగతి, బూర్జువా, భూస్వామ్య ఐక్యసంఘటనగా రూపుదిద్దుకుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య రూపంలో రాజ్యాధికారాన్ని కొనసాగించింది.

**4. రాజ్యాంగ నిర్ణయ సభ ఏర్పాటు**

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత బ్రిటన్‌లో 1945 జూలైలో లేబర్ పార్టీ నేత లార్డ్ అట్లీ అధికారంలోకి వచ్చాడు. అప్పటికే భారత ప్రజలలో బ్రిటిష్ పాలనపట్ల తీవ్ర అసంతృప్తి నెలకొని ఉంది. రైల్వే కార్మికులు, పోస్టల్ ఉద్యోగులు సమ్మెలకు పూనుకున్నారు. 1946 ఫిబ్రవరిలో నావికా దళ సభ్యులు తిరుగుబాటు జరిపారు. దీనికి తోడు సుభాష్ చంద్రబోస్ స్థాపించిన 'అజాద్ హింద్ ఫౌజ్' నాయకులను విడుదల చెయ్యాలని దేశమంతా సాగిన ఆందోళనను వలస ప్రభుత్వం అదుపుచేయలేకపోయింది. రెండవ ప్రపంచ యుద్ధంలో బాగా చితికి పోయి, భారీ నష్టాలకు గురైన బ్రిటన్ ఇక ముందు భారత ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని అణచివేయడం అసంభవమని గ్రహించింది. అందుచేత సాధ్యమైనంత త్వరలో భారత్‌లో తన ఆర్థిక ప్రయోజనాలను కాపాడుకుంటూ భారత్ నుండి వైదొలగడం శ్రేయస్కరమని భావించి బ్రిటిష్ పాలకులు భారతీయులకు రాజకీయాధికారాన్ని బదిలీ చేయాలని నిర్ణయించి ముగ్గురు సీనియర్ మంత్రుల బృందాన్ని 1946 మార్చిలో భారతదేశానికి పంపింది. ఈ బృందం సూచించిన అంశాలనే కాబినెట్ మిషన్ ప్రణాళిక అంటారు.

1935 నాటి భారత ప్రభుత్వ చట్టం ప్రకారం 1946 జూలైలో రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యులు ఎన్నుకోబడ్డారు. ఇందులో రాష్ట్రాలకూ, రాజ సంస్థానాలకూ, జనాభా ప్రాతిపదిక మీద ప్రాతినిధ్యం కల్పించారు. పది లక్షల జనాభాకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొన్నారు. రాష్ట్రాల విధానసభల సభ్యులు ఓటు బదిలీ చేసే పద్ధతి మీద తమ ప్రతినిధులను పంపారు. రాజ్యాంగ నిర్ణయ సభలో మొత్తం 389 మంది సభ్యులుండేవారు. బ్రిటిష్ రాష్ట్రాల నుండి 292 మంది, స్వదేశీ సంస్థానాల నుంచి 93 మంది, చీఫ్ కమిషనర్ సంస్థానం నుంచి ముగ్గురు, బెలూచిస్థాన్ నుంచి ఒకరు ప్రాతినిధ్యం వహించారు. రాజ్యాంగ నిర్ణయ సభకు 1946 జులైలో ఎన్నికలు జరిగాయి. పార్లమెంటు సెంట్రల్ హాల్‌లో 1946 డిసెంబర్ 9న డా. సచ్చిదానంద సిన్హా అధ్యక్షతన జరిగిన మొదటి సమావేశంలో డా. రాజేంద్రప్రసాద్‌ను రాజ్యాంగ నిర్ణయ సభ అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

భారత స్వాతంత్ర చట్టం 1947 వల్ల రాజ్యాంగ నిర్ణయ సభ అస్తిత్వంలో మరికొన్ని మార్పులు వచ్చాయి. ఒకటి, రాజ్యాంగ నిర్ణయ సభ అధికారాలపై గల బాహ్య నిబంధనలు తొలగిపోయాయి. రెండు, పాకిస్తాన్ ఏర్పాటు మూలంగా ముస్లింలీగ్ సభ్యులు రాజ్యాంగ పరిషత్తు నుంచి వైదొలగారు. మూడు, రాజ్యాంగ నిర్మాణ సంస్థ గానే గాక తాత్కాలిక పార్లమెంట్ పాత్ర కూడా కల్పించారు. రాజ్యాంగ పరిషత్‌లో డా. రాజేంద్ర ప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్ భారత జాతీయ కాంగ్రెస్‌కు, అబుల్ కలామ్ అజాద్ ముస్లింలకు, హెచ్ సి ముఖర్జీ భారతీయ క్రైస్తవులకు, డా. హెచ్ పి మోడి పార్శీలకు, ఫ్రాంక్ అంథోని ఆంగ్లో ఇండియన్లకు ప్రాతినిధ్యం వహించారు. డా. సర్వేపల్లి రాధాకృష్ణన్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, ప్రొఫెసర్ కె టి షా మొదలైనవారు ఒకపార్టీ ప్రతినిధులుగా గాక అయారంగ నిష్ణాతులుగా ప్రాతినిధ్యం వహించారు. స్త్రీలకు ప్రాతినిధ్యం వహించినవారిలో సరోజినీ నాయుడు, విజయలక్ష్మీ పండిట్‌లు ఉన్నారు.

రాజ్యాంగ నిర్ణయ సభ ప్రాతినిధ్య స్వభావం పట్ల విమర్శలు ఉన్నాయి. ప్రధానంగా అది ప్రజాస్వామికంగా సార్వత్రిక ఓటింగ్ ద్వారా ఎన్నిక కాలేదన్నది మొదటి విమర్శ. భారత కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలకు రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రాతినిధ్యం లేదన్నది రెండవ విమర్శ. భారత రాజ్యాంగం 'రాజీలు – రాయితీ'ల ఫలితంగా ఏర్పడిందని మరి

కొంతమంది అభిప్రాయం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవించే ప్రజల రాజ్యాంగ సభకు ఉండవల్సిన లక్షణాలలో ఒక్కటి కూడా దీనికి లేకుండా పోయాయన్నది ప్రజాతంత్రవాదుల విమర్శ. ఆశ్చర్యమేమంటే, ఒకప్పుడు 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని పూర్తిగా తిరస్కరించిన నాయకులే రాజ్యాంగ రచనకు పూనుకొన్నప్పుడు ఆ చట్టం నుంచి సుమారు 80 శాతం అంశాలను గ్రహించడానికి వెనుకాడలేదు. స్వాతంత్ర్యం రాక పూర్వం 1945లో ఎన్నికైన రాష్ట్ర శాసన సభల ప్రతినిధులచే 1946లో పరోక్ష ఎన్నికల విధానంలో రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యులు ఎన్నికయ్యారు. ఈ విధంగా రాజ్యాంగ నిర్ణయ సభలో కేవలం 15 శాతం జనాభాకు మాత్రమే ప్రాతినిధ్యం లభించింది. అంతేగాక, స్వదేశీ సంస్థానాల ప్రతినిధులు నామినేషన్ పద్ధతిద్వారా సభ్యత్వాన్ని పొందారు. 80 శాతంగా ఉండే రైతాంగానికి, కార్మిక వర్గానికి, కూలీలకు రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రాతినిధ్యం లేదు. ఈ కారణంచేత రాజ్యాంగ నిర్ణయ సభ నిర్మాణం ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధంగా జరిగింది. అది ప్రజలకు వాస్తవమైన ప్రాతినిధ్యాన్ని వహించలేదు.

## 5. భారత రాజ్యాంగం ఆమోదం

1947 ఆగస్టు 29న రాజ్యాంగ నిర్ణయ సభ డా. బిఆర్ అంబేద్కర్ అధ్యక్షతన ఏడుగురు సభ్యులతో ఒక ముసాయిదా కమిటీని ఏర్పాటు చేసింది. వివిధ విషయాలను పూర్తిగా పరిశీలించడానికి ఉపకమిటీలను ఏర్పాటు చేసారు. ఈ కమిటీల సిఫారసుల మేరకు రాజ్యాంగ ముసాయిదాను తయారు చేసారు. ఈ రాజ్యాంగ ముసాయిదాను 1948 జనవరిలో ప్రకటించారు. దీనిపై చర్చించి తగిన సవరణలు సూచించ డానికి భారత ప్రజలకు 8 నెలల గడువిచ్చారు. 7,635 సవరణలను ప్రతిపాదించగా, అందులో 2,473 మాత్రమే చర్చకు వచ్చాయి.

భారత రాజ్యాంగాన్ని 1949 నవంబరు 26న రాజ్యాంగ పరిషత్తు ఆమోదించింది. పౌరసత్వం, ఎన్నికలు, తాత్కాలిక పార్లమెంట్, తాత్కాలిక సంధికాల నిబంధనలు మొదలైనవి 1949 నవంబర్ 26 నుంచి అమలులోకి వచ్చాయి. తక్కిన అంశాలన్నీ 1950 జనవరి 26 నుంచి అమలులోకి వచ్చాయి. ఈ తేదీనే రాజ్యాంగ అమలు దినంగా గుర్తించారు. "భారత ప్రజలమైన మేము భారతదేశాన్ని సార్వభౌమ, సామ్యవాద లౌకిక ప్రజాస్వామ్య సర్వసత్తాక రాజ్యంగా రూపొందిస్తున్నాం. భారతపౌరులందరికీ సాంఘిక ఆర్థిక రాజకీయ న్యాయాన్ని, ఆలోచనలో భావ ప్రకటనలో మతవిశ్వాసంలో ఆరాధనా విషయంలో స్వేచ్ఛనూ, సామాజిక విషయాల్లోనూ, జీవితావకాశాల్లోనూ సమానత్వాన్నీ, వ్యక్తిగౌరవాన్నీ, జాతీయ ఐక్యతనూ (సమగ్రతనూ) పెంపొందించే విధంగా సౌభ్రాతృత్వాన్నీ కల్పించాలని రాజ్యాంగ పరిషత్తులో చిత్తశుద్ధితో తీర్మానించి 26 నవంబర్, 1949 నాడు ఈ రాజ్యాంగాన్ని పరిగ్రహించి, చట్టరూపంగా మాకు మేము సమర్పించుకొంటున్నాము" అని రాజ్యాంగ పీఠిక పేర్కొంటుంది. నూతన రాజ్యాంగ ఆరంభంతో భారతదేశం 26 జనవరి 1950 నుంచి ఒక గణతంత్ర దేశంగా అవతరించింది.

అన్ని దేశాల రాజ్యాంగాల వలే భారత రాజ్యాంగం కూడా ఇతర దేశ రాజ్యాంగాలలోని కొన్ని ప్రాథమిక అంశాలను ఉదారంగా స్వీకరించింది. కాబినెట్ విధానం గల పార్లమెంటరీ పద్ధతినీ, సమన్యాయ పాలననూ బ్రిటిష్ రాజ్యాంగం నుంచి భారతదేశం గ్రహించింది. పార్లమెంటరీ విధానాన్ని, శాసనాల తయారీ, స్పీకర్ అధికారాలనూ, హోదానూ బ్రిటిష్ పద్ధతిననుసరించి రూపొందించారు. పార్లమెంటు అధికారాలనూ, సభ్యుల హోదానూ బ్రిటిష్ హౌస్ ఆఫ్ కామన్స్ సభ్యుల కున్నట్లే కల్పించారు. భారత కాబినెట్, బ్రిటన్ కాబినెట్ లాగే పనిచేస్తుంది. ప్రాథమిక హక్కులు, స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన న్యాయశాఖ, న్యాయ సమీక్ష అనే అంశాలను అమెరికా రాజ్యాంగం నుంచి గ్రహించడమైనది. రాజ్యాంగ వేత్తలు, అమెరికా రాజ్యాంగంలోని హక్కులలో భారతదేశ పరిస్థితులకు అనుకూలమైన స్వేచ్ఛాహక్కు లాంటివి గ్రహించారు. ఆయుధాలను కలిగి ఉండే హక్కు లాంటి వాటిని వదిలి వేశారు. రాజ్యాంగ అంశాలలో విభేదించే శాసనాలను రాజ్యాంగ వ్యతిరేకమైనవనీ, చట్ట వ్యతిరేకమనీ నిర్ణయించి, రద్దు చేసే న్యాయ సమీక్షాధికారాన్ని న్యాయస్థానాలకు కల్పించడానికి అమెరికా విధానమే స్ఫూర్తినిచ్చింది. స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన న్యాయశాఖ అనే భావనను కూడా అమెరికా నుంచే గ్రహించారు. ప్రజాతంత్ర వ్యవస్థకు పునాదైన ప్రాథమిక హక్కులు భారత పౌరుల సాంఘిక రాజకీయ స్వేచ్ఛకు సంబంధించినవి. వీటికి ఆటంకం కలిగితే న్యాయస్థానాల ద్వారా వాటిని పొందవచ్చు.

కేంద్ర రాష్ట్రాల మధ్య అధికార విభజన 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం జరిగినా, అవశేషాధికారాలను కెనడా పద్ధతిని అనుసరించి కేంద్రానికే కల్పించారు. ఆదేశ సూత్రాలకు సంబంధించిన అంశాలనూ, రాజ్యసభ సభ్యుల నియామకాన్ని ఐరిష్ రాజ్యాంగం నుంచి గ్రహించారు. రాజ్యసభ సభ్యుల ఎన్నికకు సంబంధించిన అంశాలు, రాజ్యాంగ సవరణ విధానం దక్షిణాఫ్రికా రాజ్యాంగం నుండి గ్రహించారు. ఆదేశ సూత్రాలను దేశంలో రాజకీయ ప్రజాస్వామ్యానికి అవసరమైన సాంఘిక, ఆర్థిక పునాదిని ఏర్పరిచేందుకు ఉద్దేశించారు. అయితే ఇవి కోర్టుల ద్వారా అమలు పరచబడవు. అత్యవసర పరిస్థితిలో పౌరుల ప్రాథమిక హక్కులను రద్దుచేసే అధికారం సంబంధిత అంశాలు జర్మనీ వైమార్ రాజ్యాంగం నుంచి గ్రహించారు. రాజ్యంగ నిర్మాతలలో ఒకరైన అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ "మనం న్యాయ, సైనిక వ్యవస్థలకు సంబంధించి సరికొత్త రాజ్యాంగాన్నేమీ ప్రారంభించటంలేదు. ప్రస్తుతం చాలా కాలంగా అమలులో నున్న పరిపాలనా యంత్రాంగాన్ని నూతన వ్యవస్థలో పూర్తిగా అలక్ష్యం చేయలేము" అని రాజ్యాంగ సభ చర్చలో ప్రకటించాడు. 1948 ఏప్రిల్‌లోనే తాము మౌలిక మార్పుకు వ్యతిరేకమని, ప్రస్తుతమున్న నిర్మాణం దెబ్బతినకుండా జాగ్రత్తపడాల'ని రాజ్యాంగ నిర్ణయ సభలో నెహ్రూ ప్రకటించాడు. ఈ ప్రకటన భారత బడా బూర్జువా వర్గం దాని ప్రతినిధులు సామ్రాజ్యవాదంతోనూ, ఫ్యూడలిజంతోనూ చేసుకున్న రాజీ బేరాల ఒప్పందపు స్వభావాన్ని తేటతెల్లం చేస్తుంది.

సాంఘిక, ఆర్థిక మార్పులు తేవడానికి వారికి అనేక నమూనాలు అందుబాటులో ఉన్నప్పటికి, బ్రిటన్ పార్లమెంటరీ పద్ధతినే (వెస్ట్ మినిస్టర్ మోడల్) అవలంబించాలని నిర్ణయించారు. భారత రాజ్యాంగం పార్లమెంట్‌ను ప్రభుత్వ యంత్రాంగంలో అత్యున్నతమైన వ్యవస్థగా రూపొందించింది. దేశానికి (వర్గ ప్రయోజనానికి) అవసరమైన చట్టాలను రూపొందించే కార్యక్రమాన్ని ఈ వ్యవస్థ నిర్వహిస్తుంది.

### 6. అధికార బదిలీ - నేతల మాటలు

ఆగస్ట్ 15న భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్రం వచ్చిందని కాంగ్రెసు, రాజకీయ స్వాతంత్ర్యమే కాని ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదని, అయితే భారత బూర్జువా వర్గానికి స్వతంత్ర పాత్ర ఉందని, వీరికి సామ్రాజ్యవాద వ్యతిరేకత ఉందని ఆనాటి కమ్యూనిస్టు పార్టీ భావించాయి. అధికారం బదిలీ అయింది కానీ స్వాతంత్ర్యం రాలేదని విప్లవ కారులు భావించారు. మనది 'అర్ధవలస-అర్ధభూస్వామ్య వ్యవస్థ' మాత్రమేనని ఆరున్నర దశాబ్దాలుగా రాజ్య స్వభావం-పాలన విధానాలు తెలియజేస్తున్నాయి. భారత దేశ సంపదలో అత్యధిక భాగం 100 మంది దళారీ నిరంకుశ పెట్టుబడి దారుల చేతుల్లో ఉంది. గ్రామీణ ప్రాంతాల్లో 40 శాతం కుటుంబాలు సెంటుభూమి లేనివారుగానే ఉన్నారు. గ్రామీణ చేతి వృత్తులు ధ్వంసమై ప్రత్యామ్నాయం లేక దినసరి కూలీలుగా మారారు. బతుకు దెరువుకోసం కొందరు వలసలు వెళ్తున్నారు.

మనం రూపొందించబోయే రాజ్యాంగ శాసనం దేశ సాంఘిక ఆర్థిక సమస్యలను పరిష్కరించక పోతే అది వ్యర్థమైపోతుంది అని నెహ్రూ హెచ్చరించాడు. "విదేశీ ప్రభుత్వం స్థానంలో దేశీయ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత కూడా పాత దోపిడి ప్రయోజనాలను ముట్టకుండా ఉన్నట్లయితే అది స్వాతంత్ర్యం నీడగా కూడా ఉండబోదు" అని ప్రధాని కాక ముందు నెహ్రూ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. అలాగే 'ఇండియన్ సివిల్ సర్వీస్' భారతీయమైంది కాదు, పౌర సేవ చేసేది కాదని, దాన్ని రద్దు చేయాలని కూడా అన్నాడు. 'ఆహారానికి అల్లాడుతున్న దేశం మనది. పట్టెడు మెతుకుల కోసం అలమటిస్తున్న కోటానుకోట్ల మందికి వట్టిమాటలు చెప్పడమంటే అది వారిని వెక్కిరించడమే. ఇంత అన్నం, కొంత గుడ్డ, కొంప ఏర్పరచి, ప్రజలకు చదువు సంధ్యలు చెప్పించి, మందు మాకులు ఇచ్చాక - ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు'. నెహ్రూ వ్యాఖ్యలు ఆరున్నర దశాబ్దాల స్వాతంత్ర్యం తరువాత నిజమై నిలుస్తున్నాయి.

"26 జనవరి 1950 నాడు వైరుధ్యాలతో కూడిన జీవనంలోకి అడుగుబెట్టబోతున్నాం. రాజకీయ రంగంలో సమానత్వం, సామాజిక ఆర్థిక రంగాలలో అసమానత్వం కొనసాగుతుంది. మనకు రాజకీయ ప్రజాస్వామ్యం వచ్చింది. కానీ సాంఘికార్థిక ప్రజాస్వామ్యం రాలేదు. సామాజికార్థిక ప్రజాస్వామ్య పునాది లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం దీర్ఘకాలం మనుగడ సాగించలేదు. సామాజిక ప్రజాస్వామ్యమంటే అది ఒక జీవన విధానం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే సూత్రాలను ఏదో విడిగా సూత్రత్రయంగా చూడకూడదు. స్వేచ్ఛను సమానత్వం నుండి, సమానత్వాన్ని స్వేచ్ఛ నుండి వేరు చేయలేము. సమానత్వం, స్వేచ్ఛలను సోదరభావం నుండి వేరు చేయలేము. సామాజిక, ఆర్థిక అసమానతల్ని సాధ్యమైనంత త్వరగా నిర్మూలించాలి. లేకుంటే అసమానతకు గురవుతున్న వాళ్లు ఈ రాజ్యాంగాన్ని బద్దలు కొడతారు" అని హెచ్చరిస్తూ ఎంతో శ్రమకోర్చి నిర్మించుకున్న ప్రజాస్వామ్య సౌధం కుప్పకూలి పోతుందని స్పష్టం చేశారు అంబేద్కర్.

గ్రాన్విల్ ఆస్టిన్ చెప్పినట్లు "జాతీయోద్యమ కాలంలో రెండు విప్లవాలు ఒకటి రాజకీయ విప్లవం, రెండోది సామాజిక విప్లవం సమాంతర రేఖలో నడిచాయి. స్వాతంత్ర్యం లభించడంతో రాజకీయ విప్లవం ముగిసింది. కాని సామాజిక విప్లవం మిగిలింది." ఆనాటి పరిస్థితిని వివరిస్తూ రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యుడు కె. సంతానం "దేశం మూడు విప్లవాలను ఎదుర్కొంది. మొదటిది రాజకీయ విప్లవం. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించడంతో అది అంతమైంది. రెండోది సాంఘిక విప్లవం. లౌకిక విద్యలను అభివృద్ధి పరిచి, వ్యక్తి గౌరవానికి విలువను కలుగ జేయడం ద్వారా దీన్ని అంతం చేయవచ్చు. మూడోది ఆర్థిక విప్లవం - ఇప్పుడున్నటువంటి ప్రాచీన గ్రామీణ ఆర్థిక వ్యవస్థను ప్రణాళికా బద్ధమైన వ్యవసాయిక, పారిశ్రామిక వ్యవస్థగా మార్చినట్టైతే దానిపై విజయం సాధ్యమవుతుంది. ఈ సాంఘిక ఆర్థిక విప్లవాల విజయాల పైన్నే భారతదేశం భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. సామాజిక ఆర్థిక విధానాలు మారకుండా పాలించే వ్యక్తులు మారినంత మాత్రాన ప్రజల జీవన విధానాల్లో ఎలాంటి మార్పురాదు" అన్నాడు.

అందుకే రాజకీయాల వర్గ స్వభావాన్ని, రాజ్య స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. దోపిడీని, సొంత ఆస్తిని కాపాడుకోవడానికి దోపిడీదారులకు రాజ్యాధికారం ఎంత అవసరమో ఆ దోపిడీ నుండి విముక్తం కావడానికి పీడితులకూ అది అంతే అవసరం. ఆర్థిక సంబంధాలు మారాలంటే రాజకీయ సంబంధాలు మారాలి. ఆర్థికాధిపత్యం ఎవరి చేతుల్లో వుంటుందో రాజ్యాధికారం కూడా వారి చేతుల్లోనే వుంటుంది. అందుచేత రాజ్యసారం వర్గ దోపిడీ, వర్గాధిపత్యం. ప్రస్తుత రాజకీయ వ్యవస్థను పరిశీలిస్తే విషయమింత సూటిగా, సరళంగా అర్థం కాదు. బూర్జువా ఉదారవాద ప్రజాస్వామ్యంలో ఉదారత్వంలేదు, ప్రజాస్వామ్యం లేదు. భూస్వాములు లేని భూస్వామ్య ఉత్పత్తి విధానం, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలేని పెట్టుబడి వృద్ధి మాత్రమే దేశంలో ఉంది (ఆర్ఎస్ రావు). రాజకీయాలు పైకి చాలా గందరగోళంగా కనిపిస్తాయి. అయితే వాటిని నడిపించేవి మౌలికమైన, స్థిరమైన వర్గ ప్రయోజనాలే. విదేశీ సాంకేతిక పరిజ్ఞానం మీద, విదేశీ ముడిసరకుల మీద, విదేశీ పెట్టుబడుల మీద, నిర్వహణ మీద ఆధారపడిన దళారీ బడా బూర్జువా వర్గం స్వతంత్రంగా ఉత్పత్తిని సాగించలేదు. ఆరున్నర దశాబ్దాల కాలాన్ని ప్రమాణంగా తీసుకుని ఆ కాలంలో ఏ వర్గం ఆధిపత్యం, దోపిడీ, సంపద పెరిగిందనేది పరిశీలిస్తే రాజ్యసారం వర్గ దోపిడీలో వుందనే విషయం అర్థమవుతుంది.

### 7. నెహ్రూ కాలంలో రాజకీయాలు

గత ఆరు దశాబ్దాలుగా పార్లమెంట్ చేసిన రాజ్యాంగ సవరణలుగానీ, చట్టాలుగానీ పరిశీలిస్తే అవి దేశ సంపదను దేశీయ, విదేశీ సంపన్నులకు అప్పగించేందుకే అని విదితమవుతుంది. ప్రజాహిత చట్టాలు ఏవైనా చేసినా అవి కాగితాలకే పరిమితమై ప్రజలకు ఉపయోగపడలేదు. మరికొన్ని చట్టాలు శాంతిభద్రతల పేరిట, ప్రజాస్వామ్య పరిరక్షణ పేరిట నియంతృత్వాన్ని నెలకొల్పే చట్టాలే. మన రాజకీయాలు ప్రజాసేవ అనే అర్థం మార్చి లాభసాటి వ్యాపారంగా మారాయి. ప్రజల అవసరాలకంటే దేశీయ, విదేశీయ సంపన్నుల అవసరాలకు ప్రాధాన్యత పెరిగింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆరు దశాబ్దాల పార్లమెంటరీ రాజకీయాలు, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం కొత్త భూస్వాములను, కొత్త ప్రభువులను (కుబేరులు) తయారు చేసింది. ప్రజలకు సంబంధించిన ఏ ఒక్క మౌలిక సమస్యను పరిష్కరించలేదు సరికదా నూతన సమస్యలను సృష్టించింది. ప్రజాస్వామ్యం ముసుగులో, ప్రజలచే ఎన్నుకోబడ్డామన్న సమర్థనతో తమ సంపదను పెంచుకుంటున్నారు. కొన్ని తరాలు తిన్నా తరగని

ఆస్తులు సమకూర్చుకొని రాజ భోగాలు అనుభవిస్తున్నారు. ఇలా ఏవిధంగా చూసినా భారత పార్లమెంటరీ రాజకీయాలు ప్రజల ఆశలను, ఆకాంక్షలను, హక్కులను సాకారం చేయలేదు. ప్రజాస్వామ్య విలువల స్వప్నాలకు ద్రోహం చేశాయి. భూస్వామ్య సామ్రాజ్యవాద దేశీయ బడా బూర్జువా సేవలో పార్లమెంటరీ రాజకీయాలు తరించిపోతున్నాయి. పాలక వర్గాల ఈ నియంతృత్వ అప్రజాస్వామిక దళారీ పాలనకు ప్రజామద్దతు ఉన్నదనే పచ్చి అబద్దాన్ని అరవై ఏళ్లుగా ఊదరగొడుతూనే ఉన్నాయి. ఈ నేపథ్యంలో పార్లమెంటరీ రాజకీయాల డొల్లతనాన్ని పరిశీలించవలసి ఉంది.

నెహ్రూ పాలనకాలంలో భారత సమాజ నిర్మాణం అతి సంశ్లిష్టంగా విభిన్న ఉత్పత్తి విధానాలతో బహుజాతుల, సామాజిక వర్గాలుగా ఉంది. బడా బూర్జువా, బడా వాణిజ్యవేత్తల, సామ్రాజ్యవాద పెట్టుబడిదారులు, వారి దళారీ వర్గం, బ్యూరాక్రాట్స్, పట్టణ మేధావులు, భూస్వాములు, జాగీర్దారులు, ధనిక రైతులు, మాజీ సంస్థానాధీశులను అధికార వర్గంగా లేదా పాలక వర్గాలుగా గుర్తించవచ్చు. అధీన వర్గాలుగా శ్రామికులు, చేతి వృత్తుల వారు, పేద రైతులు, కౌలు రైతులు, వ్యవసాయ కూలీలు ఉంటారు. మధ్య తరగతి వర్గంగా పెటీ బూర్జువా, ఉద్యోగులు, చిన్న వ్యాపారులు, మధ్య తరగతి రైతులు, స్వయం ఉపాధి కలిగియున్నవారిని పేర్కొనవచ్చు.

పై ఆర్థిక పరమైన వర్గ విశ్లేషణను సిద్ధాంత రాజకీయాలతో సరిపోల్చలేం. తిరోగమన ఆర్థిక వ్యవస్థ, అసమాన అభివృద్ధి, ప్రజాస్వామిక ఉద్యమం లేనందున బడా బూర్జువా నాయకత్వంలో సాపేక్షికంగా నిలకడైన రాజకీయ ఆధిపత్య పార్టీలు విశాలమైన సమ్మతితో నెహ్రూ కాలమంతా నిలకడగానే కొనసాగాయి. తెలంగాణ రైతాంగ ఉద్యమాన్ని, జాతుల సమస్యను, కాశ్మీర్ సమస్యను, కేరళలో కమ్యూనిస్టుల ప్రభుత్వాన్ని నిర్బంధం ద్వారా కుట్ర ద్వారా అణచివేశారు. ఆధునీకరణ – అభివృద్ధిని పైనుంచి క్రిందికి అమలు చేయడం వలన పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి శక్తులలో వ్యతిరేకత పెరిగింది. చైనా మాదిరిగా విప్లవం ద్వారా సామాజిక వ్యవస్థను ప్రజాస్వామికీ కరించడానికి బదులుగా రాజీలు–సర్దుబాటు ద్వారా సామాజిక మార్పును, ప్రజాస్వామ్య సోషలిజాన్ని తీసుకవస్తామని నెహ్రూ ప్రజల్ని భ్రమల్లో పెట్టాడు.

భారతీయ సమాజం వివిధ సామాజిక వర్గాలతో కూడిన నిర్మాణ వ్యవస్థ. మనదేశంలో అనేక మతాలు, జాతులు, తెగలు, కులాలు, భాషలు, ప్రాంతాలు, వాటికి అనుగుణమైన సంస్కృతులు అంతర్భాగంగా ఉన్నాయి. ఈ స్థితి రాజకీయ స్థాయిలో అసంఖ్యాక వ్యవస్థలు, సమీకరణలు, సంయోగాలు, ప్రయోజనాల వ్యక్తీకరణకు అవకాశం కల్పిస్తుంది. ప్రజల సామాజిక రాజకీయ కార్యకలాపాలకు, సాంఘిక మార్పులకు అవినాభావ సంబంధం ఉంటుంది. భారతదేశ రాజకీయ, సామాజిక రంగంలో గత 65 సంవత్సరాల కాలంలో అనేక మార్పులు సంభవించాయి. సాంఘిక, ఆర్థిక శక్తుల ప్రభావాన్ని వివరించడం అంటే భారత సామాజిక రాజకీయ రంగాలను సమగ్రంగా విశ్లేషించడమే అవుతుంది. సాంఘిక, ఆర్థిక శక్తులు భారత రాజకీయ వాస్తవికతకు అద్దంపడతాయి.

మన ఆర్థిక వ్యవస్థ బ్రిటిష్ దోపిడీలో వికృతంగా తయారైన వ్యవస్థ. అధికార మార్పిడి నాటికే ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలకూ, వెనుకబడిన దేశాలకూ మధ్య బ్రహ్మాండమైన చారిత్రక అగాధం ఏర్పడివుంది. ఈ పరిస్థితుల్లో మనదేశ బడా పెట్టుబడిదారీ వర్గం సాంకేతికంగా అభివృద్ధి చెందడమూ, అంతర్జాతీయ మార్కెట్లో పోటీపడడమూ అన్నవి ఊహకు కూడా అందని విషయాలు. ఆ రోజు భారత పెట్టుబడిదారీ వర్గం సామ్రాజ్యవాదానికి దళారీగా ఉండడం, ప్రభుత్వం నుండి ప్రోత్సాహాన్ని అందుకోవడం తప్ప మరో మార్గం లేదు. ప్రపంచ మార్కెట్లో ఇతరులు వాడి, విసర్జించిన పాత టెక్నాలజీలను అరువు తెచ్చుకుని దేశీయ మార్కెట్లో ఉత్పత్తి సాగించడమే ఆరోజు వారికి సాధ్యం. అదే వారికి క్షేమం. బ్రిటిష్ వలసరాజ్యం, వలస వాద పెట్టుబడి కలసి అఖిలభారత మార్కెట్‌ను సృష్టించాయి. ఈ మార్కెట్ నుండే భారత బడా పెట్టుబడిదారీ వర్గం పుట్టి పెరిగింది. వలసానంతరం బ్రిటిష్ వారి నుండి వారసత్వంగా పొందిన జాతీయ మార్కెట్‌ను తమ వర్గ ప్రయోజనాల కొరకు మరింత గట్టిపరచుకుంది. అంతర్జాతీయ మార్కెట్లో పోటీకి దిగాలంటే విదేశీ సాంకేతిక పరిజ్ఞానం కావాలి. అది ఇతరులపై మరింత ఆధారపడేలా చేస్తుంది.

1950 దశకం నుంచి ప్రణాళికా సంఘం ఏర్పాటు, పంచవర్ష ప్రణాళికలను ప్రారంభించడం, పారిశ్రామిక, వాణిజ్య లైసెన్సులను నియంత్రించడం, పంపిణీ చేయడం, అమ్ముకోవడం ద్వారా బ్యూరాక్రసీ, కాంగ్రెసు పార్టీ తమ పట్టును పెంచున్నాయి. ఆర్థిక – సామాజిక వ్యవస్థలో ఇది అనేక అవకతవకలకు దారి తీసింది. జాతీయ ఉద్యమ కాలంలో కాంగ్రెసు చేసిన వాగ్దానాలను విస్మరించి ప్రజల ఆసక్తులకు భిన్నంగా ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణానికి వ్యతిరేకమైన విధానాలు అమలు చేయడం మొదలుపెట్టింది.

1948 ఫిబ్రవరి 17న "ఆర్థిక నిర్మాణంలో ఎలాంటి మార్పులుండవు, ఇప్పట్లో విదేశీ పరిశ్రమలు ఏవీ జాతీయం చేయడం జరుగదు" అని నెహ్రూ ప్రకటించాడు. 1948 ఏప్రిల్ 6న భారత ప్రభుత్వం స్పష్టంగా ఆయుధ సామాగ్రి, రైల్వేలు, విద్యుచ్ఛక్తి, అణుశక్తి తప్ప "మిగిలిన పారిశ్రామిక రంగమంతటా సాధారణంగా ప్రైవేట్ పెట్టుబడికి అవకాశం ఉంటుంది" అని తన విధానాన్ని తెలిపింది. అంటే అప్పటికున్న సామ్రాజ్యవాద పెట్టుబడితో సహా గుత్తసంస్థలకు తన సానుకూలతను వ్యక్తం చేసింది. పాలకులు మారినా విధానాలు మారలేదు. సామ్రాజ్యవాద ద్రవ్య పెట్టుబడి, దానితో మిలాఖత్ అవుతున్న భారత దళారీ బూర్జువా వర్గం, ఫ్యూడల్ భూస్వాముల ప్రయోజనాలను కాపాడే వ్యవస్థను నిర్వహించే రూపాలు మారడం తప్ప సారంలో మార్పు ఏమీ రాలేదు. పాత సామాజిక ఆర్థిక వ్యవస్థను, పాత పరిపాలన యంత్రాంగాన్ని, పాత నిరంకుశాధికారుల వ్యవస్థ, పాత న్యాయ వ్యవస్థ, పాత పోలీసు వ్యవస్థ, పాత అప్రజాస్వామిక నిరంకుశ చట్టాలన్నింటినీ భారత 'స్వాతంత్ర్యం' పేరుతో కొనసాగించడం నూతన ప్రభుత్వ ప్రత్యేక లక్షణం.

1950 నాటికి పూర్వపు సంస్థానాధిపతుల భూభాగాలను వారి సామాజిక, ఆర్థిక ప్రత్యేక హక్కులకు ఎట్టి తీవ్రభంగం లేకుండా కలుపుకొన్నారు. ప్రజాతంత్ర వ్యవస్థ స్వభావానికి పూర్తి విరుద్ధంగా సంస్థానాధీశులకు రాజభరణాలు, అసంఖ్యాకమైన పన్నుల నుండి

మినహాయింపులు, వారి రాజబిరుదుల్ని కొనసాగించడం తదితరమైన అనేక ప్రత్యేక హక్కులు కల్పించి వారిని భారత యూనియన్‌లో చేర్చుకొన్నారు. వీటికితోడు వారిలో అనేకమందిని విదేశీ రాయబారులుగా, రాష్ట్రాల గవర్నర్లుగా, ఐక్యరాజ్య సమితి సభ్యులుగా ఆకర్షణీయమైన పదవుల్లో నియమించారు. యథాతథ స్థితిని, పాత వ్యవస్థను కాపాడేందుకు ఫ్యూడల్ అధికార చిహ్నాలుగా వున్న వీరి పట్ల వీరి ప్రత్యేక హక్కుల పట్ల ఉదారంగా వ్యవహరించడం, సామ్రాజ్యవాదంతో రాజీ కుదుర్చుకొని అధికారంలోకి ఎగబ్రాకడం మౌలిక సారాంశమైంది.

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951-56) దళారీ బడా బూర్జువావర్గం రూపొందించిన బాంబే ప్లాన్ (1944) కార్యక్రమాన్నే ప్రధానంగా అమలుచేసింది. దాని లక్ష్యం పరిమితమైనది. ఉనికిలో వున్న, సామాజిక-ఆర్థిక వ్యవస్థ మారనంతవరకూ అభివృద్ధి వేగంగా సాగదనీ, స్వతంత్ర పారిశ్రామిక విప్లవం అసలే సాధ్యం కాదనీ త్వరగానే అందరికీ అర్థం అయిపోయింది. పెట్టుబడి సంచయనాన్ని పెంచడం ఎలా అన్న ముఖ్యమైన సమస్యను భారత దళారీ బూర్జువా వర్గం ఎదుర్కొంది. బ్రిటిష్ తరహా పెట్టుబడిదారీ అభివృద్ధికి అవసరమైన పరిస్థితులు దేశంలో లేవు. అలాగని జర్మనీ తరహాలో రాజ్యం ఆర్థిక వ్యవస్థలో జోక్యం చేసుకుని పెట్టుబడిదారీ అభివృద్ధికి అవసరమైన వనరులనూ, నిధులనూ వ్యవసాయరంగం నుండి సమీకరించేందుకూ, విదేశీ పోటీని నివారించే ఉద్దేశ్యంతో రక్షణ విధానాలను అవలంబించేందుకూ కూడా 'సైద్ధాంతికంగా' అవకాశం వున్నప్పటికీ ఆచరణలో ఏ అవకాశం మిగలలేదు. ఆనాటి నిర్దిష్ట చారిత్రక పరిస్థితులూ, రాజకీయ సమీకరణాలూ అలాంటివి. నెహ్రూ మిశ్రమ ఆర్థిక వ్యవస్థ సోషలిజం పేరుతో "ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాన్ని" ఎంచుకున్నాడు. 1955లో ఆవడి కాంగ్రెస్ సదస్సులో "సోషలిస్టు తరహా సమాజం" ను తన లక్ష్యంగా ప్రకటించింది. భూసంస్కరణలు అమలు చేయకుండా, వ్యవసాయాన్ని ఆధునీకరించకుండా వ్యవసాయంలో అదనపుమిగులు రాదు. వ్యవసాయంలో మిగులు రాకుండా పారిశ్రామికాభివృద్ధి జరుగదు. అందువలన వనరుల కొరకు నెహ్రూ ప్రభుత్వం విదేశీసహాయాన్ని అర్థించింది. విదేశీ సహాయంతోపాటే సామ్రాజ్యవాద జోక్యం కూడా దేశంలో పెరిగింది. నయావలస తరహాలో ఈ జోక్యం సాగింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) భారీ పరిశ్రమలకు పెద్దపీట వేసింది. ప్రాథమిక సదుపాయాల రంగంలో, భారీ పరిశ్రమల్లో ప్రభుత్వమే పెద్ద యెత్తున పెట్టుబడులని పెట్టడంతో బడా పెట్టుబడిదారులకు ఒక సమస్య తీరిపోయింది. వారు తమవద్ద వున్న పరిమితమైన వనరులతో వినియోగ వస్తువుల తయారీ పరిశ్రమలను స్థాపించుకున్నారు. వేగంగా, అధిక శాతం లాభాలను పొందడానికి వారికి అవకాశం దొరికింది. ప్రభుత్వ పరిశ్రమలను తమ జేబు సంస్థలుగా వాడుకుని లాభపడ్డారు. ఈ ప్రణాళికవల్ల మధ్యతరగతి కూడా విపరీతంగా లాభపడింది. ప్రభుత్వ నిర్వహణ, పబ్లిక్ రంగసంస్థల నిర్వహణ, విద్యా రంగం మొదలైన అనేక రంగాలలో కొత్త ఉద్యోగ అవకాశాలు పుట్టుకొచ్చాయి. అలాగే ఈ ప్రణాళిక భారీ పరిశ్రమలపై దృష్టి పెట్టడం వల్ల భూసంస్కరణలను పూర్తిగా వదలిపెట్టడంవల్ల భూస్వామ్యవర్గం ఆర్థికంగా, రాజకీయంగా బలపడింది. రాష్ట్రాల అసెంబ్లీల్లో ఏవైనా చిన్నాచితకా భూసంస్కరణల చట్టాలు జారీ చేయబడినా వాటిని ఎలా ఎదుర్కొని, ఎలా నిర్వీర్యం చేయాలో భూస్వామ్యవర్గాలకు బాగా తెలుసు. రాష్ట్రాల స్థాయిలో రాజకీయంగా ఈ వర్గానికే బలం ఎక్కువ వుండడంతో భూసంస్కరణల అమలు హాస్యాస్పదంగా మారిపోయింది.

ఆధునీకరణ - అభివృద్ధి పేరిట సామ్రాజ్యవాదంపై ఆదారపడటాన్ని ప్రారంభించారు. ప్రజల కొనుగోలు శక్తిని, దేశీయ మార్కెట్‌ను అభివృద్ధి చేయుటకు చర్యలు చేపట్టలేదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, అభివృద్ధి, అలీన విధానం అనే మూడు నినాదాలతో నెహ్రూ నాయకత్వం దేశ ప్రజలను మభ్యపెట్టింది. భారత దేశం విదేశీ సహాయంపై ఆధారపడటం అంతకంతకు పెరిగి పోవటంతో, విదేశీ ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలకు అనుగుణంగా భారత ఆర్థిక విధానాలు మార్చాలని వత్తిడిని పెంచాయి. అమెరికా సహాయ కార్యక్రమాలను అధ్యయనం చేసిన క్లే కమిటీ ప్రైవేట్ రంగ పరిశ్రమలతో పోటీపడే విధంగా పథకాలను చేపట్టే ఏ విదేశీ ప్రభుత్వానికి అమెరికా సహాయం చేయరాదని 1963లో స్పష్టం చేసింది. ఆ తర్వాత సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదంతో భారత్ చేసుకున్న మైత్రి ఒప్పందం పరిశీలించిచూస్తే, అందులో రాజకీయ షరతులకంటే ఆర్థిక, సైనిక షరతులతో కూడిన సహాయం అందజేసినట్లు అర్థమవుతుంది. ఇది అసమాన ఒప్పందం. సోవియట్ రష్యా సాగించే దోపిడికి దోహదకారిగా మైత్రి ఒప్పందం ఉన్నది. అలీనత పేరుతో భారత్ తరచుగా సోవియట్ అనుకూలంగా ఐక్య రాజ్య సమితిలో ఓటు చేసింది.

పేరుకు ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానమే అయినా ప్రైవేట్ పెట్టుబడిదారులకు లాభం చేకూర్చే అనేక విదానాలను ప్రభుత్వం చేబట్టింది. పెట్టుబడిదారులకు సులభంగా, తక్కువ వడ్డీరేట్లతో అప్పులు దొరికేలా చూడడం కొరకు ప్రభుత్వమే అనేక బ్యాంకులనూ, పరపతి సంస్థలనూ స్వయంగా స్థాపించింది. ఈ బ్యాంకులనూ, అవి అందించే నిధులనూ బాగా ఉపయోగించుకుని లాభపడిందీ, బలపడిందీ గుత్త పెట్టుబడిదారీ సంస్థలు. ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడిదారుల మధ్య 'స్వేచ్ఛా పోటీ' వాతావరణం పూర్తిగా ఏర్పడకముందే బలమైన ప్రైవేట్ గుత్త పెట్టుబడిదారీ సంస్థలు భారత ఆర్థిక వ్యవస్థను శాసించడం మొదలుపెట్టాయి. జాతీయాదాయం కన్నా ఈ సంస్థల ఆదాయం ఎన్నో రెట్లు ఎక్కువ పెరిగింది. అలా పెరిగిన ఆదాయాన్ని వారు మొత్తం ఆర్థిక వ్యవస్థ అవసరాల కొరకు పొదుపు చేసింది మాత్రం చాలా తక్కువ. రెండవ ప్రణాళిక చివరి నాటికి మిశ్రమ ఆర్థిక విధానం గుత్త పెట్టుబడిదారీ విధానాన్ని ప్రోత్సహిస్తూ వచ్చింది. దీనివల్ల రాజ్య పెట్టుబడిదారీ అభివృద్ధి యవ్వనం దాటకముందే ముసలి తనపు రోగాలు చుట్టు ముట్టాయి. అవి: ఒకటి పెట్టుబడి కొరత, రెండు విదేశీ మారక ద్రవ్య నిలువల కొరత, మూడు ఆహార కొరత.

**8. ఇందిరాగాంధీ కాలంలో రాజకీయాలు**

నెహ్రూ ప్రభుత్వ పెట్టుబడిదారీ అభివృద్ధీ, ప్రణాళికాబద్ధ అభివృద్ధీ, ఆధునీకరణ అనే వ్యూహం 1966 నాటికే పూర్తిగా స్థంభించిపోయింది.

అభివృద్ధి లక్ష్యాలు సామాజిక న్యాయాన్ని సాధించడంలో విఫలమయ్యాయని ఆర్థిక ప్రణాళికా వేత్తలు తెలుసుకోవడానికి ఎక్కువ కాలం పట్టలేదు. ఆర్థికాభివృద్ధి ఆశించిన మేరకు జరుగలేదు. 'ఆదాయ పంపిణీ-జీవన ప్రమాణాలు' పై మహలనోబిస్ కమిటీ నివేదిక (1964) ప్రకారం సంపద కొద్దిమంది బడా పెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకృత మైంది. గుత్త సంస్థలపై కె సి దాస్ విచారణ కమిటీ (1964), పరిశ్రమల లైసెన్స్ విధానంపై సుబిమల్ దత్ కమిటీ (1969) నివేదికలు సమసమాజ నిర్మాణానికి కావల్సిన ఆర్థికాభివృద్ధి లక్ష్యం పక్కదారి పట్టింని స్పష్టం చేశాయి. ఈ సమయంలో (1966) అధికారంలోకి వచ్చిన ఇందిరా గాంధీ దేశంలో బడా బూర్జువా వర్గం, బడా భూస్వామ్యవర్గం, పట్టణ మధ్యతరగతి, విదేశీ పెట్టుబడి అనే నాలుగు శక్తుల కూటమికి అవసరమైన గట్టి పునాదులు వేసింది. పెట్టుబడిదారీ విధానాన్ని, భూస్వామ్యాన్ని మాటల్లో తీవ్రంగా వ్యతిరేకిస్తూనే ఇందిరాగాంధీ అధికారంలోకి వచ్చింది.

వ్యవసాయ ఆధునీకరణ విధానంలో భాగంగా హరిత విప్లవాన్ని 1960 దశకంలో ప్రవేశపెట్టారు. హరిత విప్లవం ప్రారంభంతో వ్యవసాయంలోకి పరిశ్రమ లక్షణాలు వచ్చాయి. నీటి వసతి సమృద్ధిగా ఉన్న ప్రాంతాల్లో హరిత విప్లవపు పరిజ్ఞానాన్ని కేంద్రీకరించారు. నీటి వసతులు లేని ప్రాంతాల్లో దీని ప్రభావం అంతగా లేదు. ఫలితంగా ప్రాంతీయ అసమానతలతో పాటు, ప్రజల మధ్య అసమానతలు కూడా ఏర్పడ్డాయి. హరిత విప్లవం ద్వారా దేశంలో గ్రామీణ ప్రాంతాల్లో నూతనంగా ధనిక రైతాంగ వర్గం ఒకటి ఆవిర్భవించింది.

1960వ దశకం మధ్యకాలం నాటికి ఆహార సంక్షోభం, ఆర్థిక తిరోగమనం, వనరుల కొరత, ప్రజల కష్టాలు పెరిగాయి. ఫలితంగా దేశ వ్యాప్తంగా ప్రజా ఆందోళనలు పెల్లుబికాయి. భారత రాజకీయాల్లో ప్రజా ఉద్యమాల నూతన అధ్యాయం ఆరంభమైంది. ఇప్పటి వరకు వర్గాల మధ్యగల అన్యోన్య సంబంధంలో, రాజ్యంతో వర్గాలకు గల సంబంధాలల్లో హెచ్చు మార్పులు సంభవించాయి. భూ సంస్కరణలు అమలు చేయక బూర్జువా భూస్వామ్య వర్గాల ప్రయోజనాలకే ప్రభుత్వ విధానాలు తోడ్పడుతున్నాయన్న భావన మెజారిటీ ప్రజల్లో నెలకొంది. హరిత విప్లవం ద్వారా లబ్ధిపొందిన ధనికరైతులు, ప్రభుత్వ కాంట్రాక్టుల ద్వారా ఎదిగిన ప్రాంతీయ బూర్జువాలు అధికారంలో వాటాకొరకు పోరాడుతుంటే మరోవైపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోల్పోయి అభద్రతలో జీవితాలు గడుపుతున్న ప్రజలు కాంగ్రెసు పాలన పట్ల విముఖతతో ఉన్నారు. బడా బూర్జువాలు, ప్రాంతీయ బూర్జువాలు పరస్పరం సంఘర్షిస్తూనే కేంద్రంపై వాటాల కొరకు వత్తిడి పెంచారు. రాజ్య విధానాలకు, ఆధిపత్య వర్గాలకు వ్యతిరేకంగా కార్మికోద్యమాలు, రైతాంగ ఉద్యమాలు, గ్రామీణ ధనిక రైతు ఉద్యమాలు వచ్చాయి. ఈ క్రమంలోనే రాష్ట్రంలో, కేంద్రంలో అధికారంలోగల కాంగ్రెసుకు వ్యతిరేకంగా అసంతృప్తి వర్గాలు, మితవాద, మతతత్వ, కులతత్వ పార్టీలకు తమ మద్దతు ఇవ్వడంతో 1967లో తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెసు అధికారాన్ని కోల్పోయింది. దీంతో వర్గాల మధ్య ప్రయోజనాలు, పొందికలో మార్పులు చోటు చేసుకున్నాయి. పెట్టుబడిదారీ వర్గానికి, రాజ్యానికి పెను సవాళ్లు ఎదురయ్యాయి.

ధనిక రైతులు, ప్రాంతీయ ఆధిపత్య వర్గాలు అధికారంలో వాటా, ప్రభుత్వ వనరుల్లో వాటా కొరకు డిమాండ్ చేయడంతో పాటు తమ వర్గ సమస్యలు సాధించుకోవడానికి ప్రాంతీయ, జాతి, మత, కుల, సాంస్కృతిక అంశాలను ఉపయోగించుకున్నారు. అదే సమయంలో పేద రైతులు, కూలీలు, శ్రామికులు, విద్యార్థులు, పెటి బూర్జువాలు కేంద్ర, రాష్ట్ర ఆధిపత్య వర్గాలకు వ్యతిరేకంగా సమరశీల వర్గ ఉద్యమాలు చేపట్టారు (నక్సల్బరీ, శ్రీకాకుళం, ముషాహరి). పెరిగిన అసమానతలు, పేదరికం, నిరుద్యోగంతో సతమతమవుతున్న ప్రజలు ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలిచారు. ఈ నేపథ్యంలో రాజ్యం ఫాసిస్టు విధానాలు చేపట్టింది. పార్లమెంట్, న్యాయస్థానాలు, పాలన యంత్రాంగం, పార్టీలను బలహీనం చేసి అన్నీతానై ఇందిరాగాంధీ ఒక నియంతగా మారింది.

ఇందిరా గాంధీ ఏక పక్ష నియంతృత్వ వైఖరీ వలన పార్టీలో సంక్షోభం ముదిరి నవంబర్ 1969లో కాంగ్రెసులో చీలిక వచ్చింది. ఆమె అధికారాన్ని కాపాడుకోవడానికి జనాకర్షణ పథకాలు ప్రకటిస్తూనే మరోవైపు సంపన్న వర్గాల, సామ్రాజ్యవాద ప్రయోజనాలు కాపాడే చర్యలు చేపట్టింది. ప్రాంతీయ సంపన్న వర్గాలతో స్వల్పకాలిక మైత్రిని కొనసాగించింది. పట్టణ, గ్రామీణ పేదలను ఆకర్షించే నినాదాలు చేసింది. బ్యాంకుల జాతీయకరణ (1969), రాజ భరణాల రద్దు (1970), గుత్త వాణిజ్య నియంత్రణా చట్టం (ఎంఆర్‌టిపి) 1969 లాంటి చర్యలు చేపట్టింది. 1971 మార్చిలో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో 'గరిబీ హటావో' నినాదంతో, సోషలిస్టు పద వాగాడంబరంతో విజయం సాధించింది.

1970 దశకం మధ్య నాటికి ఇందిరా గాంధీ పట్ల ఆదరణ తగ్గింది. ప్రజల ఆకాంక్షలు ఆకాంక్షలుగానే మిగిలిపోయాయి. పేదరికం, ఆర్థిక అసమానతల విషయంలో అంతగా చేసింది ఏమిలేదు. దున్నేవాడికి భూమి నినాదంతో భూస్వామ్యాన్ని వ్యతిరేకిస్తూ నక్సలైట్ ఉద్యమాలు వచ్చాయి. గ్రామీణ ప్రాంతాలలో కుల పరమైన, వర్గపరమైన అణచివేతలు, పీడన కొనసాగుతూనే ఉంది. ఆర్థిక పరిస్థితి క్షీణించడంతో ప్రజల్లో అసంతృప్తి పెరిగింది. పారిశ్రామిక అశాంతి వలన సమ్మెలు ఉవ్వెత్తున ఎగిసాయి. 1973 మేలో ఉత్తరప్రదేశ్‌లో సాయుధ పోలీసులు సమ్మె చేశారు. 1974 మేలో జరిగిన 22 రోజుల రైల్వే సమ్మెను పరాకాష్టగా పేర్కొనవచ్చు. 1974 జనవరి గుజరాత్‌లో విద్యార్థి ఉద్యమం, 1974 మార్చిలో బీహార్‌లో విద్యార్థి ఉద్యమం, ఈ ఉద్యమానికి జె.పి నాయకత్వం వహించాడు. విస్తరించిన అవినీతికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర హక్కులను కాల రాస్తున్న ఇందిరాగాంధీని గద్దె దించాలని దేశ వ్యాప్తంగా ఉద్యమం నిర్వహించాలని జె.పి. పలు ప్రాంతాల్లో సభలు నిర్వహించాడు.

ఇందిరా గాంధీ ఎన్నిక చెల్లనేరదని అలహాబాద్ హైకోర్టు జస్టిస్ సిన్హా 1975 జూన్ 12న ఇచ్చిన తీర్పు భారత రాజకీయాలను అతలాకుతలం చేసింది. ఇందిరా గాంధీ రాజీనామా చేసేందుకు తిరస్కరించింది. సుప్రీం కోర్టుకి అప్పీలు చేసింది. ఇందిక రాజీనామా డిమాండు చేస్తూ దేశవ్యాప్త ప్రచారోద్యమం జరిగింది. ఈ నేపథ్యంలో ఇందిరా గాంధీ జూన్ 26న 'అత్యవసర పరిస్థితి' ప్రకటించింది. భారత బడా బూర్జువా వర్గం ఎదుర్కొనే సవాళ్లు, ఇందిరాగాంధీ ఎదుర్కొనే

సవాళ్లు ఒకటిగా మారాయి. ఇందిరా గాంధీని రాజీనామా చేయ వద్దని బడా పారిశ్రామిక, వాణిజ్యవేత్తలు ఐదువందల మంది ర్యాలీ చేయడం జరిగింది.

### 9. అత్యవసర పరిస్థితి తదనంతరం

అత్యవసర పరిస్థితిని 1977లో జనవరి 18న రద్దుచేస్తూ ఇందిరా గాంధీ లోక్‌సభకు మార్చిలో ఎన్నికలు ప్రకటించింది. రాజకీయ ఖైదీలను విడుదల చేసింది. పత్రికలపై సెన్సార్‌షిప్ రద్దుచేసింది. ఎన్నికల్లో జనతా పార్టీ దాని మిత్ర పక్షాలు ఘనవిజయం సాధించాయి. పట్టణ మధ్యతరగతి, ప్రాంతీయ బూర్జువా, వాణిజ్య వ్యాపార వర్గాలు, గ్రామీణ సంపన్న రైతులు జనతా పార్టీ పునాది. మొరార్జీ దేశాయ్ మార్చి 23న ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేశాడు. ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించే కొన్ని చర్యలు చేపట్టింది. కేంద్ర రాష్ట్రాల శాసనాల చట్టబద్ధతని సమీక్షించే సుప్రీం కోర్టు, హైకోర్టు హక్కులు పునరుద్ధరించబడ్డాయి. ఆది నుంచి జనతా పార్టీ పాలనలో వివిధ భాగస్వామ్య పార్టీల మధ్య పరస్పర అపనమ్మకముంది. ఏ వర్గానికావర్గం అధికారంలో అధిక వాటా కొరకు డిమాండ్ చేశాయి. మొత్తంగా బడా బుర్జువా వర్గానికి పెద్ద సవాలుగా మారింది. చరణ్‌సింగ్ ధనిక రైతు ప్రతినిధిగా ఆ వర్గ ప్రయోజనాల కొరకు డిమాండ్ చేయసాగాడు, మరికొందరు ప్రాంతీయ బూర్జువా పక్షాన రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు ఇవ్వాలన్నారు.

జనతా ప్రభుత్వం 1979 జులై వరకు అధికారంలో కొనసాగినప్పటికీ జనతా పార్టీ క్రమంగా విచ్ఛిన్నమవడం ప్రారంభమయింది. జనతాపార్టీ పాలనాశక్తిపై సన్నగిల్లిన విశ్వాసం ప్రజల ఆగ్రహంగా మారడం మొదలయింది. జనతా ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ, రాజకీయంగా జనతా ప్రభుత్వాన్ని కూలదోయడంలో, జనతా పార్టీని చీల్చడంలో కీలక పాత్ర వహించి 28 జూలై 1979న ప్రధాని పదవి దక్కించుకున్న చరణ్ సింగ్ ప్రభుత్వం కూడా డిసెంబర్ 1980లోనే పతనమైంది.

జనవరి 1981లో జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో ఇందిరా గాంధీ ఘన విజయం సాధించి తిరిగి అధికార పీఠాన్ని అధిష్టించింది. అధికారంలోకి రాగానే ఇందిరా గాంధీ బడా బూర్జువా వర్గానికి చాలా రాయితీలు ఇచ్చింది. ఒక వర్గాన్ని మరో వర్గంపైకి ఉసికొల్పి తన అధికారం కాపాడుకునే చతురత ఆమెకుంది. ఆర్థిక వ్యవస్థ పుంజు కోలేదు. దేశ వ్యాప్త ఉద్యమాలు వచ్చాయి. ఐఎంఎఫ్ నుండి 500 బిలియన్ డాలర్ల అప్పు తెచ్చింది. ధనిక రైతు ఉద్యమాలు ఉత్తర, దక్షిణ, పశ్చిమ భారతదేశంలో పెద్దఎత్తున వచ్చాయి. ఇందిరాగాంధీ కేంద్రీకృత పాలనకు వ్యతిరేకంగా పంజాబ్, అస్సాం రాష్ట్రాలలో సాంస్కృతిక, మత, భాష పరమైన ఉద్యమాలు వచ్చాయి. 31 అక్టోబర్ 1984న దారుణ హత్యకు గురైంది.

ఇందిరాగాంధీ హత్యానంతరం ఢిల్లీలోను, ఉత్తర భారత దేశంలోని కొన్ని ప్రాంతాలలో వికృతమైన మతతత్వ రూపం తీసుకొన్నది. సిక్కులపై దాడులు జరిగాయి. 1984 అక్టోబర్ 31న రాజీవ్ గాంధీ దేశ ప్రధాని అయ్యాడు. రాజీవ్ ప్రధాన మంత్రి అయిన రెండు వారాలలో భోపాల్ గ్యాస్ దురంతం సంభవించింది. బాధితులకు సహాయ మందించడంలో విఫలమయ్యాడు. యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీకి అనుకూలంగా వ్యవహరించాడు. దేశీయ మార్కెట్‌లోకి విదేశీ కార్పొరేట్ సంస్థలను అనుమతించాడు. ఆర్థిక రంగంలో సరళీకరణ చేపట్టి, దిగుమతి సుంకాలు తగ్గించాడు. విద్యా విధానంలో కులీన స్వభావాన్ని పెంచే నవోదయ పాఠశాలలను ప్రారంభించాడు. 1989 ఎన్నికల నాటికి బోఫోర్స్ అవినీతితో రాజీవ్ ప్రాధాన్యత తగ్గింది. మెజారిటీ స్థానాలు రాలేదు.

వి.పి. సింగ్ నేషనల్ ఫ్రంట్ ఏర్పాటు చేసి బయటి నుంచి బిజెపి, వామ పక్షాల మద్దతుతో 11 నెలలు మాత్రమే ప్రధానిగా ఉండగలిగాడు. 1989లో విపి సింగ్ ప్రధాన మంత్రిత్వాన్ని చంద్రశేఖర్ వ్యతిరేకించాడు. మరోవైపు రైతు ప్రతినిధిగా చరణ్ సింగ్‌కి ప్రధాని కావాలన్న వాంఛ ఉంది. ఎన్నికలు ముగియగానే వ్యక్తిగత ఆకాంక్షలు, పెంచుకున్న స్వాభిమానాలు, వర్గ ఆకాంక్షలు పెల్లుబికాయి. బిజెపి రామ రథయాత్ర పేరుతో హిందూ జాతీయ వాదాన్ని బలపర్చే ప్రయత్నం ఆరంభించడంతో, వి.పి. సింగ్ వెనుకబడిన కులాలకు ప్రయోజనం కలిగించే మండల్ కమీషన్ నివేదికను ముందుకు తేవడంతో బిజెపి మద్దతు ఉపసంహరించుకుంది. జనతాదళ్ లోని ఒక వర్గం చంద్రశేఖర్ నాయకత్వంలో ఏర్పడింది. దీనికి కాంగ్రెస్ మద్దతు ఇవ్వడంతో చంద్రశేఖర్ 1990 నవంబర్ లో ప్రధాని అయ్యారు. అయితే ఆరు నెలలు పూర్తికాకముందే కాంగ్రెస్ తన మద్దతు ఉపసంహరించు కోవడంతో 1991లో మధ్యంతర ఎన్నికలు వచ్చాయి.

### 10. పి.వి. నరసింహారావు కాలంలో

కాంగ్రెసుకు ఎన్నికల్లో మెజారిటీ రాకపోయినా ఏకైక పెద్ద పార్టీగా అవతరించింది. చిన్న పార్టీల మద్దతుతో పి.వి. నరసింహారావు 1991 జూన్ 21న ప్రధాన మంత్రిగా పదవి స్వీకారం చేశారు. 1992లో బాబ్రీ మసీదు విధ్వంసం జరిగింది. ఐదు సంవత్సరాలు ప్రధానిగా ఎన్నో అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటూనే కొనసాగారు. పి.వి. నరసింహారావు జూలై 1991 నుండి భారత దేశంలో నూతన ఆర్థిక సంస్కరణలు ప్రారంభించారు. ఈ సంస్కరణలను స్థిరీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ, విశ్వీకరణ వంటి పేర్లలో పిలిచారు. ఆర్థికాభివృద్ధి 3.5 శాతం దాటటం లేదని, విదేశీ మారక ద్రవ్యం నిల్వలు అంతరించాయని, ఈ సమయంలో ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్ ప్రపంచ బ్యాంక్, ఐఎంఎఫ్ ల నుండి రుణం తెచ్చారు. ప్రపంచ ద్రవ్య పెట్టుబడి ప్రయోజనార్థం మన మార్కెట్‌ను బార్ల తెరిచారు. రూపాయి విలువ తగ్గించారు. మన వనరులు అప్పగించారు. స్వేచ్ఛగా లూటీ చేసుకోవడానికి కావల్సిన సదుపాయాలు అన్ని సమకూర్చారు. ప్రభుత్వ రంగ సంస్థల వాటాల విక్రయం, దిగుమతి సుంకాల తగ్గింపు, ఏ పరిశ్రమలోనైన పెట్టుబడులు పెట్టడానికి అనుమతించారు. ద్రవ్యలోటు తగ్గింపు పేరుతో సంక్షేమ పథకాలకు కోత విధించారు. ఎగుమతుల పేరుతో కార్పొరేట్లకు కోట్లాది రూపాయల రాయితీలు యిచ్చారు. పన్ను మినహాయింపులు, నీటి సరఫరా, భూములు, ఖనిజాలు అప్పనంగా అప్పగించారు. కార్మిక చట్టాలు సవరించి, హక్కులు హరించారు. దేశీయ పెట్టుబడి తగ్గింది, విదేశీ పెట్టుబడి పెరిగింది. ప్రజావసరాలు తీర్చవల్సిన ప్రజాసేవారంగాలన్నీ ప్రైవేటీకరించబడ్డాయి. మార్కెట్ ప్రయోజనమే సమాజ ప్రయోజనంగా ప్రచారం జరుగుతుంది.

**11. సంకీర్ణ రాజకీయాలు**

1996 మే లో జరిగిన ఎన్నికల్లో, మార్చి 1998లో జరిగిన ఎన్నికల్లో, 1999 మేలో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ మెజారిటీ సాధించలేదు. ఎ.బి. వాజ్‌పాయ్ 16-5-1996 నుంచి 1-6-1996 వరకు, హెచ్‌డి దేవెగౌడ 1-6-96 నుంచి 20-4-1997 వరకు, ఐకె గుజ్రాల్ 21-4-1997 నుంచి 19-3-1998 వరకు, ఎ.బి. వాజ్‌పాయ్ 19-3-98 నుంచి 21-5-2004 వరకు ప్రధానిగా కొనసాగారు. 1984 లోక్‌సభ ఎన్నికల్లో కేవలం రెండు స్థానాలు కలిగి ఉన్న బిజెపి హిందుత్వ ముసుగులో 1998, 1999 ఎన్నికల్లో అధిక స్థానాలు పొందగల్గింది. 1999 ఎన్నికలకు ముందే బిజెపి, ఎన్‌డిఎ పేరుతో ఒక కూటమిని ఏర్పాటు చేసుకొని విజయవంతమైంది. 1991లో కాంగ్రెస్ ఆరంభించిన నూతన ఆర్థిక విధానాలను మరింత వేగవంతంగా నడిపించింది. 2004 ఎన్నికల్లో ఇండియా వెలిగి పోయిందన్న ప్రచారం ప్రజలనుంచి తిరస్కారానికి గురయింది. ఈ నేపథ్యంలో 2004లో సోనియా నేతృత్వంలో కాంగ్రెస్ పార్టీ ప్రగతిశీల ఐక్యకూటమి (యూపిఎ)ని ఏర్పాటు చేసుకొని 2004లో, 2009లో విజయం సాధించింది. ఇప్పుడు అధికారంలో మన్మోహన్ ప్రధానిగా ప్రభుత్వం కొనసాగుతుంది.

యూపిఎ పాలకులు అమెరికా సామ్రాజ్యవాదానికి సాష్టాంగ పడుతున్నారు. సామ్రాజ్యవాదుల కోర్కెలు తీర్చటానికి భారత ప్రజల ప్రయోజనాలను బలి పెడుతున్నారు. 2005లో చేసుకున్న వ్యూహాత్మక సైనిక ఒప్పందం, అణుసరఫరా ఒప్పందం, అణు ఇంధన సరఫరాలకు అమెరికా, ఫ్రాన్స్, రష్యాలతో చేసుకున్న ఒప్పందాలు, అణు ప్రమాదాల సందర్భంలో నష్టపరిహార చెల్లింపు బాధ్యత నుండి విదేశీ కంపెనీలను మినహాయించే చట్టం, ఇటీవలి కోపెన్ హాగెన్‌లో వాతావరణ ఒప్పందం, 2012 అక్టోబర్‌లో ప్రకటించిన సంస్కరణలు రిటైల్ రంగంలోకి, భీమారంగంలోకి, ప్రసార మాధ్యమంలోకి, ఫించన్ రంగంలోకి ఆహ్వానించిన విదేశీ పెట్టుబడులు, ఇవన్నీ ప్రజల ప్రయోజనాలకు హాని కరమైనవి. నేటి రాజకీయ స్థితి, సామ్రాజ్యవాదానికి లొంగి ఉన్న, ఫ్యూడలిజంతో పెనవేసుకున్న పెట్టుబడిదారీ సంబంధాలు, భారత ప్రజలను దారిద్ర్యంలోకి, బానిసత్వంలోకి నెట్టివేస్తున్నాయి.

**12. రాజకీయ పార్టీలు - స్వభావం**

మన దేశంలో 1935 భారత ప్రభుత్వ చట్టం క్రింద రాష్ట్ర శాసన సభలకు జరిగిన ఎన్నికల్లో క్రమబద్ధమైన పార్టీ వ్యవస్థ ఆరంభమైంది. జాతీయ కాంగ్రెస్, ముస్లిమ్ లీగ్, హిందు మహాసభ, భారత కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలు వలసకాలంలోనే ప్రారంభమైనాయి. వలసానంతరం అనేక నూతన పార్టీలు ఉద్భవించాయి. ఆధునిక ప్రజాస్వామ్య రాజ్యాల్లో రాజకీయ పార్టీలు తప్పనిసరి. ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థలో రాజకీయ పార్టీలు ఒక ఉపవ్యవస్థ. ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం పనితీరు రాజకీయ పార్టీల పాత్రపైనే ఆధారపడి ఉంటుంది. రాజకీయ పార్టీలు ప్రయోజనాన్ని సమీకరించే సంస్థలుగా, ప్రజాభిప్రాయానికి మెరుగులు దిద్దే సంస్థలుగా, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ప్రజల తీర్పును కోరే సంస్థలుగా పనిచేస్తాయి. ఓటర్లను చైతన్యవంతం చేయడం, వారిని ప్రభావితం చేయడం, ఎన్నికల్లో పాల్గొనడం, ఎన్నికల ప్రణాళికల్లో పేర్కొన్న విధానాలను, కార్యక్రమాలను అమలులో ఉంచడానికి ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడం అనేవి రాజకీయ పార్టీల ప్రాథమిక విధులు.

ప్రజాస్వామ్యంలో ప్రజల స్వయంపాలనకు వీలు కల్పించే ప్రజాస్వామిక సాధనాలే పార్లమెంటు, శాసన సభలు. ప్రజలు తమ ప్రతినిధుల్ని ఎన్నుకొని, తమను తాము పరిపాలించుకోవడానికి మాధ్యమాలుగా ఉపయోగపడేవే రాజకీయ పార్టీలు. ఎన్నికల ద్వారా అధికారంలోకి వచ్చిన తరువాత నిర్దిష్ట విధానాలు, సిద్ధాంతాలు ఆధారంగానే పాలన సాగాలి. రాజకీయ సంబంధాలు వ్యక్తుల మధ్య సంబంధాలు కావు. అవి వర్గాల మధ్య, విశాల జన సముదాయాల మధ్య సంబంధాలు. ఆర్థిక సంబంధాలు వ్యవస్థ పునాది అయితే భావజాల సంబంధాలైన రాజకీయ సంబంధాలు ఉపరితల నిర్మాణంలో భాగం. అన్నిటికంటే పునాదితో అతి దగ్గరైన, అత్యంత పటిష్టమైన సంబంధాలు కలిగినవి రాజకీయాలే. పునాదిపై ప్రత్యక్షంగా అతి ఎక్కువ ప్రభావాన్ని చూపగలిగేది, దాన్ని రక్షించేది కూడా రాజకీయాలే. రాజకీయాలకు, ఆర్థిక వ్యవహారాలకూ మధ్య ఎందుకీ పీటముడి? ఆర్థిక ప్రాబల్యం గల వర్గం బలప్రయోగం ద్వారానూ, ప్రత్యక్ష పరోక్ష నిర్బంధం ద్వారానూ మాత్రమే శ్రామికులను దోచుకోగలదు. అలా దోచుకోవడం, దోచుకున్నదాన్ని రక్షించుకోవడం రాజ్యాంగ యంత్రం ద్వారా మాత్రమే సాధ్యం. ఆ రాజ్యాంగ యంత్రాంగాన్ని కాపాడేవే నేటి పార్లమెంటరీ రాజకీయాలు.

నాయకుల వ్యక్తిత్వం, ఆకర్షణ, కులం, ప్రాంతం, మతం ఆధారంగా పార్టీలు ఏర్పడటం మరో లక్షణం. అధినాయకునికి విధేయంగా ఉంటూనే గ్రూప్‌లు కడతారు. అత్యంత క్రమశిక్షణ గలిగిన బిజెపి, కమ్యూనిస్టు పార్టీలలో కూడ ముఠాతత్వం కనిపిస్తుంది. ఈ ముఠాతత్వం అంతిమంగా పార్టీల చీలికలకు దారితీయడం అంటు వ్యాధిలా వ్యాపించింది. చీలికలు-కలయికలు మరొక అంశం. అవకాశ వాదం లేదా ఏదో ఒక ప్రయోజనం పార్టీ మార్పిడులకు ప్రధాన కారణంగా చెప్పవచ్చు. 1967 నుండి దేశంలో రాజకీయ మార్పిడుల యుగం ఆరంభమైంది. అధికార దాహంతో కూడా పార్టీ ఫిరాయింపులు జరిగాయి. ఎప్పుడు చీలుతారో, ఎందుకు చీలుతారో అర్థంకాదు. మళ్లీ ఎప్పుడు కలుస్తారో, ఎందుకు కలుస్తారో కూడ అర్థంకాదు.

ప్రాంతీయ పార్టీలకు కాంగ్రెసు, బిజెపి కన్న భిన్నమైన రాజకీయ, పరిపాలన, అభివృద్ధి నమూనా ఏదైనా ఉందా అనే మౌలిక ప్రశ్న ముందుకొస్తుంది. ప్రాంతాల హక్కులు, బడుగుల హక్కులు, పౌర హక్కులు, రాజ్యాధికారం గురించి ప్రాంతీయ పార్టీలు, కులపార్టీలు, మత పార్టీలు, ఉప ప్రాంతీయ పార్టీలు చెప్పే మాటలు ఏవైనా కావచ్చుగాక. కాని ఆచరణలో తమ వాగ్దానాలకు తగ్గ ప్రత్యామ్నాయ నమూనాలు ఏమైనా వారివద్ద ఉన్నాయా? అసలు ప్రత్యామ్నాయాల గురించి వారు ఎప్పుడైనా ఆలోచించారా? అంటే అదేమి లేదని ఆచరణ తెలుపుతుంది.

నేడు ప్రాంతీయ, జాతీయ ప్రభుత్వాల ఏర్పాటులో ఏ ఒక్క పార్టీ తనకు తానుగా ప్రభుత్వం ఏర్పాటుచేయలేని నిస్సహాయస్థితికి

నెట్టివేయబడ్డాయి. 1999 లోక్‌సభ ఎన్నికలకు ముందే బిజెపి మరో 12 పార్టీలతో కలిసి ఒక నేషనల్ డెమోక్రటిక్ అలయన్స్ (ఎన్.డి.ఎ) ను ఏర్పాటుచేసింది. ఈ స్ఫూర్తితోనే 2004 లోక్‌సభ ఎన్నికలకు ముందు కాంగ్రెస్ మరో 11 పార్టీలతో యునైటెడ్ ప్రోగ్రెసివ్ అలయన్స్ (యు.పి.ఎ) ఏర్పాటుచేసి నేడు కేంద్రంలో ప్రభుత్వం ఏర్పాటు చేయగలిగింది.

ప్రపంచీకరణ విధానాలు మొదలైన తర్వాత ప్రాంతీయ, దేశీయ రాజకీయ పార్టీల స్వభావంలో మార్పు వచ్చింది. గతంలో పారిశ్రామిక, వాణిజ్యవేత్తలు రాజకీయ నాయకులను ఆశ్రయించి తమ పనులు చేసుకునేవారు. ఇప్పుడు వారే రాజకీయ నాయకులవుతున్నారు. అలాగే గతంలో రాజకీయ నాయకులు గుండాయిజాన్ని ప్రోత్సహించేది. ఇప్పుడు గూండాలే రాజకీయ నాయకులవుతున్నారు.

ధనవంతులు మరింత ధనవంతులు కావడానికి పేదలు పేదలుగానే మిగిలి పోవడానికి భారత రాజకీయ వ్యవస్థ దోహద పడుతున్నది. సామాజిక ఆర్థిక విషయంలో వివిధ ప్రాంతాల మధ్య తీవ్రమైన స్థాయిలో అసమానతలున్నాయి. మహారాష్ట్ర, తమిళనాడు, గుజరాత్, పంజాబ్ మొదలైన రాష్ట్రాలు పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందితే ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్, ఆంధ్రప్రదేశ్ మొదలైన రాష్ట్రాలు బాగా వెనకబడి ఉన్నాయి. ఇటువంటి ఆర్థికాభివృద్ధికి సంబంధించిన వ్యత్యాసాలు, వెనకబాటుతనం, ప్రాంతీయ ఉద్యమాలకు, ఉప ప్రాంతీయ ఉద్యమాలకు, ఆందోళనలకు దారితీస్తున్నాయి. ఈ తరహా ప్రాంతీయ, ఉప ప్రాంతీయ వాదాలు దేశ ఆర్థిక, సాంఘిక అంశాలను ప్రభావితం చేస్తున్నాయి. ప్రాంతీయ సంపన్న వర్గాలు, కులాలు తమ రాజకీయ ఆకాంక్షలు నెరవేర్చుకొని రాజకీయ అధికారం పొందడానికి తోడ్పడుతుంది. ఈ అసమానతలు దేశ రాజకీయాల్లో ఆయా ప్రాంతాల ప్రజల ఆసక్తులను వ్యక్తీకరిస్తున్నాయి.

**13. జాతులు – కులం – వర్గం – మతం**

అధికారమార్పిడి సందర్భంలోనే దేశంలో మత ఘర్షణలు జరిగాయి. మత కలహాలు ఆ తరువాత తరచుగా కొనసాగుతూనే ఉన్నాయి. ఈ మత ఘర్షణల వెనుక సంక్లిష్టమైన సామాజిక ఆర్థిక కారణాలెన్నో ఉన్నాయి. వీటివల్ల సమాజంలో పెరిగిన మతతత్వభావాలు ఈ ఘర్షణరూపంలో బద్దలయ్యాయి. పాలక వర్గ రాజకీయాలు, రాజ్య యంత్రాంగమూ కూడ వీటికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సహకరించాయి. బాబ్రీ మసీదు విధ్వంస చర్య భారత సమాజంలో ఒక దుశ్చర్యగా మిగిలింది. ఈ చర్య ప్రజాస్వామిక వ్యవస్థలోని సమానత్వ భావనల మీద దారుణమైన దాడి జరిగిన దినంగానూ, మన సాంస్కృతిక వైవిధ్యం మీద ఆధిపత్య భావజాలాన్ని బలవంతంగా రుద్దిన దినంగానూ చరిత్రలో నిలిచిపోయింది.

భారత రాజ్యాంగం మతాన్ని రాజ్యం నుండి వేరుచేయలేదు సరికదా, అన్ని మతాలకు సమ ప్రాధాన్యత ఉంటుందని పేర్కొంది. ఫలితంగా భారతదేశ ప్రత్యేక స్వభావం ఆచరణలపై ప్రత్యక్ష ప్రభావం చూపుతున్నది. భారతదేశంలో ముందుగా ఫ్యూడలిజాన్ని ధ్వంసంచేసి, ఆ తరువాత పెట్టుబడిదారీ విధానం నిర్మించబడలేదు. అది పెట్టుబడిదారీ విధానానికి ముందున్న సామాజిక నిర్మాణాలపై రుద్దబడింది. ఇది భారత పాలక వర్గాల పొందిక స్వభావాన్ని ప్రతిఫలిస్తుంది. 1947లో బ్రిటిష్ వారి నుండి అధికారాన్ని స్వీకరించిన బడా బూర్జువావర్గం ప్రజల తిరుగుబాటు విప్లవ స్వరూపం తీసుకొనకుండా అడ్డుకోవడానికి, ప్రధానంగా గ్రామీణ భారతదేశంపై అదుపును పటిష్టం చేసుకొవడానికి, భూస్వామ్యవర్గంతో రాజీపడి, రాజ్యాధికారంలో వారిని జూనియర్ భాగస్వాములుగా చేర్చుకోవాలని నిర్ణయించారు. నూతన ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వంలో ఫ్యూడల్ భూస్వాముల కలయికతో ఏర్పడింది.

పెట్టుబడిదారీ విధానం ముందునాటి సామాజిక నిర్మాణాలలో వేళ్లూనుకొన్న తిరోగామి సిద్ధాంతాలను, ఆచారాలను ఉద్దేశపూర్వకంగా ఎంపికచేసుకొని, వాటితో మమేకమై, వాటికి కొత్తజీవితాన్ని యిచ్చింది. అవి ప్రజలను విభజించి వుంచేందుకు, పాలనకు వర్గపరమైన సవాళ్లు ఎదురుకాకుండా చూసుకొనేందుకు భారతబూర్జువాలకు అవసరమైన ఆయుధాలను సమకూర్చింది.

మన దేశంలో అసంపూర్తిగా జరిగిన పారిశ్రామీకరణ ఫలితంగా పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రవేశానికి ముందున్న పాత ఆర్థిక వ్యవస్థ నాటి చేతి వృత్తులు, గ్రామీణ వృత్తుల అవశేషాలు కొనసాగుతున్నాయి. అంతేకాకుండా లోపభూయిష్టమైన భూసంబంధ చట్టాల మూలంగా గ్రామీణ రైతాంగం పరిస్థితి మారలేదు. పాశ్చాత్య దేశాల మాదిరిగా కాకుండా ఇక్కడ బూర్జువా వర్గం, మధ్యతరగతితో పాటు సంప్రదాయ వర్గాలతో కలిసి సహజీవనం సాగిస్తున్నది. నూతన అవకాశాలను ఈ పాత ఆధిపత్య కులాలు సమర్థవంతంగా ఉపయోగించుకున్నాయి. మనదేశ ఎన్నికల్లో కులం పేరుతో ఓటరు మద్దతు సమీకరణ సాధారణ లక్షణంగా మారింది. ప్రభుత్వ పథకాలు, విధాన నిర్ణయాలు కుల ప్రాధాన్యత ఆధారంగా రూపొందించబడుతున్నాయి. కులాలు, జాతులు, కొన్ని రాజకీయ పార్టీలకు సంప్రదాయ ఓటు బ్యాంకుగా మారాయి. 1960 దశకం తరువాత క్రమంగా కాంగ్రెసు ప్రాబల్యం తగ్గడం మొదలయింది. ఆర్థిక సంక్షోభం అధికం కావడంతో దేశంలోని పలు ప్రాంతాల్లో మతతత్వం వృద్ధి చెంది ఒక రాజకీయవాదంగా మారింది. వ్యవస్థీకృత హింస, మత సమీకరణలు, వైరుధ్య వాదాలు మతాల మధ్య బలపడ్డాయి. శత్రుత్వాలను ప్రోది చేశాయి. ఈ నేపథ్యంలోనే ప్రజాసమస్యలు పరిష్కరించలేని పాలకులు, పార్టీలు మతం, కులంద్వారా ఓట్లు సంపాదించే వేట మొదలు పెట్టాయి. రాజకీయ పార్టీలు మతతత్వ దోరణులు ఎదుర్కొని మత సామరస్యాన్ని సాధించడానికి బదులు మతతత్వాన్ని, కులతత్వాన్ని పెంచి తమ రాజకీయ అధికారం పటిష్టపరుచుకోవడానికి కృషి చేశాయి, చేస్తున్నాయి.

మన దేశంలో ప్రతి మతంలోనూ అనేక కులాలున్నాయి. మతం సమాజాన్ని అడ్డంగా చీల్చితే, కులం సమాజాన్ని నిలువుగా చీల్చుతుంది. పారిశ్రామీకరణ, పట్టణీకరణ, ఆధునీకీకరణ జరుగుతున్నప్పటికి కులం అన్ని భాగాల్లో లోతుగా నాటుకొని పోయింది. రజనీ కొఠారి "కుల రాజకీయాలు, సాంప్రదాయానికి, ఆధునికతకు వరుసగా ప్రాతినిధ్యం వహించి ఒక దానితో ఒకటి సన్నిహితమవుతున్నాయి. ఈ క్రమంలోనే కులాన్ని రాజకీయం చేయడం, రాజకీయాలను కులాత్మకం చేయడం" జరుగుతుందన్నారు. భారత రాజకీయాలు బయటికి లౌకికంగా కనిపిస్తున్నప్పటికీ, అంతరంగికంగా, కులాత్మకం చెందాయి. కుల

రాజకీయాలు కులాల నాయకులకు ప్రయోజనకారిగా మారాయి గానీ కుల వ్యవస్థ బాధితులకు మేలు చేయలేదు.

భారత రాజ్యం దృష్టిలో దేశంలో ఒకే జాతి ఉంది. అదే భారతజాతి. ఈ జాతి దేశమంతటా విస్తరించి ఉంది. రాష్ట్రాల విభజన, ఏర్పాటు మొదలైనవన్ని పరిపాలన సౌలభ్యం కొరకు అమలు చేయబడ్డ ఆచరణాత్మక చర్య తప్ప, వీటి వెనుక ఖచ్చితమైన సూత్రం ఏమిలేదు. కాకుంటే రాజకీయ అవసరం. అందువలన జాతుల ఉద్యమాలను తీవ్ర నిర్బంధంతో అణచివేసేందుకు వెనుకాడలేదు. కశ్మీర్, ఈశాన్య భారత జాతుల పట్ల కేంద్ర ప్రభుత్వం అనుసరించిన వైఖరి దారుణమైంది. భారతదేశం బహుభాషల నిలయం. మన దేశంలో సుమారు 1800 భాషలు మాట్లాడే ప్రజలు నివసిస్తున్నారు. అయితే రాజ్యాంగం గుర్తింపు లభించిన భాషలు కేవలం 22 మాత్రమే. భారతదేశంలో భాష, కుల, మత రాజకీయాలున్నంత బలంగా వర్గ రాజకీయాలు లేవు. ప్రజాస్వామిక విప్లవం పూర్తికానందున పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి విధానం రద్దుకాలేదు. బూర్జువా వర్గం భూస్వామ్య వర్గంతో రాజీ పడ్డందున పెట్టుబడిదారీ వర్గ ఆధిపత్యానికి సవాలుగా రావలసిన వర్గ ఉద్యమాలు రైతాంగ, ఆదివాసీ, జాతుల, అస్తిత్వ రూపంలో వస్తున్నాయి. సాంఘిక, రాజకీయ సాంస్కృతిక హక్కులు కోల్పోయిన జాతులు, ఉపజాతులు, తెగలు, ఉప తెగలు, మహిళలు, మైనార్టీ వర్గాలు తమపై జరుగుతున్న అన్యాయాలను, పీడనను, దోపిడిని, అణచివేతను, వివక్షతలను తొలగించాలని అనేక ఉద్యమాలు చేస్తున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో స్థానిక సంస్కృతి, ప్రజల జీవనాధారాలు నాశనం చేయబడుతున్నాయి. ఈ క్రమంలోనే కొన్ని జాతులు, ఉప జాతులు, కులాలు, ఉప కులాలు తాము అస్తిత్వ ప్రమాదానికి గురవుతున్నట్లు భావించి దానికి ఎదుర్కొనేందుకు అస్తిత్వ ఉద్యమాలవైపు ఆకర్షితులవుతున్నారు. భారత సమాజంలో ఒకవైపు రోజు రోజుకు పెరుగుతున్న ఆర్థిక అసమానతలు, మరోవైపు అవినీతి, అక్రమ ఆస్తుల సంపాదనతో మునిగి తెలుతున్న రాజకీయ నాయకగణం వల్ల ప్రజా సంక్షేమం కొడిగట్టుతుంది.

**14. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ – పర్యవసానాలు**

ప్రభుత్వరంగానికి ప్రాధాన్యతనివ్వాలని 1956లో దేశ పార్లమెంటు ఆమోదించిన పారిశ్రామిక విధానానికి, దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగమే కీలకస్థానంలో ఉండడమనే అంశానికి, స్వావలంబనకు తిలోదకాలిచ్చే ఆర్థిక సరళీకరణ విధానాలు ఇందిరాగాంధీ హయాంలోనే దేశంలోకి ప్రవేశించాయి. రాజీవ్‌గాంధీ పాలనలో అవి ఊపందు కున్నాయి. అయితే ఈ విధానాల విశ్వరూపం ఆవిష్కృతమయింది మాత్రం పివి. నరసింహరావు హయాంలో. ఆర్థికమంత్రి మన్మోహన్ సింగ్ చొరవతో 1991లో ఐఎంఎఫ్ అప్పును తీసుకున్నప్పుడు వారి షరతులకు కూడా మన దేశం తలొగ్గింది. ఈ షరతుల్లో భాగంగా 1) మార్కెట్లపై నియంత్రణల ఎత్తివేతకు 2) పబ్లిక్ రంగ సంస్థల ప్రైవేటీకరణకు 3) ప్రజా సంక్షేమ కార్యక్రమాల్లో కోతకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. మన రాజ్యాంగ మౌలిక సూత్రాలయిన సామాజిక న్యాయం, సమానత్వం, స్వయం పోషకత్వం అనే ఉన్నతాదర్శాలకు తిలోదకాలిచ్చే దిశలో ఈ సరళీకరణ క్రమం కొనసాగింది. పాలకవర్గ పార్టీ కాంగ్రెసైనా, బిజెపీ అయినా గుత్త పెట్టుబడి అనుకూల విధానాలనే అనుసరిస్తోంది.

1980లలో అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఆధిపత్యంలోకి వచ్చిన తర్వాత ప్రపంచ వ్యాపితంగా జాతీయ రాజ్యాలు బలహీనమయ్యాయి. వాటి స్వయం ప్రతిపత్తి బలహీనపడింది. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఇష్టాయిష్టాలకనుగుణంగా వ్యవహరించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వాలు మార్కెట్ శక్తులకు తోడ్పడాలి తప్ప ఆటంకం కలిగించకూడదు. అవి ప్రైవేటు ఆస్తి రక్షణకూ, కాంట్రాక్టులు అమలు జరిపించడానికీ, శాంతి భద్రతల పరిరక్షణకూ పరిమితం కావాలి. ద్రవ్య పెట్టుబడికి మేలు జరిగే వాటిల్లోనే ప్రభుత్వ జోక్యం ఉండాలి. మిగిలిన వాటినన్నింటినీ మార్కెట్‌కు వదిలివేయాలి. ఇందుకు గాను ప్రభుత్వం పాత్ర పూర్తిగా మారిపోవాలి. పెట్టుబడికి ప్రోత్సాహంగా ఉండేలా ఆంక్షలు తొలగించాలి. పన్నులు తగ్గించాలి. ప్రైవేటీకరణ చేయాలి. లేబర్ మార్కెట్ పట్టువిడుపులుగా మారాలి. ద్రవ్యలోటు తగ్గాలి. ఖర్చులు తగ్గించుకోవాలి. పొదుపు చర్యలు పాటించాలి. అంటే సబ్సిడీలు తొలగించాలి. విద్యా, వైద్య తదితర సేవలు ప్రైవేటీకరించాలి. ప్రభుత్వం ఇచ్చే సేవలకు వినియోగ రుసుములను వసూలు చేయాలి. సంక్షేమ పథకాలను కుదించాలి. ద్రవ్య సంబంధ నిర్ణయాలపై అధికారాన్ని కేంద్ర బ్యాంకుకు ఇచ్చారు. ఎవరికీ జవాబుదారీ కాని ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు, డిఎఫ్ఐడి, ఎడిబి వంటి అంతర్జాతీయ సంస్థల షరతులు అమలు చేస్తున్నారు.

ప్రపంచీకరణ ఆర్థిక సంస్కరణలు ప్రారంభించి 2011 నాటికి రెండు దశాబ్దాలు గడిచాయి. ఈ రెండు దశాబ్దాలలోనూ ఏ పార్టీ అధికారంలో వున్నా కేంద్ర ప్రభుత్వం సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలను అమలు చేసింది. బడా వ్యాపార సంస్థలు, పట్టణ కులీనులు ఈ సత్వర ఆర్థికాభివృద్ధి ఫలితాలను, అనుభవిస్తుంటే, పట్టణ ప్రాంతాలలోని శ్రామిక వర్గం దిగువ మధ్య తరగతి, గ్రామీణ ప్రాంతాలలోని దాదాపు అన్ని వర్గాల ప్రజల జీవన అవకాశాలు కుదించబడినాయి. ఒకవైపున ఉన్నత వర్గాల సౌభాగ్యం, మరోవైపున శ్రామిక ప్రజలలో అధికులను మరింత దోచుకొని నిర్భాగ్యతకు గురిచేయడం అన్నవి భారతదేశంలో ప్రపంచీకరణ విధానాలకు ఒక సంకేతంగా మారాయి.

కీలక పరిశ్రమల నుండి ప్రభుత్వ ఆజమాయిషీని తొలగిస్తూ ప్రైవేటు వాటికి పెద్దపీట వెయ్యడం మొదలెట్టారు. సామాజిక కార్యక్రమాలకు ప్రభుత్వనిధులను తగ్గించారు. విద్యావైద్య రంగాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యం చేసి పేదలకు తిండిగింజలు కూడా దక్కకుండా చేసి వాళ్ల ఉసురు తీస్తున్నారు. ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరణ చేసి స్వదేశీ, విదేశీ పెట్టుబడిదారు లకు ప్రజల సొమ్మును ధారాదత్తం చేసారు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, దేశ ఆర్థిక వ్యవస్థను బార్లాతెరచి ఇష్టారీతిన దోచుకోండంటూ స్వదేశీ, విదేశీ పెట్టుబడి దారులను ఆహ్వానించారు.

కేంద్రం అన్ని అధికారాలను గుప్పిట్లో పెట్టుకొని దేశ సమాఖ్య వ్యవస్థను ఏకస్వామ్య వ్యవస్థ స్థాయికి దిగజార్చింది. ప్రజలకు బాధ్యత వహించే పార్లమెంట్‌లు, శాసనసభలకు బయట ప్రధాన నిర్ణయాలు జరుగుతున్నాయి. ఈ సంస్థలు అంతకంతకూ చర్చా వేదికలుగా

మార్చివేయబడ్డాయి. కార్పొరేట్ శక్తులను నియంత్రించడానికి బదులు ప్రభుత్వ పాలనాధికార యంత్రాంగం ఫెసిలిటేటర్లుగా వ్యవహరిస్తున్నది. ప్రత్యేక ఆర్థిక మండళ్ల పేరిట లక్షలాది ఎకరాల పంట భూములను సైతం రైతుల నుండి బలవంతంగా లాక్కుంటున్నది. ఆనకట్టలు, మైనింగ్ పేరిట అటవి భూములను లాక్కొని ఆదివాసీలను నిర్వాసితులను చేస్తున్నారు. తీర ప్రాంతంలో థర్మల్, అణు విద్యుత్ కేంద్రాలను స్థాపించి లక్షలాది మత్స్యకారుల జీవితాలను ఛిద్రం చేస్తున్నారు.

వ్యవసాయ రంగం విధానం కూడా మారిపోయింది. మార్కెట్లకు, ఎగుమతులకు అవసరమైన వాటినే పండించే దిశగా వ్యవసాయరంగాన్ని మార్చివేశారు. వ్యవసాయ రంగానికి ప్రభుత్వ మద్దతు ఉపసంహరించే ప్రపంచీకరణ వ్యూహం చిన్న రైతులను వ్యవసాయం నుంచి తరిమివేస్తున్నాయి. భారతదేశ వ్యవసాయాన్ని దేశ, విదేశ బడా కార్పొరేట్లు హస్తగతం చేసుకోవడానికి మార్గం వేయబడుతున్నది. వ్యవసాయ రంగం వృద్ధిరేటు, వ్యవసాయేతర రంగం వృద్ధిరేటు మధ్యగల వ్యత్యాసం పెరిగింది. దీంతో వ్యవసాయం, వ్యవసాయేతర రంగాల మధ్య అసమానతలు పెరిగాయి. అన్ని రూపాలలోనూ రంగాలలోనూ అసమానతలు పెరగడానికి ఇదొక ముఖ్యకారణం. అన్ని రాష్ట్రాలలో గ్రామీణ పట్టణ ప్రాంతాల మధ్య, సంఘటిత అసంఘటిత రంగాల మధ్య, ఇంకా ఇతర రంగాలలో అసమానతలు బాగా పెరగాయి.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల వల్ల బాగా లాభపడిన వారు బడా బూర్జువాలే. భారతదేశపు బడా వ్యాపార కుటుంబాల ఆస్తులు గత రెండు దశాబ్దాలలోనూ ఆకాశాన్ని తాకేలా పెరగాయి. డాలర్ కోటీశ్వరుల సంఖ్య (వంద కోట్ల డాలర్లు లేదా సుమారుగా 5000 కోట్ల రూపాయలు) 2003లలో 13 వుంటే 2012 ఫోర్బ్స్ జాబితాలో 61కి చేరింది.

పార్లమెంటరీ వ్యవస్థలు నామ్‌కా వాస్తేగా తయారయినందున ప్రజాప్రతినిధులకు సరళీకరణ విధానాల ద్వారా వారి సంపాదనకు మరిన్ని అవకాశాలు వచ్చాయి. రాజకీయాలు, వ్యాపారం మిళితమై పోయాయి. ప్రైవేటు రంగం వ్యవస్థలోని అన్ని రంగాలకూ, మూలలకు విస్తరించింది. ప్రభుత్వ రంగ సంస్థల ఆస్తులు, సహజ వనరులు కారుచౌకగా అమ్మివేయబడుతున్నాయి. వీటిని స్వాధీనం చేసుకునేందుకు ప్రజాప్రతినిధులకూ, రాజకీయ నాయకులకూ అందరి కంటే ఎక్కువ అవకాశం ఉంది. ప్రభుత్వ పనులన్నీ కాంట్రాక్టర్లకు అవుట్‌సోర్స్ చేయబడుతున్నాయి. కాంట్రాక్టరీకరణ పెరగడంతో కింది స్థాయి వరకు చిన్న చిన్న రాజకీయ నాయకులు కూడా పెట్టుబడిదారులుగా ఆవిర్భవించేందుకు అవకాశాలొచ్చాయి. ప్రజాసంపదనూ, వనరులనూ (భూములు, నీరు, గనులు, వగైరా) స్వాధీనం చేసుకునేందుకు అవకాశాలు మెండయ్యాయి. సేవలన్నీ ప్రైవేటు రంగానికి వదిలేయడం వలన స్వయంగా పెట్టుబడిదారులుగా మారడానికే కాకుండా ప్రైవేటు సంస్థలకు దళారీలుగా మారి వాటాలు పొందడానికి రాజకీయ నాయకులకు అవకాశాలు వచ్చాయి. ముడుపులు, లంచాలు తీసుకుని క్షణాల్లో కోటీశ్వరులు కావడానికి అవకాశాలు పుష్కలంగా వచ్చాయి. ఈ మధ్య బయట పడుతున్న కుంభకోణాల సారాంశమిదే. పార్లమెంటరీ ఎన్నికలకు విపరీతమైన గిరాకీ పెరిగింది. కోట్ల రూపాయల డబ్బుఇచ్చి సీట్లు కొనుక్కుంటున్నారు. ఎన్నికల్లో గెలుపు కోసం కోట్లు ఖర్చు పెడుతున్నారు. రాజ్యం అండతో ఖర్చు పెట్టిందానికన్నా ఎన్నో రెట్లు తిరిగి సంపాదించుకునే అవకాశాలు రావడమే దీనికి కారణం.

### 15. ముగింపు

ఆరున్నర దశాబ్దాలుగా దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు ముసుగులో దారుణాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ వ్యవస్థ తెరచాటున విలువైన ప్రజాధనం దోపిడికి గురవుతోంది. బలా బలాల పరీక్షలు ఎల్లవేళలా కేంద్రంలోని, రాష్ట్రాలలోని ప్రభుత్వాలను తరుము కొస్తున్నాయి. దీనితో ఫిరాయింపులు, ప్రజా ప్రతినిధుల రాజీనామాలు, ఉప ఎన్నికలతో రాజకీయం ఓ విపణి వీధిగా మారుతోంది. అన్ని రాష్ట్రాలలోనూ అవినీతి దుమారాలు లేస్తున్నాయి. అవినీతికి కాదేదీ అనర్హం అన్నట్లు అధికార, ప్రతిపక్షాలు దండిగానే ప్రజాధనాన్ని దోచుకుంటున్నాయి. సగటు మనిషికి చేటు కల్గించే నిర్ణయాలపై ప్రతిపక్షం కేవలం మొక్కుబడి నిరసనలతో కాలం గడుపుతోంది. లక్షలు, వేల కోట్ల కుంభకోణాల విషయంలో ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టేలా వ్యవహరించడం చివరికి ఏదో ఒక విచారణ సంఘం ఏర్పాటుతో సద్దుమణగడం ఒక తంతుగా మారింది. చివరికి ప్రశ్నలు వేయడంలోనూ సభ్యులు లంచాలు ఆరగించారనే అభియోగాలు రావడం, అవి నిర్ధారించ బడటంతో పార్లమెంటరీ రాజకీయాలు భ్రష్టు పట్టాయి. పార్లమెంటరీ రాజకీయాలు అవినీతి కంపుకొడుతున్నాయన్నదీ విస్తృత ప్రజాభిప్రాయం. ప్రజా సంక్షేమాన్ని, దేశ ప్రయోజనాల్ని గాలికొదిలేసి తాము, తమ కుటుంబాలు, బంధువులు, దగ్గరగా ఉన్న అంతరంగికుల ప్రయోజనాల కోసమే రాజకీయాలు చేస్తున్నారన్నది వాస్తవం. వాణిజ్య వేత్తల, పారిశ్రామిక వేత్తల, బ్యూరాక్రాట్స్, రాజకీయనాయకుల ఆస్తులు వందల వేల రెట్లు పెరుగుతుంటే ప్రజల ఆస్తులు మాత్రం తరుగుతున్నాయి.

ప్రభుత్వం ఇదే సమయంలో కాశ్మీర్ , నాగా, మిజో, బోడో, అస్సాం ప్రజలపైన, దండకారణ్యంలో జల్ జంగిల్ జమీన్ కొరకు ఉద్యమిస్తున్న ఆదివాసీల పైన, ఉద్యమకారులపైన నల్లచట్టాలను ప్రయోగించి అక్రమంగా నిర్బంధిస్తున్నది. ప్రజలపైకి సైన్యాన్ని పంపింది. అనేక ప్రాజెక్టుల నిర్మాణాల వలన జీవనాధారాలు కోల్పోతున్న ప్రజలపైన పాశవిక దమన కాండను ప్రయోగిస్తుంది. ఆరున్నర దశాబ్దాలు గడచిపోయినా మౌలికమైన ఏ ఒక్క సమస్య పరిష్కారం కాలేదు. దున్నే వానికి భూమి రాలేదు. అడవిపై ఆదివాసీలకు హక్కులు రాలేదు. అందరికి విద్య, వైద్యం అందని మావిగా మారింది. పేదరికం దిన దినం పెరిగిపోతుంది. వ్యవసాయం గిట్టుబాటు కాక రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఆకలి చావులు పెరిగిపోతున్నాయి. మహిళలపై అత్యాచారాలు, దళితులపై హత్యకాండ నిత్యం కొనసాగుతుంది. ప్రజాతంత్ర హక్కులు హరించబడ్డాయి. మన దేశం "వలస పాలన నుండి పునర్ వలస పాలన"గా మారింది. అమెరికా సామ్రాజ్యవాదం చెప్పినట్లు మన పాలకులు నడుస్తున్నారు. ప్రజల పాలిట శత్రువులుగా సామ్రాజ్యవాదానికి విధేయులుగా ఆర్థిక విధానాలు అమలు చేస్తున్నారు.

సమాన అవకాశాలు కల్పించాలనే ప్రజాస్వామిక ఆకాంక్షలు

నేరవేరలేదు. దీనికి ప్రధాన కారణం పంపిణీలో ఉంది. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ పట్ల ఉన్న అసంతృప్తి, అసహనం, వైమనస్యతలు, పాలకులు – పాలితుల మధ్య సాగుతున్న నిరంతర ఘర్షణలు ప్రజాస్వామ్య తరహా ప్రభుత్వాన్ని రాజకీయంగా అస్థిరమైన వ్యవస్థగా రుజువు చేస్తున్నాయని, భారత పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థలో అవినీతి, నేరమయ రాజకీయాలు, ప్రజాతంత్ర హక్కుల అణచివేత అధికమైందని, సామాజిక పరివర్తనలో రాజ్యం పాత్ర సన్నగిల్లి పోయిందని, అందువల్లే ప్రజలు తమ హక్కులను రక్షించుకోవడానికి ప్రజాస్వామ్య ఉద్యమాలు చేస్తున్నారని రజనీ కొఠారీ విశ్లేషించారు. రాజ్య నియంతృత్వ స్వభావానికి వ్యతిరేకంగా అన్ని రంగాల్లో, అన్ని ప్రాంతాల్లో జనసమీకరణ అవసరం, ఆవశ్యకం అని కొఠారీ భావించాడు. పార్లమెంటరీ ప్రభుత్వాలు ప్రజల ప్రజాస్వామిక హక్కులు కాపాడడంలో ఒక రాజకీయ సంస్థాపర సాధనంగా పనికి రాలేదని నిరూపితమైనందున ప్రజల ప్రజాతంత్ర హక్కులు కాపాడగల సరియైన ప్రత్యామ్నాయ రాజకీయ వ్యవస్థ ఏర్పడే వరకు ప్రజా ఉద్యమాలు, నిరసనలు కొనసాగుతూనే ఉంటాయని ఎ.ఆర్. దేశాయి పేర్కొన్నారు. రాజ్యం వనరులను అవకాశాలను అసమానంగా వర్తింపజేస్తే ఆ సమాజం విచ్ఛిన్నమవక తప్పదని గ్రాంస్కీ హెచ్చరించారు.

దేశంలో ఇప్పటివరకు పార్లమెంటుకు 15 సార్లు ఎన్నికలు జరిగాయి. ఏ ఎన్నికల్లో కాంగ్రేసు పార్టీ 48 శాతం మించి ఓట్లు పొందలేదు. భారత సమాజంలో ఈ నాటికి సామ్రాజ్యవాదం, భూస్వామ్యం, దళారీ బూర్జువా శక్తులు ఆధిపత్యం వహిస్తున్నాయి. భారత పాలకవర్గాలు సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం ప్రయోజనాలను పరిరక్షిస్తున్న దళారీ బూర్జువా భూస్వామ్య వర్గాల ప్రభుత్వం తప్ప ప్రజాప్రభుత్వం ఏ మాత్రం కాదు. భారతదేశంలో ప్రజాస్వామ్యం కేవలం పాలకవర్గాలకు, వాళ్ల పోషకులైన సామ్రాజ్యవాదులకు మాత్రమే ఉన్నది. దోపిడికి గురవుతున్న ప్రజలకు ఉన్నది పీడన మాత్రమేనని ఆరున్నర దశాబ్దాల ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో పార్లమెంటరీ రాజకీయాలు రుజువు చేశాయి. అభివృద్ధి నిరోధకులు, కుహనా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల కల్పిస్తున్న భ్రమల నుండి ప్రజలు బయట పడాలి.

రాజకీయ నాయకత్వానికి, ప్రజలకు మధ్య అగాధం పెరిగింది. ఒక సిద్ధాంతం, భావజాలం పార్టీల రాజకీయాలకు లేకపోవడం వల్లనే అధికారం చేపట్టడం ధ్యేయంగా అవి ఇతర పార్టీలతో పొత్తులు కుదుర్చుకుంటున్నాయి. నేడు రాజకీయాలంటే అధికారం, డబ్బు మాత్రమే. వీటికోసం ఏమేరకైనా రాజీపడుతున్నారు. పార్టీలు ఫిరాయించడం సాధారణమైంది. స్వార్థమే మన వ్యవస్థలో రాజ్య మేలుతుంది. ప్రత్యామ్నాయం లేక ప్రజలు ఏదో ఒక పార్టీకి ఓట్లు వేస్తున్నారు. ప్రస్తుతానికి ఒక పాలక పార్టీని దించి మరో పాలక పార్టీని అందలమెక్కిస్తున్నారు. నీతి బాహ్య రాజకీయాలు వేళ్లూనుకున్నాయి. మార్కెట్ ప్రయోజనమే ప్రజాప్రయోజనంగా మారింది. ప్రపంచ బ్యాంక్ విధానాలకు ప్రజాస్వామ్యానికి మధ్య ఎంత మాత్రం పొసగదనే విషయం స్పష్టమైంది. ప్రజాస్వామ్యం, స్వపరిపాలన, స్వావలంబన ఆకాంక్షలు నామమాత్రంగా మిగిలిపోకూడదని కోరుకునేవారు, పాలక వర్గాల సామ్రాజ్యవాద అనుకూల విధానాలే దేశ సార్వభౌమత్వానికి, ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణానికి పెద్ద ప్రమాదమన్న వాస్తవాన్ని గుర్తించాలి. స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు కోరుకునే దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఉనికి కేవలం పాలక వర్గానికి మేలు చేస్తున్నదా? లేక మొత్తం ప్రజానీకానికి మేలు చేస్తున్నదా? అన్నది ఆలోచించకపోతే అంతకు మించిన ఆత్మవంచన మరొకటి ఉండదు.

గత ఆరు దశాబ్దాలుగా భారత పాలకులు అనుసరిస్తున్న రాజకీయార్థిక విధానాలు దేశ సంపదను సహజ వనరులను సామ్రాజ్యవాద బహుళజాతి గుత్తసంస్థలకు, భారత దళారీ బూర్జువా వర్గానికి, భూస్వామ్య వర్గానికి కట్టబెట్టాయి. ఈ విధానాల పర్యవసానంగా దేశంలో జరిగినందని చెబుతున్న అభివృద్ధిలో సింహభాగం పై మూడు వర్గాల చేతిలోనికే వెళ్లింది. ఈ మూడు వర్గాలు సంఘర్షిస్తూ, రాజీపడుతూ పరస్పరం సహకరించుకొంటూ దేశంలోని అశేష ప్రజానీకాన్ని, శ్రామిక ప్రజలను అణిచి ఉంచుతున్నాయి. మధ్య తరగతి వర్గానికి కొన్ని తాయిలాలు, అవకాశాలు ఇస్తూ భ్రమలల్లో ముంచెత్తుతున్నాయి. గత రెండు దశాబ్దాల సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల అమలు తరువాత ఇవి ప్రజావ్యతిరేకమైనవేనని రోజు రోజుకు మరింత స్పష్టమవు తుంది. ఈ నేపథ్యంలో స్వాతంత్ర్యం, స్వేచ్ఛ ఎవరికి లభించాయి? అభివృద్ధి ఫలాలు ఎవరికి దక్కుతున్నాయి అనేది అవగతం చేసుకొని నిజమయిన స్వేచ్ఛా స్వాతంత్రాల కొరకు, సహజ వనరులపై సమాజ ఆధిపత్యాన్ని సాదించేందుకు ప్రజాభిమానులు, దేశభక్తులు, ప్రజాతంత్ర వాదులు, బుద్ధి జీవులు ప్రజాస్వామిక ఉద్యమాలకు, వర్గ ఉద్యమాలకు అండగా నిలబడడాన్ని తమ కర్తవ్యంగా స్వీకరించాలి.

**ఉపయుక్త గ్రంథాలు**


- Indian Constitutional Development, RG Aggrawal.
- Indian Government And Politics - A.S. Narang.
- The Indian Constitution - Corner Stone of Nation- Granville Austin.
- State And Politics In Contemporary India - Moin Shakir.
- Caste, Class And Power - Andre Beteille.
- Politics In India - Rajani Kothari.
- Indian Political System - Hans Raj
- State and Poltics In India - Partha Chattarjee.
- The State, Political Process And Identity - (Ed). Zoya Hasan, Sn Jha, Basheeruddin Khan.
- India's Democracy - (Ed). Atul Kohil.
- State and Society in India - AR Desai
- The State of India's Democracy (Ed) Sumit Ganguly, Larry Diamond, Mare F. Platter.
- India Mortgated - T.N.R.
- The Politics of India since Independance-Paul R. Brass


*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు,
రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# దళిత ఆత్మగౌరవాన్ని ఎత్తిపట్టిన ఉద్యమం

*కారంచేడు మారణకాండ రగిలించిన చైతన్యంతో రాష్ట్రంలో వికసించిన దళిత ఆత్మగౌరవ ఉద్యమాన్నీ, వివిధ ధోరణులనూ, సాహిత్య ప్రతిఫలనాన్నీ, వర్తమాన స్థితినీ అంచనా వేస్తున్నారు* **కె. సత్యనారాయణ**

ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమం లేవనెత్తిన ప్రశ్నలు, పోరాట రూపాలు, నిర్మాణాలు, సైద్ధాంతిక ధోరణులు – స్థూలంగా దళిత ఉద్యమ ప్రాధాన్యతను పరిచయం చేయడం ఈ వ్యాస లక్ష్యం. కారంచేడు హత్యాకాండ (1985)తో ప్రారంభమై, వివిధ అత్యాచార ఘటనల చుట్టూ, నిరసన రూపంలో మొదలై ఒక నిర్దిష్ట నిర్మాణ రూపం తీసుకున్న దళిత ఉద్యమం అనేక సైద్ధాంతిక చర్చల్ని లేపింది, విజయాల్ని సాధించింది, సంక్షోభాల్ని ఎదుర్కొంది. ఉప కులాల అస్తిత్వాల కేంద్రంగా మొదలైన ఉద్యమాలు, వామపక్ష భావజాలంతో ఏర్పడిన ఉద్యమ సంస్థలు, దళిత స్త్రీల ఉద్యమాలు – ఇలా అనేక రూపాలుగా విస్తరించిన దళిత ఉద్యమాన్ని మొత్తంగా వివరించడం, సమీక్షించడం ఒక వ్యాసంలో సాధ్యం కాదు. దానికోసం ప్రత్యేక పరిశోధన అవసరం. ఇప్పటికే జరిగిన పరిశోధనల, పత్రాల ఆధారంగా దళిత ఉద్యమంలో కొన్ని ముఖ్య ఘట్టాల్ని, పరిణామాల్ని, ధోరణుల్ని పరిచయం చేసే చిన్న ప్రయత్నమే ఈ వ్యాసం. మొత్తం నాలుగు ప్రధాన అంశాల్ని 1) కారంచేడు పోరాటం, 2) దళిత ఉద్యమం – సాహిత్యం, 3) దళితులు – ఎన్నికలు, 4) మాదిగ ఉద్యమం, కుల సమస్య పై పని చేయడానికి ఏర్పడిన వామపక్ష ఉద్యమ సంస్థలు – వివరించే ప్రయత్నం జరిగింది.

**కారంచేడు పోరాటం**

కారంచేడు మారణకాండ దళిత ఉద్యమ చరిత్రలో కొత్తమలుపు. దళితుల ఆగ్రహం, నిరసనజ్వాలలు గల్లీ నుంచి ఢిల్లీ దాకా వ్యాపించాయి. మానవ మర్యాద, ఆత్మగౌరవం, సమానత్వం కొత్త నినాదాలుగా ముందుకొచ్చాయి. కుల వ్యవస్థని గతకాలపు సంప్రదాయాల కొనసాగింపుగా, శిథిలమవుతున్న వ్యవస్థ అవశేషంగా భావించడం సరైంది కాదని కారంచేడు ఘటన తేల్చి చెప్పింది. కులం ఒక సజీవ సామాజిక సంబంధంగా, ఆధిపత్యానికి, వివక్షకు, హింసకు సాధనంగా కొనసాగుతుందనడానికి కారంచేడు హత్యలు, హింస, హత్యాకాండ సాక్ష్యాలుగా నిలిచాయి. దళితులపై హింస, హత్యాకాండలను సమర్థవంతంగా తిప్పికొట్టడానికి దళితులే నాయకులుగా ప్రత్యేక దళిత సంస్థలు ఆవిర్భవించాయి. దళిత మహాసభ పుట్టుక, దళిత నాయకత్వం, కార్యకర్తలు గణనీయంగా పెరగడం, దళిత ఉద్యమం, నిర్మాణం రాష్ట్ర వ్యాపితం కావడం – మొత్తం దళిత ప్రజానీకం ఒక సంఘటిత శక్తిగా రూపొందడం కారంచేడు పోరాట ఫలితమే. దళిత సాహిత్య, సాంస్కృతిక ఉద్యమ వికాసానికి, ఫూలే – అంబేద్కర్ కుల వ్యతిరేక ఆలోచనా విధానాల్ని వెలుగులోకి తేవడానికి కారంచేడు పునాదులు వేసింది.

జూలై 16, 1985న కమ్మ యువకులకి, దళిత యువతికి చెరువు దగ్గర జరిగిన చిన్న వివాదంతో కారంచేడు ఘటన మొదలైంది. కారంచేడు గ్రామంలో మాదిగపల్లెకి దగ్గరలో గల చెరువు దగ్గర ఇద్దరు కమ్మ యువకులు పశువుల్ని కడుగుతున్నారు. ఆ పశువుల్ని కడిగిన నీరు, అవి తాగిన కుడితి మంచినీళ్ల చెరువులో కలిసిపోయి నీటిని కలుషితం చేస్తున్నాయని కత్తి చంద్రయ్య అనే దళిత కుర్రాడు అభ్యంతరం చెప్పాడు. కమ్మ యువకులు అతన్ని కొట్టబోగా సువార్తమ్మ అనే దళిత యువతి అడ్డుపడింది. ఆమెను కూడా పలుపుతాడుతో కొట్టబోగా ఆమె నీళ్లకోసం తెచ్చిన బిందెను అడ్డుపెట్టి వారిని ఆపింది. కమ్మ కుల యువకులకి దళిత యువతి అడ్డుకోవడం, బిందెనెత్తడం అభ్యంతరకర ప్రవర్తనగా కనిపించింది. తమ కులాధిపత్యాన్ని ధిక్కరించినట్టయింది. అగ్రకుల కమ్మ కులస్తులు కనిపిస్తే తలదించుకు పోవాల్సిన దళితులు ఎదురుపడి ప్రశ్నించడం నేరమనిపించింది. చుట్టుపక్కల ఏడు గ్రామాల్లోన్ని కమ్మ కులస్తుల్ని కలుపుకొని జూలై 17 ఉదయం మాదిగపల్లెపై బడి విచక్షణారహితంగా దాడులు చేసారు. సుమారు మూడు వేల మంది కమ్మ కులస్తులు బరిసెలు, గొడ్డళ్లు, కత్తులు లాంటి మారణాయుధాలతో దాడిచేసి, పంట పొలాల్లో తరిమి తరిమి వెంటాడి కొట్టి, నరికి దళితుల్ని చంపారు. స్త్రీలపై అత్యాచారం చేసారు. పట్టపగలు జరిపిన ఈ నరమేధంలో ఆరుగురు దళిత పురుషులు మరణించారు. ముగ్గురు దళిత స్త్రీలు అత్యాచారానికి గురైనారు. దళితుల ఆస్తుల్ని లూటీ చేసి ధ్వంసం చేశారు. దళిత కుటుంబాల వారు పారిపోయి దగ్గరలోని చీరాల పట్టణంలోని ఒక చర్చిలో తలదాచుకున్నారు.

కారంచేడు హత్యాకాండ రాష్ట్ర ప్రజానీకాన్ని, దళిత సమాజాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. పెద్ద ఎత్తున నిరసనలు, ఆందోళనలు మొదలయ్యాయి. ఈ సామూహిక హత్యాకాండకు గల కారణాలపై లోతైన చర్చ జరిగింది. కారంచేడు దాడి భూస్వాములు పేద వ్యవసాయ కార్మికులపై చేసిన దాడిగా చూడాలా? ఈ దాడిలో కులం పాత్ర ఉందా? తెలుగు సమాజంలో కారంచేడు ఘటన ప్రాధాన్యతని ఎలా అర్థం చేసుకోవాలి?

కోస్తాంధ్రలో కారంచేడు బాగా 'అభివృద్ధి' చెందిన పెద్ద గ్రామం. పది వేల మంది జనాభా గల ఈ గ్రామంలో కమ్మ కులస్తులు ఆరు వేలకు పైగా ఉంటారు. మొత్తం 1500 మంది దళిత కుటుంబాల్లో వెయ్యి మంది మాదిగలు ఉన్నారు. ఇంకా యాదవులు, రజకులు, ఎరుకల, యానాది, ముస్లింలు తదితరులంతా గ్రామంలో ఉన్నారు. ఆర్థికంగా, సామాజికంగా కమ్మ కులస్తులు ఆధిపత్యంలో ఉన్నారు.

కమ్మ కులస్తులలో ఒక చిన్న వర్గం భూస్వాములుగా ఉన్నారు. ఈ కమ్మ భూస్వాములు పత్తి, పొగాకు లాంటి వాణిజ్య పంటలు పండిస్తున్నారు. పొగాకుని అంతర్జాతీయ మార్కెట్‌కు అమ్ముతున్నారు. వ్యవసాయంలోని మిగులుని సినిమా పరిశ్రమల్లో, పట్టణరంగంలో, కాంట్రాక్టులు చేయడానికి పెట్టుబడిగా వాడుతున్నారు. ఇదే గ్రామంలోని దళితులకు భూమి లేదు. వారు వ్యవసాయ కార్మికులుగా, పాలేర్లుగా, కౌలుదార్లుగా బతుకుతున్నారు. వ్యవసాయరంగంలో వచ్చిన మార్పులు – ప్రధానంగా ఆహార పంటలకు బదులు వాణిజ్య పంటల్ని పండించి, ఎగుమతి చేయడం – కొత్త ఉపాధి అవకాశాల్ని కల్పించాయి. కూలీ రేట్లు గణనీయంగా పెరిగాయి. అలాగే ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలు, రిజర్వేషన్‌లు, ఉపాధి పథకాలు కూడా దళితులకు కొంత మేరకు అందుతున్నాయి. ఈ మార్పులన్నీ దళితుల్ని కమ్మ భూస్వాముల పట్టు నుంచి సడలించి కొంచెం స్వతంత్రంగా వ్యవహరించే వెసులుబాటు కల్పించాయి. కౌలుదార్లుగా, పాలేర్లుగా ఒకే భూస్వామి కుటుంబానికి బానిసలుగా ఉండి, వ్యవసాయ పనులు, ఇంటి పనులు అన్నీ దళితులే చేయాల్సిన స్థితి కొంత సడలింది. తమకు నచ్చిన వారి పొలంలో కూలిపనికి పోయే అవకాశం, పిల్లల్ని చదివించుకునే అవకాశం దళితులకు దొరికింది. కారంచేడు గ్రామంలో, కోస్తా జిల్లాల్లోని అలాంటి అనేక గ్రామాల్లో అగ్రకుల భూస్వాముల పెత్తనం బలహీనపడింది. బహిరంగ ప్రదేశాల్లో (బస్సుల్లో, రైళ్లలో, విద్యా సంస్థల్లో, సినిమా హాళ్లలో, పంచాయితీ సభల్లో) దళితులపై అంటరానితనం, వివక్ష కొంతమేరకు తగ్గింది. మరోమాటలో చెప్పాలంటే సాంప్రదాయ కుల వ్యవస్థ ఏర్పరిచిన కట్టుబాట్లు, ఆచారాలు, శిక్షలు దళితులు పాటించడం లేదు. అలాగే, కులవృత్తులను మాని, ఇతర ఉపాధి అవకాశాల వైపు వెళ్లడం కూడా దళితుల స్థితిగతుల్లో మార్పు తెచ్చింది. అంటరానితనం, వెట్టిచాకిరీ, లైంగిక దోపిడీ నిరాటంకంగా కొనసాగించే పరిస్థితి మారింది. తమ రోజువారీ కూలీ కోసం, తిండి కోసం కమ్మ కులస్తులపై దళితులు ఆధార పడవలసిన అగత్యం లేని స్థితి వచ్చింది. ఒక పక్క కమ్మ భూస్వాములు, ఆ కులంలోని ఇతరులు ఆర్థికంగా బలపడుతున్న సమయంలోనే, దళితులు కూడా సాపేక్షికంగా స్వతంత్రంగా వ్యవహరించ గలిగే స్థితికి వచ్చారు. కారంచేడు హత్యాకాండ తరువాత ప్రజాగాయకుడు గద్దర్ రాసిన పాట 'దళిత పులులమ్మా!' ఈ వైరుధ్యాన్ని చాలా చక్కగా విశ్లేషించింది.

*'కోడెల్లాంటి మరి కుర్రవాళ్లురా*
*సాము నేర్చినరు చదువు నేర్చినరు*
*అరే ఒరే అని ఎవడన్నంటే*
*మాట సక్కగా రానీయంటరు*
*ఉన్న బట్టలు తెల్లగుతుక్కొని*
*మల్లెపువ్వులా పల్లెలుంటరూ*
*ఆస్తుపాస్తులు లేకున్నా మాకు*
*ఆత్మగౌరవం ఉందంటారూ*
*కుర్చీలో కూర్చుని కాఫీ తాగితే*
*వున్నవాళ్లకే కడుపుమంటరా*
*ఎవడబ్బ సొమ్ము మేం తింటలేదురా!*
*మా సొమ్ము మా యిష్టమంటరూ...'*

దళితులు మనుషులుగా బతకడాన్ని – తెల్ల బట్టలేసుకుని, తలెత్తుకొని – ఆత్మగౌరవంతో బతకడాన్ని గుర్తించని, సహించని అగ్రకుల అహంకారమే, కమ్మ దురహంకారమే కారంచేడు హత్యాకాండకు కారణం.

మారుతున్న కుల సంబంధాల కారణంగా దళితులు స్వతంత్రంగా బతకడాన్ని సహించలేని అగ్రకుల దురహంకార శక్తులు దాడులకు, హత్యాకాండలకు దిగుతున్నాయి. దేశంలో బెల్చీ (1977) కీలవేన్మణి (1969) లలో జరిగిన మారణకాండలు, మన రాష్ట్రంలో పాదిరికుప్పం (1983), కారంచేడు (1985), నీరుకొండ (1987), చుండూరు (1991), వేంపెంట (1998), ప్యాపిలి (2003), నిన్నమొన్నటి లక్ష్మింపేట (2012) వరకూ ఒక పరంపరగా సాగుతున్నాయి. ఈ అత్యాచారాల్ని, తరాతరాలుగా దళితుల పై దాడులు, హత్యలకు కొనసాగింపుగా మాత్రమే చూడరాదు. ఈ అత్యాచారాలు గత అరవై ఏళ్ల భారత పాలకుల రాజకీయ, ఆర్థిక విధానాల వల్ల కులాంతరాలు, వైషమ్యాలు మరింత పెరగడం వల్ల జరుగుతున్నాయి. సంప్రదాయ కుల వ్యవస్థ, కట్టుబాట్లు రూపాంతరం చెంది, దళితులపై హింస పెరుగుతుంది. కారంచేడులో కమ్మ – దళిత ఘర్షణలను 1950ల నుంచి అమల్లో ఉన్న భారత రాజ్య ఆర్థిక – రాజకీయ విధానాల నేపథ్యంలో పరిశీలించాల్సిన అవసరం ఉంది. ముఖ్యంగా భూ సంస్కరణల విధానం, హరిత విప్లవం – రెండూ భారత రాజ్యం ప్రవేశపెట్టిన అభివృద్ధి నమూనాలో భాగమే. ఈ విధానాల ఫలితమే భూమిపై ఆధిపత్యం కలిగిన సంపన్నవర్గం ఒకటి తయారైంది.

భూ సంస్కరణల విధానం ద్వారా పేదలకు భూములు పంచి జమీందారీ వ్యవస్థను, కౌలుదార్ల వ్యవస్థను రద్దు చేయాలన్నది ప్రభుత్వ లక్ష్యం. వాస్తవంలో ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల చట్టాలు (1961, 1973) జమీందార్లలాంటి మధ్యవర్తుల వ్యవస్థను రద్దు చేయడం, కౌలు సంస్కరణలు, భూమి సీలింగ్ లాంటి అనే చర్యలు అమలులోకి తెచ్చాయి. ఈ చర్యల వల్ల భూసంబంధాలలో గుణాత్మకమైన మార్పులు రాలేదు. కౌలుదార్లుగా ఉన్న రైతాంగ అగ్రకులాలు (రెడ్డి, కమ్మ, కాపు తదితరులు) భూయజమానులుగా మారడానికి, ఈ కులాలు ఆర్థికంగా మరింత బలపడడానికి భూసంస్కరణలు దోహదపడ్డాయి. అలాగే వ్యవసాయ రంగంలో హరితవిప్లవ విధానాలు ప్రవేశపెట్టారు. హరిత విప్లవ లక్ష్యాలలో శాస్త్రీయ వ్యవసాయ పద్ధతుల ద్వారా వ్యవసాయ దిగుబడి గణనీయంగా పెంచడం ప్రధానమైనది. ఈ శాస్త్రీయ పద్ధతుల్లో ఎక్కువ దిగుబడి ఇచ్చే హైబ్రిడ్ విత్తనాలు, రసాయన ఎరువులు, పురుగుల మందులు లాంటివన్నీ ఉన్నాయి. వ్యవసాయ దిగుబడి పెరిగింది కానీ ఈ విధానం వల్ల ప్రాంతీయ అసమానతలు తీవ్రంగా పెరిగాయి. అంతకంటే ముఖ్యంగా గ్రామీణ ప్రజానీకం మధ్య అంతరాలు పెరిగి, కులపరంగా చీల్చబడ్డారు. నీటి పారుదల సౌకర్యాలు బాగా ఉన్న కోస్తాంధ్రలో హరితవిప్లవ విధానాల అమలు కారణంగా భూమిపై ఆధిపత్యం గల కమ్మ కుల రైతాంగం కులపరంగా సమీకరించబడింది. వ్యవసాయాన్ని ఆధునీకరించాలనే ప్రభుత్వ విధానాల వల్ల ప్రాంతీయ అసమానతలు, కుల అసమానతలు పెరిగాయి. ఆధునిక అభివృద్ధి కుల పరమైన అసమానతల్ని అంతమొందిస్తుందనే వాదన తప్పని కారంచేడు హత్యాకాండతో రుజువయింది.

రాష్ట్రంలో భూ సంస్కరణలు, హరిత విప్లవం కారణంగా భూమిపై ఆధిపత్యం గలిగిన శూద్ర అగ్రకుల రైతాంగం ఆర్థికంగా, రాజకీయంగా బలపడ్డారు. అందుకే ఈ కులాల వారిని ప్రాంతీయ సంపన్న వర్గం (ప్రావిన్షియల్ ప్రాపర్టీడ్ క్లాస్) అని బాలగోపాల్ వ్యాఖ్యానించారు. ఈ వర్గాన్ని కేవలం భూస్వామ్య వర్గమని పిలవడం సరైంది కాదు. ఈ వర్గానికి గ్రామంలో భూమిపై ఆధిపత్యం, వాణిజ్య పంటల ద్వారా వ్యాపారం, తద్వారా వచ్చే మిగులుతో పాటు, పట్టణాల్లో అనేక వ్యాపారాలు (వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు, సినిమా పరిశ్రమ, హోటల్స్, కాంట్రాక్టులు) ఉంటాయి. భూమిపై వచ్చే మిగులును, ప్రభుత్వ అభివృద్ధి ఫలితాలను అనుభవిస్తూ, ఈ వర్గం మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో కూడా ప్రవేశించింది.

కోస్తాంధ్రలో కమ్మ సామాజికవర్గం ప్రాంతీయ సంపన్న వర్గంగా ఎదిగే క్రమంలోనే రాజకీయ అధికారం కోసం అర్రులు చాచింది. 1982లో తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం, దాన్ని స్థాపించిన సినీ నటుడు, కమ్మ కులస్తుడు ఎన్.టి. రామారావు 1983లో ముఖ్యమంత్రిగా ఎన్నిక కావడం ఈ రాజకీయ – ఆర్థిక పరిణామ క్రమాల్లో భాగమే. అప్పటికే సామాజికంగా, ఆర్థికంగా బలపడి ఉన్న కమ్మ సామాజికవర్గానికి రాజకీయ అధికారం తోడైంది. ఈ క్రమంలోనే కారంచేడులో ఎన్.టి. రామారావు వియ్యంకుడు దగ్గుబాటి చెంచు రామయ్య, ఇతర కమ్మ కులస్తుల ఆధ్వర్యంలో దళితులపై పాశవిక హత్యాకాండ జరిగింది.

భారతదేశ రాజకీయ, ఆర్థిక విధానాల నేపథ్యంలో చూసినపుడు ఒక్క కారంచేడు మాత్రమే కాదు, దళితులపై జరుగుతున్న ఊచకోత ఘటనలన్నీ కూడా కుల ఆధారిత సంపన్నవర్గాలకు, పీడిత కులాలైన దళితులకు మధ్య జరుగుతున్నవని అర్థమవుతుంది. ఈ అరవై ఏళ్లలో కుల వ్యవస్థ రూపాంతరం చెంది భూమి, ఇతర వనరులపై ఆధిపత్యం కలిగిన కులాలను మరింత బలపరిచింది. అంటరాని కులాల ప్రజలు సాపేక్షికంగా కొంత స్వతంత్రంగా బతకాలని ప్రయత్నిస్తున్నారు. కుల కట్టుబాట్లని, కుల వృత్తుల్ని చేయడానికి నిరాకరిస్తున్నారు. ఈ నేపథ్యంలో ఆత్మగౌరవంతో తలెత్తుకు తిరుగుతున్న దళితుల్ని అణగదొక్కడానికి అగ్రకులాలు దళితులపై హత్యాకాండల్ని ఒక పథకం ప్రకారం అమలు చేస్తున్నాయి. ఒక దళితుడు ప్రశ్నించాడనో, సినిమా హాలు, స్కూలు లాంటి బహిరంగ ప్రదేశాల్లోకి అడుగు పెట్టాడనో, ఎన్నికల్లో తనకు నచ్చిన వారికి ఓటు వేసాడనో నెపంతో ఆ గ్రామంలో దళిత వాడపై సామూహికంగా దాడి చేయడం ఈ హత్యాకాండలో ముఖ్యమయిన అంశం. మొత్తం దళిత కులానికి పాఠం చెప్పాలి, అపుడే వారి సామాజిక స్థితి (కులప్రకారం)కి అనుగుణంగా నడుచుకుంటారనే వైఖరి అగ్రకులాల దాడుల వెనుకనున్న లక్ష్యం. దళితులపై అత్యాచారం అంటే సామూహికంగా దాడి చేయడం, హింసించడం, లైంగికంగా అత్యాచారాలు చేయడం, గుడిసెల్ని, ఆస్తుల్ని ధ్వంసం చేయడం, నిరాశ్రయుల్ని చేయడం, సాంఘిక బహిష్కరణ చేయడం, ఊరి నుంచి తరిమేయడం, నరికి చంపడం, పిల్లలూ, పెద్దలూ, స్త్రీలనే విచక్షణ చూడకపోవడం అనే అర్థం కారంచేడు, అలాంటి ఇతర ఘోర ఘటనల్ని పరిశీలిస్తే స్పష్టమవుతుంది. ఈ అత్యాచారాలు గతకాలపు సంప్రదాయాల వల్ల మాత్రమే కొనసాగుతున్న కులహింస కాదు. రాజ్య అభివృద్ధి విధానాల వల్ల బలపడిన కులాలు జరుపుతున్న ఆధునిక హింసా రూపంగా అత్యాచార ఘటనలని చూడాల్సి ఉంది. ఈ అర్థంలో కుల ఆధారిత సంపన్న వర్గాలు ఉనికిలోకి రావడం, ఆత్మగౌరవ ఆకాంక్షతో ఉన్న దళిత ప్రజల్ని పాశవిక హత్యలకు గురి చేయడాన్ని మనం పరిశీలించాల్సి ఉంది.

### దళిత మహాసభ

కారంచేడు సంఘటన దళిత ఉద్యమ ఆవిర్భావానికి దారితీసింది. అగ్రకుల దురహంకార శక్తుల పాశవిక హత్యల నుంచి రక్షణ కోసం, మానవ మర్యాద, సమానత్వం కోసం దళితులే నాయకత్వం వహించే ఒక ఉద్యమ అవసరం ముందుకొచ్చింది. 1947 తర్వాత ఎదిగిన, చాలా చిన్నదయినా కీలకమైన దళిత మధ్యతరగతి వర్గం – మేధావులు, చదువుకున్న యువత, ఉద్యోగులు, కార్యకర్తలు – దళిత ఉద్యమ సంస్థ నిర్మాణానికి పూనుకున్నారు. కారంచేడు నెత్తుటి మరకలు ఆరకముందే ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ ఏర్పడింది. దళిత గుర్తింపు (ఐడెంటిటీ) కేంద్రంగా, అంబేద్కరిజం సైద్ధాంతిక అవగాహనగా దళిత మహాసభ ఏర్పడింది. వలస పాలనా కాలంలో, ఆ తరువాత భారత ప్రభుత్వం ఏర్పడ్డ తొలిరోజుల్లో అంటరాని కులాల వారి ఉద్యమాలు, కొన్ని సంస్కరణలు, విద్య, ఉద్యోగాలు కోరుతూ అర్జీలకు, విజ్ఞప్తులకు, సమావేశాలు, నిరసనలకు పరిమితమయ్యాయి. కారంచేడు తర్వాత దళిత ఉద్యమ పోరాట రూపాలు, డిమాండ్లు మారాయి. అగ్రకుల నిందితుల అరెస్టు, రాజ్యం, దాని సంస్థలైన పోలీసుల కుమ్మక్కుపై విమర్శలు, సమాజంలో, రాజకీయ వ్యవస్థలో దళితుల ప్రాతినిధ్యం గురించి ప్రశ్నలు – ఇలాంటివెన్నో కొత్త అంశాల్ని, డిమాండ్లను దళిత ఉద్యమం ముందుకు తెచ్చింది. రాష్ట్ర బంద్, ఛలో అసెంబ్లీ, రైలురోకో లాంటి మిలిటెంట్ పోరాట రూపాలు, పెద్ద ఎత్తున సభలు, సమావేశాలు, గ్రామస్థాయి నుంచి జిల్లా, రాష్ట్ర స్థాయి వరకు జరిగాయి. దళితుల ఉద్ధరణకు, సంక్షేమానికి విజ్ఞప్తులు చేసే దశ నుంచి దళితుల సామాజిక, రాజకీయ స్థానం గురించి ప్రశ్నించడం మొదలయ్యింది. రాజకీయాల్లో కొత్త ఆలోచనలకి, భాషకు కారంచేడు పోరాటం నాంది పలికింది. 'కారంచేడు కమ్మ, కాస్కో నీయమ్మా!' లాంటి నినాదాలు సమాజంలో కులవైరుధ్యాన్ని స్పష్టంగా బయటపెట్టాయి. ఇలాంటి భాష, ఆలోచనలు కొత్తగా అనిపించినా, ఒక కొత్త వాస్తవం కళ్లముందు కొచ్చినట్లు గతకాలపు ఆలోచనల్ని ప్రశ్నిస్తున్నట్లు అనిపించింది.

దళిత మహాసభ వివిధ అభ్యుదయ, ప్రజాస్వామిక సంస్థల్లోను, అంబేద్కర్ యువజన సంఘాల్లోను పనిచేస్తున్న దళిత కార్యకర్తల్ని, నాయకుల్ని ఒక వేదిక మీదకు తెచ్చి దళిత ప్రజల్ని సంఘటిత పరిచింది. కోస్తాంధ్రలో ప్రారంభమైన దళిత మహాసభ రాయలసీమ, ఉత్తరాంధ్ర, తెలంగాణ జిల్లాల్లో కూడా నిర్మాణాలు ఏర్పర్చుకుని పనిచేసింది. అనేక మంది కొత్త దళిత కార్యకర్తల్ని తయారు చేసింది. భిన్న సైద్ధాంతిక అవగాహన నుంచి వచ్చిన దళితులతో కలిసి పనిచేయడానికి వేదిక అయింది. దళిత మహాసభ వ్యవస్థాపక సభ్యులు, కారంచేడు ఉద్యమ నాయకులైన బొజ్జాతారకం (మొదటి అధ్యక్షులు), కత్తి పద్మారావు (మొదటి ప్రధాన కార్యదర్శి) రెండు వేర్వేరు నేపథ్యాల నుంచి దళిత

మహాసభలోకి వచ్చారు. ఇద్దరూ కవులు, రచయితలు. వివిధ ఉద్యమాల్లో పనిచేసిన అనుభవం ఉన్నవారు. 1960లలో తారకం న్యాయవాదిగా జీవితం ప్రారంభించారు. 1960, 70లలో తెలంగాణలోని నిజామాబాద్ జిల్లాలో రైతుకూలీ సంఘం (మార్క్సిస్ట్ - లెనినిస్ట్ భావజాలం గల)తో కలిసి పని చేసారు. డా. అంబేద్కర్ యువజన సంఘం స్థాపించారు. పౌరహక్కుల ఉద్యమంలో, విప్లవ రచయితల సంఘంలో పనిచేసారు. ఎపి హైకోర్టులో ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేస్తున్న సమయంలో కారంచేడు హత్యాకాండ జరిగింది. కారంచేడు హత్యలకి నిరసనగా తారకం ప్రభుత్వ న్యాయవాది వృత్తికి రాజీనామా చేసి దళిత ఉద్యమంలో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. కత్తి పద్మారావు పొన్నూరులోని ఒక కళాశాలలో సంస్కృత అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. 1970ల నుంచి నాస్తిక, హేతువాద ఉద్యమాల్లో క్రియాశీలకంగా పనిచేస్తున్నారు. వక్తగా మంచి పేరుంది. ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘానికి ఉపాధ్యక్షుడిగా, ప్రధాన కార్యదర్శిగా పనిచేసారు. ఆ సంస్థ పత్రిక హేతువాదంకి సంపాదకులుగా పనిచేసారు. కారంచేడు హత్యల తర్వాత దళిత ఉద్యమంలో పూర్తికాలం పనిచేయడానికి నిర్ణయించుకున్నారు. (స్థలాభావం వల్ల, సమగ్ర వివరాలు లేనందు వల్ల అనేకమంది నాయకుల వివరాలు ఇవ్వలేకపోయాను.)

దళిత మహాసభ ఆవిర్భావం రాజకీయంగా చాలా ముఖ్యమయిన అంశం. రాజకీయ పార్టీలలో దేనికీ దళితుల సమస్యలు పట్టవనీ, అవి అగ్రకులాల సంస్థలుగానే ఉన్నాయనీ కారంచేడు బట్టబయలు చేసింది. తెలుగుదేశం పార్టీ దాడిచేసిన కమ్మ కులస్తుల కోసం ఏర్పడిన పార్టీ, ప్రధాన నిందితులే ఈ పార్టీకి చెందినవారు. పార్లమెంటరీ వామపక్ష పార్టీలు - సిపిఐ, సిపిఐ (ఎం) రెండూ కూడా కోస్తాంధ్రలో ధనిక వర్గాల్లో పనిచేస్తూ, దళితులలో ఏ మాత్రం పట్టు సంపాదించ లేదు. అంతకంటే అన్యాయంగా, ఈ పార్టీలు తెలుగుదేశంతో ఎన్నికల పొత్తు వల్ల కమ్మ, ఇతర అగ్రకులాల ప్రతినిధులుగా మిగిలిపోయాయి. కారంచేడు హత్యలపై కాంగ్రెస్ పార్టీ గగ్గోలుపెట్టి, తెలుగుదేశంపై దుమ్మెత్తి పోసింది. అయితే అప్పటికి మూడు దశాబ్దాలకు పైగా అధికారంలో ఉన్న కాంగ్రెస్ భూస్వామ్య అగ్రకులాలైన కమ్మ, రెడ్డి, కాపులని కాంగ్రెస్ పార్టీ బలోపేతం చేసింది. కంటి తుడుపు చర్యలతో దళితుల్ని కేవలం ఓటు బ్యాంకుగా మిగిల్చింది. కారంచేడు పోరాటానికి సంఘీభావం ప్రకటించిన ఎం.ఎల్. పార్టీలు (ముఖ్యంగా అప్పటి పీపుల్స్‌వార్) కారంచేడు శిబిరంలో పనిచేసాయి. జన నాట్య మండలి (జెఎన్ఎం) బృందాలు విస్తృత ప్రచార కార్యక్రమాలు నిర్వహించాయి. ఆ తరువాత కాలంలో కారంచేడు హత్యలకు ప్రధాన కారకుడైన చెంచు రామయ్యని పీపుల్స్‌వార్ కాల్చి చంపింది. అయినప్పటికీ దళిత ఉద్యమానికి, ఎం.ఎల్. పార్టీలకు మధ్య కుల సమస్యను అర్థం చేసుకోవడంలో తేడాలున్నాయి. కారంచేడు హత్యాకాండ దళిత వ్యవసాయ కూలీలపై భూస్వాముల దాడిగా ఎం.ఎల్. పార్టీలు సూత్రీకరించాయని, కుల వైరుధ్యాన్ని గుర్తించడం లేదని దళిత నాయకుల, మేధావుల విమర్శ. దళిత కవి శిఖామణి కవిత 'క్షమాపణ' ఈ వైరుధ్యాన్ని ఎత్తి చూపుతుంది. దళిత ఉద్యమం - ఎం.ఎల్. పార్టీల మధ్య ఈ సైద్ధాంతిక వైరుధ్యం అనేక చర్చలకు దారితీసింది. ఈ చర్చ కొనసాగుతుంది. స్థూలంగా, 1985 నాటికున్న రాజకీయ పార్టీలు, ఉద్యమ సంస్థల అవగాహనతో ఏకీభావం లేక దళిత మహాసభ ఆధ్వర్యంలో ఒక స్వతంత్ర దళిత ఉద్యమ నిర్మాణానికి పూనుకోవడం, దళిత నాయకత్వంలో అది ప్రారంభం కావడం చారిత్రక ప్రాధాన్యత గల అంశాలు. అంతేకాక, దళితుల్ని 'హరిజనుల'ని, అంటరానివారుగా పిలవడాన్ని పూర్తిగా తిరస్కరిస్తూ, అంటరాని కులాల ప్రజలందరికీ దళితులుగా గుర్తింపు తేవడంలో దళిత మహాసభ కార్యాచరణ ఉంది. దళిత నాయకులు తారకం అన్నట్లు 'దళిత మహాసభ తమ పోరాటాన్ని తామే చేసుకోగలమనే ఆత్మస్థైర్యాన్ని దళితులకి ఇచ్చింది'.

దళిత మహాసభ మొదటి మహాసభలు 1986లో తెనాలిలో జరిగాయి. దళిత ఉద్యమం తారాస్థాయికి చేరుకున్న రోజుల్లో ఈ సభలు జరిగాయి. త్వరలోనే దళిత మహాసభలో నాయకత్వం మధ్య సైద్ధాంతిక విభేదాలు వచ్చాయి. 1988లో జరిగిన రెండవ మహాసభలో ఈ విభేదాలు చర్చకు వచ్చాయి. ఆ సభల తర్వాత దళిత మహాసభ రెండుగా చీలిపోయింది. నాయకుల మధ్య వ్యక్తిగత వైరుధ్యాలే ఈ చీలికకు కారణమని ప్రచారం జరిగింది. కానీ ఉత్తర భారతదేశంలో బహుజన సమాజ్ పార్టీ బలపడడం, 1987-88లో కాన్షీరామ్ ఆంధ్రప్రదేశ్ వచ్చి దళిత ఉద్యమ నాయకుల్ని కలిసి రాజకీయ అధికారం కోసం ఎన్నికల రంగంలోకి రావాలని కోరడం జరిగింది. దళిత ఉద్యమాన్ని సామాజిక, సాంస్కృతిక ఉద్యమంగా నడపాలా లేక ఎన్నికల రంగంలోకి దిగి రాజకీయ పార్టీగా అవతరించాలా అన్న అంశంపై వచ్చిన సైద్ధాంతిక భేదాలే చీలికకు కారణమని కె. శ్రీనివాసులు అభిప్రాయపడ్డారు. 1991లో దళిత మహాసభ 3వ మహాసభలు రెండు చోట్ల జరిగాయి. దళిత మహాసభ పేరుతోనే పద్మారావు నాయకత్వంలో విజయవాడలో, తారకం నాయకత్వంలో ఒంగోలులో జరిగాయి. దళిత మహాసభ చీలినా, ఆ సంస్థ ఇచ్చిన స్ఫూర్తి, చైతన్యం వివిధ రూపాల్లో దళిత పోరాటాల్ని కొనసాగించాయి.

## దళిత ఉద్యమం - సాహిత్యం

కారంచేడు మారణకాండపై ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం వారు ప్రచురించిన రిపోర్టులో 'కారంచేడు కోస్తాంధ్రకు దర్పణం లాంటిది' అని వ్యాఖ్యానించారు. 'ప్రాంతీయ సంపన్న వర్గంగా ఏర్పడిన శూద్ర అగ్రకులాల (కమ్మ, రెడ్డి, కాపు తదితరులు)కు, ఆత్మగౌరవంతో తలెత్తుకుని తిరుగుతున్న దళితులకు మధ్య మొదలైన సంఘర్షణ కోస్తాంధ్ర ప్రాంతమంతా వ్యాపించింది. ఒక చోట కమ్మ, మరొక చోట రెడ్డి, ఇంకోచోట కాపు - ఇలా దాడి చేసిన అగ్రకులాల పేర్లు మారినా, గ్రామాల పేర్లు మారినా - బాధితులంతా దళితులే - మాదిగ, మాల, తదితర దళిత కులాల ప్రజలే. నీరుకొండ (1987), తిమ్మసముద్రం (1991), చుండూరు (1991), లక్ష్మింపేట (2012) లాంటి ఊచకోత ఘటనలన్నీ ఒకపరంపరగా, ఒక పథకం ప్రకారం జరిగినవే. ఈ వాస్తవాన్ని దళిత కవి కలేకూరి ప్రసాద్ కవిత 'పిడికెడు ఆత్మగౌరవం కోసం' గొప్పగా వ్యక్తీకరించింది.

*త్రేతాయుగంలో నేను శంభూకుణ్ని / ఇరవై రెండేళ్ల క్రితం నా పేరు కంచికచర్ల కోటేశు / నా జన్మస్థలం కీలవేన్మణి, కారంచేడు,*

*నీరుకొండ / ఇప్పుడు కరడు కట్టిన భూస్వామ్య క్రౌర్యం / నా గుండెల మీద నాగేటి కర్రులతో పచ్చ బొడిసిన నా పేరు చుండూరు / ఇక చుండూరు నామవాచకం కాదు సర్వనామం ఇపుడు ప్రతి గుండె ఒక చుండూరు, రగిలే రాచపుండూరు'*

చుండూరులో రెడ్లు దళిత వాడపై దాడి చేసి ఎనిమిది మందిని తరిమి తరిమి, వేటాడి నరికి చంపారు. గోనె సంచుల్లో వేసి తుంగభద్రలో తొక్కారు. చుండూరు ఘటనకి తీవ్రమైన స్పందన వచ్చింది. దళిత శక్తులకి తోడు, విప్లవ శక్తులు తోడైనాయి. దళితుల శవాలను ఊరేగింపుగా తీసుకొచ్చి ఊరి మధ్యలో ఖననం చేసి దానికి రక్తక్షేత్రమని పేరు పెట్టారు. అక్కడే స్మారక చిహ్నం ఏర్పాటు చేయాలనుకున్నారు. దళిత ఉద్యమం ఢిల్లీ వరకు పాకింది. ఎస్.సి., ఎస్.టి ఎం.పి.ల మద్దతు సంపాదించింది. అగ్రకుల నిందితుల్ని శిక్షించాలనే డిమాండ్ బలంగా ముందుకొచ్చింది. అగ్రకుల భూస్వాములు స్థాపించిన సర్వ జనాభ్యుదయ సమితి చేసిన అబద్ధ ప్రచారాన్ని దళిత ఉద్యమం తిప్పి కొట్టింది. విప్లవ ఉద్యమాల నుంచి బయటకు వచ్చిన బి.ఎస్. రాములు, ఉ.సా., కంచ ఐలయ్య, కె.జి. సత్యమూర్తి లాంటి వారంతా చుండూరు ఉద్యమానికి మద్దతు పలికారు. పోలీసు చర్యలతో, దళిత యువకుడు అనిల్‌కుమార్‌ని చుండూరు బాధితుల శిబిరంలో హత్య చేయడం ద్వారా దళిత ఉద్యమాన్ని లొంగదీసుకునే ప్రయత్నం ప్రభుత్వం చేసింది. దళిత, విప్లవ శక్తుల ఐక్యత దెబ్బ తినడానికి కత్తి పద్మారావు విధానాలే కారణమనే వాదన కూడా ఉంది. (ఉ.సా. వ్యాసం, దళిత రణన్నినాదం). ఒక సంస్థగా లేకున్నా, దళిత మహాసభ సృష్టించిన చైతన్యం, లేపిన ప్రశ్నలు దళితుల ఆత్మరక్షణ కోసం, హక్కుల కోసం ఉద్యమ రూపం తీసుకుంటున్నాయి. దళిత మేధావి, కవి కలేకూరి అన్నట్టు 'దళిత జీవితం ముందుకు తెచ్చిన మహత్తరమైన ప్రశ్నలతో ఒక సమగ్రమైన ఉద్యమంగా ఎదగవలసిన దళిత ఉద్యమం ఆందోళనల స్థాయికి కుంచించుకు పోయింది. కారంచేడు ఉద్యమం, చుండూరు ఉద్యమం అని పిలుచుకోవడం అర్థం అదే'. దళితులపై వివక్ష, దాడుల ఘటనల చుట్టూ నిరసనలు, ఆందోళనల రూపంలో దళిత ఉద్యమం నడిచింది. ఇంకా నడుస్తూ ఉంది. అయితే దళిత ఉద్యమం సృష్టించిన చైతన్యం, అవగాహన తెలుగు సమాజంలో, వివిధ రంగాల్లో చాలా మార్పులు తెచ్చాయి. ముఖ్యంగా సాహిత్యరంగంలో దళిత సాహిత్యం ప్రత్యేక ఉద్యమంగా ఆవిర్భవించడం గొప్ప పరిణామం.

సతీష్‌చందర్ కవితల్ని విశ్లేషిస్తూ కె. శ్రీనివాస్ రాసిన 'దళిత సూర్యోదయ కవిత' అనే వ్యాసంలో కారంచేడు, చుండూరు ఉద్యమాల తర్వాత సాంస్కృతిక, సాహిత్య రంగాల్లో దళిత చైతన్యం బలపడిందని అన్నారు. దళిత పోరాటాలు, రిజర్వేషన్ అనుకూల ఉద్యమాలు (బిసి రిజర్వేషన్‌లు 1986లో పెంచినపుడు; 1990లో మండల్ నివేదిక అమలు చేసినప్పుడు), ముస్లిం, స్త్రీవాద సాహిత్య ప్రకంపనలు – అన్నీ దళిత ఐడెంటిటీ ఒక ప్రత్యేకమైన ఐడెంటిటీ (గుర్తింపు)గా సాహిత్య రంగంలో స్థిరపడడానికి దోహదం చేసాయి. ఖాదర్ మొహియొద్దీన్ రాసిన 'పుట్టుమచ్చ' కవిత (1991) పెద్ద చర్చను లేపింది. 'నేను పుట్టకముందే / దేశ ద్రోహుల జాబితాలో / నమోదై ఉంది నా పేరు' అంటూ ముస్లిం అస్తిత్వంపై, హిందూ మతతత్వంపై వ్యాఖ్యానంలా ఈ కవిత నడుస్తుంది. అలాగే స్త్రీవాద కవితా సంకలనం 'నీలి మేఘాలు' (1993) స్త్రీల అస్తిత్వం కేంద్రంగా స్త్రీవాద చర్చకు దోహదం చేసింది. మొత్తంగా ఈ పరిణామాల నేపథ్యంలో దళిత సాహిత్యోద్యమం ఆవిర్భవించింది. దళిత సాహిత్య ప్రత్యేకతను గుర్తించాలని వాదిస్తూ, 'దళిత ఐడెంటిటీ' కేంద్రంగా సాహిత్యం రావడం 1990ల తర్వాత వచ్చిన దళిత సాహిత్య లక్షణమని కె. శ్రీనివాస్ అభిప్రాయపడ్డారు. కారంచేడు కన్నా ముందు వచ్చిన దళిత సాహిత్యం రూపంలోనూ, సారంలోనూ సంస్కరణవాదంగా మిగిలిందని చల్లపల్లి స్వరూపరాణి వ్యాఖ్యానించారు. కారంచేడు పోరాటం అనేకమంది ప్రతిఘటనా కవులను సృష్టించిందని, సుమారు వందకు పైగా దళిత రచయితలు కలాలు పట్టుకుని రాయడం మొదలు పెట్టారని స్వరూపరాణి అన్నారు.

దళిత సాహిత్యరంగాన్ని పరిశీలిస్తే రెండు తరాల రచయితలు మనకు కనిపిస్తారు. మొదటి తరంలో అప్పటికే కవులుగా, కళాకారులుగా, మేధావులుగా ప్రసిద్ధులైనవారు, కారంచేడు తర్వాత చాలా శక్తివంతమైన దళిత సాహిత్యం సృష్టించారు. వీరిలో గద్దర్, శివసాగర్, సలంద్ర, బొజ్జా తారకం, కత్తి పద్మారావు, ఎండ్లూరి సుధాకర్, సతీష్‌చందర్, శిఖామణి, కలేకూరి ప్రసాద్‌లు ముఖ్యమైనవారు. అలాగే కారంచేడు, చుండూరు పోరాటాల చైతన్యం నుంచి ఉద్భవించిన రెండవ తరానికి చెందిన కవుల్లో మద్దూరి నగేష్‌బాబు, పైడితెరేష్‌బాబు, నాగప్పగారి సుందర్రాజు, వేముల ఎల్లయ్య, చంద్రశ్రీ, చల్లపల్లి స్వరూపరాణి, జాజులగౌరి, గోగుశ్యామల, జూపాక సుభద్ర తదితరులు ఉన్నారు. ఈ రెండవ తరం దళిత ప్రజల కసిని, కోపాన్ని, ఆవేదనని బలంగా వ్యక్తీకరించింది.

ఆంధ్రజ్యోతి ఆదివారం సప్లిమెంట్ ఇంఛార్జిగా ఉన్న కవి, రచయిత త్రిపురనేని శ్రీనివాస్ దళిత సాహిత్యాన్ని ప్రోత్సహిస్తూ, జి. లక్ష్మీనరసయ్యకు కాలమ్ రాసే అవకాశం ఇచ్చారు. లక్ష్మీనరసయ్య తన కాలమ్ ద్వారా దళిత సాహిత్యంపై విస్తృతమైన చర్చ నిర్వహించారు. త్రిపురనేని శ్రీనివాస్, లక్ష్మీనరసయ్యల సంపాదకత్వంలో అప్పటి వరకు అందుబాటులోకి వచ్చిన దళిత కవిత్వాన్నంతటినీ కూర్చి 'చిక్కనవుతున్న పాట' (1995) కవితా సంకలనాన్ని మొట్టమొదటి దళిత కవితా సంకలనంగా ప్రచురించారు. ఆ తరువాత 'పదునెక్కిన పాట' (1996) అనే మరో సంకలనాన్ని లక్ష్మీనరసయ్య, తదితరుల సంపాదకత్వంలో తెచ్చారు. ఈ రెండు సంకలనాల్లో దళిత సాహిత్యాన్ని ఒక ప్రత్యేకమైన ధోరణిగా ప్రతిపాదించారు. ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీలంతా దళితులని, అగ్రకులాలు మీడియేషన్ రోల్‌కి పరిమితం కావాలనీ, 'దేశీయ మార్క్సిజం' దళిత కవిత్వానికి సైద్ధాంతిక చట్రంగా ఉందని అనేక ప్రతిపాదనల్ని లక్ష్మీనరసయ్య చేసారు. ఈ ప్రతిపాదనలపై విస్తృత చర్చ జరిగింది. అనేక సంకలనాలు, వందలాది మంది కవులు సృష్టించిన దళిత సాహిత్య ఉద్యమం దళిత చైతన్యాన్ని, దళిత ఎజెండాని సజీవంగా ఉంచింది. ఆ తరువాత కాలంలో భిన్న రూపాల్లో (కథ, నవల, ఆత్మకథ లాంటివి) సాహిత్యాన్ని విస్తృతం చేయడంలో దళిత రచయితలు వెనుకబడ్డారు. 'దళిత సాహితీ విమర్శ నచ్చిన వాళ్లను పొగడడం, నచ్చని వాళ్లని తెగడడం స్థాయికి కుదించుకు పోయింది' అంటూ కలేకూరి విమర్శించారు. దళిత సాహిత్యంపై విస్తృతమైన చర్చ, విశ్లేషణ లేక ఆ

ఉద్యమం ఉజ్వలంగా ఎదగలేక పోవడానికి దళిత రచయితలు, నాయకులే బాధ్యులుగా చెప్పాలి.

## దళితులు - ఎన్నికలు

దళిత ఉద్యమం సామాజిక, సాంస్కృతిక ఉద్యమంగా ప్రారంభ మయింది. దళితులలో చైతన్యాన్ని, అవగాహనను పెంచింది. అయితే, దళిత ఉద్యమం ఎన్నికల రాజకీయాలకు మొదటి నుంచి దూరంగా ఉంది. రాజకీయ పార్టీలకు అతీతంగా ఒక స్వతంత్ర ఉద్యమంగా దళిత ఉద్యమం ఎదిగింది. ఈ నేపథ్యంలో 1987-88లోనే బహుజన సమాజ్ పార్టీ నాయకులు కాన్షీరామ్ రాష్ట్రానికి రావడం, దళిత నాయకత్వాన్ని ఎన్నికల రంగం ద్వారా రాజకీయ అధికారం కోసం ప్రయత్నించమని చెప్పడం జరిగింది. అత్యాచారాలు ఆగాలన్నా దళితుల స్థితిగతులు మెరుగుపడాలన్నా అధికారమే మూలమని బిఎస్‌పి అవగాహన. దళిత నాయకత్వంలోని కొన్ని సెక్షన్ల వారికి ఈ ఆలోచన బాగా నచ్చింది. 1994 అసెంబ్లీ ఎన్నికలు దళిత ఉద్యమ చరిత్రలో కీలకమయినవి. బిఎస్‌పి సభలకు పెద్ద ఎత్తున జనం వస్తున్నారని, రాష్ట్రంలో ఆ పార్టీ విజయం సాధిస్తుందని చేసిన ప్రచారాలని దళిత నాయకత్వం నమ్మింది. ఒకరి తర్వాత ఒకరు బిఎస్‌పిలో చేరారు. బొజ్జా తారకం, కత్తి పద్మారావు, కె.జి. సత్యమూర్తి లాంటి వారంతా ఈ జాబితాలో ఉన్నారు. అంతలోనే బిఎస్‌పి ఉత్తర్‌ప్రదేశ్‌లో బిజెపితో పొత్తుపెట్టుకుని అధికారం చేపట్టడంతో మొదటగా తారకం బిఎస్‌పి నుంచి బయటకొచ్చారు. తారకం రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా అనే పార్టీ స్థాపించి దాని అధ్యక్షులుగా ఉన్నారు. ఆ తరువాత సత్యమూర్తి బయటకు వచ్చి బహుజన రిపబ్లిక్ పార్టీ అనే సంస్థను స్థాపించారు. 1994లో జరిగిన ఎన్నికల్లో బిఎస్‌పి ఘోరంగా ఓడిపోయింది. దళిత ఉద్యమం సృష్టించిన అనేక మంది నాయకుల్లో, కార్యకర్తల్లో ఎన్నికల్లో పాల్గొనడం పెద్ద గందరగోళం కలిగించింది. టిక్కెట్ల కోసం పోటీపడే క్రమంలో మొత్తం దళిత నాయకుల మధ్య గొడవల వల్ల దళిత నాయకులపై గౌరవం తగ్గింది. దళిత ఉద్యమం మరింతగా బలహీన పడింది. ఈ సందర్భంలోనే మంద కృష్ణ మాదిగ నాయకత్వంలో మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ఏర్పడి, మాదిగ ఉద్యమ నిర్మాణం మొదలైంది.

మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎంఆర్‌పిఎస్) తో కలిసి ఉ.సా., సత్యమూర్తి తదితరులు మహాజన ఫ్రంట్ స్థాపించి ఎన్నికల్లో రాణించాలని ప్రయత్నం చేసారు. మహాజన ఫ్రంట్ టిక్కెట్ల పంపకం దశలోనే చీలిపోయి, బలహీనపడింది. ఆ తరువాత వచ్చిన ప్రజారాజ్యం పార్టీ (2008) మళ్లీ దళిత బహుజనుల్లో ఆశలు రేపింది. దళిత నాయకుల్లో ముఖ్యులైన కత్తి పద్మారావు ఆ పార్టీలో చేరారు. గత అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసి ఓడిపోయారు. దళిత బహుజన ఉద్యమాల్లో నాయకులు ఉ.సా., గౌతమ్‌లు కూడా ప్రజారాజ్యంలో చేరారు. త్వరలోనే ఉ.సా. ప్రజారాజ్యం అగ్రకుల కాపుల పార్టీ అని విమర్శిస్తూ బయటకు వచ్చారు.

ఎన్నికల రంగాన్ని కూడా పోరాట రంగంగా భావించాలని, అధికారం సాధిస్తేనే హక్కులు సాధ్యమనే అవగాహన దళిత సంపన్న వర్గం, దళిత బ్యూరోక్రాట్లు, దళిత రాజకీయ నాయకుల్లో బలంగా ఉంది. ఈ అవగాహన దళిత నాయకత్వంలో కూడా భ్రమలు కల్పించింది. ఎన్నికల రంగంలో పాల్గొన్న ప్రతిసారీ దళిత ఉద్యమం చీలికలు, పేలికలై బలహీన పడిందనేది వాస్తవం.

## మాదిగ ఉద్యమం

1990ల తర్వాత దళిత ఉద్యమంలో సైద్ధాంతిక విభేదాలు, అంతర్గత వైరుధ్యాలు బయట పడ్డాయి. వివిధ దళిత, బిసి ఉపకులాలు సంఘాలుగా ఏర్పడడం ఈ సమయంలో జరిగింది. దళితులంతా ఒకే కులంగా, ఒకే సామాజిక వర్గంగా భావించే స్థితి సరైంది కాదని, దళితుల్లో అనేక ఉప కులాలు ఉన్నాయని మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (1994) స్పష్టం చేసింది. దళితులుగా పిలవబడుతున్న షెడ్యూల్డు కులాల ప్రజలు 59 ఉపకులాలుగా విభజింపబడి ఉన్నారని, ఈ కులాల మధ్య సామాజిక అంతరాలు, వివక్ష ఉన్నాయని బహిరంగ చర్చ మొదలయింది. ఉమ్మడి ఎస్.సి. రిజర్వేషన్‌ల విధానం వల్ల సంక్షేమ, రాజకీయ రంగాల్లో రాయితీలు అనుభవించడంలో కూడా కేవలం కొన్ని ఉపకులాలే (మాల, ఆది ఆంధ్ర తదితరులు) ముందున్నారని, మాదిగ, రెల్లి తదితర కులాలకు ఈ రిజర్వేషన్‌లు, రాయితీలు రావాల్సిన మేరకు రాలేదనే వాదన ఒకటి వచ్చింది. 1990 తర్వాత వచ్చిన పెద్ద ప్రజా ఉద్యమాల్లో మాదిగ ఉద్యమాన్ని ఒకటిగా చెప్పవచ్చు.

షెడ్యూల్డు కులాల (ఎస్.సి.) లో ఒక కులమైన మాదిగలు 1994లో మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ప్రారంభించారు. మాదిగ దండోరాగా ప్రాచుర్యంలోకి వచ్చిన ఈ ఉద్యమం అణగారిన దళిత కులాల మధ్య సమానత్వం కోరుతూ, ఉమ్మడి ఎస్.సి. రిజర్వేషన్‌లు (15 శాతాన్ని) దళిత కులాల మధ్య ఎ బి సి డిలుగా విభజిస్తూ చట్టం చేయాలని డిమాండ్ చేసింది. సామాజిక, సాంస్కృతిక వెనుకబాటుతనం, జనాభా ప్రాతిపదికన 59 దళిత కులాలను నాలుగు గ్రూపులుగా (సామాజికంగా వెనుకబడిన కులాల్ని 'ఎ' గానూ, బాగా ముందున్న కులాల్ని 'డి'గానూ) విభజించి, నిర్దిష్ట రిజర్వేషన్‌ల వాటా శాతాన్ని నిర్ణయిస్తూ చట్టం చేయడం వల్ల ఎస్.సి.ల్లోనే వెనుకబడిన, అణగారిన దళిత కులాలైన రెల్లి, మాదిగ తదితర కులాలకు న్యాయం జరుగుతుందని ఎంఆర్‌పిఎస్ వాదించింది. మొత్తం 59 దళిత కులాల్లో సంఖ్యాపరంగా మాల, మాదిగలు ఎక్కువ ఉండడం వల్ల, మాలలు రిజర్వేషన్‌లు ఎక్కువ అనుభవించారనే కారణంగా ఈ మొత్తం ఉద్యమం మాల - మాదిగల మధ్య ఘర్షణగా రూపం తీసుకుంది.

పీపుల్స్‌వార్ పార్టీలో పనిచేసిన మాజీ నక్సలైట్ కార్యకర్త కృష్ణ, దళిత మహాసభలో పనిచేసిన కృపాకర్ (ఇద్దరూ 'మాదిగ' కులం పేరుని తమ పేర్లకు జతచేసారు) నాయకత్వంలో 1994లో ఎంఆర్‌పిఎస్ ఒంగోలు జిల్లా ఈదుమూడిలో ఏర్పడింది. ధర్నాలు, ర్యాలీలు, సమావేశాలు, బహిరంగసభలు, రాస్తారోకోలు తదితర పోరాట రూపాల ద్వారా ఎంఆర్‌పిఎస్ వర్గీకరణ డిమాండ్‌ని విస్తృతంగా ప్రచారం చేసింది. మాదిగ కులానికి, మాదిగ ఉప కులాలకి చెందిన ఉద్యోగులు, స్త్రీలు, రచయితలు, రాజకీయ నాయకులు - అందర్నీ కూడగట్టి పెద్ద ఉద్యమాన్ని ఎంఆర్‌పిఎస్ నిర్మించింది. వామపక్ష, విప్లవ, ప్రజాస్వామిక సంస్థల మద్దతుని సమీకరించింది. అన్ని రాజకీయ పార్టీల మద్దతు సంపాదించింది. ప్రజా కళాకారుడు గద్దర్ నేతృత్వంలో మాదిగ దండోరా

పోరాట సంఘీభావ కమిటీ ఏర్పడి వివిధ ప్రజాసంఘాల, వ్యక్తుల మద్దతుని కూడగట్టింది.

మాదిగ ఉద్యమ ఒత్తిడికి స్పందించి ప్రభుత్వం జస్టిస్ రామచంద్ర రాజు కమిషన్ (1996) ఏర్పాటు చేసింది. ఈ కమిషన్ మాదిగల వాదనలో వాస్తవం ఉందని తేల్చింది. ఈ కమిషన్ నివేదిక ఆధారంగా ప్రభుత్వం ఎస్.సి. రిజర్వేషన్‌లని ఎ బి సి డిలుగా వర్గీకరిస్తూ 1997లో జి.ఒ. జారీ చేసింది. గ్రూపు 'ఎ'లో రెల్లి, మెహతర్ తదితర కులాలు, గ్రూప్ 'బి'లో మాదిగ ఉపకులాలు, గ్రూప్ 'సి'లో మాల, ఉపకులాలు, గ్రూప్ 'డి'లో ఆది ఆంధ్ర ఉన్నాయి.

కొందరు దళిత ఉద్యమ నాయకులు వర్గీకరణ డిమాండ్ వల్ల దళితులు చీలిపోయారని, ఉద్యమం బలహీన పడుతుందని అభిప్రాయ పడ్డారు. దళితుల మౌలిక సమస్యలపై చేసే ఉమ్మడి పోరాటాలు బలహీన పడతాయని వాదించారు. మాదిగ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తూ ఏర్పడిన మాల మహానాడు లాంటి సంస్థలు మాదిగ ఉద్యమం తెలుగుదేశం పార్టీ కుట్ర అని, దళితుల్ని విభజించి మాదిగల్ని ఓటు బ్యాంకులుగా చేసుకోవడానికే ఈ కుట్ర అని అన్నాయి. ఈ సంస్థలు అనేక చట్టపరమైన అభ్యంతరాలు లేపాయి. వర్గీకరణ చట్టవిరుద్ధమని, రాజ్యాంగ వ్యతిరేకమని వాదించాయి. హైకోర్టు, సుప్రీంకోర్టు, రాష్ట్ర అసెంబ్లీ, కేంద్ర ప్రభుత్వం, జాతీయ ఎస్.సి., ఎస్.టి. కమిషన్ లాంటి సంస్థలన్నీ వర్గీకరణ వివాదాన్ని పరిశీలించాయి. హైకోర్టు ప్రభుత్వ వర్గీకరణ జి.ఒ.ని కొట్టివేసింది. జాతీయ ఎస్.సి., ఎస్.టి. కమిషన్ వర్గీకరణ రాజ్యాంగ విరుద్ధమన్నది. రాష్ట్ర గవర్నర్ ప్రభుత్వం తెచ్చిన ప్రత్యేక ఆర్డినెన్స్‌ని రాష్ట్రపతి అభిప్రాయానికి పంపారు. చిట్ట చివరికి అప్పటి రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ వర్గీకరణ ఆర్డినెన్స్‌ని ఆమోదించారు. ఎ.పి. ఎస్.సి. (రిజర్వేషన్‌ల హేతుబద్ధీకరణ) చట్టం, 2000ను ప్రభుత్వం అమలులోకి తెచ్చింది. వర్గీకరణ చట్టం ఏప్రిల్ 1, 2000 నుంచి నవంబర్ 5, 2004 వరకూ అమలయ్యింది. కాని మాల మహానాడు ప్రతినిధుల రిట్ పిటిషన్‌పై తీర్పునిస్తూ, సుప్రీంకోర్టు – వర్గీకరణ చట్టం రాజ్యాంగ వ్యతిరేకమని, 'షెడ్యూల్డ్ కులాలు' రాజ్యాంగపరంగా అవిభాజ్యమని, కాబట్టి ఎ, బి, సి, డి గ్రూపులుగా వర్గీకరణ చట్ట విరుద్ధమని చెప్పింది. పార్లమెంట్‌లో చట్టం చేసి వర్గీకరణ అమలు చేయాలని డిమాండ్ చేస్తూ మాదిగలు పోరాటం కొనసాగిస్తున్నారు.

మాదిగ ఉద్యమం రిజర్వేషన్‌ల వర్గీకరణ తక్షణ డిమాండ్‌తో ముందుకొచ్చింది. ఈ డిమాండ్ సాధించుకునే క్రమంలో నిర్మించిన ప్రజా ఉద్యమం అనేక సైద్ధాంతిక అంశాల్ని, కొత్త చూపుని అందించింది. దళిత కులాల్లో అణగారిన మాదిగ, రెల్లి తదితర కులాల ఆత్మగౌరవ సమస్య చర్చ కొచ్చింది. మొత్తంగా మాదిగ కులానికి గౌరవం లేనిదే ఏ మాదిగ కులస్తునికి గౌరవం, సమానత్వం సాధ్యం కాదనే అవగాహన బలపడింది. అణగారిన కులాల మధ్య సమానత్వం, ఐక్యత ద్వారా కులాధిపత్యాన్ని దెబ్బతీయగలమని మాదిగ మేధావులు వాదించారు. మాదిగ అస్తిత్వాన్ని, సంస్కృతిని వివరిస్తూ, ఎత్తి పడుతూ మాదిగ సాహిత్యోద్యమం వచ్చింది. దళిత సాహిత్యమంతా మాలల సాహిత్యమేనా? అనే ప్రశ్న వచ్చింది. నాగప్పగారి సుందర్రాజు 1996లో మాదిగ సాహిత్య వేదిక స్థాపించాడు. 'మాదిగ చైతన్యం' కవితా సంకలనాన్ని తెచ్చాడు. ఆ తరువాత కృపాకర్ మాదిగ, జూపాక సుభద్ర సంపాదకత్వంలో 'కైతునకల దండెం : మాదిగ కవిత్వం' (2005) సంకలనం వచ్చింది. మాదిగ అస్తిత్వాన్ని, సంస్కృతిని, పోరాటాన్ని ఎత్తిపడుతూ మాదిగ సాహిత్యం ఒక ముఖ్య ధోరణిగా ఉంది.

దళిత ఉద్యమంలాగే, మాదిగ ఉద్యమం గొప్ప ప్రశ్నల్ని లేపింది. చైతన్యాన్ని రగిలించింది. అలాగే – అనేక కారణాల వల్ల చీలిపోయింది. కాని మాదిగ చైతన్యం సమాజంలో బలంగా పాతుకుపోయింది. కుల వ్యవస్థని అర్థం చేసుకుని అంతం చేయడానికి దళిత కులాల ఆకాంక్షలు, ఉద్యమాలు అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది.

**కుల సమస్య – మార్క్సిస్టులు**

రాష్ట్రంలోని కమ్యూనిస్టు పార్టీలు, మార్క్సిస్టు మేధావి వర్గం కుల సమస్యను ఒక ప్రాధాన్యతగల అంశంగా తమ విప్లవ ఎజెండాలో భాగం చేసుకోలేదని విమర్శ దళిత శక్తులలో కారంచేడు నుంచీ ఉంది. పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీలైన సిపిఐ, సిపిఎంలు కోస్తాంధ్రలో దళితులకు దూరం కావడం, వీటి నాయకత్వం మొత్తం ఒకటి, రెండు అగ్రకులాల చేతుల్లో ఉండడాన్ని దళిత శక్తులు ఎత్తిచూపాయి. విప్లవ కమ్యూనిస్టు పార్టీలు దళితులే పునాదిగా పనిచేస్తున్నా, దళితుల్ని వ్యవసాయ కార్మికులుగా, భూమిలేని నిరుపేదలుగా చూడడం వల్ల కారంచేడు సంఘటన కూడా భూస్వాములకి, భూమి లేని పేదలకు జరిగిన ఘర్షణగా మొదట వ్యాఖ్యానించడం జరిగింది. భూమి, అధికారం చేతుల్లో ఉన్న సంపన్న కులాలు దళితులపై జరిపిన దాడిలో ఆధునికమైన కులతత్వాన్ని చూడలేకపోవడం విప్లవ పార్టీల వైఫల్యంగా చెప్పవచ్చు. అయితే కారంచేడు హత్యలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పీపుల్స్‌వార్ పార్టీకి చెందిన శక్తులు ఆనాటికి తమకున్న అవగాహనతో పనిచేసాయి. దళితులపై దాడిని వ్యతిరేకించాయి. భూస్వామి, ప్రధాన సూత్రధారి చెంచు రామయ్యని హత్య చేసాయి. చుండూరు ఊచకోత నాటికి విప్లవ పార్టీలన్నీ దాదాపుగా బాధితులకు అండగా ఉద్యమంలో పాల్గొన్నాయి. అయితే – కుల సమస్య పై ఒక స్పష్టమైన అవగాహన, కార్యాచరణ ప్రకటించాలని దళిత శక్తులు విప్లవ పార్టీలను డిమాండ్ చేసాయి.

కారంచేడు నుంచి విప్లవ పార్టీలు, మార్క్సిస్ట్ మేధావి వర్గం కుల సమస్యపై సైద్ధాంతిక చర్చ చేస్తూ, ఈ సమస్యపై నిర్మాణాల ఏర్పాటుకు ప్రయత్నాలు చేస్తున్నాయి. కారంచేడు సమస్యని కేవలం కుల దృష్టితో కాకుండా, వర్గ దృష్టితో కూడా చూడాల్సిన అవసరముందని భావించిన వారు దళిత మహాసభలో చేరలేదు. బలహీన వర్గాల సమాఖ్యని స్థాపించి దళితులు, బి.సి.లు, ఇతర పీడిత కులాల్ని ఐక్యం చేస్తూ ఉద్యమం నడపాలని నిర్ణయించారు. 1990లలో విప్లవ ఉద్యమం నుంచి బయటకొచ్చిన ఉ.సా., కె.జి. సత్యమూర్తి తదితరులు ఎం.ఎల్. సెంటర్‌ని ప్రారంభించారు. 'ఎదురీత' పత్రిక ప్రారంభించి మార్క్సిజం – అంబేద్కరిజంపై చర్చ ప్రారంభించారు. చుండూరు ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. ఈ క్రమంలోనే అనేక ప్రయోగాలు చేసారు. సమతా వాలంటీర్ ఫోర్స్ స్థాపించి, దళిత ఉద్యమం ఆత్మరక్షణ ఉద్యమంగా మారాలని, ప్రతిఘటనకు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు. సామాజిక విప్లవ వేదిక అనే సంస్థను ప్రారంభించారు. ఈ ప్రయత్నాలు పెద్దగా

విజయవంతం కాలేదు.

కె.జి. సత్యమూర్తి (ఎస్ఎం, శివసాగర్) 1990లలో బయటకొచ్చినపుడు దళిత శక్తులు ఆయన నాయకత్వంలో ఉద్యమం బలపడుతుందని ఆశించారు. ఎం.ఎల్. సెంటర్ తదితర ప్రయోగాల తరువాత 1994లో సత్యమూర్తి బి.ఎస్.పి.లో చేరారు. సైద్ధాంతిక విభేదాల కారణంగా, సీట్ల పంపకం గొడవలతో త్వరలోనే ఆయన బిఎస్‌పి నుంచి బయటకొచ్చారు. బహుజన రిపబ్లికన్ పార్టీ (1995) అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థ తరఫున 'ఏకలవ్య' అనే పత్రికను నడిపారు. 1996లో ఇద్దరు దళిత యువకులు – చలపతిరావు, విజయవర్ధనరావులకు విధించిన ఉరిశిక్షలు రద్దుచేయాలనే ఉద్యమం విప్లవ, దళిత, హక్కుల సంఘాలతో కలిసి పనిచేసారు. ఉరిశిక్ష రద్దుని సాధించారు. విప్లవ కవిత్వంలో శ్రీశ్రీ తరువాత గొప్ప విప్లవకవిగా పేరున్న సత్యమూర్తి (శివసాగర్), దళిత ఉద్యమ ప్రభావానికి మళ్లీ దళిత కవిగా దళిత కవిత్వం రాశారు. సత్యమూర్తి కృషిని అంచనా వేస్తూ, కలేకూరి ఇలా అన్నారు. 'సైద్ధాంతిక స్థాయిలో ఆయన కృషి చాలా ఉంది. మార్క్సిస్ట్ శిబిరంతో దళిత శక్తుల పోరాటంలో ఆయన చాలా సమాచారం, పనిముట్లు అందించారు. ఆయన అడిగిన ప్రశ్నలు దళిత ఉద్యమాన్ని బలపరిచాయి. బ్లాక్ పాంథర్ ఉద్యమం తరహాలో ఉద్యమం నిర్మించాలనే కోరిక ఆయనకుండేది. కానీ దళిత ఉద్యమ నిర్మాణంలో ఆయన కృషి పెద్దగా లేదు.'

1990వ దశకంలో కమ్యూనిస్టు పార్టీల్లో కుల సమస్యపై విస్తృతమైన చర్చ జరిగింది. దళిత ఉద్యమం లేపిన ప్రశ్నలు కమ్యూనిస్టు శిబిరంలో కల్లోలం సృష్టించాయి. అన్ని పార్టీలు కుల సమస్యపై ప్రత్యేక డాక్యుమెంట్లు / తీర్మానాలు రూపొందించాయి. ముఖ్యంగా భారత దేశ చరిత్రలో కుల వ్యతిరేక ఉద్యమాల చరిత్ర నుంచి, ఆ ఉద్యమాలకు నాయకత్వం వహించి పూలే – అంబేద్కర్‌ల వారసత్వాన్ని స్వంతం చేసుకోవాల్సిన అవసరంపై చాలా చర్చ జరిగింది. అంబేద్కర్ ఆలోచనలపై ప్రత్యేకమైన చర్చ జరిగింది. రంగనాయకమ్మ అంబేద్కర్‌పై రాసిన పుస్తకం 'దళిత సమస్య పరిష్కారానికి బుద్ధుడు చాలడు! అంబేద్కర్ చాలడు! మార్క్స్ కావాలి', దానికి జవాబుగా సత్యమూర్తి రాసిన 'అంబేద్కర్ సూర్యుడు' పుస్తకాలు ఈ చర్చలో భాగంగానే చూడాలి. ఈ విస్తృత చర్చ నుంచి కా. వీరన్న 'ఇండియాలో ఏం చేయాలి?' అనే సిద్ధాంత గ్రంథం వచ్చింది. ప్రత్యేక దళిత బహుజన కమ్యూనిస్టు పార్టీ స్థాపించడం జరిగింది. ముఖ్యంగా కుల సమస్యపై పని చేయడానికి ప్రత్యేక నిర్మాణాల్ని ఏర్పాటు చేయడం కులవాదం కాదు, చారిత్రక అవసరంగా గుర్తించి విప్లవ పార్టీలు, ఇతర కమ్యూనిస్టు సంస్థలు ప్రత్యేక నిర్మాణాల్ని ఏర్పర్చడం ఒక చారిత్రక విశేషం. అలా ఏర్పరచిన సంస్థల్లో డఫోడం (1994) (డెమోక్రటిక్ ఆక్షన్ ఫోరం ఆఫ్ దళిత్స్ అండ్ మైనారిటీస్) మొదటిది. సిపిఎం పార్టీ ఆధ్వర్యంలో కుల వివక్ష పోరాట కమిటీ (1998) ఏర్పడ్డది. అలాగే విప్లవ సానుభూతిపరులు, దళిత ఉద్యమాల్లో పనిచేసిన వారితో కలిసి కుల నిర్మూలనా పోరాట సమితి (1998) ఏర్పడ్డది. డఫోడం ఎంతో కాలం పనిచేయలేదు కానీ మిగతా సంస్థలు పనిచేస్తున్నాయి. కుల వివక్ష పోరాట కమిటీ కుల వివక్ష రూపాలపై ప్రచారం, చైతన్యం చేసే కార్యక్రమాలు చేపట్టింది. దళితులపై దాడులపైన, దళితుల మౌలిక సమస్యలపైన సమరశీల పోరాటాలు నిర్మించిన దాఖలాలు లేవు. సిపిఎం పార్టీ పట్ల దళిత శక్తులకు గురీలేదు, భ్రమలూ లేవు. ఇందువల్ల ఈ సంస్థ అంతగా దళిత ప్రజల్లోకి చొచ్చుకుపోయే అవకాశం లేదు.

కుల నిర్మూలనా పోరాట సమితి (కెఎన్‌పిఎస్) దళిత ప్రజల్లో, పీడిత కులాల్లో కొంత ఆశలు రేపింది. గ్రామ – మండల స్థాయి నుంచి నిర్మాణాల ద్వారా, దళితుల్ని చైతన్యవంతం చేయడం ద్వారా, దళితులపై అంటరానితనం, దాడుల్ని ఎదుర్కోవాలనే వ్యూహంలో కెఎన్‌పిఎస్ పని చేస్తూ, కొన్ని అత్యాచార ఘటనల్లో నిందితులు అరెస్టు అవ్వడం కోసం, బాధితుల్లో ఆత్మస్థైర్యాన్ని నింపడం కోసం ఉద్యమాలు చేసింది. ముఖ్యంగా చుండూరులో దళిత మారణకాండ కేసు ఎస్.సి./ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం కింద ప్రత్యేక కోర్టులో పదేళ్ల తరువాత విచారణకొచ్చినపుడు, ఆ బాధితులకు అండగా గ్రామంలో ఉండి దళితులకు నైతిక ధైర్యాన్ని ఇచ్చింది. కెఎన్‌పిఎస్ విచారణ సమయంలో ఉండడం వల్లే దళిత బాధితులు ధైర్యంగా సాక్ష్యం చెప్పడం, చుండూరు హంతకులకి శిక్షలు పడడం జరిగింది. ఇలా అత్యాచార ఘటనలపై, దళితుల సమస్యలపై పనిచేసే సంస్థల అవసరం నేడు చాలా ఉంది. లక్షింపేట మారణకాండ తరువాత దీర్ఘకాలం పాటు రాజీలేకుండా పోరాడే సంస్థల అవసరం చాలా ఉంది. కుల నిర్మూలనా పోరాట సమితి లాంటి సంస్థలు లక్షింపేట పోరాటాన్ని ముందుండి నడిపించాల్సిన పరిస్థితి వచ్చింది. దళిత సంఘాలు బలహీనపడడం, మాదిగ దండోరా, మాల మహానాడు లాంటి సంస్థలు రాజకీయ పార్టీలకు తోకలుగా వ్యవహరించడం, దళిత నాయకులు నిలకడగా నిలబడని స్థితి – ఈ గడ్డుకాలంలో కెఎన్‌పిఎస్ లాంటి రాష్ట్రవ్యాప్త సంఘాలు, అంటరాని కులాల్ని, పీడిత బిసి కులాల్ని కలుపుకు పోయే సంస్థల అవసరం చాలా ఉంది.

**ముగింపు**

ఇరవై ఐదేళ్ల దళిత ఉద్యమాల్ని, పోరాటాల్ని రేఖామాత్రంగా పరిచయం చేయడానికే ఈ వ్యాసం పరిమితమయింది. మొత్తంగా సమగ్ర సమీక్షకు మరో వ్యాసం రాయాల్సి ఉంది. దళితుల అత్యాచారాల ఘటనలో న్యాయవ్యవస్థ పనితీరుపై చర్చ మరో వ్యాసం అవుతుంది. దళిత ఉద్యమాన్ని, చైతన్యాన్ని ఎన్‌జిఒలు వక్రీకరిస్తూ బలహీనపరిచిన తీరుపై కూడా విశ్లేషణ అవసరం. అలాగే – తెలంగాణ సమస్య, దళిత స్త్రీల ఉద్యమాల నేపథ్యంలో వస్తున్న ప్రశ్నలపై కూడా మరింత చర్చ అవసరం.

**ఉపయుక్త రచనలు**


1) కలేకూరి ప్రసాద్, దళిత ఉద్యమం – దళిత సాహిత్యోద్యమం, సాక్షి, హైదరాబాద్, 1999.
2) కె. శ్రీనివాసులు, Caste, Class and Social Articulation in Andhra Pradesh: Mapping Differential Regional Trajectaries, 2002
3) కె. బాలగోపాల్, Ear to the Ground, Navayan, 2011
4) ఉ.సా. (సం). దళిత రణన్నినాదం, ఎదురీత పబ్లికేషన్స్, 2005
5) కె.వై. రత్నం, The Dalit Movement and Democratisation in Andhra Pradesh, 2008


*(రచయిత ఇంగ్లిష్ అండ్ ఫారిన్ లాంగ్వేజెస్ యూనివర్సిటీ అధ్యాపకులు)*

వీ

# మహోజ్వల భారత కార్మికోద్యమం

***భారత చరిత్రలో కార్మికవర్గం పుట్టి, పెరిగి, వర్గ స్పృహను సంతరించుకొని, ఏయే పోరాట మార్గాలలో నడిచి వచ్చిందో, ఇవాళ్టి కార్మిక జీవన, పోరాట స్థితిగతులు ఏమిటో వివరిస్తున్నారు పి.వి. రమణ***

*'అన్ని దేశాల కార్మికోద్యమ చరిత్ర పరిశీలిస్తే, పురోగామిగా ఉన్న కార్మికవర్గం సోషలిస్టు భావాలను సులభంగా, త్వరితంగా అర్థం చేసుకొంటుందని తెలుస్తుంది. వీరిలో కార్మికోద్యమంలో అగ్రగామిగా ఉన్న కార్మికులు, శ్రామిక వర్గ ప్రజల విశ్వాసాన్ని చూరగొని శ్రామిక వర్గ సంఘాలను నిర్మించి కార్మికుల విజ్ఞానం పెంపొందిస్తారు. వీరు సోషలిస్టు సిద్ధాంతాన్ని హృదయ పూర్వకంగా అంగీకరించి, స్వతంత్రంగా సోషలిస్టు సిద్ధాంతాలను రూపొందించడానికి కృషి చేస్తారు.'*

*– లెనిన్*

ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద పెట్టుబడి కార్మికవర్గంపై దుర్మార్గమైన దాడులు కొనసాగిస్తోంది. మన దేశ పాలకులు కార్మికోద్యమాన్ని ధ్వంసం చేసేందుకు, బలహీనపరిచేందుకు, పక్క దారులు పట్టించేందుకు నానా ప్రయత్నాలు చేస్తున్నారు. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణల పేరుతో కార్మికుల జీతభత్యాల కుదింపు, పరిశ్రమల మూసివేత, సామాజిక సంక్షేమం కోత, సిబ్బంది కుదింపు, పని భారం పెంపు, హక్కులపై వేటు, ప్రైవేటీకరణ, కాంట్రాక్టీకరణలతో పాటు, కనీసం యూనియన్ ఏర్పాటు చేసుకోవాలన్నా తీవ్రమైన నిర్బంధాలు, దాడులు, అరెస్టులు, చివరకు హత్యలు కూడా కొనసాగిస్తున్నారు. మొన్న యానాంలోనూ, నిన్న మానేసర్‌లోనూ జరిగిన హింస భవిష్యత్‌లో కార్మికవర్గంపై జరగబోయే మరింత ప్రమాదకరమైన దాడులకు సంకేతాలుగా కనిపిస్తున్నాయి.

మరి లెనిన్ ఆశించినట్లు మన దేశ కార్మికవర్గం స్వతంత్రంగా సోషలిస్ట సిద్ధాంతాలు రూపొందించి పెట్టుబడి దాడులను తిప్పికొట్టగలదో లేదోనని చాలా మంది ఆందోళన చెందుతున్న పరిస్థితి ఉంది. భారత కార్మికోద్యమ చరిత్రలో ఉత్తేజకరమైన సంఘటనలు అనేకం ఉన్నాయి. నేడు కార్మికోద్యమం ఎదుర్కొంటున్న బలహీనతల నుండి, నిర్లిప్త పరిస్థితి నుండి బయటపడడానికి, ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాన్ని దృఢంగా కొనసాగించడానికి స్ఫూర్తినిచ్చే ఆ చరిత్రను తెలుసుకొందాం.

1834లో బ్రిటిష్ వలస రాజ్యాలలో బానిస విధానం రద్దు చేయబడడంతో, భారత దేశం నుండి వలసల వెల్లువ ప్రారంభమైంది. 1834–37ల మధ్య కాలంలో పదిహేడు వేల మంది భారత కార్మికులు పనుల కోసం దేశాన్ని విడిచిపెట్టి వెళ్లారు. ఆధునిక పరిశ్రమలకు భారత దేశంలో 1850–70లలో పునాది పడింది. దానితోటే భారత కార్మికవర్గం కూడా అవతరించింది. ఈ విధంగా మన దేశంలో కార్మికులు మొదట కార్మికవర్గంగా పరిణామం చెందారు.

## ప్లాంటేషన్ కార్మికుల స్థితి

చెరకు సమృద్ధిగా పండే బ్రిటిష్ వలస దేశాలైన ఆఫ్రికా, వెస్టిండీస్‌లకు మన దేశం నుండి లక్షలాది మంది కార్మికులు వలసలు పోయారు. 1870 నాటికి పురుషులు, స్త్రీలు, పిల్లలు మొత్తం ఐదు లక్షలకు పైగా దేశంలోని వివిధ ప్రాంతాల నుండి విదేశాలకు ఎగుమతి చేయబడ్డారు. 1824–70ల మధ్య మారిషస్‌కు 3,51,401 మంది, బ్రిటిష్ గయానాకు 79,691 మంది, ట్రినిడాడ్‌కు 42,519 మంది, జమైకాకు 15,169 మంది, బ్రిటిష్ వెస్టిండీస్ దీవులకు 7,021 మంది, ఫ్రెంచి రి-యూనియన్‌కు 15,505, ఫ్రెంచి వెస్టిండీస్ దీవులకు 16,341 మంది, దక్షిణాఫ్రికాకు 6,448 మంది, మొత్తం 5,33,595 వలస వెళ్లినట్లు లెక్కలు చెపుతున్నాయి. 19వ శతాబ్దానికి భారతదేశం నుంచి వలస వెళ్లిన కార్మికుల సంఖ్య డెబ్బై లక్షల వరకు ఉంటుంది. ఉధృతి తగ్గినప్పటికీ వలసపోవడం 1917 వరకూ కొనసాగింది.

వలసపోయిన భారత కార్మికులు తీవ్రమైన దోపిడీకి, హింసకు గురయ్యారు. 1838 జూన్ 15న బొంబాయి గజెట్ 'వంచితులైన ఈ పేద ప్రజలకు ఉద్యోగాల ఆశ చూపి మోసగిస్తున్నారు. ఈ కూలీలు తమ గమ్యం చేరుకొన్నది మొదలు, బానిసల వలె పెత్తందారీ ఆధిపత్యానికి లోబడి ఉన్నారు. బానిసత్వం రద్దు చేయబడిన వలసలకు ఈ పేద ప్రజానీకం చేరవేయబడుతున్నారు. కానీ అక్కడకు చేరుకోవడంతోనే బానిసలవుతున్నారు' అని ప్రకటించింది.

ఆ రోజుల్లో విపరీతంగా లోడ్ చేయబడిన సామానులు చేరవేసే ఓడలలో పశువులను కుక్కినట్లు, కార్మికులను కుక్కి ఇతర దేశాలకు చేరవేస్తుండేవారు. వీరిని అక్కడ చాలా నీచంగా చూసేవారు. కడుపు నిండా తిండి దొరికేది కాదు. చాలామంది గమ్యాన్ని చేరకముందే మార్గమధ్యంలోనే మృత్యువాత పడుతుండేవారు. గమ్యాన్ని చేరిన వారు తీవ్రంగా అలసట చెంది ఉండడం వలన శారీరకంగా, మానసికంగా దిగజారిపోయేవారు. అక్కడ రోజుకు 18 గంటలు పని చేయాల్సి రావడంతో అధిక సంఖ్యలో చనిపోయేవారు.

## అస్సాం టీ తోటలు

19వ శతాబ్దం ప్రారంభంలో భారతదేశంలో టీ తోటల పెంపకం ఆరంభమైంది. 1815 ప్రాంతంలో ఈస్టిండియా కంపెనీ చైనాతో టీ వ్యాపారం ద్వారా అధిక లాభాలు సాధించింది. 1833లో చైనాతో వ్యాపారంపై ఈస్టిండియా కంపెనీ గుత్తాధిపత్యం అంతం కావడం, భారతదేశంలో టీ వాడకాన్ని ప్రవేశపెట్టడానికి దారితీసింది. భారతీయ తేయాకు పరిశ్రమ అస్సాంలోనూ, బెంగాల్ డార్జిలింగ్ లోనూ ప్రారంభమై

1851 నాటికి తేయాకు ఉత్పత్తి క్రమబద్ధంగా పెరగసాగింది. భారతీయ తేయాకు పరిశ్రమలో 1895 నాటికి 5,53,817, 1919 నాటికి 9,73,351, 1928 నాటికి 9,06,785 కార్మికులు పని చేస్తున్నారు.

కంపెనీలు నియమించిన సర్దార్‌లు గ్రామాల నుండి కార్మికులను తీసుకువచ్చి, పురుషులు, స్త్రీలు, పిల్లలు అనే విచక్షణ లేకుండా చిత్రహింసలు పెట్టి దారుణంగా దోపిడీ చేసేవారు. కూలీలు పారిపోకుండా మార్గాల వద్ద కాపలాలు ఏర్పాటు చేసేవారు. కూలీల నివాసాల చుట్టూ ముళ్లకంచెలు వేసి రాత్రి పూట కంచె దాటనిచ్చే వాళ్లు కాదు. పారిపోతూ పట్టుబడినవాళ్లను కొరడాలతో కొట్టేవారు. యజమానులు, వారి ప్రతినిధులు కార్మికులపై సాగిస్తున్న రాక్షసకృత్యాల వలన చాలామంది కార్మికులు ప్రాణాలు కోల్పోయేవారు. అస్సాంలో కమిషనర్‌గా పనిచేసిన ప్రభుత్వాధికారి 'అస్సాంలో కూలీలు చాలా ప్రమాదకరమైన స్థితిలో ఉన్నారు. కార్మికుల్ని పీల్చి పిప్పిచేసే పరిస్థితుల్లో మృత్యువాత పడడం ఆశ్చర్యపడాల్సిన విషయమేమీ కాదు' అని తెలిపారంటే వారి రాక్షసత్వం ఏ స్థాయిలో ఉండేదో అర్థమవుతుంది.

చాలని జీతాలు పెంచాలనీ, తక్కువ రకం బియ్యం సరఫరాకు వ్యతిరేకంగా డమ్ డమ్ కంపెనీలోని తోట కార్మికులు 1920, సెప్టెంబర్ 6న పనులు చేయడానికి నిరాకరించారు. మొట్టమొదటి నిరసన భయాలు ప్రారంభమయ్యాయి. (తన భూమిని ఆక్రమించిన జాగిర్దార్‌ను హత్యచేసి, అస్సాంలో తలదాచుకున్న గోండు వీరుడు కొమురం భీము, అక్కడి తేయాకు తోటల కార్మిక ఉద్యమాలలో పాల్గొన్నట్లు తెలుస్తుంది.) 1921లో దేశవ్యాప్తంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సహాయ నిరాకరణోద్యమం ఉధృతంగా కొనసాగుతున్న సమయంలో టీ తోటల కార్మికులు వేలాది మంది ఈ బానిస సంకెళ్లను తెంచుకొని తమ స్వస్థలాలకు వెళ్లిపోవాలని నిర్ణయించుకొన్నారు. ఎనిమిది వేల మంది కార్మికులు ఏకమై తమ ఊళ్లకు ప్రయాణమయ్యారు. దాంతో యజమానులు వారిని ఆపడానికి అనేక కుట్రలు పన్నారు. కిరోల్‌గంజ్ రైల్వేలో కూలీలకు టిక్కెట్లు ఇవ్వవద్దని యూరోపియన్ అధికారులు ఆదేశించారు. దాంతో వారు కాలినడకన ప్రయాణం కొనసాగించడానికి నిర్ణయించుకున్నారు. 1921 మే 20న పురుషులు, స్త్రీలు, పిల్లలు గాఢ నిద్రలో ఉండగా, డివిజనల్ కమిషనర్ ఆదేశానుసారం గూర్ఖా సైనికులు వారిపై దాడిచేసి నిర్దాక్షిణ్యంగా బాయ్‌నెట్‌లతో పొడిచారు. ఎవ్వరినీ వదలలేదు. చిత్రహింసలకు గురిచేసి, అనేకమందిని నదిలోకి విసిరేసారు. ఈ అమానుషకాండ గురించి విన్న చందాపూర్ ప్రజానీకం బాధితులను కాపాడడానికి ముందుకు వస్తే ప్రభుత్వ యంత్రాంగం అడ్డుకొంది. దీంతో బెంగాల్ ప్రజలు కోపోద్రేకాలతో సార్వత్రిక సమ్మె జరిపారు. అస్సాం - బెంగాల్ రైల్వే కార్మికులు పనులు నిలిపివేసి, రైల్వేలను స్తంభింపచేసి తమ సంఘీభావం తెలిపారు.

### పారిశ్రామిక యుగం ప్రారంభం

మన దేశంలో మొట్టమొదటి బొగ్గు గని రాణిగంజ్‌లో 1832లో ప్రారంభమైంది. మొదటి బట్టల మిల్లు బొంబాయిలో 1854లో, మొదటి జూట్‌మిల్లు కూడా అదే సంవత్సరం కలకత్తాలో ప్రారంభమయ్యాయి. మొదటి రైల్వే లైను 1853లో కలకత్తా నుండి రాణిగంజ్ వరకు, బొంబాయి నుండి థానే వరకు ప్రారంభమయ్యాయి. దీంతో పారిశ్రామిక శ్రామికవర్గం మొదటి అడుగులు ప్రారంభమయ్యాయి.

రైల్వేలు ప్రారంభమై తొమ్మిది సంవత్సరాలు గడవక ముందే 1862లో రైల్వే కార్మికులు 1200 మంది ఎనిమిది గంటల పని కోసం సమ్మె చేయడం భారత కార్మికోద్యమంలో గొప్ప సంఘటన. ఎందుకంటే చికాగోలో కార్మికులు నిర్వహించిన చారిత్రాత్మకమైన 'మే'డే పోరాటానికి ఇరవై నాలుగు సంవత్సరాల ముందే మన కార్మికులు ఆ పోరాటంలో భాగస్వాములయ్యారు. ఈ సమ్మె గురించి బెంగాలీ వారపత్రిక సోమ్ ప్రకాశ్ 'హౌరా రైల్వేస్టేషన్‌లో పనిచేసే 1200 మంది కార్మికులు సమ్మె చేశారు. లోకోమోటివ్ శాఖలో పనిచేసే కార్మికులు రోజుకు ఎనిమిది గంటలు పనిచేస్తుండగా తాము పది గంటలు పని చేయాల్సి వస్తోందని వారు అన్నారు. పని కొద్దిరోజులు ఆగిపోయింది. రైల్వేవారు వారి కోర్కెను అంగీకరించాలి. లేకపోతే వారికి పనివారు దొరకరు' అని రాసింది. అప్పటికి కార్మిక సంఘాలే ఏర్పడలేదు. అయినా కార్మికుల చైతన్యస్థాయికి దిక్సూచిగా వారి పోరాటం నిలిచింది.

మొట్టమొదటి కార్మిక సంఘం బొంబాయిలో బట్టల మిల్లు కార్మికులతో ప్రారంభమయింది. మహాత్మా జోతిరావు పూలే సహచరుడైన నారాయణరావు మెఘాజి లోఖండే 1884లో 'మిల్ హాండ్స్ అసోసియేషన్' ఏర్పాటు చేశారు. సెప్టెంబర్ 23 నుండి 26 వరకు బొంబాయిలో సమావేశాలు జరిపి 5500 మంది కార్మికుల సంతకాలతో ప్రభుత్వానికి మెమోరాండం సమర్పించారు. పని గంటలు తగ్గించాలనీ, ఆదివారం సెలవు ఇవ్వాలనీ, నెల జీతం 15వ తేదీలోగా ఇవ్వాలనీ, ప్రమాదానికి, అస్వస్థతకు గురైన కార్మికులకు కోలుకొనే వరకు జీతాలు చెల్లించాలనీ డిమాండ్ చేశారు. ఏప్రిల్ 20, 1890లో లోఖండే ఏర్పాటు చేసిన సమావేశానికి పదివేల మంది మిల్లు కార్మికులు హాజరయ్యారు.

దేశంలో 1870 నాటికి అనేక పరిశ్రమలు ఏర్పడడంతో కార్మికుల పోరాటాలు కూడా ప్రారంభమయ్యాయి. జీతాల పెంపు కోసం 1877లో నాగపూర్ ఎంప్రెస్ మిల్లులో సమ్మె జరిగింది. 1882-1890ల మధ్య బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో 25 సమ్మెలు జరిగినట్లు రికార్డు చేయబడింది. అప్పటికి ఏ సంఘాలూ ఏర్పడకపోయినప్పటికీ, కార్యాచరణలో ఐక్యత పెరగడం, ప్రాథమిక కార్మికవర్గం చైతన్యం పెరగడం ప్రారంభమయింది. దీనికి ఉదాహరణగా 'ఇండియా పరిశ్రమాభివృద్ధి' అన్న గ్రంథంలో డి.ఎచ్.బుచానన్ అభిప్రాయాన్ని పేర్కొనవచ్చు. '1890-1908ల మధ్య నిజమైన సంఘాలేవీ లేవనీ దాదాపు అందరూ కమిషన్ ముందు చెప్పారు. అయినప్పటికీ ఒక్కొక్క మిల్లులోని కార్మికులు సామాన్యంగా ఐకమత్యంతో పనిచేయగలుగు తున్నారు. ఒక గుంపుగా పనిచేస్తున్నప్పుడు వారు చాలా స్వతంత్రులు అని చాలా మంది చెప్పారు. 1892లో బాయిలర్ల ఇన్‌స్పెక్టర్ 'ప్రజలలో లేనిది, కార్మికుల మధ్య ఉన్నది పేరులేని, లిఖిత పూర్వకంగా లేని ఐక్యతా, బంధమూ' అని పేర్కొన్నాడు. 'ఇది కేవలం గాలిలోనే ఉన్న శక్తివంతమైనది' అని బొంబాయి కలెక్టర్ రాశారు. బొంబాయి రాష్ట్ర పరిశ్రమల డైరెక్టరైన బరూచా 'కార్మికులు యజమానులకు వ్యతిరేకంగా అతి బలవత్తరంగా ఉన్నారు. వారు కార్మిక సంఘమేదీ లేకున్నా కలిసి పనిచేయగలరు' అన్నాడు. ఈ ప్రకటనలో అతిశయోక్తి కొంత ఉన్నదనుకొంటే వార్ధాలో బ్రిటిష్ డిప్యూటీ కమిషనర్ చెప్పిన మాటలు

దానినే ధృఢపరుస్తున్నాయి. 'కార్మికులే పరిస్థితిని తమ చేతుల్లో ఉంచుకొన్నారు. కార్మికుల కన్నా యజమానులకే నిజంగా రక్షణ అవసరముంది' అన్నాడు. ఆనాటికే కార్మికవర్గ చైతన్యం చూసి పాలకులు ఎంత భయపడుతున్నారో అర్థం అవుతుంది.

**పోరాటాల వెల్లువ**

1895లో బడ్జ్ బడ్జ్ జూట్ మిల్లులో సమ్మె జరిగింది. సమ్మెలో పాల్గొన్న కార్మికులపై పోలీసులు కాల్పులు జరిపారు. 'మంగళవారం రాత్రి 8 గంటలకు బడ్జ్ బడ్జ్ వద్ద తీవ్రమైన కొట్లాట జరిగింది. జూట్‌మిల్లు కార్మికులు ఏడు వేల మంది గుమిగూడి యూరోపియన్ ఉద్యోగుల బంగళా అద్దాలను పగలగొట్టారు. అధికార్లు కార్మికులపై కాల్పులు జరిపారు. కార్మికులతోపాటు, గాయపడిన ఇద్దరు కానిస్టేబుళ్లను, మిల్లు దర్వానును కూడా ఆసుపత్రిలో చేర్చారు. చాలా అరెస్టులు జరిగాయి' అంటూ అమృతబజార్ పత్రిక రాసింది.

1905లో బెంగాల్ విభజనతో ప్రారంభమైన స్వదేశీ ఉద్యమ ప్రభావం బెంగాల్‌కే పరిమితం కాకుండా మొత్తం దేశం మీద, ప్రత్యేకంగా కార్మికవర్గంపై పడింది. దేశంలో మొదటిగా ప్రారంభమైన వాటిలో బెంగాల్ ప్రెస్ వర్కర్స్ యూనియన్ దీనికి ఉదాహరణ. తర్వాత అనేక సమ్మెల వెల్లువ ప్రారంభమైంది. హౌరాలోని బర్న్ అండ్ కంపెనీ కార్మికులు, కలకత్తా ట్రామ్‌వే కార్మికులు సమ్మె చేశారు. కలకత్తా కార్పొరేషన్‌కు చెందిన పాకీ పనివారు దాదాపు రెండు వేల మంది జీతాల పెంపు కోసం సమ్మె చేసి విజయం సాధించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యంతో జరిగిన ఉద్యమాల్లో 1906 జూలై నుండి సెప్టెంబర్ వరకు జరిగిన ఈస్టిండియా రైల్వేలోని బెంగాల్ సెక్షన్ రైల్వే కార్మికుల సమ్మెను ఉదాహరణగా చెప్పుకోవచ్చు. 'ఈ సమ్మె రాజకీయ ఆందోళనకు ప్రత్యక్ష సాక్ష్యంగా నిలిచింది' అని లండన్ టైమ్స్ పత్రిక రాసింది. టైమ్స్ ఆఫ్ ఇండియా కథనం ప్రకారం 'స్వదేశీ కార్మికులందరూ పనులు వదలిపెట్టారు. హౌరా నుండి అసన్‌సోల్ వరకూ, బర్ద్వాన్‌తో సహా అన్ని స్టేషన్‌లు మూతపడ్డాయి. సరకుల రవాణా పూర్తిగా స్తంభించి పోయింది' అని రాసింది.

జాతీయ ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం ఉన్న సమ్మెలలో బహుశా ఇదే మొదటిది కావచ్చు. ఈ సమ్మె వృథా కాలేదు. మన దేశ మొదటి కార్మికసంఘాల్లో ఒకటైన ఈస్ట్ ఇండియా రైల్వే ఎంప్లాయిస్ యూనియన్ ఈ సమ్మె వల్లనే ఏర్పడింది. కార్మికుల్లో పెరుగుతున్న జాతీయ భావాలను చూసి బ్రిటిష్ ప్రభుత్వం భయపడింది. ఆనాటి స్పెషల్ బ్రాంచి నివేదిక ఇలా వాదించింది. 'కలకత్తా ఆందోళనకారులను ప్రేమతోష ఘోష్, ఎ.కె. ఘోష్, లియాకత్ హుస్సేన్ లాంటి నాయకులు, అసన్‌సోల్, రాణిగంజ్, జసూల్ పూర్, సాహెబ్‌గంజ్ ప్రాంతాలలో ఉన్న రైల్వే యూనియన్‌లో చేరవలసిందిగా ఆ ప్రాంతాల కార్మికులను ఒత్తిడి చేస్తున్నారు. తమ యూనియన్ రైల్వే కార్మికులు చేసే పోరాటాలకు మద్దతిస్తుందని ప్రచారం చేస్తున్నారు. రహస్య సమావేశాలు జరిపి అవసరం వస్తే కూలీలను కూడా సమ్మెలోకి దించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. సమ్మెలో ఉద్యోగులు పాల్గొనకుంటే వారిని సాంఘికంగా వెలివేయాలని కూడా సూచిస్తున్నారు'. దీన్ని బట్టి ఆనాటి పరిస్థితి మనకు అర్థం అవుతుంది.

1907లో కూడా అనేక సమ్మెలు జరిగాయి. నవంబర్ 18న రైల్వే గార్డులు నిర్వహించిన సమ్మెలో యూరోపియన్‌లు, ఆంగ్లో ఇండియన్‌లు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ సమ్మె దేశాన్ని బాగా కదిలించింది. అసన్‌సోల్ రైల్వేస్టేషన్‌లో ప్రారంభమైన సమ్మె తూర్పున తుండులా వరకు వ్యాపించింది. కలకత్తాకు ఒక్క ట్రైన్ రాకుండా సమ్మె విజయవంతమైంది. రెండు వందల మంది గార్డులు రైలు పట్టాల మీద కూర్చొని ఏ రైలు రాకుండా కాపలాకాసారు. మూడు వందల వ్యాగన్‌లు నిలిచిపోయి, కలకత్తాలో మిల్లులకు బొగ్గు కొరత ఏర్పడింది. కలకత్తా రేవు నుండి బయలుదేరవలసిన ఓడలు ఆగిపోయాయి. నవంబర్ 24 నాటికి కలకత్తా రేవు ప్రాంతంలో వెయ్యి ఖాళీ వాగన్‌లు, నాలుగు వందల సరుకులను నింపిన వాగన్‌లు నిలిచిపోయాయి. అన్ని మార్గాల రాకపోకలు నిలిచిపోయాయి. 1907 నవంబర్ 18 నుండి 28 వరకు జరిగిన ఈ సమ్మె మూలంగా వైస్రాయి ప్రధాన కార్యాలయమున్న కలకత్తాకు భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. సోవియట్ పరిశీలకుడు ఎ.ఐ.లెవ్‌తోస్కీ 'ఇది బ్రిటిష్ వాడి అధికారానికి తీవ్ర విఘాతం. ఈ దెబ్బతో ప్రభుత్వానికి తమ అమోఘమైన శక్తి మీద నమ్మకం సడలింది' అని రాసారు.

1906 నాటికి భారతదేశంలో 2వ పెద్ద నగరమైన బొంబాయిలో 168 ఫ్యాక్టరీలు ఉండేవి. జనాభా దాదాపు పది లక్షల వరకూ ఉండేది. దానిలో 34 శాతం మంది కార్మికులు. వారిలో రెండు లక్షల మంది పరిశ్రమలలోను, ఒక లక్ష మంది బట్టల మిల్లుల్లోనూ పనిచేసేవారు. 1905-07ల మధ్య కాలంలో రష్యాలో సాగిన విప్లవ ప్రభావం బొంబాయి కార్మికవర్గంపైన పడింది. భారత బూర్జువా వర్గంలోనూ కలతలు రేగాయి. 1907లో ఇవి సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ సభలో బాహాటంగా కనిపించాయి. మితవాదులు, అతివాదులుగా చీలిపోయారు. మితవాదులు బ్రిటిష్ ప్రభుత్వానికి సహకారమిచ్చి, విదేశీ వస్తు బహిష్కారాన్ని, హింసా మార్గాన్ని విడనాడాలని వాదించారు. మరోవైపు అతివాదులుగా పిలవబడే వర్గం ప్రధాన నాయకుడు తిలక్ బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా ఉద్యమం నిర్వహించాలని వాదించాడు. తన అనుచరులతో ఆయన కార్మికవర్గం వద్దకు పోయి ప్రజాపోరాటంలో పాల్గొనవలసిందిగా కోరారు. 1908 జూన్ 24న తిలక్‌ను అరెస్టు చేసి, విచారణ జరిపి జూలై 22న దేశద్రోహం నేరం కింద ఆరు నెలల జైలు శిక్ష విధించారు. దీంతో దేశవ్యాప్తంగా తీవ్ర నిరసనలు వ్యాపించాయి. అనేక చోట్ల సమ్మెలు, హర్తాళ్లు, ప్రదర్శనలు జరిగాయి. బొంబాయిలో జూలై 23న మొదటిసారిగా సార్వత్రిక సమ్మె జరిగింది. లక్షలాది మంది కార్మికులు రాజకీయ సమ్మెలో పాల్గొన్నారు. ప్రజలు సాయుధ పోలీసులను, సైన్యాన్ని ఎదుర్కొని వీధి పోరాటాలలో పాల్గొన్నారు. బొంబాయి వీధుల్లో భారత కార్మికవర్గం మొదటిసారిగా వీధి పోరాటాలలో పాఠాలు నేర్చుకొంది. కార్మిక వర్గ విప్లవ పోరాటాలు ఈ సంఘటనతో కొత్త అధ్యయనాన్ని తెరిచాయి. 'అంతవరకు రాజకీయ సమస్యల పట్ల కార్మికుల ప్రతిఘటన చవిచూడని అధికారులు, పరిస్థితిని తీవ్రంగా పరిగణించారు. తెల్లతోలు శాసన రక్షకులు రంగం మీదకి రాగానే నల్లజాతి కార్మికులు పారిపోతారని విశ్వసించారు. తమ వర్గం శక్తినీ, హుందాతనాన్నీ, పూర్తిగా నమ్ముకొన్న కార్మిక జనాన్ని

ఎదుర్కొంటున్నామన్న సంగతి పోలీసులకు ఏమాత్రం తెలియదు' అని డి.సి.హోమ్ వ్యాఖ్యానించారు.

ఈ పోరాటంలో చాలా మంది మరణించారు. గణపత్ గోవింద్ అనే కార్మికుడు ఆఖరి శ్వాస విడిచే వరకూ జనాన్ని పోరాడమని సూచనలిస్తూనే ఉన్నాడు. కేశవ్‌లాల్ కంజీ అనే గుజరాతీ వ్యాపారస్తుడు పోలీసులపై రాళ్లు రువ్వుతూ పోరాటంలో పోలీసు కాల్పుల్లో చనిపోయాడు. తిలక్‌కు పడిన ఆరు సంవత్సరాల జైలు శిక్షకు ఏడాదికి ఒకరోజు చొప్పున సమ్మె చేయాలనే ప్రతిజ్ఞను కార్మికులు జూలై 23 నుండి 28 వరకు కొనసాగించి నిలబెట్టుకున్నారు. ముస్లింలు ఈ సమ్మెలో పాల్గొనలేదని బ్రిటిష్ ప్రభుత్వం ప్రచారం చేసింది. కాని అది పూర్తిగా అబద్ధం. కార్మికుల్లో 20 శాతం ఉన్న ముస్లింలు సమ్మెలో పాల్గొన్నారు. నగరంలో హిందువులు, ముస్లింలకు చెందిన అన్ని షాపులూ సమ్మెకు మద్దతుగా మూసివేసారు.

ఈ పోరాటం గురించి లెనిన్ 'భారతదేశంలో కూడా శ్రామిక వర్గం చైతన్యవంతమైన ప్రజా పోరాటాలు నడిపే దశకు ఎదిగింది. అందువలన రష్యన్ చక్రవర్తుల పద్ధతులో సాగే బ్రిటిష్ పాలనకు అంతిమకాలం ఆసన్నమైంది' అని వ్యాఖ్యానించడం ఎదుగుతున్న భారత కార్మికవర్గ చైతన్యానికి గొప్ప గుర్తింపు. డి.సి.హోమ్ ఈ పోరాటం గురించి 'దురదృష్టవశాత్తూ, స్వాతంత్ర్య పోరాటం గురించి రాసిన చరిత్రలో గానీ, అనేక ఇతర రచనలలో గానీ, ఈ సంఘటనకు సరైన స్థానం లభించలేదు. చరిత్రను అబద్ధాలతో నింపిన సామ్రాజ్యవాదులు గానీ, బూర్జువా చరిత్రకారులు గానీ ఈ సమ్మె ప్రాధాన్యతను ఉద్దేశపూర్వకంగానే తొక్కి పెట్టారు. దీనికి ఒక్కటే కారణం. వీరిద్దరికీ కార్మికవర్గ చైతన్యంతో చేసిన పోరాటం అంటే విపరీతమైన భయం. కానీ కార్మికవర్గం తాము ప్రథమంగా నిర్వహించిన ఉజ్వల పోరాటాన్ని, అందులో అమరులైన వీరుల జ్ఞాపకాలను తమ హృదయాలలో పదిలపర్చుకొన్నది. ఈ సంఘటన గురించిన వాస్తవం ఇంతవరకు సమగ్రంగా ఎవ్వరూ చెప్పలేదు' అని రాసారు.

1917లో విజయవంతమైన రష్యన్ విప్లవం, భారత కార్మికవర్గంపై గొప్ప ప్రభావం చూపింది. సమ్మెలు వెల్లువలా సాగాయి. ప్రత్యేకంగా 1920లో కలకత్తా జూట్‌మిల్లు కార్మికులు, బొంబాయిలో, షోలాపూర్‌లో, మిల్లు కార్మికులు, మద్రాస్‌లో మిల్లు కార్మికులు, అహ్మదాబాద్‌లో మిల్లు కార్మికులు, ఇంకా రైల్వే, పోర్ట్ అండ్ డాక్, ఇంజనీరింగ్ వర్క్‌షాప్స్, ఆయిల్ కర్మాగారాలు, ప్రభుత్వ కార్యాలయాలు, ప్రెస్, ట్రామ్‌వే, గ్యాస్, ఎలక్ట్రిసిటీ, మునిసిపాలిటీ కార్మికుల సమ్మెలు జరిగాయి. సమ్మెల వెల్లువలు దాదాపు అన్ని పారిశ్రామిక రంగాలకూ వ్యాపించాయి.

ప్రపంచవ్యాప్తంగా రష్యా విప్లవ ప్రభావాన్ని గమనించిన పెట్టుబడిదారీ వర్గాలు దాన్ని అరికట్టడానికి పన్నాగాలు పన్నారు. దాని పర్యవసానమే 1918లో అంతర్జాతీయ కార్మిక సంఘం (ఐఎల్‌ఒ) ఏర్పాటు. దాని ద్వారా పోరాటాలను చట్ట పరిధిలో మొద్దుబార్చాలని నిశ్చయించుకొన్నారు.

సంఘటిత ఉద్యమాల ప్రభావాన్ని భారత కార్మికవర్గం గుర్తించింది. నిరంతర ప్రయత్నాలు ఫలించి 1920 నాటికి రెండు లక్షల యాభై వేల మంది సభ్యులుగా గల 125 యూనియన్‌లు ఏర్పడ్డాయి. ఈ మహోద్యమ ఉధృతిని అరికట్టడానికి బ్రిటిష్ ప్రభుత్వం రెండు సాధనాలు ప్రయోగించింది. ఒకటి, ఉద్యమాలను దారుణంగా అణచివేయడం. రెండవది, అధికార యంత్రాంగం సమస్యల్ని పరిష్కరిస్తుందని నమ్మించి దగా చెయ్యడం. రెండవదాని పర్యవసానమే కొన్ని కార్మిక చట్టాలను తీసుకురావడం. కోర్టు ఆఫ్ ఎంక్వైరీలు, లేబర్ ఎడ్వయిజరీ బోర్డులు, ప్రత్యేక న్యాయస్థానాలు, వర్కర్స్ కమిటీలు, కన్సీలియేషన్ బోర్డులు ఏర్పడ్డాయి. ఇవన్నీ కార్మికుల వర్గ చైతన్యాన్ని మొద్దుబార్చి, పరిష్కారాలకు నిరంతరం ఈ వ్యవస్థల చుట్టూ తిరిగేటట్టు చేయడానికే.

1920లో అక్టోబర్ 31న అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఎఐటియుసి) ఏర్పడింది. ప్రారంభ సమావేశానికి లాలా లజపత్‌రాయ్ అధ్యక్షత వహించారు.

కార్మిక సంఘ నాయకుడు సింగార వేలు చెట్టియార్ అధ్యక్షతన మద్రాసు బీచ్‌లో భారతదేశంలో మొట్టమొదటిసారిగా మే 1న మేడే జరిగింది. సమయానికి ఎర్రజెండా అందుబాటులో లేకపోవడంతో కామ్రేడ్ చెట్టియార్ తన కుమార్తె చీర చింపి తన ఇంటిపై ఎర్రజెండా ఎగరవేశారు.

1928లో జరిగిన ఆలిండియా పెజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ మహాసభల్లో ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై సిద్ధాంతపరమైన విధానం సమీక్షింపబడి ఆమోదించబడింది. ఈ తీర్మానంలో కార్మికోద్యమానికి ఉపయోగపడే అంశాలు చాలా ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి 1) అభివృద్ధి చెందిన దేశాలలో కూడా వినాశకరమైనదిగా నిరూపించ బడిన 'పారిశ్రామిక శాంతి' విధానాన్ని భారత ట్రేడ్ యూనియన్ ఉద్యమం నుండి బహిష్కరించాలి. 2) మన దేశంలో అనేక మంది కార్మిక నాయకులు ఉద్యమ ప్రధాన లక్ష్యం యజమానులకు, కార్మికులకు సత్సంబంధాలు నెలకొల్పడమేనని చెప్పి కార్మికులను మోసం చేస్తున్నారు. కాని వాస్తవానికి ట్రేడ్ యూనియన్ ఉద్యమ ప్రధాన లక్ష్యం యజమానులతో పోరాడి జీవన పరిస్థితులను మెరుగు పర్చుకోవడమే. 3) ట్రేడ్ యూనియన్ ఉద్యమం అంతర్జాతీయ సమస్యలపై కూడా స్పష్టమైన వైఖరినవలంబించాలి. 4) సామ్రాజ్య వ్యతిరేక సమితికి ఎఐటియుసిని అనుబంధం చేయాలి. సరైన రాజకీయ సిద్ధాంత అవగాహన కలిగిన కమ్యూనిస్టులు, తదితర వామపక్ష భావాలు కలిగినవారు మిలిటెంట్ ట్రేడ్ యూనియన్ ఉద్యమం నిర్మించే బృహత్తర కార్యక్రమం చేపట్టి, అనుభవజ్ఞులైన, రాజ్యాంగ పరిధిలోనే పోరాడాలని వాదించే వారినధిగమించారు.

దీనికి ఉదాహరణగా డిసెంబర్ 1928లో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో జరిగిన ఒక సంఘటన చెప్పవచ్చు. కలకత్తా ట్రామ్స్‌వే మెన్స్ యూనియన్, బెంగాల్ జూట్ వర్కర్స్ అసోసియేషన్, ఈస్టిండియా రైల్వే లేబర్ యూనియన్‌లతో సహా అనేక కార్మిక సంఘాలు ఇచ్చిన పిలుపు మేరకు ముజప్ఫర్ అహ్మద్, బంకిమ్ ఛటర్జీ, శివనాథ్ బెనర్జీ, గోపేన్ చక్రవర్తి, ధరణి గోస్వామి మొదలైన కమ్యూనిస్టులు, వామపక్ష అభిమానుల నాయకత్వంలో ముప్పై వేల మంది కార్మికులు కాంగ్రెస్ సమావేశం జరుగుతున్న ప్రదేశానికి ఊరేగింపుగా వెళ్లారు. 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి', 'స్వతంత్ర భారత రిపబ్లిక్ వర్ధిల్లాలి', 'మనం కోల్పోయేది ఏమీ లేదు బానిస సంకెళ్లు తప్ప' వంటి నినాదాలు చేస్తూ, కాంగ్రెస్ వాలంటీర్లు ప్రతిఘటిస్తున్నా లెక్కచెయ్యకుండా ప్రదర్శకులు సమావేశ స్థలంలోకి ప్రవేశించి

బ్రహ్మాండమైన సభ జరిపారు. జవహర్‌లాల్ నెహ్రూయే ఈ సభకు అధ్యక్షత వహించవలసి వచ్చింది. ఈ సందర్భంగా భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతూ ఒక తీర్మానం ఆమోదించడం అపూర్వమైన విషయం. 'అన్ని పరిశ్రమలలోని కార్మికులు, కర్షకులు హాజరైన ఈ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించి, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద విధానాల వలన సాగుతున్న దోపిడీ అంతమయ్యేవరకు విశ్రమించం అని ప్రకటిస్తోంది. సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యంగా పెట్టుకొని దేశంలోని వివిధ శక్తులను సమీకరించవలసిందిగా జాతీయ కాంగ్రెస్‌ను కోరుతున్నాం' అని తీర్మానం జరిగింది.

## మీరట్ కుట్ర కేసు

రష్యన్ విప్లవ ప్రభావంతో దేశంలో కమ్యూనిస్టు భావాలు నిరంతరం వ్యాప్తి చెందుతూ ఉన్నాయి. కార్మికవర్గంలో కూడా వర్గ చైతన్యం అభివృద్ధి చెందుతున్నది. రిట్రెంచ్‌మెంట్‌లకు, ఉద్యోగాల తొలగింపు, పనిభారం పెంపులకు వ్యతిరేకంగా, మెరుగైన జీతాల కోసం, యూనియన్లు ఏర్పాటు చేసుకొనే హక్కు కోసం, మానవులుగా జీవించడానికి అవసరమైన హక్కుల గురించి, జౌళి మిల్లులలో, రైల్వే వర్క్‌షాపులలో బొంబాయిలో 111, బెంగాల్‌లో 60, బీహార్, ఒరిస్సాలలో 8, మద్రాస్‌లో 7, పంజాబ్‌లో 2 పోరాటాలు సాగాయి. మొత్తం 203 సమ్మెలు జరిగాయి. అభివృద్ధి చెందుతున్న ఉద్యమాన్ని చూసి దెబ్బతీయాలని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 1929 మార్చ్ 20న కుట్రకేసు విధించి 31 మంది ప్రముఖ కమ్యూనిస్టు కార్మిక, కర్షక నాయకుల్ని అరెస్టు చేసి మీరట్‌లో విచారణ జరిపారు.

'కూలీ జనంలో ప్రస్తుతం నెలకొని ఉన్న ప్రమాదకరమైన పరిస్థితుల దృష్ట్యా, బొంబాయి, కలకత్తాలలో విచారణ జరపడం స్పష్టంగా వాంఛనీయం కాదు' అని ప్రభుత్వ అధికారులు చెప్పిన కారణంగా మీరట్ లాంటి చిన్న ఊరులో కేసు విచారణ జరిపించారు. 'తీవ్రవాద జాతీయ ఉద్యమాన్ని ఏ వర్గాలైతే బలపరుస్తాయో, ఆ వర్గాలకే కమ్యూనిజం నుండి తీవ్ర ప్రమాదాలు ఉన్నాయి. ఈ రెండు ఉద్యమాల మధ్య కృత్రిమ ఐక్యత ఏర్పడదానికి ఏమీ చేయరాదన్నది మన లక్ష్యం అయి ఉండాలి. ఆందోళనకారుల్లో ప్రధానంగా కమ్యూనిస్టులను అణచడానికి ప్రత్యేక ఆర్డినెన్స్ ప్రవేశపెట్టాలని' బొంబాయి వాణిజ్య మండలి, ఇండియన్ మర్చంట్స్ అసోసియేషన్ బ్రిటిష్ ప్రభుత్వాన్ని అర్థించాయంటే ఆనాటి కార్మికుల, ప్రజల పోరాట చైతన్యాన్ని గ్రహించ వచ్చు.

మీరట్ కుట్రకేసులో అరెస్టు అయిన వారిలో అధికశాతం కార్మిక సంఘ నాయకులే. వారిలో ముజఫర్ అహ్మద్, ఎస్.ఎ. డాంగే, కె.ఎన్. జోగ్లేకర్, ఎస్.వి. ఘాటే, కిషోర్ లాల్ ఘోష్, పి.సి. జోషి, ఎన్.ఎచ్. జబ్‌వాలా, లక్ష్మణ్ రామకదమ్ లాంటి ప్రముఖ నాయకులు ఉన్నారు. వీరిలో ఐదుగురు బొంబాయి బట్టల మిల్లుల 'గిర్ని కాంగార్ యూనియన్'కు చెందిన వారే ఉన్నారు. వీరితో పాటు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు, కార్మిక నాయకుడు, రైల్వే యూనియన్, గిర్ని కాంగార్ యూనియన్‌ల ఎగ్జిక్యూటివ్ కార్మికుల సంయుక్త సమ్మె కమిటీకి కోశాధికారి అయిన బెంజిమిన్ ఫ్రాన్సిస్ బ్రాట్లే, బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు, ఎ.ఐ.టి.యు.సి. కార్యనిర్వాహక వర్గ సభ్యుడు ఫిలిఫ్ స్ప్రాట్, బ్రిటిష్ జర్నలిస్ట్, న్యూస్పార్క్ పత్రిక సంపాదకుడు హ్యూరెస్టర్ హచిన్‌సన్‌లు ఉన్నారు.

కోర్టు విచారణ కొరకు తీసుకు రాబడిన ప్రతిసారీ నాయకులు 'ఇంక్విలాబ్ జిందాబాద్', 'కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్', 'సామ్రాజ్య వాదం, వలసవాదం నశించాలి', 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అనే నినాదాలు కోర్టు దద్దరిల్లేలా చేసేవారు. కోర్టులో వీరిపై ఆరోపణలు: 'కార్మికులకు యజమానులకు మధ్య ద్వేషం రగుల్కొల్పారు, కార్మిక, కర్షక పార్టీలను, యువజన సంఘాలను, యూనియన్లను స్థాపించారు, సమ్మెలను ప్రోత్సహించారు'. ముద్దాయిలలో ఒకరైన బెంగాలీ జనపనార కార్మిక సంఘ కార్యదర్శి గురించి 'కలకత్తా పాకీ పనివారి సమ్మెలో తాను పాల్గొనడంతో కుట్రలో ఈయన పాత్ర ఆరంభమైంది. బొంబాయి బట్టల మిల్లు కార్మికుల్లో వారి ప్రాబల్యం ప్రమాదకరమైనది. అది 1928 సమ్మెలోనూ, గిర్నికాంగార్ యూనియన్ విప్లవ విధానాలలోను కనపడింది' లాంటి అంశాలు ఉన్నాయి. చివరకు బ్రిటిష్ రాజుకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించిన నేరానికి 27 మందికి శిక్ష విధిస్తూ తీర్పు వెలువడింది.

## చారిత్రాత్మకమైన షోలాపూర్, పెషావర్ ప్రతిఘటనలు

1930లో గాంధీ శాసనోల్లంఘన ఉద్యమానికి పిలుపిచ్చినప్పుడు దేశంలో పోరాటాలు చెలరేగాయి. తొలి దినాలలో కరాచీ, మద్రాస్, కలకత్తా, షోలాపూర్ జౌళి మిల్లు కార్మికులు మే 7 నుండి సమ్మెలోకి దిగారు. కల్లు దుకాణాలను తగలబెట్టారు. పోలీసు అవుట్‌పోస్టులపై దాడులు చేసారు. దాదాపు సమాంతర ప్రభుత్వాన్ని నడిపారు. అన్ని పదవులకు అధికార్లను నియమించారు. పోరాటం మే 16 వరకూ సాగింది. 'వాలంటీర్లు ట్రాఫిక్‌ను కంట్రోల్ చేస్తున్నారు. జిల్లా మేజిస్ట్రేట్ నుండి కింది వరకు ఉన్న పదవులన్నింటికీ నియామకాలు జరిగినట్లు నాకు చెప్పారు' అని షోలాపూర్ మెజిస్ట్రేట్ తెలిపారు. దీన్ని బట్టి పారిస్ కమ్యూన్ కార్మిక వీరుల చైతన్యాన్ని భారత కార్మిక వర్గం అంది పుచ్చుకొన్నదని రుజువైంది. ఈ పోరాటాన్ని వల్లభ భాయ్ పటేల్ 'ఏమైనా చేయండి, కానీ షోలాపూర్‌లో చేసినట్లుగా మాత్రం చేయకండి. ఈ పోరాటంలో హింసతో విజయం సాధించలేం' అంటూ తీవ్రంగా ఖండించారు.

గఫార్ ఖాన్ అరెస్టుకు నిరసనగా పెషావర్‌లో ఏప్రిల్ 23న పెద్ద ఎత్తున నిరసనలు ప్రారంభమయ్యాయి. పోలీసులు కాల్పులు జరుపుతున్నప్పటికీ ప్రజలు భయపడలేదు. కాల్పుల్లో ముప్పై మంది చనిపోయారని అధికార లెక్కలు చెపుతున్నాయి. కాని 250 మంది వరకు చనిపోయినట్లు తెలుస్తుంది. ఈ సంఘటనలో 18వ రాయల్ గఢ్వాలీ రైఫిల్స్‌కు చెందిన రెండవ బెటాలియన్‌లో రెండు ప్లాటూన్లకు ఠాకూర్ చంద్రసింగ్ నాయకత్వం వహించారు. ప్రదర్శకులపై కాల్పులు జరపమని పై అధికార్లు ఇచ్చిన ఆదేశాన్ని వారు తిరస్కరించారు. ప్లాటూన్‌కు చెందిన సైనికులేమో హిందువులు, ఉద్యమంలో ఉన్నవారంతా ముస్లింలు. సైనికులు క్రమశిక్షణను ధిక్కరిస్తూ ఉద్యమకారులతో చేరిపోయారు. తమ తుపాకులు ఉద్యమ కారులకు అందించారు. తర్వాత వారిని సైనిక న్యాయస్థానం విచారించినప్పుడు వాళ్లు 'నిరాయుధులైన మా సోదరులని మేము కాల్చం. భారత సైన్యం

దేశపు బయట శత్రువులతో యుద్ధం చేయాలి. కావాంటే మీరు మమ్మల్ని తుపాకి గుళ్లకు ఎరవేయండి' అని ధైర్యంగా ప్రకటించి సెక్యులరిజానికి నిజమైన గొప్ప ప్రమాణాన్ని నిలబెట్టారు.

కాల్పులు జరిగిన పది రోజుల వరకు తెల్లవాళ్లు పెషావర్‌లో తమ పాలనను పునరుద్ధరించలేకపోయారు. కాల్పులకు నిరాకరించిన సైనికులకు తీవ్రమైన శిక్షలు విధించారు. దీనిపై గాంధీ ఒక ఫ్రెంచ్ జర్నలిస్టుకు ఇంటర్వ్యూ ఇస్తూ 'కాల్పులు జరపమని ఇచ్చిన ఆదేశాన్ని ఒక సైనికుడు అమలు జరపకపోతే అతను తాను తీసుకున్న ప్రతిజ్ఞను ఉల్లంఘించిన వాడవుతాడు. అవిధేయతా నేరానికి పాల్పడిన వాడవుతాడు. అధికారులనూ, సైనికులనూ అవిధేయత ప్రకటించమని నేనడగను. ఎందుకంటే నేనే అధికారంలో ఉంటే ఆ అధికారుల్నే, ఆ సైనికుల్నే ఉపయోగించుకోవాలి. అధికారుల ఆదేశాన్ని ఖాతరు చేయవద్దని నేనే వాళ్లకు బోధిస్తే, నేను అధికారంలో ఉన్నప్పుడు వాళ్లు అదే పని చెయ్యొచ్చు కదా' అని చెప్పాడు. దీన్ని బట్టి మహాత్ముడు ఎంత శాంతిదూతో, అహింసకు ఎంత విలువిస్తున్నాడో అర్థమవుతుంది.

## వీరోచితమైన నావికుల తిరుగుబాటు

1946 ఫిబ్రవరి 18న బొంబాయిలో రాయల్ ఇండియన్ నేవీకి చెందిన నావికులు తిరుగుబాటు చేసారు. '1905 రష్యన్ విప్లవంలో బ్లాక్‌సీలో జరిగిన నావికుల తిరుగుబాటును సెర్గీ ఐజెన్‌స్టీన్ తీసిన సినిమా 'బ్యాటిల్‌షిప్ పొటెంకిన్'లో జరిగినట్లుగానే ఇక్కడ కూడా జరిగిందని' ప్రముఖ చరిత్రకారుడు సుమిత్ సర్కార్ రాసారు. నావికుల్లో ఉన్న దీర్ఘకాల అసంతృప్తికీ, జాతీయోద్యమ చైతన్యానికీ పరాకాష్టగా సాగిన ఈ తిరుగుబాటు 'తల్వార్' అనే నౌకలో ప్రారంభమయింది. శరవేగంతో తీరాన ఉన్న క్యాజిల్ అండ్ ఫోర్ట్ బారక్స్‌కు, బొంబాయి హార్బర్‌లోని 22 నౌకలకూ పాకిపోయింది. బొంబాయిలో జరిగిన తిరుగుబాటు కరాచీ, కలకత్తా, వైజాగ్, జర్సుగూడ, కొచ్చిన్, మద్రాస్‌లలో ఇలాంటి తిరుగుబాట్లకు దారితీసింది. సముద్రంలో ఉన్న నౌకలకు కూడా ఇది పాకిపోయింది. వైమానిక దళంలోనూ, పదాతిదళం లోనూ తిరుగుబాటు సూచనలు కనిపించాయి. ఫిబ్రవరి 26 కల్లా నావికుల సమ్మె 74 నౌకలకూ, నాలుగు యుద్ధ ఓడలకూ, 20 తీర ప్రాంత సంస్థలకూ విస్తరించింది. బొంబాయిలో నావికుల సమ్మె కేంద్ర కమిటీని ఎన్నుకుంది. ఎం.ఎస్. ఖాన్ అనే ముస్లింను అధ్యక్షుడిగానూ, మదన్‌సింగ్ అనే సిక్కును ఉపాధ్యక్షుడిగానూ ఎన్నుకున్నారు. తిరుగుబాటు కేవలం వారి పని పరిస్థితులకే పరిమితమైనది కాదు. 'భారతీయ రాజకీయ ఖైదీలనందరినీ, సుభాష్ చంద్రబోస్‌కు చెందిన ఐ.ఎన్.ఎ. సైనికులతో సహా విడుదల చేయాలనీ, ఇండోనేషియా నుండి భారత సైన్యాలను ఉపసంహరించాలనీ, బ్రిటిష్ వారు భారత దేశాన్ని విడిచిపోవాలనీ' వాళ్లు చేసిన డిమాండ్లలో ఉన్నాయి. ఈ ఉద్యమంలో పాల్గొని 'అమాయకుల తిరుగుబాటు' (మ్యూటినీ ఆఫ్ ఇన్నోసెంట్స్) గ్రంథం రాసిన రచయిత బి.సి.దత్తు 'రాజకీయ కార్యక్రమాన్ని అమలు చేయడానికి పరిస్థితి పక్వమై ఉంది. ఒక్క బొంబాయిలోనే దాదాపు ఇరవై వేల మంది యువకులు మొత్తం నేవీకి చెందిన తుపాకులు, మందుగుండు సామాగ్రితో ఆదేశాల కోసం ఎదురుచూస్తున్నారు' అని రాసారు. ఇంకా 'నావికులు ప్రతి ఓడ నుండీ, తీరాన్నుంచీ తల్వార్ వైపు రాసాగారు. జాతీయ ఐక్యతకై వారిచ్చిన నినాదాలతో బొంబాయి వీథులు మారుమోగి పోయాయి. 'హిందూ ముస్లిం ఏక్‌హో', 'ఇంక్విలాబ్ జిందాబాద్' అని గొంతెత్తి నినాదాలు ఇచ్చారు. సాధారణ ప్రజానీకం, చివరకు దుకాణ యజమానులు, హోటళ్ల యజమానులు సైతం సమ్మె చేస్తున్న నావికులను సహోదరుల్లాగా చూసుకొన్నారు. వాళ్లకు భోజనాలు పెట్టారు. నావికుల సమ్మెకు సంఘీభావంగా ఫిబ్రవరి 22న మూడు లక్షల ముంబాయి కార్మికులందరూ సమ్మె చేసారు. కాంగ్రెస్ నాయకుల ద్రోహంతో సమ్మె విఫలమయింది' అని వివరంగా పోరాట క్రమాన్ని రాసారు.

పటేల్‌తోపాటు గాంధీ ఈ పోరాటాన్ని ఖండిస్తూ 'వారి సమస్యలపై పోరాడాలనుకుంటే, శాంతియుతంగా వారి ఉద్యోగాలకు రాజీనామా చేసి వెళ్లిపోవాల'ని కోరాడు. అంతేకాక 'హింసాపూరిత ఉద్యమాల్లో హిందూ ముస్లింల కలయిక అపవిత్రమైంది' అని కూడా అన్నాడు. దానిపై అరుణా అసఫ్ అలీ 'రాజ్యాంగపరంగా కన్నా పోరాటంలో బారికేడ్స్ దగ్గర హిందూ ముస్లిం ఐక్యత సాధించడం సులువు' అని అంది. దీన్ని బట్టి ఉద్యమ అణచివేతలో కాంగ్రెస్ నాయకుల పాత్ర గ్రహించవచ్చు.

నావికులు, 'మా ప్రజలకి చివరి మాట. మా సమ్మె మన జాతి జీవనంలో ఒక చారిత్రాత్మక సంఘటన. మొట్టమొదటిసారిగా ఒక ఉమ్మడి లక్ష్యం కోసం, సైనికుల, ప్రజల రక్తం కలిసి పారింది. సైన్యంలో ఉన్న మేం దాన్నెప్పుడూ మర్చిపోం. మీరు, మా అన్నదమ్ములూ, అక్కా చెల్లెళ్లూ కూడా మర్చిపోరని మాకు తెలుసు. మన గొప్ప ప్రజలు వర్ధిల్లాలి' అని ప్రకటించారు. బొంబాయిలో దాదాపు నాలుగు వందల మంది నావికుల్ని అరెస్టు చేసారు. కరాచీలో ఐదు వందల మందిని అరెస్టు చేసారు. తర్వాత వేలమందిని నిర్బంధించారు. శిక్షలు విధించారు.

ఏఐటియుసిలో మొదటి చీలిక ఏర్పడి 1929 డిసెంబర్ 1న 'ఇండియన్ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్' (ఐటియుఎఫ్) ఏర్పడింది. రెండవ చీలిక 1931 జూలై 6న జరిగి 'ఆలిండియా రెడ్ యూనియన్ కాంగ్రెస్' (ఎఐఆర్‌యుసి) ఏర్పడింది. తర్వాత 1947లో మరో చీలిక ఏర్పడి ఐఎన్‌టియుసి ఏర్పడింది. మే 3,4 తేదీలలో ఢిల్లీలో కాంగ్రెస్ అనుకూలవాదుల 'హిందూ మజ్దూర్ సేవక్ సంఘ్' ఒక సమావేశం జరిపింది. అంతకు ముందు ఎఐఆర్‌యుసికి మూడుసార్లు అధ్యక్షుడిగా పనిచేసిన సురేంద్రనాథ్ బెనర్జీ ప్రవేశపెట్టిన తీర్మానంలో 'ప్రజాస్వామ్య విధానాలు, శాంతియుత మార్పులను వ్యతిరేకించే వారి నాయకత్వంలో దేశ శ్రామికవర్గ ఉద్యమం నడపబడుతున్నతీరు, దేశ ప్రజల వాస్తవ ప్రయోజనాలకు తీరని అపచారం కలిగించేదిగా ఉన్నది. ఇప్పుడు కార్మిక శ్రేయస్సు కోరే వారందరూ కార్యాచరణకు పూనుకోవడం వారి పవిత్రమైన విధి. ఆ ఆశయ సిద్ధికి 'ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్'ను స్థాపించాలి' అని కోరారు. ఈ సభకు అధ్యక్షత వహించిన వల్లభభాయి పటేల్ తన అధ్యక్షోపన్యాసంలో 'ఎ.ఐ.టి.యు.సి.ని సంస్కరించడానికి ప్రయత్నించడం, దాన్ని చేజిక్కించుకోవడం వలన ప్రయోజనం లేదు. ఇప్పుడు తీసుకొన్న చర్య (ఐ.ఎన్.టి.యు.సి.ని స్థాపించడం) ఏనాడో జరగాల్సింది' అన్నాడు.

అంతవరకు ఎ.ఐ.టి.యు.సి.లో కమ్యూనిస్టులు, కాంగ్రెస్ వర్గాలు

కలిసి పనిచేసాయి. కాని కమ్యూనిస్టుల నాయకత్వంలో దేశంలో పెల్లుబుకుతున్న పోరాటాలకు, కార్మికుల సంఘటిత శక్తికి, వారి అభేద్యమైన ఐక్యతకు భయపడిన కాంగ్రెస్ వర్గాలు వారి ఐక్యతను విచ్ఛిన్నం చేసి, వారిని బలహీనపరచడానికి చేసిన ప్రయత్నమే ఐ.ఎన్.టి.యు.సి. ఏర్పాటని గ్రహించవచ్చు. కార్మికవర్గంలో రోజు రోజుకూ పెరుగుతున్న రాజకీయ చైతన్యాన్ని చూసి కాంగ్రెస్ గడగడలాడింది. అందుకే తమ రాజీ, వర్గ సామరస్య సిద్ధాంతాలను నిలబెట్టుకోవడం కోసం, కార్మిక వర్గంలోని వెనకబడిన సెక్షన్లను తమవైపు తిప్పుకోవడం కాంగ్రెస్ వర్గాలకు తక్షణ కర్తవ్యమైంది.

1947లో అధికార మార్పిడి తర్వాత నిజమైన స్వాతంత్ర్యం రాలేదని ప్రజలకు, కార్మికులకు అర్థమైపోయింది. దానికి నిదర్శనంగా అనేక సమ్మెలు జరిగాయి. 1947లో 1811, 1948లో 1259, 1949లో 920, 1950లో 814 సమ్మెలు జరిగాయి. వీటిల్లో దాదాపు ముప్పై ఐదు లక్షల మంది కార్మికులు పాల్గొన్నారు. 1951 నుండి 1962 వరకు 25,586 సమ్మెలు జరిగాయి. దాదాపు ఎనభై ఐదు లక్షల మంది కార్మికులు ఈ సమ్మెల్లో పాల్గొన్నారు.

1960 ఏప్రిల్ 2, 3 తేదీలలో బొంబాయిలో కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల సదస్సు జరిగింది. ఆలిండియా రైల్వే మెన్స్ ఫెడరేషన్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఎంప్లాయీస్, ఆలిండియా డిఫెన్స్ ఎంప్లాయీస్ ఫెడరేషన్, కాన్ఫెడరేషన్ ఆఫ్ సెంట్రల్ గవర్నమెంట్ ఎంప్లాయీస్‌లతో ఒక 'ఐక్య కార్యాచరణ సమితి' ఏర్పడి ప్రభుత్వానికి తమ డిమాండ్ల పత్రం సమర్పించి, పరిష్కరించని యెడల సమ్మె చేస్తామని ప్రకటించింది. ఆనాటి భారత ప్రధాని నెహ్రూ ఈ సమ్మెను ప్రజల తిరుగుబాటుగా వర్ణించి, దీన్ని ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నామని తెలియజేసాడు. 1960 జూలై 11 అర్ధరాత్రి నుండి సమ్మె ప్రారంభించ డానికి నాయకులు, కార్యకర్తలు తీవ్రమైన కృషి చేసారు. కాని ప్రభుత్వం రాత్రి 12 గంటలయ్యే సరికి వారందర్నీ అరెస్టులు చేసింది. అయినా సమ్మె ప్రారంభమై దేశవ్యాప్తంగా ప్రజాజీవనం దాదాపు స్థంభించి పోయింది. లాఠీఛార్జీలు, పోలీసు కాల్పులు జరిగాయి. పశ్చిమ రైల్వేలోని దోహాద వర్క్‌షాపులో ఐదుగురు కార్మికులు ప్రాణాలు కోల్పోయారు. ఈ సందర్భంగా ఇరవై వేల మందికి పైగా అరెస్టు కాబడ్డారు. 1500 మందిని డిస్మిస్, పదివేల మందిని సస్పెండ్ చేసారు. 1500 పైగా ఉద్యోగులను దోషులుగా నిర్ణయించి జైలు శిక్షలు విధించారు. తెల్లకోటు, ఎర్రని గులాబీ ధరించే శాంతి దూత నెహ్రూ మార్కు ప్రజాస్వామ్యాన్ని కార్మికులు అర్థం చేసుకొన్నారు.

1967లో ప్రారంభమైన నక్సల్బరీ ఉద్యమ ప్రభావం కార్మికోద్యమంపై పడి, వారి పోరాట చైతన్యాన్ని ఉధృతం చేసింది. 1967లో జరిగిన సమ్మెలలో పదిహేను లక్షల మంది పాల్గొన్నారు. 1968 సెప్టెంబర్ 19న ఇరవై ఐదు లక్షల మంది కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు సమ్మె చేయగా, ఆ సంవత్సరంలో దేశవ్యాప్తంగా పదిహేడు లక్షల మంది కార్మికులు సమ్మెల్లో పాల్గొన్నారు. ఈ పోరాటాలన్నింటిలో ఇంజనీరింగ్, బట్టల పరిశ్రమ, బొగ్గు గనులు, జనపనార, రసాయనిక, విద్యుచ్ఛక్తి, రోడ్డు రవాణా, ఓడరేవులు, నౌకా నిర్మాణ పరిశ్రమల కార్మికులు ప్రధాన పాత్ర వహించారు.

## రైల్వే కార్మికుల సమ్మె

కార్మికవర్గ ప్రతిఘటన 1974లో ఉన్నత స్థాయికి చేరింది. 2938 పారిశ్రామిక వివాదాలలో జరిగిన సమ్మెల్లో ఇరవై ఎనిమిది లక్షల మంది కార్మికులు పాల్గొన్నారు. 86 అఖిల భారత సమ్మెలు జరిగాయి. అధికార అంచనా ప్రకారం 1974లో జరిగిన రైల్వే కార్మికుల సమ్మెలో 4,75,092 మంది కార్మికులు పాల్గొన్నారు. కాని నిజానికి ఇరవై లక్షల మంది పాల్గొన్నారు. సమ్మెను అణచివేయడానికి యాభై వేల మంది కార్మికుల్ని అరెస్టు చేసారు. రైల్వే కాలనీలలో భయోత్పాతం సృష్టించి ఇళ్లపై దాడులు చేసారు. ఒక లక్ష మంది కార్మికులను ఉద్యోగాల నుండి తొలగించారు. దీనిపై దేశవ్యాప్తంగా బ్రహ్మాండమైన నిరసనలు పెల్లుబికాయి. 164 రాజకీయ సమ్మెలు, సానుభూతి సమ్మెలు జరిగాయంటే దేశంలో కార్మికోద్యమ ప్రతిఘటన పెరుగుతున్నట్లు రుజువవుతున్నది. దీన్ని అణచివేయడానికే ఇందిరాగాంధీ జూన్ 26, 1975న ఎమర్జెన్సీ ప్రకటించింది. కార్మికోద్యమంపై ఉక్కుపాదం మోపింది. తీవ్రమైన అణచివేత, దాడులు కొనసాగాయి. యాజమాన్యాలు కూడా కార్మిక సమస్యల పట్ల ఉదాసీనత వహించాయి. కార్మికులు ప్రమాదకరమైన పరిస్థితుల్లో పనిచేయవలసి వచ్చినా, రక్షణ కల్పించడంలో ఘోరమైన నిర్లక్ష్యం వహించారు. దాని పర్యవసానమే ఈస్టరన్ కోల్‌ఫీల్డ్స్‌లో ఛస్నాల కాలరీలో 1975 డిసెంబర్ 27న జరిగిన ఘోర ప్రమాదం. దానిలో నాలుగు వందల మంది గని కార్మికులు నీటిలో మునిగి చనిపోయారు. పాలకవర్గాల దుర్మార్గ విధానాలకు నిదర్శనం ఈ సంఘటన.

## సింగరేణి కార్మికుల పోరాటాలు

దేశవ్యాప్తంగా కార్మికోద్యమం మీద తీవ్రమైన అణచివేత జరుగుతున్న తరుణంలో సింగరేణి బొగ్గు గనులలో అత్యంత మిలిటెంట్ కార్మికోద్యమ పోరాటాలు జరిపారు. ఆదిలాబాద్ జిల్లాలోని బెల్లంపల్లి, మందమర్రి, రామకృష్ణాపురం, కరీంనగర్ జిల్లాలోని గోదావరిఖని, ఖమ్మం జిల్లా ఇల్లెందు, మణుగూరు, కొత్తగూడెం బొగ్గుగని ప్రాంతాలు వంద కిలోమీటర్ల వరకూ వ్యాపించి ఉంటాయి. ఖమ్మం జిల్లా ఇల్లెందు తాలూకా సింగరేణి గ్రామ ప్రాంతంలో మొదటిసారిగా 1889లో బొగ్గు గనుల తవ్వకం ప్రారంభమైంది. తర్వాత 1928లో బెల్లంపల్లిలో, 1937లో కొత్తగూడెంలో, బొగ్గు ఉత్పత్తి ప్రారంభమైంది. ఈ ప్రాంతాల బొగ్గు నిల్వల్లో 2500 మిలియన్ టన్నులు ఉంటుందని అంచనా. ఈ పరిశ్రమలో ఎనభై వేల మంది కార్మికులు పనిచేసేవారు. బొగ్గు గనుల్లో పని పరిస్థితులు చాలా భయంకరంగా ఉంటాయి. బొగ్గు బావుల్లో బొగ్గు పెల్లలు కూలి ఎంతో మంది చనిపోతుంటారు. ఈ దుర్భర పరిస్థితులకు వ్యతిరేకంగా పోరాటాలు జరిగాయి.

1976లో బావుల్లో గాలి, వెలుతురు, నీటి కోసం కార్మికులు సమ్మె చేసారు. దీనిపై ఏడుగురు కార్మికుల్ని మీసా చట్టం కింద అరెస్టు చేసి వారి కుటుంబాలను అనేక నిర్బంధాలకు గురిచేసారు. ఇదే కాలంలో గని కప్పు కూలడంతో గోదావరిఖనిలో ఇరవై ఐదు మంది, బెల్లంపల్లి ప్రాంతంలో ఇరవై ఐదు మంది, కొత్తగూడెంలో కూడా అనేక మంది కార్మికులు నేల మాళిగల కింద నలిగి మరణించారు. దీనిపై కార్మికులు పోరాటం చేస్తే, అనేక మంది కార్మిక నాయకుల్ని మీసా, డిఐఆర్, చట్టాల కింద అరెస్టులు చేసి నిర్బంధాలకు గురిచేసారు. 1977లో

బెల్లంపల్లి పోలీస్ స్టేషన్ ముందున్న కార్మికుల గుడిసెల్ని సింగరేణి యాజమాన్యం, స్థానిక వ్యాపారస్తులు నేలమట్టం చేయడంతో, విద్యార్థుల, కార్మికుల నాయకత్వంలో దానికి వ్యతిరేకంగా పోరాడారు. 1977లోనే కంపల్సరీ డిపాజిట్ స్కీం కింద నిర్బంధంగా వసూలు చేసిన సొమ్ము తిరిగి ఇవ్వాలని ఉద్యమించారు. ప్రైవేట్ లారీ డ్రైవర్ల సమస్యలపై పోరాడారు. అధికారుల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా, అక్రమ సస్పెన్షన్‌లు, డిస్మిస్‌లకు వ్యతిరేకంగా పోరాడారు. 1978 మార్చ్ 28న రమీజా బీ పై అత్యాచారం జరిపి, ఆమె భర్తను హత్యచేసిన పోలీసుల రాక్షసత్వానికి వ్యతిరేకంగా పోరాటంచేస్తూ ఏప్రిల్‌లో ఐదుగనుల్లో బంద్ నిర్వహించారు.

సింగరేణి అధికారి శ్యామ్ మోహనరావు కొడుకు రఘు రాజేశ్వర్‌పై అత్యాచారం జరిపి, కిరాతకంగా చంపేసాడు. దీనిపై కార్మికులు, ప్రజలు పెద్ద ఎత్తున ఆందోళనలు జరిపారు. ఊరేగింపులు నిర్వహించారు. ఉధృతంగా జరుగుతున్న పోరాటాన్ని అణచివేయడానికి జరిపిన పోలీసు కాల్పుల్లో నలుగురు కార్మికులు చనిపోయారు. జూలై 3న కాగజ్‌నగర్‌లో బంద్ జరిగింది. చుట్టుపక్కల ప్రాంతాలలో కూడా అనేక బంద్‌లు, నిరసనలు జరిగాయి.

వైద్య సౌకర్యాల మెరుగుదల కోసం పోరాటాలు చేసారు. గూండా ఆర్డినెన్స్ పేరుతో కార్మికోద్యమ నాయకుల్ని అరెస్టు చేయడాన్ని వ్యతిరేకిస్తూ పోరాడారు. గనుల్లో పిట్ కమిటీని నిర్మాణం చేసి అనేక పోరాటాలు చేసారు. స్థానిక భూస్వామి, ట్రేడ్ యూనియన్ నాయకుడిగా చలామణి అవుతున్న శ్రీపతి రావు, వాడి గూండాల హత్యా రాజకీయాలకు వ్యతిరేకంగా కెకెవన్ నుండి మూడు వేల మంది కార్మికులు ఊరేగింపుగా వెళ్లి శ్రీపతిరావు సినిమా హాల్‌ను తగలబెట్టారు. వాడి కల్లు దుకాణాలు, సారా దుకాణాలు, బ్రాందీ గోడౌన్లను నాశనం చేసారు. మేనేజ్‌మెంట్ అవలంబిస్తున్న అక్రమ రిక్రూట్‌మెంట్, టెర్మినేషన్ల పద్ధతికి వ్యతిరేకంగా పోరాడారు. బొగ్గు గని కార్మికులు గుటకలు, తుంటలు మోసినందుకు వేతనం చెల్లించకుండా చేయించుకుంటున్న వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా పోరాడారు.

సింగరేణి యాజమాన్యం కార్మికుల పోరాటాల్ని అణచి వేయడానికి పదిహేను రోజుల ముందు నోటీసు ఇవ్వకుండా కార్మికులు సమ్మె చేస్తే సెక్షన్ 9(2) నిబంధనల ప్రకారం వారికి ఎనిమిది రోజుల జీతం కోత కోయబడుతుందని ఆదేశాలిచ్చారు. దీనికి వ్యతిరేకంగా బెల్లంపల్లిలో బ్రహ్మాండమైన సమ్మె జరిగింది. ఏప్రిల్ 1981లో ప్రారంభమైన సమ్మె అన్ని గనులకు విస్తరించింది. సమ్మె కారణంగా బొగ్గు కొరత ఏర్పడి ఎన్నో రైళ్లు, పరిశ్రమలు ఆగిపోయాయి. ఇలాంటి పోరాటాలు అనేకం సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస) నాయకత్వాన జరిగాయి. కార్మిక సంఘం అంటే కేవలం కార్మికుల కోసమే కాకుండా చుట్టుపక్కలున్న సామాన్య ప్రజల సమస్యలు, అసంఘటిత రంగ కార్మికుల సమస్యలు, సామాజిక సమస్యలు, స్త్రీల సమస్యలు, ఇలా అన్ని రకాల సమస్యలకు వ్యతిరేకంగా యూనియన్లు పోరాటం చేయాలని, చేయగలవని నిరూపించింది సింగరేణి కార్మికోద్యమం.

## శంకర్ గుహ నియోగి - ఛత్తీస్‌గడ్ కార్మికోద్యమం

విద్యార్థి దశలోనే వామపక్ష భావాలు కలిగిన శంకర్ గుహ నియోగి 1960ల్లో భిలాయ్ స్టీల్ ప్లాంట్ బ్లాస్ట్ ఫర్నేస్ కార్మికుల సమస్యలపై పోరాటంతో తన ఉద్యమాన్ని ప్రారంభించాడు. బ్లాస్ట్ ఫర్నేస్ యాక్షన్ కమిటీ కార్యదర్శిగా పనిచేసాడు. ఆ పోరాటంలో ప్రధాన పాత్ర వహించినందుకు అతన్ని ఉద్యోగం నుండి తొలగించారు. బతుకు తెరువు కోసం ఏదో వృత్తిలో ఉంటూనే అతను స్థానిక ప్రజా ఉద్యమాలలో కలగలిసిపోయాడు. వాటిలో బస్తర్ గిరిజనుల పోరాటాలూ, ప్రజల సమస్యలపై చేసిన పోరాటాలూ ఉన్నాయి. ఎమర్జెన్సీలో అరెస్టయి పదమూడు నెలలు జైలులో గడిపాడు. విడుదలయ్యాక దల్లీ-రాజహరాలో 1977 మార్చ్ 3న ఛత్తీస్‌గడ్ గని కార్మిక సంఘం (సిఎంఎస్ఎస్) ను స్థాపించాడు. వేలాది గని కార్మికులు ఈ యూనియన్‌లోకి తరలి వచ్చారు. 1977 జూన్ 1న పదివేల మందితో బోనస్ అలవెన్స్‌ల కొరకు అంతవరకు ఆ ప్రాంతంలో ఎవ్వరూ చూడని అతిపెద్ద ఊరేగింపు జరిపి యజమానుల, కాంట్రాక్టర్ల గుండెల్లో దడ పుట్టించాడు. జూన్ 2న ఏ కారణం చూపకుండానే అతన్ని అరెస్ట్ చేస్తే, దల్లీ-రాజహరా బొగ్గు గని కార్మికులు వేలాది మందిగా కదిలి పోలీస్ స్టేషన్‌ను దిగ్బంధం చేసారు. పోలీసులు జరిపిన కాల్పుల్లో పన్నెండు మంది మరణించారు. నియోగి జైల్లో ఉన్నప్పటికీ, కార్మికుల చొరవను, ఐక్యతను చూసి జడిసిన యాజమాన్యాలు కార్మిక సంఘంతో ఒప్పందాలు కుదుర్చుకున్నాయి. తర్వాత సంఘం కార్యకలాపాలు ఇతర ప్రాంతాలకు, సున్నపురాయి గనుల్లోకి, డోలమైట్ గనుల్లోకి విస్తరించాయి.

సిఎంఎస్ఎస్ ప్రారంభం నుండీ మహిళలకు ప్రాధాన్యమిచ్చి, వారిని ప్రోత్సహించింది. బొగ్గు గనుల్లో దాదాపు సగం మంది మహిళా కార్మికులే. వారిని నాయకత్వ స్థానాలకు ఎదిగేటట్లు బాధ్యత తీసుకున్నారు. దీంతో గతంలో మహిళలపై జరిపే అత్యాచారాలను ఎదిరించే శక్తిగా 'మహిళా ముక్తి మోర్చా' ఏర్పడింది. 1981లో కల్తీ సారా తాగి మహాసముంద్ సమీపంలో చాలా మంది కార్మికులు చనిపోయారు. దీంతో సిఎంఎస్ఎస్ మద్యపాన నిషేధ ఉద్యమం ప్రారంభించింది. ఈ విధంగా కార్మికుల జీవితాల్ని నాశనం చేసే మద్యపానానికి వ్యతిరేకంగా సింగరేణి బొగ్గు గనుల్లో సింగరేణి కార్మిక సమాఖ్య, సిఎంఎస్ఎస్‌లు తప్ప దేశంలో మరెక్కడా ఉద్యమాలు జరిగినట్లు కనిపించదు. గ్రామీణ ప్రాంతాల్లో వివిధ సమస్యలపై పోరాడడానికి ఛత్తీస్‌గడ్ ముక్తి మోర్చా ఏర్పడింది. మిల్లు కార్మికులు, రవాణా కార్మికులు, చిన్న వర్క్‌షాప్‌ల కార్మికుల కోసం అనేక కార్మిక సంఘాలు సిఎంఎస్ఎస్ ఆధ్వర్యంలో ఏర్పడ్డాయి.

రాజ్‌నంద్‌గావ్ నుండి దుర్గ్-భిలాయ్, రాయపూర్ వరకు ఉద్యమం విస్తరించడంతో పారిశ్రామిక యజమాన్యాలు కుట్ర చేసి గూండాలతో సెప్టెంబర్ 28, 1991న ఇంటిలో నిద్రిస్తున్న కార్మికనేతను హత్యచేసారు. ఆయన అంత్యక్రియలకు లక్షన్నర మంది కార్మికులు తరలివచ్చి శ్రద్ధాంజలి ఘటించారు.

నియోగి మార్గదర్శకత్వంలో ఎన్నో సృజనాత్మకమైన ప్రయోగాలు జరిగాయి. దల్లీ-రాజహరాలో కార్మికుల కోసం స్వంత షహీద్ ఆస్పత్రిని నిర్మించారు. ఆస్పత్రి కార్యకర్తలు బస్తీల్లోని, గ్రామాల్లోని పేద ప్రజల ముంగిట్లోకి వైద్యాన్ని తీసుకెళ్లారు. కార్మికుల జీవితంలో ప్రతిరోజూ వారు పనిచేసే ఎనిమిది గంటల సమయానికి మాత్రమే కాక ఇరవై నాలుగు గంటలూ వాళ్ల జీవిత పరిస్థితుల పట్ల తమ సంఘం బాధ్యత

వహించేలా నియోగి కార్యక్రమాలను రూపొందించాడు. 'ఆరోగ్యం, విద్య, సంస్కృతి, ప్రకృతి పరిసరాలు, పర్యావరణ కాలుష్యం, స్త్రీ విముక్తి, జాతుల విముక్తి, రైతాంగ విమోచన మొదలైన అంశాలన్నింటినీ నియోగి తన సిఎంఎస్ఎస్ కార్యక్రమంలో పొందు పరిచాడు. ఈ సామాజిక ఉద్యమాలన్నింటికీ కార్మికవర్గ నేతృత్వం అందించాడ'ని ఆయన సన్నిహితుడైన డాక్టర్ పుణ్యవ్రత్ గుణ పేర్కొన్నారు.

## దత్తా సామంత్ – చారిత్రాత్మక టెక్స్‌టైల్ కార్మికుల సమ్మె

1982లో ఒక ఏడాది పైగా సాగి దేశాన్నంతా ఆకర్షించిన మహోజ్వలమైన టెక్స్‌టైల్ కార్మికుల సమ్మెకు దత్తా సామంత్ నాయకత్వం వహించాడు. వృత్తిపరంగా ఆయన వైద్యుడు. బొంబాయి శివారు ప్రాంతాలలో ఒకటైన ఘట్‌కోపర్‌లో కార్మికుల కాలనీలో డాక్టర్‌గా ప్రారంభమై, కార్మికుల పరిచయాలతో ట్రేడ్ యూనియన్ రాజకీయాల్లోకి వచ్చాడు. మొదట క్వారీలో రాళ్లు కొట్టే కార్మికులకు నాయకత్వం వహించాడు. ట్రేడ్ యూనియన్ల ద్వారానే ఎన్నికల రాజకీయాల్లోకి ప్రవేశించి కాంగ్రెస్ నుంచి మహారాష్ట్ర శాసనసభ సభ్యుడిగా ఎన్నికయ్యాడు. కాని ఆయన మిలిటెంట్ ఉద్యమాల కారణంగా ఎమర్జెన్సీ అంతా జైల్లోనే గడిపాడు. తర్వాత మిలిటెంట్ విధానంతో బొంబాయి కార్మికవర్గాన్ని ఆకట్టుకొన్నాడు. అనేక యూనియన్‌లు స్థాపించి పదిహేను లక్షల మంది కార్మికులకు నాయకత్వం వహించాడు.

కొన్ని బట్టల మిల్లుల్లో నాయకత్వం వహిస్తున్న శివసేనకు చెందిన గిర్ని కామ్‌గార్ సేన (జికెఎస్) కార్మికులకు ద్రోహం చెయ్యడంతో కార్మికులు దత్తా సామంత్‌ను నాయకత్వం వహించమని కోరారు. ఆయన అక్టోబర్ 30, 1981లో మహారాష్ట్ర గిర్ని కామ్‌గార్ యూనియన్ (ఎంజికెయు) స్థాపించాడు. అప్పటికే మిల్లులలో కాంగ్రెస్‌కు చెందిన రాష్ట్రీయ మిల్ మజ్దూర్ సంఘ్ (ఆర్ఎంఎంఎస్), కమ్యూనిస్టులకు చెందిన గిర్ని కామ్‌గార్ యూనియన్ (జికెయు)లు పనిచేస్తున్నాయి. అన్ని యూనియన్ల మీద కార్మికులు తీవ్ర అసంతృప్తితో ఉన్నారు. సామంత్ నాయకత్వంలో కొన్ని మిల్లుల్లో ప్రారంభమైన ఉద్యమం, చివరకు అరవై మిల్లులకు వ్యాపించి, రెండు లక్షల యాభై వేల మంది కార్మికులతో జనవరి 18, 1982న బొంబాయి టెక్స్‌టైల్ కార్మికుల చరిత్రాత్మక సమ్మె ప్రారంభమైంది. కార్మికులు రోడ్ల మీద పడుకొని ట్రాఫిక్‌ను స్తంభింప చేసారు. రోడ్డు రోలర్‌లు తెచ్చినా కార్మికులు బెదరలేదు. ఈ సమ్మె సందర్భంగా అపూర్వమైన సంఘటనలు జరిగాయి.'సామంత్ ఈ సమ్మె ఆరు నెలల వరకూ కొనసాగవచ్చని కార్మికుల్ని ముందే హెచ్చరించాడు. సంగ్లీ, సతారా, పూనే నుండి వచ్చిన వారంతా వారి స్థలాలకు వెళ్లిపోయారు. సామంత్ స్వయంగా గ్రామాలను పర్యటించి, ఆహార ధాన్యాలను సాయం చేయమని కోరాడు. రోజూ చాలా మంది గ్రామాల నుండి బియ్యం బస్తాలతో బొంబాయి వచ్చేవారు. సామంత్‌కు అనుబంధంగా ఉన్న ఇతర యూనియన్ల నుండి మిల్లు కార్మికుల కోసం మూడు కోట్ల రూపాయలు వసూలు చేసారు. ఈ సొమ్ము కార్మికుల వైద్య ఖర్చుల కోసం, వారి పిల్లల కోసం, వారి చదువుల కోసం ఉపయోగించారు' అని ఎంజికెయు ప్రధాన కార్యదర్శి జయప్రకాశ్ భిలురె తెలిపారు.

## స్త్రీ కార్మికుల సాహసం

సమ్మె పోరాటంలో స్త్రీ కార్మికులు అపూర్వమైన సాహసంతో చరిత్ర సృష్టించారు. 'మమ్మల్ని అరెస్టు చేసి బోయవాడా పోలీస్ స్టేషన్‌లో పెట్టారు. తర్వాత పోలీసులు టీ, టిఫిన్‌లు పంపిస్తే అవి వసంత దాదా పాటిల్ (అప్పటి ముఖ్యమంత్రి) పంపినవి, అవి 'మాకక్కర్లేదు, మీరే తినండి' అని తిరస్కరించాం. మేం నినాదాలు చేస్తూంటే పోలీసులు మమ్మల్ని నోర్మూసుకోండి అని బెదిరించారు. 'ఎందుకు మూసుకోవాలి. ఈ కుక్కలు మా వల్లనే అధికారంలోకి వచ్చాయి. కాని చూడండి ఏం చేస్తున్నారో' అని అరిచాం. రాత్రి అయిపోయిందని మమ్మల్ని ఇళ్లకు వెళ్లిపొమ్మన్నారు. రాత్రివేళ మేం ఇళ్లకు వెళ్లలేం అని గొడవ చేస్తే చివరకు పోలీస్ వాన్‌లో మమ్మల్ని ఇళ్ల దగ్గర దించారు.'

'సెంచరీ మిల్స్ దగ్గర ఆందోళనలో పాల్గొంటే మళ్లీ మమ్మల్ని అరెస్టు చేసి, అకోలా జైలులో పెట్టారు. జైలులో తినలేని తిండి పెడితే వార్డెన్‌ను పిలిచి 'మేం మనుషులం. మా హక్కుల కోసం పోరాడుతున్నాం. ఈ తిండితో మమ్మల్ని చంపాలని చూస్తున్నారా' అని కేకలు వేస్తే వార్డెన్ క్షమాపణలు చెప్పి వెంటనే మంచి ఆహారం తెప్పించాడు. పద్నాలుగు రోజులు జైల్లో ఉండి బయటకు వస్తున్నప్పుడు చీఫ్ వార్డెన్ మా వస్తువులు మాకిచ్చేస్తూ సంతకాలు పెట్టమన్నారు. నాకు చదువు లేదు. సంతకం పెట్టలేను అంటే 'ఫరవాలేదు. మీ స్త్రీలు చాలా ధైర్యవంతులు. మీరు పోరాట యోధులు' అంటూ మమ్మల్ని అభినందించారు.

'ముఖ్యమంత్రి వసంత దాదా ఇంటికి తొమ్మిది వందల మంది మహిళా కార్మికులు వెళ్లి 'పూరి పాకల నుండి వచ్చాం. ముఖ్యమంత్రిని సన్మానం చెయ్యడానికి వచ్చామని గేటు దగ్గర చెప్పాం. వసంత దాదా బయటకు రాగానే ఒకామె మిల్లు కార్మికుల గురించి ఏం చేస్తున్నావు అని తిన్నగా అడిగింది. ఎన్నికలలో నిలబడినపుడు ఏం వాగ్దానాలు చేసావు అని కూడా అడిగారు. దాదా తత్తరపడుతూ నేను ఇందిరా గాంధీని కలవటానికి వెళ్లాను. కాని ఆమె నాకు ఇంటర్వ్యూ ఇవ్వలేదు అని అన్నాడు. దానికి మేం మరయితే ఎందుకెళ్లావు. ఆమె చెడ్డీలు ఉతకడానికెళ్లావా అని ప్రశ్నించాం. ఎవ్వరూ భయపడలేదు. మేం దయాదాక్షిణ్యాల కోసం అడుక్కోవడానికి రాలేదు. మేం మా హక్కుల కోసం పోరాడుతున్నాం. మేం ఆకలితో చచ్చిపోతున్నాం. నువ్వు మిల్లు ఓనర్ల దగ్గర లంచాలు తీసుకొంటున్నావు. నీవు ఒక బందిపోటువు. కార్మికుల కోసం నువ్వు అసలు పట్టించుకోవడం లేదు' అని చెడామడా తిట్ల వర్షం కురిపించాం. ఒకామె 'నీవు పరిష్కరించలేకపోతే నీ పదవికి రాజీనామా చెయ్యి' అన్నది. అతను అక్కడ నుండి పారిపోబోయాడు. కొంతమంది అతని పంచె లాగేసారు. అక్కడ ఉన్న పూలకుండీలు ధ్వంసం అయిపోయాయి. పోలీసులు వచ్చి మమ్మల్ని ఆపాలని చూసారు. మేం 'ఈ కుక్కలు మీరు చేసే కష్టమైన పనికి ఎప్పుడైనా సరైన జీతం ఇచ్చారా? మీ హక్కుల కోసం పోరాడండి' అని అరిచాం. అక్కడ ఉన్న నీటి పైపు తీసుకొని పోలీసుల మీద పిచికారీ చేసాం. ఇంతలో ఒక పోలీసు, వసంత దాదా మీకు ఆహారాన్ని పంపిస్తున్నారని చెప్పాడు. దానికి 'దాన్ని అతని శవానికి పెట్టండి' అని జవాబిచ్చాం' అని ఆ సమ్మెలో పాల్గొన్న నాయకురాలు లక్ష్మీ భట్కార్ చెప్పారు.

పోరాటానికి నాయకత్వం వహించిన మరో నాయకురాలు పార్వతి కదమ్. స్త్రీల పోరాటాలలో ఎప్పుడూ ఆమె ముందు ఉండేది. ఎవరైనా

లాఠీ ఎత్తితే వాళ్ల చేతిలో లాఠీ లాక్కుని తిరిగి కొట్టడానికి ప్రయత్నించేది. పోలీసుల లాఠీఛార్జీలలో చాలాసార్లు ఆమె గాయపడింది. వసంత పాటిల్ ఇంటి మీద దాడిలో ఆమె కూడా పాల్గొన్నారు. సిగ్గుపడిపోయిన పాటిల్ వెంటనే దత్తా సామంత్‌కి ఫోన్ చేసి నానా తిట్లు తిట్టాడు. ఆడవాళ్లని నా మీదకి పంపిస్తావా. నువ్వు హిట్లర్ లాంటి వాడివి అని కేకలు వేసాడు. నిజానికి సామంత్‌కి స్త్రీ కార్మికులు ముఖ్యమంత్రి ఇంటికి వెళ్లిన సంగతి తెలియదు. అరెస్టు అయి విడుదల అయ్యాక విషయం తెలుసుకొని 'చాలా ఆశ్చర్యంగా ఉంది. నేను చెయ్యలేని పనిని మీరు చేసారు' అన్నాడు.

సమ్మె ప్రారంభంలో కమ్యూనిస్టు యూనియన్‌లు పాల్గొనలేదు. తర్వాత కూడా వారి పాత్ర లేదు. కాని సమ్మెకు కేవలం వారి మద్దతు ప్రకటించారు.

ఆగస్ట్ 15న బొంబాయిలో నిషేధాజ్ఞలు విధించారు. 16న జైల్‌భరో కార్యక్రమంతో జైళ్లన్నీ నిండిపోయాయి. ఇరవై ఐదు వేల మంది కార్మికులు పాల్గొన్నారు. జైళ్లలో ఖాళీ లేక చాలా మందిని వదిలేసారు. సెప్టెంబర్ 16న మళ్లీ జైల్‌భరోకు పిలుపిచ్చారు. దత్తా సామంత్ నాయకత్వంలో నడుస్తున్న సంఘాల నుండి ఎనిమిది లక్షల మంది కార్మికులు పాల్గొన్నారు. కాలాఘాట్ నుండి సిద్ధార్థ కాలేజీ వరకూ అర కిలోమీటర్ ప్రాంత రోడ్లన్నీ కిక్కిరిసిపోయాయి.

మిల్లు కార్మికుల సాహసోపేతమైన ఉద్యమ ప్రభావం పోలీసుల మీద పడింది. అప్పటికే తమ సమస్యల పట్ల తీవ్ర అసంతృప్తితో ఉన్న పోలీసులు కూడా ఉద్యమ బాట చేపట్టారు.

## బొంబాయి పోలీసుల సమ్మె

ఎటువంటి విశ్రాంతి లేకుండా ఇరవై నాలుగు గంటలూ పని చెయ్యలేకపోతున్నామని, నిర్ణీతమైన పని గంటలు, ప్రభుత్వ ఉద్యోగుల్లాగా సెలవులివ్వాలనే డిమాండ్లతో ఆగస్ట్ 18, 1982న సమ్మె ప్రారంభించారు. ప్రభుత్వం వెంటనే పోలీసు యూనియన్‌లను నిషేధించింది. ఎస్ఆర్‌పి, సిఆర్‌పి సైన్యాన్ని దించింది. అయినా సమ్మె ఆగలేదు. నగరమంతా అల్లర్లు ప్రారంభమయ్యాయి. కనిపిస్తే కాల్చివేతకు ఆదేశాలిచ్చారు. వర్లీ నుండి దాదర్ వరకు కర్ఫ్యూ విధించారు. నిరసనకారులు రాళ్లు విసిరారు. కాల్పుల్లో నలుగురు చనిపోయారు. 19న కార్మికసంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ బంద్‌కి పిలుపిచ్చింది. దాంతో అప్పటికే మండిపోతున్న మిల్లు కార్మికుల్లో కోపాగ్ని బద్దలైంది. కొన్నిచోట్ల మిల్లుల్ని కాల్చేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

'పోలీసులు అప్పుడప్పుడు నా సలహాలు అడిగేవారు. వారి సమస్యలు విన్నాక ఆగస్ట్ 15న నల్లబ్యాడ్జీలు ధరించమని చెప్పాను. వారు 'మహారాష్ట్ర రాజ్య పోలీస్ కర్మచారి సంఘటన్' (ఎంఆర్‌పికెఎస్) ఏర్పాటు చేసుకున్నారు. పోలీస్ అధికార్ల ఇళ్ల వద్ద పనిచేస్తున్న ఆర్డర్లీలు పనులు చేయడానికి నిరాకరించారు. దాంతో పోలీసు అధికార్లకు కోపం వచ్చింది. దాని ప్రభావం పోలీసుల ఉద్యమంపై అధికార్ల దురుసు ప్రవర్తన ద్వారా రుజువయింది. 17వ తేదీ రాత్రి ప్రభుత్వం సిఆర్‌పిని దించింది. యూనియన్ నాయకులందర్నీ అరెస్ట్ చేసారు. తర్వాత వారిని జాతీయ భద్రతా చట్టం కింద డిస్మిస్ చేసారు. ఇది చాలదన్నట్లు నయాగామ్ పోలీస్ క్వార్టర్లకు మంచినీటి సరఫరా బంద్ చేసారు. దాంతో పోలీసుల భార్యలు, పిల్లలు రోడ్ల మీదకు వచ్చి నిరసనలు తెలిపారు. పోలీసు అధికార్లకు, వారికి తీవ్రమైన వాగ్యుద్ధం జరిగింది. ఆనాటి బొంబాయి వాతావరణం మిల్లు కార్మికుల సమ్మె కారణంగా చాలా ఒత్తిడితో నిండి ఉంది. ప్రజలు చాలా అసహనంతో ఉన్నారు. పోలీసుల ఆందోళనతో సంబంధం లేకపోయినా ప్రజలు నిరసన పోరాటాల్లో అధిక సంఖ్యలో పాల్గొన్నారు. బొంబాయిలో కొన్ని ప్రాంతాలలో రెండురోజులు ఎక్కడ చూసినా అగ్గిమంటలతో నిండిపోయాయి. బొంబాయిలో నైగామ్, మరోల్, తార్దేవ్, వొర్లిలలో ఆయుధాగారాలున్నాయి. సమ్మె కాలంలో నైగామ్‌లోనే ఆయుధాలను పోలీసులు, ప్రజలు లాక్కున్నారు. ఆయుధాలతో ఉన్న పోలీసులను చూసి అధికార్లు వారి దగ్గరకు వెళ్లడానికి కూడా సాహసించలేకపోయారు' అని ముంబై మరాఠీ పత్రికార్ సంఘ్ మాజీ అధ్యక్షుడు కుమార్ కదమ్ తెలిపారు.

మొత్తం మీద మిల్లు కార్మికుల సమ్మె అంత దీర్ఘకాలం నడిచి విఫలం కావడంతో అనేక అభిప్రాయాలు వెలువడ్డాయి. 'దత్తా సామంత్‌ది తప్పుకాదు. అతనితో ప్రయాణం చేసిన లాల్ నిషాన్ పార్టీ కార్మికుల్ని ఇళ్లకు వెళ్లిపొమ్మని చెప్పింది. దాని వలన గ్రామాల్లో రైతాంగ విప్లవం వస్తుందని వారి అవగాహన. రైతులు, కార్మికులు ఐక్యంగా పోరాడతారని ఊహించారు. కార్మికుల్ని వారి పని స్థలాలలోనే నిలబడి పోరాటం చెయ్యమని చెప్పాలి. ఇది విప్లవం కాదు. కార్మికుల సమ్మె మాత్రమే. అలాగే ప్రభుత్వం మధ్యలో కొంత పెంచుతామని రాజీకి వచ్చినా, దత్తా సామంత్ తిరస్కరించినట్లు పేపర్లలో వచ్చింది. కాని నిజానికి కార్మికులెవ్వరూ దానికి ఒప్పుకోలేదు' అని ఒక నాయకుడు అభిప్రాయపడ్డాడు.

సంవత్సరం పాటు నడిచిన మిల్లు కార్మికుల సమ్మె విఫలం చెందినా దత్తా సామంత్ ప్రభావం కొనసాగుతుండడం చూసిన మిల్లు యాజమాన్యాలు శంకర్ గుహ నియోగిని చంపినట్లే, సామంత్‌ను కాంట్రాక్ట్ హంతకుల ద్వారా జనవరి 16, 1997న కాల్చి చంపారు. ఆయన బొంబాయి నగరంలో శివసేన, బిజెపి ప్రభుత్వం చేపట్టిన ప్రభుత్వ భూముల అమ్మకాన్ని, పరిశ్రమలను క్రమంగా మూసివేసి ఆ పరిశ్రమల భూములను రియల్ ఎస్టేట్‌గా అమ్మాలనుకుంటున్న వారి కుట్రలను తీవ్రంగా వ్యతిరేకించాడు. సేన, బిజెపి నాయకత్వంలో ప్రబలుతున్న అవినీతిని, లంచగొండితనాన్ని కూడా వ్యతిరేకించాడు. అందుకే రాజకీయ నాయకులు, కార్పొరేట్ శక్తుల అపవిత్ర కలయికకి దత్తా సామంత్ బలయ్యాడు.

## నెల్లిమర్ల జూట్‌మిల్ కార్మికుల పోరాటం

1990ల నుండి ఏలూరు, నెల్లిమర్ల జూట్ మిల్లులో అనేక పోరాటాలు జరిగాయి. 1992 జూన్‌లో నెల్లిమర్ల యజమాన్యం మిల్లు లాకౌట్ ప్రకటించింది. ఐఎఫ్‌టియు నాయకత్వంలో కార్మికులు 'పొయ్యి వెలగొద్దు – ముద్ద ముట్టొద్దు' అనే పిలుపుతో ఇళ్లలో ఉండే మహిళలను బ్రహ్మాండంగా కదిలించారు. స్త్రీలు తొలిసారిగా వీధుల్లోకి వచ్చారు. ఐదువేల మంది మహిళలు కలెక్టరేట్‌కు ఊరేగింపు జరిపారు. లాఠీఛార్జీలు, పోలీసు కాల్పులను లెక్కచేయకుండా స్త్రీలు పోరాటం అగ్రభాగాన నిలబడ్డారు. గ్రామాలలోని రైతాంగం, వ్యవసాయ కూలీలు, చిన్న వ్యాపారులు, ఉద్యోగులు అందరి మద్దతు కూడగట్టారు. ఈ

ఉద్యమంలో అనేక పోరాట రూపాలు ముందుకు వచ్చాయి. హోప్ రోడ్ రోకో, బస్ రోకో – ఛోడో, దండోరా దినం, ఖాళీ పళ్లాలు, గ్లాసులతో ఆకలియాత్ర తదితర పోరాట రూపాలతో వేలాది మందిని సమీకరించి పోరాడారు. 92 గంటల రైలింజన్ ముట్టడి, మిల్లులో మేనేజర్లను 42 గంటల ముట్టడి, 34 గంటల నిరవధిక రాస్తారోకోలు జరిగాయి. జనవరి 29, 1994న పోలీసు కాల్పుల్లో ఐదుగురు కార్మికులు చనిపోయారు.

### దల్లా సిమెంట్ కార్మికుల పోరాటం

భారతదేశంలో అతి పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీ ఉత్తరప్రదేశ్ దల్లాలో ఉంది. 1991లో ఏడు వందల కోట్ల విలువ చేసే పరిశ్రమను ప్రైవేట్ పెట్టుబడిదారులకు అమ్మేయడానికి నిర్ణయించారు. నూతన ఆర్థిక విధానాల ఫలితంగా ప్రభుత్వరంగ సంస్థల్ని ప్రైవేటు పరం చేయడానికి, దాల్మియా కంపెనీకి కేవలం 26 కోట్లకు అమ్మడానికి అప్పటి ప్రభుత్వం ప్రయత్నించగా కార్మికులు తీవ్రమైన నిరసనలు తెలిపారు. ఆరు వేల మంది కార్మికులు ఫ్యాక్టరీ చుట్టూ నిద్రాహారాలు మాని షిఫ్టులు వేసుకొని పహారా కాసారు. అనేక మందిని పోలీసులు అరెస్టు చేసినా వాళ్లు బెదరలేదు. చివరకు పోలీసు కాల్పుల్లో 40 మంది మరణించినా కార్మికులు ఐక్యంగా నిలబడి 'ప్రాణాలైనా ఇస్తాం ప్రైవేటీకరణ జరగనివ్వం' అంటూ దృఢంగా నిలబడ్డారు. చివరకు ప్రభుత్వం వెనక్కి తగ్గక తప్పలేదు. మన దేశంలో మొట్టమొదటిసారిగా ప్రైవేటీకరణ యత్నాన్ని తిప్పికొట్టి చరిత్ర సృష్టించారు దల్లా కార్మికులు.

### కనోరియా జూట్ మిల్లు కార్మికుల పోరాటం

1991 వరకు కలకత్తాలో మఫత్‌లాల్ కంపెనీ నడిపిన కనోరియా జూట్ మిల్ తర్వాత శివశంకర్ పసారి ఆధీనంలోకి వచ్చింది. కొత్త యాజమాన్యం వచ్చిన దగ్గర్నుంచీ కార్మికులపై తీవ్రమైన దాడులు సాగించింది. దాంతో కార్మికులు కనోరియా సంగ్రామ్ శ్రామిక్ యూనియన్ నాయకత్వంలో పోరాటం ప్రారంభించారు. 2 డిసెంబర్, 1993న కార్మికులు టూల్ డౌన్ సమ్మె ప్రారంభించారు. పసారి వెంటనే కంపెనీ లాకౌట్ ప్రకటించాడు. కార్మికులు లాకౌట్‌కు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించారు. కార్మికుల్లో ఎక్కువ భాగం గ్రామాల నుండి వచ్చిన వారే కావడం వలన, వారు గ్రామాలకు వెళ్లి రైతులకు తమ పోరాటం గురించి ప్రచారం చేస్తూ, వారి సహకారంతో సమష్టి వంటశాలలను ఏర్పాటు చేశారు. దేశవ్యాప్తంగా వారి పోరాటానికి మద్దతు కోసం ప్రయత్నించారు. రైల్ రోకో, రోడ్ల బంద్, నిరాహార దీక్షలు కొనసాగించి విజయం సాధించారు.

### తమిళనాడు ప్రభుత్వ ఉద్యోగుల పోరాటం

తమిళనాడులో ముప్పై యూనియన్లతో కలిసి ఉన్న ఫెడరేషన్, కన్ఫెడరేషన్ నాయకత్వంలో 12 లక్షల మంది రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు, తమ 16 డిమాండ్ల సాధన కోసం జూలై 2, 2003 నుండి నిరవధిక సమ్మెకు పిలుపిచ్చారు. కాని ప్రభుత్వం జూన్ 30 అర్ధరాత్రి నుండే ప్రముఖ కార్మిక, ఉద్యోగ సంఘాల నాయకులందరినీ అరెస్టు చేసింది. వాళ్లను రోడ్ల మీద ఈడ్చుకుంటూ వాన్‌లలోకి ఎక్కించారు. నాయకుల్ని అవమానించడంతో ఉద్యోగులు జూలై 2 నుండి సమ్మె ప్రారంభించారు. ఇంతవరకూ దేశచరిత్రలోనే జరగని విధంగా సమ్మె చేస్తున్న వారి స్థానంలో కొత్త వారిని రిక్రూట్ చెయ్యడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. చాలా చోట్ల ప్రభుత్వ క్వార్టర్లలో ఉంటున్న ఉద్యోగులను, వారి కుటుంబాలను బయటకు గెంటేయడం ప్రారంభించారు. ఏ యూనియన్‌లో చేరననే ఒప్పందం మీద కొత్త ఉద్యోగులకు నెలకు రు.4000 జీతం ప్రకటించారు. దీనిపై ఉద్యోగ సంఘాలు హైకోర్టుకెళితే సమ్మె ప్రారంభించినందుకు క్షమాపణ పత్రాలు ఇవ్వాలని ఆదేశించింది. డ్యూటీలో చేరడానికి వెళ్లిన వారిని వెంటనే చేరనివ్వక వారిపై ఎటువంటి పోలీసు కేసులు లేవని నిరూపితమవ్వాలని, పోలీస్ ఎఫ్ఐఆర్ చూసిన తర్వాతనే చేరనిస్తామని చెప్పారు. దీనిపై సుప్రీంకోర్టుకెళితే, ఒక సందర్భంలో 'ఉద్యోగులు సమ్మె చేయడం తమ హక్కు అనుకుంటున్నారు. తమిళనాడు ప్రభుత్వం దృఢమైన నిశ్చయంతో సరైన గుణపాఠం చెప్పింది' అని చెప్పి చివరకు సమ్మె చట్టవిరుద్ధం అని, కాని మానవతా దృక్పథంతో డిస్మిస్ చేసిన ఉద్యోగుల్ని తిరిగి తీసుకోవాలని తీర్పునిచ్చింది.

### మారుతీ సుజుకి కార్మికుల పోరాటం

2004–05లో కార్లు, మోటారు సైకిళ్లు, ఆటోలు మొత్తం వాహనాలు 85 లక్షలు ఉత్పత్తి అయితే 2011–12 నాటికి రెండు కోట్ల నాలుగు లక్షలకు చేరిందంటే దేశంలో ఆటోరంగంలో ఉత్పత్తి ఏ స్థాయిలో పెరుగుతుందో అర్థమవుతుంది. కేవలం కార్ల ఉత్పత్తి, 2003–04లో 12 లక్షలుంటే, 2011–12 నాటికి ముప్పై లక్షలకు చేరింది.

ఢిల్లీ, నోయిడా, గుర్‌గావ్, మానేసర్, ఫరీదాబాద్ తదితర పారిశ్రామిక ప్రాంతాలలో దాదాపు పది లక్షల మంది కార్మికులు పని చేస్తున్నట్లు ఒక అంచనా. వీరిలో 80 నుండి 90 శాతం వరకూ కాంట్రాక్టు కార్మికులే. ఆటో పరిశ్రమల్లో ఒక లక్ష మంది పని చేస్తుంటారు. ఆటో పరిశ్రమలో కార్మికులందరి ప్రధాన సమస్య స్వంత యూనియన్ ఏర్పాటు చేసుకోవడం. దాని కోసం ప్రయత్నిస్తే అరెస్టులు, లాఠీఛార్జీలు, గూండాల దాడులు. చివరకు ప్రాణాలు తీస్తున్నారు. ఆటో పరిశ్రమల్లో తమ హక్కుల కోసం కార్మికులు అనేక పోరాటాలు చేస్తున్నారు. 2004లో గుర్‌గావ్‌లో రికో ఆటో కంపెనీలో గూండాల దాడిలో ఒక కార్మికుడు చనిపోయాడు. మానేసర్‌లో మారుతి సుజుకి కంపెనీ కార్మికులు తమ పోరాటాలతో చరిత్ర సృష్టించారు. 2011లో జూన్ 4 నుండి 17 వరకు పద్నాలుగు రోజుల సమ్మె చేసి, కంపెనీ లాకౌట్ ప్రకటించినా, సస్పెన్షన్లకు గురిచేసినా, పోలీసుల, కంపెనీ గూండాల దాడులకు భయపడకుండా ధైర్యంగా నిలబడ్డారు. సెప్టెంబర్ 5న నాలుగు వేల మంది కార్మికులతో హైవేను నిర్బంధించారు. వీరికి మద్దతుగా అనేక ఆటో కంపెనీలలో సమ్మెలు జరిగాయి. ఆగస్ట్ 18, 2012న ఫ్యాక్టరీ తగలబడి ఒక అధికారి కాలి చనిపోతే ఆ నెపం కార్మికుల మీద నెట్టేసారు. కంపెనీ గూండాలు దాడిచేసి ప్లాంట్ ద్వారాలన్నింటినీ మూసివేసి కార్మికులపై దాడిచేసి, కంపెనీ ఆస్తిని ధ్వంసం చేసి, నిప్పు పెట్టారు. హింసాకాండ అంతా ఒక ప్లాన్ ప్రకారం చేసి నేరాన్ని కార్మికులపై నెట్టడానికి కుట్రపన్నారు.

మానేసర్ ప్లాంట్‌లో కార్మికుల ప్రధాన డిమాండ్లు పర్మనెంట్ కార్మికులకు, కాంట్రాక్టు కార్మికులకు సమాన వేతనాలు చెల్లించాలని, వారిద్దరి సమస్యలు ఒకేసారి పరిష్కరించాలని. కాని పర్మనెంట్

కార్మికులకి, కాంట్రాక్టు కార్మికుల గురించి అడిగే హక్కు లేదని అది చట్ట విరుద్ధమని యాజమాన్యం, కార్మిక శాఖలు వాదించాయి. గత సంవత్సరం జూన్‌లో జరిగిన పోరాటంలో మారుతి సుజుకి వర్కర్స్ యూనియన్ (ఎంఎస్‌డబ్ల్యుయు), కాంట్రాక్ట్ కార్మికుల సమస్యను పరిష్కరిస్తే, తమకు ఒక సంవత్సరానికి వచ్చే ఎరియర్స్‌ను వదులుకొంటామని లిఖితపూర్వకంగా తెలపడం కార్మిక వర్గ చైతన్యానికి గొప్ప నిదర్శనం.

దేశంలో ప్రధానంగా ప్రభుత్వరంగ సంస్థల్లోనూ, ప్రైవేట్‌రంగ సంస్థల్లోనూ పర్మినెంట్ కార్మికుల్ని తగ్గించి వేస్తూ కాంట్రాక్టు కార్మికులతో పనులు చేయిస్తూ, వారిపై దారుణమైన అణచివేత సాగిస్తున్నారు. వారి సమస్యపై జాతీయ యూనియన్లు ఏమాత్రం పట్టించుకోవడం లేదు. పైగా పర్మినెంట్ కార్మికుల సమస్యలపై సమ్మెలు చేసేటప్పుడు, కాంట్రాక్ట్ కార్మికుల్ని కూడా రంగంలోకి దించుతున్నారు. కాని యాజమాన్యాలు కుట్రపూరితంగా పర్మినెంట్ కార్మికులకు ఏదో మేరకు రాయితీలు ప్రకటించగానే, కాంట్రాక్టు కార్మికుల సమస్యలు గాలికొదిలేసి సమ్మెలు విరమిస్తున్నారు. దాంతో కాంట్రాక్టు కార్మికులు ద్రోహానికి గురవుతున్నారు. ఉదాహరణకు, ఏప్రిల్ 2012లో ప్రభుత్వరంగ సంస్థ అయిన నైవేలీ లిగ్నైట్ కార్పొరేషన్‌కు చెందిన వేలాది కాంట్రాక్టు కార్మికులు తమ సమస్యల పరిష్కారం కోసం 44 రోజులు సమ్మె చేసారు. కమ్యూనిస్టు యూనియన్లు సమ్మెకు మద్దతిచ్చాయి గాని పర్మనెంట్ కార్మికుల్ని కాంట్రాక్టు కార్మికులకు మద్దతుగా సమ్మెకు పిలుపివ్వలేదు. దానికి భిన్నంగా మానేసర్‌లో మారుతి సుజుకి కంపెనీలో కాంట్రాక్టు కార్మికుల కోసం, పర్మినెంట్ కార్మికులు దృఢంగా నిలబడడం నిజమైన కార్మికవర్గ చైతన్యానికి నిదర్శనం.

నూతన ఆర్థిక విధానాల ఫలితంగా డిస్-ఇన్వెస్ట్‌మెంట్స్, రిట్రెంచ్‌మెంట్, వాలంటరీ రిటైర్‌మెంట్, గోల్డెన్ హాండ్‌షేక్ వంటి కార్మిక వ్యతిరేక చర్యలు ప్రారంభమయ్యాయి. ఈ చర్యలను కేంద్ర కార్మిక సంఘాలు తూతూ మంత్రంగా నిరసిస్తున్నాయి గాని, ఒక దృఢమైన దేశవ్యాప్త ఉద్యమాన్ని నిర్మించడానికి పూనుకోవడం లేదు. ఈ తరుణంలో కార్మికులు తమ కార్మిక సంఘాలకతీతంగా సంయుక్త కార్యాచరణలోకి వస్తున్నారు. కొన్నిచోట్ల తమ సంఘ నాయకుల మెడలు వంచి సంయుక్త కార్యాచరణ కమిటీలు ఏర్పాటు చేస్తున్నారు. ఈ కమిటీలు గతంలో కన్నా భిన్నమైన పోరాట రూపాలు చేపడుతూ స్థిరమైన పోరాటాలు చేస్తున్నాయి. మానేసర్‌లో హింసా ఘటనల అనంతరం దానిపై వ్యాఖ్యానిస్తూ 'పాత యూనియన్లు పూర్తిగా చొరవ కోల్పోయాయి. అందుకే కొత్త యూనియన్లు ఎక్కడికక్కడ పుడుతున్నాయి. వాటికి రాజకీయ పరమైన, చట్టపరమైన రక్షణ అవసరం. అవి వారికి అందకపోయినా, వారి పని పరిస్థితులు మెరుగుపర్చకపోయినా ప్రభుత్వం, దోపిడీ చేసే పెట్టుబడిదార్లకు వత్తాసుగా నిలబడడం కొనసాగిస్తే, అది మరింత హింసకు, పారిశ్రామిక అశాంతికి దారి తీయక తప్పద'ని ఇపిడబ్ల్యు హెచ్చరించడం గమనార్హం.

## మహోజ్వల పోరాటాలలో స్ఫూర్తినిచ్చే అంశాలు

భారత కార్మికోద్యమంలోని అనేక మహోజ్వల పోరాటాలలో గొప్ప స్ఫూర్తినిచ్చే అంశాలు అనేకం ఉన్నాయి. 'మాలోని మనిషివే నీవు, పొట్ట కూటికి నీవు పోలీసువైనావు' అన్న చెరబండరాజు గేయంలోని సారాంశానికి నిదర్శనంగా, బొంబాయి మిల్లు కార్మికుల సమ్మెలో పోలీసులు, కార్మికులు కలిసి పోరాడారు. నావికుల తిరుగుబాటులో నావికులు, కార్మికులు, ప్రజలు కలిసి పోరాడారు. పెషావర్‌లో సైనికులు, ప్రజలు దృఢంగా నిలబడి హిందూ ముస్లిం ఐక్యతకు, నిజమైన సెక్యులరిజానికి ప్రతీకగా నిలబడ్డారు. అమెరికా, జర్మనీ, బ్రిటన్ దేశాలకు చెందిన కార్మిక నాయకులు ఉరికంబాలెక్కి అంతర్జాతీయ కార్మిక ఐక్యతకు నిదర్శనంగా నిలబడిన మేడే పోరాటయోధుల స్ఫూర్తిని, మీరట్ కుట్రకేసులో భారత్, బ్రిటన్ కార్మిక నాయకులు అందుకొన్నారు. సమాంతర ప్రభుత్వం నడిపి, పారిస్ కమ్యూన్ చైతన్యాన్ని అందుకొన్నారు. షోలాపూర్ కార్మికులు, పోరాటాల్లో స్త్రీలు ఏమాత్రం తీసిపోరని, బొంబాయి మిల్లు కార్మికుల సమ్మెలోనూ, నెల్లిమర్ల జూట్‌మిల్లు కార్మికుల పోరాటంలోనూ రుజువు చేశారు. దీర్ఘకాలం పోరాటం చేసి విఫలం చెందినా, నెపం నాయకత్వం మీద నెట్టేయకుండా, సమష్టి బాధ్యతను వహించడం; అల్లర్లలో లూటీలు జరిగినా వాటిల్లో పాల్గొనకుండా కార్మికుల నిజాయితీని ప్రదర్శించిన బొంబాయి మిల్లు కార్మికుల పోరాటం; గ్రామాల నుండి, ప్రజల నుండి సహకారం పొందడంలో విజయం సాధించిన, బొంబాయి మిల్లు కార్మికులు, కానోరియా జూట్ మిల్లు కార్మికుల చైతన్యం; కేవలం కార్మికులు కార్మికుల సమస్యలపైనే కాకుండా, ప్రజల సమస్యలపైన, అసంఘటిత రంగ కార్మికుల సమస్యల పైన, స్త్రీల సమస్యలపైన, సామాజిక సమస్యలపైన పోరాటం చేసిన సింగరేణి కార్మికులు, ఛత్తీస్‌గడ్ కార్మికులు; ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ప్రాణాలర్పించి అడ్డుకొన్న దల్లా సిమెంట్ కార్మికులు; కాంట్రాక్టు కార్మికుల కొరకు పర్మనెంట్ కార్మికులు నిలబడడమనే చైతన్యాన్ని ప్రదర్శించిన మారుతి సుజుకి కార్మికులు; మొత్తం మీద అందరూ కార్మికవర్గ చైతన్యానికి అద్భుతమైన ప్రతీకలుగా నిలబడ్డారు.

సంఘటిత కార్మిక ప్రజా ఉద్యమాలు గొప్ప సామాజిక చైతన్యాన్ని పెంపొందిస్తాయి. 'ఉద్యోగులు గానో, వృత్తి నిపుణులుగానో ఒక కార్యాలయంలో పనిచేసే వ్యక్తుల మధ్య కన్నా, వీధుల్లోకి వచ్చి పోరాడే క్రమంలో తమ సమస్యల ప్రాతిపదికన ఏర్పడే ఐక్యత భిన్నంగా ఉంటుంది. ఈ పోరాడే కార్యక్రమం ఎన్ని ప్రమాదాలూ, గుణపాఠాలూ ఎదురయినప్పటికీ ఈ సామాజిక ఆచరణ వాళ్లకొక పరిష్కార మార్గాన్ని అందిస్తుంది. ఈ సామాజికోద్యమ ఆచరణలో ఏర్పడే ఐక్యత భాగస్వామ్యం, వ్యక్తిగత నిబద్ధత, చర్చ వంటి అంశాలు వారిలోకి నైపుణ్యాలను, జ్ఞానాన్ని వెలికితీసి వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తాయి. ఆర్థిక సంస్థలూ, రాజ్యం చేసే పెత్తనం, వ్యక్తుల్లో కలిగించే పరాయీకరణను, సామాజిక వర్గపరంగా ఏర్పడే నూతన సామాజిక సంబంధాలు తొలగించగలుగుతాయి. బాధిత వ్యక్తుల్లో ఏర్పడుతున్న నేర ప్రవృత్తినీ, సంఘ వ్యతిరేక ధోరణుల్ని అరికట్టడంలో సంఘటిత ప్రజా ఉద్యమాలు ప్రధాన పాత్ర వహిస్తాయి' అని జేమ్స్ పెట్రాస్ చెప్పినదాన్ని కార్మికవర్గం స్వీకరించాలి.

దీనికి ఉదాహరణగా 1995లో ప్రపంచీకరణ కు వ్యతిరేకంగా జరిగిన మొదటి తిరుగుబాటుగా వర్ణించబడిన ఫ్రాన్స్ కార్మికుల పోరాటం గురించి చెప్పుకోవాలి. రైల్వే, ప్రజారవాణా సిబ్బందితోపాటు, నర్సులు,

ఆసుపత్రి సిబ్బంది, విద్యుత్ కార్మికులు, దినపత్రికల సిబ్బంది, టెలిఫోన్ ఆపరేటర్లు, వైమానిక సిబ్బంది, ఉపాధ్యాయులు, ఆటోవర్కర్లు, విశ్వవిద్యాలయ విద్యార్థులు కలిసి పాల్గొన్న అద్భుతమైన పోరాటమిది. 'అందరూ ఐక్యంగా' అనే నినాదంతో సామూహికతను ప్రతిబింబించే బ్యానర్లను కేవలం సంఘటిత రంగం నుండే కాకుండా అసంఘటిత రంగం నుండి, నిరుద్యోగ సమూహాల నుండి, ఇల్లూ వాకిలీ లేని నిరుపేదల నుండి, వలస వచ్చిన కార్మికుల నుండి, కళాకారులు, నాటక, నృత్య కంపెనీల వరకు వచ్చిన వారితో ప్రదర్శనలు, ఊరేగింపులు జరిపి సమ్మెకు సంఘీభావం ప్రకటిస్తూ, ఇరవై లక్షల మంది రోడ్ల మీదకు వచ్చిన అపురూపమైన సంఘటన అది. సమ్మె కాలంలో సంఘటిత భావనను పెంపొందించ డానికి నిర్దిష్టమైన చర్యలు తీసుకొన్నారు. పారిస్ బస్‌డ్రైవర్లు బస్సులను స్వాధీనం చేసుకొని ఆ బస్సుల్లో నిలవనీడలేని, ఇల్లూ వాకిలీ లేని ప్రజలకు ప్రయాణ సౌకర్యం కల్పించారు. బస్సులపై 'ప్రజా బాహుళ్యం, అత్యంత నిరుపేద ప్రజానీకానికి సంఘీభావం ప్రకటిస్తూ బస్సు డ్రైవర్లు' అనే బానర్లు కట్టారు. చిన్న పట్టణాలలో విద్యుత్ కార్మికులు విద్యుత్ ప్లాంట్లను స్వాధీనం చేసుకొని, వినియోగదారులకు తక్కువ రేట్లకు విద్యుత్ సరఫరా చేసారు. రైల్వే కార్మికులు, ఇతర కార్మికులు పని స్థలాలకు వెళ్లి తమ సమస్యల గురించి వివరించి, వారిని ఉద్యమానికి సంఘీభావం ప్రకటించేటట్టు చేసారు. అలాగే ఉద్యోగాల మీద ఏ మాత్రం ఆశలేని విద్యార్థులు, విశ్వవిద్యాలయ భవనాన్ని స్వాధీనం చేసుకొని, కార్మికులకు సంఘీభావం ప్రకటిస్తూ, ప్రభుత్వాన్ని విమర్శిస్తూ 'వాళ్లు మనల్ని బయటకు విసిరేయక ముందే మనమే వీధుల్లోకి వద్దాం రండి' అని ప్రకటించడం అపూర్వమైన విషయం.

కార్మికవర్గం తమ సమస్యల గురించి, పోరాటాల గురించి ఎప్పటికప్పుడు ప్రజలకు వివరించాలి. వారి సహకారం పొందాలి. ప్రజల సమస్యల్లో భాగం పంచుకోవాలి. అటువంటి కార్యాచరణ ద్వారా మాత్రమే సామాజిక మార్పుకు, సమాజంలో భాగమైన కార్మిక వర్గ సమస్యలకు కూడా పరిష్కారం లభిస్తుంది. మార్క్స్ చెప్పినట్లు 'కార్మిక వర్గ సంపూర్ణ విముక్తి కోసం నేడు ట్రేడ్ యూనియన్‌లు తమ సహజ కర్తవ్యాలతో పాటు కార్మికవర్గాన్ని సంఘటితపరిచే కేంద్ర బిందువులుగా, చైతన్యంతో ఎలా కృషి చేయాలో నేర్చుకొని తీరాలి. ఈ ధ్యేయంతో నిర్వహించబడే ప్రతి సాంఘిక, రాజకీయ ఉద్యమాన్ని అవి బలపర్చాలి. యావత్తు కార్మికవర్గ ప్రతినిధిగా, నాయకుడిగా ముందునిలిచి, బయటి కార్మికులను కూడా తన చుట్టూ సమీకరించడం ప్రతి ట్రేడ్ యూనియన్ కర్తవ్యం కావాలి.'

సామ్రాజ్యవాద విధానాలకనుగుణంగా నేడు మన పాలకులు, యాజమాన్యాలు కార్మికవర్గ చైతన్యాన్ని అణచివేయడంలో భాగంగా కార్మికుల హక్కులపై దాడులు చేస్తున్నారు. చట్టాలను అమలు చేయడం లేదు. సమస్యల్ని పరిష్కరించడానికి ఏర్పాటు చేసిన కార్మికశాఖల్ని బలహీనం చేసారు. సంస్థల్లో యూనియన్ల పాత్ర అలంకారప్రాయం చేసారు. కార్మిక సంఘాల నాయకత్వాన్ని కొనేస్తున్నారు. యాజమాన్యాలు ఏకపక్ష నిర్ణయాలు తీసుకొంటున్నారు. దోపిడీ దౌర్జన్యాలను ఇక భరించలేని స్థితిలో కార్మికులు నిలబడితే వాళ్లే హింసను సృష్టిస్తున్నారు. దొంగే దొంగ అన్నట్లు హింసాపూరిత వాతావరణాన్ని సృష్టించి, కార్మికులపై మానసిక, భౌతిక హింసలు కొనసాగిస్తున్నారు. దేశ వ్యాప్తంగా కార్మికులపై అమలవుతున్న దాడులను, ప్రత్యేకంగా మానేసర్ కార్మికుల పోరాటంలో జరిగిన ఘటనలపై విశ్లేషకులు దానిని 'పారిశ్రామిక టెర్రరిజం', 'కార్పొరేట్ మిలిటరీ ఫాసిజం' అని వ్యాఖ్యానించారంటే కార్మికులపై దాడి ఏ స్థాయిలో జరుగుతుందో అర్థం చేసుకోవచ్చు. ఈ విషయాన్ని 126 సంవత్సరాల క్రితం 1886లో ఎనిమిది గంటల పనికోసం ఉరికంబాన్నెక్కిన జార్జి ఏంజెల్ స్పష్టంగా చెప్పాడు: 'యంత్రాల అభివృద్ధి పెరిగిన కొద్దీ కార్మికుడు నిరుపయోగ మవుతాడు. వారు కేవలం యంత్రాలకు అనుబంధాలుగానే మిగిలి పోతారు. ముందు ముందు వీధి పోరాటాలు అసాధ్యమని ఈ బాంబు సంఘటన (హే మార్కెట్‌లో ఫీల్డెన్ మాట్లాడుతుండగా సభను భగ్నం చేయడానికి పోలీసులు వేసిన బాంబు) రుజువు చేసింది. నాకు యుద్ధం అంటే ఇష్టం లేదు. కానీ హింసాత్మక విప్లవం వస్తుంది. వచ్చితీరాలి. అయితే దాన్ని రప్పించేది కార్మికులు కాదు. పెట్టుబడిదారులే. క్షణక్షణం దరిద్రులవుతున్న కార్మికులు ఏకమవకతప్పదు. ఎదురు తిరగక తప్పదు. అప్పుడు పెట్టుబడిదారులు చట్టాలను, కార్మిక హక్కులను రద్దు చేసి తీరుతారు. కార్మికులు అంతిమ యుద్ధానికి సిద్ధం కావాలి. కార్మికుల విజయం తరువాత శాంతి తప్ప యుద్ధాలే ఉండవు.'

నేడు సామ్రాజ్యవాద దోపిడీకి కేవలం కార్మికులే కాకుండా దేశ ప్రజలందరూ గురవుతున్నారు. ఈ పరిస్థితుల్ని ఎదుర్కోవడానికి జాతీయ కార్మిక సంఘాల పాత్ర నామ మాత్రమే కాక నష్టదాయకంగా కూడా ఉంది. కాని వారి సంఘాల వెనక లక్షలాది మంది కార్మికులున్నారు. వారినందరినీ సమష్టి కార్యాచరణలోకి తీసుకురావాలి. సరైన శాస్త్రీయమైన రాజకీయ దృక్పథంతో, పోరాటాలకు అవసరమైన సృజనాత్మకమైన ఎత్తుగడలతో ఐక్య సంఘటనల్ని నిర్మించాలి. భారత కార్మికోద్యమం ఈ చారిత్రక కర్తవ్యాన్ని, ఉత్తేజాన్నిచ్చే కార్మిక పోరాటాల చరిత్ర స్ఫూర్తితో తప్పక నెరవేరుస్తుంది.

**ఉపయోగపడిన గ్రంథాలు**


1. భారత కార్మికోద్యమ చరిత్ర - సుకోమల్ సేన్
2. నేటి భారతదేశం - రజనీ పామీదత్
3. వన్ హండ్రెడ్ ఇయర్స్ - వన్ హండ్రెడ్ వాయిసెస్ (ది మిల్ వర్కర్స్ ఆఫ్ గిరంగావ్ ఆన్ ఓరల్ హిస్టరీ) - మీనా మెనన్, నీరా అపర్ణ
4. మాడర్న్ ఇండియా - సుమిత్ సర్కార్
5. గొప్పదాడి - సోహన్‌సింగ్ జోష్
6. జీవితమే ఉద్యమమై (శంకర్ గుహ నియోగి) - భరత్ డోగ్రా
7. సింగరేణి బొగ్గు గనుల్లో రగిలిన పోరాటాలు - కార్మిక ప్రచురణలు
8. మే 1886 ఉరికొయ్యలు - చెరసాలలు - ఎచ్‌బిటి
9. వీరోచిత ఆంధ్రా జూట్ మిల్ కార్మికోద్యమం - పి. ప్రసాద్
10. జేమ్స్ పెట్రాస్ వ్యాస సంకలనం - 2
11. భారతదేశంలో సమ్మెలు - వి.బి. కార్నిక్
12. శ్రమజీవి - పత్రికలు
13) లేబర్ ఫైల్ - పత్రికలు


*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# మహిళా ఉద్యమ చరిత్ర - ప్రధాన ఘట్టాలు

***సమాజంలో అర్ధభాగాన్ని ఆక్రమించినప్పటికీ అన్ని రకాల అసమానతనూ, వివక్షనూ, హింసనూ ఎదుర్కొంటున్న మహిళలు తమ హక్కులను సాధించుకోవడానికి సాగించిన మహోజ్వల పోరాట గాథలను వివరిస్తున్నారు* డా. నళిని**

ఏళ్ల తరబడి సమానత్వం కోసం పోరాడుతున్న మహిళలకి ఈనాటికీ ఎదురవుతున్నది అడుగడుగునా నిర్బంధాలు, వివక్ష మాత్రమే. ఇటీవల పెరుగుతున్న భ్రూణ హత్యలు, యాసిడ్ దాడులు, వరకట్న చావులు, మానభంగాలు, గృహహింసలు ఇందుకు నిదర్శనం. స్త్రీకి ఇంటా బయటా భద్రతే లేకుండా పోతోంది. వయసుతో సంబంధం లేకుండా పసిపిల్లలు సైతం వేధింపులకు, అత్యాచారాలకు గురవుతున్నారు. ఇటీవల అస్సాంలో జరిగిన దురాగతం ఇందుకొక తాజా ఉదాహరణ. వీథిలో ఒక ఆడపిల్లని అసభ్యంగా వేధించినా దారినపోయేవాళ్లు పట్టించుకోలేదు. మీడియా దాన్ని వివరంగా చిత్రించింది. రెండోరోజు ఆ వార్త సద్దుమణిగిపోయింది. మళ్లీ మరో దగ్గర అలాంటి సంఘటనే పునరావృతమవుతోంది.

'ఎండ, వాన, వినీలాకాశం, కొండలు, కోనలు, ఆకులు, అలుములు, చుక్కల వెలుగు, చంద్రుని కాంతి, ఇవి మాత్రమే నా సొంతం' అంది మాయా ఏంజెలో అనే కవయిత్రి. నేడు స్త్రీలలో చాలా మంది ఒంటరి తనాన్ని ఎదుర్కొంటున్నారు. కుటుంబాలు కుదించుకుపోవడం, పుట్టి పెరిగిన ప్రాంతాలకు దూరంగా వలస వెళ్లవలసి రావడం, మానవ సంబంధాల్లో పెరుగుతున్న సంక్లిష్టతలు కొంతవరకు కారణం కావచ్చు. మరోవైపు, పెరుగుతున్న ఆర్థిక మాంద్యం, అనేక ఆర్థిక, సామాజిక, రాజకీయ ఒత్తిళ్లు కలగలసి దీనికి ఎక్కువగా దోహదం చేస్తున్నాయి. అందుకే, ఏ చిన్న అవకాశం వచ్చినా సంఘటితం కావాలనే కాంక్ష, తమ గొంతు కూడా వినిపించాలనే తపన స్త్రీలలో ఎక్కువగా వెల్లడవుతోంది. అలజడే జీవితంగా గడుపుతున్న వారు ఆందోళనే కార్యాచరణగా స్వీకరించడానికి సంసిద్ధమవుతున్నారు.

మానవాళిలో సగభాగంగా ఉన్న స్త్రీ జనావళి ప్రత్యేకించి తమ ఆకాంక్షలను తెలియజేయడానికి, హక్కుల్ని డిమాండ్ చేయడానికి గొంతెత్త వలసిన అవసరం అసలు ఎందుకు వచ్చింది? ఎప్పుడు వచ్చింది? ఎలా వచ్చింది? మానవ చరిత్ర ఆరంభం నుంచే ఈ అవసరం ఉందా? లేక అది మధ్యలో తలెత్తిందా? స్త్రీ దేనినుంచి విముక్తి చెందాలి? ప్రధాన సమస్య ఏది? ఉద్యమిస్తున్న స్త్రీలకు ఎదురవుతున్న అవరోధాలు ఏమిటి? ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోనిదే మహిళోద్యమాన్ని అర్థంచేసుకోలేం. అందులో నెలకొని ఉన్న వివిధ పార్శ్వాలను విశ్లేషించలేం.

స్త్రీ విముక్తి ఉద్యమాన్ని అర్థం చేసుకోవాలంటే, ఉద్యమించక తప్పని పరిస్థితుల్ని కల్పించిన సమాజాన్ని ప్రశ్నించాలి. ఎందుకంటే, ఏ దేశంలోనైనా స్త్రీల పట్ల అవలంబించే విధానాలే దేశ సామాజిక ఆర్థిక ప్రగతిని ప్రతిఫలిస్తాయి. స్త్రీలస్థాయిని బట్టి ఆ సమాజం ఎంత ఆరోగ్యకరంగా ఉందో తెలుసుకోవచ్చు.

**ఈనాటి స్త్రీల స్థితిగతులు**

సమస్య తీవ్రత పట్ల అవగాహనే సమస్య పరిష్కారం వైపు అడుగులు వేయిస్తుంది. అందుకే ముందుగా సమస్యని అర్థం చేసుకోవాలి. 'కాలిపోయిన తల్లులు, గజగజ వణుకుతున్న యువతులు ఎండి వగ్గయిపోయిన పిల్లలు, హింసకి గురయిన జంతువు, అన్నీ శబ్ద బీభత్స నిశ్శబ్దంలో, తమ స్థానంలో, కాలంలో ఆక్రోశిస్తున్నారు' అంది నిసిం ఎజెకీల్ అనే బొంబాయి రచయిత్రి. ఎందుకీ ఆక్రోశం? ఎందుకీ వేదన? ఎందుకంటే, ఏ విధంగా చూసినా అన్ని రంగాల్లో స్త్రీ వివక్షకు గురవుతోంది. అభివృద్ధి చెందుతున్న దేశాలన్నిటితో పోలిస్తే మన దేశంలో స్త్రీల పరిస్థితి చాలా హీనంగా ఉంది. అది దాదాపు సబ్-సహారన్ ఆఫ్రికా స్థాయికి దగ్గరలో ఉంది. మన పిల్లల పరిస్థితీ అంతే. కొన్ని లైంగిక సూచికల ప్రకారం చూస్తే ఈ పరిస్థితి బాగా అర్థమవుతుంది.

**జెండర్ ఇండికేటర్లు :**

- స్త్రీల ఉనికి – సెక్స్ రేషియో, మాయమవుతున్న మహిళలు.
- విద్య – అక్షరాస్యత, పాఠశాలల్లో భర్తీ శాతం, ఉన్నత విద్యలో భాగస్వామ్యం.
- ఆహార పరిస్థితి, ఆరోగ్యం – పోషకాహార లోపం, జీవితకాల పరిమితి, గర్భిణీ స్త్రీల ప్రమాద స్థాయి.
- ఉద్యోగ భద్రత – పనిలో భాగస్వామ్యం, వేతనాల్లో వ్యత్యాసం.
- భద్రత, భావ ప్రకటన – స్త్రీలపై హింస, రాజకీయ భాగస్వామ్యం.

పై సూచికల ప్రకారం చూస్తే, ఆడపిల్ల పిండంగా ఉన్న దగ్గర నుంచి కాలి బూడిదయ్యే వరకు (వూంబ్ టు టూంబ్) వివక్షకు గురవుతూనే ఉంది. ఆడపిల్లని గర్భంలోనే అంతం చేయడం, లేదా పుట్టగానే చంపేయడం, ఎలాగో బతికి బట్టకట్టినా సరైన ఆహారం ఇవ్వకపోవడం, స్కూలుకి పంపకపోవడం, ఆరోగ్యంలో నిర్లక్ష్యం, బాల్య వివాహాలు, లైంగిక అత్యాచారాలు, యాసిడ్ దాడులు, కట్న పిశాచి, విడాకులు, భద్రతలోపం, వేతనాల్లో వ్యత్యాసం, రాజకీయాల్లో వివక్ష, పేదరికానికే ఒక ముఖంగా మారిన స్త్రీ – ఇలాంటి చర్యలవల్ల స్త్రీ అభివృద్ధిని సాధించలేకపోతోంది. ఆర్థిక సమానత్వం లేకపోవడం లైంగిక వివక్షకు కారణమవుతోంది. రాజకీయ భాగస్వామ్యం లేకపోవడం, సామాజిక, సాంస్కృతిక స్వేచ్ఛ లేకపోవడం అన్ని విధాలా అధోగతికి దారితీస్తోంది.

స్త్రీల స్థాయిని చూస్తే మన దేశం ఎంత అభివృద్ధి సాధించిందో అర్థమవుతుంది. పేదవాళ్లలో నూటికి 70 శాతం ఆడవాళ్లే. ప్రపంచ వ్యాప్తంగా నూటికి 67 గంటలు పనిచేసేది స్త్రీలే. కానీ ప్రపంచ రాబడిలో నూటికి పదిశాతం మాత్రమే స్త్రీలది. అలానే ప్రపంచ ఆస్తిలో ఒక్క

శాతం మాత్రమే స్త్రీలది. వీటిలో మన దేశం ఎందులోనూ తీసిపోదు. స్త్రీలకి సమానమైన పనికి సమాన వేతనం ఎప్పుడూ లేదు. పురుషుల కంటే 30-40 శాతం తక్కువ వేతనం ఆమెది. ఆహారంలో 60-80 శాతం పండించేది స్త్రీలే. కానీ పోషకాహార లోపం వారిలోనే ఎక్కువ. అంతేకాక ఆమె పండించే భూమిపై ఆమెకి ఏ హక్కూ ఉండదు. ఒక స్త్రీకి సగటున 2,200 కిలో కేలరీలు అవసరమైతే, ఆమె తీసుకునే ఆహారంలో 1,400 కేలరీలు మాత్రమే లభ్యమవుతున్నాయి.

మిగిలిన కొలమానాల ప్రకారం చూసినా ఆమె స్థితి దిగజారుడుగానే ఉంది. ఇప్పటికీ నిరక్షరాస్యుల్లో 67 శాతం మహిళలే ఉన్నారు. అంటే, మహిళల్లో అక్షరాస్యత 54 శాతంగానే ఉంది. పద్నాలుగేళ్ల లోపు బాలికలకు ఇప్పటికీ నిర్బంధ విద్య అమలు కావడం లేదు. ఆరోగ్యం విషయానికి వస్తే గర్భిణీ స్త్రీలలో 88 శాతానికి రక్తహీనత. పైగా, ప్రతి ఐదు నిమిషాలకి ఒక మహిళ కాన్పులో చనిపోతోంది. యుక్త వయసులో ఉండవలసిన ఆరోగ్య సంరక్షణ లేదు. ఐదేళ్ల లోపు పిల్లలకు టీకాలు ఇప్పించడంలో నిర్లక్ష్యం. తగిన వయసు రాకముందే పెళ్లిళ్లు, పోషకాహార లోపం. ఇవన్నీ కలిసి స్త్రీల ఆరోగ్యాన్ని దిగజార్చి వేస్తున్నాయి. పిల్లల్ని కనే వయసులో తోడ్పడే హార్మోన్ల వల్ల మాత్రమే ఆమెకి కొంత రక్షణ ఉంటోంది.

ఇక శారీరక వేధింపుల మాటకొస్తే, ఆడపిల్లకి గర్భంలోనూ, పుట్టిన వెంటనే చావు భయం వెంటాడుతుంది. భ్రూణ హత్యల వల్ల స్త్రీ పురుషుల మధ్య సెక్స్ రేషియో ప్రభావితమవుతోంది. ప్రతి వెయ్యి మంది పురుషులకు 914 మంది మహిళలు మాత్రమే మిగులుతున్నారు. ఇంకా, ప్రతి 32 నిమిషాలకు ఒక మహిళపై అత్యాచారం జరుగుతోంది. ప్రతి 12 నిమిషాలకు ఒక మహిళ లైంగిక వేధింపులకు గురవుతోంది. ప్రతి 36 నిమిషాలకు ఒక స్త్రీ, లేదా మైనర్ బాలిక అదృశ్యమవుతోంది. ప్రతి 66 నిమిషాలకు ఒక స్త్రీ వరకట్న చావుకి బలవుతోంది. ప్రతి 11 నిమిషాలకు ఒక స్త్రీ కుటుంబ హింసకు గురవుతోంది. ఇది కాక, రేప్ అనేది ఒక రాజకీయ ఆయుధంగా కూడా పనిచేస్తోంది. తమ హక్కుల కోసం ఎలాంటి పోరాటం చేపట్టినా, అది తీవ్రస్థాయికి చేరుకునే సరికి రాజ్యం రేప్ రూపంలో వారిపై విరుచుకుపడుతుంది.

పొద్దు పొడవక ముందే లేచి, ఇంటిని చక్కదిద్ది, అందరి కడుపులు నింపి, సుదూర ప్రాంతాల నించి నీళ్లు మోసుకొచ్చి, మంచినీళ్లు నింపి, బట్టలుతికి, వంట చెరుకు తెచ్చి, వంట చేసి, బయట పనికిపోయి, చీకటి పడుతుంటే ఇల్లు చేరుకుని, మళ్లీ ఇంటి పనిలో లీనమైపోయి, అందరూ నిద్రపోయాక ఇంత తిని, అన్నీ సర్దుకుని, ఏ అర్ధరాత్రికో ఒంటి నొప్పులతో సలుపులతో నడుము వాల్చే స్త్రీ తన కోసం ఆలోచించడం, నేర్చుకోవడం, తన పోరాటాలు తాను చేసేలా తర్ఫీదు పొందడం విశేషం.

## సామాజిక పరిణామ చరిత్ర

మనం మన హక్కుల కోసం అడుక్కోవడం కాదు. పోరాడి సాధిద్దాం అనే స్పృహ కలిగిన స్త్రీ అసలు తన హక్కుల్ని ఎలా కోల్పోయిందో తెలుసుకోవాలంటే సామాజిక పరిణామ క్రమాన్ని అధ్యయనం చేయక తప్పదు. క్రిస్టియన్ దేముడు ఒక ఆడంని, ఒక ఈవ్‌ని సృష్టించి సహజీవనం చేయమన్నంత సులువుగా ఈ పరిణామం జరగలేదు. ఆ చరిత్రలో ఒక జీవన పోరాటం ఉంది. శ్రమశక్తి ఉద్భావన ఉంది. చేతి ఉపయోగాన్ని తెలుసుకోవడం ఉంది. శ్రమ విభజన ఉంది. ఆహారాన్వేషణ ఉంది. వ్యవసాయం ఉంది. అగ్నిని కనుక్కోవడం ఉంది. పనిముట్లు తయారీ ఉంది. చివరగా సంపద ఉంది. స్త్రీని అణగదొక్కిన ఆర్థిక ప్రాతిపదిక ఉంది. అది కల్పించిన వారసత్వం ఉంది. దోపిడీ ఉంది.

స్త్రీ, పురుషుల శరీర నిర్మాణంలో తేడాల వల్లనే పురుషులు అధికులు, స్త్రీలు అధములు అయిపోయారనే వితండవాదానికి ఆంత్రపాలజిస్టులు (మానవ పరిణామ విశ్లేషకులు) ఏనాడో సమాధానం చెప్పారు. ఆదిమ సమాజంలో, వానరుడి నించి మానవుడు పరిణామం చెంది, రెండు కాళ్ల జీవిగా అభివృద్ధి చెందిన కాలం నించి మిగులు సంపద పోగయే కాలం వరకు స్త్రీ ఉన్నత స్థాయిలో ఉండేది. ఆదిమ వ్యవస్థలో మాతృస్వామ్యం అమలయ్యేది. ఆనాడు ఆమెకి సృజనాత్మకత, సామాజిక సాంస్కృతిక శక్తి అపారంగా ఉండేది. మరి ఆ సబల ఈనాటి అబలగా ఎలా తయారయింది?

ఆదిమ సమాజంలో హెచ్చుతగ్గులు లేవు. సమానత్వం ఉండేది. ఆడ, మగ వివక్ష లేదు. అమెరికన్ లూయీ మోర్గన్, బ్రిటిష్ ఎడ్వర్డ్ టైలర్ ఈ పరిణామ క్రమాన్ని సహేతుకంగా, శాస్త్రీయంగా విశ్లేషించిన ఆంత్రపాలజిస్టులు. ఈ భూమి మీద దాదాపు 99 శాతం కాలం వేటాడుతూ బతికే ఆటవిక కాలంగానే నడిచింది. ఎనిమిది వేల ఏళ్ల క్రితం మాత్రమే వ్యవసాయం, పశుపోషణ దశ ఆరంభమయింది. ఐదువేల ఏళ్ల క్రితం నేటి నాగరిక సమాజం ఉద్భవించింది. డార్విన్, మోర్గన్‌ల పరిశోధనలతో ఉత్తేజితులై మార్క్స్, ఎంగెల్స్‌లు కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుకను స్పష్టంగా నిర్వచించారు. సామాజిక పరిణామంలో 'ఆంత్రపాయిడ్' (కోతి) నుంచి 'హ్యూమనాయిడ్' (మనిషి) దశకి రూపాంతరం శ్రమ వల్లనే జరిగిందని ఎంగెల్స్ నొక్కి చెప్పారు.

మొదటగా ఆదిమ కమ్యూనిజంలో ఉత్పత్తి సాధనాలు అందరివీ. వాటి మీద ఎవరి పెత్తనం లేదు. రెండవది, ధనికవర్గాలకు కాపుకాసే రాజ్యం ఆనాడు లేదు. ఆదిమ తెగల సమాజం స్వయం నిర్ణయాధికారాన్ని కలిగి ఉన్న దశ. దాని సభ్యులంతా సమానులే. అక్కడ ఆడ, మగ తేడా కూడా లేదు. మూడవది, ఆనాడు అది మాతృస్వామిక దశ. ఆనాటి స్త్రీ పిల్లల్ని కంటూ కూడా స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఉండేది. సామాజిక, సాంస్కృతిక జీవనంలో ప్రధాన పాత్ర పోషించేది. ఆనాడు సొంత ఆస్తి లేదు. అలానే, పిల్లల్ని ఆస్తిలా చూసుకోవడమూ లేదు.

గార్డన్ చైల్డ్ వంటి సామాజిక శాస్త్రవేత్తలు చెప్పినట్టు, ఆదిమ సమాజంలో మహిళలు అనేక ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. మానవాభివృద్ధికి ఎంతగానో దోహదపడ్డారు. పురుషులు వేటకి వెళ్లేవారు. వేటలో ఆహారం తప్పకుండా దొరుకుతుందన్న హామీ లేదు. స్త్రీలు దుంపలు, ఆకులు, అలుములు ఏరుకుంటూ తిరిగేవారు. ఆ ఆహారాన్వేషణ నిలకడయింది. తప్పకుండా ఆహారం దొరికేది. ఈ క్రమంలోనే విత్తు నుంచి మొక్క మొలవడాన్ని గ్రహించిన స్త్రీ వ్యవసాయానికి మూల స్తంభమయింది. మరోవైపు మట్టిపాత్రల తయారీ, తోళ్ల వాడకం, నిప్పుని ఉపయోగించి వంట నేర్వడం, తర్వాతి కాలంలో ఇళ్లు కట్టడం, చేనేతలు వంటి ఎన్నో ప్రక్రియలను ఆమె చేపట్టింది. అలా స్త్రీ బీజ రూపంలో బాటనీ, కెమిస్ట్రీ, వైద్యం తదితర శాస్త్రీయ విజ్ఞానాన్ని కలిగి ఉండేది. ఉత్పత్తిలో భాగం పంచుకుని ఉన్నత స్థానాన్ని ఆక్రమిస్తూ,

రైతుగా, చేతివృత్తుల కళాకారిణిగా, తొలి గురువుగా తరతరాలకు తన జ్ఞానాన్ని అందిస్తూ, సమాజంలో గుర్తింపు పొందింది. అలా, ఎంగెల్స్ చెప్పిన ఉత్పత్తి, పునరుత్పత్తి అనే సమాజపు రెండు రంగాల్లోనూ ఆమెదే పై చేయిగా ఉండేది. అంటే, శారీరకమైన తేడాల వల్ల స్త్రీ అధోగతిపాలు కాలేదని అర్థం.

మరి తిరోగమనం ఎలా ఆరంభమయింది? వ్యవసాయంతో, పశు పోషణతో అభివృద్ధి సాధ్యమయింది. ఇనుము, ఇతర లోహాల తయారీతో ఈ అభివృద్ధి ద్విగుణీకృతమయింది. ఉత్పత్తి పెరిగింది. అవసరాలను మించిన ఉత్పత్తి మిగులుగా, సంపదగా పోగుపడింది. మనిషిని, మనిషి దోచుకునే ప్రాతిపదిక తలెత్తింది. వర్గాలు, దోపిడీ పీడనలు, సొంత ఆస్తి తలెత్తాయి. ఆ ఆస్తిని కాపాడుకోవడం కోసం వారసులు కావాలి. అందుకు ఏకపత్నీ వ్యవస్థ అవసరం. అలా పురుషుడు సంపదకు హక్కుదారయ్యాడు. ఎంగెల్స్ చెప్పినట్టు 'ఏకపత్నీ వివాహ వ్యవస్థలో పురుషుడికీ, స్త్రీకీ మధ్య పెంపొందిన వైరుధ్యమూ, మొదటి వర్గ వైరుధ్యమూ ఏకకాలంలో తలెత్తాయి. అలానే, స్త్రీ జాతిని పురుష జాతి అణచివేయడం, మొట్టమొదటి వర్గ దోపిడీ ఏకకాలంలో తలెత్తాయి'. అంటే, వర్గ సమాజం ఆవిర్భావం తోటే స్త్రీ అణచివేత ఆరంభమయింది. మూలాల్ని గ్రహిస్తేనే అణచివేతని సమూలంగా ఎలా అంతం చేయాలో అర్థమవుతుంది. లైంగిక అసమానత వర్గ అసమానత వెంబడే వచ్చింది. అలా వర్గ దోపిడీ కింద కులం, మతం, రాజ్యం అనే గుదిబండలు మోస్తున్న పురుషులు ఉంటే, స్త్రీలు అదనంగా పురుషాధిక్యత అనే భారాన్ని మోస్తున్నారు. అందుకే, తక్షణ సమస్యలపై ఎన్ని పోరాటాలు చేసినా, అంతిమంగా వర్గ పోరాటాలతోటే సంపూర్ణమైన స్త్రీ విముక్తి సాధ్యం.

### పిడికిలెత్తిన మహిళలు

సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నిటిలో స్త్రీ అణచివేతకి గురైనా గాని, సామాజిక ప్రతిఫలనాలకి వ్యతిరేకంగా మొట్టమొదటి ఉద్యమాలు ఆరంభమయ్యాయి. మహిళోద్యమం అంచెలంచెలగా ఎదిగింది. ఒక్కొక్క దశలో అది ఒక చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చింది.

**మహిళోద్యమంలో స్థూలంగా కొన్ని దశలు:**

| | |
|---|---|
| 1857-1947 | - జాతీయోద్యమంలో క్రియాశీలంగా పాల్గొనడం. |
| 1947-57 | - స్వతంత్ర భారతం తొలి సంవత్సరాల్లో స్తబ్దుగా ఉన్న దశ. |
| 1957-75 | - భ్రమలు వదిలి అన్ని పోరాటాల్లో పాలుపంచుకోవడం. |
| 1975-90 | - స్వయం ప్రతిపత్తి గల మహిళా గ్రూపుల ఏర్పాటు దశ. |
| 1990 నుంచి నేటి వరకు | - ప్రభుత్వ ఆర్థిక విధానాలను వ్యతిరేకిస్తూ బడుగు వర్గాల మహిళలు చురుగ్గా ముందుకు వస్తున్న దశ. |

**సంస్కరణోద్యమం :** మొదటగా 19వ శతాబ్దంలో సంస్కరణోద్యమాలు మొదలయ్యాయి. వీటిని పురుషులే ఆరంభించి, మహిళా సంఘాలను కూడా ఏర్పరిచారు. కానీ క్రమంగా 19వ శతాబ్దం చివరి నాటికి మహిళలు స్వయంగా సంఘాలు ఏర్పరుచుకున్నారు. అవి చిన్నగా, స్థానికంగా ఏర్పడినా, ఆ తర్వాత అవి జాతీయ స్థాయిని సంతరించుకున్నాయి. ఆనాడు ప్రధానంగా రాజకీయ హక్కులను, వ్యక్తిగత చట్టాల సంస్కరణలను మహిళలు కోరారు.

రామ్మోన్‌రాయ్ సతికి, బహు భార్యత్వానికి వ్యతిరేకంగా పాటుపడి, మహిళల ఆస్తి హక్కు డిమాండ్‌ని లేవనెత్తారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ విధవా వివాహాలను ప్రోత్సహించారు. అదే కాలంలో మన రాష్ట్రంలో వీరేశలింగం, గురజాడ మొదలైన సంఘ సంస్కర్తలు కూడా బాల్య వివాహాలను వ్యతిరేకిస్తూ, పైన పేర్కొన్న అన్ని సామాజిక దురన్యాయాలకు వ్యతిరేకంగా నడుము బిగించారు. స్త్రీ విద్య కోసం పాటుపడ్డారు. అలా ముందుకొచ్చిన పురుషుల కుటుంబాల్లోని స్త్రీలు కూడా కదిలి వచ్చి ఉద్యమించారు. ఈ ఒరవడి వామపక్ష సంస్థల్లో కూడా కనిపిస్తుంది. సావిత్రిబాయి పూలే ఎన్నో సామాజిక ఒడిదుడుకులను ఎదుర్కొంటూ స్త్రీ స్వేచ్ఛ కోసం, స్త్రీ విద్య కోసం పాటు పడింది. టాగోర్ సోదరి స్వర్ణకుమారి దేవి 'భారతి' అనే మహిళా పత్రిక నడుపుతూ తొలి భారతీయ మహిళా ఎడిటర్‌గా నిలుస్తూ, స్త్రీ విద్యని ప్రోత్సహించింది. పేదలకి, విధవలకి చదువు నేర్పి, వివిధ వృత్తుల్లో శిక్షణనిచ్చి, తమ కాళ్ల మీద తాము నిలబడేలా ప్రోత్సహించింది. ఈ దశలో పురుషుల ప్రోత్సాహం ఎంతో తోడ్పడింది. అటు తర్వాత మహిళలు తమంత తాముగా స్వచ్ఛందంగా సంఘటితం కాసాగారు.

## 1. జాతీయోద్యమం

మహిళలు పెద్ద ఎత్తున కదలడానికి జాతీయోద్యమం దోహదపడింది. బ్రిటిష్ వ్యతిరేక ఆరాట పోరాటాల విస్తరణలో మహిళల భాగస్వామ్యం విజృంభించింది. అలా మహిళోద్యమం పునాది కూడా విస్తరించింది. భారత జాతీయ కాంగ్రెస్ మూడవ సమావేశం మహిళల సమస్యను చర్చించింది. 1905లో అందులో మహిళా విభాగం ఏర్పడింది. బాల్య వివాహాలు, వితంతు సమస్య, కట్న పిశాచి వంటి సమస్యలపై అది కేంద్రీకరించింది. బెంగాల్, మహారాష్ట్ర, దక్షిణాది రాష్ట్రాల్లో విద్యాధికులైన మహిళలు చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడ్డారు. ఇంటి నుంచి బయటికి అడుగు పెట్టడమే ఆనాడు ఒక విప్లవం. అలా బయటికొచ్చాక, ఇతర మహిళలను కలుసుకునే అవకాశం ఏర్పడింది. అందరూ కలిసి సమాజ సేవలో పాలుపంచుకున్నారు. తమ పరిధిని విస్తరించుకుంటూ ప్రజల సమస్యలపై కేంద్రీకరించి, సంస్థల నిర్మాణంలో అనుభవం సంపాదించుకున్నారు.

ఆనీ బిసెంట్, మార్గరెట్ కజిన్స్ ఆధ్వర్యంలో మహిళల భారతీయ సంస్థ (డబ్ల్యూఐఎ) ఏర్పడింది. ముఖ్యంగా స్త్రీల ఓటు హక్కు కోసం వీరు పాటు పడ్డారు. సరోజినీ నాయుడు నాయకత్వంలో మహిళలు ఈ డిమాండ్‌ని ముందుకు తెచ్చారు. 23 మంది మహిళల సంతకాలతో మాంటెగు చెమ్స్‌ఫోర్డ్‌కి వినతి పత్రం సమర్పించారు. అలా 1920 నుంచి మహిళలు ఓటు హక్కు సాధించుకున్నా, అది విద్యావంతులకి, ఆస్తిపరులకి మాత్రమే పరిమితమైపోయింది. 1935 నాటికి అది ప్రభుత్వ చట్టంగా వచ్చింది. కానీ స్వాతంత్ర్యానంతరం మాత్రమే అది సార్వజనీన ఓటు హక్కుగా రూపొందింది.

జాతీయోద్యమ కాలంలో బాల వితంతువులైన దుర్గాబాయి దేశ్‌ముఖ్,

కమలాదేవి ఛటోపాధ్యాయ వంటి మహిళల జీవితాలు ఎంతో మార్పు చెందాయి. ఇతర మహిళల జీవితాలు మార్చడానికి వారు ఎంతో కృషి చేశారు. స్వదేశీ ఉద్యమంలో, హోమ్‌రూల్ ఉద్యమంలో మహిళలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. మొదటి సహాయ నిరాకరణోద్యమంలో, ఉప్పు సత్యాగ్రహంలో, శాసనోల్లంఘన ఉద్యమంలో కూడా వారు పురుషులతో చేతులు కలిపారు. స్వాతంత్ర్యం సాధించాలనే దృఢ దీక్షతో, విదేశీ దోపిడీని అంతమొందించాలనే దృఢ సంకల్పంతో మీటింగ్‌లు నిర్వహించారు. అంతవరకు వీధి ముఖం చూడని మహిళలు సైతం వేదికలెక్కి ఉత్సాహభరితమైన ఉపన్యాసాలు ఇచ్చేంత ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకున్నారు. ఊరేగింపుల్లో పాల్గొని, విదేశీ వస్త్రాలను విక్రయించే దుకాణాలను మూయించి, జైలుకెళ్లారు. ఇది స్వతంత్రమైన మహిళోద్యమం కాదు. కానీ వలసవాదులకు వ్యతిరేకంగా స్వాతంత్ర్య కాంక్షతో మహిళలు కదిలారు. వారి బలం వారికి తెలిసింది. ఆత్మ విశ్వాసం హెచ్చింది.

జాతీయోద్యమంలో భాగంగా మహిళల **ప్రజాస్వామిక పోరాటాలు** దేశవ్యాప్తంగా పెరిగాయి. త్రిపురలో రాచరికానికి వ్యతిరేకంగా ఆదివాసి మహిళలు కదిలారు. కుమారి, మధుతి, రూపశ్రీ అనే నాయకులు ప్రాణాలర్పించారు. అస్సాంలో సంస్కరణోద్యమాలు జరిగాయి. మలబార్, కొచ్చిన్, ట్రావన్‌కోర్‌లలో నియంతృత్వ వ్యతిరేక పోరాటాలు, భూ పోరాటాలు జరిగాయి. కయ్యూరు వీరుల కోసం పోరాడారు. తమిళనాడులో భూ పోరాటాలు చేస్తూ నిర్బంధాన్ని వ్యతిరేకించారు. మహారాష్ట్రలో తిరుగుబాటుకి గోదావరి పరులేకర్ నాయకత్వం వహించింది. గుజరాత్, పంజాబ్, యుపిలలో కూడా అనేక పోరాటాలు జరిగాయి.

మరోవైపు, పెల్లుబికిన అనేక రైతాంగ పోరాటాల్లో మహిళలు వీరోచితంగా పోరాడారు. పోరాట యోధులకి అండదండగా రహస్య కార్యకలాపాలు నిర్వహిస్తూ, వేగులుగా వ్యవహరిస్తూ, వారిని కడుపులో దాచుకుంటూ, మరోవైపు ఎంతో సమరశీలంగా పోరాటాలు చేస్తూ, త్యాగాలు చేస్తూ, ప్రాణాలొడ్డుతూ, దోపిడీ భూస్వామ్య వర్గాల గుండెల్లో దడ పుట్టించారు. వలసవాదుల పథకాలకు పగ్గాలు వేశారు. బొర్సాద్, బర్డోలీ ప్రాంతాల్లో గ్రామీణ ప్రాంతాల సత్యాగ్రహాల్లో మహిళలు పాల్గొన్నారు. **తెభాగా తిరుగుబాటులో** స్త్రీల పాత్ర గురించి పీటర్ కస్టర్స్ తన పుస్తకంలో చాలా విపులంగా వివరించారు. బెంగాల్ కరువు సమయంలో మహిళా ఆత్మ రక్షణ సమితి (మార్స్) పేరుతో మహిళలు ఒకటయితే, తెభాగా ఉద్యమంలో 'నారీ బాహిని'లో అట్టడుగు వర్గాల రైతాంగ, గిరిజన, హిందూ, ముస్లిం మహిళలు నాయకులయ్యారు. పురుషులు, కమ్యూనిస్టు పార్టీ జంకిన చోట్ల సైతం వారు ముందుండి నాయకత్వం వహించి ఆదర్శప్రాయులయ్యారు. 1945లో ప్రభుత్వం తన యుద్ధ అవసరాలు తీరడం కోసం బస్తాల కొద్దీ వరిధాన్యాన్ని తరలించుకుపోయి కృత్రిమంగా కరువును సృష్టించింది. ప్రజలు ఆ దెబ్బనించి కోలుకోక ముందే భూస్వాములు (జోతేదార్లు) పంటలో సగాన్ని దోచుకుంటే, రెండు వంతుల పంట తమకే చెందాలనే డిమాండ్‌తో నడుము బిగించిన కౌలుదార్ల ఉద్యమమే 'తెభాగా'. సంవత్సరం పాటు తీవ్ర ప్రతిఘటన ప్రదర్శించిన ప్రజల్లో స్త్రీలు ఆదర్శవంతమైన పాత్ర నిర్వహించారు. కిసాన్ సభతో ప్రభావితమై వారు ఉద్యమించారు. 1946 పంట కోతల సమయంలో ఆరంభమై, 1948-49 వరకు ఈ పోరాటం కొనసాగింది. కౌలుదార్లని పంట కోయనివ్వకుండా భూస్వాముల గూండాలు అడ్డుకుంటే, ప్రజలని ప్రోత్సహించి పంట కోయించింది జల్పాయిగురికి చెందిన మహిళ. తర్వాత దినాజ్‌పూర్, రంగపూర్, మైమన్‌సింగ్, మిద్నపూర్, కక్‌ద్వీప్ జిల్లాలకు ఉద్యమం వ్యాపించింది. అప్పటికి పోలీసులు రంగంలోకి దిగి మహిళలను వేధించి, కాల్పులు కూడా జరిపారు. అప్పుడు మహిళలు, ముఖ్యంగా 24 పరగణాల ప్రాంతంలో విజృంభించారు. పోలీసుల మీద దాడులు చేశారు. ప్రత్యేక సాయుధ దళాన్ని ఏర్పరుచుకున్నారు. ఈ పోరాట క్రమంలో ఎందరో మహిళలు అసువులు బాసారు. వారిలో అహల్య అనే నాయకురాలు కూడా ఉంది. చివరికి ఉద్యమం ముగిసేసరికి రైతాంగం రెండు వంతుల పంట డిమాండ్‌ని సాధించుకుంది.

'మహిళలే పాల్గొని ఉంటే పారిస్ కమ్యూన్ చరిత్ర మరోలా ఉండేది' అనే లెనిన్ మాటలు గుర్తు చేసుకుంటే, స్త్రీలు నిర్వహించిన వీరోచిత పాత్ర వల్లనే తెభాగా ఉద్యమం ఎన్నో గుణపాఠాలు నేర్పింది.

అలానే, స్వాతంత్ర్యానికి ముందు **శ్రామిక మహిళలు** కొన్ని చోట్ల తమ పోరాట పటిమను నిరూపించారు. 1917లో అహ్మదాబాద్ జౌళి కార్మికుల సమ్మెకి అనసూయ సారాబాయి నాయకత్వం వహించింది. 1920 నాటికి సమ్మెల్లో మహిళల భాగస్వామ్యం గణనీయంగా పెరిగింది. మణిబెన్ కారా రైల్వే కార్మికుల సోషలిస్టు నాయకురాలు. జౌళి కార్మికులకి ఉషాబాయి డాంగే, పార్వతి భోరె నాయకులు. 1928-29లో బొంబాయి, కలకత్తాలలో జరిగిన జౌళి కార్మికుల సమ్మెలో మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.

మరోవైపు 1802-03 రంప తిరుగుబాటులో, 1938-41 కొమురం భీము పోరాటంలో **ఆదివాసి మహిళలు** ముందుకొచ్చారు. బ్రిటిష్ వ్యతిరేక, దోపిడీ వ్యతిరేక సమీకరణల్లో వారు ఆదర్శవంతమైన పాత్ర వహించారు. 1946లో గోండ్, కొలాం, పర్ధాన్ ఆదివాసులు తమ భూమిపై హక్కుల కోసం పోరాడారు.

ఈ దశలో ఒకవైపు దేశభక్తి పెల్లుబికింది. మరోవైపు ప్రపంచాన్ని కుదిపేసిన సోషలిస్టు భావాల ప్రతిఫలనాలు దోపిడీ వ్యతిరేక పోరాటాల్లో కనిపిస్తాయి. వాటిల్లో స్త్రీల వీరోచిత పాత్ర ఉంది.

## 2. స్త్రీల పోరాట ఫలితాలే కొత్త చట్టాలు

స్వాతంత్ర్యానంతరం పదేళ్లపాటు ఉద్యమాల్లో కొంత స్తబ్ధత కనిపించినా గాని, మహిళల పోరాట పటిమ ఫలితంగానే కొన్ని చట్టాలు అమల్లోకి వచ్చాయి. స్త్రీల స్థితిగతులు మెరుగుపరచడానికి ఈ చట్టాలు కొంత దోహదపడ్డాయి.

మహిళా సంఘాల ఆందోళనతోనే స్వాతంత్ర్యానంతరం స్త్రీలకి సార్వజనీన ఓటు హక్కు సంప్రాప్తించింది. 1927లో వివాహ వయోపరిమితిని పెంచుతూ శారదా ఆక్టు వచ్చింది. బహు భార్యత్వాన్ని నిషేధిస్తూ, విడాకుల చట్టాన్ని, ఆస్తి హక్కు చట్టాన్ని సవరిస్తూ 1950లో హిందూకోడ్ బిల్లు వచ్చింది. మహిళల హక్కుల కోసం, సంక్షేమం కోసం 1947 నించి అనేక చట్టాలు ఆమోదించారు. మహిళలు, బాలికల అపహరణ నిషేధ చట్టం (1956), స్త్రీల వివాహ సంబంధ ప్రత్యేక

చట్టం (1955), హిందూ వారసత్వ చట్టం (1956), వరకట్న నిషేధ చట్టం (1961), స్త్రీ పురుషుల సమాన వేతన చట్టం (1976), కుటుంబ న్యాయస్థానాల చట్టం (1984), లైంగిక దాడులను, వరకట్న హత్యలను నిరోధించే నేర నిరోధక చట్టం సవరణ ఆక్టు (1985), మహిళల్ని కించపరచడాన్ని నిషేధించే చట్టం (1986) తదితరాలు అమల్లోకి వచ్చాయి. కానీ వీటి అమలులో లోపాలు ఉంటూనే ఉన్నాయి. సవరణలు జరిగినా లొసుగులు ఉంటున్నాయి. జడ్జీల వ్యక్తిగత అభిప్రాయాలే తీర్పులని ప్రభావితం చేస్తున్నాయి. అందుకే చట్టాలు స్త్రీలకు కొంత ఆసరా కల్పిస్తాయే తప్ప వాటితో స్త్రీలు విముక్తి చెందరు. జీన్సు తొడుక్కునే మహిళలు సమాజాన్ని పాడు చేస్తారని, ఆడపిల్లలకి సెల్‌ఫోన్లు నిషేధించాలని, ఆడ మగ కలిసి స్వేచ్ఛగా తిరగడం వల్లనే మానభంగాలు జరుగుతున్నాయని తప్పుడు వాదనలు ఈనాటికీ ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి.

అన్ని విధాలా భద్రత కలిగి ఉన్న మహిళలకి ఈ చట్టాల విలువ తెలియకపోవచ్చు కానీ వారి జీవితాలకి భిన్నంగా, భద్రత లేకుండా, ఎలాంటి రక్షణ కవచాలూ లేని స్త్రీలు ఎందరో. వారికి ఈ చట్టాలు కొంత ఊరట కల్పిస్తాయి. 'పేదరికం సాధించే నిశ్శబ్ద హింస'కి బలైపోయిన మహిళలకి అవి అవసరమే.

అయితే, ఈనాడు అమలవుతున్న చట్టాల వల్ల కూతుళ్లకి కొడుకులతో సమానంగా ఆస్తి హక్కు ఉంది. క్రిస్టియన్ మహిళలు విడాకులు కోరాలంటే భర్త వ్యభిచారే కానవసరం లేదు. 'గార్డియన్‌షిప్' ఆక్టు కింద తల్లులు కూడా చట్టపరంగా పిల్లలకి బాధ్యత వహించవచ్చు. అలానే, ఉన్నత పదవుల్లో ఎందరో స్త్రీలు కనిపిస్తున్నారు. దేశ అధ్యక్షులుగా, స్పీకర్‌గా, రాజకీయ పార్టీల నేతలుగా ఎందరో పైకి వచ్చారు. కానీ దీన్ని ప్రగతి అందామా? దీనివల్ల సమాజం మారిపోతుందా?

రాజ్యాంగంలో స్త్రీ పురుషుల సమానత్వాన్ని లేవనెత్తి ఆరు దశాబ్దాలు గడిచిపోయాయి. కానీ ఇంకా నీళ్ల గ్లాసు సగమే నిండింది. సగం నిండిందని సంబరపడదామా? సగం ఖాళీగా మిగిలిపోయిందని ఖేద పడదామా? స్త్రీల హక్కుల సాధన కోసం, సాధికారత కోసం ఇంకా ఎంతో పోరాడవలసే ఉంది.

## 3. విప్లవ చైతన్యంతో సమీకృతులైన స్త్రీలు

**తెలంగాణ సాయుధ పోరాటం:** స్వాతంత్ర్యానికి ముందే ఆరంభమై, స్వాతంత్ర్యానంతరం కొనసాగిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో మహిళల పాత్ర, తర్వాత జరిగిన ఎన్నో పోరాటాలకు స్ఫూర్తిదాయకంగా నిలిచింది. 1946-51 వరకు కొనసాగిన ఈ పోరాటం యుద్ధానంతర రైతాంగ పోరాటాలకు ఒక ప్రతీక. అంతకు ముందు తెలంగాణ ప్రాంతపు సామాజిక ఆర్థిక పరిస్థితులను సంస్కరించడం కోసం 1930లో ఆంధ్ర మహా సభ ఏర్పడింది. అది 1940 నాటికి కమ్యూనిస్టుల ప్రాబల్యంతో నడిచింది. ఇదే కాలంలో అభ్యుదయ రచయితలు విరివిగా రచనలు చేశారు.

అంతవరకు కాంగ్రెస్‌తో చేతులు కలిపిన కమ్యూనిస్టు పార్టీ తెలంగాణ రైతాంగ పోరాటంతో తన ఉనికిని చాటుకుంది. ఆ కాలంలో తెలంగాణ ప్రాంతం భూస్వామ్య వర్గాల దోపిడీ కింద నలిగిపోతోంది. దానికి తోడు నైజాం నిరంకుశ పాలన, రజాకార్ల పాశవికత, బాంచన్ బతుకుల కన్నీటితో, నెత్తుటితో ఆ నేల తడిసిపోయింది. పుడితే శిస్తు, గిడితే శిస్తు. వెట్టి చాకిరి. చేతివృత్తుల దోపిడీ. ఆడపిల్లల్ని చెరబట్టి దాసీలుగా మార్చి, శారీరకంగా వాడుకోవడం. అత్తవారింటికి వెళ్తున్న కూతుళ్లతో పాటు ఈ దాసీలను నజరానాగా పంపించడం. ఊళ్లోకి అడుగుపెట్టిన కొత్త పెళ్లి కూతురుని దొర తన పడకటింట్లోకి లాక్కురావడం, బాలింతల పాలు పిండి నేలపాలు చేయడం – ఇలా రకరకాలుగా స్త్రీలను వేధించిన రోజులవి. ఆత్మగౌరవం నేలరాసిపోయిన, నిరుపేద, దళితవర్గాలు తలెత్తుకోలేని పరిస్థితులు అవి. ఆ కుల, వర్గ దోపిడీలకు వ్యతిరేకంగా రైతాంగం ఉవ్వెత్తున లేచింది. దొర కాళ్లకింద అణిగి ఉన్న దుమ్ము లేచి దొర కంట్లో నలుసై సలపరించింది. ప్రజల వీపుల మీద వీరంగం వేసిన చర్నాకోలలు తిరగబడి దొరల వీపునే సాపుచేశాయి.

భూమి కోసం, భుక్తి కోసం, విముక్తి కోసం సాగిన వీరోచిత తెలంగాణ రైతాంగ పోరాటం సాయుధ పోరాటంగా రూపొందే క్రమంలో మహిళలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. భూపోరాటాల్లో, రైతు కూలీ పోరాటాల్లో ముందున్నారు. భూస్వాముల ధాన్యాన్ని స్వాధీనం చేసుకోవడంలో పాలుపంచుకున్నారు. కోయ, చెంచు, లంబాడా తెగలను తమ పల్లెల నుంచి తరిమి వేయాలనే బ్రిగ్స్ ప్లాన్‌కి వ్యతిరేకంగా పోరాడారు. తమ అన్నలతో, భర్తలతో కలిసి నిజాం తొత్తుల్ని, రజాకార్లని ఎదిరించి, తర్వాత నెహ్రూ-పటేల్ సైన్యాలని, పోలీసులని కూడా ఎదిరించారు.

ఎన్నో కష్టనష్టాలకోర్చి మహిళలు దళాల్లో చేరారు. రాజకీయ, సైనిక దళాల్లో క్రియాశీల పాత్ర పోషించారు. కొరియర్లుగా, కార్యకర్తలుగా, ఆర్గనైజర్లుగా వ్యవహరించారు. ప్రజాందోళనల్లో, రైతాంగ ఉద్యమాల్లో పాల్గొనే క్రమంలో భూస్వాముల నుంచి, పోలీసుల నుంచి ఎన్నో చిత్రహింసలకు గురయ్యారు. మానభంగాలు, గర్భిణీ స్త్రీల కడుపులు చీల్చడాలు, పచ్చి బాలింతలపై అత్యాచారాలు, చనుబాలని బలవంతంగా పిండి నేలపాలు చేయడం, గడ్డివాముల్లో సజీవ దహనాలు, ఉద్యమకారుల పైజామాల్లోకి తొండల్ని వదిలి వేధించడం వంటి హింసలు అనుభవిస్తూ కూడా స్త్రీ ఆత్మస్థైర్యం సడలలేదు. భూమి, భుక్తి, విముక్తి సాధించుకోవాలనే తపన చల్లారలేదు. అందుకే 'మర ఫిరంగులు మోగినా, బాంబుల వర్షం కురిసినా, ఎత్తిన జెండా దించకోయ్' అంటూ ఉద్యమించారు. మరింత రాటుదేలి, తీవ్రంగా ప్రతిఘటించారు. సామాజికంగా, ఆర్థికంగా అణగారిపోయిన స్త్రీలలో ఈ విప్లవోత్తేజం మరింతగా ఉరకలెత్తింది. పాలకుర్తి గ్రామంలో ఐలమ్మ, ముకుందపురంలో కుమారి, ఓడపల్లి, కొండ్రపోలు, మొద్దులకుంటల్లో లంబాడీ విధవలు, ఇంకా అనేకులు భూపోరాటాల్లో చురుకైన పాత్ర నిర్వహించారు. గోదావరి నదీ పరీవాహక ప్రాంతంలో తునికాకు పోరాటాలు చేశారు. ఆకు తెంపినందుకు కూలీరేట్లు పెంచాలని డిమాండ్ చేశారు. రైతుకూలీ సమ్మెల్లో, పోరాటాల్లో ఇరవై కంటే ఎక్కువ గ్రామాల్లో మహిళలే నాయకులయ్యారు. దళాల్లో కూడా స్త్రీలు చురుకైన పాత్ర నిర్వహించారు. పోలీసుల ఆనుపానులు కనుక్కుంటూ గెరిల్లాలకు ఆహారాన్ని అందిస్తూ వీరులను ఎంతో ప్రేమగా కడుపులో పెట్టుకొని

కాపాడుకున్నారు. రాళ్లతో, రోకళ్లతో, కారంతో, గునపాలతో, నాగలి కర్రలతో, పశువుల గంటలతో వాళ్లు పోలీసులను వీరోచితంగా ఎదుర్కొన్నారు. అందుకే 'ఆనాటి మహత్తర ఘటనలని, మహిళల సాహస గాథలను, వారి బాధలను ఎవరు మర్చిపోగలరు' అన్నాడు సుందరయ్య. ఇలాంటి పోరాటాలని మరో స్థాయికి తీసుకువెళ్లింది శ్రీకాకుళం.

**శ్రీకాకుళ సాయుధ పోరాటంలో మహిళల వీరోచిత పాత్ర:** స్వాతంత్ర్యానంతరం ఉత్తర బెంగాల్‌లో జరిగిన నక్సల్‌బరీ సాయుధ రైతాంగ పోరాటం కొనసాగింపుగా నిరుపేద గిరిజనులు శ్రీకాకుళంలో ఆయుధాలు చేతబట్టి వ్యాపారులను, భూస్వాములను, అధికారులను, ప్రభుత్వాన్ని నిలదీశారు. అటవీ సంపదపై తమ హక్కులను బ్రిటిష్ ఏజెంట్లు హరించి వేయగా, భూమి పోయి, పంటపోయి, అటవీ సంపద పోయి వారు బానిసలైపోగా, కడుపు కాలి పిడికిలి బిగించారు. 1958 నుంచి అక్కడ గిరిజన సంఘాలు ఏర్పడ్డాయి. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన చింతచెట్ల మీద పన్నుని వ్యతిరేకిస్తూ, గిరిజన కార్పొరేషన్ అక్రమాలను ఎదుర్కొంటూ, ఫారెస్టు ఉద్యోగులు చేయించే వెట్టిని తిప్పికొడుతూ, పోలీసుల లంచగొండితనాన్ని ఎండగడుతూ, వాళ్లు ఎన్నో పోరాటాలు చేశారు. పాలేళ్ల జీతాలు పెంచుకున్నారు. 1967 నాటికి కూలీపెంపు, కౌలుదారుకి పంటలో మూడింట రెండు వంతుల వాటా, భూస్వాముల భూముల ఆక్రమణ, బంజరు భూమి స్వాధీనం, బాకీల మాఫీ వంటి విజయాలతో వెంపటాపు సత్యం, రాములు మాస్టార్ల నాయకత్వంలో సంఘం ప్రభావం పెరిగింది. గిరిజనుల రాజకీయ చైతన్యాన్ని, సమరశీలతని చూసి భయపడిన ప్రభుత్వం 1968 ఆరంభానికే దాడి ఆరంభించింది. అరెస్టులు, కేసులు, దాడులు హెచ్చుమీరాయి. దీనికి ప్రతిఘటనగా శ్రీకాకుళ గెరిల్లా పోరాటం మొదటి దశ ఆరంభమైంది. అందులో ఎందరో స్త్రీలు పాల్గొన్నారు. పంచాది నిర్మల కీలకమైన పాత్ర వహించింది. అప్పుడు భూస్వాములు, వడ్డీ వ్యాపారులు, పోలీసు ఇన్‌ఫార్మర్ల మీద దాడులు జరిగాయి. ఆస్తుల స్వాధీనం, రుణపత్రాల ధ్వంసం, ధాన్యం రాసుల స్వాధీనం, క్రూరమైన భూస్వాముల హతం జరిగాయి. ప్రజా కమిటీలు గ్రామాలను పాలించాయి. ప్రజాకోర్టులు తీర్పు చెప్పాయి.

మిలిటెంట్ రైతాంగ ఉద్యమం రాజకీయ చైతన్యం గల ప్రభుత్వ వ్యతిరేక పోరాటంగా మారడాన్ని ప్రభుత్వం సహించలేదు. ఆ ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి, నాయకులను, కార్యకర్తలను 'ఎన్‌కౌంటర్' పేరుతో కాల్చి చంపింది. 1970 జూలై వరకు సాగిన ఈ దమనకాండలో 157 మంది అమరులుకాగా, వారిలో 82 మంది గిరిజనులు. అందులో 17 మంది మహిళలున్నారు.

ఉద్యమ కాలంలో వందలాది మంది గిరిజన స్త్రీలు తమ కుటుంబాలను వదిలి సంఘం కార్యకలాపాల్లో పాల్గొన్నారు. సంవత్సరాల తరబడి జైలు శిక్షలు అనుభవించారు. పోడు వ్యవసాయం చేస్తూ పొదలు నరకడం, నాట్లు వేయడం, కలుపు తీయడం, పంట కోయడం, నూర్చడం, తూర్పారబట్టడం, గట్లు కట్టడం, ఇంటి పని, నీళ్లమోత, వంట చెరకు సేకరణ, అటవీ సంపద పోగు చేయడం, ధాన్యం దంచడం, వంట చేయడం, తాళ్లు పేనడం, పశువుల పోషణ వంటి పనులన్నీ చేసే గిరిజన స్త్రీలు ఎందులోనూ వెనకబడలేదు. పోడు హక్కు కోసం, అటవీ సంపద కోసం, వెట్టి రద్దు కోసం, వడ్డీ వ్యాపారానికి అడ్డుకట్ట వేయడం కోసం, దౌర్జన్యాలను వ్యతిరేకించడం కోసం స్త్రీలు పోరాడుతూ ముందు పీటిన నిలిచారు. మైదాన ప్రాంతాల్లో కూడా రైతుకూలీ పోరాటాలు చేపట్టారు. వెట్టిపని చేస్తూ లైంగిక అత్యాచారాలకు గురయ్యే స్త్రీలకి అండగా మహిళా సంఘం నిలిచింది. సారా వ్యతిరేక క్యాంపెయిన్ జరిగింది. స్త్రీల ఉమ్మడి శక్తి అనుభవమయింది.

సమావేశాలు, ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలు, బహిరంగ సభలు, సమ్మెలు వారి దినచర్యగా మారాయి. వందలాది మైళ్లు నడిచి మీటింగ్‌లో పాల్గొన్న ఘటనలు కూడా ఉన్నాయి. శ్రీకాకుళం పోరాటం రెండవ దశలో 1967 అక్టోబర్ 31న మొండెంఖల్‌లో జరుగుతున్న గిరిజన మహాసభకు గుమ్మ గ్రామం నించి వస్తున్న నాలుగు వందల మంది గిరిజన స్త్రీల మీద భూస్వామి గూండాలు లేవిడి వద్ద దాడి చేశారు. ఈ విషయం తెలిసి మొండెంఖల్ నించి తరలివచ్చిన ప్రజలు ఈ దాడిని తిప్పికొట్టారు. ఆ ప్రయత్నంలో కోరన్న, మంగన్న అమరులయ్యారు. ఈ లేవిడి ఘటన స్త్రీల చొరవకు ఒక ఉదాహరణ.

దళాల్లో స్త్రీలు ఎంతో చొరవతో వ్యవహరించారు. పంచాది నిర్మల, సంపూర్ణమ్మ, పురి రమణమ్మ, తామాడ చంద్రమ్మ, మేడవరపు రామసీత, వరలక్ష్మి నాయకులుగా ఎదిగారు. పోరాట ప్రతిఘటనల్లో చురుగ్గా పాల్గొంటూ నిర్మల, అంకమ్మ, సరస్వతి అమరులయ్యారు. స్త్రీల సంఘటిత శక్తికి, ఉద్యమ కార్యాచరణకి, సాహసానికి, లక్ష్య సాధనపై గురికి, త్యాగాలకి, అమరత్వానికి, పోరాటానికి ప్రతీకగా మహిళలు శ్రీకాకుళ సాయుధ పోరాటంలో తమ కర్తవ్యాన్ని నెరవేర్చి చిరస్థాయిగా మిగిలిపోయారు.

## 4. అంతర్జాతీయ మహిళా దశాబ్దం స్ఫూర్తి

ఐక్యరాజ్య సమితి 1975-85 మధ్య కాలాన్ని అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా గుర్తించింది. ఈ దశాబ్దం 1975 మెక్సికో సమావేశంతో మొదలై, 1985 కెన్యాలో నైరోబీతో అంతమైంది. ఈ సందర్భంగా ప్రపంచ ఆరోగ్య సంస్థ స్త్రీల స్థితిగతుల మీద ఒక నివేదిక విడుదల చేసింది. దాని సారాంశం - అభివృద్ధి కోసం మహిళలు చేసే కృషిపై సరైన అంచనా లేదు. వారి శక్తి సామర్థ్యాల మీద కూడా సరైన అంచనా లేదు. ఉద్యోగం, విద్య, సామాజిక స్థాయి వారి ఆరోగ్యాన్ని నిర్దేశిస్తున్నాయి. ఆర్థిక వనరులు, రాజకీయాధికారంలో భాగస్వామ్యం వారి ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తాయి.

ఈ నేపథ్యంలో, అన్ని హక్కులు స్థంభించిపోయిన ఎమర్జెన్సీ కాలం తర్వాత మళ్లీ మేల్కొన్న మహిళలు కొత్తగా కర్తవ్యాలను నిర్దేశించుకున్నారు. 'స్వాతంత్ర్యం' తర్వాత విద్య, ఉద్యోగం, రాజకీయ, సమానత్వం అనే కలలు నెరవేరతాయనడం కల్ల అని తెలిపోయాక క్రియాశీల పోరాటాలు, 'నిర్మాణాత్మకమైన' కార్యాచరణ చోటు చేసుకున్నాయి. పర్యావరణ విధ్వంసం, జీవికలో అస్థిరత్వం, బాలికల పట్ల వివక్ష, పెరుగుతున్న పేదరికం, స్త్రీలపై అత్యాచారాలు స్త్రీలని కదిలించాయి. స్త్రీల సమస్యలపై ఆందోళనలు ఎమర్జెన్సీ తర్వాత ప్రభుత్వ విధానాల వ్యతిరేక ఆందోళనలుగా రూపుదిద్దుకున్నాయి.

**వివిధ సమస్యలపై పోరాటాలు :** మహిళలు కేవలం శరీర స్పృహతో కాక సమాజంలో ఒక భాగంగా అనేక సమస్యలపై తమ నిరసన తెలిపారు. వీరు వ్యక్తిగతమే రాజకీయం అనే ఫెమినిస్టు పోకడలకి విరుద్ధంగా తోటివారి సమస్యలను తమవిగా భావించి ఉద్యమించారు. అందుకే అలాంటి మహిళల పోరాట పరిధి విస్తృతమైంది. అలాంటి పోరాటాలు కొన్నిటిని చూద్దాం. 'పోరాట క్రమంలో హక్కులనేవి రాజకీయ ధృవీకరణలు' అన్న మనోరంజన్ మొహంతి మాటలకు ఇవి నిదర్శనలు. ఈ పోరాటాలు ఎక్కువగా విద్యార్థులను, దిగువ మధ్యతరగతి వర్గాలను కదిలించాయి. ఎమర్జెన్సీకి ముందు, వెనక అనేక పాక్షిక పోరాటాలు జరిగాయి. స్త్రీలని వేధిస్తున్న అనేక రోజువారీ సమస్యలపై ఎన్నో క్రియాశీల పోరాటాలు చేశారు.

**అధిక ధరలకు వ్యతిరేకంగా :** బొంబాయి, గుజరాత్ వంటి చోట్ల అధిక ధరల వ్యతిరేక ఉద్యమం విద్యార్థి ఉద్యమంగా ఆరంభమై, మధ్యతరగతిని కదిలించింది. మూకుమ్మడి నిరాహార దీక్షలు, ప్రభాత భేరీలు, నకిలీ శవదహనాలు జరిగాయి. మన రాష్ట్రంలో కూడా అనేక ర్యాలీలు జరిగాయి.

**పర్యావరణ పరిరక్షణ కోసం :** చిప్కో ఉద్యమంలో స్త్రీలు గణనీయంగా పాల్గొన్నారు. కాంట్రాక్టర్లు చెట్లని నరుకుతుంటే అడ్డుకున్న స్త్రీలు ఆ చెట్ల చుట్టూ తమ చేతులు చుట్టి వాటిని పొదివి పట్టుకుని, పర్యావరణం కోసం గొడ్డలి దెబ్బలకు సైతం సిద్ధపడ్డారు. పర్యావరణ పరిరక్షణ డిమాండ్ నేడు ప్రముఖంగా వినబడుతుంటే, ఆనాడు 1973లోనే వాళ్లు దాని కోసం ప్రాణాలను పణంగా పెట్టడం విశేషం.

**స్త్రీలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా :** 1978 మార్చ్‌లో ఒక రాత్రి సినిమా చూసి భర్తతో ఇంటికి తిరిగివస్తున్న రమిజాబీపై అడిక్‌మెట్ పోలీసులు అత్యాచారం జరిపారు. ఆమెని వేశ్యగా చిత్రించి, భర్తని కొట్టి చంపితే, రాష్ట్రవ్యాప్తంగా నెల రోజులకి పైగా ఆందోళన కొనసాగింది. వారం రోజుల కర్ఫ్యూలో పోలీసుల లాఠీ తూటాలకు ఇరవై ఆరు మంది బలి అయ్యారు. ముక్తధర్ కమిషన్ పోలీసుల నేరాన్ని ధృవీకరిస్తూ ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఈ సందర్భంగా మన రాష్ట్రంలో మహిళలు వివిధ రూపాల్లో నిరసనలు తెలుపుతూ ఒక కొత్త ఒరవడిని సృష్టించారు. మధుర కేసుని కూడా వ్యతిరేకించారు. మధుర అనే పదహారేళ్ల ఆదివాసి బాలికపై పోలీసులు అత్యాచారం జరిపారు. అయితే, ఆమె 'కన్య' కాదని, ఆమెకి అప్పటికే ఒక కుర్రవాడితో సంబంధం ఉందని చెప్తూ కేసు కొట్టివేశారు. కానీ ఆందోళనల ఫలితంగా చివరికి ప్రభుత్వం రేప్ చట్టాన్ని సవరించింది. ఇంకా అనేక చోట్ల ఇలాంటి ఘటనలకు ప్రతిఘటనలు వెల్లువెత్తాయి. ఇద్దరు భిల్లు మహిళల మానభంగంతో షహాదా సమ్మె జరిగింది. భిల్లులు ఏర్పరుచుకున్న శ్రామిక సంఘటన నేతృత్వంలో వారు భూస్వాముల దోపిడీని వ్యతిరేకిస్తూ కూడా ముందుకు కదిలారు. విప్లవ గీతాలతో కదం తొక్కుతూ భూమిలేని కూలీలు సంఘటితమయ్యారు.

మానభంగాలని వ్యతిరేకిస్తూనే, కట్నం చావులని నిరసిస్తూ, రూప్‌కన్వర్ వంటి స్త్రీల సతిని ఖండిస్తూ, గృహహింసని వ్యతిరేకిస్తూ, ర్యాగింగ్‌ని, ఈవ్ టీజింగ్‌ని తిప్పి కొడుతూ, అశ్లీల వాల్ పోస్టర్లని చించుతూ విద్యార్థినులు, మహిళా సంఘాలు పెద్ద ఎత్తు ప్రదర్శనలు జరిపారు. అలా 1970, 80వ దశకాల్లో పితృస్వామ్య భావజాలానికి వ్యతిరేకంగా ఇంటా బయటా వారు ఉద్యమించారు. ఈ సందర్భంగా విద్యార్థినులు చురుకైన పాత్ర వహించడం చెప్పుకోదగిన ముందంజ. వీరు తర్వాత మహిళా సంఘాల్లోనే కాక, విప్లవ రాజకీయాల్లో సైతం క్రియాశీల పాత్ర నిర్వహించారు. ఆ తరం విద్యార్థినులే నేడు తర్వాత తరాన్ని ఉత్తేజపరుస్తూ ఎన్నో రాజ్యహింస వ్యతిరేక పోరాటాలకు నాయకత్వం వహిస్తున్నారు కూడా.

**వ్యక్తిగత చట్టాల్లో మార్పు కోసం :** మధ్యప్రదేశ్‌లోని ఇండోర్‌కి చెందిన 62 ఏళ్ల షాబానో ఐదుగురు పిల్లల తల్లి. 1978లో భర్త ఆమెని వదిలేశాడు. ఆమె కేసు 1985లో దుమారం లేపింది. ముస్లిం కుటుంబ చట్టం ప్రకారం భర్తకి ఆమెని వదిలేసే హక్కు ఉంది. కానీ స్త్రీకి ఆ హక్కు లేదు. షాబానో తనని, తన కుటుంబాన్ని పోషించుకునే ఆధారం ఏమీ లేకపోవడంతో, మనోవర్తి కోసం కేసు పెట్టింది. ఆ కేసు సుప్రీంకోర్టు చేరుకునే సరికి ఏడేళ్లు గడిచిపోయాయి. కులం, మతంతో సంబంధంలేని విధంగా సుప్రీంకోర్టు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 125 ప్రకారం ఆమె మనోవర్తికి సమానమైన పరిహారం చెల్లించవలసిందిగా తీర్పు చెప్పింది. అయితే, ఒబైదుల్లా ఖాన్ అజ్మీ, సయ్యద్ షహాబుద్దీన్ వంటి ముస్లిం పెద్దలు ఈ తీర్పుని ఖండించారు. ముస్లిం వ్యక్తిగత చట్టాన్ని ఇది ఉల్లంఘిస్తుందని వారు భావించారు. ఆ ఒత్తిళ్లకు తలొగ్గి, 1986లో కాంగ్రెస్ ప్రభుత్వం సుప్రీంకోర్టు తీర్పుని బుట్టదాఖలు చేసింది. ముస్లిం మహిళల చట్టాన్ని ఆమోదించింది. దాని ప్రకారం నెలవారీ సొమ్ము చెల్లింపుకి బదులు 'ఇద్దత్' సమయంలోనే ఒకేసారి నష్టపరిహారంగా పెద్ద మొత్తాన్ని చెల్లించాలని చెప్పారు. దీనివల్ల స్త్రీల మనుగడ దుర్భరమవుతుందంటూ అన్ని వర్గాల మహిళలు నిరసన తెలిపారు. మతం మత్తు మందే కాక స్త్రీల అణచివేత సాధనం కూడా అని మరోసారి రుజువయింది.

70వ దశకంలో **స్వయం ప్రతిపత్తిగల** మహిళా గ్రూపులు ఏర్పడ సాగాయి. ఉదాహరణకి, అహ్మదాబాద్‌లో 'సేవా' సంస్థ 1972లో కార్మికోద్యమంగా మొదలయింది. మహిళలు తమ అనుభవాలు కలబోసుకునేవారు. ఉమ్మడిగా డిమాండ్లు ముందుకు తెచ్చేవారు. తమ పని పరిస్థితులని మెరుగు పరుచుకునేవారు. అలానే, 1974లో గుజరాత్‌లో నవనిర్మాణ్ ఉద్యమం అవినీతిని వ్యతిరేకించే విద్యార్థి ఉద్యమంగా మొదలయింది. అటు తర్వాత, హక్కుల కోసం, రాజ్యాంగ పాలనలో పాత్ర కోసం ఆందోళన చేశారు. కుల సమస్యని వ్యతిరేకించి, మతపరమైన మూఢ నమ్మకాలని ఎండగట్టారు. రాజకీయార్థిక సమస్యలపైనే కాక, గృహహింసపై కూడా కేంద్రీకరించారు. 1974లోనే హైదరాబాద్‌లో ప్రగతిశీల మహిళా సంఘం (పిఒడబ్ల్యు) లింగ వివక్షని వ్యతిరేకిస్తూ, సమానత్వాన్ని కోరుతూ ముందుకొచ్చింది.

ఇలాంటి సంఘాలన్నీ మహిళల ప్రత్యేక సమస్యలపై కేంద్రీకరించాయి. ముఖ్యంగా విద్యార్థుల్లో, ఉద్యోగుల్లో, రైతు కూలీల్లో, కార్మికుల్లో, కళాకారుల్లో ఈ సంఘాలు ఏర్పడి, ప్రత్యేక స్త్రీ సమస్యలపై ప్రజలను చైతన్యవంతం చేయసాగాయి. ఇందులో సాహిత్యం, కళారూపాలు ఎంతో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. చిన్న చిన్న వీధి నాటకాల ద్వారా, కరపత్రాల ద్వారా, ఎక్కడికక్కడ చేపట్టిన ప్రదర్శనల ద్వారా వీరు విరివిగా పనిచేశారు. మహిళలని చిన్నచూపు చూసేవారు ఈ సంఘాలకి భయపడ సాగారు. కోర్టుల్లో ఇచ్చే తప్పుడు తీర్పులని సైతం వీరు ధిక్కరించారు. అలా దేశవ్యాప్తంగా మహిళల గొంతులు ప్రస్ఫుటంగా వినిపించాయి. ఒక్కొక్క మహిళ జీవితం ఒక్కొక్క చరిత్రని చెప్తుంది. అందులో తీపి చేదులు రెండూ కలగలిసి ఉంటాయి. చేదుపాళ్లు ఎక్కువ ఉండటం సామాన్య స్త్రీకి అలవాటే. అలాంటి స్త్రీలంతా తమ గొంతు వినిపించటానికి ఈ సంఘాల్లో చేరడం కోసం ఉవ్విళ్లూరారు. పురుషుల కంటే స్పష్టంగా తమ సమస్యలని విప్పిచెప్పే స్థాయికి ఎదిగారు. పది మంది ముందు నోరు విప్పడానికి జంకిన మహిళలు సైతం ఈ ప్రత్యేక సంఘాలు ఇచ్చిన ప్రోత్సాహంతో భావవ్యక్తీకరణ నేర్చుకుని, నేడు అనర్గళంగా మాట్లాడి స్త్రీలకి నాయకత్వం వహించే స్థాయికి ఎదిగారు.

ఫ్యూడల్ భావాలను తిప్పికొడుతూ ప్రజాస్వామిక భావాలను చాటి చెప్తూ, స్త్రీవాద సాహిత్యం పెంపొందింది.

**ఫెమినిజం :** దాదాపు అదే సమయంలో పట్టణాల్లో ఫెమినిజం ఎజెండా మీదకి వచ్చింది. పత్రికలు దాన్ని ప్రచారం చేశాయి. వ్యక్తిత్వాన్నే రాజకీయంగా సమర్థిస్తూ, శారీరక తేడాల వల్ల స్త్రీలుగా అణగారి పోవడాన్ని నిరసిస్తూ, పితృస్వామ్య భావజాలాన్ని ఖండిస్తూ, సాహిత్యంలో ఈ ధోరణి ఒక పెద్ద అలలా ఉవ్వెత్తున లేచింది. అయితే ఉత్పత్తి, పునరుత్పత్తి మధ్య వైరుధ్యాన్ని సృష్టిస్తూ, స్త్రీల అణచివేత పునాదులను అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. అలా అది మహిళోద్యమంలో ఒక ధోరణిగానే మిగిలిపోయింది. స్త్రీలు ఉత్పత్తిలో పాలుపంచుకుంటూ తమని తాము విముక్తం చేసుకుంటూ అణగారిన వర్గాలతో చేతులు కలపవలసిన ఆవశ్యకతను వారు గుర్తించవలసి ఉంది.

**దళిత పోరాటాలకి మద్దతుగా :** అగ్రకులాల ఆగడాలకు తారస్థాయిగా కారంచేడు, పదిరికుప్పం, నీరుకొండ, చుండూరు దాడులు జరిగాయి. కారంచేడులో తన కొడుకుని నరికిన దోపిడీదారులని గుర్తించి ప్రధాన సాక్షిగా నిలిచిన అలీసమ్మని అగ్రకులాలు హత్యచేశాయి. చుండూరులో కూడా ప్రధాన సాక్షిని పోలీసులు చంపేశారు. ఈ దారుణకాండకి వ్యతిరేకంగా రాష్ట్రమంతా అట్టుడికి పోయింది. మహిళలు అనేక రూపాల్లో నిరసన తెలియజేశారు. సావిత్రిబాయి పూలే వంటివారు రగిల్చిన చైతన్యం వారిలో వెల్లివిరిసింది.

అప్పటికే 'దున్నే వారికే భూమి' అనే నినాదంతో సాగుతున్న రైతాంగ పోరాటాల్లో మహిళలు పెద్ద ఎత్తున పాల్గొంటున్నారు. కుల, మత, వర్గ, లింగ వివక్షలను ఎదిరిస్తున్నారు. పై సంఘటన తర్వాత దళిత మహిళలు మరింత పటిష్టంగా భూమికోసం, భుక్తి కోసం, విముక్తి కోసం పోరాడారు. కులవివక్షని, లింగ వివక్షని ఎదిరిస్తూ అన్ని రకాల అత్యాచారాలని ఎదిరించారు. ఈనాడు లక్షింపేట మళ్లీ ఎంతో చర్చని లేవనెత్తింది. అది కుల సమస్య అని కొందరు, భూమి సమస్య అని కొందరు వాదిస్తే, బొజ్జాతారకం వంటివారు దాన్ని భూమి కలిగిన దళితుల సమస్యగా వర్ణించారు. అంటే మన దేశంలో కుల సమస్య ప్రధానంగా వర్గ సమస్యే అని పదే పదే రుజువవుతూనే ఉంది.

**సారా వ్యతిరేక పోరాటం :** ఈ పురుషస్వామ్య సమాజంలో స్త్రీల అణచివేతలో సారాకి పెద్ద పాత్రే ఉంది. కుటుంబాలకి కుటుంబాలు ఆర్థికంగా చితికిపోవడానికి ఇది ఒక కారణం. ఇల్లు గడవడం కోసం పగలూ రేయీ రెక్కలు ముక్కలు చేసుకునే స్త్రీలు, తమ భర్తలు తమకి చేయూతనివ్వకపోగా ఇద్దరి సంపాదనా తాగి తగలేస్తుంటే చూస్తూ ఊరుకోలేదు. ప్రభుత్వ ఖజానా నింపడం కోసం వారుణివాహిని పేరుతో సారా ఒక సాధనమయింది. దాన్ని వ్యతిరేకిస్తూ సారా ఉద్యమంలో లక్షలాది మహిళలు ప్రభంజనంలా కదిలారు. 'సారా కాదు – నీరు అందించండి', 'సారా ప్యాకెట్స్ కాదు – పాల ప్యాకెట్స్ కావాలి', 'పానశాలలు కాదు – పాఠశాలలు కావాలి' వంటి నినాదాలతో స్త్రీలు వీధుల్లో కదం తొక్కారు. మంచినీటి సరఫరా కోసం ఎలాంటి ప్రయత్నాలూ చేయని ప్రభుత్వం సారాని మాత్రం రాష్ట్రం మూలమూలలకి పంపడాన్ని వీళ్లు వ్యతిరేకించారు. ప్రదర్శనలు, రాస్తారోకోలు, ధర్నాలు, బహిరంగ సభలు నిర్వహించి, సారా ప్యాకెట్లను ధ్వంసం చేశారు. సారా వ్యానులపై, సారా షాపులపై దాడి చేశారు. ప్రభుత్వానికి, సారా కాంట్రాక్టర్లకి మధ్య జరిగిన ఒప్పందాలు ప్రజా వ్యతిరేకమైనవని వారు గ్రహించారు. ఈ పోరాటం వల్ల తమ లాభార్జనకు గండిపడడంతో కాంట్రాక్టర్లు, ప్రభుత్వం కలిసి ప్రజలపై విరుచుకుపడ్డారు. ఉద్యమకారులపై దాడులు చేయించారు. నెల్లూరు జిల్లాలో ఆరంభమైన ఈ పోరాటం అలలు అలలుగా విస్తరించి, పల్లెలనే కాక పట్టణాలను చుట్టుముట్టింది. తెలంగాణలో మరింతగా ఊపందుకుంది.

రోజువారీ సమస్యలపై మహిళలు దావానలంలా ఎలా కదిలిరాగలరో 1992లో జరిగిన ఈ ఉద్యమం రుజువు చేసింది. దూబగుంట రోశమ్మ లాంటి వారు చరిత్రను లిఖించారు. ప్రభుత్వ ఎక్సైజ్ విధానానికి ఇలాంటి వ్యతిరేకత రావడంతో ఎన్‌టిఆర్ ప్రభుత్వం మద్యపాన నిషేధాన్ని విధించింది. కానీ చంద్రబాబు నాయుడు దాన్ని ఎత్తివేసి, మళ్లీ గ్రామాలను సారాతో ముంచెత్తాడు. సారా పోరాటంలో భాగంగా జరిగిన 'అక్షరజ్యోతి' అనే నిరక్షరాస్యతా నిర్మూలన కార్యక్రమానికి కూడా చంద్రబాబు వల్ల గండిపడింది.

**జాతుల పోరాటానికి మద్దతుగా :** 80వ దశకంలో జాతుల న్యాయమైన పోరాటాలను అణచివేయడం కోసం బడా బూర్జువా వర్గాల ప్రభుత్వం ప్రజలను తీవ్రమైన ఇబ్బందులకు గురిచేసింది. జాతుల

అభ్యున్నతి కోసం వారు న్యాయంగా పోరాటం చేస్తుంటే వారి సమస్యను తీర్చకపోగా అందమైన భారతదేశం పటం ఛిన్నాభిన్నమవడం సహించేది లేదంటూ వారిపై విరుచుకుపడింది. అలాంటి చర్యలను ఖండిస్తూ ఈశాన్య భారతంలో, కాశ్మీర్‌లో మహిళలు ముందుకొచ్చారు. ఉద్యమకారులని నైతికంగా బలహీనపరచడం కోసం ప్రభుత్వం మహిళలపై దాడులు చేసింది. యువకులను మాయం చేసింది. స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడే వారిని ప్రభుత్వం మానభంగాలు జరిపి అణచాలని చూస్తే 'హమ్ చుప్ నహీ బైఠేంగే' అంటూ కాశ్మీర్ మహిళలు కూడా తుపాకులు పట్టి, కత్తులతో, బూమరాంగ్‌లతో శిక్షణ పొందారు. అలాంటి జాతుల పోరాటాలను సమర్థిస్తూ, అక్కడ జరిగే అత్యాచారాలను ఖండిస్తూ మన రాష్ట్రంతో సహా అనేక చోట్ల మహిళలు స్పందించారు. ప్రస్తుతం తెలంగాణ కోసం జరుగుతున్న ఉద్యమంలో కూడా విద్యార్థినులు, మహిళలు ఎంతో చొరవ చూపుతున్నారు.

**భోపాల్ విషవాయువుకి వ్యతిరేకంగా :** 1984 డిసెంబర్‌లో భోపాల్‌లో యూనియన్ కార్బయిడ్ విషవాయువు దుర్ఘటనలో దాదాపు సగం జనాభాకి విషవాయువు సోకింది. ఫ్యాక్టరీ చుట్టూ ఉంది నిరుపేదలే. ప్రాణాలు కోల్పోయిందీ ఈ బడుగు జీవులే. బహుళజాతి సంస్థల అతి దారుణమైన ప్రజావ్యతిరేక చర్యగా ఇది చరిత్రలో నిలిచిపోయింది. నష్టపరిహారం చెల్లింపు చాలా ఆలస్యంగా, అతి స్వల్పంగా ఉంటే ఆ వాయువు కలిగించిన దుష్ప్రభావాలు ఇప్పటికీ వారిని వేధిస్తున్నాయి. మిథైల్ ఐసోసైనేట్ (మిక్) రోజూ ఏదో ఒక రూపంలో విలయతాండవం చేస్తోంది. నీరసం, అవయవాల నిస్తేజం, గర్భస్రావాలు, వికలాంగ సంతానం, మరణవేదన మిగిలాయి. తరతరాలుగా వేధించనున్న ఆ దుర్ఘటన వారికి దినదిన గండంగా తయారయింది.

కార్బయిడ్‌పై క్రిమినల్ కేసు ఉపసంహరించి, 4,500 కోట్ల రూపాయల పరిహారానికి బదులు 715 కోట్ల రూపాయలు మాత్రమే చెల్లిస్తే సరిపోతుందనే కోర్టు తీర్పు ప్రజల బాధల్ని పెంచింది. పైగా, తలా మూడు వేల పరిహారంతోనే అక్కడి పేదలు మధ్యతరగతిగా మారిపోతారంటూ ఒక జడ్జి చేసిన ఉవాచ పుండు మీద కారం చల్లింది. మిక్ విషవాయువు వల్ల రెండున్నర వేల మంది చనిపోగా, ఐదు లక్షల మందికి ఈ వాయువు సోకింది. దాదాపు 80 వేల మంది జీవితాంతం అంగవైకల్యంతో, వ్యాధులతో బాధపడవలసిందే అని భారత వైద్య పరిశోధనా మండలి నిర్ధారించింది.

ప్రజలు ప్రతిఘటించారు. ఫ్యాక్టరీని చుట్టుముట్టారు. సంఘాలుగా ఏర్పడి ధర్నాలు, రైల్ రోకోలు, ట్రాఫిక్ బందులు చేపట్టారు. 'భోపాల్ గ్యాస్ పీడిత మహిళా ఉద్యోగ సంఘటన్'గా మహిళలు కూడా సంఘటిత పడ్డారు. వీరికి మద్దతుగా దేశమంతటా ప్రదర్శనలు జరిగాయి. కోర్టు తీర్పు ప్రజావ్యతిరేకంగా ఉందంటూ మహిళలు అసెంబ్లీ ముందు, సుప్రీంకోర్టు ముందు ప్రదర్శనలిచ్చారు. వారికి న్యాయం జరగలేదు సరికదా లాఠీ దెబ్బలు మిగిలాయి. 'హిందుస్తాన్ గులామ్, కార్బయిడ్ సలామ్', 'హమారే ఔలాద్ భీ లడేగీ హమారే మౌత్ కే బాద్', 'కైరాత్ నహీ రోజ్‌గార్ చాహియే', 'గైర్ కానూనీ ఫైసలా వాపస్‌లో' వంటి నినాదాలతో ఆ ప్రాంతాలన్నీ హోరెత్తిపోయాయి. మహిళల సంఘటిత శక్తికి ఇది ఒక నిదర్శనం. ఈ సందర్భంగా మన రాష్ట్రంలో అనేక సభలు, ప్రదర్శనలు జరిగాయి. భోపాల్ మహిళలకు సంఘీభావంగా విద్యార్థినులు బాగా కదిలారు. ప్రతి విద్యా సంస్థలో మీటింగ్‌లు పెట్టి, సమస్య తీవ్రతని తెలియజెప్పి, భోపాల్ బాధితులకి న్యాయం చేయాలని డిమాండ్ చేస్తూ, సంతకాలు సేకరించి సుప్రీంకోర్టుకి పంపారు. పర్యావరణాన్ని పెద్ద ఎత్తున దెబ్బతీసిన ఈ సంఘటన లాంటివి ఇంకా పదే పదే కొనసాగుతూనే ఉన్నాయి. ప్రతిఘటనా తప్పడం లేదు.

**మండల్ కమిషన్ వ్యతిరేక పోరాటాన్ని నిరసిస్తూ :** పెరుగుతున్న ఆర్థిక సంక్షోభానికి కారణాలను వెతికే ప్రయత్నం చేయకుండా, నిరుద్యోగానికి అసలైన కారణాలు వెతక్కుండా కొందరు ఉన్నత కులాల విద్యార్థులు రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన చేపట్టారు. ఎదురుగా కనిపిస్తున్న నిరుపేద దళితులపై నెపాన్ని నెట్టి, తమ అవకాశాలు వాళ్లు కాజేస్తున్నారనే అపోహతో వాళ్లు ప్రజావ్యతిరేక చర్యలు చేపట్టారు. ఈ అభివృద్ధి నిరోధక శక్తులను ఖండిస్తూ, రిజర్వేషన్‌లు కొనసాగించాలని డిమాండ్ చేస్తూ వామపక్షాల విద్యార్థి సంఘాలు ఉద్యమించాయి. ఇందులో విద్యార్థినులు చురుగ్గా పాల్గొన్నారు. తరతరాలుగా అణగారిపోయిన వర్గాలకు రిజర్వేషన్‌ల చేయూతతో కొంతైనా ఆసరా కల్పించవలసిన అవసరాన్ని వారు నొక్కి చెప్పారు. ప్రాథమిక విద్యలో, సెకండరీ విద్యలో కింద కులాల వారు రిజర్వేషన్‌లు కొంతమేరకు వాడుకున్నా, ఉన్నత విద్యలో వారి సీట్లు ఖాళీగా ఉండడానికి వెనకగల ఆర్థిక రాజకీయ కారణాలను విశ్లేషిస్తూ అనేక ప్రచార ఆందోళన కార్యక్రమాలు జరిగాయి. అన్యాయానికి గురైన వారినే అన్యాయం చేసే వారిగా చిత్రించే ఉన్నతవర్గాల కుట్రను ఈ ఉద్యమం బయటపెట్టింది.

**బాబ్రీమసీదు కూల్చివేతకు నిరసన :** మత దురహంకారుల దౌర్జన్యానికి పరాకాష్ట బాబ్రీ మసీద్ కూల్చివేత. ముస్లింలు మొదటిసారిగా తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకోక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. కలిసిమెలిసి పనిచేసిన చోట్ల సైతం తమ పేరు చెప్పుకోవడానికి జంకే, భయపడే సందర్భం ఏర్పడడం విచారకరం. దేశ విభజన కాలం నాటి కాళరాత్రి మళ్లీ తాండవించింది. మత కల్లోలాలను ప్రేరేపించే ఇలాంటి దురాగతాలను ఖండిస్తూ కదిలిన ప్రజాస్వామికవాదుల్లో మహిళలు కూడా ముందు పీటిన నిలిచారు. ఎన్నో రచనలు కూడా చేశారు. ఏకత్వంలో భిన్నత్వమనే నాయకుల నినాదాల బోలుతనాన్ని బయటపెడుతూ గాయపడిన హృదయాలతో ప్రజాస్వామిక వాదులు ముస్లింలకు చేదోడుగా నిలిచారు. మరోవైపు తస్లీమా నస్రీన్ వంటి మానవతావాదులపై జరిగిన దాడులను నిరసించారు.

## 5. నూతన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా విస్తరించిన పోరాటాలు

సంఘటితమవుతున్న మహిళల పోరాట పటిమను నీరుగార్చే దిశగా ప్రభుత్వం పొదుపు లక్ష్మి వంటి పథకాలు పెట్టి, డ్వాక్రా వంటి స్వయం ప్రతిపత్తిగల సెల్ఫ్‌హెల్ప్ గ్రూపులను స్థాపించింది. మైక్రో ఫైనాన్స్ పేరుతో తక్కువ వడ్డీలకు అప్పు ఇవ్వడం, వారి ఉత్పత్తులకు విపణి కల్పించడం వంటి వాగ్దానాలతో ఆశలు కల్పించింది. చివరికి వడ్డీ మొత్తాలు పెరిగి మోపెడై స్త్రీల నడుములు విరిగాయి. పథకాల పనితీరును ప్రశ్నిస్తూ అనేక ఆందోళనలు జరిగాయి.

అలానే, గ్రామీణ ప్రాంతాల్లో వైద్యాన్ని, మాతా శిశు పోషణని మెరుగుపరిచే విధంగా ఏర్పడిన అంగన్‌వాడీ విధానంలో కూడా అవకతవకలు జరుగుతున్నాయి. అందీ అందని జీతాల వల్ల ఆ కార్మిక

మహిళలు నెలల తరబడి ధర్నాలు నిర్వహిస్తున్నారు. 104 సేవల పేరుతో గ్రామాల్లోని గర్భిణీ స్త్రీలకు ఉచిత పరీక్షలు, మందుల పంపిణీ అనే ఆశ కల్పించి, చివరికి ఆ సర్వీసుల్ని రద్దు చేయబోతే, ఆ సేవలు నిర్వహించే ఉద్యోగులు కూడా వీధినపడి పోరాడక తప్పలేదు. ఎన్ఆర్ఎచ్ఎం పేరుతో నడిచే పథకాలన్నీ కుంటి నడక నడుస్తున్నాయి. 1982లో ప్రపంచ ఆరోగ్య సంస్థ, యునిసెఫ్ కలిసి మాతా శిశువుల కోసం ఏర్పరిచిన పోషకాహార మద్దతు కార్యక్రమం ఆ రకంగానే నడుస్తోంది.

**రాజకీయ రంగంలో హక్కుల కోసం :** రాజకీయ ప్రాతినిధ్యం కోసం మహిళలు 1920వ దశకంలోనే ఓటు హక్కు డిమాండ్‌తో ముందుకొచ్చారు. స్వాతంత్ర్యం తర్వాత మహిళలందరికీ ఓటు హక్కు లభించినా, పాలనా యంత్రాంగంలో వారికి స్థానం దక్కలేదు. ఇండియాలో మహిళల స్థితిగతులను అంచనా వేసే ప్రభుత్వ కమిటీ 1971-74లో తన నివేదికలో ఈ పరిస్థితిపై ఇలా వ్యాఖ్యానించింది – 'పరిస్థితి ఇలానే కొనసాగితే, తమ సమస్యలని చెప్పుకుంటూ పరిస్థితిని మార్చుకునే అవకాశం తమకి లేదనే నిరాశతో మహిళలు రాజకీయ విధానంలో ఆసక్తిని కోల్పోయి, ఆ విధానంలో పాల్గొనడానికి నిరాకరించి, స్తబ్దుగా మారవచ్చు, లేదా తిరుగుబాటుదారులుగా తయారయ్యే అవకాశం ఉంది' అన్నారు. అయితే, రాజీవ్‌గాంధీ పంచాయతీల్లో మహిళల ప్రాతినిధ్యానికి పచ్చజెండా ఊపాడు. ప్రాంతీయ స్వయంపాలన అనుభవంతో మహిళలు రాష్ట్ర ప్రభుత్వాల్లో, పార్లమెంట్‌లో కూడా ప్రాతినిధ్యాన్ని కోరుతూ ఉద్యమించారు. 33 శాతం రిజర్వేషన్ డిమాండ్‌తో అన్ని మహిళా సంఘాలు కలిసి ఉమ్మడి పోరాటం సాగించాయి. అయితే ఆ బిల్లుతో నిజమైన సాధికారికత ఎంతవరకు ఉంటుందో వేచి చూడవలసిందే. కేవలం ఈ సాధికారత వల్లనే మహిళల స్థితిగతులు మారిపోవనే అవగాహన కూడా అవసరం.

**ముంపుకి వ్యతిరేకంగా :** రాజమండ్రి నుంచి భద్రాచలానికి పడవలో వెళ్తుంటే, విశ్రాంతి కోసం ఆగే అందమైన పేరంటాలపల్లిలో చిన్న చిన్న వాగులు కనువిందు చేస్తాయి. పక్కనే ఉన్న కొండ మీదకి ఎక్కితే అక్కడి ప్రజలు వెదురుతో చేసిన అందమైన పూలగుచ్ఛాలను అమ్ముతూ కనిపిస్తారు. వాటిని తెచ్చి మన ఇంట్లో అలంకరిస్తే పోలవరం గుర్తుకొచ్చి బాధనిపిస్తుంది. అక్కడ ప్రాజెక్టు వల్ల నీళ్లు ముంచితే ఇంకా పైపైకి పోతామే తప్ప ఆ ప్రాంతాన్ని విడిచిరామంటూ పదిహేను గడపల మహిళలు అక్కడే స్థిరంగా ఉండి పోయారు. పౌరహక్కుల సంఘాల, ప్రజాసంఘాల నేతృత్వంలో మహిళలు అనేక రూపాల్లో తమ నిరసనలు తెలియజేస్తున్నారు. మేధా పాట్కర్‌లు ఇక్కడ కనిపించకపోయినా, అంతే పట్టుదల, స్థైర్యాలు గల అనసూయలు, రాములమ్మలు ఉన్నారు. ఈ సమస్య మీద ఏళ్ల తరబడి పోరాడుతున్నారు.

ఇలా అనేక సమస్యలపై మహిళలు సమరశీలంగా ముందుకొచ్చారు, ఇంకా వస్తున్నారు. ఒక్కొక్క పోరాటంలో వారి సంసిద్ధత, సమరశీలత రాటుదేలుతున్నాయి. ఒక్కొక్క ఉద్యమం అంతిమ పోరాటానికి రిహార్సల్స్ వంటిదనే మార్క్సిస్ట్ అవగాహన ప్రతిరోజు రుజువవుతూనే ఉంది. అందుకే స్త్రీలు విప్లవోద్యమంలో కూడా ఎంతో ఉత్సాహంగా పాలుపంచుకుంటున్నారు.

**విప్లవోద్యమంలో :** 'కష్టాలే ఎదురవ్వనీ / అలజడే వేధించనీ / జీవితాంతం పోరాడుతాను / ఉన్నతమైన లక్ష్యం కోసం' అన్నాడు యువ కార్ల్ మార్క్స్. అదే ఒరవడిలో మహిళలు అనేక దశల్లో విప్లవోద్యమంలో చురుగ్గా పాల్గొని తమ ఉనికిని చాటుకున్నారు. సమాజం సమూలంగా మారనిదే తమకి సంపూర్ణమైన స్వేచ్ఛ సిద్ధించదని నమ్మి పీడిత రైతాంగంతో, కార్మికులతో, విద్యార్థులతో, రచయితలతో, పౌరహక్కుల కార్యకర్తలతో, కళాకారులతో, పోరాట యోధులతో భుజం భుజం కలిపి పోరాడారు. ఆ క్రమంలో ఎన్నో కష్టనష్టాలను ఓర్చారు, త్యాగాలు చేశారు, ప్రతిఘటించారు, అసువులు బాసారు.

ఎమర్జెన్సీకి ముందు 70వ దశకంలో నక్సల్‌బరీ శ్రీకాకుళ రైతాంగ ఉద్యమ ప్రభావం ఎల్లలు దాటి ఆంధ్రదేశాన్ని కుదిపివేసింది. ముఖ్యంగా లేలేత యువత బలంగా స్పందించారు. వివిధ ప్రజాసంఘాలు ఏర్పడ్డాయి. విద్యార్థి సంఘాలు ఏర్పడి విశ్వవిద్యాలయాలతో సహా అన్ని విద్యా సంస్థలను ప్రభావితం చేశాయి. ముఖ్యంగా తెలంగాణలో ఇవి చురుగ్గా పనిచేశాయి. ఇళ్లలో ప్రతిబంధకాలను ఎదిరించి విద్యార్థినులు సాహసోపేతంగా ముందుకొచ్చారు. అరుణోదయ, జననాట్యమండలి వంటి సాంస్కృతిక సంస్థలు విప్లవ రాజకీయాలతో ప్రజలను ఉత్తేజపరిచాయి. సభలకి, ప్రదర్శనలకి జనం వేలాదిగా కదిలివచ్చారు. ఈ నేపథ్యంలో ఇందిరాగాంధీ 1975 జూన్ 26న ఎమర్జెన్సీ విధించి అనేక అకృత్యాలకు పాల్పడింది. తనకి ఎదురు నిలిచిన పార్టీలను, ప్రజలను నిర్బంధించి నెలల తరబడి వేధించింది. ఆనాటి వేధింపుల ప్రభావంతో ఈనాటికీ ఆరోగ్యం పూర్తిగా కోలుకోలేని విద్యార్థులు ఎందరో ఉన్నారు. ఆ చీకటి రోజుల్లోనే ప్రభుత్వం భూమయ్య – కిష్టాగౌడ్‌లను ఉరితీసింది. ఆ తీర్పుకి వ్యతిరేకంగా ప్రజలు స్పందించారు. ఉరితీతలకి వ్యతిరేకంగా ఆందోళన చేపట్టారు.

ఎమర్జెన్సీ విధించగానే రాత్రికి రాత్రి అరెస్టులు జరిగాయి.

తప్పించుకున్న వారు అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు. చిన్న పట్టణాల్లో, గ్రామాల్లో వేతన కూలీలుగా, చిన్నపాటి డాక్టర్లుగా, టీచర్లుగా నిలదొక్కుకొని ప్రజలతో మమేకమయ్యారు. అక్కడ మహిళలు వీరిని కడుపులో దాచుకున్నారు. ఎమర్జెన్సీ తర్వాత వివిధ సంఘాల ఏర్పాటుకు వీరి కృషి ఎంతగానో దోహదపడింది.

1977లో ఎమర్జెన్సీ ఎత్తివేయగానే కాంగ్రెస్ పాలన అంతం కావడంతో అన్ని ప్రజా సంఘాలు చురుగ్గా పనిచేశాయి. ప్రజాస్వామిక వాతావరణంలో వాటి సభ్యత్వం పెరిగింది. తర్వాత యువజన సంఘాలు, కార్మిక సంఘాలు, రైతుకూలీ సంఘాలు ఏర్పడ్డాయి. మహిళలు ఎన్నో విజయాలు సాధించారు. వెట్టి చాకిరీ రద్దు కోసం జరిగిన పోరాటంలో ఆడబాపల విధానం కూడా రద్దయింది. దొరల గడీల ముందు బతకమ్మ ఆడాలనే నియమాన్ని రద్దు చేశారు. రైతు కూలీల వేతనాలు పెరిగాయి. స్త్రీ పురుషులకు సమాన వేతనం అనే డిమాండ్‌ని సాధించుకున్నారు. తునికాకు కూలీరేట్లు పెరిగాయి. బంజరు భూముల్లో జెండాలు పాతిన భూ ఆక్రమణ పోరాటాల్లో మహిళలు చురుగ్గా పాల్గొన్నారు. భూస్వాములు అదనంగా కలిగి ఉన్న భూముల్ని స్వాధీనం చేసుకోవడంలో కూడా స్త్రీలు ముందున్నారు. రైతు కూలీ సంఘాల్లో, మహిళా సంఘాల్లో తమ గొంతులు వినిపించారు. వేధించే భర్తలని ప్రజాకోర్టుల ముందు నిలబెట్టారు. అన్ని సమస్యలకీ ప్రజా కోర్టుల తీర్పునే ప్రమాణంగా తీసుకున్నారు. దురాగతాలు చేసిన భూస్వాములను సైతం ఈ కోర్టుల్లో నిలదీశారు. ముక్కు నేలకి రాయించి, చీపుళ్లతో కొట్టి, చెప్పుల దండలు వేసి, ఊరు నుంచి బహిష్కరించి, ఒకోసారి మరణదండన విధించి, వారి దురహంకారానికి, పైశాచికత్వానికి, దోపిడీ పీడనలకు తగిన శిక్షలు విధించారు. సారాని ఊళ్ల నుంచి తరిమేశారు. దొంగ వ్యాపారులను, తప్పుడు తూకాలను, జీవితాలను ఛిద్రం చేసే వడ్డీ లెక్కలను ఎండగట్టారు. రుణ పత్రాలను తగులబెట్టారు.

అలా ఉద్యమిస్తున్న గ్రామాల నుంచి వెళ్లి గనుల్లో, ఇతర కర్మాగారాల్లో స్థిరపడిన కార్మికులు, ఈ పోరాటాన్ని తమతో పాటు ఆయా ప్రాంతాలకు తీసుకెళ్లారు. అలా బొగ్గు గనుల్లో అగ్గి రాజుకుంది. దినదిన గండంగా గడిచే ఆ జీవితాలకు ఉద్యమం ఒక వెలుగయింది. అక్కడ కూడా మహిళలు క్రియాశీల పోరాటాల్లో పాల్గొన్నారు. ఈ క్రమంలోనే అనేక కుటుంబాలు మొత్తంగా విప్లవోద్యమానికి అంకితమయ్యాయి. మహిళలు ఎన్నో త్యాగాలకు సిద్ధపడ్డారు. మూతపడిన జూట్ మిల్లుల్ని తెరవాలని, లాకౌట్లు ఎత్తివేయాలని, వేతనాలు పెంచాలని డిమాండ్ చేస్తూ జరిగిన పోరాటాల్లో కూడా మహిళలు పాల్గొన్నారు.

ఈ పోరాట తాకిడికి ఊళ్లు విడిచి పారిపోయిన దొరలు, భూస్వాములు, వ్యాపారులు పట్టణాల్లో ఆస్తులు సంపాదించుకొని, రాజకీయాల్లో చేరి, ఊళ్ల మీదకి పోలీసుల్ని దింపారు. ఐదారేళ్లపాటు జరిగిన తీవ్ర ప్రతిఘటనతో, నిర్బంధంతో ఆ గ్రామాలు అతలాకుతలమై పోయాయి. ఈ క్రమంలో అక్కడి మహిళలు ఉద్యమకారులని కడుపులో దాచుకున్నారు. శత్రువు ఆనుపానులని కనిపెడుతూ ప్రజల మనుషులను రక్షించే ప్రయత్నాలు చేశారు. కొందరు మహిళలు తామే కార్యకర్తలుగా ఎదిగి, సుదూర ప్రాంతాలకు తరలి వెళ్లడానికి, ఉద్యమాన్ని విస్తరింప చేయడానికి సిద్ధమయ్యారు.

అంతవరకు 'బాంచన్ కాల్మొక్త' బతుకులుగా ఉన్న జనానికి తలెత్తుకు తిరగడం నేర్పింది ఉద్యమం. దొరల బానిసలుగా, దాసీలుగా ఉన్న స్త్రీలు అపర కాళికలై, దొరలకి దడ పుట్టించారు. అన్ని రకాల దోపిడీని అంతమొందించే ఉద్యమానికి వెన్నెముకలయ్యారు.

**ఆదివాసి మహిళల పోరాటాలు:** మరోవైపు ఉద్యమం అడవులకు కూడా విస్తరించింది. అడవి మీద, అటవీ సంపద మీద ఆధారపడి, ప్రకృతిలో భాగంగా బతుకుతున్న అనేక గిరిజన తెగల జీవితం ఈనాడు చిన్నాభిన్నమై పోతోంది. బ్రిటిష్ కాలం నుంచి అక్కడ వనరుల దోపిడీ జరుగుతున్నా, ఇటీవల కార్పొరేట్ సంస్థల ధనార్జన కోసం ప్రభుత్వం అడవులనే అమ్మేస్తోంది. అందుకే నదీ పరీవాహక ప్రాంతాలు అంతమైపోతున్నాయి. వనరుల విధ్వంసంతో పాటు జనజీవన విధ్వంసం కూడా ఏకకాలంలో జరుగుతోంది. దీన్ని ప్రతిఘటిస్తున్న ఆదివాసులపై ప్రభుత్వం విరుచుకు పడుతోంది. పోలీసులు, సైన్యం, సల్వాజుడుం లాంటి కిరాయి గూండాల సాయుధ దళాలు వారి జీవితాలను చిన్నాభిన్నం చేస్తున్నాయి. వాకపల్లి, బల్లుగూడ వంటి చోట్ల ప్రతిఘటనని అణచడం కోసం మహిళలపై అత్యాచారాలు జరుగుతున్నాయి.

భూమి పోయి, ఇల్లు వాకిలి పోయి, మానప్రాణాలు పోయి నిస్సహాయంగా మిగిలిన గిరిజనులు కడుపుకాలి పోరాటాన్ని చేపట్టారు. 1967లో భూములు కోల్పోయి, శిస్తులు కుంగదీస్తుంటే బెంగాల్లో, శ్రీకాకుళంలో గిరిజన పోరాటాల్లో మహిళలు ముందు పీటిన నిలిచారు. ప్రాణాలు పణంగా పెట్టారు. 1970వ దశకంలో ఆదిలాబాద్, ఖమ్మం జిల్లాల్లో రైతుకూలీ సంఘాల్లో మహిళలు చేరారు. ఇంద్రవెల్లి ప్రతిఘటనలో పాలుపంచుకున్నారు. 80, 90వ దశకంలో ఆంధ్ర, జార్ఖండ్, చత్తీస్‌ఘడ్, మధ్యప్రదేశ్ గిరిజన మహిళలు ఆదివాసి ముక్తి సంఘటన్ వంటి సంఘాల్లో చురుగ్గా పనిచేశారు.

భూస్వాముల భూములకు, గిరిజనేతర భూములకు 1/70 ఆక్ట్ భద్రత కల్పిస్తుంది. సహజ వనరులను బహుళజాతి సంస్థలకు అమ్మడాన్ని ఇది చట్టబద్ధం చేస్తుంది. ఈ చట్టాన్ని వ్యతిరేకిస్తూ మహిళలు 1989 నించి ఆందోళన చేస్తున్నారు. బాక్సైట్ గని తవ్వకాలను ఆపుతున్నారు. వేదాంత వంటి సంస్థలను వెళ్లగొడుతున్నారు. నర్మద, కోయిల్‌కారో డ్యాం నిర్మాణాలను వ్యతిరేకిస్తున్నారు. పోలవరం ప్రాజెక్టు వల్ల మునిగిపోయే ప్రాంతాలను రక్షించుకునే ప్రయత్నం చేస్తున్నారు.

ఇవికాక, తునికాకు పోరాటాల్లో ముందు ఉంటున్నారు. వెదురు కోసుకునే హక్కు కోసం డిమాండ్ చేస్తున్నారు. కూలీ రేట్లు, వెదురు, ఇప్పపూల రేట్లు పెంచుకుంటున్నారు. పూట గడవడం కష్టమైనపుడు కరువుదాడులు చేపడుతున్నారు. ప్రతి ఊళ్లో స్త్రీలు సమరశీలంగా చేసిన భూపోరాటాల వల్ల వాళ్లు తమ భూములను దక్కించుకోగలిగారు. అలాంటి స్త్రీలలో బుచ్చక్క, రాజక్క, ఆత్రంబాయి ఆదర్శంగా నిలిచారు.

అంతేకాక, పురుషాధిక్యత వల్ల అమలయ్యే అన్ని సామాజిక దురాచారాలను ఈ ఆదివాసి మహిళలు వ్యతిరేకించారు. పెళ్లయ్యాక స్త్రీలు జాకెట్లు మానుకోవాలనే ఆచారాన్ని ధిక్కరించి జాకెట్లు వేసుకున్నారు. బలవంతపు పెళ్లిళ్లు మానుకున్నారు. ఊరి బయట గుడిసెలో నెలవారీ నిర్బంధాన్ని ఆపేశారు. రాజకీయ, ఆర్థిక పోరాటాల్లో పురుషులతో భుజం భుజం కలిపి పోరాడుతున్నారు. సాయుధులై తమని తాము రక్షించుకోగలుగుతున్నారు. సల్వాజుడుం, గ్రీన్‌హంట్ వంటి నిర్బంధాలను తిప్పికొట్టే ప్రయత్నం చేస్తున్నారు. వనరుల విధ్వంసాన్ని, జీవ విధ్వంసాన్ని ఆపే ప్రయత్నంలో సింగూరు నించి, కళింగనగర్

నించి టాటాని వెళ్లగొట్టారు. నందిగ్రామ్‌లో కెమికల్ ఫ్యాక్టరీని ఆపారు. సోంపేటలో నాగార్జున థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్‌ని ఆపారు. నియంగిరి కొండల నుంచి వేదాంత కంపెనీని తరిమేస్తున్నారు.

ఆదివాసుల మధ్య సుదీర్ఘకాలం గడిపి, వారి బాగోగులని ఆకళింపు చేసుకున్న రచయిత్రి మహాశ్వేతాదేవి బెంగాల్ ప్రభుత్వం చేసే తప్పిదాలను ఎత్తిచూపింది. ప్రభుత్వం కాంట్రాక్టర్లకి రక్షణ కల్పిస్తూ, చెట్లని నరికిస్తోంది. దానివల్ల జంగల్ మహల్ ఆదివాసులు జీవనోపాధిని కోల్పోతున్నారు. అక్కడ రోడ్లు లేవు. మంచినీళ్లు లేవు. కరెంటు లేదు. ఆదివాసులు బెంగాల్లో ఉన్నంత దయనీయంగా ఇంకెక్కడా లేరని ఆమె బాధపడ్డారు. ప్రజల హక్కుల్ని ప్రభుత్వం కాలరాస్తోంది. వారు సంఘటితంగా పెట్టిన కొన్ని డిమాండ్‌లను తోసిరాజంటోంది. లాల్‌గఢ్‌లో తన ప్రజల మీద రాష్ట్ర ప్రభుత్వం యుద్ధాన్ని ప్రకటించడం సిగ్గుచేటని ఆమె దుయ్యబట్టింది. దాని బదులు అక్కడి ప్రజలకి తెల్లకార్డులు ఇచ్చి, మంచినీళ్లు ఇచ్చి, సోలార్ లైట్లు ఇచ్చి చూడమంది. అన్ని హక్కులు కోల్పోయిన నిరుపేదలకి, నిర్వాసితులకి అందని స్వాతంత్ర్యం ఏమి స్వాతంత్ర్యమని ఆమె ప్రశ్నించింది. ఆరుకోట్ల ఆదివాసులు ఉన్న మన దేశంలో మహిళలు ఉపాధి కోసం కొడుకుల మీద ఆధారపడరని ఆమె ఒక ఉదాహరణ చెప్పింది. మిద్నపూర్‌లో తులిబార్‌కి చెందిన అరవయ్యేళ్ల కర్మిసోరేన్ తనకు చెందిన చిన్న ఇంటిని, చిన్న మడిచెక్కని తన కొడుక్కి ఇవ్వకుండా గ్రామానికి ఇచ్చేసింది. అలా తులిబార్‌లో మొదటి స్కూలు వెలిసింది. అంత పెద్ద మనసుగల స్వచ్ఛమైన ఆదివాసుల జీవితాలతో ఆడుకుంటోంది ప్రభుత్వం. లాభాపేక్షగల బడా పెట్టుబడిదారులకు అడవిని, దానిలోని వనరుల్ని అమ్మేస్తోంది. అందుకే 'ఈ నిర్వాసితులకి ఏ స్వేచ్ఛా లేదు, స్వతంత్రమూ లేదు. అరవయ్యేళ్ల స్వతంత్ర భారతదేశంలో వారికి ఏ ప్రాథమిక హక్కూ సంప్రాప్తించలేదు' అంటుంది మహాశ్వేతాదేవి. ఒకపక్క ఎడ్లబండి, మరోపక్క ఎ.సి. స్కూళ్లు. ఒక పక్క నూలు చీరలు, మరోపక్క మినీస్కర్టులు, వీపంతా కనిపించే జాకెట్లు. అడగుడుగునా అలా ఆర్థిక వ్యత్యాసాలు ఇంకా కనిపిస్తుంటే, ఎలాంటి స్వాతంత్ర్యం పొందలేకపోయినా ఆదివాసులు ఇప్పుడు మళ్లీ తమ విముక్తి కోసం పోరుబాట పట్టారని ఆమె విశ్లేషిస్తారు. ఇది బెంగాల్లోనే కాక దేశవ్యాప్తంగా అడవులన్నిటిలో ఉన్న స్థితి. అందుకే గోచిపాతల ఆదివాసులు గొడ్డళ్లు నూరుతున్నారు.

**లక్ష్యం వైపుగా :** అలా ఎన్నో సమస్యలపై మహిళలు కదిలారు, కదులుతూనే ఉన్నారు. అలానే ఉత్పాదక శ్రమలో పాలుపంచుకోవడానికి ముందుకు వస్తూనే ఉన్నారు. కానీ మన దేశంలో స్త్రీలని వేధిస్తున్న సమస్యలు ఇప్పటికీ చాలానే ఉన్నాయి. పోషకాహార లోపం, అనారోగ్యం, నిరక్షరాస్యత, అధిక శ్రమ, నైపుణ్యతా లోపం, వివక్ష, శారీరక మానసిక వేధింపులు, అత్యాచారాలు, ఏ హక్కులూ లేని నిస్సహాయత, ఆర్థిక స్వేచ్ఛ లేకపోవడం అనేవి వాటిలో ముఖ్యమైనవి. అందుకే, పేదరికాన్ని నిర్మూలించే వైపుగా చేసే పోరాటాలు ముఖ్యమా, అస్తిత్వం కోసం జరిగే పోరాటాలు ముఖ్యమా అనే చర్చ చాలాకాలంగా జరుగుతూనే ఉంది. పేదరికం ప్రాతిపదికగా స్త్రీలు కోల్పోతున్న ఉనికే ప్రధానం అని చెప్పక తప్పదు.

పేదరికంలో మగ్గిపోతున్న ప్రజల ప్రతిఘటనని నీరుగార్చడం కోసం ప్రభుత్వం కొత్త ఎత్తులు వేస్తోంది. వాటిలో భాగమే స్వయం పోషక గ్రూపులు (సెల్ఫ్ హెల్ప్ గ్రూపులు – ఎస్.ఎచ్.జి.) వారికి అందజేస్తున్న సూక్ష్మరుణాలు (మైక్రో ఫైనాన్స్). ప్రజల శక్తి సామర్థ్యాలను తనకి అనుకూలంగా మలుచుకుంటూ, వారికి దూరపు కొండలు చూపే ప్రభుత్వ ప్రయత్నమే ఇది. కానీ ఇటీవల ఆ విధానంలో ఏర్పడిన సంక్షోభం అందరికీ కనువిప్పు అయింది. కష్టపడి దాచుకున్న సొమ్మును చాలా మంది కోల్పోయారు. అప్పుల ఊబిలో కూరుకున్నారు.

సమస్య మూలాల్లోకి వెళ్తే, ఈనాడు సమాజాభివృద్ధికి పురుషునితో పాటు స్త్రీలను కూడా వినియోగించుకోలేని సమాజంలో మనం ఉన్నాం. జనాభాలో సగం మాత్రమే ఉత్పత్తిలో పాలు పంచుకుంటే, ఎన్ని వనరులున్నా ఆ దేశం దిగజారుడుగానే ఉంటుంది. పైగా, ఇప్పుడు ఆ వనరులు, వాటిపై పెరిగే సంపద కొద్దిమంది చేతుల్లో చిక్కుకుంది. ఆస్తిహక్కు పేరుతో, ఇతర దోపిడీ విధానాల దన్నుతో కొందరు కోట్లకి పడగలెత్తుతుంటే, మెజారిటీ ప్రజలు రోజు రోజుకీ పేదరికంలో కూరుకుపోతున్నారు. ఆర్థవలస, అర్ధ భూస్వామ్య విధానం కొత్త కొత్త రూపాల్లో ప్రజలని అధోగతి పాలు చేస్తోంది. అందుకే ఈనాడు మన దేశంలో దాదాపు నలభై శాతం మంది దారిద్ర్యరేఖకి దిగువ ఉన్నారు. ఇంకొక ముప్పై శాతం ఆ స్థాయికి దిగజారడానికి సిద్ధంగా ఉన్నారు. అలాంటి అణగారిన మెజారిటీ ప్రజలు విముక్తి చెందడం కోసం ఆరాటపడుతుంటే, మహిళలు వారితో కలిసి పోరాడుతూ, సకల మానవాళి స్వేచ్ఛలోనే తమ స్వేచ్ఛ ఇమిడి ఉందని నమ్ముతూ, అంచెలంచెలుగా తమ ప్రజాస్వామిక హక్కుల్ని పొందాలి. మహిళలుగా తమ ప్రత్యేక హక్కుల కోసం పోరాడాలి. ఫైజ్ చెప్పినట్లు 'ఏక్ ఖేత్ నహీ, ఏక్ దేశ్ నహీ, హమ్ సారీ దునియా మాంగేంగే!'.

రజనీ దేశాయ్ మాటల్లో చెప్పాలంటే 'మనకి ఇంకా ఇంకా కావాలి. మరింత ఉత్పాదకత కావాలి. దానికోసం మరింత స్వేచ్ఛ కావాలి. అలా పొందిన అదనపు విలువని మానవాళి కోసం వినియోగించాలి. భూస్వాములు, వడ్డీ వ్యాపారులు, కాంట్రాక్టర్లు, రెవెన్యూ అధికారులు, కోర్టులు, పోలీసులు, మిలిటరీ – అన్నీ కలిసి మనల్ని దోచుకుంటుంటే, వారి నించి విముక్తి కోసం పురుషులు చేసే పోరాటంలో మనమూ భాగస్వాములు కావాలి. ఆ స్వేచ్ఛని కోరే హక్కు మనకి ఉందని పురుషులకి తెలియజెప్పాలి. అందుకే, ఉత్పత్తి సాధనాలపై ఆధిపత్యం కోసం దోపిడీదారులకు వ్యతిరేకంగా చేసే పోరాటం శత్రువైరుధ్యం. ఆ పోరాటాలలో మనకి చేదోడుగా ఉండే పురుషులతో మనది మిత్ర వైరుధ్యం. అయితే, ఇది కూడా చాలా కీలకమైన పోరాటమే. ఎందుకంటే, దీనివల్ల సగం జనాభా విముక్తి చెంది, అసలైన పోరాటంలో పాలుపంచుకునేలా ఎదుగుతుంది. లేకపోతే, అర్ధాకలితో బాధపడుతూ, నిరుద్యోగంలో కూరుకుపోయి, జీవితానికి భద్రతలేక, అణచివేతకి గురయ్యే పురుషులు ఉంటే, వారితో కోరుకునే సమానత్వానికి అర్థం లేదు.'

ఈ అవగాహన స్త్రీలకే కాక పురుషులకి లేకపోతే, అంతిమ పోరాటంలో స్త్రీలు వెనకబడి పోతారు. విముక్తి పోరాటానికి అది ప్రతిబంధకమే అవుతుంది. సూక్ష్మంగా చూస్తే, ఒక కుటుంబంలో పురుషుడు బయట ఎంత మహత్తరమైన పోరాటాల్లో పాల్గొన్నా, ఇంట్లో భార్యకి దాని విలువ తెలిసి ఆమె కూడా అందుకు సంసిద్ధం కాకపోతే, ఆమె అతనికి ప్రతిబంధకంగా తయారవుతుంది. అప్పుడామె బానిసకొక బానిసగా పడి ఉంటుంది. అందుకే, 'బానిస యజమాని' మనస్తత్వాన్ని అందరిలో దూరం చేయాలని ప్రబోధించాడు లెనిన్.

నూతన ఆర్థిక విధానం (ఎన్ఇపి) పేరుతో ఈనాడు మన దేశం సామ్రాజ్యవాద దోపిడీకి అధికాధికంగా గురవుతోంది. దాని ముద్దు పేరే 'ప్రపంచీకరణ'. పీడిత ప్రజలని ఏకం చేసి ప్రపంచ దేశాలను సమైక్యం చేసే అంతర్జాతీయ తత్వానికి దీనికి చాలా తేడా ఉంది. ఎన్ఇపి కింద ఆహారధాన్యాల ఉత్పత్తి పడిపోయింది. ధరలు పెరిగాయి. కుటుంబాన్ని నడిపే స్త్రీ అతలాకుతలమవుతోంది. ఆహార లోపంతో వ్యాధులు పెరుగుతున్నాయి. రోగ నిరోధక శక్తి తగ్గుతోంది. మంచినీళ్ల కరువు. పక్కా ఇళ్లు లేవు. పాయఖానాలు లేవు. అటవీ సంపద దోపిడీతో కూడా స్త్రీలు ప్రభావితమవుతున్నారు. ఇంధనం కరువుకి కూడా స్త్రీలే బలవుతున్నారు. పెరుగుతున్న విద్యుత్ ఛార్జీలు, తగ్గుతున్న గ్యాస్ పంపిణీ, పెరుగుతున్న ఆహార ధరలు, తరుగుతున్న ఉద్యోగావకాశాలు స్త్రీలని వేధిస్తున్నాయి. అన్ని చోట్లా స్వచ్ఛంద పదవీ విరమణని ప్రోత్సహించి, కాంట్రాక్టు ఉద్యోగాల పేరుతో మరో విధంగా దోచుకుంటున్నారు. అక్షరాస్యతలో వెనకబడి స్త్రీలు మెరుగైన ఉద్యోగాలు పొందలేక పోతున్నారు. అత్యంత దయనీయ స్థితిలో వ్యభిచారంలోకి నెట్టబడి ఎయిడ్స్‌కి కూడా బలవుతున్నారు.

అందుకే, 20వ శతాబ్దంలో మూడవ ప్రపంచ దేశాల్లో చెలరేగిన మహిళోద్యమాల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక అంశం ప్రత్యేకమైన రాజీలేని డిమాండ్‌గా మిగిలిందంటారు ఇందు అగ్నిహోత్రి. స్త్రీల సమానత్వం రాజకీయమైనది కావడంతో మార్పు కోసం సంఘటితమైన ఉద్యమాలను బలోపేతం చేయవలసిన అవసరం ఉందని ఆమె నొక్కి చెప్పింది.

స్త్రీలందరూ ఏదో ఒక రూపంలో వివక్షకి గురవుతూనే ఉన్నాగానీ, వారిలో కూడా వర్గాన్ని బట్టి పీడన రూపాలు మారుతాయి. అందుకే ప్రధానంగా మహిళల సమస్యలు ఒకటే అనిపించినా, వాటిలో ప్రత్యేకతలు ఉంటాయి. ప్రాధాన్యతలుంటాయి. ఇంటి చాకిరీ, పిల్లల పెంపకం అందరికీ ప్రతిబంధకాలే. రాజ్యం వాటికి హామీ కలిగిస్తే, స్త్రీలు ఉత్పత్తిలో ఎక్కువగా పాల్గొనగలుగుతారు. అలా వారు తమను తాము తెలుసుకుంటూ బంధనాలు తెంచుకోగలుగుతారు. సమాజంలో మార్పు కోసం ఏ ఉద్యమం జరిగినా, అందులో మహిళల భాగస్వామ్యం లేకపోతే అది అసంపూర్తిగానే మిగిలిపోతుంది. అయితే, వారి ప్రత్యేక సమస్యల కోసం ప్రత్యేక సంఘాలు అవసరం. ప్రత్యేక గళాలు అవసరం.

సామాజిక, ఆర్థిక పునాది లేని మహిళోద్యమం వర్గ దృక్పథాన్ని కోల్పోతే దీర్ఘకాలిక లక్ష్యాలు నీరుగారిపోయి, అది కొంతమంది పై వర్గాల స్త్రీల చేతుల్లో చిక్కుకుపోయే ప్రమాదం ఉంది. అందుకే, ఆయా వర్గాల పీడిత మహిళలకు ప్రత్యేక సంఘాలు అవసరం. ప్రత్యేక డిమాండ్స్ లేవనెత్తాలి. అప్పుడు ఏ డిమాండ్లకి ప్రాధాన్యతనివ్వాలి, ఏ మహిళపై మనం ప్రధానంగా కేంద్రీకరించాలి, ఎలాంటి నిర్మాణాలు చేపట్టాలి, ఎవరెవరితో చేతులు కలపాలి, ఎవరి మీదకి పోరాటాన్ని ఎక్కుపెట్టాలనే విషయాల మీద స్పష్టత ఏర్పడుతుంది.

సమాన అవకాశాలు కల్పించని వ్యవస్థని ప్రశ్నిస్తూ, దోపిడీ పీడనలని వ్యతిరేకిస్తూ, ఉత్పత్తిలో, సమాజాభివృద్ధిలో భాగస్వామ్యాన్ని కోరుతూ, త్యాగాలకి వెరవకుండా, ఒకవైపు పురుషస్వామ్యాన్ని ఎదిరిస్తూ, మరోవైపు దోపిడీపై కొరడా ఝుళిపిస్తూ నేటి స్త్రీ చైతన్యంతో పోటెత్తుతూ ఆదర్శంగా నిలుస్తోంది. దోపిడీ కారణాలను వెతుకుతూ, వివక్ష మూలాలను అన్వేషిస్తూ, ప్రశ్నలను సంధిస్తూ, ఛేదిస్తూ, అడుగడుగునా ముళ్ల బాటలను అధిగమిస్తూ తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంటోంది. జీవించే హక్కు కోసం, పరిపూర్ణమైన మనిషిగా జీవించే హక్కు కోసం తపన పడుతోంది. అందుకే ఆమె బాటకి అడ్డంగా ప్రతిబంధకాలు ఏర్పర్చకండి. ఆత్మస్థైర్యాన్ని పెంచుకుంటున్న మహిళలు ఇంకా ఎన్నో అడ్డంకులు దాటవలసి ఉంది. బానిస సంకెళ్లను సమూలంగా తెంచవలసి ఉంది.

మన దేశంలో మహిళోద్యమాన్ని కూలంకషంగా పరిశీలిస్తే, కొన్ని విషయాలు విశదమవుతాయి.

– స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయి కాబట్టి ప్రత్యేక నిర్మాణాలు, ఆందోళనా పద్ధతులు అవసరం. కార్మికవర్గ నాయకత్వం కింద పెద్ద ఎత్తున స్త్రీల సమీకరణ జరగాలి.

– మహిళా ఉద్యమం దానికదే ప్రజా ఉద్యమంగా పెంపొంది, సాధారణ ప్రజా ఉద్యమంలో భాగం కావాలి.

– విప్లవోద్యమం వేసిన ప్రతి అడుగు మహిళోద్యమాన్ని మరో అడుగు ముందుకు తీసుకుపోతుంది.

– స్త్రీలు లేకుండా నిజమైన ప్రజా ఉద్యమాలు ఉండలేవు. స్త్రీల సామాజిక విప్లవ చైతన్యాన్ని పెంచాలి.

– స్త్రీల స్థితిని మెరుగుపరచడానికి స్త్రీల తక్షణ సమస్యలను, తక్షణ డిమాండ్లను ముందుకు తీసుకురావాలి.

– పట్టణాలలో విద్యార్థులు, ప్రభుత్వోద్యోగులు, కార్మికులు మొదలైన వివిధ సెక్షన్లకు చెందిన మహిళలు సంఘటితం కావడంతో మహిళా సమస్యలు ముందుకొచ్చాయి. మహిళోద్యమం బలంగా పెంపొందింది.

– శ్రామిక మహిళలు విముక్తి కానిదే స్త్రీ విముక్తికి అర్థం లేదు.

మహిళల స్థితిగతులను అంచనా వేసే కమిటీని ప్రభుత్వం 1971లో ఏర్పరిచింది. ఆ కమిటీ 1975లో తన నివేదికని సమర్పించింది. 'సమానత్వం దిశగా' అనే ఈ నివేదిక ఎంతో కీలకమైన ప్రశ్నని లేవనెత్తింది – 'ఈ అసమానతలని కేవలం స్త్రీలలోనే తొలగించలేం. స్త్రీల విముక్తి కోసం, అభివృద్ధి కోసం జరిగే ఏ ఉద్యమమైనా, అమలయ్యే ఏ విధానమైనా తప్పనిసరిగా అన్ని అసమానతలను రూపు మాపాలి. అణచివేతకి దారితీసే అన్ని సామాజిక సంస్థలని రద్దు చేసే ఉద్యమంలో అవి భాగం కావాలి. అప్పుడు మాత్రమే, ఆ చర్యల వల్ల కలిగిన లాభాలు, అవకాశాలు, విజయాలు యావత్ మహిళా లోకానికి చేరతాయి. అవి కొద్ది మంది చేతుల్లో బందీ కాకుండా పోతాయి.'

అంటే మహిళలకు ప్రత్యేక సమస్యలున్నాగానీ, సమాజంలో ఒక భాగంగా వారు అన్ని సమస్యలపై స్పందించాలి. అందుకే, మహిళలు తమ ప్రత్యేక సమస్యలపై పోరాడుతూనే, పురుషులతో భుజం భుజం కలిపి సామాజిక, ఆర్థిక, రాజకీయ దురన్యాయాలన్నిటినీ దునుమాడ వలసి ఉంది. ఆకాశంలో సగంగా ఉన్న మహిళలు తాము కోల్పోయిన ఆకాశాన్ని తిరిగి పొందవలసి ఉంది. నేటి సమాజంలో దిగజారిపోతున్న జీవన స్థాయిని నిలబెట్టి ప్రపంచానికే ఆదర్శప్రాయంగా పోరాడవలసి ఉంది. ఈ బృహత్తర కార్యక్రమంలో విస్తృత స్థాయిలో సమీకరణ జరిపి అభివృద్ధికర శక్తులన్నిటినీ ఏకం చేయవలసిన మహత్తర కర్తవ్యం మన ముందుంది.

*(రచయిత శిశు వైద్యులు,*
*ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక నాయకులు)* వీ

# ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం

***తెలుగు సీమలో విప్లవ భావాల ప్రవేశం నాటి నుంచీ విప్లవోద్యమం సంఘటిత నిర్మాణంగా ఎదిగి, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను అమలు చేసేదాకా సాగి వచ్చిన చరిత్రను వివరిస్తున్నారు* వరవరరావు**

విప్లవం అంటే సమూలమైన మార్పు. వర్గ సమాజంలో దోపిడీ వ్యవస్థను కూల్చివేసి దాని స్థానంలో శ్రామికశక్తుల అధికారాన్ని నెలకొల్పేది విప్లవం. అది వర్గపోరాటం ద్వారా మాత్రమే సాధ్యమయ్యే మార్పు. వర్గ సమాజంలో అధికారంలో ఉన్న ఏ పాలకులైనా తమ శాసనాలను, పరిపాలనను, దోపిడీని జైళ్లు, చట్టాలు, కోర్టులు, పోలీసు, సైన్య బలగాల ద్వారానే అమలు చేస్తారు గనుక వారిని కూల్చివేయడానికి కూడా లేదా అధికారం నుంచి దించివేయడానికి కూడా సాయుధ పంథానే ఎంచుకోవాల్సి ఉంటుంది. ముఖ్యంగా ఉత్పత్తి శక్తులను, సాధనాలను తమ గుప్పిట పెట్టుకొని అణచివేత, పీడనల ద్వారా ఉత్పత్తి ఫలితాలను దోచుకునే, కొల్లగొట్టే దోపిడీవర్గాల విషయంలో, ఉత్పత్తిలో పాల్గొనే అశేష ప్రజానీకానికి మరొక ప్రత్యామ్నాయం లేదు. కనుక వర్గ సమాజంలో వర్గ పోరాటపు ప్రధాన పోరాట రూపం సాయుధ పోరాటమే. ఇది స్పార్టకస్ కాలం నుంచి ఇవ్వాల్టి దాకా చరిత్ర మళ్లీ మళ్లీ రుజువు చేసిన సత్యం. ప్యారిస్ కమ్యూన్ అయినా, బోల్షివిక్ విప్లవమైనా, చైనా విప్లవమైనా శ్రామికవర్గం (కమ్యూనార్డులు), కార్మికులు, రైతాంగం ప్రధాన చోదక శక్తిగా సాయుధంగా తిరుగబడిగానీ, దీర్ఘకాలిక పోరాటం ద్వారా గానీ సాధించిన విజయాలే. ఈ మూడింటినీ కమ్యూనిస్టు విప్లవాలుగా పేర్కొనవచ్చును. వీటిలో ప్యారిస్ కమ్యూన్ ఒక్కటి మార్క్స్, ఎంగెల్స్ జీవితకాలంలోనే జరిగి, ఆ ఇద్దరూ ప్రత్యక్షంగా పాల్గొన్నప్పటికీ, అప్పటికింకా ఉక్కుశిక్షణ గల శ్రామికవర్గ పార్టీ నిర్మాణం జరిగి, దాని నాయకత్వంలో కాకుండా కమ్యూనార్డులు బూర్జువా వర్గంపై తిరుగుబాటు చేసారు గనుక అది విజయవంతమైనా డెబ్బై రోజులు మాత్రమే అపూర్వంగా, ఉజ్వలంగా బతికి ఓడిపోయింది. జైళ్లు, పోలీసులు, దోపిడీలేని సంపూర్ణ మానవ వికాసం సాధ్యమయ్యే సమాజం ఎట్లా ఉంటుందో మాత్రం చవిచూపింది. మానవ జీవితంలోని బాల్యం వంటి ఆదిమ సమాజం నుంచి గతితార్కిక దృక్పథంతో మార్క్స్, ఎంగెల్స్ శాస్త్రీయంగా ఊహించిన చరిత్ర భౌతిక పరిణామం ఎలా ఉంటుందో రేఖా మాత్రంగా మన ముందు ప్యారిస్ కమ్యూన్ ఉంచింది. ప్యారిస్ కమ్యూన్ తిరుగుబాటుకు ఇంకా సర్వం సమాయత్తమైన సమయం రాలేదని మార్క్స్, ఎంగెల్స్ వారించినా కమ్యూనార్డులు ఫ్రెంచి బూర్జువా వర్గంతో యుద్ధంలో తలపడడంతో మార్క్స్, ఎంగెల్సులు కూడా అందులో పాల్గొన్నారు.

ప్రవాహంలో పాల్గొనకుండా ప్రవాహ గతిని మార్చలేం.

ప్యారిస్ కమ్యూన్ నుండి పాఠం తీసుకున్న లెనిన్ జారిస్టు రష్యాలో బోల్షివిక్ పార్టీని నిర్మాణం చేసి కార్మికవర్గాన్ని సంఘటితం చేసి జారిస్టు రష్యా జాతుల బందీఖానాలో ఉన్న జాతులన్నింటినీ స్వచ్ఛంద సంఘటనలోకి తెచ్చి 1917 ఫిబ్రవరిలో బూర్జువా విప్లవాన్ని, అక్టోబర్‌లో సామ్యవాద విప్లవాన్ని సుసాధ్యం చేసాడు. సెంట్ పీటర్స్‌బర్గ్ (లెనిన్ గ్రాడ్)లో ఏభై వేల మంది కార్మికులు సాధారణ సమ్మెకు పిలుపు ఇచ్చి జార్ చక్రవర్తి బలహీనమైన రాజ్యాన్ని కూల్చడానికి రంగంలో దూకారు. జార్ సైన్యంలోని గణనీయమైన సంఖ్య కూడా విప్లవ సైన్యంలో చేరింది. 1917 అక్టోబర్ నుంచి 1923 వరకు లెనిన్ నాయకత్వంలో, 1923 నుంచి 1953 వరకు స్టాలిన్ నాయకత్వంలో సోవియెట్ రష్యాలో సామ్యవాద ప్రయోగం జరిగి ప్రజలు 1930 సామ్రాజ్యవాద ఆర్థిక సంక్షోభానికి దూరంగా, రెండవ ప్రపంచ యుద్ధ ఫాసిస్టు ప్రమాదాన్ని నిలవరించి సుఖశాంతులు అనుభవించారు. రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ (జర్మనీ), ముసోలినీ (ఇటలీ), టోజో (జపాన్)ల నాజీజాన్ని, ఫాసిజాన్ని మట్టి కరిపించి, పాశ్చాత్య దేశాల నామమాత్రమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి, అంతకన్నా ముఖ్యంగా మూడో ప్రపంచ దేశాలను యూరప్ దేశాల వలస పాలన నుంచి విముక్తి చేయడానికి స్టాలిన్ నాయకత్వంలో సోవియెట్ రష్యా పాల్గొన్నది. బోల్షివిక్ విప్లవంలో కన్నా, రెండో ప్రపంచ యుద్ధంలోనే రష్యా తన ప్రియమైన రెండు కోట్ల ప్రజల ప్రాణాలను పణం పెట్టింది. ప్రపంచ చరిత్రలోనే ప్రజాస్వామ్యం కోసం చేసిన మహత్తర త్యాగంగా ఇది నిలిచి పోయింది.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత మావో సె టుంగ్ నాయకత్వంలో చైనా కమ్యూనిస్టు పార్టీ జపాన్ సామ్రాజ్యవాద దాడిని ఎదుర్కొని 1949 అక్టోబర్ 1న ప్రజా రిపబ్లిక్‌గా అవతరించింది. అయితే ఇది ఒక్క రోజులోనో, కొద్ది రోజులలోనో సుసాధ్యమైన విజయం కాదు. 1922లో చైనా కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి, గ్రామాల నుంచి నిర్మాణమవుతూ రెండు పంథాల మధ్య పోరాటాన్ని నిర్వహిస్తూ, మావో నాయకత్వం స్థిరపడిన తర్వాత గానీ సాధ్యమైంది కాదు. ఇందుకోసం ఏళ్లతరబడి, వేలమైళ్లు నడిచిన లాంగ్‌మార్చ్ రక్త తర్పణలు, విప్లవ భూ సంస్కరణ, ఐక్య సంఘటన, ఎర్రసైన్యం నిర్మాణాలు – 1935 తర్వాత దేశభక్తియుత శ్రేణులన్నిటినీ కూడగట్టి జపాన్ సామ్రాజ్యవాద దాడిని ఎదుర్కొనడం – చివరకు మానవహారంగా టాటూన్ నది వంతెన దాటి పెకింగ్‌లో స్థావర యుద్ధం చేసి గెలవడం దాకా ఇదంతా ఒక అరుణారుణ చరిత్ర. మూడు వేల సంవత్సరాల చైనా రైతాంగ పోరాటం చరిత్రను, సామ్రాజ్యవాద దశలో విప్లవాల చరిత్రను అధ్యయనం చేసి, విశ్లేషణ చేసి మావో సె టుంగ్ హూనాన్ ప్రాంతంలో భూ సంబంధాల

అధ్యయనం, పరిశీలన, విశ్లేషణ చేసి నూతన ప్రజాస్వామిక విప్లవం సిద్ధాంతాన్ని రచించాడు. వ్యవసాయ దేశాల్లో విప్లవం నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో ప్రవేశించి గానీ సామ్యవాదంలోకి అడుగిడ జాలదని గ్రహించాడు. నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో కార్మికవర్గ నాయకత్వంలో భూమిలేని నిరుపేద మొదలు, ధనిక రైతు వరకు, ఫ్యాక్టరీ కార్మికుడు మొదలు జాతీయ బూర్జువా వర్గం వరకు ఐక్య సంఘటనలో పాల్గొంటారని – కమ్యూనిస్టు పార్టీ, ఐక్య సంఘటన, ఎర్రసైన్యం ప్రజల చేతిలో మూడు మంత్ర దండాల వంటివని చెప్పాడు.

చైనా 1949 నుంచి 1956 వరకు నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో కొనసాగి 'ఒక పెద్ద గెంతు' (గ్రేట్ లీప్ ఫార్వర్డ్)తో 1956లో సామ్యవాద దశలోకి ప్రవేశించింది. సరిగ్గా 1956లోనే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక సైద్ధాంతిక ఘర్షణ, చర్చ, చీలిక వచ్చింది. 1956లో రష్యాలో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ సమావేశంలో కృశ్చేవ్ వర్గ సామరస్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ఇంచు మించు చైనాతో పాటే ఇండియాలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ (1945)లో లాహోర్, మీరట్, కాకోరీ వంటి ప్రాంతాల్లో తిరుగుబాట్లు, పున్నప్రావాయిలార్, మలబార్ (ఇప్పటి కేరళలో) వంటి చోట్ల రైతాంగ పోరాటాలు, బెంగాల్‌లో తెభాగా పోరాటం (పండిన పంటలో మూడో వంతు మాత్రమే భూస్వామికీ, రెండు వంతులు కౌలుదారుకు చెందాలనే డిమాండ్) నిర్వహించినప్పటికీ, కలకత్తా, బొంబాయి వంటి మహానగరాల్లో నావికా తిరుగుబాటు మొదలు, బట్టల మిల్లుల కార్మికుల వరకు ఎన్నో మిలిటెంట్ పోరాటాలు నిర్వహించినప్పటికీ వర్గ పోరాటమనదగింది తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటమే.

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాన్ని (1946–51) సాయుధ పోరాటమని, విముక్తి పోరాటమని చెప్పుకున్నంతగా నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీగానీ, సుందరయ్య గారితో సహా చరిత్ర రచయితలుగానీ విప్లవంగా అభివర్ణించలేదు. విప్లవం కాదగిన వర్గపోరాట అంశాలు (ఇన్‌గ్రెడియెంట్స్), శక్తి (పొటెన్షియల్) అన్నీ అందులో ఉన్నాయి. చైనాలో నిర్మాణమైనంత పటిష్టంగా తెలంగాణ లోనూ (హైదరాబాద్ రాష్ట్రంలో అని కూడా అనవచ్చు) ఆంధ్ర మహాసభ పేరుతో ఐక్య సంఘటన 1930 నాటికి బలంగా ఏర్పడింది. అందులో నీళ్లలో చేపవలె కమ్యూనిస్టు పార్టీ 1944 దాకా కూడా పనిచేయగలిగింది. కొద్దిమంది విద్యావంతులు తెలుగుభాష స్వీయ గౌరవం కోసం ప్రారంభించిన ఉద్యమాన్ని గ్రామ స్థాయిలో వెట్టి చాకిరీ రద్దయి – దున్నే వారికి భూమి దక్కాలనే పోరాటం దాకా తీసుకపో గలిగారు. అట్టడుగు స్థాయిలో వ్యవసాయ కూలీలను, భూమిలేని నిరుపేదలను కూడగట్టి సంగాలు పెట్టి, గుత్పల సంగాలు పెట్టి సుత్తీ కొడవలి ఎర్ర జెండా నాయకత్వంలో మూడు వేల గ్రామాల్లో పది లక్షల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకున్నారు. ప్రజలకు బీజ ప్రాయంలో ఎర్రరాజ్యాన్ని చవిచూపారు. ఢిల్లీలో 1947 ఆగస్ట్ 15న అధికార మార్పిడి జరిగి ఏర్పడిన నెహ్రూ–పటేల్ ప్రభుత్వం 1947 నవంబర్‌లో నిజాం రాజుతో యథాతథ ఒడంబడిక చేసుకున్న తర్వాత 1948 సెప్టెంబర్ 11న సాయుధ పోరాటం చేపట్టి 1951 నవంబర్ దాకా తమ విజయాలను, తమ స్వాధీనంలో ఉన్న భూమిని ప్రజల పరంగా సంరక్షించుకోవడానికి ప్రాణాలు పణంగా పెట్టి పోరాడారు.

అయినా 1951 దాకా భారతదేశ కమ్యూనిస్టు పార్టీ చరిత్రగా, ప్రపంచమే తలతిప్పి చూసిన ఉజ్వలమైన తెలంగాణ పోరాటంలో మనకు సాయుధ పోరాటం, విముక్తి అనే మాటలు కనిపించినంత ప్రబలంగా విప్లవం అనే మాట కనిపించదు. ఇది యాదృచ్ఛికమా – సైద్ధాంతిక పరిమితియా?

1951లో సాయుధ పోరాట విరమణ తర్వాత కమ్యూనిస్టు పార్టీ తన నాయకత్వంలో స్వాధీనం చేసుకున్న భూములను తిరిగి భూస్వాములకు అప్పగించింది. ఆయుధాలనూ నెహ్రూ ప్రభుత్వానికి అప్పగించింది. అప్పటిదాకా అజ్ఞాతంలో ఉన్న కమ్యూనిస్టులు (గెరిల్లాలు అనే మాట కూడా అంత ప్రచారంలో ఉన్నట్లు లేదు), పూర్తికాలపు విప్లవకారులు సాధారణ జీవితంలోకి 1952 సాధారణ ఎన్నికల వరకు వచ్చేసారు. 1952 ఎన్నికల్లో పాల్గొన్నారు. మళ్లీ అవిభక్త కమ్యూనిస్టు పార్టీ నుంచి గానీ 1964లో ఏర్పడిన సిపిఐ (ఎం) నుంచి గానీ కొంతమంది విప్లవ శ్రేణులు తప్ప – పార్టీలు గానే ఆ రెండూ ఇప్పటికీ పార్లమెంటరీ పంథానే అంటిపెట్టుకొని ఉన్నవి.

కనుక 1956లో కృశ్చేవ్ ప్రతిపాదించిన వర్గ సామరస్య సిద్ధాంతం 'తొందరపడి ఒక కోకిల ముందే కూసి'నట్లుగా అవిభక్త, కమ్యూనిస్టు పార్టీ మన దేశంలో 1951లోనే ప్రతిపాదించింది. 1952 నుంచి అమలవుతున్నది. షహీద్ భగత్‌సింగ్ ప్రతిపాదించిన కార్మిక, కర్షక రాజ్యం గానీ, ఇన్‌ఖ్విలాబ్ నినాదంగానీ, ఇది సాధించడానికి నిర్మించిన హిందుస్థాన్ ఫౌజ్, నవజవాన్ భారత్ సభ వంటి విప్లవ నిర్మాణాల గురించి కమ్యూనిస్టు పార్టీ ఎందుకు ప్రయత్నించలేదు? తిలక్ గోఖలేల కాలం నుంచి తిలక్–గాంధీలు, గాంధీ–నెహ్రూలు, ఇందిరా–మొరార్జీలు, కేంద్రంలో సోనియా గాంధీ దాకా, రాష్ట్రంలో ఎన్టీఆర్, చంద్రబాబు, వై.ఎస్.ఆర్.ల దాకా అధికార పార్టీల్లోని ప్రగతిశీల శక్తులతో పొత్తుల గురించి ఆలోచించినంతగా 52 నుంచి కమ్యూనిస్టు పార్టీలు తమ నాయకత్వంలో కార్మికవర్గాన్ని అధికారంలోకి తేవడానికి ప్రయత్నించలేదు అంటే పార్లమెంటరీ రాజకీయాలకు పరిమితమయ్యాయి.

1946లో 'చైనా మార్గమే మన మార్గమని' స్ఫురించినప్పటికీ 'దున్నేవారికే భూమి' నినాదమిచ్చి భూస్వాధీనం చేసుకున్నప్పటికీ మనది కూడా నూతన ప్రజాస్వామిక విప్లవ పంథా కావాలని, పోరాట శ్రేణుల విప్లవాచరణ అదేనని నాయకత్వానికి చైతన్యపూర్వకంగా అర్థం కాలేదు. అంటే వాళ్లందుకు సిద్ధంగా లేరు. అందుకే అది విప్లవం కాలేకపోయింది.

విప్లవం పోరాటంలో పాల్గొనే శక్తులను – విప్లవకర వర్గాలను రాజ్యాధికారానికి తేవాలి. విప్లవమంటే కేవలం 'దున్నే వారికే భూమి' అనే ఆర్థిక పోరాటం కాదు.

మరొకవైపు 1947లో ఢిల్లీలో అధికారానికి వచ్చిన బూర్జువా వర్గం దేశవ్యాప్తంగా గానీ, 48 సెప్టెంబర్ సైనిక ఆక్రమణ తర్వాత తెలంగాణలో గానీ చేపట్టినవన్నీ సంస్కరణలే. పేర్లు ఏమైనా కావచ్చు. సామ్యవాద నమూనా సమాజం పేరుతో పంచవర్ష ప్రణాళికలు, సహకార వ్యవసాయం మొదలు గరిబీ హటావో, రాజభరణాల రద్దు, బ్యాంకుల జాతీయాకరణ– వంటి ఎన్ని ఆకర్షణీయమైన నినాదాలు, కార్యక్రమాలైనా

కావచ్చు. హైదరాబాద్ రాష్ట్రంలో జమీందారీ, జాగీర్దారీ రద్దు, రక్షిత కౌల్దారీ చట్టం వంటి ఎన్ని భూసంస్కరణలైనా కావచ్చు. అవన్నీ రైతాంగ పోరాటాలను చల్లార్చే దళారీ బూర్జువా ఎత్తుగడలే, సంస్కరణలే. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికి, 64 తర్వాత సిపిఐలోకి వెళ్లిన వాళ్లందరికీ నెహ్రూ సామ్యవాది అనే భ్రమలు 47 నాటికే ప్రారంభమైనట్లున్నాయి. ఇంక కిషన్ డాక్యుమెంట్ పేరుతో సాయుధ పోరాట నాయకుడే నెహ్రూ ప్రభుత్వానికి అనుకూలంగా వెలిబుచ్చిన అభిప్రాయాల గురించి వివరంగా రాయనక్కర్లేదు.

కార్మిక వర్గ పోరాటానికి నాయకత్వం వహించవలసిన అగ్రగామి పార్టీలో వర్గ దృష్టి లోపిస్తే వచ్చే ప్రమాదం ఎటువంటిదో మనం ఇటీవల నేపాల్ ఉదాహరణ నుంచి కూడా అర్థం చేసుకోవచ్చు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం అనుభవం ఉన్నవాళ్లకు ఇప్పుడు నేపాల్ ప్రయోగం చరిత్ర మరొకసారి విషాదంగా పునరుక్తి కావడంగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు. తెలంగాణలో నైజాం వ్యతిరేకత, నెహ్రూ అనుకూలత, నేపాల్‌లో రాజు వ్యతిరేకత, ఇండియా ప్రభుత్వం అనుకూలత నూతన ప్రజాస్వామిక విప్లవ విఘాతానికి దారితీసాయి. రెండూ సముద్ర తీరం లేని ప్రాంతాలు. సైనిక వ్యూహానికి, పొరుగు దేశాల సహాయానికి భౌగోళికంగా సమస్యాత్మకమైనవి. రెండూ వేగవంతంగా పురోగమించినవి. అయితే నేపాల్‌లో మావోయిస్టు పార్టీ కూడా దీర్ఘకాలిక సాయుధ పోరాటమూ, సాయుధ తిరుగుబాటు – రెండూ సమన్వయించి ప్రచండ ఆలోచనను జోడించి దక్షిణాసియాకే ఒక నమూనా అయినానని చెప్పుకున్న పార్టీ సాయుధ పోరాట విరమణ చేయడమే కాకుండా, ఆయుధాలన్నీ ఐక్యరాజ్య సమితి పర్యవేక్షణలో పెట్టి, ప్రజా గెరిల్లా సైన్యాన్ని రెగ్యులర్ సైన్యంలో కలిపి బహుశా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పోవడమనేది పదకొండేళ్లలోనే గెంతులుగా పురోగమించిన పోరాటానికి అశనిపాతమయిపోయింది.

నూతన ప్రజాస్వామిక విప్లవ కార్యక్రమం రాచరికం రద్దు కావడం దగ్గర ఆగేది కాదు గదా. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటించక పోవచ్చు. కానీ విముక్తి గురించి మాట్లాడింది, భూస్వాధీన కార్యక్రమం పెద్ద ఎత్తున చేపట్టింది. ఎర్రరాజ్యాన్ని బీజప్రాయంలో చవి చూసింది కూడ. కనుక సమస్య రాజ్యాధికారంపై దృష్టి లేకపోవడం, కార్మిక వర్గ అగ్రగామి పార్టీ లక్ష్యం రాజ్యాధికారం 'సీజింగ్ ది పవర్' చేపట్టడం కావాలి.

ఆ స్పష్టత నక్సల్బరీ 1967లో ఇచ్చింది. నక్సల్బరీ వసంత మేఘగర్జన తర్వాత ఏర్పడిన సిపిఐ (మార్క్సిస్ట్ – లెనినిస్ట్) ఒక సుదీర్ఘమైన ప్రజాస్వామిక విప్లవం గురించి మాట్లాడింది. 1857లో ప్రారంభమైన ప్రజాస్వామిక విప్లవం అప్పటికి నూటా పది ఏళ్లయినా అసంపూర్తిగానే ఉందని చెప్పింది. నూతన ప్రజాస్వామిక విప్లవం ద్వారానే దానిని పరిపూర్తి చేయమన్నది.

నక్సల్బరీ విస్ఫోటనం కన్నా ముందే చారు మజుందార్ తెరాయి దస్తావేజుల పేరున ఎనిమిది దస్తావేజులు రాసాడు. అందులో చాల సులభంగా సూటిగా విప్లవం అంటే ఏమిటో విప్లవ శక్తుల కార్యక్రమం ఏమిటో నిర్వచించాడు. 1) భూస్వాధీనం అనే రైతాంగ పోరాటం; 2) స్వాధీనం చేసుకున్న భూములను భూస్వాముల గూండాల నుంచి, పోలీసుల నుంచి కాపాడుకోవడానికి గెరిల్లా పోరాటమనే సైనిక కార్యక్రమం; 3) ఈ ఆర్థిక, సైనిక ఫలితాలను అనుభవించడానికి ప్రజల చేతికి అధికారం (ఆల్ పవర్స్ టు పీపుల్) అనే రాజకీయ పోరాటం తెరాయి దస్తావేజులు ప్రతిపాదించాయి. సోవియెట్ రష్యాలో అన్ని అధికారాలు సోవియెట్లకే, జన చైనాలో అన్ని అధికారాలు కమ్యూన్‌లకే అన్న విధంగా ప్రజల చేతికి రాజ్యాధికారం గురించి చారు మజుందార్ ఒక దార్శనికతతో కూడా కార్యక్రమమిచ్చాడు.

1966 నాటికి ప్రపంచంలోనూ, దేశంలోనూ సంస్కరణల యుగం ముగిసింది. సంక్షేమ రాజ్యాల నామమాత్రపు పట్టు కూడా తరిగిపోతూ అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్ – ఐఎంఎఫ్), ప్రపంచ బ్యాంకు పట్టు పెరగడం ప్రారంభమైంది. కృశ్చేవ్ 1956లో ప్రతిపాదించిన శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ, శాంతియుత సహజీవనం సిద్ధాంతం వల్ల అమెరికన్ సామ్రాజ్యవాద మార్కెట్‌కు, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాద మార్కెట్‌కు పోటీ తీవ్రతరమైంది. కాని, అదే కాలానికి ఈ సిద్ధాంతానికి వ్యతిరేకంగా మావో నాయకత్వంలో ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టు శిబిరంలో సాగిన మహత్తర చర్చ (గ్రేట్ డిబేట్) ముగిసి సమాజంలో వర్గాలు ఉన్నంత కాలం వర్గపోరాటం ఉంటుందని తేల్చివేసింది. దాని వ్యక్తీకరణగానే చైనాలో శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం వచ్చింది. ఇది ప్రపంచ విప్లవాలలో మూడవ విప్లవంగా చారు మజుందార్ అభివర్ణించాడు. ఈ శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం మార్క్సిజం – లెనినిజానికి సైద్ధాంతిక స్థాయిలోనూ, వర్గపోరాట ఆచరణలోనూ సృజనాత్మకమైన అంశాలను చాలావాటిని చేర్చింది. ఆలోచించడానికి సాహసించడం, ఏటికి ఏదురీదడం, కుట్రలూ, కుహకాలూ చేయకుండా పారదర్శకంగా ఉండడం విప్లవకారులు పాటించవలసిన ఆచరణగా చైనా కమ్యూనిస్టు పార్టీ పదో కాంగ్రెస్ ప్రతిపాదించింది. రెండు పంథాల మధ్య పోరాటం అన్నప్పుడే రెండోది వర్గేతర పంథా అయి ఉంటుందనీ, వర్గ సమాజంలో వర్గపోరాటం మరెక్కడో కాదు కమ్యూనిస్టు పార్టీలో రెండు పంథాల మధ్యన పోరాటంగా కూడా ప్రతిఫలిస్తుందనీ మావో సాహసంగా ప్రతిపాదించాడు. వాస్తవానికి రష్యాలో మెన్షివిక్‌లతో బోల్షివిక్‌లు చేసిన పోరాటం అటువంటిదే. చైనాలో హూనాన్ రైతాంగ పోరాటం గానీ, తిరిగి 1966లో, 1973లో శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవంలో గానీ మావో చేసిన పోరాటం అటువంటిదే. అంతమాత్రమే కావు, ఈ వ్యవస్థ మీద పోరాడుతూ తన మీద తాను చేసుకునే పోరాటంగా నిరంతరం తనలోని వర్గేతర భావజాలంతో చేసే పోరాటంగా కూడా మావో దీన్ని గుర్తించాడు. అందుకే ఇదివరకు ఎప్పుడూ లేనంతగా శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవంలో పునాది ఉపరి తలాల, పరస్పర ప్రభావాల చర్చ చాలా జరిగింది. పేరులోనే ఉన్నట్టుగా పునాది అయిన శ్రామికవర్గం చేసే ఉత్పత్తి సంబంధాల పోరాటం మీద సాంస్కృతిక విప్లవ ప్రభావం ఇది ముందుకు తెచ్చింది. ఈ విప్లవం నుంచి 'గేటు దాటి నూతన మానవావిష్కరణ జరగాలని' మావో ఆశించాడు. నక్సల్బరీ పోరాటంలో చారు మజుందార్ కూడా ఈ నూతన మానవావిష్కరణ గురించి మాట్లాడాడు. విప్లవం సమూలంగా వ్యవస్థను మాత్రమే మార్చదు, ఈ

వర్గ సమాజంలోని మనిషిని కూడా సమూలంగా మార్చి, నూతన మానవావిష్కరణ చేస్తుంది. శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం ప్రభావంలో నక్సల్బరీ పంథా మన ముందు ఈ స్పష్టమైన విప్లవ అవగాహనను ఉంచింది. ఈ నేపథ్యం నుంచి మన దేశంలో విప్లవోద్యమ చరిత్రను విహంగ దృష్టితో చూద్దాం.

పైననే పేర్కొన్నట్లుగా 1950లో భారత రాజ్యాంగం గణతంత్ర సమాఖ్యగా ఆచరణలోకి వచ్చి తనది లౌకిక ప్రజాస్వామిక స్వభావమని నిర్వచించుకొని, సామ్యవాదం లక్ష్యంగానూ, సైంటిఫిక్ టెంపర్ కలిగిందిగానూ చెప్పుకున్నప్పటికీ ఆచరణలో అది సామ్రాజ్యవాద దళారీ పాత్రనే నిర్వహించింది. మిశ్రమ ఆర్థిక విధానం, ప్రైవేట్ రంగంలో అమెరికా, యూరోపియన్ సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడులు, పబ్లిక్ రంగంలో సోవియట్ రష్యా పెట్టుబడులు, తటస్థ విధానం పేరుతో రెండు సామ్రాజ్యవాదాలతో ఒక దళారీగా బేరమాడడం ఈ విధానాలను నెహ్రూ 1964 దాకా నిర్వర్తించాడు. ఇందిరాగాంధీ అధికారంలోకి వచ్చి 1967 నాటికి నినాదాలు ఏమిచ్చినప్పటికీ అన్ని రకాల పార్లమెంటరీ సంస్కరణలు ముగిసినవి. 1948లో ఇంకా రాజ్యాంగం, రిపబ్లిక్, పార్లమెంట్ ఏవీ అవతరించకముందే నెహ్రూ ప్రభుత్వం హైదరాబాద్ సంస్థానంపై సైనిక దాడి చేసినట్టుగా 1967లో ఇందిరాగాంధీ బెంగాల్‌లో నక్సల్బరీ ఉద్యమాన్ని అణచడానికి కేంద్ర అర్ధసైనిక బలగాలను పంపించింది. ఒకవైపు నెహ్రూ కుటుంబ పరిపాలనపై కాంగ్రెస్ పార్టీ నుంచీ, ఇతర బూర్జువా పార్టీల నుంచీ ప్రముఖులు కొందరు ఒకటై కాంగ్రెసేతర పార్టీలుగా 1967 ఎన్నికల్లో పోటీచేసి తొమ్మిది రాష్ట్రాల్లో అధికారానికి వచ్చారు. అదే ఎన్నికల్లో బెంగాల్‌లో కాంగ్రెస్ నుంచి బయటికి వచ్చి బంగ్లా కాంగ్రెస్ ఏర్పరిచిన అజయ్ ముఖర్జీతో పొత్తు పెట్టుకొని లెఫ్ట్ ఫ్రంట్ అధికారానికి వచ్చింది. హోంమంత్రిగా, ఉప ముఖ్యమంత్రిగా జ్యోతిబసు నక్సల్బరీ ఉద్యమాన్ని నెత్తురుటేర్లలో ముంచాడు. అప్పటికి చారుమజుందార్ సిపిఐ (ఎం)లోనే డార్జిలింగ్ జిల్లా సిలిగురి డివిజన్ కార్యదర్శి. లెఫ్ట్‌ఫ్రంట్ అధికారంలోకి వస్తే జోతేదార్ల దురాక్రమణలో ఉన్న ఆరు లక్షల హెక్టార్ల భూమిని భూమిలేని నిరుపేదలకు పంచుదామన్న ఎన్నికల వాగ్దానాన్ని చారు మజుందార్ తెరాయ్ దస్తావేజుల ఆచరణకు మలుచుకొని నక్సల్బరీలో సంతాల్ ఆదివాసి రైతాంగాన్ని విప్లవంలోకి దించాడు.

ఒక స్పష్టమైన విప్లవ లక్ష్యంతో ప్రారంభమైన ఈ నక్సల్బరీ పోరాటం 1969లో సిపిఐ (ఎంఎల్)గా ఏర్పడి తన లక్ష్య ప్రకటన చేసింది. భారత దేశ వ్యవస్థ అర్ధ వలస, అర్ధ భూస్వామ్య, దళారీ నిరంకుశ వ్యవస్థ అని, దీనిని దీర్ఘకాలిక వ్యవసాయ విప్లవం ద్వారా ఓడించి, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించాలని, ఈ పోరాటమంతా సాయుధ పోరాటం ప్రధానంగా ఉంటుందని, దున్నే వారికే భూమి నినాదంతో కొనసాగుతుందని, ఈ పోరాటం నడిపించే సైద్ధాంతిక దార్శనికత మార్క్సిజం – లెనినిజం – మావో ఆలోచనా విధానం అని ప్రకటించింది. పదహారేళ్ల రివిజనిజం, పార్లమెంటరీ రాజకీయాల మీద తిరుగుబాటుగా వచ్చింది గనుక సహజంగానే ఇందులో కొన్ని అతివాద నినాదాలూ, నిర్వచనాలూ చోటు చేసుకున్నాయి. సాయుధ పోరాటం ఏకైక మార్గంగానూ, వర్గ శత్రువు నిర్మూలనే తొలి దశలో సాయుధ పోరాటానికి ప్రత్యామ్నాయ రూపం గానూ భావించిన సందర్భాలూ ఉండవచ్చు. ట్రేడ్ యూనియనిజం మీది అసహ్యం ట్రేడ్ యూనియన్‌ల మీదా, బహిరంగ కార్యకలాపాల మీదా వ్యక్తం కావచ్చు. చైనా యుద్ధకాలంలోనూ, పాకిస్తాన్‌తో యుద్ధ సందర్భాలలోనూ దేశంలో రెచ్చగొట్టబడిన కుహనా దేశభక్తిని అంతర్జాతీయ శ్రామిక వర్గ దృక్పథంతో తోసిరాజేసిన సందర్భంలో చైనా చైర్మన్ మన చైర్మన్ అనడం వంటి సూత్రీకరణ కూడా కావచ్చు. కానీ, విగ్రహ విధ్వంసన అనేది అప్పటివరకు మనకు ఇవ్వబడిన విలువలను ప్రశ్నించే ఒక సమూలమైన పోరాట అవగాహనను ఇచ్చింది. నక్సల్బరీ పోరాటం నిప్పురవ్వ వలె దేశమంతా విస్తరించి, ముఖ్యంగా మొదట శ్రీకాకుళం, వైనాడ్ వంటి ఆదివాసి రైతాంగంలో క్రమంగా గోదావరి లోయ, యుపిలో ముషాహరీ, బీహార్‌లో భోజ్‌పూర్, పంజాబ్‌ల వరకు కూడా విస్తరించింది. ఇదే కాలంలో బెంగాల్, బీహార్‌లలో కన్హయ్ ఛట్టర్జీ నాయకత్వంలో మావోయిస్ట్ – కమ్యూనిస్ట్ సెంటర్ ఏర్పడి జెహనాబాద్, గయా ప్రాంతాలలో విప్లవ నిర్మాణం చేసింది.

శ్రీకాకుళం సవరలు, జాతాపులు నివసించే ఆదివాసి ప్రాంతం. తూర్పు సముద్ర తీరం. అప్పటికే అక్కడ ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసంలు 1964లో సిపిఐ నుంచి వేర్పడి సిపిఐ(ఎం) ఏర్పడినప్పుడు అందులో చేరి సిపిఎం వర్గపోరాటం చేయడానికే ఏర్పడిందనే ఆశలతో గిరిజన సంఘాలు స్థాపించి ఆదివాసుల మధ్య పనిచేయడం ప్రారంభించారు. క్రమంగా 1967 నవంబర్ నాటికి పోరాట చైతన్యం పెరిగిన కొద్దీ గిరిజన సహకార సంఘాలుగా, సంఘర్షణ సమితిలుగా రూపొందినవి. నక్సల్బరీ విస్ఫోటనంతో అదే సరైన పంథా అని భావించి ఆ వెలుగులో శ్రీకాకుళంలో మొండెంఖల్లులో జిల్లా గిరిజన రైతు కూలీ సంఘం సభలు నిర్వహించాలనుకున్నప్పుడు అక్టోబర్ 31, 1967న సభ తలపెట్టగా, ఆ సభకు వస్తున్న ఆదివాసులపై లేవిడి అనే గ్రామం వద్ద దారికాచి, మేడిద సత్యం అనే భూస్వామి కాల్పులు జరిపాడు. ఈ అక్టోబర్ 31 సంఘటన శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటానికి దారితీసింది. ఆ నవంబర్ నెలలోనే ఉద్దానంలోని గరుడభద్ర ప్రాంతంలో సాయుధ పోరాటం ప్రారంభమైంది. ఇదే 1972 నాటికే అటు నక్సల్బరీలోనూ, ఇటు శ్రీకాకుళంలోనూ తీవ్రమైనటువంటి రాజ్యహింస, అణచివేత, కల్లోలిత ప్రాంతాల ప్రకటన, పోలీసు క్యాంపులు, ఎన్‌కౌంటర్‌లతో ఉద్యమం సెట్‌బ్యాక్‌కు గురైంది. ఈ విప్లవంలోని తొలి దశలో ఖతం అనే పోరాట రూపం ముందుకువచ్చింది. కానీ, నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యంగా ప్రకటించుకున్న ఈ విప్లవం ఒకవైపు బహిరంగ కార్యకలాపాలు వద్దని అనుకున్నప్పటికీ, 1970 జూలై నాటికే విప్లవ రచయితల సంఘం వంటి సంస్థ, 1972 నాటికి జననాట్య మండలి వంటి కళా సాంస్కృతిక నిర్మాణాలు కూడా ఏర్పడినవి. ఈ పోరాటాలు భూస్వాధీనం, వడ్డీ కాయితాలు తగలబెట్టడం, ఆదివాసులు పోడు చేసుకుంటున్న భూముల నుంచి భూస్వాములను తరిమెయ్యడంతోపాటు వర్గశత్రువుల ఖతం కార్యక్రమాలుగా కొనసాగినవి. 1974లో ఈ సెట్‌బ్యాక్ కారణాలను సమీక్షించుకొని, దీర్ఘకాలిక పోరాటంగా చెప్పుకొన్నది. ఆచరణలో సత్వర యుద్ధంగా అమలు చేయడానికి అమలు

చేశారని, శ్రీకాకుళం యేనాన్‌గా విముక్తమైందని, యాభై వేల భారత సైన్యాలైనా శ్రీకాకుళాన్ని ఏమీ చేయలేవని, మన పవిత్రమైన కోరికలే ఈ పోరాటానికి ఆపాదించడం వల్ల దెబ్బతిన్నామని స్వీయ విమర్శ చేసుకొని ప్రజాపంథాను అమలు చేయాలని తీర్మానించుకున్నది. 1976లో నాగ్‌పూర్‌లో జరిగిన తెలంగాణ రీజినల్ కమిటీ 'రోడ్ టు రెవల్యూషన్' (విప్లవానికి బాట) అనే పోరాట పంథాను రూపొందించు కొని, అందులో ఇతర మార్క్సిస్ట్ – లెనినిస్ట్ పార్టీలు కలిసి పనిచేసే ప్రతిపాదన కూడా చేసి అప్పటికే ప్రకటించబడిన ఎమర్జెన్సీలో గ్రామ స్థాయికి వెళ్లి భూసంబంధాలను పరిశీలించే కార్యక్రమాన్ని తీసుకున్నది.

1974లో రూపొందించుకున్న స్వీయ విమర్శ వెలుగులో ప్రజాసంఘాలను ఏర్పాటు చేయాలనే నిర్ణయంతో 1974 అక్టోబర్‌లోనే 'రాడికల్ విద్యార్థి సంఘా'న్ని ఏర్పాటు చేసుకొని 1975 ఫిబ్రవరిలో ప్రథమ మహాసభలు కూడా నిర్వహించుకున్నది. మూడు నెలలకే వచ్చిన ఎమర్జెన్సీలో దీని నాయకత్వం కొందరు అరెస్టు కాగా, మిగిలిన వారందరూ అజ్ఞాత జీవితానికి వెళ్లి, ఎమర్జెన్సీ కాలమంతా కూడా చైనాలో హూనాన్ ప్రాంతంలో వలె తెలంగాణలో గ్రామ అధ్యయనం చేశారు. 1975లోనే గుంటూరులో రాడికల్ యువజన సంఘాన్ని కూడా ఏర్పాటు చేయాలని ప్రయత్నం చేసి చెరుకుపల్లి పోలీసు స్టేషన్‌పై మహదేవ్ ముఖర్జీ గ్రూప్ చేసిన దాడివల్ల పోలీసులు సభల ప్రచారానికి అంతరాయం కలిగించడంతో వాయిదా పడింది. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత 1978 ఫిబ్రవరిలో రాడికల్ విద్యార్థి సంఘం రెండవ మహాసభలు వరంగల్‌లో జరిగి, విద్యార్థులకు 'గ్రామాలకు తరలండి' అని పిలుపునిచ్చాయి. ఇదే సంవత్సరం మే నెలలో గుంటూరులో జరిగిన రాడికల్ యువజన సంఘం ప్రథమ మహాసభలు కూడా ఈ పిలుపును అందుకున్నాయి.

అట్లా 1978 ఎండాకాలం సెలవుల్లో విద్యార్థి యువజనులు, జననాట్య మండలి, విరసం గ్రామాలకు తరలివెళ్లి చేపట్టిన ప్రచారంతో రైతుకూలీ సంఘాలు ఏర్పడి పెద్ద ఎత్తున భూస్వాధీన కార్యక్రమం ప్రారంభమైంది. అప్పటికి ఒక అనంతపురం జిల్లాలో మాత్రమే ఎమర్జెన్సీకి ముందే పరిటాల శ్రీరాములు పద్దెనిమిది గ్రామాలలో రైతుకూలీ సంఘాలు ఏర్పాటు చేసినాడు. 1978 సెప్టెంబర్ నాటికి ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల్లో ఆసిఫాబాద్ మొదలు హుజూరాబాద్ దాకా 150 గ్రామాల్లో సిపిఐ (ఎంఎల్) నాయకత్వంలో భూమిలేని నిరుపేదలు, వ్యవసాయ కూలీలు భూస్వాముల దురాక్రమణ లో ఉన్న లేదా, ప్రభుత్వ భూములుగా ఉన్న పంచరాయి, పొరంబోకు భూములను స్వాధీనం చేసుకొని, వాటిలో ఎర్రజెండాలు పాతి సెప్టెంబర్ 8న 'జగిత్యాల జైత్రయాత్ర' పేరుతో నిర్వహించిన మహాసభకు తరలి వచ్చారు. ఈ దశ ఇంకా 1973లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసిన భూసంస్కరణ లను అమలు చేయాలని డిమాండ్ చేసిన దశే. ప్రతి కుటుంబానికి 54 ఎకరాల కుష్కి (ఆరు ఎకరాల తరి, పద్దెనిమిది ఎకరాల కుష్కి)కి మించి ఉండరాదని, ఆ పైన మిగులు భూమి అంతా స్వాధీనం చేసుకోవాలని. అట్లా స్వాధీనం చేసుకున్న భూములపై పట్టాలివ్వాలని అక్కడికి వచ్చిన నలభై వేల మంది ప్రజలు పార్టీ కార్యదర్శి ముక్కు సుబ్బారెడ్డికి దరఖాస్తు చేసుకున్నారు. కరీంనగర్ కలెక్టర్ భూసంస్కరణలను యుద్ధ ప్రాతిపదికన అమలు చెయ్యాలని ఉత్తర్వులు జారీ చేయాల్సి వచ్చింది.

ఈ జగిత్యాల జైత్రయాత్రలో రూపొందిన విప్లవ ఆచరణయే 1980లో ఏర్పడిన సిపిఐ (ఎంఎల్ – పీపుల్స్‌వార్) కొనసాగించిన ప్రజాపంథా. జగిత్యాల జైత్రయాత్ర తరువాత జగిత్యాల, సిరిసిల్లలను రక్తపుటేరులలో ముంచి, కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి, పోలీసు క్యాంపులు పెట్టినప్పటికీ నక్సల్బరీ, శ్రీకాకుళాల వలె దెబ్బతినకుండా ఈ పోరాటం విస్తరించింది. ఇది ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ పోరాటంగా, ఉత్తర తెలంగాణ రైతాంగ పోరాటంగా కూడా విస్తరించింది. 1980లో పీపుల్స్‌వార్‌గా ఏర్పడిన తరువాత దండకారణ్య పర్‌స్పెక్టివ్ రచించి సిరోంచ, గడ్‌చిరోలిలోకి, బస్తర్‌లోకి ఉద్యమ నిర్మాణానికి పార్టీ దళాలను పంపించింది. మరొకవైపు గోదావరి లోయ పొడుగునా ఉన్న సింగరేణి బొగ్గుగనుల్లో సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస)ను లక్షకు పైగా సభ్యత్వంతో నిర్మాణం చేసింది. 1981లో ఆంధ్రప్రదేశ్ రైతు కూలీ సంఘాన్ని ఏర్పాటు చేసింది. 1981 ఏప్రిల్ 20న ఇంద్రవెల్లిలో జరిగిన ఆదిలాబాద్ జిల్లా రైతుకూలీ సంఘం మహాసభలపై పోలీసులు కాల్పులు జరిపి అరవై మంది ఆదివాసులను చంపినప్పటికీ బెంబేలు పడకుండా పోరాటం గోదావరి దాటి విస్తరించింది. సిరోంచ అడవుల్లోకి ప్రవేశించిన పెద్దిశంకర్ 80 నవంబర్‌లోనే మహారాష్ట్రలో జరిగిన మొట్టమొదటి ఎన్‌కౌంటర్‌లో అమరుడయినప్పటికీ ఆయన పెట్టిన నెత్తుటి చాలు ఇవ్వాళ గడ్‌చిరోలి కూడా భాగంగా పురోగమిస్తున్న దండకారణ్య పోరాటంలో ఒక ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయాలను అమలు చేస్తున్నది.

1980లో సిపిఐ (ఎంఎల్–పీపుల్స్‌వార్) ఏర్పడి రచించుకున్న దండకారణ్య పర్‌స్పెక్టివ్ నక్సల్బరీ పంథాను మరింత స్పష్టంగా నిర్వచించి, ఆచరణలోకి తెచ్చింది. ప్రజలకు రాజ్యాధికారం రావాలంటే విముక్తి ప్రాంతాన్ని ఏర్పాటు చేసుకోవాలి. ఆ లక్ష్యంతో అడవిలోకి విస్తరణ జరగాలి. అట్లాగే అడవి కేవలం ఒక బేస్ ఏరియా అనే దృష్టితో కాకుండా నక్సల్బరీతోటే ప్రపంచంలో మొదటిసారిగా ఒక మార్క్సిస్ట్ – లెనినిస్ట్ పోరాట చైతన్యంలోకి వచ్చిన ఆదివాసులను విప్లవ పోరాటంలో భాగస్వాములను చేసుకోవాలి. ఇవ్వాళ ప్రచలితంగా వినవస్తున్న 'మావోయిస్టులు ఆదివాసులు అయ్యారు, ఆదివాసులు మావోయిస్టులు అయ్యారు' అనే సూక్తికి 80లో దండకారణ్యంలో ప్రవేశించిన దళాల మొదటి అడుగు దారివేసింది.

1983లో కరీంనగర్‌లో రైతుకూలీ సంఘం రెండవ మహాసభ జరిగేనాటికి విప్లవోద్యమం తీవ్రమైన అణచివేతనూ, రాజ్యహింసనూ చవిచూసింది. అప్పటికే మొదటిసారిగా ఆంధ్రప్రదేశ్‌లో ఎన్టీరామారావు ఏర్పాటు చేసిన తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చింది. నక్సలైట్లకు జోహార్లనీ, వాళ్లు తమతో చేతులు కలిపితే ఎర్రకోటపై ఎర్రజెండా ఎగుర వేస్తాననీ ఎన్నికల కాలంలో ప్రగల్భాలు పలికిన ఎన్టీఆర్ 1985 నాటికి 'ఆటా, మాటా, పాటా బంద్' చేసి కనీవినీ ఎరగని నిర్బంధాన్ని అమలు చేశాడు. అప్పటికే కేంద్రంలో అధికారంలోకి వచ్చిన రాజీవ్‌గాంధీ పంజాబ్ మిలిటెంట్ పోరాటాన్ని అణచివేయడానికి టాడా వంటి అమానుష చట్టాన్ని రూపొందించాడు. ఎన్టీఆర్ ఈ టాడా కింద పదిహేను వేల మంది విప్లవ ప్రజాసంఘాల కార్యకర్తలను జైళ్లలో పెట్టాడు.

వందలాది మందిని ఎన్‌కౌంటర్‌లలో చంపాడు. 75 మంది విప్లవకారులు 'అదృశ్యమైపోయారు'. పోలీసు ఊరేగింపులో నుంచి అధికారులు వెళ్లి పౌరహక్కుల సంఘం ఉపాధ్యక్షుడు డా. రామనాథంను ఆయన క్లీనిక్‌లోనే చంపారు. కరీంనగర్‌లో పౌరహక్కుల నాయకుడు జాపా లక్ష్మారెడ్డిని ఆయన ఇంట్లోనే పోలీసులు చంపారు. 1985-89 మధ్య ఈ తీవ్ర నిర్బంధంలో కూడా పీపుల్స్‌వార్ పార్టీ ఉత్తర తెలంగాణలో ప్రజల్లో పనిచేసి 1990 మేలో వరంగల్‌లో జరుపుకున్న రైతుకూలీ సంఘం మహాసభలలో భూసంస్కరణల్లోని రెండవ దశను ప్రవేశపెట్టింది. ప్రభుత్వం పెట్టిన గరిష్ఠ భూపరిమితిని కాకుండా గ్రామాల్లో భూస్వాముల అనుపస్థితి ఉండకూడదని, చట్టం అనుమతించిన భూమి అయినా గ్రామంలో ఉండి వ్యవసాయం చేసినప్పుడే అనుమతిస్తామని విప్లవ నిర్మాణానికి ఆటంకం కాని మేరకే భూపరిమితిని ఆమోదిస్తామని స్పష్టం చేసింది. అట్లాగే భూస్వామికైనా, రైతుకైనా గ్రామంలోని భూమి మీద కాకుండా, పట్టణంలో మరొక ఆదాయం ఉండడానికి అనుమతించమని చెప్పింది. ఇదంతా గ్రామాల్లో విప్లవ నిర్మాణాలకు అవరోధం కాని మేరకు భూసంస్కరణల అమలుగా ప్రతిపాదించింది. తెలంగాణ అంతటా రైతాంగం స్వాధీనం చేసుకున్న భూముల్లో ఎర్రజెండాలు రెపరెపలాడాయి. 1992 నాటికే విప్లవోద్యమం ఆంధ్రప్రదేశ్ అంతటా విస్తరించింది. భారతదేశంలో ఇతర విప్లవ పార్టీలతో ముఖ్యంగా సిపిఐ (పార్టీ యూనిటీ), ఎంసిసిఐలతో ఐక్యతా ప్రయత్నాలు కొనసాగించింది.

ఈ కాలానికే 1991లో నూతన ఆర్థిక విధానం పేరుతో కేంద్రంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాన్ని పివి నరసింహారావు ప్రవేశపెట్టాడు. 1992లో బాబ్రీమసీదు విధ్వంసం జరిగింది. 1992లో ఆంధ్రప్రదేశ్‌లో చెన్నారెడ్డిని ముఖ్యమంత్రిగా దించి, రాజీవ్‌గాంధీ అనుచరుడైన నేదురుమల్లి జనార్ధనరెడ్డిని ముఖ్యమంత్రిగా చేయడానికి హైదరాబాద్ పాతబస్తీలో రాయలసీమ నుంచి వైఎస్సార్ ముఠా బాంబులూ, కత్తులతో దాడిచేసి వందలాది ముస్లింలను చంపివేసింది. జనార్ధనరెడ్డి అధికారంలోకి వచ్చి ఇంజినీరింగ్ కాలేజీలను ప్రైవేటీకరించ డానికి ప్రయత్నించాడు. పీపుల్స్‌వార్‌ను, విప్లవ ప్రజా సంఘాలను నిషేధించాడు. ఇతని కాలంలోనే గులాం రసూల్ వంటి జర్నలిస్టును ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేశారు. ఎపిసిఎల్‌సి నాయకుడు నర్రా ప్రభాకరరెడ్డిని చంపేశారు. పీపుల్స్‌వార్ కార్యదర్శి పులి అంజయ్య, ఆయన సహచరి భాగ్యలను చంపేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఇంత నిర్బంధాన్ని చవిచూస్తున్నప్పటికీ దండకారణ్యంలో జరుగుతున్న నిర్మాణం పార్టీ నిలదొక్కుకోవడానికి దోహదం చేసింది. 1996 నాటికి ఆంధ్రప్రదేశ్ పీపుల్స్‌వార్ పార్టీ ఏపి రాష్ట్ర కమిటీగానూ, ఉత్తర తెలంగాణ కమిటీగానూ ఏర్పడి, గెరిల్లా జోన్ల నిర్మాణం చేయాలనే కార్యక్రమాలను తీసుకున్నది. అంత మాత్రమే కాదు, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ముందుకు తెచ్చిన ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాకు ప్రత్యామ్నాయంగా ఒక అభివృద్ధి నమూనాను ప్రజల ముందు ఉంచాలనే నిర్ణయం కూడా తీసుకున్నది. 1995లో జరిగిన పీపుల్స్‌వార్ స్పెషల్ ప్లీనం ఈ ప్రజా ప్రత్యామ్నాయ నమూనాను రూపొందించింది. దండకారణ్యంలో ముఖ్యంగా బస్తర్‌లో, ఉత్తర తెలంగాణలో గ్రామ రాజ్య కమిటీల నాయకత్వంలో అభివృద్ధి కమిటీలను ఏర్పాటు చేసి ప్రజల ప్రాథమిక అవసరమైన భూమితో పాటు తాగు, సాగు నీరు, ప్రాథమిక విద్య, ప్రాథమిక ఆరోగ్యం, ఎరువులు, విత్తనాలు ఈ కమిటీల నాయకత్వంలో ప్రజలకు అందించాలని, ఇందులో ప్రజలను సహకార స్థాయిలో స్వచ్ఛంద సేవతో పెద్ద సంఖ్యలో ప్రవేశపెట్టాలని, వందలాది గ్రామాల్లో కృషి చేసింది. ఎన్నికలను బహిష్కరించి ప్రభుత్వానికి పన్నులు కట్టడాన్ని నిరాకరించి, గ్రామ రాజ్య కమిటీల నాయకత్వంలో ఈ స్వావలంబన అభివృద్ధి నమూనాను అమలు చేయడానికి పూనుకున్నది. ఆరంభంలో ఉత్తర తెలంగాణలో వందలాది గ్రామాలలో, దక్షిణ తెలంగాణలో నల్లగొండ జిల్లావంటి చోట ఈ ప్రయోగం జరిగింది. బస్తర్‌లోనైతే ఈ ప్రయోగం ఇప్పుడు మరింత ముందుకు వెళ్లి జనతన సర్కార్‌గానూ, క్రాంతికార్ జనతన సర్కార్‌గానూ ఒక ప్రత్యామ్నాయ ప్రజా ప్రభుత్వమే అక్కడ నడుస్తున్నది.

ఇదే కాలంలో ప్రపంచ బ్యాంక్ కుట్రతో అధికారంలోకి వచ్చిన చంద్రబాబు నాయుడు 1995 ఆగస్ట్ మొదలుకొని తొమ్మిదిన్నర సంవత్సరాల పాటు అమలు చేసిన నిర్బంధం, రక్తపాతాల వల్ల ఉత్తర తెలంగాణలో ఈ నిర్మాణాలు దెబ్బతిన్నాయి. ఈకాలంలోనే సింగరేణి కార్మిక సమాఖ్య తర్వాత అంత శక్తివంతంగా హైదరాబాద్ నగరంలోనూ, మెదక్ జిల్లాలోనూ నిర్మాణమైన విప్లవ కార్మిక సంఘాల మీద ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధాన్ని అమలు చేసి, ఆ సంఘాలు నిర్మాణం చేసిన విప్లవ కార్యకర్తలందరిని పట్టుకొని ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేసింది. హైదరాబాద్‌లోనూ, హైదరాబాద్ పరిసర జిల్లాల్లోనూ ఉన్న పబ్లిక్ రంగ పరిశ్రమలను మూసి వేయడానికి, రద్దు చేయడానికి ఈ మొత్తం పరిశ్రమలను ప్రైవేట్ కంపెనీలకు ఇవ్వడం కోసం గానీ, లేదా, రియల్ ఎస్టేట్‌గా అమ్మడం కోసం గానీ చంద్రబాబు నాయుడు వేసిన పథకంలో భాగంగానే ఇది జరిగింది.

ఈ కాలంలోనే తీవ్ర విద్యుత్ సంక్షోభం వచ్చి పీపుల్స్‌వార్ నాయకత్వంలో దీనికి వ్యతిరేకంగా మెదక్, నిజామాబాద్ జిల్లాల్లో మిలిటెంట్ ఉద్యమాలు వచ్చాయి. సబ్సిడీలు రద్దు చేయడానికి, సంక్షేమ పథకాలను రద్దు చేయడానికి ప్రపంచ బ్యాంక్ ఆదేశాలతో చంద్రబాబు చేసిన ప్రయత్నాలను కూడా నిషేధంలో కొనసాగుతున్నా కూడా పీపుల్స్‌వార్, అది ఏర్పాటు చేసిన వివిధ ప్రజాసంఘాలు మిలిటెంట్ ఉద్యమాలు నిర్మాణం చేసినవి. వీటన్నిటికీ ఎన్‌కౌంటర్ హత్యలు మాత్రమే కాకుండా, లొంగిపోయిన నక్సలైట్లను ప్రలోభపెట్టి మాజీ నక్సలైట్లకూ భూములూ, సెటిల్‌మెంట్లూ వంటి సులభ స్వయం ఉపాధి మార్గాలు చూపి, ఒక చిన్నపాటి సైన్యాన్ని నిర్మాణం చేసి, కోవర్టు ఆపరేషన్‌లు ప్రారంభం చేశాడు. 2000 నాటికి ఢిల్లీలో కేంద్రంతో నక్సలైట్ ప్రభావం గల రాష్ట్రాల సమావేశంలో చంద్రబాబు దీనినొక పథకంగా కూడా ప్రవేశ పెట్టాడు. పార్టీలో కోవర్టుల ద్వారా ఉద్యమాన్ని అణచాలని ప్రతిపాదించాడు. కరీంనగర్ జిల్లా కార్యదర్శి విజయ్‌ను ఆయన అంగరక్షకుడు జడల నాగరాజు చంపి, ప్రభుత్వం నుంచి బహుమానం తీసుకున్న ఉదంతం దీనికి తిరుగులేని ఉదాహరణ. ఈ కాలంలోనే నయీం ముఠాతో పౌరహక్కుల సంఘం నాయకులు పురుషోత్తం, ఆజం అలీలను కూడా చంపించాడు. చివరకు ఉన్నత పోలీసు అధికారుల కనుసన్నల్లోనే ఒకవైపు పీపుల్స్‌వార్ నాయకుల హత్యలు, మాఫియాల

మాజీ నక్సలైట్ల పోషణ, హైదరాబాద్ నగరం చుట్టూ రియల్ ఎస్టేట్ వ్యాపారం, సెటిల్‌మెంట్‌లు సాగుతున్నాయని, పౌరసమాజం కూడా భయభీతావాహ స్థితిలో మీడియా కూడా ఇవన్నీ వెలుగులోకి తేవడంతో ప్రభుత్వానికి ఒక ఉన్నతాధికారి నాయకత్వంలో కమిషన్ వేయక తప్పలేదు. ఆ రంగాచారి కమిషన్‌కు పోలీసులు సహకరించక ఆ విచారణ మూలపడింది.

ఒక్కమాటలో చంద్రబాబు అమలు చేస్తున్న ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనా అటు విప్లవోద్యమం నుంచి కింది నుంచి ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను, తెలంగాణ నుంచి మళ్లీ ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని ముందుకు తెచ్చాయి. ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా తీవ్ర నిర్బంధానికి గురయి దెబ్బతింటున్న దశలో 1996 డిసెంబర్ చివరన ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ సదస్సును ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం వరంగల్‌లో నిర్వహించింది. ఇక్కడే ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ కోసం వరంగల్ డిక్లరేషన్ ప్రకటించబడింది. అప్పటికి తెలంగాణలో ముఖ్యంగా వరంగల్ జిల్లాలో ఎందరో పత్తి రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్న స్థితి. పత్తి రైతులను ఆత్మహత్యలకు పూనుకోకుండా, ప్రతిఘటనకు పూనుకోమని పిలుపునిస్తూ జిల్లాలో పార్టీ విస్తృత ప్రచారం చేసి, వారికి అండగా నిలిచి, వారికి సహకరించింది. వరంగల్‌లో జరిగిన ఈ ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ సదస్సుకు రెండున్నర లక్షల మంది వచ్చారు. 1969 తర్వాత మళ్లీ ప్రారంభమైన ఈ ఉద్యమం నుంచి వచ్చిన కొత్త గొంతే బెల్లి లలిత. తెలంగాణ కోయిలగా అనతికాలంలోనే పేరు తెచ్చుకున్న భువనగిరికి చెందిన ఈ మహిళను కూడా నయీం ముఠా పదిహేడు ముక్కలు చేసి చంపివేసింది.

చంద్రబాబు కాలంలో అటు నక్సలైట్ ఉద్యమం మీద, ఇటు తెలంగాణ ఉద్యమం మీద జరుగుతున్న అణచివేత నేపథ్యంలో 1996లో ఏర్పడిన కన్‌సర్న్‌డ్ సిటిజెన్స్ కమిటీ ప్రభుత్వానికీ, పార్టీకీ మధ్యన చర్చల ప్రతిపాదన తెచ్చింది. అప్పటికే నల్లమల ఉద్యమం మీద ప్రభుత్వం ఉక్కుపాదం మోపింది. ఎస్.ఆర్. శంకరన్ కన్వీనర్‌గా ఏర్పడిన ఈ కమిటీని ప్రధానంగా వేధించిన సమస్య రాష్ట్రవ్యాప్తంగా ముఖ్యంగా తెలంగాణలో సాగుకు యోగ్యమైన భూములు లక్షలాది ఎకరాలు పడావు పడి ఉండడం. 2002 నాటికి అంటే అప్పటికే ఒక దశాబ్దంగా పీపుల్స్‌వార్ నాయకత్వంలో ప్రజలు స్వాధీనం చేసుకున్న భూములు, ఉద్యమ ప్రభావంతో ప్రజలు తాముగా స్వాధీనం చేసుకున్న భూములు, ఉద్యమానికి భయపడి పట్టణాలకు పారిపోయి వచ్చిన భూస్వాముల భూములు పోలీసు క్యాంపుల వల్ల కూడా సాగు కాకుండా ఉండి పోయాయి. దీనివల్ల ఉత్పత్తి కుంటుపడి, అభివృద్ధి ఆగిపోయిందని ఆవేదన చెందిన వీళ్లు ప్రధానంగా భూసంస్కరణల దృష్టితో చర్చల ప్రతిపాదన తెచ్చారు. శంకరన్ వంటి వాళ్లయితే ఈ భూములను ప్రభుత్వం ఎస్.సి., ఎస్.టి. కార్పొరేషన్ ద్వారా కొని భూమిలేని పేదలకు పంచాలని ప్రతిపాదించారు. దీనికి పోరాడి సాధించుకున్న భూములు మళ్లీ కొని వాళ్లకివ్వడం ఏమిటి అని ఉద్యమం అభ్యంతరం పెట్టినప్పుడు తాముగా కానీ, పార్టీ నాయకత్వంలో కానీ ఇట్లా స్వాధీనం చేసుకున్న భూముల విషయంలో 'న్యాయం' ఉంటే, అంటే స్వాధీనం చేసుకున్న వాళ్లు అంతకు పూర్వం భూమిలేని నిరుపేద దళితులై ఉంటే, వాటిపై పట్టాలిచ్చి ప్రభుత్వం దాన్ని గుర్తించాలని కూడా శంకరన్ ప్రతిపాదించారు. ఇది ప్రభుత్వానికి ఆమోదం కాలేదు. ఎందుకంటే ప్రజలు తాముగా గానీ, పార్టీ నాయకత్వంలో గానీ పోరాడి సాధించు కున్నదాన్ని ఆమోదించినట్లవుతుంది. ప్రభుత్వాలు ఎప్పుడూ ప్రజలు తాము ఇచ్చింది తీసుకోవాలని ఆశిస్తాయి తప్ప, ప్రజలు తాముగా పోరాడి ఏది సాధించుకోవడాన్ని సహించవు. ఈ విధంగా స్వాధీనం చేసుకున్న భూములు ఎన్ని ఉండి ఉంటాయో, అందులో న్యాయాన్యాయాలు ఏమిటో కూడా విచారించమని శంకరన్‌కు చంద్రబాబు చెప్పాడు గాని ఆయన ఆ పనిచేసి తన నివేదికేదో తాను రూపొందించినా అది పట్టించుకోలేదు.

ఏమైనా ఈ తీవ్ర ప్రయత్నాల నేపథ్యంలో 2002 జనవరిలో చంద్రబాబు ప్రభుత్వం పీపుల్స్‌వార్‌తో చర్చలకు అంగీకారం తెలిపింది. అప్పటికే 1999 ముందే పీపుల్స్‌వార్ అగ్రనాయకత్వం శ్యాం, మహేష్‌లతో సిసిసి నాయకులు నలుగురు రెండు రోజుల పాటు సుదీర్ఘ చర్చలు జరిపి ప్రభుత్వంతో చర్చలకు రావడానికి అనుకూలతను తెలుసుకున్నారు. 1999 డిసెంబర్ 1న శ్యాం, మహేష్, మురళిలను బెంగళూరులో అరెస్టు చేసి పోలీసులు కరీంనగర్ జిల్లా కొయ్యూరు అడవుల్లో కాల్చివేశారు. వాళ్లతోపాటు లక్ష్మిరాజ్యం అనే పశువుల కాపరిని కూడా కాల్చివేశారు. ఇంత నష్టం తర్వాత కూడా మొదట 2002 జనవరిలో పార్టీ ఏకపక్షంగా కాల్పుల విరమణ ప్రకటించి చర్చలకు సంసిద్ధత తెలిపింది. మార్చ్ నెలలో వరంగల్ జిల్లా తుపాకులగూడెంలో ఎన్‌కౌంటర్ పేరుతో గ్రేహౌండ్స్ పదకొండు మందిని చంపేశారు. ఈ గ్రేహౌండ్స్ 1985లో అప్పటి డిఐజి కె.ఎస్. వ్యాస్ సలహాపై ఎన్టీఆర్ రూపొందించిన చట్టబద్ధత లేని పోలీసులు. వీళ్లు యూనిఫారాలు వేసుకోవాల్సిన అవసరం లేదు, నేం ప్లేట్స్ పెట్టుకోవాల్సిన అవసరం లేదు, రాష్ట్రంలోనే కాదు, ఇరుగుపొరుగు రాష్ట్రాలకు కూడా వెళ్లి నక్సలైట్లను ఎన్‌కౌంటర్ చేసి రావచ్చు, వీళ్లు కేవలం తమ బాస్‌కే జవాబుదారీ. ఆయన తిరిగి ముఖ్యమంత్రికే జవాబుదారీ. ఆంధ్రప్రదేశ్ లోనూ, ఒరిస్సాలోనూ, కర్ణాటకలోనూ ఒక భౌగోళిక పరిమితి కూడా లేకుండా వీళ్లు చేసిన హత్యాకాండ, అత్యాచారాలు బలిమెలలో వీళ్లపై మావోయిస్టు పార్టీ చేసిన ప్రతిఘటనను బట్టి ఊహించుకోవచ్చు. లేదా, డిఐజి వ్యాస్‌పై తీసుకున్న చర్యను బట్టి ఊహించుకోవచ్చు.

ఏమైతేనేమి 2002 జూన్‌లో మూడు దఫాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, పీపుల్స్‌వార్ చర్చల ప్రతినిధులతో విధి విధానాల గురించి చర్చించింది. అప్పటికి రెండోసారి పార్టీ మాత్రమే ఏకపక్షంగా కాల్పుల విరమణ పాటించింది. పార్టీ మీద నిషేధం ఎత్తివేయకపోవడం మాత్రమే కాదు, ఈ విధి విధానాల నిర్ణయం జరిగే రోజు కూడా ఎన్‌కౌంటర్‌లు జరిగాయి. చర్చలకు అంగీకరించి స్వయంగా నాయకత్వం వస్తే వచ్చే నాయకుల తలలపై వెలలు ఎత్తివేసుకునే విషయం ఆలోచిస్తామని మాత్రమే ప్రభుత్వం చెప్పింది. విధి విధానాలను నిర్ణయించే ప్రతినిధుల ద్వారా ప్రభుత్వం ముందు పార్టీ పెట్టిన ప్రతిపాదనలను ప్రభుత్వం తరపున చర్చల్లో పాల్గొన్న మంత్రి విజయరామారావు (అంతకుపూర్వం ఎమర్జెన్సీలో డిఐజి నక్సలైట్, డిజిపి, సిబిఐ చీఫ్) పార్టీ నుంచి వచ్చిన ప్రతిపాదనలు రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలను పోలి ఉన్నాయి అని అన్నాడు. పార్టీ ప్రభుత్వం ముందు ఉంచిన ప్రతిపాదనల్లో ప్రజలు

తాముగా గానీ, పార్టీ నాయకత్వంలో గానీ స్వాధీనం చేసుకున్న భూములకు పట్టాలు ఇవ్వాలని, కాని చోట్ల కూడా ప్రభుత్వం తన చట్టాలను తానే గౌరవించి, మిగులు భూములను భూమిలేని పేదలకు పంచాలని. అడవిలో కూడా ఆదివాసులు స్వాధీనం చేసుకున్న భూములకు పట్టాలిచ్చి, ఆదివాసేతర పేదలకు మైదాన ప్రాంతాలలోని భూమి ఇచ్చి అడవిలో 1ఆఫ్ 70ని కచ్చితంగా అమలు చేయాలని. జూన్ 5, 9, 20 తేదీల్లో మూడు విడతలుగా జరిగిన ఈ చర్చల్లో జూన్ 9 నాటికే కేంద్రంలో హోంమంత్రి అద్వానికీ, ముఖ్యమంత్రి చంద్రబాబుకు రాష్ట్రపతి అభ్యర్థి విషయంలో అంగీకారం కుదిరి గుజరాత్ మారణకాండ విషయంలో చంద్రబాబు నోరు విప్పనని హామీ పడిన తరువాత ప్రభుత్వం గొంతు మారింది. ఆయుధాలు వదిలిపెడితే తప్ప చర్చలు సాధ్యం కాదని చెప్పింది. ఇంత ప్రతికూల పరిస్థితులలో కూడా పార్టీ నాయకత్వం జూలై 20న చర్చలకు తాము వస్తామని ప్రకటించింది.

కాని జూన్ నెలాకరునాటికి వరంగల్‌లో పీపుల్స్‌వార్ దళాన్ని తుద ముట్టించి, జూలై 2న ఉత్తర తెలంగాణ రాష్ట్ర కమిటీ సభ్యురాలు రజితను ఎన్‌కౌంటర్ పేరుతో చంపడంతో జూలై 19న తానింక చర్చలకు వచ్చేది లేదని, ప్రతిఘటన చర్యలకు పూనుకుంటానని పార్టీ ప్రకటించింది. ఈ నేపథ్యంలోనే అలిపిరిలో చంద్రబాబుపై పార్టీ చర్యకు పూనుకొని, ఆయన చావు తప్పి కన్నులొట్టపోయి బతికిపోయాడు, కాని, అది ముందస్తు ఎన్నికలకు దారితీసింది. అప్పటికే ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనా, నక్సలైట్‌తో చర్చలు, ప్రత్యేక తెలంగాణ అనే అంశాలు ప్రజల్లో చర్చనీయాంశాలు అయిపోయాయి. 2001లో ఏర్పడిన తెలంగాణ రాష్ట్ర సమితితో పాటు వైఎస్సార్ నాయకత్వంలోని కాంగ్రెస్‌తో సహా, చివరకు బిజెపి కూడా రాష్ట్రంలో ప్రపంచ బ్యాంక్ ఆర్థిక విధానంకు వ్యతిరేకంగా మాట్లాడడం అనేది ఒక పాప్యులిస్ట్ విధానం అయిపోయింది. అట్లాగే, అప్పటికి సిపిఐ, సిపిఐ(ఎం) తప్ప అన్ని పార్టీలు ప్రత్యేక తెలంగాణకు అనుకూల విధానాన్నో, తాటస్థ్యాన్నో పాటించాయి. నక్సలైట్లతో చర్చల విషయంలో తెలుగుదేశం పార్టీ తప్ప అన్ని పార్టీలు సానుకూలత ప్రకటించాయి. 2004 ఎన్నికలు చంద్రబాబు భాషలోనే చెప్పాలంటే ఈ అంశాలపై రెఫరెండం లాగ జరిగాయి. ఆయన తాను ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాకే కట్టుబడి ఉంటాననీ, నక్సలైట్లను శాంతిభద్రతల సమస్యగానే చూస్తాననీ, ప్రత్యేక తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకిస్తాననీ తెలుగుదేశం పార్టీ లక్ష్యంగా ప్రకటించాడు. ఈ మూడు అంశాలతో పాటు, తాను అధికారంలోకి వస్తే ఉచిత విద్యుత్ ఇస్తాననీ, ప్రజాకర్షక వాగ్దానాలతో పాదయాత్ర చేసిన రాజశేఖరరెడ్డి తెరాస పొత్తుతో అత్యధిక మెజారిటీతో అధికారంలోకి వచ్చాడు. తెలంగాణ రాష్ట్ర సమితి అయితే తాము అధికారానికి వస్తే నక్సలైట్ ఎజెండాను అమలు చేస్తానని హామీ ఇచ్చింది. మీడియా కూడా ప్రజాభిప్రాయాన్ని సేకరించింది.

మొత్తం మీద 2004 కాంగ్రెస్ – తెరాస ప్రభుత్వం ఏర్పడేనాటికి చర్చలకు ఒక సంపూర్ణమైన అనుకూల వాతావరణం ఏర్పడింది. అదే సమయంలో చర్చలు జరగాలే గాని, పార్టీ ఆయుధాలు వదలొద్దు అనే మనోభావాలు కూడా ప్రజల్లో వ్యక్తమైయ్యాయి. 2004 మే 14 నుంచి 2005 జనవరి వరకు ఆంధ్రప్రదేశ్‌లో మళ్లీ ఒకసారి 1990 జనవరి – సెప్టెంబర్ మధ్య ఉన్న ఒక ప్రశాంత వాతావరణం ఏర్పడింది. ప్రభుత్వం ఈ కాలంలో కూడా కోవర్టు ఆపరేషన్‌ల ద్వారా ఉత్తర తెలంగాణ నాయకత్వాన్ని తుదముట్టించాలని చూసినప్పటికీ ఇంచు మించు ఇరువైపుల ప్రాణనష్టం జరగలేని ఒక వాతావరణం ఈ ఏడు నెలల కాలం కొనసాగింది. 2004 అక్టోబర్‌లో పార్టీ నాయకత్వం స్వయంగా ప్రభుత్వంతో చర్చలకు వచ్చింది. ఈ కాలమంతా రాష్ట్రమంతా పార్టీ, ప్రజాసంఘాలు, ప్రజాసంఘవాదులు, బుద్ధిజీవులు ప్రజా సమస్యల గురించి ముందుకు తెచ్చిన చర్చలలో భూమి, భూసంస్కరణలు, ప్రజాస్వామ్యం, స్వావలంబన అనే అంశాలు విస్తృతంగా వెలుగులోకి వచ్చినాయి. కె.ఆర్. వేణుగోపాల్ ఆదివాసుల స్థితిగతులు, వాళ్లు కోల్పోయిన భూమి గురించి, ఎస్.ఆర్. శంకరన్, బొజ్జాతారకం, నరేంద్రనాథ్ వంటి వాళ్లు దళితులు కోల్పోయిన భూముల గురించి, మిగులు భూముల గురించి ఎన్నో సాధికారికమైన నివేదికలు ముందుకు తెచ్చారు. ప్రభుత్వంతో నాలుగు రోజులు జరిగిన చర్చల్లో పార్టీ సిపిఐ (ఎంఎల్) జనశక్తితో పాటు కలిసి రాష్ట్రంలో ఒక కోటి ఇరవై లక్షల ఎకరాల మిగులు భూమి ఉందని, ఇది భూమిలేని ప్రజలకు పంచాలని ప్రతిపాదించింది. ఇది 35 కేటగిరిలలో ఉందని వివరాలు ఇచ్చింది. వీటిలో తమ నాయకత్వంలో మైదాన ప్రాంతంలో మూడు లక్షల ఎకరాలు, అడవిలో రెండు లక్షల ఎకరాలు ప్రజలు స్వాధీనం చేసుకున్నారని, తీవ్ర నిర్బంధం రాజ్యహింసల వల్ల ప్రజలు ఆ భూమిని సాగు చేసుకోలేక పోతున్నారని, ఆ భూములపై పట్టాలివ్వాలని ప్రతిపాదించింది. భూపంపకాలకు గరిష్ట పరిమితి కాకుండా భూమిలేని నిరుపేదలైన దళిత కుటుంబాలు ప్రాతిపదికగా కింది నుంచి భూసంస్కరణలు జరగాలని, ప్రతి దళిత కుటుంబానికి మూడు ఎకరాల భూమి చొప్పున ఆ ఇంటి మహిళ పేర పట్టా చేయాలని నిర్దిష్టమైన ప్రతిపాదన చేసింది. దీంతోపాటు చట్టబద్ధమైన పరిపాలన సాగడానికి వాక్, సభ, విశ్వాస స్వాతంత్ర్యాలను గౌరవించాలని, ఎన్‌కౌంటర్‌లపై న్యాయవిచారణ జరపాలని, ప్రజాస్వామిక హక్కుల పునరుద్ధరణ గురించి నిర్దిష్టమైన ప్రతిపాదన చేసింది.

గతంలోకి వెళ్లకుండా ఇకనుంచి ఇవి గుర్తించి గౌరవిస్తామని, పార్టీ ప్రతిపాదించిన భూసంస్కరణలను అమలు చేయడానికే కాదు, ముందు రెవెన్యూ రికార్డులు చూడడానికి కూడా తమకు సమయం కావాలని రెండో దఫా చర్చలకు ప్రభుత్వం మళ్లీ పిలుస్తుందని ప్రభుత్వం చెప్పింది. ఈ నాలుగు రోజులు చర్చలు సానుకూలంగా జరిగినట్లే కనిపించింది. పార్టీ తిరిగి వెళ్తూ భూసంస్కరణల గురించి తాము చేసిన ప్రతిపాదనే ఆఖరి మాట కానవసరం లేదనీ, ఇందుకోసం ఒక భూ కమిషన్ వేయాలనీ ముప్పై పేర్లతో ఒక జాబితా ఇచ్చింది. కె.ఆర్. వేణుగోపాల్‌ను దానికి అధ్యక్షుడిగా నియమించాలని కోరింది. ఆ ముప్పై మంది దశాబ్దాలుగా తెలుగు సమాజంలో ప్రజాస్వామిక ఉద్యమాలతో, దళిత, ఆదివాసి ఉద్యమాలతో, సమస్యలతో, పరిష్కారాలతో గాఢమైన అనుబంధం ఉండి, చిత్తశుద్ధి గురించి, జ్ఞానం గురించి ఎంతో గౌరవామోదాలు కలిగిన ప్రజాజీవితం కలవారు.

ప్రభుత్వం ఈ జాబితాను పక్కనబెట్టి, ఉప ముఖ్యమంత్రిగా ఉన్న కోనేరు రంగారావు నాయకత్వంలో ఒక కమిషన్ వేసింది. చివరకు ఈ కమిషన్ చేసిన సూచనలను కూడా ఇవ్వాల్టికీ అమలు చేయలేదు.

ఉదాహరణకు, కోనేరు రంగారావు కూడా ఒక ప్రతిపాదన చేశాడు. భూమి లేని నిరుపేద దళిత కుటుంబాలు స్వాధీనం చేసుకున్న భూమిని గుర్తించి, వారికి పట్టా ఇవ్వవచ్చును అని. ప్రభుత్వం రెండో దఫా చర్చలకు పిలవనే లేదు.

వాస్తవానికి చర్చలకు రావడానికి ముందే 21 సెప్టెంబర్ 2004న సిపిఐ (ఎంఎల్ – పీపుల్స్‌వార్) ఎంసిసిఐతో కలిసి మావోయిస్టు పార్టీ ఏర్పడింది. ఈ విషయాన్ని చర్చలకు వచ్చిన పార్టీ నాయకత్వం అక్టోబర్ 13న హైదరాబాద్‌లో మీట్ ది ప్రెస్‌లో ప్రకటించింది. చర్చలకు పిలిచింది పీపుల్స్‌వార్‌నే అయినప్పటికీ ఆ పార్టీ మావోయిస్టు పార్టీగా పాల్గొనడానికి ప్రభుత్వం సాంకేతికంగా ఏ అభ్యంతరం చెప్పలేదు. రాష్ట్రంలో పీపుల్స్‌వారే మావోయిస్టు పార్టీగా మారినప్పటికి ఇంక అప్పటి నుంచి ఇది మావోయిస్టు పార్టీగానే అధికారికంగా పరిగణనలోకి వచ్చింది. చర్చలకు పిలిస్తే పీపుల్స్‌వార్‌లో సాయుధ పోరాట విరమణ గురించి కొందరైనా ఆలోచిస్తారని వైఎస్సార్‌కూ, అరవిందరావుకూ ఉన్న భ్రమలు ఈ ప్రకటనతో తొలిగిపోయినయి. ఇటువంటి భ్రమలైనా, ఊహలైనా ఉండడానికి రెండు ప్రాతిపదికలు ఉంటాయి. సంస్కరణ వాదులూ, బుద్ధిజీవుల వైపు నుంచి చూసినప్పుడు భూసంస్కరణలు చిత్తశుద్ధిగా అమలు చేస్తే నక్సలైట్ ఉద్యమం ఉండదు. నక్సలైట్ ఉద్యమానికి భూ సమస్యే మూలమనేది ఒకటి. నక్సల్బరీ ఉద్యమం ప్రజల చేతికి రాజ్యాధికారం ఇవ్వడం కొరకు అని మనం ఆరంభంలో చెప్పుకున్న అంశం మార్క్సిస్టేతరులకు అంత సులభంగా జీర్ణమయ్యే విషయం కాదు. రెండో అంశం ప్రజలైనా, పార్టీలైనా కొంత కాలం శాంతీ, విరామం కోరుకుంటున్నారు కాబట్టి, ఎవరైనా ఎంత కాలం పోరాడుతారు, అలసిపోతారు, కొత్త ఆలోచనలకు చోటు ఉండదు, సృజనాత్మకతకు చోటు ఉండదు అనే ఆధునికానంతర భావజాలం ఒకవైపు. వీటితోపాటు వివిధ కారణాలతో జరిగిన కొన్ని లొంగుబాట్లు, తాజాగా జనశక్తి పార్టీ నుంచి రాష్ట్రస్థాయి నాయకత్వంలో అప్పటి కరీంనగర్ జిల్లా ఎస్‌పి ఏర్పాటు చేసిన మేళాలో నలభై ఐదు మంది యూనిఫారాలతో వచ్చి, ఆయుధాలతో లొంగిపోవడం వైఎస్సార్‌కి కొత్త ఉత్సాహాన్నిచ్చింది. కాని, మావోయిస్టు పార్టీ ఏర్పాటు ప్రకటన ఈ భ్రమలను పటాపంచలు చేయడం మాత్రమే కాదు, ఈ చర్చల నుంచి, ప్రజాభిప్రాయం నుంచి ఎట్లా దృష్టి మళ్లించడం అనే వాళ్ల ప్రయాసలు కొనసాగినవి. చర్చల కాలమంతా వైఎస్సార్ ఏ ఆసక్తీ చూపలేదు. పైగా చర్చలు ఆరంభమైన మొదటి రోజే పులిచింతలకు వెళ్లి పులిచింతల ప్రాజెక్ట్‌కు శిలాఫలకం వేశాడు. పులిచింతల ప్రాజెక్ట్ కృష్ణా నదికి ఇరువైపులా ఉన్న పలనాడు, నల్లగొండ జిల్లా ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా తలపెట్టినది. చర్చల్లో పాల్గొంటున్న రెండు విప్లవ పార్టీలు, తెలంగాణవాదులందరూ వ్యతిరేకిస్తున్నది.

అక్టోబర్ 30 నాటికి వైఎస్సార్ ప్రభుత్వం కూడా తుపాకులు వదిలితే తప్ప రెండో దఫా చర్చలు ఉండవని రాగమెత్తుకున్నది. అక్టోబర్ 30 2004న జరిగిన మంత్రివర్గ సమావేశం ప్రపంచ బ్యాంక్ సహాయం కోరాలని కూడా తీర్మానం చేసింది. ఎన్నికల కాలంలోనూ, అప్పటిదాకా ప్రపంచబ్యాంక్ అభివృద్ధి నమూనాను మాటల్లో వ్యతిరేకిస్తూ వచ్చిన వైఎస్సార్ తన నిజ రూపాన్ని చూపడం ప్రారంభించాడు. 2005 జనవరి 8న చైతన్య మహిళా సమాఖ్య కార్యవర్గ సభ్యురాలు లక్ష్మిని నల్లమల రీజినల్ కమిటీ సభ్యుడైన సాగర్ సహచరి అయినందుకు ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చి చంపడంతో మళ్లీ రాజ్యహింస ప్రారంభమైంది. ఇంక అక్కడి నుంచి వరంగల్, సిరిసిల్లలో జనశక్తి కార్యకర్తలను, ఆ తరువాత జనవరి 14, 15న నల్లమల, వరంగల్‌లో మావోయిస్టు కార్యకర్తలను కానివారిని కూడా ఎన్‌కౌంటర్ పేరుతో చంపడంతో ప్రభుత్వం ఏం సంకేతాలు ఇస్తున్నదో అర్థమైపోయింది.

జనవరి 15న వరంగల్ జిల్లా అడవుల్లో మావోయిస్టు పార్టీ నాయకుడు జంపన్నతో ప్రత్యేక తెలంగాణ విషయం చర్చించడానికి వెళ్లిన తెలంగాణ జన సభ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు, పోస్టల్ ఉద్యోగి సుదర్శన్‌ను, వరంగల్ జిల్లా తెరాస ఉపాధ్యక్షుడు నల్లా వసంత్‌ను పట్టుకొని చంపివేశారు. ఇంక ఎన్‌కౌంటర్‌ల పరంపర ప్రారంభమైంది. జనవరి 16న పార్టీ కూడా చర్చల నుంచి విరమిస్తున్నట్లు, ప్రతిఘటన దాడులకు పూనుకుంటామని ప్రకటించింది. మళ్లీ చంద్రబాబు కాలం పునరావృతం అయింది. ఈ రెండు ప్రభుత్వాల కాలంలోనూ, ముఖ్యంగా 1995 ఒక దశగా, 2004 ఒక దశగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాను అమలు చేసే క్రమంలో రాజ్యహింసను, దాన్ని ప్రతిఘటించే క్రమంలో విప్లవోద్యమాన్ని బేరీజు వేయాల్సి ఉంటుంది.

జగిత్యాల జైత్రయాత్ర నుంచి 1990 వరకు జరిగినదంతా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో భాగమే అయినా ప్రధానంగా ఫ్యూడల్ భూస్వామ్య వ్యతిరేక పోరాటం, భూస్వాధీన పోరాటం. 1991 నుంచి అందులోనూ 95లో చంద్రబాబు పాలన తెలంగాణను ఒక ప్రయోగశాలగా మార్చి ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్న కాలం నుంచి ఇది సామ్రాజ్యవాద భూస్వామ్యాన్ని ప్రతిఘటించే పోరాటంగా పదునుతేలింది. ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు, వనరుల కోసం భూస్వాధీనం, గనుల తవ్వకాలు, భారీ ప్రాజెక్టులు 2004 నుంచి దేశవ్యాప్తంగానే ముందుకు వచ్చిన పథకాలయ్యాయి. అంటే ప్రజలు స్వాధీనం చేసుకున్న భూములను కాపాడుకోవడం, తమ కాళ్ల నింది నేలను కాపాడుకోవడం కోసం పోరాడాల్సి వచ్చింది. 2006 నాటికి మళ్లీ చంద్రబాబు కాలాన్ని మరిపించే నిర్బంధం వైఎస్సార్ అమలు చేశాడు. చర్చల కాలంలో తొలగించిన నిషేధాన్ని మళ్లీ 2005 ఆగస్ట్ 17న ప్రకటించడమే కాకుండా, సాహితీ చరిత్రలోనే మొట్టమొదటిసారిగా విప్లవ రచయితల సంఘాన్ని కూడా నిషేధించాడు. దేశవ్యాప్త నిరసన వల్ల అడ్వయిజరీ బోర్డు మూడు నెలల తర్వాత ఆ నిషేధాన్ని తొలగించింది. 2006లో ప్రజాసంఘాలలో పనిచేసే కనకాచారి, మన్నెం ప్రసాద్‌లను మఫ్టీలో పోలీసులు, మాఫియాలు చంపేశారు. చంద్రబాబు కాలంలో టైగర్‌ల పేరుతో చలామణీ అయిన ఈ కోవర్టులు, వైఎస్సార్ కాలంలో కోబ్రాల పేరుతో చలామణీ అయ్యారు. 2009 ఎన్నికల్లో వైఎస్సార్ రెండోసారి అధికారంలోకి వచ్చాడు. 2009 ఆగస్ట్‌లో ఆయన హెలికాప్టర్ ప్రమాదంలో మరణించడాన్ని ప్రజల ఉసురు తాకి ఆయన చనిపోయాడని చెప్పుకోవడంలో ఆయన ప్రజల మీద అమలు చేసిన నిర్బంధం ఎటువంటిదో ఊహించుకోవచ్చు.

అయితే, ఈ కాలంలో నల్లమల ఉద్యమం పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. ఉత్తర తెలంగాణ ఉద్యమం నాయకత్వం నష్టపోకున్నప్పటికీ వెనకపట్టు పట్టింది. ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తరాంధ్రలోని మూడు జిల్లాల్లో

మాత్రం ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దు స్పెషల్ గెరిల్లాజోన్‌లో భాగంగా విప్లవోద్యమం కొనసాగుతున్నది. దీన్ని చాలామంది బుద్ధిజీవులు చర్చల కారణంగా విప్లవోద్యమం దెబ్బ తిన్నట్లుగా భావిస్తున్నారు. కాని, వాస్తవానికి ఏ చర్చలు లేని కాలంలోనే నక్సల్బరీ, శ్రీకాకుళాలు పూర్తిగా సెట్‌బ్యాక్ అయినవి. తెలుగుదేశంతో చర్చలు ప్రారంభమయ్యే కాలానికే పీపుల్స్‌వార్ అగ్రనాయకత్వం ముగ్గురూ ఒకేసారి ఎన్‌కౌంటర్ హత్యలకు గురయ్యారు. చారు మజుందార్ కాలం నుంచి కిషన్‌జీ కాలందాకా ఇట్లా అగ్రనాయకత్వం మొత్తం ఒక్కసారి కోల్పోవడం అనేది ఎన్నడూ జరగలేదు. రెండుసార్లు చర్చలు ఎందరో అగ్రనాయకులను కోల్పోయిన తర్వాతనే జరిగినయి. చర్చలు లేని విప్లవ ప్రాంతాల్లో కూడా ఉద్యమంలో ఎగుడుదిగుడు లున్నాయి. ఒకసారి గెలుచుకున్న కోట ఎల్లకాలం మన చేతుల్లోనే ఉండదు. గెలుపూ, ఓటమీ, గెలుపూ, ఓటమీ అంతిమంగా విజయం తప్ప విప్లవం సరళరేఖ కాదు. ప్రజాపంథాకు సంకేతంగా పేర్కొనే జగిత్యాల, సిరిసిల్లలో కూడా ఇవ్వాళ విప్లవోద్యమం లేదు. విప్లవాన్ని ఒక కొనసాగింపుగానూ, విస్తరణగానూ అవగాహన చేసుకుంటే తప్ప ఇది అర్థం కాదు. మహత్తర తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంతో పోల్చినప్పుడు ఆనాడు పోరాటంలో 96 శాతం మంది ప్రజలు పాల్గొన్నారు. అది ఉజ్వలమైన పోరాటం. తరువాత పోరాటాలకు వేగుచుక్క వంటి పోరాటం. కాని, అది మొత్తంగా చూసినప్పటికీ 46 నుంచి ఇంకా స్పష్టంగా చెప్పాలంటే 48 నుంచి 51 దాకా సాగిన సాయుధ పోరాటం. దానికి కాలపరిమితి ఉంది. అట్లే అది ఆనాటి వరంగల్, నల్లగొండ జిల్లాలకు పరిమితమైంది. ప్రాంత పరిమితితో చూసినప్పుడు నక్సల్బరీ, శ్రీకాకుళాల వంటిది.

కాని, తెలంగాణకూ, నక్సల్బరీ, శ్రీకాకుళాలకూ మధ్యన వచ్చిన స్పష్టత ఏమిటంటే నక్సల్బరీ ఒక గ్రామమే. ఎంతో ఉజ్వలంగా చెప్పుకుంటున్న శ్రీకాకుళం మూడు ఏజెన్సీ తాలూకాలైన పార్వతీపురం, పాలకొండ, పాతపట్నంతో పాటు ఉద్దానం. ఈ అంతా కలిపినా ఆనాటి తెలంగాణ విప్లవ ప్రాంతం కన్నా తక్కువే. అట్లే వైనాడు, మరొక చోటు. కాని, తేడా ఏమిటంటే, నక్సల్బరీ పంథా 1967లో నక్సల్బరీ గ్రామంతో ప్రారంభమై ఇప్పటికీ అంటే నలభై ఐదేళ్లుగా కొనసాగుతున్నది. సెట్‌బ్యాక్‌కు గురైన 78 జగిత్యాల జైత్రయాత్ర నిరంతర సాయుధ పోరాటంగా సాగుతున్నది. దీని రెండవ బలం విస్తరణ. మామూలు బుద్ధిజీవులు, మధ్యతరగతికి ఆంధ్రప్రదేశ్‌లో తుడిచిపెట్టుకుపోవడంగానో, నష్టంగానో కనిపిస్తున్నది. గతితార్కికంగా చూస్తున్నప్పుడు దాని బలం విస్తరణలో కనిపిస్తున్నది. ఇవాళ అది విప్లవ పార్టీల ఐక్యత వల్ల దండకారణ్య, బీహార్, జార్ఖండ్‌ల విప్లవోద్యమంగా పురోగమిస్తున్నది. పన్నెండు రాష్ట్రాలలో మావోయిస్టు పార్టీ పనిచేస్తున్నది. పదహారు రాష్ట్రాలలో మావోయిస్టు పార్టీ ప్రభావం ఉన్నది. దండకారణ్యంలోని బస్తర్‌లో, జార్ఖండ్‌లోని సరండాలో జనతన సర్కార్‌లు ప్రజా ప్రత్యామ్నాయ ప్రజాస్వామిక ప్రభుత్వాలను నడుపుతున్నది. బెంగాల్‌లోని జంగల్ మహల్‌లో నక్సల్బరీని మైమరిపించే విప్లవోద్యమం వికాసం జరిగి, కామ్రేడ్ కిషన్‌జీ అమరత్వంతో తాత్కాలికంగా దెబ్బతిని ఉన్నది. మొత్తంగా ఒడిశాలో ప్రత్యేకించి నారాయణపట్నంలో శ్రీకాకుళాన్ని తలపింపజేసే ప్రయోగం జరుగుతున్నది. స్వయంగా దేశ ప్రధాని ఇవాళ దేశంలో అత్యంత ప్రమాదకరమైన ప్రధాన ప్రమాదంగా మావోయిస్టు ఉద్యమాన్ని పేర్కొంటున్నాడు. 2009లో మావోయిస్టులపై యుద్ధం ప్రకటించి, గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో తూర్పు, మధ్య భారతాల మీద లక్షలాది మంది పారామిలిటరీ బలగాలను పురిగొల్పాడు. గ్రీన్‌హంట్ ఆపరేషన్ రెండో దశలో 2011లో అబూజ్‌మాడ్ ప్రాంతం లోకి సైన్యాన్ని దించాడు. సామ్రాజ్యవాద ప్రేరణతో భారత దళారీ ప్రభుత్వం తన ప్రజల మీద తానే ఇవాళ యుద్ధం చేస్తున్నది. ఇవాళ దేశంలో ఇరాక్ కంటే విస్తారమైన ప్రాంతం మీద, మనదే అనుకున్న ప్రభుత్వం మానవరహిత విమానాలతో ప్రత్యక్ష దాడి చేస్తున్నది. వలసపాలన కాలంలో వలె ఆదివాసి ప్రాంతాలలో బేస్ క్యాంపులు ఏర్పాటు చేసి, లక్షలాది మంది ఆదివాసులను నిర్వాసితులను చేసి, అక్కడ నిర్బంధిస్తున్నది. గ్రామాలు తగలబెడుతున్నది. వందలాది మంది ఆదివాసులను చంపివేసింది. స్త్రీలను చెరిచింది. జంగల్ మహల్‌లో హర్మద్ వాహిని పేరుతో, ఇప్పుడు భైరవ్ వాహిని పేరుతో, జార్ఖండ్‌లో సేంద్రా పేరుతో, ఒడిశాలో శాంతివాహిని పేరుతో, ఆంధ్రప్రదేశ్ వంటి కోవర్టుల వంటి ప్రైవేట్ సైన్యాలను ఏర్పాటు చేసి దాడులు చేస్తున్నది.

ఇంక దండకారణ్యంలో 2004లో కాంగ్రెస్ ప్రతిపక్ష నాయకుడు మహేంద్రకర్మ నాయకత్వంలో రమణ్‌సింగ్ బిజెపి ప్రభుత్వానికి అండగా తయారైన సల్వాజుడుం దురంతాలు ఇప్పుడు ప్రపంచానికంతా తెలుసు. సుప్రీంకోర్టు స్వయంగా జోక్యం చేసుకొని, ఇది చట్టవ్యతిరేకం కనుక రద్దుచేయాలని చెప్పాల్సి వచ్చింది.

ఈ నిర్బంధాలన్నిటినీ అధిగమించి ఇవాళ దండకారణ్యంలో జనతన సర్కార్ క్రాంతికారీ జనతన సర్కార్‌గా రూపుదిద్దుకొని, ప్రజల స్వావలంబన అభివృద్ధి నమూనా ఎట్లా ఉంటుంది, ప్రజలు తమకు తాముగా పరిపాలించుకుంటే ఏమీ సాధించుకోగలరో చేసి చూపుతున్నారు. జనతన సర్కార్ నాయకత్వంలో ప్రజలు అక్కడి రాజ్యాధికారాన్ని తమ అనుభవంలోకి తెచ్చుకుంటున్నారు. చెరువులూ, కుంటలూ తవ్వుకొని, చేపల చెరువులు ఏర్పాటు చేసుకొని, వ్యవసాయం చేస్తూ తమ సమస్యలను చర్చించుకుంటున్నారు. ఇవాళ దండకారణ్యంలో నలభై శాతం పైగా మహిళలు ప్రజా సంఘాలు మొదలు, పీపుల్స్ మిలిషియా వరకు భాగస్వాములవుతున్నారు. లలిత, కుమ్లీ వంటి ఆదివాసి మహిళలు నాయకత్వం స్థానంలోకి వచ్చి అమరులయ్యారు. సుకుమాలో జిల్లా కలెక్టర్‌ను బందీగా తీసుకున్నప్పుడు మధ్యవర్తులుగా వెళ్లిన వారితో చర్చలు జరపడానికి దక్షిణ బస్తర్ బాధ్యుడుగా వచ్చిన విజయ్ మాడ్కం ఆదివాసుల నుంచి రూపొందిన నాయకుడు అని చెప్తే క్రమంగా అక్కడ ఆదివాసులు మావోయిస్టులుగా మారుతున్న ఒక పరిణతి, నూతన మానవావిష్కరణ మనం అర్థం చేసుకోవచ్చు. ఇటీవలనే ఒక ప్రమాదంలో ఆయన అమరుడయ్యాడు.

జగిత్యాల పోరాటం నాడు భూస్వాధీనం ఎంత ప్రధానమైన రూపంలో ఉందో, ఇవాళ తూర్పు, మధ్య భారతంలోనే కాదు, మైదాన ప్రాంతంలో కూడా సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగా బహుళజాతి కంపెనీల నుంచీ బడా కంపెనీల నుంచి వనరులను కాపాడుకోవడం కూడా అంత ప్రధాన సమస్యగా ఉన్నది. ప్రపంచంలోనే ఒక రాజ్యాధికార లక్ష్యంతో ఒక ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి నమూనాను ఇవాళ

దండకారణ్యంలోనూ, సరండాలోనూ మావోయిస్టు పార్టీ అమలు చేస్తున్నది. దీని గెలుపోటములు ప్రపంచ పరిస్థితుల మీద, విప్లవ శక్తుల, ప్రజాస్వామిక శక్తుల ఐక్యత మీద ఆధారపడి ఉంటాయి గాని, ఒకప్పటి వియత్నాం పోరాటం వలె, డెబ్బై ఏళ్లుగా కొనసాగుతున్న పాలస్తీనా పోరాటం వలె, ఇది ఒక న్యాయమైన పోరాటం. పాలస్తీనా పోరాటం కన్న ఈ న్యాయమైన పోరాటానికి ఒక స్పష్టమైన విప్లవ లక్ష్యం ఉన్నది. భూమీ, వనరులూ మాత్రమే కాదు ఏ పోరాటం కూడా ప్రజల చేతికి రాజకీయాధికారం రాకుండా కాపాడుకునేది కాదు. ప్రజల చేతికి రాజ్యాధికారం వచ్చినా కూడా నిరంతర అనవరత అప్రమత్తతతో, జాగరూకతతో శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం నిర్వహించకుండా అవి నిలిచేవి కూడా కావు. రష్యా, చైనా, చివరికి ఇవాళ నేపాల్ నుంచి కూడా భారత విప్లవోద్యమం తీసుకుంటున్న పాఠమిది.

నక్సల్బరీ ప్రారంభమైననాడు విప్లవాభిమానులైన ప్రజలందరూ తమ అందరి ఆవాసం నక్సల్బరీ అనుకున్నారు. తమ అందరి పేరు వియత్నాం అనుకున్నారు. ఇవాళ అట్లా ప్రజలందరి ఆకాంక్షగా, భారత విప్లవోద్యమం సామ్రాజ్యవాదం నుంచి ఒక ప్రత్యక్ష దాడిని ఎదుర్కొంటున్నది. వియత్నాం ప్రజలు చేసినటువంటి పోరాటాన్ని ఇవాళ తూర్పు, మధ్య భారతంలోని ఆదివాసులు చేస్తున్నారు. ప్రపంచంలో పెట్టుబడికీ, రాజ్యానికీ, కేంద్రానికీ వ్యతిరేకంగా పోరాటం చేసిన ఐదు వందల మహత్తర చరిత్ర ఆదివాసులదే. ఈ ఆదివాసులకు విప్లవోద్యమ నాయకత్వం వహించిన చరిత్ర నక్సల్బరీది. ఇది కేవలం ఆదివాసి రైతాంగ పోరాటం కాకుండా భారత పీడిత ప్రజల విప్లవోద్యమంగా పురోగమిస్తున్నది. నూతన ప్రజాస్వామిక విప్లవం విజయం లక్ష్యంగా కొనసాగుతూ ఉన్నది. ఎన్నో ఒడిదుడుకులనూ, సమస్యలనూ ఎదుర్కొంటూ రక్తసిక్తమైన దారిలో గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లోని రెండవ దశ అయిన విజయ్ ఆపరేషన్, హాకా ఆపరేషన్, ఆనకొండ ఆపరేషన్‌లను ఎదుర్కొంటున్నది. ప్రజాస్వామ్య శక్తుల అండదండల మీద ఈ విప్లవోద్యమ విజయం ఆధారపడి ఉన్నది. ఈ విప్లవోద్యమ విజయం మీదనే ప్రజాస్వామ్య శక్తుల, ప్రజల భవిష్యత్తు కూడా ఆధారపడి ఉన్నది.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ



**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజీ; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ;

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 నవంబర్ నుండి 30 నవంబర్ 2012 వరకు 15 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1604)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు: వ్యవసాయ రంగం | ఆత్మహత్యలు: చేనేత రంగం | ఆత్మహత్యలు: ఇతరాలు స్త్రీ | ఆత్మహత్యలు: ఇతరాలు పు. | చికిత్స అందక, అనారోగ్యం: స్త్రీ | చికిత్స అందక, అనారోగ్యం: పు. | చికిత్స అందక, అనారోగ్యం: పి. | గుర్తు తెలియని: స్త్రీ | గుర్తు తెలియని: పు. | హత్యలు: స్త్రీ | హత్యలు: పు. | ప్రమాదాలు: పనిచేసే స్థలంలో | ప్రమాదాలు: కరెంట్ | ప్రమాదాలు: రహదారి | ప్రమాదాలు: ఇతరాలు | పోలీసు కాల్పుల్లో: ఉద్యమ కారులు | పోలీసు కాల్పుల్లో: ఇతరులు | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 6 | – | 23 | 18 | 4 | 3 | 3 | – | 2 | 3 | 3 | 2 | 2 | 21 | 24 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 9 | 5 | – | – | – | – | 1 | 4 | 10 | – | – | 16 | 26 | – | – | – | 14 | – |
| నల్గొండ | – | 6 | – | 9 | 13 | 5 | 6 | – | 4 | 2 | 1 | 3 | – | 1 | 36 | 16 | – | – | – | 2 | – |
| మహబూబ్‌నగర్ | – | 7 | – | 6 | 9 | 10 | 10 | 2 | 2 | 10 | 23 | 15 | 14 | 12 | 48 | 2 | – | – | – | – | – |
| మెదక్ | – | 2 | – | 10 | 8 | 1 | 5 | 3 | – | 1 | 3 | 2 | 3 | 4 | 37 | 15 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 7 | 8 | 1 | 2 | 3 | 1 | 2 | – | 7 | 5 | 4 | 23 | 21 | – | – | – | – | – |
| రంగారెడ్డి | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| వరంగల్ | 2 | 6 | 2 | 17 | 18 | 15 | 6 | 11 | – | 2 | – | 1 | 2 | 10 | 15 | 21 | – | – | – | – | 3 |
| కరీంనగర్ | 3 | 17 | 12 | 35 | 40 | 10 | 15 | 9 | 4 | 5 | 7 | 11 | 2 | 2 | 26 | – | – | – | – | – | – |
| ఖమ్మం | – | 2 | – | 1 | 6 | 1 | 2 | 6 | 2 | 7 | 6 | 7 | 1 | 4 | 24 | 10 | – | – | – | – | – |
| అనంతపూర్ | – | 9 | 1 | 13 | 21 | 1 | 3 | 3 | – | 5 | 3 | 7 | 1 | 5 | 39 | 9 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 1 | – | – | – | – | 1 | – | – | – | 2 | 24 | 9 | – | – | – | – | – |
| కర్నూలు | – | 5 | 1 | 9 | 5 | 4 | 2 | 6 | 8 | 9 | 3 | 2 | 7 | 6 | 26 | 30 | – | – | – | – | 3 |
| చిత్తూరు | – | – | – | 7 | 7 | 5 | 7 | – | 1 | 4 | 5 | 7 | 1 | – | 38 | 16 | – | – | – | – | – |
| విశాఖపట్నం | 1 | – | – | 6 | 7 | 2 | 4 | – | – | 14 | 1 | – | 6 | 4 | 15 | 20 | – | – | – | 2 | 16 |
| విజయనగరం | – | – | – | 4 | 3 | 3 | 5 | 6 | 3 | 5 | 3 | 4 | – | – | 22 | 4 | – | – | – | – | – |
| **మొత్తం** | **6** | **60** | **16** | **158** | **169** | **62** | **70** | **51** | **25** | **70** | **62** | **79** | **44** | **56** | **410** | **223** | **–** | **–** | **–** | **21** | **22** |

